# శబ్దార్థచంద్రిక

అను

## ఆంధ్రనిఘంటువు

మహాకాళి సుబ్బారాయనిచే

వ్రాయఁబడినది.

చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

1942.

TO

***The Hon'ble Dr. A. G. Bourne,*** D. SC., F. R. S.,

DIRECTOR OF PUBLIC INSTRUCTION, MADRAS.

**THIS WORK**

**IS**

**WITH KIND PERMISSION**

MOST RESPECTFULLY DEDICATED.

# విన్నపము

సీ. శ్రీసముద్భవపదస్థేమాభిరామంబు
వర్ణరత్నప్రభావర్ధితంబు
నఖిలబుధప్రమోదామృతస్థానంబుఁ
జంద్రికాభిఖ్యాప్రచారభూమి
చింతితార్థవిశేషసంతాననిలయంబు
పురుషోత్తమేప్సితపూరణంబు
మంజుపత్రాచలమహిమాలవాలంబు
కుండలిలక్షణగుంభితంబుఁ

తే. గాన నన్నిట నప్పాలకడలిమాడ్కి
వఱలుకోశంబు గలిగినఁ గొఱంత గలదె
మిత్రమానసశతపత్రమిత్రులార
మిత్రులార సుశీలతాపాత్రులార.

క. పొరపాటు పురుషబుద్ధికిఁ
బరఁగు స్వతస్సిద్ధ మగుచుఁ బండితులారా!
పరమాదరమున గుణములఁ
బరికించి యనుగ్రహింపఁ బ్రార్థింతు మిమున్.

బుధజనవిధేయుఁడు,

**మహాకాళి సుబ్బారాయఁడు.**

# పీఠిక

నేను 1893-వ సంవత్సరమునందు చిన్న తెనుఁగు నిఘంటు వొకదానిని శబ్దార్థ చంద్రిక యని పేరిడి ప్రచురపఱచియుంటిని. ముద్రితములైన వేయిప్రతులును ఒక సంవత్సరకాలమునకు లోపుగానే వెలపోయి యుండుటచేత నంతకంటె పెద్దదగు నొకనిఘంటువును సిద్ధముచేయుట యగత్యమని తలఁచి దయతోడఁ గొందఱు పత్త్రికాధిపతులు మొదలగువారు దయచేసిన యభిప్రాయముల ననుసరించి దానియందుఁ గల లోపములను సవరణచేయుచు గ్రంథము పెద్దదిగఁ జిరకాలముక్రిందటనే వ్రాసియు ద్రవ్యాభావముచే వెంటనే యచ్చొత్తింపఁ జాలనైతిని. కొంతకాల మైనపిమ్మట చెన్నపట్టణములోని శ్రీ వేమూరు వేంకటకృష్ణమసెట్టి కంపెనీవారు నాతోఁ గొన్ని యేర్పాటులు చేసికొని దీనిని 1905-వ సంవత్సరములో ముద్రించిరి.

వారు ముద్రించిన రెండువేలప్రతులు సుమారు 5 సంవత్సరములకాలములో వెల పోయినవి. మరల మూఁడవసారి యచ్చొత్తించుటకై రెండవసారి ముద్రణమునకై యేర్పఱచుకొన్న యేర్పాటుప్రకారము ముద్రింపవలసిన దని వారిని వేఁడగా వారు తమకు స్వంతపను లధికముగా నున్న వనియు, నీపనిని చేయఁబూనుకొనఁజాలమనియు వ్రాసిరి. మరల కొంతకాల మైనపిమ్మటసయితము నేను స్వంతముగా నచ్చు వేయించుకొనఁ జాలను గనుక మెసర్సు వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి కీ గ్రంథవిషయమైన సర్వస్వాతంత్ర్యముల నమ్మి వారిచే దీనిని 1913-వ సంవత్సరములో ముద్రించితిని.

---

ఈ గ్రంథమును సిద్ధముచేయుటలో నాకీక్రిందినిఘంటువులు విశేషసహాయ మొసఁగె నని కృతజ్ఞతతో నొప్పుకొనుచున్నాఁడను.

1. 'Vamana Shivaram Apte's Sanskrit-English Dictionary, 2. Arthur A. Macdonell's Sanskrit-English Dictionary, 3. Brown's Telugu-English Dictionary, 4. బ్రహ్మశ్రీ బ. సీతారామాచార్యులవారిచే రచింపఁబడిన శబ్దరత్నాకరము, 5. ఆంధ్రపదపారిజాతము, 6. ఆంధ్రభాషార్ణవము, 7. ఆంధ్రదీపిక, 8. దేశ్యనామార్థకోశము, 9. అమరకోశము, 10. నానార్థనిఘంటువు, 11. శబ్దార్థకల్పతరువు, 12. అగస్త్యశబ్దసంగ్రహము, 13. ద్విరూపకోశము, 14. వేంకటేశాంధ్రము, 15. ఆంధ్రనామశేషము, 16. లక్ష్మీనారాయణీయ మను శుద్ధాంధ్ర ప్రతిపదార్థపర్యాయపదనిఘంటువు.

# గ్రంథనియమములు.

1. క్ష అను నక్షర మాదియందుఁ గల పదములు క అను నక్షరముతోఁ జేరి వచ్చు నచ్చులును హల్లులును అయిన పిమ్మట వ్రాయఁబడి యున్నవి.

2. ళకార యుక్తపదములు అనఁగా దళము, నళ, వళులు మొదలగునవి యాయాయక్షరముల కడపట వ్రాయఁబడి యున్నవి.

3. క్రియాపదములకు ధాతురూపములును, నామపదములకుఁ బ్రథమైకవచన రూపములును మాత్రము వ్రాయఁబడెను.

4. బాలురు సులభముగ సమాసార్థములను గ్రహింపలేని సామాన్య సమాసపదములుసయితము వ్రాయఁబడియున్నవి.

5. సంస్కృతము అనఁగా తత్సమము, తద్భవము, దేశ్యము, గ్రామ్యము వీని కాయాయి సంజ్ఞలు స. త. దే. గ్రా. ఈవిధముగా ప్రతిపదాంతమందు వ్రాయఁబడియున్నవి. అన్యదేశ్యపదములు గ్రామ్యములలోఁ జేర్పఁబడినవి గాన వానికిఁ బ్రత్యేకముగ గుఱుతు వ్రాయఁబడదు.

6. లింగములును, అంతములును వ్రాయక విడిచిపెట్టితిని.

7. రూపాంతరములు గల శబ్దములు సాధ్యమైనమట్టుకు వాని మొదటిరూపము దగ్గఱనే వ్రాయఁబడియెను.

8. అర్థభేదమును గలిగించు బహువచనరూపములు అవి వ్రాయవలసిన తావుల యందు వ్రాయఁబడియెను.

9. బాలురకుఁ జక్కఁగఁ దెలియుటకై అర్థములు తఱచుగ వాఁడుకపదముల తోడను సంధిలేకయు వ్రాయఁబడి యున్నవి.

10. వ్యాజ్యెము మొదలగు కొన్ని అచ్చ తెలుఁగుపదములు వాడుకలో వ్యాజ్యము అనియున్నను నిఘంటువులలో వ్రాయఁబడిన రీతిని పైయట్లు వ్రాసితిని. కాళా గజ్జ మొదలగు కొన్ని పదములను వాడుకలో నెట్లు వినుచున్నామో అట్లు వ్రాసితిని.

11. సంపుటము మొదలగు కొన్ని పదములకు అర్థము స్పష్టమగుటకై కడపట వాల్యూమ్ అనియు మిగుల సామాన్యములగు కొన్ని యింగ్లీషుపదములు అక్కడక్కడ నిదే యుద్దేశముతోఁ దెలుఁగక్షరములతో వ్రాయఁబడియున్నవి.

12. దేశమందలివాడుకనుబట్టి బాణలి, బూరెలమూఁకుడు మొదలైనవి అర్థములుగాఁగలచోట్ల రెండు పదములును వ్రాయఁబడి యున్నవి.

13. వండుచే మొదలగు శత్రర్థక చువర్ణకములను కొన్ని స్థలములయందు మాత్రము ఇట్లు చే అని వ్రాసి తక్కినచోట్ల వాడుకవలనఁ గనిపెట్టఁగలరని చు అని యిట్లు వ్రాసితిని.

14. కాగితమునకు కాకితము అనియు, జాగ్రత్తకు జాగ్రత అనియు, శోఫకు శోభి అనియు, కుష్ఠకు కుష్ఠు అనియు, న్యాయతీర్పరి మొదలగు వాడుకలోని గ్రామ్య పదములును కొన్నిచోట్ల అర్థమునకై యుపయోగింపఁబడెను.

15. ఆవలు దీనికి ననేకచోట్ల ఆవాలు అని వ్రాయఁబడియున్నది.

16. క్రంప, క్రుళ్లు మొదలగువానికి, కంప, కుళ్లు మొదలగు రూపాంతరములు వ్రాయఁబడియున్నవి.

17. నెయ్యి, నేయి, నుయ్యి, నూయి, నెమలి, నెమిలి ఈమొదలైనవాని రెంటిలో నేదియో యొకరూపము ఉపయోగింపఁబడుచుండెను.

18. పుత్త్రుఁడు, పుత్త్రిక, పత్త్రిక మొదలయిన తకారద్విత్వశబ్దములు ద్విత్వము లేకుండ వ్రాయఁబడియెను. ఇట్టిచోట్ల నుచ్చారణలో భేదములేదు గనుక ఏకద్విత్వము గాని అనేకద్విత్వములుగాని నిరుపయోగములుగదా?

19. కొన్నిచోట్ల చిన్నమొక్కలను సయితము చెట్లు అని వాడవలసివచ్చెను.

20. వీణె, వీణ, తీఁగె, తీఁగ ఇట్లు రూపాంతరములుగల శబ్దములకు అచ్చటచ్చట నేదియోయొకరూపము వాడఁబడుచుండెను.

21. చేఁపమొదలగు నిట్టి కొన్నిపదములకు అదేపదము నుపయోగించుచు అర్థవివరణము చేయఁబడియెను.

22. నాథుఁడు, నాధుఁడు, ఇట్లురెండురూపములున్నను విశేషముగా వాడుకలో నాధుఁడు అని వాడఁబడుచుండుటచే దాదాపుగా నన్నిచోట్లను అదేవిధముగ వ్రాయఁబడియెను.

23. జవాజిపిల్లి = సంకువు. ఇట్టిచోట్ల వివరించిచెప్పుట అనగత్యము గనుక బాలురు తత్సమపదములను తెలిసికొనుటకు, కొన్నిచోట్ల పర్యాయపదములను దెలిసికొనుటకును మూలపదములకంటె కరినమగునర్థపదములు కొన్నిచోట్ల వ్రాయఁబడియున్నవి.

24. అనేకచోట్ల బిళ్ల, బిల్ల, ఇట్టివి సమానార్థకములుగానే యుండును.

25. మూలపదములు తత్సమములుగా నున్నపుడు వీలైనమట్టుకు వాని తద్భవ రూపములను, తద్భవములుగా నున్నప్పుడు వాని తత్సమరూపములనుగూడ నంతమందు వ్రాసియున్నాను.

26. అర్థములు వ్రాయుటలో ననేకచోట్ల వ్యాకరణమునుబట్టి సంధి, సరళాదేశము, నకారాగమము మొదలైనవానిని బాలురును, వ్యాకరణము తెలియనివారును, గ్రహించుట కష్టమని విడిచిపెట్టితిని.

27. సాధ్యమైనమట్టుకు పదములకు నానార్థములు వ్రాయఁబడియున్నవి.

28. సామాన్యములగు సులభపదములకు సైతము అర్థములుగా పర్యాయపదములను, తద్భవపదములకు ప్రకృతులును, కొన్నిచోట్ల ప్రకృతులకు సైతము తద్భవ రూపములను వ్రాసియుంటిని.

29. సమాసపదములలో ఒకపదము తద్భవముగాను మఱియొకటి దేశ్యముగాను ఉన్నపుడు ఆపదమంతయు దేశ్యముగా వ్రాయఁబడియున్నది.

30. తెలుఁగువారిచే విశేషముగా వాడఁబడుచుండునట్టియు వ్యవహారములో వాడుకలోనున్నట్టియు నన్యదేశ్యపదములకు గ్రామ్యములని గుఱుతిడఁబడియెను.

31. కొన్నిపదములకు విశేషణార్థములు వ్రాయునపుడు పదము నపుంసకలింగరూపముగాను అర్థములు పుంలింగ స్త్రీలింగరూపములుగలవిగాను వ్రాయఁబడియున్నవి. ఉదా. చిపిటము=చప్పట ముక్కుగలవాఁడు, చప్పటముక్కుగలది.

32. దుర్భిక్షము, త్రిలింగదేశము, తిలపుష్పము, పౌరభాగ్యము మొదలగు నిట్టిపదములు కొన్నిప్రయోగశరణంబులుగాకయు, వానియునికి సందేహాస్పదముగఁ దోఁచుచున్నను మెక్డానల్సు సంస్కృతాంగ్లేయ నిఘంటువున వ్రాయఁబడియుండుట చేత నేనును వానిని ఆదేరూపముతో నిఘంటువులో వ్రాసితిని.

33. ప్రతిశబ్దమునకుఁ బ్రయోగమున్నదో లేదో కనుఁగొని వ్రాయుటకు నాబోటి వానికి దుస్తరము గనుక కొన్నిపదములకై నిఘంటువులనే నమ్మి వ్రాసితిని.

34. అప్రసిద్ధార్థములును, నిషిద్ధరూపములును, దుష్టరూపములును దీనియందేవేని ఉన్నయెడల తెలియమిచే వ్రాసినందులకు నన్ను మన్నింపుఁడని ప్రణామపూర్వకముగఁ బండితుల వేఁడుకొనుచున్నాఁడను.

---

## సంజ్ఞావివరణము.

స. తత్సమము. ఇందు సంస్కృత ప్రాకృతములలోనుండి వచ్చిన సమస్త తత్సమశబ్దములును చేరియున్నవి.

త. తద్భవము. ఇందు సంస్కృతప్రాకృతభవములు ఇమిడియున్నవి.

దే. దేశ్యము. ఇందు దేశపదములును, తద్భవాదులతోఁ జేరిన మిశ్రమపదములును, సమాసపదములును జేర్పఁబడియున్నవి.

గ్రా. గ్రామ్యము. ఇందు నింద్యానింద్య గ్రామ్యములును, అన్యదేశ్యపదములును జేరియున్నవి.

శ్రీరస్తు.

# శబ్దార్థచంద్రిక.



## అ

అ. త. ఒకయక్షరము. బొత్తిగా అనునర్థమును, తనంతట అనునర్థమును తెలుపును. స. అభావార్థకమైన లేదనుట, కాదనుట అనువానిని దెలుపును

అంక. దే. పార్శ్వము, ప్రక్క, ఆణక

అంకకాఁడు. దే. చేలముపట్టువాఁడు, కలహప్రియుఁడు

అంకణము. త. నలుచేదరపుచోటు, రెండు దూలముల మధ్యప్రదేశము, కక్ష్య

అంకనము. స. గుఱుతు, చిహ్నము, గుఱుతు వేయుట

అంకపాళి. స. కవుఁగిలి, తొడ, తిన్నె

అంకపాళిక. స. కౌఁగిలి

అంకపొంకములు. దే. కోపము, ఉగ్రము, విరోధము

అంకము. స. చిహ్నము, నాటకములో నొకభాగము, ఒడి, అంకె, యుద్ధము, సమీపము

అంకము. దే. ఆక్షేపము

అంకపంక. దే. మృదుత్వము

అంకపన్నియ, అంకపన్నె. దే. కాలుపెట్టి గుఱ్ఱము మీఁదికి ఎక్కెడి అంకెము

అంకవిద్య. స. గణితము

అంకాపొంకములు. దే. కోపము, ఉగ్రము, విరోధము

అంకించు. దే. సంతోషించు, మీఁదికెత్తు, ఆడించు, జళిపించు, త్రిప్పు, అపహరించు, పట్టుకొను, అవలంబించు, పొగడు

అంకించు. స. నుతించు

అంకిణీలు. దే. గుఱ్ఱపుజీనుకు వేయునలంకారము

అంకితము. స. గుఱుతువేయఁబడినది, ఎంచఁబడినది, ఒకగ్రంథమును వ్రాసి మఱియొకనిపేర కృతియిచ్చుట

అంకితుఁడు. స. గుఱుతిడఁబడినవాఁడు

అంకియ. త. ఒకటి మొదలగుసంఖ్య, అంకె, వశము

అంకియము. దే. ఎద్దుమీఁదియొకవైపుగోనె

అంకిలి. దే. విఘ్నము, ఆపద, కలఁత, సాధకబాధకములు, వ్యాకులము, తాలుమూలము

అంకిలిపడు. దే. అడ్డిపడు, అభ్యంతరమగు

అంకినిపెట్టు. దే. అడ్డగించు

అంకిళ్లు. దే. దౌడక్రిందికీళ్లు

అంకు. దే. అంకమ్మ, గ్రామదేవత, తాలుమూలము

అంకుటము. స. కుంచెకోల
అంకుఁడు. స. చిహ్నముగలవాఁడు
అంకుఁడు. దే. దేవుఁడు
అంకురము. స. మొలక, నీళ్లు, పెంద్రుక
అంకురించే. స. మొలచే, కలుగు
అంకురితము. స. మొలకెత్తినది
అంకుశము. దే. ఏనుఁగును నడపించుటకై కుంభస్థలమునందుఁ బొడిచెడి ఆయుధము, అంకుసము
అంకుసంబుమాద్రి. దే. మూలానక్షత్రము
అంకుసము. త. అంకుశము
అంకుసంకులు. దే. సాధ్యము
అంకూరము. స. అంకురము, మొలక
అంకూరితము. స. మొలకెత్తినది, ఉద్భవించినది
అంకూర్యము. స. మొలక
అంకె. త. అంకము, వశము, సమయము
అంకె. దే. అణక, ఎద్దులు అంకెవేయుట
అంకెకాఁడు. దే. ముఖ్యుఁడు
అంకెగొను. దే. కప్పుకొను
అంకెన. దే. ఒకానొకఫలవృక్షము
అంకెము. దే. గుఱ్ఱమునెక్కుట కిరుప్రక్కల నమర్చిన యినుపమెట్టు, ఎద్దుమీఁది యొకవైపుగోనె
అంకెపన్నియ } దే. అంకెము
అంకెపన్నె
అంకోలము. స. ఊడుగుచెట్టు [దగినది
అంక్యము. స. ఒకవిధమగుమద్దెల, ఎంచే
అంగ. దే. కాలుచాఁచిపెట్టిన అడుగు
అంగకము. స. శరీరము, అవిక, చొక్కాయ

అంగక్రియ. స. తలంటుకొనుట
అంగజ. స. కూఁతురు
అంగజము. స. పెంద్రుక, మదము, దేహమునఁ బుట్టినది, నెత్తురు
అంగజుఁడు. స. మన్మథుఁడు, కొడుకు
అంగజోల } దే. అంతఃపురపు కావలివాఁడు
అంగజోలుఁడు
అంగడి. దే. దుకాణము, సభ, రచ్చ, దివాణము, అగసాలె లోనగువారు పనిచేయుచోటు
అంగణము. స. ముంగిలి
అంగద. దే. ఆపద, ఆఁకలి, ఉపద్రవము, కోపము, దుఃఖము [ఏనుఁగు
అంగద. స. దక్షిణదిక్కునందలి ఆఁడు
అంగదము. స. భుజమునఁగట్టుకొను నొకనగ, బాహుపురి
అంగదట్టము. దే. పావడ
అంగదుఁడు. స. ఒకానొకవానరుఁడు
అంగన. స. ఆఁడుది, ఉత్తరదిక్కునందలి ఆఁడుఏనుఁగు
అంగనము. స. ముంగిలి
అంగబిల్ల. దే. ఆఁడుపిల్లలమొలనుగట్టెడి వెండిబంగారములబిల్ల
అంగభవుఁడు. స. మన్మథుఁడు
అంగమచ్చెము. దే. గుఱుతు, జాడ
అంగము. దే. అందము, విధము, అంగము. స. అవయవము, దేహము, ఒకానొక దేశము, ఉపాయము, సమీపించినది
అంగమొల. దే. గుడ్డలేనిమొల, దిసమొల
అంగమొలవేల్పు. దే. శివుఁడు

అంగరక. దే. చొక్కా
అంగరాగము. స. గంధాదులపూఁత
అంగరుహము. స. వెండ్రుక
అంగరేఖ. త. చొక్కాయ, అంగరక
అంగరొల్లెలు. దే. భక్ష్యవిశేషము
అంగలారుచు } దే. దుఃఖించు, భయముచే నఱచు
అంగలార్చు
అంగలారుపు } దే. దుఃఖము
అంగలార్పు
అంగళ్లవాడ. దే. బజారు
అంగవించు. దే. ఉత్సహించు, అతిక్రమించు, యత్నించు
అంగహారము. స. అవయవములకదలిక
అంగారకము. స. నిప్పు, గుంటగలగరమొక్క, బొగ్గు
అంగారకవారము. స. మంగళవారము
అంగారకుఁడు. స. ఒకానొకగ్రహము
అంగారధానిక. స. కుంపటి
అంగారము. స. నిప్పు, బొగ్గు
అంగారవల్లరి. స. ఒకదినుసు కానుగుచెట్టు
అంగారవల్లి. స. బారంగిమొక్క
అంగారశకటి. స. కుంపటి
అంగారిక. స. చెఱకుగడ, మోదుగుమొగ్గ
అంగారిణి. స. కుంపటి
అంగి. త. మోఁగాళ్లదాఁక జోలుగల చొక్కాయ
అంగి. స. అవయవములు గలది, ముఖ్యము
అంగిక. స. రవిక, చొక్కాయ
అంగిటిముల్లు. దే. కుత్తుకలోపలఁ గలిగెడి రోగవిశేషము, గళాంకురము

అంగిలి. దే. లోకుత్తుక, జిహ్వామూలోర్ధ్వభాగము, అంతర్గళము
అంగిలిగుంట. దే. గళగర్తము, వావిక
అంగీ. త. చొక్కాయ, చీలమండలదనుక వ్రేలుచొక్కాయ
అంగీకరించు. స. సమ్మతించు, పుచ్చుకొను
అంగీకారము. స. సమ్మతి
అంగీకృతము. స. అంగీకరింపఁబడినది
అంగు దే. అందము, విధము
అంగుటము. త. బొటనవ్రేలు, అంగుష్ఠము
అంగుడుదుడిపి } దే. అక్కడిమాట ఇక్కడ ఇక్కడిమాట అక్కడ చెప్పువాఁడు, తంత్రగొట్టు, తంటాలమారి
అంగుడుదుడుపు
అంగుళము. స. వ్రేలు, బొటనవ్రేలు, ఒక అడుగులో పండ్రెండవభాగము
అంగుళి. స. వ్రేలు, తొండముచివర
అంగుళిత్రము } స. హస్తకవచము, అనఁగా వ్రేళ్లకు దెబ్బలు తగులకుండ విలుకాఁడు కట్టుకొనుచర్మము, అత్తెము
అంగుళీత్రాణము
అంగుళిముద్ర. స. ముద్దుటుంగరము
అంగుళిమానము. స. అంగుళము, మూరమొదలగుకొలత
అంగుళీయకము } స. వ్రేలి ఉంగరము
అంగులీయకము
అంగుష్ఠము. స. బొటనవ్రేలు
అంగూరు. దే. ద్రాక్షావిశేషము
అంఘ్రి. స. కాలు, వేరు
అంఘ్రిపము. స. చెట్టు

అంఘ్రిపర్ణిక. స. కోలపొన్నచెట్టు

అంచలము. స. కొంగు, చిగురు

అంచించు. దే. అంచెనవేయు, ఫలపరిమితి నూహించు

అంచితము. స. పూజింపఁబడినది

అంచియ
అంచె } దే. పత్త్రికలు తీసికొని పోవు వారును, బండ్లు లోనగు నవియును చేయుమకాము, టపా

అంచెలు. దే. వరుస

అంచె. త. హంస, సమీపము

అంచెన
అంచనా } దే. ఇంత పండును అనికాని ఇంత వెలయగుననికాని యూహించుట

అంచెనదారుఁడు. దే. అంచెనవేయువాఁడు

అంచెపదము. త. హంసపాదము, గుఱుతు

అంచెయాన. త. హంసవలెనడుచునాఁడుది

అంచెరవుతు. త. బ్రహ్మ

అంచెల. దే. ప్రక్క

అంచెలము. దే. కోపము

అంచు. దే. పుచ్చు, పంపించు, అనుచు, ఆజ్ఞాపించు, విధము

అంచు. త. తుద, బండికంటియాకు

అంచులవాఁడు. దే. చిత్తరువు వ్రాయు వాఁడు, చిత్రకారుఁడు, ముచ్చి

అంజన. స. హనుమంతుని తల్లి

అంజనకాఁడు. దే. అంజనమువేసి పోయిన వస్తువులను కనుఁగొనుమాంత్రికుఁడు

అంజనము. స. కాటుక, పడమటిదిక్కు నందలి ఏనుఁగు, మంత్రగానికాటుక, రసాంజనము, తలంటు, సిరా, నిప్పు, వక్రతలేనిది, మర్యాదగలది

అంజనావతి. స. ఈశాన్యపు దిక్కునందలి ఆఁడుఏనుఁగు

అంజని. స. కాటుకపెట్టుకొనినస్త్రీ

అంజనిక. స. నలికండ్లపాము

అంజలి. స. చేమోడుపు, దోసిలి

అంజిక. దే. భయము

అంజె. త. పాదము, అడుగు

అంజె. త. సమీపము

అంజెమెడపట్టు. దే. మల్లబంధవిశేషము

అంజెలిగుంజెలి. దే. శ్రమమునొందినది

అంజోయించు. దే. సందేహించు

అంజు. దే. భయపడు

అంజోరు. దే. అత్తిమ్రాను, మేడిచెట్టు సీమ అత్తిపండు

అంట. దే. అనుట, కుట్టుడాకు, అడ, త్వక్కు

అంటఁగట్టు. దే. చేర్చికట్టు, బిగించు

అంటగు. దే. బహిష్ఠయగు

అంటరానివేల్పు. దే. అగ్ని

అంటలు. దే. గుంపు

అంటలుగట్టు. దే. గుంపులుకూడు

అంటసిల్లు. దే. చేరు

అంటి. దే. అరఁటి

అంటించు. దే. అతికించు, చేర్చు, తేలు కుట్టు, అంటఁజేయు

అంటిగది. దే. ఱంకులాఁడి, కులట

అంటిసి. దే. తృణవిశేషము, సంబంధము

అంటు. దే. తాఁకు, రాచు, కూడిక, స్పర్శము, ముట్టు, మైల, స్నేహము, కొమ్మవంచిపాఁతినచెట్టు, బాంధవ్యము, అశుచి, స్నేహితుఁడు

అంటుకత్తియ. దే. ప్రియురాలు, అంటుకత్తె
అంటుకాఁడు. దే. ప్రియుఁడు
అంటుకొనిపోవు. దే. దొంగిలించు
అంటుకొను. దే. కఱచుకొను, తగులుకొను, అగ్నిముట్టుకొను
అంటుజోడు. దే. కర్ణభూషణము
అంటునూనియ } దే. తలంటుకొనునూనె
అంటునూనె }
అంటుపడు. దే. అశుచియగు
అంటుపూస. దే. ముత్తెపుఁజిప్పయందంటిన ముత్తెము
అంటుపేను. దే. ఒకదినుసుచిన్నపేను
అంటుపోఁగులు. దే. చెవులనంటియుండెడు అంటుజోడు
అంటుప్పు. దే. ఒకవిధమైనయుప్పు
అంటుమెడ. దే. పొట్టిమెడ
అంటుటాయి. దే. సూదంటుటాయి
అంటెలు. దే. బొంత, కంథ
అంట్రింత. దే. గుడ్డనుఅంటుకొనెడు ఒకదినుసుగడ్డి, అంటెస
అంట్లు దే. వండి తోమనిపాత్రలు; లేక ఆపాత్రలలో అంటుకొనియుండునది, అంటుపేలు
అండ, దే. సమీపము, వెనుక, ఆశ్రయము
అండకోశము. స. వృషణము
అండగొట్టు. దే. ఆలస్యముచేయు
అండగొను. దే. ఆలస్యముచేయు, ఆశ్రయించు
అండజ. స. కస్తూరి
అండజము. స. పక్షి, చేప, పాము

అండనము. స. ఛేత్తము లోనగువానిచేఁ జేయఁబడిన కేడెము, అడ్డనము
అండము. స. గ్రుడ్డు, వృషణము [అండి
అండా. దే. నీళ్లుకాఁచుకొను పెద్దపాత్ర,
అండి } దే. పాత్రవిశేషము, పూజ్యవాచియైనశబ్దము
అండీ }
అండియ } దే. వసంతములాడెడు గొట్టము
అండె }
అండియము } దే. ఎద్దుమీఁదవైచిన సరకు గోనెలు రెంటిలో నొకవైపుగోనె.
అండెము }
అండీరుఁడు. స. చేక్కగాబలిసినమనుజుఁడు
అంత. త. సర్వము, ఆకొలఁది, పరిమాణార్థకము, సంఖ్యార్థకము, పిమ్మట, అప్పుడు
అంతంత. త. కొంతదూరమున
అంతఃకరణము. స. మనస్సు, దయ
అంతఃపురము. స. రాణివాసపుస్త్రీలుండు చోటు, అంతిపురము
అంతఃపురి. స. అంతఃపురము, అంతిపురి
అంతకము. దే. మొత్తము, అంతు
అంతకుఁడు. స. యముఁడు
అంతట. దే. అనంతరము, అంత
అంతము. స. తుద, చావు
అంతరంగము. స. హృదయము
అంతరంగుఁడు. స. మిగుల నమ్మఁదగినస్నేహితుఁడు
అంతరదామర. దే. ఒకదినుసునాఁచు
అంతరపల్లటి. దే. ఒకజాతిపావురము
అంతరము. స. ఎడము, భేదము, సమయము, సందు, మఱుగు, అన్యము, తారతమ్యము, మధ్యప్రదేశము

అంతరాత్మ. స. జీవాత్మతోఁ జేరియుండెడి పరమాత్మ, మనస్సు

అంతరాయము. స. విఘ్నము, పనిచెఱుపు

అంతరాళము. స. ఎల్లదిక్కులకు నడిమి చోటు

అంతరించు. స. చచ్చు, నశించు, చెడు, దాఁటు

అంతరిక్షగము, స. పక్షి

అంతరిక్షము } స. ఆకాశము
అంతరీక్షము

అంతరితము. స. వేఱుచేయఁబడినది, దాఁచేఁబడినది

అంతరీపము. స. ద్వీపము

అంతరీయము. స. కట్టువస్త్రము

అంతరువు. త. తారతమ్యము, మఱుఁగుచోటు

అంతర్గతము. స. మఱచిపోఁబడినది, నడుమ పొందఁబడినది, హృదయము

అంతర్ధ. స. మఱుఁగు

అంతర్ధానము. స. మఱుఁగుపాటు

అంతర్ధి. స. మఱుఁగు

అంతర్భూతము. స. లోపల నడఁగినది

అంతర్భౌమము. స. భూమిక్రిందిది

అంతర్మనుఁడు } స. వ్యాకులచిత్తుఁడు
అంతర్మనస్కుఁడు

అంతర్ముఖుఁడు. స. నిగుఱుగప్పిన నిప్పువలె నుండువాఁడు

అంతర్యాగము. స. మానసపూజ

అంతర్యామి. స. పరమాత్మ, లోపలనుండువాఁడు

అంతర్లాపి. స. ఉత్తరము లోపల నడఁగియుండునట్లు అడుగునట్టి విషమసమస్య

అంతర్వంశికుఁడు. స. అంతఃపురమున కధికారి

అంతర్వత్ని. స. గర్భిణి స్త్రీ

అంతర్వాణి. స. శాస్త్రము నెఱిఁగినవాఁడు

అంతర్వాహిని. స. భూమిలోపలఁ బ్రవహించెడు ఏఱు

అంతర్హితము. స. మఱుఁగుపడినది

అంతలపొంతలవాఁడు. దే. దూరపుచుట్టము

అంతవట్టు. దే. అంతయు, అంతపర్యంతము

అంతశయ్య. స. చావు, శ్మశానము, భూశయ్య

అంతశ్ఛిద్రములు. స. లోపలిలోపములు

అంతస్తు. త. మఱుఁగుచోటు, మిద్దె, తారతమ్యము, ఒకటిమీఁద నొక్కటిగా నుండెడుకట్టు, కక్ష్య, పరువు, మూల

అంతస్థ. స. లంచము

అంతస్థములు. స. య, ర, ల, వ వీని వ్యాకరణమందు పేరు

అంతావసాయి. స. మాలవాఁడు, మంగలికి

అంతిక. స. ప్రాయ్యి, నాట్యపరిభాష యందు అక్క

అంతికము. స. సమీపము, ఎదుట

అంతికలు } దే. చోఁపవలె నల్లినకసవు తడికలు
అంతికెలు

అంతిపురము } త. అంతఃపురము
అంతిపురి

అంతిమము. స. కడపటిది, సమీపించినది

అంతియ. దే. అంతమాత్రము

అంతు. త. మొత్తము, అంతకము

అంతె } త. అంతియ
అంతే }

అంతేవాసి. స. శిష్యుఁడు, మాలవాఁడు, సమీపమున నున్నవాఁడు

అంత్యకులుఁడు } స. మాలవాఁడు
అంత్యజుఁడు }

అంత్యము. స. కడపటిది, అధమము, చివర

అంత్రము. స. ప్రేగు

అందంద. త. అక్కడక్కడ, మఱిమఱి

అందంబుగూడుకొను. దే. కలసికొను

అందకత్తియ } దే. సౌందర్యవతి
అందకత్తె }

అందగాఁడు. దే. సౌందర్యవంతుఁడు

అందగించు. దే. రమ్యమగు, అందపడు

అందగింపు. దే. సొగసు

అందమకు. దే. మిక్కిలి అదుకుగలది, సంపూర్ణము కానిది

అందనుక. దే. అందాఁక

అందపడు. దే. రమ్యమగు

అందము. దే. చేక్కఁదనము, సౌందర్యము

అందఱు. దే. ఎల్లవారు

అందలము. త. పల్లకి, ఆందోళికము

అందలములు. దే. బాలక్రీడావిశేషము

అందాఁక. దే. అంతపర్యంతము

అందిక. దే. సమీపము

అందిపొందినవాఁడు. దే. దూరపుచుట్టము

అందియ } దే. ఆఁడువాండ్రు కాళ్ల
అందె } యందు ధరించెడు నగ

అందు. దే. గ్రహించు, పొందు, అచ్చోట, ఒకప్రత్యయము

అందుకము. స. అందె, ఏనుఁగుసంకెల

అందుకొను. దే. కైకొను, చేఁచిపుచ్చుకొను

అందుకోలు. దే. అందుకొనుట, అతిసమీపము

అందుగు. దే. ఒకజాతిచెట్టు

అందుపాటు. దే. సమీపము

అందుబడి. దే. ప్రాప్తము, సమీపము

అందులకు. దే. దానికి, అచ్చోటికి

అందువు. దే. అందుగుచెట్టు, ఏనుఁగు సంకెల, అందె

అందె. దే. అందియ

అందెబందెలు. దే. చిక్కులు

అందోఱు. దే. అందఱు

అంధకము. స. గ్రుడ్డి

అంధకరిపువు. స. శివుఁడు

అంధకారము. స. చీఁకటి

అంధకుఁడు. స. గ్రుడ్డివాఁడు

అంధకురాలు. స. గ్రుడ్డిది

అంధకూపము. స. పాడునూయి

అంధతమసము. స. గాఢాంధకారము, కటిక చీఁకటి

అంధము. స. చీఁకటి, గ్రుడ్డిది

అంధస్సు. స. అన్నము

అంధిక. స. చీఁకటి

అంధుఁడు. స. గ్రుడ్డివాఁడు

అంధువు. స. నూయి

అంధ్రము. స. తెలుఁగుదేశము, తెలుఁగు

అంధ్రుఁడు. స. కిరాతుఁడు

అంప. దే. బాణము

అంపకము. దే. అంపుట, ప్రేషణము

అంపకాఁడు. దే. విల్లు చేతఁబట్టినవాఁడు, గురితప్పక అమ్ము వేయువాఁడు
అంపకోల. దే. బాణము
అంపగరి. దే. బాణమునకుఁ గట్టినయీఁకలు
అంపఱ. దే. బాణసమూహము
అంపాచోరము. త. జలప్రవాహము
అంపియ
అంపె } దే. చింపిగుడ్డ
అంపు. దే. పంపించే, ఆజ్ఞాపించే, జాతర
అంపుదోడు. దే. ప్రయాణమై పోవువారికి తోడుగా అంపఁబడువాఁడు
అంబ. స. అమ్మ, పార్వతీదేవి
అంబకము. స. కన్ను, బాణము
అంబకళము. దే. అంబలి
అంబటిజోరిగాఁడు. దే. పక్షివిశేషము
అంబరము. స. ఆకాశము, వస్త్రము, పరిమళద్రవ్యము
అంబరాంబరుఁడు. స. శివుఁడు
అంబరీషము. స. యుద్ధము, మంగలము
అంబరీషుఁడు. స. ఒకానొకరాజు, శివుఁడు, సూర్యుఁడు
అంబరు. త. ఒకపరిమళద్రవ్యము
అంబలము. దే. కలకలధ్వని
అంబలి. దే. ఒకవిధమైనజావ
అంబష్ఠ. స. అడవిమొల్ల, పులిచింత
అంబష్ఠుఁడు. స. మంగలవాఁడు
అంబస్తు. దే. కపటములేనివాఁడు, దమ్మఁడు
అంబారము. దే. ధాన్యరాశి
అంబారి. దే. ఏనుఁగుమీఁది పీఠము
అంబారు. దే. అంబారము
అంబారుపిడుజో. దే. పశువుల దేహమున నంటుకొని రక్తముపీల్చెడి జంతువిశేషము
అంబాళము. త. ఆమ్రాతకవృక్షము
అంబిక. స. తల్లి, పార్వతి, ధృతరాష్ట్రునితల్లి
అంబు. త. బాణము
అంబుజగర్భుఁడు. స. బ్రహ్మ
అంబుజము. స. తామర, గన్నేరుచెట్టు
అంబుదము. స. మేఘము
అంబుధి. స. సముద్రము
అంబుపక్కెర. దే. మత్స్యవిశేషము
అంబుభృత్తు. స. మేఘము
అంబువాహిని. స. నీళ్లు పోవుటకు తూముగా పెట్టఁబడిన తొలిచిన తాటిమ్రాను లోనగునది, దోనె
అంబువు. స. ఉదకము
అంబుస్ఫోటము. స. నీటిబుగ్గ
అంబూకృతము. స. తుంపరగలది
అంబే. త. ఆవుల దూడలకూఁత
అంబేద. దే. దిట్టతనములేనివాఁడు, మెత్తనివాఁడు, అప్రయోజకుఁడు
అంభ. స. ఆవుకూఁత, అంబే
అంభస్సు. స. నీరు
అంభోజము
అంభోజిని } స. కమలము
అంభోదము. స. మేఘము
అంభోధి
అంభోనిధి
అంభోరాశి } స. సముద్రము
అంభోరుహము. స. పద్మము
అంశకుఁడు. స. పాలికాఁపు

అంశనము. స. విభాగించుట
అంశము. స. పాలు, వంతు, విషయము
అంశయిత. స. భాగించువాఁడు
అంశి. స. భాగముగలవాఁడు
అంశుకము. స. ఉత్తరీయము, వస్త్రము, సన్నవస్త్రము [తుఁడు
అంశుమంతుఁడు. స. సూర్యుఁడు, ధనవం
అంశుమతి. స. ముయ్యాకుపొన్న
అంశుమత్ఫల. స. అరఁటిచెట్టు
అంశుమాలి. స. సూర్యుఁడు
అంశులము. స. ప్రకాశమానమయినది
అంశువు. స. కాంతి, కిరణము
అంస. స. మూఁపు, అంశము
అంసకూటము. స. ఎద్దుమూఁపురము
అంసలుఁడు. స. బలిసినవాఁడు
అంహతి. స. ఈవి, తెగులు, విడుపు
అంహస్సు. స. పాపము, దోషము
అఁట. దే. వృత్తాంతమును చెప్పుటను దెలుపును, మహత్త్వమును దెలుపును
అఋణి. స. అప్పులేనివాఁడు, అనృణి
అక. త. అక్క, పూజ్యస్త్రీ, పాచకురాలు
అకంటకము. స. ముండ్లులేనిది, శత్రువులు
అకచము. స. బట్టతల [లేనిది
అకట } దే. అయ్యో
అకటా }
అకటవికటము } దే. తాఱుమాఱు, విరుద్ధ
అకటావికటము } మైనది
అకము. స. దుఃఖము, పాపము
అకరణము. స. చేయకపోవుట
అకరణి. స. పాపము, తిట్టు, తప్పిపోవుట, ఆశాభంగము

అకరు } దే. తామరపువ్వులోని కింజల్కము
అకరువు }
అకర్ణము. స. చెవుడుగలది
అకర్మకము. స. కర్మలేనిది
అకర్మణ్యము. స. పనిచేయలేనిది, చేయ నర్హముకానిది [సోమరి
అకర్మశీలుఁడు. స. పని చేయనివాఁడు,
అకల్కము. స. స్వచ్ఛమయినది, దోష రహితమయినది
అకల్పము. స. అధికారమునకుఁగాని విధులకుఁగాని లోఁబడనిది, బలములేనిది, పోల్చశక్యము కానిది
అకస్మాత్తుగా. స. ఉన్నట్టుండి
అకాముఁడు. స. కామములేనివాఁడు
అకారణము స. కారణములేనిది
అకార్యకరణము. స. చేయఁగూడనిపని
అకార్యము. స. చెడుపని [చేయుట
అకాలము. స. సరికానికాలము, అసమయమైనది
అకించనుఁడు. స. దరిద్రుఁడు
అకించిజ్ఞుఁడు. స. ఏమియు నెఱుఁగనివాఁడు
అకీర్తనీయము. స. చెప్పశక్యముకానిది
అకీర్తి. స. అవమానము
అకుతోభయుఁడు. స. దేనికిని జడియనివాఁడు
అకులజుఁడు. స. నీచజాతిలో జన్మించిన
అకులత. స. నీచజన్మము [వాఁడు
అకూపారము. స. సముద్రము
అకృత్రిమము. స. స్వభావసిద్ధమైనది
అకృతము. స. చేయఁబడనిది, సిద్ధము కానిది, పక్వముకానిది, పూర్తికానిది

అకృతకృత్యుఁడు. స. తనకువిధాయకకృత్యమును చేయనివాఁడు
అకృతశ్రముఁడు.స.శ్రమనుపొందనివాఁడు
అకృత్యము. స. చేయరానిపని
అకృష్ణకర్ముఁడు. స. సత్ప్రవర్తనగలవాఁడు
అకో. దే. సంశయార్థకము
అకోటము. స. పోఁకమ్రాను
అక్క. త. తనకంటె పెద్దదియగు తోఁడఁబుట్టినది, పూజ్యస్త్రీ, జార, వంటలక్క
అక్కజపడు. త. ఆశ్చర్యపడు [శక్యము
అక్కజము. త. అధికము, ఆశ్చర్యము, అ
అక్కజుఁడు. త. అధికుఁడు
అక్కజురాలు. త. అధికురాలు
అక్కట } దే. అయ్యో
అక్కటా }
అక్కటి. దే. దయకలవాఁడు, దయకలది
అక్కటిక } దే. కనికరము
అక్కటికము }
అక్కడ. దే. ఆస్థలమందు, ఆవల
అక్కరము. త. అక్షరము
అక్కఱ. దే. అపేక్ష, ప్రయోజనము, శ్రద్ధ, ఆవశ్యకకార్యము, కార్యము
అక్కఱకాఁడు. దే. అక్కఱగలవాఁడు
అక్కఱగండఁడు. దే. శ్రద్ధకలవాఁడు
అక్కఱపడు. దే. అక్కఱగొను
అక్కఱపాటు. దే. అక్కఱపడుట
అక్కలకర. దే. జ్వరదోషమునకుఁ బనికి వచ్చునొక మూలిక
అక్కలి. దే. అల
అక్కలించు } దే. కడుపు వెన్నున అంటుకొనునట్లు సగ్గించు
అక్కళించు }

అక్కసము. దే. దయ, సంతాపము
అక్కసి. దే. ఆగ్రహవంతుఁడు, అక్కసుగలవాఁడు
అక్కసు. దే. కోపము, ఆగ్రహము
అక్కసుకాఁడు. దే. ఆగ్రహవంతుఁడు
అక్కి. దే. బిడ్డలకు లేచెడు ఒకగజ్జి
అక్కిబిక్కిదండ. దే. బాలక్రీడావిశేషము
అక్కిలి. దే. కలఁత, అంకిలి
అక్కిలిపడు. దే. కలఁతపడు
అక్కు. దే. ఱొమ్ము
అక్కుళ్లు. దే. ధాన్య విశేషము, ఆత్రగడలు
అక్తము. స. చేరినది,పోయినది,స్పష్టమైనది
అక్రమము. స. క్రమముకానిది, నేరము, దుర్మార్గమైనది, అన్యాయమయినది
అక్రియ. స. పనిచేయకపోవుట
అక్రియమాణము. స. చేయఁబడనిది
అక్రూరము. స. క్రూరముకానిది, శాంతమయినది
అక్రోధనుఁడు. స. కోపములేనివాఁడు
అక్లిష్టము. స. శ్రమనొందనిది, శిథిలముకానిది, క్రొత్తది
అక్షతము. స. నొప్పింపఁబడనిది
అక్షతలు. స. పసుపుగాని కుంకుమగాని రాచిన బియ్యపుగింజలు, సేసఁబ్రాలు
అక్షదర్శకుఁడు. స. దివాణమునందలి న్యాయ విచారణకర్త
అక్షదేవి. స. జూదమాడువాఁడు
అక్షద్యూతము. స. పాచికలాట [హము
అక్షద్యూతికము. స. జూదమునందలి కల
అక్షధూర్తిలము. స. ఎద్దు

అక్షధూర్తుఁడు. స. జూదరి
అక్షమాల. స. జపమాల
అక్షముఁడు. స. అసమర్థుఁడు
అక్షము. స. పాచిక, బండికన్ను, బండి, రుద్రాక్షము, తాండ్రచెట్టు, వ్యవహారము, పదునాఱుమాషములయెత్తు, తెలియఁబడిన యర్థము
అక్షయ. స. ఒకసంవత్సరము
అక్షయము. స. నాశముకానిది
అక్షయలోకము. స. స్వర్గము
అక్షరచణుఁడు. స. వ్రాఁతకాఁడు
అక్షరచుంచువు. స. వ్రాఁతకాఁడు
అక్షరజ్ఞుఁడు. స. విద్వాంసుఁడు
అక్షరము. స. అక్కరము, పరబ్రహ్మము, ముక్తి, నాశములేనిది
అక్షరుఁడు. స. చెడనివాఁడు, విష్ణువు, శివుఁడు
అక్షవతి. స. జూదము
అక్షవాటము. స. జెట్టి సాధకముచేయు [చోటు
అక్షసరము } స. జపమాల
అక్షసూత్రము } స. జపమాల
అక్షాంతి. స. ఓర్వలేనితనము
అక్షి. స. కన్ను
అక్షింతలు. గ్రా. అక్షతలు
అక్షిగతము. స. గోచరము
అక్షిగతుఁడు. స. పగఁగొనఁదగినవాఁడు
అక్షితము. స. చెడనిది, శిథిలముకానిది
అక్షిబము. స. మునగచెట్టు
అక్షీణము. స. ఎడతెగనిది, తఱుగనిది
అక్షీబము. స. మునగచెట్టు, పండింపక గలుగు ఉప్పు, క్రొవ్వనిది
అక్షీయమాణము. స. తఱుగనిది

అక్షుఁడు. స. రావణునికొడుకు
అక్షోటము. స. కొండగోనుగు
అక్షోభము. స. కలఁతలేమి, ఏనుఁగును కట్టుకంబము
అక్షౌహిణి. స. (21870 రథములు, అన్ని ఏనుఁగులు, 65610 గుఱ్ఱములు 109350 కాల్బలమునుగల) సేనావిశేషము
అఖండము. స. సమస్తము, ఖండముకానిది, నిరంతరము వెలుఁగుచుండెడిదీపము
అఖండితము. స. ఖండింపఁబడనిది, అనశ్వరమైనది
అఖండుకము. స. పొట్టిబెంకాయచెట్టు
అఖర్వము. స. విస్తారము
అఖాతము. స. మనుష్యులచేత త్రవ్వఁబడని కోనేఱు మొదలగు నీటిబెంకి
అఖిలము. స. సమస్తము
అగచరము. స. కోఁతి
అగచాట్లపోతు. దే. అనేక ఆపదలను పొందినవాఁడు
అగచాట్లమారి. దే. అగచాట్లపోతు
అగచాట్లు. దే. ఆపద, కడగండ్లు, తిప్పలు
అగచ్ఛము. స. చెట్టు
అగజాత. స. పార్వతి
అగడారు. దే. నింద, అపవాదము
అగడిత. త. కోటచుట్టు త్రవ్వఁబడిన జలాధారము
అగడు. దే. నింద, రవ్వ, అపకీర్తి, అల్లరి
అగడుపడు. దే. దూఱుపడు, తొట్రుపడు
అగడ్త. త. అగడిత, పరిఖ
అగణ్యము. స. ఎంచఁదగనిది
అగణితము. స. విస్తారమైనది

అగతికుఁడు. స. గతిలేనివాఁడు
అగత్యము. త. అవశ్యము, ఆవశ్యకత
అగదంకారుఁడు. స. వైద్యుఁడు [లేమి
అగదము. స. మందు, ఆరోగ్యము, వ్యాధి
అగప. దే. టెంకాయచిప్పగరిటె, అబక
అగపడు. దే. కనఁబడు, దొరకు, చిక్కు, అధీనమగు
అగపాటు. దే. అగపడుట
అగమము. స. కొండ, చెట్టు
అగము. స. కొండ, చెట్టు, పాము
అగమ్యము. స. పో శక్యముకానిది
అగరువు. స. చందనవిశేషము, అగలు
అగలు. త. అగరువు
అగలు. దే. పెల్లగిల్లు, పగులు
అగలుచు. దే. పెల్లగించు, పగులఁగొట్టు
అగవాళ్ళు. దే. తేలికయైన ఓరట్టుచెప్పులు
అగవు. దే. కార్యము, పని
అగసాలి, అగసాలె } దే. కమసాలివాఁడు, స్వర్ణకారుఁడు
అగస్తి. స. అగిసెచెట్టు, అగస్త్యుఁడు
అగస్త్యము. స. అవిసెచెట్టు
అగస్త్యుఁడు. స. ఒకఋషి
అగాడు. దే. తుపాకిపిరంగిలోనగు వానియందు నిప్పుఁదగిలించుట
అగాధము. స. మిక్కిలి లోఁతుగలది, బొక్క
అగారము, ఆగారము } స. ఇల్లు
అగావు. దే. కుదువ, ముందు రూకలిచ్చుట
అగిని. త. అగ్ని
అగిసియ, అగిసె } దే. అగిసెచెట్టు

అగు. దే. అవు, కలుగు
అగుఁగదె. దే. ఆశ్చర్యమును తెలుపును
అగుఁగాక. దే. అంగీకారమును తెలుపును
అగుఁబొమ్ము. దే. సరే, ఔను [వాఁడు
అగుణజ్ఞుఁడు. స. గుణమును గనిపెట్టలేని
అగుణి. స. సుగుణములులేనివాఁడు
అగుదెంచు. దే. అగు
అగుర, అగురా } దే. అవుర
అగురు. దే. అవురుగడ్డి, వీరణము
అగురువు. స. బరువులేనిది, చిన్నది, అగలు
అగులు. దే. ఊడు, పగులు
అగోచరము. స. కనఁబడనిది
అగౌకసము. స. పక్షి, సింహము
అగ్గపడు. దే. అగపడు, అధీనమగు
అగ్గపాటు. దే. అగపడుట, అగ్గపడుట
అగ్గము. దే. అధీనము, గోచరము
అగ్గలము. దే. అధికము, దుస్సహము
అగ్గలించు. దే. ఎక్కువగు, ఉత్సహించు
అగ్గలిక, అగ్గలికము } దే. ఆధిక్యము, పూనిక, పరాక్రమము, విలాసము
అగ్గి. త. నిప్పు, అగ్ని
అగ్గించు. త. స్తోత్రముచేయు
అగ్గింపు. త. స్తోత్రము
అగ్గికంటి. దే. శివుఁడు
అగ్గిచూలి. దే. కుమారస్వామి
అగ్గితత్తడి. దే. పొట్టేలు
అగ్గిబోడి. దే. కరదీపము, ఇలాయి
అగ్గువ. త. వెలతక్కువ, చౌక
అగ్ని. స. నిప్పు, చిత్రమూలము
అగ్నికణము. స. నిప్పుకణము

అగ్నికార్యము. స. అగ్నిహోత్రమును చేయుట

అగ్నిచిత్తు. స. సోమయాజి

అగ్నిజ్వాల. స. నిప్పుమంట, ఆరెచెట్టు

అగ్నిభువు. స. కుమారస్వామి

అగ్నిమంథము. స. నెల్లిచెట్టు

అగ్నిముఖము. స. జీడిచెట్టు

అగ్నిముఖుఁడు. స. బ్రాహ్మణుఁడు, వేల్పు

అగ్నిశిఖ. స. నిప్పుమంట, వెన్నవెదురుకూర

అగ్నిశిఖము. స. కుంకుమపువ్వు

అగ్నిష్టోమము. స. యాగవిశేషము

అగ్నిహోత్రము. స. అగ్ని, హోమము

అగ్రగణ్యము. స. శ్రేష్ఠమైనది

అగ్రజన్ముఁడు / అగ్రజుఁడు } స. బ్రాహ్మణుఁడు, అన్న, బ్రహ్మ

అగ్రణి. స. శ్రేష్ఠుఁడు, మొదటివాఁడు, ముఖ్యము

అగ్రతస్సరుఁడు. స. మొదటివాఁడు, ముందు నడచువాఁడు

అగ్రబీజము. స. ముంతమామిడిచెట్టు

అగ్రము. స. చివర, ముఖ్యము, ఎదురు, సమీపము, మొదటిది, ముందు

అగ్రసరుఁడు. స. మొదటివాఁడు, ముందు నడచువాఁడు

అగ్రహారము. స. బ్రాహ్మణుల ఇండ్లవరుస

అగ్రిమము. స. ప్రధానమైనది

అగ్రిముఁడు. స. మొదటివాఁడు, అన్న

అగ్రియము / అగ్రీయము } స. ముఖ్యము

అగ్రేదిధిషువు. స. మాఱుమనువుదాని మొదటిమగఁడు

అగ్రేసరుఁడు. స. మొదటివాఁడు, శ్రేష్ఠుఁడు

అగ్ర్యము. స. ముఖ్యము

అఘటనము. స. దుర్ఘటము

అఘటితము. స. అశక్యము

అఘమర్షణము. స. స్నానముచేయునపుడు జపించేమంత్రము

అఘము. స. పాపము, దుఃఖము

అఘోరము. స. మిగుల భయంకరము

అఘోరించు. స. దుఃఖించు

అఘ్న్య. స. ఆవు

అచండి. స. సాధువైనయావు

అచరము. స. స్థావరము

అచల. స. భూమి

అచలము. స. కొండ, కదలనిది, మేకు

అచలుఁడు. స. కదలనివాఁడు

అచింత్యము. స. చింతింపరానిది

అచిత్తి. స. అజ్ఞానము, తెలివిలేమి

అచిరద్యుతి. స. మెఱపు

అచుంబితము. స. ముద్దుపెట్టుకొనఁబడనిది

అచేతనము. స. ప్రాణములేనిది

అచ్చిక / అచ్చికము } దే. కొఱత

అచ్చికబుచ్చిక. దే. కల్పుకోలుతనము, భేదములేకయుండుట

అచ్చివచ్చు. దే. అయివచ్చు, మేలైవచ్చు

అచ్చెరియము. త. ఆశ్చర్యము

అచ్చెరుపడు. త. ఆశ్చర్యపడు

అచ్చెరుపాటు. త. ఆశ్చర్యపడుట

అచ్యుతాగ్రజుఁడు. స. బలరాముఁడు

అచ్యుతుఁడు. స. విష్ణువు, స్థిరమైనవాఁడు

అచట } దే. అచోటు
అచటు }

అచోటు. దే. అస్థలము

అచ్చ. దే. అచ్చము [స్ఫటికమాల

అచ్చగుండ్లపేరు. దే. ముత్యాలహారము,

అచ్చట } దే. అస్థానము
అచ్చటు }

అచ్చనగండ్లు } దే.బాలికలుగచ్చకాయ
అచ్చనగాయలు } లతో ఆడు ఒకఆట

అచ్చనగుండ్లు. దే. అచ్చనలు ఆడుగుండ్లు, లేక కాయలు, అచ్చనగుండ్లాట

అచ్చనలు. దే. అచ్చనగండ్లు

అచ్చము. త. స్వచ్ఛము, తెల్లనిది, కేవలము

అచ్చర. త. అప్సరస్త్రీ

అచ్చరము. త. అక్షరము

అచ్చలము. దే. కోపము, పూనిక

అచ్చలించు. దే. ఆగ్రహించు

అచ్చాళు. దే. జంజాటము లేనివాఁడు

అచ్చు. దే. అప్పుపడు, ఇచ్చు, దండుగిచ్చు

అచ్చు. త. ముద్ర, విధము, బెల్లము మొదలైనవాని అచ్చురూపము, ప్రతిబింబము, సాలెవానిసాధనవిశేషము, శుద్ధము

అచ్చుఁగూటము. దే. ముద్రాక్షరశాల

అచ్చుకట్టు. దే. ఏర్పులచే, మడిమడిగా గట్టువేయు

అచ్చుకుప్ప. దే. ధనవంతుఁడు

అచ్చుకొను. దే. తానియ్యవలవని ధనాదికమును ఇచ్చుటకు ఒప్పుకొను

అచ్చుటెద్దు. దే. అచ్చువేసి విడిచినఎద్దు

అచ్చుదల. దే. అచ్చి వచ్చుట, అప్పు

అచ్చుపడు. దే. స్పష్టమగు, ముద్రింపఁబడు

అచ్చుపాటు. దే. అచ్చుపడుట, ఏర్పాటు

అచ్చోటు } దే. అక్కడ, అస్థానము,
అచ్చోఁటు } ఆఁడుగుఱి

అచ్చొత్తు. దే. అచ్చువేయు, ముద్రించు

అచ్ఛభల్లము. స. ఎలుఁగుగొడ్డు

అచ్ఛము. స. ఎలుఁగుగొడ్డు, స్వచ్ఛము

అచ్ఛాచ్ఛము. స. మిక్కిలి స్వచ్ఛమయినది

అజ. స. ప్రకృతి, ఆఁడు మేఁక

అజగంధిక. స. వాయింట మొక్క

అజగరము. స. పెనుఁబాము

అజగర్దము. స. నీరుపాము

అజగవము. స. శివునివిల్లు

అజన్యము. స. తోఁకచుక్క మొదలగు ఉత్పాతము, జన్యముకానిది

అజప. స. సగము మగపోలిక సగము ఆఁడు పోలిక గల అకృతి

అజపుఁడు. స. వైదికములు కాని గ్రంథములను చదువువాఁడు

అజభక్షము. స. బొబ్బిలిచెట్టు

అజము. స. మగమేఁక

అజమోద. స. ఒకదినుసుఓమము

అజయ్యము. స. జయింపశక్యముగానిది

అజరుఁడు. స. ముసలితనములేనివాఁడు

అజశృంగి. స. జొట్టుపుఁజెట్టు

అజస్రము. స. ఎల్లప్పుడు

అజహ. స. దూలగొండిచెట్టు

అజాండము. స. బ్రహ్మాండము

అజాగ్రత్త. స. జాగ్రత్తలేమి

అజాజి. స. జీలకఱ్ఱ

అజాజీవుఁడు. స. మేఁకలమేఁపువాఁడు

అజాతశత్రువు. స. ధర్మరాజు, శత్రువులు లేనివాఁడు
అజానేయము. స. మంచిగుఱ్ఱము
అజితము. స. జయింపఁబడనిది
అజితుఁడు. స. బ్రహ్మ, విష్ణువు, శివుఁడు, జయింపఁబడనివాఁడు
అజినపత్ర. స. గబ్బిలము, చివుకపిట్ట
అజినము. స. తోలు
అజిరము. స. కప్ప, గాలి, ముంగిలి
అజిహ్మగము. స. బాణము
అజిహ్మము. స. కప్ప, సరియైనది
అజిహ్వము. స. కప్ప, నాలుకలేనిది
అజీగవము, అజీగావము } స. అజగవము, శివునివిల్లు
అజీర్ణము, అజీర్తి } స. అన్నాదులు అఱుగక పోవుట
అజీవనము, అజీవని } స. మరణము
అజీవము. స. ప్రాణములేనిది
అజుఁడు. స. బ్రహ్మ, విష్ణువు, శివుఁడు, మన్మథుఁడు, ఒకానొకరాజు
అజేయము. స. గెలువశక్యముకానిది
అజ్ఝట. స. నేలయుసిరికచెట్టు
అజ్ఞత. స. తెలివిలేనితనము, అజ్ఞత్వము
అజ్ఞానము. స. తెలివిలేమి
అజ్ఞుఁడు. స. మూర్ఖుఁడు, తెలివిలేనివాఁడు
అజొరము. దే. మొగసాల, చావడి
అజ్జె. దే. పాదము, సమయము, బళీ, నేర్పు
అజ్జెము. త. కొన్నిపనసలుగల వేదభాగము
అజ్జెరె. దే. బళిరే
అజ్జెవాలు. దే. కోడి, చరణాయుధము

అజ్జో. దే. బళీ
అజ్జోరె, అజ్జోరే } దే. బళీయను ప్రశంసనార్థకము
అట. దే. అక్కడ, అవుల
అటకలి. దే. నలుగుపిండి, నూనెజిడ్డును పోఁగొట్టెడువస్తువు
అటతాళము. స. తాళభేదము
అటనము. స. తిరుగుట, సంచారము
అటని. స. వింటిచివర
అటను. దే. భయము [అసత్యము
అటమట. దే. వంచన, దుఃఖము, వ్యర్థము,
అటమటకాఁడు. దే. అటమటీఁడు, వంచకుఁడు [చలించు
అటమటించు. దే. వంచు, అపహరించు,
అటమటీఁడు. దే. మోసకాఁడు
అటమర. దే. వ్యర్థము, పలాయనము
అటమరించు. దే. అటమటించు
అటరూషము. స. అడ్డసరపుచెట్టు
అటవి. స. అడవి, అరణ్యము [గుట
అటాట్య. స. భిక్షలోనగువానికొఱకుతిరు
అటి. దే. అట్టి
అటిక. దే. చిన్నకుండ
అటికమామిడి. దే. వృక్షవిశేషము
అటు. దే. ఆప్రకారము, అక్కడికి
అటుక. దే. ఇంటిలోపల గోడలమీఁద కొయ్యలతో నేర్పఱచఁబడినమంచె,అటక
అటుకులు. దే. వడ్లునానబోసి వేయించి [కొట్టినవి
అటులు. దే. ఆప్రకారము
అటువంటి. దే. అట్టి
అటువలె. దే. అట్లు [పెడిపదము
అటె. దే. ఆశ్చర్యమును, దుఃఖమును తెలి

అట్ట. దే. తలతెగినశరీరము, చెప్పులకు అడుగున వేయుచర్మము, త్వక్కు

అట్టచెమ్మ. దే. నాలుగుగవ్వలతో నాడెడు నొకానొకఆట

అట్టడి. త. కోఁటబురుజుమీఁదియిల్లు

అట్టము. స. వంటకము, వంటచెఱకు, మేడ వెనుకటియిల్లు, అతిశయము

అట్టము. త. వేదకాండము, అట్ఠము

అట్టహాసము. స. పెద్దనవ్వు

అట్నము. దే. కోటబురుజు

అట్టాలకము. స. కోటబురుజు, నగరు

అట్టి. దే. అటువంటి

అట్టిఁడు. దే. అటువంటివాఁడు

అట్టిక. దే. అటుక

అట్టియ. దే. గుంపు

అట్టు. దే. పిండివంటలోని భేదము, ఆప్రకారము

అట్టుక. దే. అటిక

అట్టుపుట్టానవాలు. దే. యావత్తువివరము

అట్టుప్పు. దే. ఒకదినుసుఉప్పు

అట్టులు. దే. ఆప్రకారము, అట్లు

అట్టువ. దే. అటుక

అట్టె. దే. ఆశ్చర్యమును దుఃఖమును తెలిపెడిపదము

అట్టెడ. దే. పూడికయెత్తుటకు ఉపయోగింపఁబడుతట్ట, జల్లెడవంటితడిక, వంతెన, కోటలోని యొకభాగము

అట్రము. త. వేదభాగము, అష్టకము

అట్లు. దే. ఆప్రకారము

అట్లొట్లు. దే. వాన వెలిసినపిమ్మట చూరు నుండి పడెడినీటిబొట్లు, నట్టొట్లు, వంగుళ్లు

అడ. దే. ముద్ద, ఆకృతి

అడఁకువ. దే. వినయము, నమ్రత

అడఁగారు. దే. అడఁగు, ఉపశమిల్లు

అడఁగించు. దే. అణఁగించు

అడఁగు. దే. తగ్గు, ఉపశమిల్లు, నశించు, లోఁబడు, నమ్రమగు

అడఁచు. దే. అడఁగఁజేయు

అడకత్తు, అడకత్తెర. దే. అడకొత్తు, పూగదళని

అడకము. దే. లోపలనణఁగినది

అడకర. దే. తాలిమి, ఓర్పు

అడకించు. దే. అపహసించు, మోసపుచ్చు

అడకొత్తు. దే. పోఁకొత్తు, పోఁకలను ముక్కలుచేయు సాధనము, శంకుల

అడగొను. దే. అడకట్టు, ముద్దకట్టు

అడగోలుకొను. దే. అపహరించు

అడజెడి. దే. అలజెడి, దుఃఖము

అడజెడిపెట్టు. దే. దుఃఖపఱచు

అడది. త. పచ్చేఁదనము

అడప. దే. అడప ముంచికొనియుండు ఆఁడుది, పశుపాదరోగము

అడపకత్తె, అడపకత్తియ. దే. అడపముంచికొని యుండునది, తాంబూలము మడిచియిచ్చునది

అడపకాఁడు. దే. అడపము నుంచుకొను వాఁడు

అడపము. దే. వక్కలాకులతిత్తి, మంగలతిత్తి

అడపఱ. దే. అడ, ముద్ద

అడపు. దే. పట్టుకొను

అడపొడ. దే. జాడ

అడబాల. త. వంటవాఁడు, వంటలక్క

అడరించు. దే. బాణమును ప్రయోగించు, వేయు

అడరు. దే. అతిశయించు, కలుగు, పూను, త్వరపడు, వృద్ధిపొందు, వ్యాపించు, ఆధిక్యము, ఒప్పు, కష్టము

అడరుచు } దే. అడరించు
అడర్చు }

అడరుదెంచు. దే. అతిశయించు

అడలించు దే. గద్దించు, గదుము

అడలు. దే. ఏడ్చు, దుఃఖించు, శోకము, భీతి, భయపడు

అడలుకొను. దే. అడలు, శోకించు

అడవి. త. అరణ్యము, కాన

అడవికాఁపు. దే. వానప్రస్థుఁడు

అడవికుక్క. త. తోఁడేలు

అడవితిరుగుడు. దే. కోఁతి

అడవినెలవరి } దే. వనవాసి
అడవిమనికిపట్టు }

అడసాల. త. వంటయిల్లు

అడి. త. వ్యర్థము, అధికము [జాళ్లు

అడిగండ్లు. దే. మలువఁగా నడుగుననిలిచిన

అడిగము. దే. ఎడ్లమీఁదవేయు కంట్లముల లోని భేదము

అడిగట్టె. దే. పాదుక

అడిగొట్టు. దే. అడిగొంటు, కల్పితుఁడు

అడిచిపడు. దే. త్వరపడు, మండిపడు, మిడిసిపడు

అడిచిపాటు. దే. త్వర

అడితి. దే. వర్తకములో నూటికింతయని పుచ్చుకొనెడు తఱుగు

అడిత్రాగుడు. దే. కఱవు, దుర్భిక్షము

అడిదపుమెకము. దే. ఖడ్గమృగము

అడిదము. దే. ఖడ్గము, కత్తి

అడిబండ. దే. దుష్టుఁడు, తుంటరి

అడిబీరము. దే. కావరము, మత్తు

అడియఁడు. దే. పాదసేవకుఁడు

అడియరి. దే. కింకరుఁడు, లోభి

అడియాలము. దే. గుఱుతు

అడియాస. దే. అర్థాశ, దురాశ

అడియొత్తు. దే. పాదుక

అడిసాట. దే. తరుగుబేరము, అనావతు బేరము

అడుకు. దే. దొంతిగనిడు, దొంతి, భయము

అడుకులు. దే. అటుకులు

అడుగంటు. దే. వట్టిపోవు

అడుగంట్లు. దే. అడుగున నిల్చినవి

అడుగు. దే. ప్రశ్నముచేయు, యాచించు, క్రింద, పాదము, పాదప్రమాణము, అధమము

అడుగుకొను. దే. ప్రార్థించు, యాచించు

అడుగుకోలు. దే. ప్రార్థన, యాచన, బిచ్చము

అడుగుపడు. దే. అధమమగు

అడుగుపుట్టువు. దే. శూద్రుఁడు, గంగ

అడుచు. దే. కొట్టు, పంపు

అడుజ. దే. ఒకజాతిడేగ [రోగము

అడుప. దే. పశువులకాళ్లయందుఁ గలిగెడు

అడుపు. దే. దెబ్బ, కొట్టు, తాడనము

అడువ. దే. ప్రాఁత

అడువు. దే. అడుగు, పాదము

అడువుఁబుట్టువు. దే. కాఁపువాఁడు, గంగ

అడుసు. దే బురద

అడ్గు. దే. అడుగు

అడ్డ. త. కుంచెములో సగము

అడ్డంకి. దే. అడ్డి, ఆటంకము
అడ్డకట్ట. దే. నీళ్లు పోకయుండుటకు అడ్డముగా కట్టెడుకట్ట
అడ్డకట్టు. దే. అడ్డగించు
అడ్డకత్తి. దే. ఆయుధవిశేషము
అడ్డకమ్మి. దే. ద్వారబంధపులత్తుకమ్మి
అడ్డకఱ్ఱ. దే. అడ్డి, విఘ్నము [సాధనము
అడ్డకోడమ. దే చేపలనుపట్టు ఒకానొక
అడ్డగాలు. దే. అడ్డకఱ్ఱ
అడ్డగించు. దే. నిలుపు, నిరోధించు
అడ్డచేఁపు. దే. అడ్డవాసపుదూలము
అడ్డనము. త. డాలు, కేడెము
అడ్డపట్టు. దే. అడ్డముగా పట్టు
అడ్డపట్టె. దే. మడి చేయునుపయోగించెడి పలక, అడ్డపట్టియ
అడ్డపడు. దే. అడ్డమువచ్చు, అభ్యంతరమగు
అడ్డపాటు. దే. అడ్డపడుట, నిరోధము
అడ్డపాప. దే. శిశువు
అడ్డపెట్టు. దే. నిరోధించు, ఈడుపెట్టు
అడ్డబాస. దే. స్త్రీలు ముక్కునకు పెట్టుకొనునత్తు, బులాకి
అడ్డమాడు. దే. విరుద్ధముగాఁ బలుకు
అడ్డమాను. దే. అడ్డపట్టె
అడ్డము. దే. నిరోధము, వ్యవధానము, చోటు, తాకట్టు, తిర్యక్కు, పూఁట
అడ్డరిక. స. పోళీ, ఇడ్డెన
అడ్డవాట్లు. దే. అభ్యంతరములు
అడ్డవాలియమ్ము. దే. ఒకదినుసుబాణము
అడ్డవేడెము. దే. పామునడకవంటి గుఱ్ఱపు నడక

అడ్డసరము. త. అటరూషము, ఒకానొక చెట్టు
అడ్డసారెలు }
అడ్డసాళులు } దే. పాచికలు
అడ్డసాళ్లు }
అడ్డాదిడ్డి. దే. అక్రమము
అడ్డి. దే. అక్రమము
అడ్డి. దే. అడ్డంకి, నిరోధము
అడ్డిగ. దే. అడ్డుగ
అడ్డిగలు. దే. ఆఁడువారు మెడనుంచుకొనెడు ఒకనగ
అడ్డిపడు. దే. అభ్యంతరమగు
అడ్డు. దే. అడ్డగించు, అడ్డగింత, చోటు
అడ్డుగ. త. రూకలో సగము, చిన్నములో సగము [ఘాతము
అడ్డుగఱ్ఱ. దే. అడ్డకఱ్ఱ, గడియమ్రాను, వి
అడ్డుగొను. దే. అడ్డపడు
అడ్డెఁడు. దే. రెండుమానికలసరకు
అణఁకువ. దే. అడఁకువ
అణఁగారు. దే. అడఁగారు, ఉపశమిల్లు
అణఁగు. దే. నశించు, తగ్గు, లోఁబడు, ఉపశమిల్లు, నమ్రమగు
అణఁచు. దే. అడఁచు, అణఁగించు
అణక. దే. మెడమీఁదనున్న కాఁడిని మెడక్రిందికి తెచ్చుకొనుట
అణకించు. దే. అడకించు, అపహసించు
అణకుఁడు. స. అధముఁడు, కుత్సితుఁడు
అణవీనము }
అణవ్యము } స. అణువులుపండుపొలము
అణి. స. ఇఱుసుతుదిచీల, అంచు
అణిమ. స. అణుత్వము, ఒకయైశ్వర్యము

అణీయము. స. మిక్కిలి యణువు
అణీయుఁడు. స. అతిసూక్ష్మమైనవాఁడు
అణుకుఁడు. స. అల్పుఁడు, నేర్పరి
అణుజే. దే. అడుజే, ఒకవిధమైన డేగ
అణువు. స. చిఱువడ్లు, లేశము, అల్పము
అతంద్రిత. స. అలసటలేమి, జాగరూకత
అతఁడు. దే. ఆయన, ఆతగాఁడు
అతకరించు. త. క్రిందుపఱుచు, అతిక్రమించు
అతగుఁడు. దే. దుర్బలుఁడు, బీద
అతత్త్వము. స. నిజముకానిది
అతనుఁడు. స. మన్మథుఁడు, గొప్పవాఁడు
అతర్కణము. త. నేరము, దుర్మార్గము, మట్టుమీఱినకార్యము
అతర్క్యము. స. ఊహింపఁగూడనిది
అతలకుతలము, అతలాకుతలము } దే. నలుగుట, శ్రమము, చెదరిపోవుట [ము
అతలము. స. భూలోకమునకు క్రిందిలోక
అతలస్పర్శము.స. మిక్కిలి లోఁతైనది
అతసి. స. అగిసెచెట్టు
అతికల్యాణము. స అందముకానిది
అతికించు. దే. అంటించు [బడినది
అతికృతము. స. మిగులనధికముగాఁ జేయఁ
అతిక్రమము. స. మీఱుట, దుర్మార్గము
అతిక్రమించు. స. మీఱు
అతిక్రాంతము. స. మీఱినది, అతీతము
అతిక్రాంతి. స. అతిక్రమము
అతిగండము. స. ఒకయోగము, దొడ్డచెంప గలది [కము
అతిగంధము. స. విశేషవాసన గలది, గంధ

అతిగహనము, అతిగహ్వరము } స. చొరశక్యము కానిది
అతిగుణము. స. శ్రేష్ఠమైనది, ఉత్తమగుణములు కలది
అతిచర. స. మెట్టదామర
అతిచరణము. స. విశేషవాడుక, అత్యధికముగఁ జేయుట [వేగము
అతిచారము. స. మీఱుట, గ్రహగమన
అతిచ్ఛత్ర. స. సదాపమొక్క
అతిచ్ఛత్రము. స. గుడ్డికామంచిమొక్క
అతిజనము. స. కాఁపురము లేనిది
అతిథి. స. విందు, భోజనార్థము ఇంటికి వచ్చిన యాచకుఁడు
అతిదుర్మనాయమానము. స. విశేషముగా దుఃఖించునది
అతిదేశము. స. బదులు, రూపనిష్పత్తి
అతిధృతి. స. అత్యంతధృతి గలవాఁడు, ఒకఛందస్సు
అతినువు. స. ఓడఁగడచినది, ఓడదిగినది
అతిపథము. స. మంచిత్రోవ
అతిపన్నము. స. కడచినది, తప్పిపోయినది
అతిపాతము. స. అతిక్రమము
అతిప్రసంగము, అతిప్రసక్తి } స. అధికప్రేమ, గర్వము, అవమానము
అతిబల. స. ఒకదినుసుమొక్క, విశ్వామిత్రుఁడుపదేశించిన ఒకవిద్య, మిక్కిలి బలము గలది
అతిబాల. స. రెండేండ్లువయస్సుగలయావు
అతిబాలకుఁడు. స. శిశువు
అతిబ్రహ్మచర్యుఁడు. స. స్త్రీసంగమాదులు చేయుచు బ్రహ్మచర్యవ్రతము మానిన వాఁడు

అతిభూమి. స. అతిశయము
అతిమతి. స. గర్వము
అతిమధురము. స. ఒకతియ్యనిమందు దినుసు, మంచిరుచిగలది
అతిమాత్రము. స. అధికము, మిక్కిలి
అతిమానము. స. లెక్కింపశక్యముకానిది, గర్వము
అతిమానుషము. స. మనుష్యశక్తికిమించినది
అతిముక్తము. స. పువ్వులగురివిందచెట్టు, కూడికలేనిది
అతిరథుఁడు. స. పెక్కు విలుకాండ్రతో పోరెడి యోధుఁడు
అతిరభసము. స. విశేషవేగము, తొందర
అతిరసము. స. భక్ష్యవిశేషము, అరిసె
అతిరిక్తము. స. హెచ్చినది
అతిరూపము. స. రూపములేనిది, మిగుల నందమైనది
అతిరేకము. స. ఆధిక్యము, అధికమైనది
అతిరోగము. స. క్షయరోగము
అతిలోకుఁడు. స. లోకాతీతుఁడు, మిగుల దొడ్డవాఁడు
అతివ. దే. ఆఁడుది, వనిత
అతివర్తనము. స. మన్నింపఁదగిననేరము, దండనలేనిది [మీఱినవాఁడు
అతివర్ణాశ్రమి. స. వర్ణాశ్రమధర్మములను
అతివస. త. ఒకమందుదినుసు, అతివిష
అతివాదము. స. కఠినముగా మాటాడుట
అతివాసము. త. శ్రాద్ధదినమునకు ముందు దినము
అతివిష. స. అతివస [చ్చువాన
అతివృష్టి. స. దేశమునకు హానికరమైనహె
అతివేలము. స. అతిశయము, వెల్లు
అతిశయము. స. ఆధిక్యము, ఎక్కువ
అతిశయిల్లు. స. అగ్గలించు
అతిశాయి. స. అతిశయించినది
అతిశేషము. స. మిగిలియున్నకొంచెము
అతిసంచయము. స. ద్రవ్యము నధికముగ పోగుచేయుట
అతిసంధానము. స. మోసము
అతిసర్గము. స. కోరికనిచ్చుట, తీసివేయుట
అతిసర్జనము. స. ఈవి, కొల
అతిసారకి. స. అతిసారరోగము గలవాఁడు
అతిసారము. స. రోగవిశేషము
అతీంద్రియము. స. ప్రత్యక్షముకానిది
అతీకాశము. స. ప్రకాశము
అతీతము. స. అతిక్రాంతము, కడచినది
అతీతుఁడు. స. కడచినవాఁడు
అతీర్థము. స. తప్పుత్రోవ, అననుకూల కాలము
అతుకు. దే. అంటుకొను, అతికినతావు, అతికించు, అతికించినది
అతులము } స. సరిలేనిది
అతులితము }
అతుష్టి. స. అతృప్తి
అతేజస్కము. స. కాంతివిహీనమైనది
అత్త. దే. మగనియొక్కతల్లి, భార్యయొక్కతల్లి, తండ్రిసోదరి, మేనమామ భార్య
అత్తడి. దే. ఆఁడుగుఱ్ఱముయొక్క ఋతు కాలము
అత్తపత్తి. దే. తాఁకిన ముడుచుకొను నా కులుగల మొక్క, సిగ్గాకు
అత్తమిల్లు. త. అస్తమించు, ఒఱగు, శయనించు, వ్యాపించు
అత్తము. దే. అరఁటిపండ్లగెల, సమూహము

అత్తరము. దే. త్వర, ఆత్రము
అత్తరు } దే. సుగంధతైలము
అత్తరువు
అత్తలము } దే. ఈటె
అత్తళము
అత్తి. దే. మేడిచెట్టు
అత్తిక. స. నాట్యపరిభాషయందు అక్క
అత్తు. దే. కలియు, కూడు, తగు, మైనపు గుడ్డ
అత్రైము. త. డేగకాలిగోళ్లు తగులకుండు నట్లు చేతికిఁ గట్టుకొనుచర్మము, హస్త కవచము
అత్తెసరు. దే. గంజివార్చకుండ నన్నములో నిమిడిపోవునట్లు పెట్టఁబడి యుడికిన యన్నము
అత్యంతము. స. అధికము, మిక్కిలి [డు
అత్యంతీనుఁడు. స. విచ్చలవిడిగనడచేవాఁ
అత్యయము. స. అతిక్రమము, కష్టము, దుఃఖము, చేటు
అత్యరాళము. స. మిక్కిలి వంకరైనది
అత్యర్థము. స. అధికము
అత్యాకారము. స. తిరస్కారము
అత్యారూఢము. స. ఉన్నతపదవి
అత్యాశ. స. పేరాస
అత్యాహితము. స. మిక్కిలివెఱపు, కూడఁ బడినది, బ్రదుకుఁ గోరనిపని, గొప్ప యాపద [ఇంగువ
అత్యుగ్రము. స. మిగుల భయంకరమైనది,
అదండ్యము. స. దండింపఁదగనిది [లేనిది
అదంతము. స. దంతములురానిది,దంతములు
అదంత్యము. స. దంత్యముకానిది, పండ్లకు హానికరమైనది [అతంత్రము
అదంత్రము. త. స్వాతంత్ర్యముతప్పినది,
అదంభము. స. మోసములేనిది, మరియాద
అదంష్ట్రము. స. దంతములులేనిది, కోఱలు తీసినపాము
అదక. దే. ప్రాఁతచెప్పు
అదటు. దే. గర్వము
అదత్త. స. పెండ్లికానిపడుచు
అదత్తము. స. ఈయఁబడనిది, చెల్లనియీవి
అదనబదన. దే. చెక్కుచెదరకుండ, పోఁడి మిగా
అదను. దే. సమయము, కాలము
అదనైనవాఁడు. దే. ఆఁకొన్నవాఁడు, క్షుధి తుఁడు
అదభ్రము. స. ఎక్కువది, విస్తారమైనది
అదయుఁడు. స. దయలేనివాఁడు
అదరము. త. పెదవి, అధరము
అదరించు. దే. గదుము, అదలించు
అదరు. దే. చలించు, చలనము, భయము, భయపడు
అదరుగడ. దే. బెదరు
అదరులు. దే. విస్ఫులింగములు, నిప్పులు
అదర్శనము. స. చూడమి, కల
అదలించు. దే. బెదరించు, గద్దించు
అదలు. దే. బెదరు, భయపడు
అదలుచు } దే. అదలించు, బెదరించు, కోపముచేగద్దించు, తర్జించు
అదల్చు
అదలుపు } దే. అదలించుట, తర్జనము
అదల్పు
అదవ. దే. అడ్వి, కోన
అదవద. దే. కలఁత, చింత, వ్యత్యస్తము

అదవదపడు. దే. కలఁతపడు, వ్యాకులపడు
అదాటు. దే. అకస్మాత్తు, ఉన్నట్టుండి
అదారుఁడు. స. భార్యలేనివాఁడు
అదాసుఁడు. స. దాసుఁడుకానివాఁడు
అదాహ్యము. స. కాల్పఁబడనిది, పరమాత్మ
అది. దే. తదర్థకము
అదిగొ. దే. కనఁబడుచున్నదానిఁ జూపుట, అదిగో
అదితి. స. దేవతలతల్లి
అదితినందనుఁడు. స. అమరుఁడు
అదిర } దే. ఔరా
అదిరా }
అదిరిపడు. దే. ఉలికిపడు, గర్వపడు
అదిరిపాటు. దే. ఉన్నట్టుండి, ఏమరిపాటు, గర్వము
అదుకు. దే. అతుకు, అలికినతావు
అదుము. దే. అణఁచు
అదుముడు. దే. అనుముట, ఒత్తుట, కుక్కుట
అదురు. దే. చలించు, అదరు
అదురుఁగ్రోవి. దే అదురువేటు
అదురుఁద్రిక్కు. దే. పశురోగవిశేషము
అదురుగడ. దే. అదిరిపాటు
అదురుగుండియ. దే భయపడుస్వభావము గలవాఁడు
అదురువేటు. దే. ఇనుపగొట్టములో మందు గట్టించి అదురునటుల ప్రేసెడువేటు
అదువ. దే. అస్థిరము
అదృకుక్కు. స. గ్రుడ్డివాఁడు
అదృశ్యత. స. కనఁబడకపోవుట
అదృశ్యము. స. దృశ్యముకానిది

అదృష్టము. స. భాగ్యము, చూడఁబడనిది
అదృష్టి. స. కోపముచేఁ గ్రూరమైనచూపు
అదె. దే. అదిగో
అదేవుఁడు. స. దేవుఁడుకానివాఁడు, నిరీశ్వరుఁడు
అదేశము. స. చెడ్డదేశము, తప్పుతావు
అదేశ్యము. స. ఆజ్ఞాపింపఁదగనిది
అద్ద. త. సగము, అరసోల, పరికుప్పలోని క్రింది సగముభాగము
అద్దకము. దే. వస్త్రమునకు వేయురంగు
అద్దగోడ. త. సగముగోడ, మఱుఁగుగోడ
అద్దమరేయి. త. అర్ధరాత్రి
అద్దము. త. సగము, ముఖము చూచుకొనెడి గాజుబిల్ల
అద్దరి. దే. ఆదరి, ఆవల, అక్కడ
అద్ది. దే. అది, అయ్యది
అద్దికము. దే. కావలి, రక్షణము
అద్దిగ. దే. అద్దె, బాడుగ
అద్దిర } దే. ఔరా
అద్దిరా }
అద్దిరపడు. దే. ఆశ్చర్యపడు
అద్దిరపాటు. దే. అద్దిరపడుట
అద్దిరయ్య. దే. ఔరా
అద్దు. దే. రంగువేయు, తోఁచు
అద్దువ. దే. అస్థిరము, అదువ
అద్దె. దే. బాడుగ
అద్భుతము. స. ఆశ్చర్యము, ఆశ్చర్యకరము
అద్మరుఁడు. స. తిండిపోతు
అద్యతనీయము. స. నేఁటిది, ఈకాలపుది
అద్యతనుఁడు. స. ఇప్పటివాఁడు

అద్యత్వము. స. ఇప్పుడు
అద్రవ్యము. స. పనికిమాలినవస్తువు
అద్రి. స. కొండ, చెట్టు, సూర్యుడు
అద్రిరాజము. స. హిమవత్పర్వతము
అద్రుచు. దే. అదురు, కంపించు [గుడు
అద్వంద్వుడు. స. తత్త్వజ్ఞుడు, నిస్సం
అద్వయవాది. స. జైనులదేవత
అద్వయుడు. స. సాటిలేనివాడు, దేవుడు
అద్వితీయము. స. అసమానము
అద్వేషరాగి. స. ఇష్టానిష్టములులేనివాడు
అద్వైతము. స. అభేదము, జీవేశ్వరుల
 కైక్యము చెప్పెడి మతము
అధఃకరణము. స. క్రిందుపఱచుట
అధఃకరించు. స. తక్కువపఱచు
అధఃకారము. స. క్రిందుపఱచుట
అధఃకృతము. స. తక్కువపఱుపఁబడినది
అధనుడు. స. నిర్ధనుడు
అధమము. స. తక్కువైనది, నీచము
అధమర్ణుడు. స. అప్పుతీసికొన్నవాడు,
 అప్పుపడ్డవాడు
అధముడు. స. నీచుడు
అధరము. స. పెదవిక్రిందిది, తక్కువైనది
అధరాంబరము. స. కట్టువస్త్రము
అధరితము. స. క్రిందుపఱుపఁబడినది
అధర్మము. స. ధర్మముకానిది
అధర్వము. స. ఒకవేదము
అధర్వణుడు. స. అధర్వవేదము తెలిసిన
 బ్రాహ్మణుడు, పురోహితుడు
అధర్వుడు. స. బ్రాహ్మణుడు
అధవ. స. విధవ

అధవా. స. లేనిపక్షమందు
అధార్మికుడు. స. అన్యాయముయినవాడు
అధికమాసము. స. ఒకసంవత్సరములోనే
 రెట్టింపుగా వచ్చెడునెల
అధికము. స. అతిశయము, ఎక్కువ
అధికరణము. స. ఆధారము
అధికరణికుడు. స. న్యాయాధిపతి, అధికారి
అధికరణ్యము. స. అధికారము, శక్తి
అధికరించు. స. చేదువు, అతిశయించు
అధికాంగము. స. నడికట్టు
అధికామము. స. బలమగుకోరిక
అధికారము. స. ప్రక్రియ, చెల్లుబడి, స్వ
 తంత్రము, యోగ్యబాధ్యత, దొరతనము
అధికారి. స. అధికారము కలవాడు,
 ప్రభువు
అధికుడు. స. గొప్పవాడు, దొడ్డవాడు
అధికృతుడు. స. అధికారి
అధిక్రియ. స. అధికారము [బడినది
అధిక్షిప్తము. స. ఉంచఁబడినది, ఆక్షేపింపఁ
అధిక్షేపము. స. ఆక్షేపించుట, దూఱుట
అధిక్షేపించు. స. ఆక్షేపించు, దూఱు, బెద
 రించు
అధిగంత. స. పొందువాడు
అధిగతము. స. చేదువఁబడినది, పొందఁబడి
 నది [లాభము
అధిగమము. స. చేదువుట, పొందుట,
అధిగమించు. స. అదువు, పొందు, గ్ర
 హించు, నేర్పు
అధిగవము. స. ఆవువలనఁ గలిగినది
అధిగుణము. స. ఉత్తమగుణములుగలది,
 ఎక్కువగుణము

అధిచరణము. స. ఒకవస్తువుమీఁదనడచుట
అధిజనము. స. జన్మము, పుట్టుక
అధిజ్యము. స. ఎక్కుపెట్టినది
అధిత్యక. స. కొండమీఁదినేల
అధిదంతము. స. ఎక్కువపల్లుగలది
అధిదేవత. స. సంరక్షించుదేవత
అధిదేవనము. స. జూదమాడుపలక
అధిపతి, అధిపుఁడు, అధిభువు. స. ప్రభువు, ఏలిక
అధిభోజనము. స. అధికభోజనము, మంచి భోజనము
అధిమండపము. స. న్యాయసభ
అధిమంథము. స. నేత్రరోగము
అధియజ్ఞము. స. గొప్పయజ్ఞము
అధియోగము. స. మంచిముహూర్తము
అధిరథుఁడు. స. రథమునెక్కినవాఁడు
అధిరాజు. స. గొప్పరాజు
అధిరోహణము. స. ఆరోహణము,ఎక్కుట
అధిరోహించు. స. ఆరోహించు, ఎక్కు
అధిరోహిణి. స. నిచ్చెన
అధివక్త. స. పక్షపాతముగమాటాడువాఁడు
అధివసించు. స. నివసించు, ఉండు
అధివాసము. స. ఉనికి, గృహమును ధూపాదులచేత సంస్కరించుట
అధివాసరము. స. అతివాసము
అధివిన్న. స. మొదటిపెండ్లాము
అధివేత్త. స. భార్యయుండఁగాఁ బెండ్లాడినవాఁడు
అధివేదనము. స. భార్యయుండఁగా మరలఁ బెండ్లియాడుట
అధిశ్రయణి. స. ప్రొయ్యి
అధిశ్రయము. స. నిప్పుపై నుడుకఁబెట్టుట
అధిష్ఠాత. స. అధిష్ఠించువాఁడు, ముఖ్యుఁడు
అధిష్ఠానదేవత. స. అధిదేవత
అధిష్ఠానము. స. ఆక్రమించుట, బండికన్ను, ప్రభావము, దగ్గఱనిలుచుట, నివసించుట, స్థానము, అధికారము, రాజ్యము
అధిష్ఠించు. స. ఆశ్రయించియుండు
అధిస్త్రీ. స. గొప్పయాఁడుది
అధీతము. స. అధ్యయనింప బడినది,చేదువఁబడినది
అధీతి. స. అధ్యయనము చేసినవాఁడు
అధీనము. స. ఆయత్తము, స్వాధీనము
అధీయానుఁడు. స. వేదముచేదువువిద్యార్థి
అధీవాసము. స. శరీరమునంతను కప్పు
అధీశుఁడు. స. రాజు,ప్రభువు [చేయుకొ్న్నా
అధీశ్వరుఁడు. స. సమస్తసామంతులచేత సేవింపఁబడురాజు
అధునాతనము. స. ప్రస్తుతకాలమునకు సంబంధించినది
అధూమకము. స. పొగలేనిది
అధృతి. స. ధైర్యములేమి
అధృష్ణుఁడు. స. అసమర్థుఁడు
అధృష్యము. స. సమీపింపశక్యముకానిది, జయింపశక్యముకానిది [యీవు
అధేనువు. స. ఇంకను యీని పాలియ్యని
అధైర్యము. స. ధైర్యములేమి
అధోంశుకము. స. కట్టువస్త్రము
అధోక్షజుఁడు. స. విష్ణువు
అధోగతి. స. తక్కువస్థితి, నాశనము [డు
అధోగతుఁడు. స. తక్కువస్థితినిపొందినవాఁ

అధోదృష్టి. స. క్రిందిచూపు.
అధోభువనము. స. పాతాళము
అధోముఖము. స. దిగుముఖముగలది
అధౌతము. స. కడుగఁబడనిది
అధ్యంసము. స. భుజముపైనున్నది
అధ్యక్షము. స. గోచరమగునది
అధ్యక్షించే. స. పరిపాలించే, ఏలు
అధ్యక్షుఁడు. స. అధికారి, ప్రత్యక్షమైన వాఁడు
అధ్యగ్నికృతము. స. వివాహవేళ అగ్ని హోత్రునిసన్నిధియందు చేదివింపఁబడు స్త్రీధనము
అధ్యధిక్షేపము. స. విశేషనింద
అధ్యయనము. స. గురుముఖమున వేదము చేదువుట
అధ్యయనించే. స. అధ్యయనముచేయు
అధ్యవసానము. స. నిశ్చయము, పూనిక
అధ్యవసాయము. స. ఉత్సాహము, పూనిక, శ్రద్ధ
అధ్యశనము. స. విశేషముగాతినుట
అధ్యష్టము. స. ధైర్యములేనిది
అధ్యస్తము. స. ఒకదానిపై నుంచేఁబడినది, తప్పుగాఁ దలఁపఁబడినది
అధ్యాఖ్యానము. స. కల్లజగడము, అభ్యాఖ్యానము
అధ్యాత్మదృక్కు. స. అంతరాత్మను తెలిసికొన్నవాఁడు
అధ్యాత్మము. స. జ్ఞానము, ఆత్మసంబంధమైనది
అధ్యాపకుఁడు. స. వేదమును చేదివించువాఁడు
అధ్యాపనము. స. వేదమును చేదివించుట
అధ్యాపించే. స. వేదమును చేదివించు
అధ్యాయనము. స. అధ్యయనము
అధ్యాయము. స. గ్రంథభాగవిశేషము, ప్రకరణము

అధ్యారోపము. స. పొరపాటున నొకదాని గుణమును మఱియొకదానియం దుండు నట్లు తలఁచుట
అధ్యావాపము. స. విత్తులుచేల్లుట
అధ్యాస. స. మిథ్యాజ్ఞానము, తప్పుతలఁపు
అధ్యాసనము. స. ఆక్రమించుట
అధ్యావాహనికము. స. పుట్టినింటనుండి అత్త వారింటికిఁ బోవునపు డీయఁబడు నట్టి స్త్రీధనము
అధ్యాహారము. స. లేనిపదములను కొన్నిటిని తెచ్చుకొనుట, ఊహ
అధ్యూఢ. స. మొదటిపెండ్లాము
అధ్యూఢుఁడు. స. శివుఁడు
అధ్యేత. స. చేదువువాఁడు
అధ్యేషణ. స. సత్కారపూర్వకముగా నొకనిని ఒకపనియందు నియోగించుట
అధ్వగ. స. ఆకాశగంగ
అధ్వగుఁడు. స. దారినడచువాఁడు, సూర్యుఁడు
అధ్వనీనుఁడు }
అధ్వన్యుఁడు } స. దారినడచేవాఁడు
అధ్వపుఁడు. స. మార్గములమీఁది అధికారి
అధ్వము. స. త్రోవ, కాలము
అధ్వరము. స. యాగము
అధ్వరుఁడు. స. ఒకవసువు
అధ్వర్యుఁడు. స. యజ్ఞమునందు యజుర్వేద తంత్రమును నడపువాఁడు
అధ్వాంతము. స. కనుచీఁకటి, ప్రయాణాంతము
అధ్వానము. స. అమార్గము, పాడు
అన. దే. ఆనకట్ట, అన్న, లేఁతకొమ్మ
అనంగకము. స. మనస్సు

అనంగము. స. ఆకాశము, హృదయము

అనంగుఁడు. స. మన్మథుఁడు, అంగము లేనివాఁడు

అనంత. స. భూమి, పార్వతి, ఉసిరికచెట్టు, తిప్పతీఁగ, గఱిక

అనంతము. స. ఆకాశము, మేరలేనిది, సంఖ్యా పరిమాణము

అనంతరము. స. పిమ్మట, వెనుకటిది

అనంతవిజయము. స.ధర్మరాజుయొక్క శంఖము,లెక్కకుమిాఱిన జయములుగలది

అనంతశయనుఁడు. స. విష్ణువు [వాఁడు

అనంతుఁడు. స. శేషుఁడు, విష్ణువు,తుదలేని

అనఁగు. దే. కలయు

అనఁటి. దే. అరఁటి

అనకట్ట. దే. ఆనకట్ట, అడ్డకట్ట

అనక్షరము. స. ఉచ్చరింపఁగూడనిది, తిట్టు

అనక్షి. స. బలహీనమైనకన్ను

అనగ్ని. స. నిప్పుకానిది, అగ్నినుంచేని, అగ్నికార్యములుచేయని

అనగ్నిదగ్ధము. స. నిప్పుచేఁ గాల్పఁబడనిది

అనఘము. స. నిర్మలము, రమ్యము

అనఘుఁడు. స. పాపరహితుఁడు, నిర్దోషి

అనడ్వాహము. స. ఎద్దు

అనతి. స. కొద్దిపాటిగానుండు

అనద. త. అనాథ, అల్పుఁడు, విధవ

అనదతనము. త. అనాథత్వము

అనద్యతనము. స. నేఁటిదికానిది

అనధీయానుఁడు. స. వేదముచేదువనివాఁడు

అనధ్యాయము. స. చేదువరానిదినము, ఆటవిడుపు

అననము. స. ఊపిరివిడుచేట

అననుభావుకము.స. గ్రహింపశక్యముకానిది

అనన్యగతికుఁడు. స. వేఱేగతిలేనివాఁడు

అనన్యజుఁడు. స. మన్మథుఁడు

అనన్యము. స. అనితరము

అనన్యవృత్తి. స. ఒకటమనస్సుచెల్లినవాఁడు

అనన్యాదృశము, అనన్యాదృశ్యము } స. మఱియొకటితో సమానముకానిది, అసమానము

అనన్వయము. స. అన్వయములేనిది

అనపత్యము. స. సంతానములేమి

అనపత్యుఁడు. స. బిడ్డలులేనివాఁడు

అనపరాధి. స. అపరాధికానివాఁడు

అనపాయము, అనపాయి } స. అపాయములేనిది

అనభిశస్తి. స. నిర్దోషమైనది

అనము. స. ఊపిరి [ఎల్లప్పుడు, మఱిమఱి

అనయము. దే. అత్యంతము, అవశ్యము,

అనయము. స. అశుభము, నీతికానిది,ఆపద

అనరు. దే. సంకటము

అనరులు. దే. జీవస్థానము, మర్మము

అనర్గళము. స. అడ్డంకిలేనిది

అనర్ఘము. స. వెలలేనిది

అనర్ఘ్యము. స. అర్ఘ్యముకానిది, వెలలేనిది

అనర్థకము. స. పరస్పరాన్వయము లేనిది

అనర్థము. స. కీడు, అర్థములేనిది

అనర్హము. స. అర్హముకానిది

అనలము. స. అగ్ని, ఉత్పాతము

అనలుఁడు. స. అగ్నిదేవుఁడు, ఒకవసువు

అనల్పము. స. విస్తారము

అనవగ్రహము. స. నివారింపశక్యముకానిది

అనవచ్ఛిన్నము. స. అతిశయము, విచ్ఛిన్నముకానిది

ఉపసర్గము. స. పదమునకు ముందువచ్చే ప్రవర మొదలగునవి, మారితెవులు, ఉత్పాతము, ఆపద, హాని, గ్రహణము, దుశ్శకునము, దయ్యముపట్టుట

ఉపసర్జనము. స. అప్రధానము

ఉపసర్పణము. స. ఉపసర్పించుట, ప్రాపు

ఉపసర్పించు. స. ఆశ్రయించు, ప్రాపుగొను

ఉపసర్యా. స. తొలిచూలావు

ఉపసూర్యకము. స. సూర్యపరివేషము

ఉపసృత్వము. స. లాభము, భూమిమీఁద వచ్చునాదాయము

ఉపస్కరణము. స. చేంపుట, మార్పు, నింద

ఉపస్కరము. స. సంబారము

ఉపస్కారము. స. అలంకారము, నగ

ఉపస్థ స. ఆఁడుగుఱి, యోని

ఉపస్థము. స. సమీపమందున్నది, ఒడి మధ్యభాగము, ఆఁడుగుఱి, ఆసనము, కటిప్రదేశము

ఉపస్థాత. స. సేవకుఁడు

ఉపస్థానము. స. చేరిక, సేవ

ఉపస్థితము. స. చేరినది

ఉపస్థితి. స. చేరిక, తోఁచుట

ఉపస్నేహము. స. తడుపుట

ఉపస్పర్శము. స. ఆచమనము, తాఁకుట, స్నానము

ఉపస్త్రీ. స. ఉంచుకొనఁబడినయాఁడుది

ఉపహతము. స. నాశనమునొందినది

ఉపహతి. స. ఉపద్రవము, నాశము

ఉపహారము. స. కానుక

ఉపహాసము. స. వెక్కిరింపు, ఎగతాళి

ఉపహితము. స. ఉంచఁబడినది

ఉపహ్వరము. స. సమీపము, ఏకాంతము

ఉపాంగము. స. నుతిపొసెడితిత్తి

ఉపాంతము. స. సమీపము, మూల, సమీపించినది

ఉపాంత్యము. స కడపటిదానికిముందున్నది

ఉపాంశు స. ఏకాంతము

ఉపాకరణము } స. యథావిధిగా వేదమును
ఉపాకర్మము } గ్రహించుట

ఉపాకరించు స. తెచ్చు, పిలుచు, ఇచ్చు, పొందు, ఆరంభించు

ఉపాకృతము. స. యజ్ఞమునందు చేంపఁబడిన పశువు

ఉపాఖ్యానము. స. ఇతిహాసము, ఒక కథాకథనమున సందర్భానుసారముగా నుడువఁబడుమఱొకకథ

ఉపాగతము. స. పొందఁబడినది, వచ్చినది

ఉపాత్తము. స పొందఁబడినది

ఉపాత్యయము స. అతిక్రమణము

ఉపాదానము. స. ప్రధానకారణము, భిక్షము, మఱలించుట

ఉపాదేయము. స. గ్రహింపఁదగినది

ఉపాధానము. స. ఉంచుట, ధరించుట, కప్పుట

ఉపాధి. స. ధర్మచింత, కుటుంబపోషకము, విశేషణము, అడ్డి, కపటము, కారణము

ఉపాధ్యాయ. స. ఉపాధ్యాయత్వము చేసెడి స్త్రీ

ఉపాధ్యాయాని. స. ఉపాధ్యాయునిభార్య

ఉపాధ్యాయి. స. ఉపాధ్యాయత్వము చేసెడిస్త్రీ, ఉపాధ్యాయునిభార్య

ఉపాధ్యాయుఁడు. స. వేదమును జదివించువాఁడు, చదువు చెప్పువాఁడు, పురోహితుఁడు

ఉపావహము. స. చెప్పులు
ఉపాయనము. స. కానుక
ఉపాయము. స. నేర్పు, వెరవు
ఉపారతము. స. సంతోషింపఁజేయఁబడినది, పనిగలిగియున్నది
ఉపారము. త. కానుక, ఉపహారము, తప్పు, పాపము
ఉపార్జనము. స. సంపాదనము
ఉపార్జించే. స. సంపాదించే
ఉపార్జితము. స. సంపాదింపఁబడినది
ఉపాలంభము. స. దూషణ, ఎత్తిపొడుపు
ఉపాలంభించే స. దూషించే
ఉపాలబ్ధము. స. దూషింపఁబడినది
ఉపావర్తనము. స. మరలుట, సమీపించుట
ఉపావృత్తము. స. పలుమారు నేలబొర్లాడినది
ఉపాశ్రయము. స. ప్రాపు, కటకటాలు
ఉపాశ్రితము. స. ఆశ్రయింపఁబడినది
ఉపాసంగము. స. అమ్ములపొది, సమీపము
ఉపాసకుఁడు. స. సేవకుఁడు, పూజించేవాఁడు
ఉపాసన, ఉపాసనము } స. సేవ, పూజ, మర్యాద, ధ్యానము, శరాభ్యాసము, పీఁట
ఉపాసము. త. ఉపవాసము
ఉపాసించే. స. సేవించే
ఉపాసిత. స. ఉపాసించేవాఁడు
ఉపాసితుఁడు. స. ఉపాసింపఁబడినవాఁడు
ఉపాసీనుఁడు. స. సమీపమందుఁ గూర్చున్నవాఁడు
ఉపాస్తి. స. సేవ, ఉపాసనము, పూజ
ఉపాస్యుఁడు. స. ఉపాసింపఁదగినవాఁడు
ఉపాహారము. స. ఫలాహారము
ఉపాహితము. స. ఆరోపితము, తోఁకచిచ్చు
ఉపాహృతము. స. పట్టుపడినది
ఉపేంద్రుఁడు. స. విష్ణువు
ఉపేక్ష. స. అశ్రద్ధ
ఉపేక్షకుఁడు. స. ఉపేక్షించువాఁడు
ఉపేక్షించు. స. అశ్రద్ధచేయు
ఉపేక్షితుఁడు. స. ఉపేక్షింపఁబడినవాఁడు
ఉపేత. స. ఉపాయములు వన్నువాఁడు, సమీపించేవాఁడు
ఉపేతము. స. కూడుకొన్నది
ఉపోదక, ఉపోదకి } స. దుంపబచ్చలి
ఉపోద్ఘాతము. స. పీఠిక, ఉదాహరణము
ఉపోషణము. స. ఉపవాసము, పస్తు
ఉపోషితుఁడు. స. పస్తున్నవాఁడు
ఉపోష్యము. స. పస్తుండఁదగినది
ఉప్తము. స. విత్తఁబడినపొలము
ఉప్తి. స. విత్తుట, ధాన్యముచల్లుట
ఉప్పత. దే. ఓర్వలేనితనముచేత ఆడిపోసికొనుట, రవ్వ, దృష్టితాఁకునట్లునులించుట
ఉప్పతి. త. ఉత్పత్తి, జన్మము
ఉప్పతించే. దే. ఓర్వలేనితనముచేత ఆడిపోసికొను, దృష్టితాఁకునట్లు నులించు
ఉప్పతిల్లు. త. పుట్టు, పొంగు, ఉత్పత్తియగు
ఉప్పందనము. దే. ఉప్పన
ఉప్పన. దే. ఒకరసము, ఉప్పదనము, ఊషరభూమి
ఉప్పనఁబట్టెలు. దే. బాలక్రీడావిశేషము
ఉప్పర. దే. త్రవ్వి జీవించెడు నొకజాతి

ఉప్పరము. త. ఆకాశము,ఊర్ధ్వప్రదేశము
ఉప్పరించు. దే. మల్లయుద్ధక్రియావిశేషము, ఉప్పళించే
ఉప్పరి. దే. ఉప్పరవాఁడు
ఉప్పరిగ. త. మేడ
ఉప్పలవాయి. దే. బొట్టనవ్రేళ్లనడుము
ఉప్పలి. దే. కీడు
ఉప్పవడము. దే. ఉపవడము
ఉప్పళము. దే. ఉప్పుపండెడినేల,ఉప్పుపట్టి
ఉప్పళించే. దే. ఉప్పరించే, మల్లయుద్ధక్రియావిశేషము, కొట్టు, తాడించే, ఉసుము
ఉప్పిఁడి. దే. ఉప్పులేనిది
ఉప్పిరింత. దే. జ్యోతిష్మతీలత
ఉప్పిళ్లు. దే. ఉప్పుడుబియ్యము
ఉప్పు. దే. లవణము, ఉప్పఁదనము, ఆవిరిపోక యుడుకఁబెట్టు
ఉప్పుఁగండ. దే. ఉప్పుచమిరియెండఁబెట్టినమాంసఖండము
ఉప్పుఁగడలి. దే. లవణసముద్రము
ఉప్పుఁగాయ. దే. ఊరుఁగాయ
ఉప్పుఁగుందము. దే. బాలక్రీడావిశేషము
ఉప్పుఁజేప. దే. ఉప్పుచమిరి ఎండఁబెట్టినచేఁప
ఉప్పుఁబట్టి. దే. తనంతట ఉప్పుపండెడినేల
ఉప్పుడు. దే. ఉడుకఁబెట్టఁబడినవి (వడ్లు)
ఉప్పుడుబియ్యము. దే. వడ్లు ఉడుకఁబెట్టి ఆరనిచ్చి దంచిచేసినబియ్యము
ఉప్పురియు. దే. ఉప్పుమట్టిగారాలిచెడిపోవు
ఉప్పువాము. దే. ఉప్పుపంటపెట్టెడుచోటు
ఉప్పెన. త.సముద్రముపొంగిప్రవహించేట
ఉప్పొంగు. దే. ఉబుకు, సంతోషించు, విజృంభించు [జొలి
ఉబలాటము. దే. మిక్కిలి అభిలాషము,
ఉబుకు. దే. పొంగు, వృద్ధి, పొంగుట
ఉబుసు. దే. పనిలేనికాలము, పనిలేనివృత్తాంతము
ఉబుసుపుచ్చు. దే. కాలమునుగడపు, ఆలస్యముచేయు
ఉబ్బ. త. ఉక్క
ఉబ్బకము. త. హెచ్చు, ఉత్సాహము
ఉబ్బతిల్లు. త. ఉబ్బు, పొంగు
ఉబ్బనీరు. త. ప్రసవజలము
ఉబ్బరపోవు. దే. ఏమియుతోఁచేక అట్టెనిలుచు, ఆవులు మున్నగునవి నల్లకప్పువేసి శుష్కించుటయు
ఉబ్బరము. త. కడుపుబ్బుట, అతిశయము
ఉబ్బరించే. త. కడుపుబ్బు, అతిశయించే
ఉబ్బరింపు. త. ఉబ్బరము
ఉబ్బలి. దే. బురద
ఉబ్బసము. త. ఊర్ధ్వశ్వాసరోగము
ఉబ్బించే. దే. స్తోత్రముచేసి సంతోషింపఁజేయు
ఉబ్బు. త. ఉబ్బరించే, పొంగు, లేచే, సంతోషించే, లావగు, సంతోషము, ఉబ్బరము
ఉబ్బుసంకటము. దే. వాఁపురోగము
ఉబ్బెత్తు. దే. పైకుబికియుండు
ఉభయము. స. రెండవయవములుగలది, గుడియుత్సవము నడపువంతు
ఉమ. స. పార్వతీదేవి, కాంతి
ఉమక. దే. ఊఁక, పొట్టు, రూ. ఉముక
ఉమము. స. పట్టణము
ఉమాదము. త. వెఱ్ఱి
ఉమాపతి. స. శివుఁడు

ఉమి. త. ఉమ్మి

ఉమియు. త. ఉమ్మివేయు

ఉముక. దే. పొట్టు, ఊఁక

ఉమ్మ. త. ఉబ్బ, వేఁడి

ఉమ్మగిల్లు. దే. ఆవిరిచేతనుడుకు, ఉక్కగా నుండు

ఉమ్మడి. దే. ఇద్దరుకలిసి చేయు వ్యవహారము మొదలగునవి, పొత్తు, ఏక కాలమున, ఒక్కమాఱుగ

ఉమ్మదము. దే. ఉక్క, ఉమ్మ

ఉమ్మదించు. దే. ఉక్కపోయు

ఉమ్మనీరు. త. ప్రసవజలము

ఉమ్మలము. దే. దుఃఖము, శోకము

ఉమ్మలి. దే. బురద

ఉమ్మలించు. దే. దుఃఖించు, శోకించు

ఉమ్మలిక } దే. దుఃఖము
ఉమ్మలికము }

ఉమ్మలికాఁడు. దే. అధికారి

ఉమ్మలికించు. దే. దుఃఖించు, శోకించు

ఉమ్మాదము. దే. చిత్తవిభ్రమము

ఉమ్మాయముత్తెము. దే. తయారుచేయఁబడిన కవిధమగు ముత్యము

ఉమ్మి. త. ఉమిసెడు ఎంగిలినీరు, ఊర్మ

ఉమ్మెత } త. ఉమ్మెత్తచెట్టు
ఉమ్మెత్త }

ఉయాల }
ఉయేల } దే. బిడ్డలను పరుండఁబెట్టి ఊఁచెడుడోలి, ఊయేల
ఉయ్యల }
ఉయ్యాల }

ఉయ్యాలతొట్టి. దే. తొట్ల

ఉయ్యాలపులుఁగు. దే. సారసపక్షి

ఉయ్యాలమంచము. దే. డోలామంచము

ఉయ్యెల } దే. ఉయ్యాల, ఊయేల
ఉయ్యేల }

ఉరక. దే. ఊరక

ఉరగము. స. సర్పము

ఉరడించు } దే. విజృంభించు, వేగిరపడు
ఉరణించు }

ఉరణము } స. పొట్టేలు
ఉరభ్రము }

ఉరణాక్షము } స. తగిరిసచెట్టు
ఉరణాఖ్యము }

ఉరమరిక. దే. రమారమి

ఉరము. స. ఱొమ్ము, శ్లేష్మము

ఉరరీకృతము. స. అంగీకరింపఁబడినది

ఉరరీకృతి. స. అంగీకారము

ఉరలఁబడు. దే. దొర్లు

ఉరలఁబాఱు. దే. కదలు, చలించు

ఉరలు. దే. దొర్లు, కాఱు, రాలు, విడిపోవు

ఉరలుకొను. దే. పీడు

ఉరవడి. దే. అతివేగము

ఉరవడించు } దే. వేగిరపడు
ఉరవణించు }

ఉరవు. త. తగినది, అధికము, ఉచితము

ఉరశ్ఛదము. స. కవచము

ఉరసిలుఁడు } స. విశాలమైన ఱొమ్ముగలవాఁడు
ఉరసుఁడు }

ఉరస్త్రాణము. స. కవచము

ఉరస్యుఁడు. స. ధర్మపత్నియందు తనకుఁ బుట్టిన కొడుకు

ఉరస్వంతుఁడు. స. ఉరసిలుఁడు

ఉరస్సూత్రిక. స. ఱొమ్మునవ్రేలెడు ముత్యాలహారము

ఉరళించు. దే. ప్రకాశించు

ఉరి. దే. ఉచ్చు, పక్షిబంధనము, మరణసాధవరజ్జువు

ఉరిగోల. దే. పక్షులు మొదలయినవానిని బట్టుటకై చివర నురిఁబెట్టి కట్టినకోల

ఉరిదీయు. దే. త్రాడుమెడకువేసిలాగిచంపు

ఉరిడె. దే. కమ్మరపురుగు

ఉరియాట. దే. ఉరియాడుట, ఊఁగులాట, సందేహము

ఉరియాడు. దే. ఊఁగులాడు, కదలు, వణఁకు

ఉరియు. దే. విడిపోవు, చలించు, వెండ్రుకలు నెరయు, దుఃఖించు

ఉరివోయు. దే. ఉరిదీయు

ఉరీకృతము. స. అంగీకరింపఁబడినది

ఉరుజె. దే. మత్స్యవిశేషము

ఉరుటము. స. తీక్ష్ణము

ఉరుతత<br>ఉరుత్వము } స. విరివి, గొప్పతనము

ఉరుబూకము. స. ఆముదపుఁజెట్టు

ఉరుమ. దే. చర్మవాద్యభేదము

ఉరుమంజి. దే. హురుమంజి, దేశవిశేషము

ఉరువడించు. దే. విజృంభించు, గెలుచు

ఉరువడు. దే. నెఱవేరు

ఉరువిడి. దే. వస్తుసమూహము

ఉరువు. దే. పరిత్యజించు, తోలుఒలుచు

ఉరువు. త. రూపము

ఉరువు. స. విరివియైనది, శ్రేష్ఠమైనది

ఉరోజము. స. కుచము

ఉర్ణ. స. బొచ్చు, ఉన్ని

ఉర్ణనాభము. స. సాలెపురుగు

ర్లఁబడు. దే. ఉరలఁబడు

ఉర్లు. దే. ఉరలు

ఉర్వర. స. ఎల్లపైరులచే నిండినభూమి

ఉర్వారువు. స. దోసచెట్టు

ఉర్వి. స. భూమి

ఉర్వీశుఁడు. స. ప్రభువు, రాజు

ఉఱఁడు. దే. లక్ష్యపెట్టఁడు

ఉఱవు. త. సౌందర్యము, గొప్ప, ఔచిత్యము

ఉఱిది. దే. దార్ఢ్యము, స్థిరము, దృఢము

ఉఱియ. దే. దిట్టతనము గలవాఁడు, ధీరుఁడు

ఉఱియు. దే. ఇంటికప్పుచెడి నీళ్లుపడు

ఉఱు. త. శ్రేష్ఠమగు, తగు

ఉఱు. దే. లక్ష్యపెట్టు

ఉఱుఁద్రాళ్లు. దే. పాలు పితుకునప్పుడు ఆవుకాళ్లుగట్టుత్రాళ్లు, ఉఱ్ఱుఁద్రాళ్లు

ఉఱుకు. దే. దాఁటు, దుముకు

ఉఱుకుడుబొద్దు. దే. పైఁ బెరిఁగినబొద్దు

ఉఱుగొట్టు. దే. కోఁతిఉఱ్ఱుమను

ఉఱుత. దే. ఉడుత

ఉఱుపు. దే. ఉఱియుంట

ఉఱుము. దే. గర్జించు, గర్జనము, వీరహుంకారము, ఉడుము

ఉఱువు. దే. ఉఱుగొట్టుట

ఉఱ్ఱటలూఁగు<br>ఉఱ్ఱట్లూఁగు } దే. మిక్కిలి యూఁగు, చలించు

ఉఱ్ఱాడు. దే. వ్రేలాడు

ఉఱ్ఱుకట్టు. దే. పాలుపిండునప్పుడు ఆవుకాళ్లకుకట్టు

ఉఱ్ఱూఁతలూఁగు. దే. మిక్కిలియూఁగు, చలించు

ఉలంగవము. స. పెద్దనల్లచీమ, కంద్రచీమ

ఉలక. దే. చేలుక, నిర్లక్ష్యము
ఉలకన. దే. చేలుకన, లాఘవము
ఉలపము. స. దట్టముగానల్లుకొనెడి తీఁగ
ఉలవ. దే. సస్యవిశేషము
ఉలవరము } దే. ఉలవరించుట
ఉలగరము
ఉలవరించే. దే. తడిచేత నేల ఉబుకు, ఉబికి సారవంతముగానుంచు
ఉలస. దే. తృణవిశేషము
ఉలి. దే. వడ్లంగి కఱ్ఱతొలుచుసాధనము, అల్పము
ఉలికిపడు. దే. త్రుళ్లిపడు, ఉలుకు
ఉలికిపాటు. దే. ఉలికిపడుట
ఉలిపి
ఉలిపికట్టె } దే. దుర్మార్గుఁడు, తులువ
ఉలిపిగొట్టు
ఉలిపితెవులు. దే. గజ్జి
ఉలియు. దే. చలించు, ధ్వనించు
ఉలివాడు. దే. చలించు
ఉలివు. దే. ధ్వని, స్రోఁత
ఉలివులాఁగ. దే. చెవి
ఉలుకు. దే. భయపడు, భయము
ఉలుచే. త. మిక్కిలి చాపల్యముగల మత్స్యము
ఉలుచే. దే. ఊడఁదీయు, ఆడించు
ఉలుప. త. కానుక
ఉలుప. దే. పలుచగా నూఱిన పుల్లఊరుఁ[బిండి
ఉలుపఁడు } దే. శోఫరోగముగలవాఁడు
ఉలుపి
ఉలుపు. దే. కుష్ఠరోగము, ఉలుచు
ఉలుము. దే. కుష్ఠరోగము
ఉలూకము. స. గుడ్లగూబ
ఉలూకుఁడు. స. ఇంద్రుఁడు

ఉలూఖలకము. స. గుగ్గిలపుఁజెట్టు
ఉలూఖలము. స. ఱోలు
ఉల్క. స. బొగ్గునిప్పు, తోఁకచుక్క, కొఱవి
ఉల్బణము. స. పొంగు, అతిశయము
ఉల్బము. స. గర్భపిండము, మావి
ఉల్ముకము. స. కొఱవి
ఉల్లంకి. దే. పక్షివిశేషము
ఉల్లంగి. దే. ఒకానొకచెట్టు
ఉల్లంఘనము. స. అతిక్రమణము
ఉల్లంఘించే. స. అతిక్రమించే
ఉల్లంఘితము. స. అతిక్రమింపఁబడినది
ఉల్లంఘ్యము. స. అతిక్రమింపఁదగినది
ఉల్లకి } దే. దారములతో నల్లబడిన యొకవిధమగు నుయ్యాల
ఉల్లట
ఉల్లకుట్టు. దే. మనస్సు నొచ్చునట్టి పరిహాసము
ఉల్లడ. త. చాందిని, మేలుకట్టు, ఉల్లాభము
ఉల్లడి. దే. కలవరము, బాధ
ఉల్లము. దే. హృదయము
ఉల్లఱము. దే. మనస్సునకు సహింపఁగూడనిది
ఉల్లలము. స. చలనము
ఉల్లలితము. స. కదలినది
ఉల్లసమాడు. దే. పరిహసించే, దూషించే
ఉల్లసము. దే. మనస్సునొచ్చునట్లు ఆడు వచనము
ఉల్లసము. స. సంతోషము, ప్రకాశము
ఉల్లసితము. స. ప్రకాశితము
ఉల్లసిల్లు. స. సంతోషించు, ప్రకాశించు
ఉల్లాకు. దే. చీటి
ఉల్లాఘుఁడు. స. రోగము తీఱినవాఁడు

ఉల్లాపము. స. శోకభీత్యాదులచేతఁ గలిగిన వికృతధ్వనితోఁ జెప్పఁబడినమాట
ఉల్లాభము. స. చాందిని, మేలుకట్టు
ఉల్లాము. దే. పక్షివిశేషము
ఉల్లారు. దే. గుఱ్ఱపుపల్లముమీఁదిగుడ్డ
ఉల్లాసము. స. సంతోషము
ఉల్లాసి. స. ఉల్లాసవంతుఁడు
ఉల్లి. దే. నీరుల్లి, వెల్లుల్లి
ఉల్లిఖితము. స. పైనవ్రాయఁబడినది, గీఁకి వేయఁబడినది
ఉల్లిపాషాణము. దే. సౌవీరము
ఉల్లుంఠనము. స. ఉపాలంభము
ఉల్లూనము. స. ఒకదినుసుదర్భ
ఉల్లెడ. త. మేలుకట్టు
ఉల్లేఖము. స. ఉచ్చారణము, అర్థాలంకారములలో నొకటి
ఉల్లోచము. స. మేలుకట్టు
ఉల్లోలము. స. పెద్దతరంగము
ఉవిద. త. ఆఁడుది
ఉవ్వ. దే. వృక్షవిశేషము
ఉవ్వన. దే. తటాలున
ఉవ్వపిట్ట. దే. పక్షివిశేషము, గోలత్తిక
ఉవ్వలపోటి. దే. బాలక్రీడావిశేషము
ఉవ్వాయి. దే. వికాసము
ఉవ్విళులూరు } దే. త్వరపడు, మిక్కిలి
ఉవ్విళ్ళూరు } మనసుపడు
ఉవ్విళ్ళుఁగొను. దే. త్వరపడు, సంభ్రమించు
ఉవ్వు. దే. పూనిక
ఉవ్వెత్తు. త. నిశ్శేషముగా, అడుగుతో
ఉశతి } స. అశుభమైన వాక్కు
ఉషతి }

ఉశనుఁడు. స. శుక్రుఁడు
ఉశీరము. స. వట్టివేరు
ఉష. స. బాణాసురునికూఁతురు, రాత్రి
ఉషణ. స. పిప్పలి
ఉషణము. స. మిరియము, సొంటి
ఉషర్బుధుఁడు. స. అగ్నిహోత్రుఁడు
ఉషస్సు. స. తెల్లవాఱుటకుముందు అయిదు గడియలకాలము
ఉషాపతి. స. అనిరుద్ధుఁడు
ఉషితము. స. చలిది, చద్ది
ఉష్ట్రము. స. ఒంటె
ఉష్ట్రిక. స. ఆఁడుఒంటె
ఉష్ణకము. స. వేసవికాలము
ఉష్ణకుఁడు. స. చొరవగలవాఁడు, వ్యాధిగ్రస్తుఁడు
ఉష్ణము. స. ఎండ, వేఁడిమి, వేసవికాలము, వేఁడిదైనది, నేర్పుగలది, కారము, జ్వరము
ఉష్ణరశ్మి. స. సూర్యుఁడు
ఉష్ణవారణము. స. గొడుగు
ఉష్ణిక. స. కాచిన గంజి
ఉష్ణించు. స. వేఁడియగు
ఉష్ణీషము. స. తలపాగ, కిరీటము
ఉష్ణోపగమము. స. వేసంగికాలము
ఉష్మము. స. ఎండకాలము, ఎండ, వెట్ట
ఉసి. దే. కుక్కమీఁదికి వచ్చుట, పొడి
ఉసికొల్పు. దే. కుక్కమీఁగికి వచ్చునట్లు చేయు, రోషమువచ్చునట్లు చేయు, పురికొల్పు
ఉసిరిక. దే. ఆమలకివృక్షము
ఉసుక. దే. ఇసుక

ఉసుము. దే. ఉతుకు, పులుము, తుడుచు
ఉసురసురు. దే. ఆయాసమునందు అగు ధ్వన్యనుకరణము
ఉసురు. దే. ఉస్సురుయొక్క రూపాంతరము, దుఃఖము, ఊపిరి
ఉసురుపోసికొను. దే. బాధించు
ఉసుఱు. దే. ప్రాణము
ఉసులు. దే. సౌఖ్యము, సుఖము, వీలు
ఉసుళ్ళు. దే. ఱెక్కపురుగులు, ఇసుళ్ళు
ఉస్ర. స. ఆవు
ఉస్రము. స. ఎద్దు, కిరణము
ఉస్సు. దే. ఉస్సురు, అయ్యో
ఉస్సురను. దే. నిట్టూర్పువిడుచు, మిక్కిలి విసుగు
ఉస్సురస్సురు } దే. ఆయాసము నందగు ధ్వన్యనుకరణము
ఉస్సురు
ఉహుహూ. దే. శీతబాధయందగు ధ్వన్యనుకరణము
ఉహ్హు. దే. అగ్నినూఁదుటయందగు ధ్వన్యనుకరణము

## ఊ.

ఊ. ఒకయక్షరము
ఊఁ. దే. ప్రశ్నార్థకము, కథలు మొదలయినవి వినునప్పుడు ఉపయోగింపఁబడునది
ఊఁక. దే. ఊఁగులాట, పొట్టు
ఊఁకర. దే. ఊఁగొట్టుట
ఊఁకరగొట్టు. దే. శిశువులు అస్పష్టముగా పలుకు
ఊఁకించు } దే. పూను, ఉంకించు
ఊఁకు
ఊ పవగు. దే. పూను
ఊఁకొట్టు } దే. ఊఁ ఊఁ అని విను
ఊఁకొను
ఊఁగాడు. దే. ఊఁగులాడు
ఊఁగు } దే. ఊఁగాడు
ఊఁగులాడు
ఊఁగులాట. దే. ఊఁగులాడుట
ఊఁచె. దే. లేఁతజొన్నకఱ్ఱ, అరఁటిబొంద, ముండ్లదుబ్బు, సన్నమైన, వాడిన
ఊఁచెపడు
ఊఁచెపట్టు } దే. సన్నమగు, కృశించు
ఊఁచెపోవు
ఊఁచెబియ్యము. దే. చక్కఁగా ముదరని జొన్నలు మొదలయినవి
ఊఁచెముట్టు. దే. బొత్తిగా, నిశ్శేషము
ఊఁచు } దే. ఊఁగఁజేయు, ఆడించు
ఊఁగించు
ఊఁటు. దే. పొడుచు
ఊఁత. దే. ఆసరా, అవలంబము, చేఁపలు పట్టుసాధనము
ఊఁతకొను. దే. అవలంబించు, ఊఁదు
ఊఁతకోల. దే. ఊనుకొనెడు కఱ్ఱ
ఊఁతము. దే. పట్టు, అవలంబము
ఊఁతముచేయు. దే. బలపఱచు, నిర్ధారణచేసిచెప్పు
ఊఁదకడుపు. దే. పెరిఁగినకడుపు
ఊఁదబొడ్డు. దే. ఉబుకుడుబొడ్డు
ఊఁదర. దే. కాయలుపండుటకును ఎలుకలు దోమలు మొదలగునవి చచ్చుటకును అవకాశములేకుండావేసెడుపొగ
ఊఁదరపెట్టు. దే. పొగవేసి జంతువులను తపింపఁజేయు
ఊఁదు. దే. శంఖములోనగువానినూఁదు, నిప్పు మొదలగువాని నూఁదు, పట్టు, పొందు, అదుము, ఊను, ఉంచు, వాఁచు, చేఁపలను పట్టెడియూఁత, వాఁపు, అవలంబించు

ఊఁదుఁగ్రోవి. దే. నిప్పుడూఁదెడిగొట్టము
ఊఁదువత్తి. దే. సాంబ్రాణివత్తి
ఊఁదువెండి. దే. శుద్ధమయినవెండి
ఊఁపు. దే. ఊఁగఁజేయు, ఊఁచుట
ఊఁపురము. దే. పూఁపురము
ఊకనబొడ్డు. దే. జ్వరమునకు పనికివచ్చు ఒకానొక మందాకుచెట్టు
ఊచు. దే. రోగముచేతతలవెండ్రుకలురాలు
ఊట. దే. ఊరెడునీరు, ఊరుఁగాయరసము, మూలగ, చేవ
ఊటకల్లు. దే. ఆళ్లివంటి ఒకదినుసుధాన్యము
ఊటమెకము. దే. పంది
ఊటయెత్తు. దే. చెమ్మగలుగు
ఊటాడు. దే. చలించు, ఊఁగు, సంభ్రమించు
ఊటి. దే. ఒకానొకచెట్టు
ఊటించు. దే. వంచించు
ఊటు. దే. వానచినుకులచేఁ గలిగినచెమ్మ
ఊడ. దే. చెట్టుకొమ్మనుండి క్రిందికిదిగెడు వేరు
ఊడనిఁబాడు. దే. పాఱు, తొలఁగు
ఊడి. దే. ఒకదినుసుకూరాకు
ఊడిగము. దే. పరిచర్య, సేవ
ఊడిగీఁడు. దే. పరిచారకుఁడు
ఊడిత. దే. సాలెవాఁడు పడుగుచేయు నపుడు అదివ్రాలకుండఁ గ్రిందనూఁతగా నిలువున నిలిపెడు కొయ్య
ఊడియము. దే. ఊడిగము
ఊడు. దే. వీడిపోవు, వదలు, రాలు, జాఱు, కాఱు, తెగు, పాఱు
ఊడుకొను. దే. నాటు, గ్రుచ్చుకొను
ఊడుగు. దే. అంకోలవృక్షము
ఊడుచు / ఊడ్చు } దే. చిమ్ము, నాఱునాటు
ఊడుపు. దే. ఊడ్చుట, నాఱునాటుట
ఊడెము. దే. ఊడియము, చిన్నకోట
ఊఢ. స. పెండ్లాము, పెండ్లాడినది
ఊతము. స. (గుడ్డమొదలైనది) కుట్టఁబడినది
ఊతి. స. కుట్టు, రక్షణము, కుట్టుకూలి, నేయుట, అనుభవించుట, ఆట, దయ, సాహాయ్యము, కోరిక
ఊదర. త. ఒకదినుసుగడ్డి
ఊదరలు. త. ధాన్యవిశేషము
ఊదా. దే. ఒకరంగు
ఊధము. స. పాలపొదుఁగు
ఊధస్యము. స. క్షీరము, పాలు
ఊనము. స. తక్కువైనది, లోపము
ఊనిక. దే. ఆనిక, దిటవు
ఊను. దే. వహించు, ఊఁతచేసికొను, పొందు, తోలుసు మెత్తపఱచు
ఊప. దే. అడవిలోని చిన్న చెట్లగుంపు
ఊపిరి. దే. శ్వాసము
ఊపెరికుట్టు. దే. ఊపిరి పుచ్చనీక నొప్పించెడివ్యాధి
ఊబ. దే. పేడి, నపుంసకుఁడు
ఊబి. దే. బురద
ఊయల / ఊయాల / ఊయెల / ఊయేల } దే. ఉయ్యాల, డోల
ఊయు. దే. ఈలవేయు [కంద
ఊరఁగంద. దే. ఊరియందు పైరుచేసెడు
ఊరఁబంది. దే. ఊరియందు తిరుగుపంది
ఊరఁబిచ్చిక దే. ఊరియందుతిరుగుపిచ్చిక

ఊరఁబోవు. దే. తగ్గు
ఊరక. దే. కారణములేక, ఏమియులేక
ఊరకవి. దే. పల్లెటూరికవి
ఊరజోగి. దే. బిచ్చపుజోగి
ఊరనుయ్యి. దే. అందఱకు సామాన్యమగు ఊరిలోనిబావి
ఊరవిందు. దే. గ్రామస్థులందఱకుఁ జేయఁబడువిందు
ఊరవ్యుఁడు. స. కోమటి
ఊరాఱుచు / ఊరార్చు } స. ఊఱడించు
ఊరీకరించు. స. అంగీకరించు
ఊరీకృతము. స. అంగీకరింపఁబడినది
ఊరు. దే. జలాదికములోపలనుండి వెలికి వచ్చు, నాను, తడిగలదియగు, పుట్టు, గ్రామము, దేశము, దేశాంతరము
ఊరుఁగాయ. దే. ఉప్పులో ఊరవేయఁబడిన మామిడికాయ మొదలైనవి
ఊరుఁబిండి. దే. వ్యంజనవిశేషము, పచ్చడి
ఊరుకొను. దే. ఆఘ్రాణించు,ఊరకయుండు
ఊరుచు / ఊడ్చు } దే. సానమీఁదనున్న గంధము మొదలగువానిని చేతిలోకిఁ దీసికొను
ఊరుచు / ఊర్చు } త. ఊపిరివిడుచు, నిట్టూర్పు నిగుడించు
ఊరుజుఁడు. స. కోమటి
ఊరుపర్వము. స. మోఁకాలు
ఊరుపు / ఊర్పు } త. శ్వాసము
ఊర్పు. దే. వ్యంజనవిశేషము
ఊరువు. స. తొడ
ఊరేగించు. దే. గ్రామములోఁ ద్రిప్పి యుత్సవముఁ జేయు

ఊరేగు. దే. మెరవడిపోవు
ఊర్జము. స. శరీరబలము, ఉత్సాహము, కార్తికమాసము
ఊర్జస్వలుఁడు / ఊర్జస్వి } స. మిక్కిలి బలముగల వాఁడు, మిక్కిలియుత్సాహముగలవాఁడు
ఊర్జితపఱచు. దే. దృఢపఱచు
ఊర్జితము. స. దృఢము, గట్టి
ఊర్ణ. స. గొఱ్ఱెబొచ్చు, నూలు
ఊర్ణనాభము / ఊర్ణనాభి } స. సాలెపురుగు
ఊర్ణాయువు. స. పొట్టేలు, సాలెపురుగు, కంబళి
ఊర్ధ్వకము. స. ఒకవిధమగు మద్దెల
ఊర్ధ్వజ్ఞువు. స. కొంగకాళ్లవాఁడు, లేచినవాఁడు
ఊర్ధ్వము. స. మీఁదిది, మీఁదికెత్తఁబడినది, పొడవైనది
ఊర్ధ్వరేతసుఁడు.స.ఋషి,జితేంద్రియుఁడు
ఊర్ధ్వలోకము. స. పైలోకము, స్వర్గము
ఊర్ధ్వలోచనము. స. శరభమృగము
ఊరొప్పిక. దే. ఉబుసుపోక
ఊరొప్పు. దే. ఊపిరి వెడలు
ఊర్మి. స. తరంగము, ఉమ్మి, వస్త్రపుముడుత, ప్రవాహము, నొప్పి, కాంతి, వేగము, వరుస, మనుష్యునకుఁ గల దేహజములగు లోపము
ఊర్మిక. స. ఉంగరము, అల, వస్త్రపుముడుత, ఏవస్తువైన పోయినపుడు కలుగుచింత
ఊర్మిమాలి. స. సముద్రము
ఊర్మిళ. స. మగనిఎడఁబాసినస్త్రీ, జనకమహారాజుకూఁతురు

ఊటట. దే. ఊటాడించేట, తెలివి, సాహాయ్యము
ఊటాడిల్లు } దే. ఉపశమిల్లు
ఊటాడు
ఊటు. దే. సరిపోలు
ఊల. దే. జంబుకధ్వని, అడుగు పెదవిని చేతపట్టుకొని ఊదిఁ జేయుధ్వని
ఊలమాల. దే. తహతహ, బాధ
ఊలమాలగుడుచే. దే. తహతహపడు
ఊలు. దే. కూలు, పడు
ఊవాఁడు. దే. ఊఁగాడు
ఊవు. దే. ఊఁగు
ఊషణ. స. పిప్పలిచెట్టు
ఊషణము. స. మిరియాలు
ఊషము. త. చవుడు, వేకువ
ఊషరము. స. చవుటినేల
ఊష్మకము. స. వేసవికాలము
ఊష్మము. స. ఎండ, వెట్ట, వేసంగి
ఊష్మములు. స. వ్యాకరణమందు శ ష స హ లకు పేరు
ఊష్మలత్వము. స. వేడిమి
ఊష్మలము. స. చేుక్కగలది
ఊష్మాగమము. స. గ్రీష్మము, వేసంగి
ఊసరబిల్లి. దే. బక్కపిల్లి
ఊసరము. త. చేవుటినేల
ఊసరము. దే. కృశించినది
ఊసరవెల్లి. దే. ముదిసినతొండ
ఊసరిల్లు. దే. చిక్కు, కృశించే
ఊసివాసము. త. ఈర్ష్య
ఊసు. దే. ఊబుసు, మాట
ఊసులాడు. దే. ముచ్చటలాడు
ఊహ. స. లేనిమాటలను కొన్ని తెచ్చుకొనుట
ఊహనము. స. ఊహించేట
ఊహని. స. చీఁపురుకట్ట
ఊహాపోహాలు. స. తలంపులు
ఊహము. స. బుద్ధి, తలంపు
ఊహించే. స. తలఁచు, ఆలోచించే, యుక్తి
ఊహిని. స. గుంపు
ఊహ్యము. స. ఊహింపఁదగినది
ఊళ. దే. నక్కకూఁత

# ఋ

ఋ. ఒకయక్షరము
ఋక్కు. స. ఋగ్వేదము, వేదభాగవిశేషము
ఋక్ణము. స. గాయమునొందినది
ఋక్థము. స. ధనము
ఋక్షగంధ. స. బోద్దికూర
ఋక్షగంధిక. స. నల్ల నేలగుమ్ముడుచెట్టు
ఋక్షము. స. నక్షత్రము, ఎలుఁగుగొడ్డు, గ్రువ్వఁబడినది
ఋజీషము. స. బూరెలమూఁకుడు, బాణలి
ఋజువు. స. చక్కనైనది, తిన్ననిది
ఋజూకరించే. స. చక్కఁబెట్టు, దిద్దు
ఋజ్వి. స. ఖచితమైనఆఁడుది, గ్రహములసరళసంచారము
ఋణము. స. అప్పు
ఋణవంతుఁడు. స. ఋణముగలవాఁడు
ఋణార్ణము. స. అప్పుతీర్చుటకై తీసినఅప్పు
ఋణి } స. అప్పులుచేసినవాఁడు
ఋణికుఁడు
ఋతంభరుఁడు. స. సత్యముతప్పనివాఁడు, దేవుఁడు
ఋతము. స. నీళ్లు, శిలోంఛవృత్తి, సత్యమైనది, పూజింపఁబడినది, సత్యవాక్కు

ఋతి. స. త్రోవ; శుభము, రోఁత
ఋతీయ. స. రోఁత
ఋతుకాలము. స. స్త్రీ బహిష్ఠయైనకాలము
ఋతుమతి. స. రజస్వలయైనస్త్రీ, ముట్టుది
ఋతువు. స. వసంతములోనగు ఋతువు, ఆర్తవము
ఋతుశాంతి. స. నిషేకము
ఋతుస్నాత. స. ముట్టునీళ్లుపోసికొన్నస్త్రీ
ఋత్విజుఁడు. స. యజ్ఞకర్తచేత ధనము పుచ్చుకొని యజ్ఞముచేయించువాఁడు, ఒజ్జ
ఋద్ధము. స. పెరిఁగినది, సుఱిచినది
ఋద్ధి. స. సమృద్ధి, భాగ్యము
ఋభుక్షుఁడు. స. ఇంద్రుఁడు
ఋభువు. స. వేల్పు
ఋశ్యకేతువు. స. మన్మథుఁడు
ఋశ్యము } స. మనుఁబోతు, తెల్లపాద
ఋష్యము } ములుగల జింక
ఋషభము. స. ఎద్దు, ఒకస్వరము, శ్రేష్ఠ వాచకము, తిరుమల
ఋషభి. స. మాచేకమ్మ, ముండ
ఋషి. స. ముని, వేదము, వెలుఁగు
ఋష్టి. స. ఈఁటె, ఖడ్గము
ఋష్యప్రోక్త. స. దూలగొండిమొక్క, పిల్లపీఁచరమొక్క, ఒకదినుసు చిట్టాముదపుచెట్టు

## ఎ

ఎ. ఒకయక్షరము. దే. ప్రశ్నమును, వ్యతిరేకమును, ఆఁడుదగుటను దెలుపునది. త. చూపుటను, తనంతట తను మెచ్చుకొనుటను, నిశ్చయమును తెలుపును

ఎంగిలి. దే. ఉచ్ఛిష్టము
ఎంగిలికాయ. దే. పనికిమాలినవాఁడు
ఎంగెస. దే. ఒకానొక అడవిచెట్టు
ఎంచు. దే. లెక్కించు, తలంచు, ఆక్షేపించు
ఎండ. దే. సూర్యప్రకాశము
ఎండఁగట్టు. దే. అఱఁగట్టు
ఎండఁగొట్టు. దే. ఎండఁజేయు
ఎండఁబెట్టు. దే. ఎండవేయు
ఎండఁబొద్దు. దే. మధ్యాహ్నము
ఎండదెబ్బ. దే. ఎండతగులుటచేఁ గలిగిన జబ్బు
ఎండదొర. దే. సూర్యుఁడు
ఎండమావులు. దే. మధ్యాహ్నమందు బయళ్లయందునీటివలెఁగనుపడెడు సూర్యకిరణములు, మృగతృష్ణ
ఎండు. దే. తడియాఱు, నీరింకిపోవు, శుష్కించు
ఎండుగులు. దే. ఎండఁబోసినధాన్యము
ఎండతెవులు. దే. దేహముశుష్కించెడు వ్యాధి
ఎండుపుదట్ట. దే. జేనిసేనియెండఁబెట్టుటకు వెదురుబద్దలు లోనగువానిచేత నల్లిన తట్ట, ప్రసేవకము, దాఁగర
ఎండ్రకాయ }
ఎండ్రి } త. పీత, కర్కటకము
ఎండ్రిక }
ఎండ్రిమేతరి. దే. నక్క
ఎండ్రిరాశి. దే. కర్కటరాశి
ఎంత. దే. ఏకొలఁది
ఎంతయుఁ } దే. మిక్కిలి
ఎంతేని }
ఎందనుక. దే. ఎందాఁక
ఎందఱు. దే. ఎంతమందిస్త్రీలు, పురుషులు
ఎందాఁక. దే. ఎంతపర్యంతము

ఎందు. దే. ఎచ్చోట

ఎందులకు. దే. ఎచ్చోటికి, దేనికి

ఎంబన్న. దే. చేతకానివాఁడు

ఎంబెటికము. దే. అసహ్యము, ఎబ్బెటికము

ఎఁడు. దే. పరిమాణార్థకము

ఎకదొట్టు. దే. అతిశయించు

ఎకరా. దే. ఏనుఁగనుపట్టు మొగసాల

ఎకసకియము, ఎకసకెము, ఎకసక్కియము, ఎకసక్కెము } దే. అపహాస్యము, వికటపుమాట, అవమానము, వికటము

ఎకిమీఁడు. దే. అధిపతి, రాజు

ఎకిరింత. దే. వాహనము

ఎక్కటి. త. ఒక్కటి, ఒంటరివాఁడు, శూరుఁడు

ఎక్కటికయ్యము. దే. ద్వంద్వయుద్ధము

ఎక్కటీఁడు. దే. అసహాయుఁడైనబంటు

ఎక్కడ. దే. ఏచోటు

ఎక్కము. దే. గనిమ

ఎక్కము. త. ఒకటి, గుణకారపఠకము

ఎక్కలి. దే. ప్రవాహముచేత కొట్టుకవచ్చిన యిసుక, ఊగడమట్టి

ఎక్కసకియము, ఎక్కసెకియము, ఎక్కసకెము, ఎక్కసెకెము, ఎక్కసక్కియము, ఎక్కసెక్కియము, ఎక్కసక్కెము, ఎక్కసెక్కెము } దే. వికటపుమాట

ఎక్కాడు. దే. పురికొల్పు

ఎక్కిడు. దే. మోపెట్టు

ఎక్కిరింత. దే. వాహనము

ఎక్కిలి. దే. పైత్యాదివ్యాధి, హిక్క

ఎక్కు. దే. అతిశయించు, ఇష్టమగు, ఆరోహించు, వింటినారి

ఎక్కుడించు. దే. హెచ్చించు, ఎక్కుడించు

ఎక్కుడు. దే. ఎక్కుట, వాహనము, వింటినారి, అధికము, ఉత్కృష్టము, మిట్టు

ఎక్కుడుతీఁగ. దే. జ్యోతిష్మతీలత

ఎక్కుడుపెట్టు. దే. ఎక్కుపెట్టు, మోపెట్టు

ఎక్కుడుమెకము. దే ఏనుఁగు

ఎక్కుపెట్టు. దే. మోపెట్టు

ఎక్కులు. దే. ప్రేరేపణ

ఎక్కులుపెట్టు. దే. పురికొల్పు

ఎక్కువ. దే. అధికము, ఆధిక్యము

ఎక్కువలు. దే. విశేషములు

ఎగ. దే. మీఁదు

ఎగఁగొట్టు. దే. ఎగురఁజేయు, ఋణము తీర్పమి

ఎగఁగ్రోలు. దే. పీల్చు

ఎగఁజేపు. దే. పాలురాకుండ మీఁదికిఁ జేఁపుట

ఎగఁజెల్లు. దే. పైకిఁజల్లు

ఎగఁదన్ను. దే. ఎగువకుఁ దన్ను

ఎగఁబట్టు. దే. ఎత్తిపట్టు

ఎగఁబెట్టు. దే. ఇయ్యవలసినదాని నియ్యక పోవు

ఎగఁబోఁత. దే. ఎగువకువ్యాపించుట, దుర్బోధనముచేయుట

ఎగఁబోయు. దే. దుర్బోధనఁజేయు, సూచించు

ఎగఁబ్రాఁకు. దే. మీఁదికిఁబ్రాఁకు

ఎగచు. దే. ఎగయఁజేయు, తఱుము

ఎగతాళి. దే. పరిహాసము

ఎగదిగ. దే. మీఁదను, క్రిందను

ఎగదువ్వు. దే. మీఁదికి దువ్వు

ఎగనూఁదు. దే. పైకినూఁదు, తిరస్కరించు
ఎగసెత్తు. దే మీఁదికెత్తు
ఎగపు. దే. గర్వము, మండిపడుట
ఎగయు. దే. ఎగురు, పైకిలేచు
ఎగరోఁజు. దే. నిట్టూర్పు
ఎగవిడుచు. దే. ఊరకవిడుచు
ఎగవు. దే. ఎగురుట
ఎగవేయు. దే. అపహరించు, చేసినదిలేదని సాధించు
ఎగవైచు. దే. ఎగరవైచు
ఎగసన. దే. ఎగువగా
ఎగసనఁదోయు. దే. ఎత్తు, దీపపువత్తిని పైకిఁదోయు
ఎగసిపడు. దే. ఎగిరిపడు, గర్వించు, మండిపడు
ఎగసిపాటు. దే. గర్వించుట, ఎగసిపడుట
ఎగసిల్లు. దే. ఎగయు
ఎగాదిగ. దే. క్రిందుమీఁదను
ఎగు. దే. ఎత్తైన, ఎగురఁగల
ఎగుచు. దే. తఱుము
ఎగుడు. దే. ఉన్నతము
ఎగుడుదిగుడు. దే. మిట్టపల్లము, సమముకానిది, అసంగతము
ఎగుదల. దే. పైభాగము, వృద్ధి
ఎగుపు. దే. పక్షిగతి
ఎగుబుజము. దే. ఎత్తైనభుజము
ఎగుబోద. దే. ఱెక్కలువచ్చిన పక్షిపిల్ల
ఎగుమతి. దే. సరకులు ఓడ కెక్కించుట
ఎగుమతిచేయు. దే. ఓడను సరకులెక్కించు
ఎగురఁగొట్టు. దే. త్రోసివేయు, తిరస్కరించు
ఎగురు. దే. ఎగయు, గంతు
ఎగురులాడు. దే. దుముకులాడు
ఎగువ. దే. మీఁదు, ఆధిక్యము

ఎగ్గడము. దే. దట్టము
ఎగ్గడి. దే. నపుంసకుఁడు
ఎగ్గతము. త. ఏకాంతస్థలము
ఎగ్గించు. దే. అనాదరించు
ఎగ్గు. దే. కీడు, కీడుమాట, అపరాధము, దోషము, అనాదరము
ఎగ్గుఱుతు / ఎగ్గుర్తు } దే. జ్ఞాపిక, విషయసంగ్రహము
ఎగ్గులాడు / ఎగ్గాడు / ఎగ్గులుపట్టు } దే. నిందించు
ఎగ్గులు. దే. దూషణము
ఎచ్చిరిలు / ఎచ్చిర్లు } దే. ప్రబలు, వృద్ధిపొందు
ఎచ్చిఱు. దే. వృద్ధిపొందు, బాగుపడు
ఎచేటు. దే. ఏచోటు
ఎచేరించు. దే. ఎచ్చరించు
ఎచోటు / ఎచ్చేటు } దే. ఏచోటు
ఎచ్చెరము. దే. ఎచ్చెరిక
ఎచ్చెరించు. దే. ఎచ్చెరికచేయు
ఎచ్చెరింత. దే. ఎచ్చెరిక
ఎచ్చెరిక. దే. సూచన, అవధానము
ఎచ్చెరికించు. దే. ఎచ్చరించు
ఎచ్చు. దే. అధికమగు, అధికము, ఆధిక్యము
ఎచ్చొటు / ఎచ్చోటు } దే. ఏస్థానము
ఎట. దే. ఎక్కడ
ఎటవారె. దే. అందుగుచెట్టు
ఎటు / ఎటులు } దే. ఎట్లు

ఎటువంటి. దే. ఎట్టి
ఎటువలె. దే. ఎట్లు
ఎట్టకు నేని } దే. అతిప్రయాసము చేత
ఎట్టకేని } దీర్ఘకాలమునకు
ఎట్టకేలకు }
ఎట్టట. దే. ఎట్లైన
ఎట్టపోగు. దే. దండు
ఎట్టఎదురు. దే. మిక్కిలిముందఱ
ఎట్టి. దే. ఎటువంటి
ఎట్టిఁడు. దే. ఎటువంటివాఁడు
ఎట్టు }
ఎట్టులు } దే. ఎట్లు, ఏప్రకారము
ఎట్టువోలె }
ఎట్టూ. దే. ప్రశ్నమును దెలుపును
ఎట్లు. దే. ఏప్రకారము
ఎడ. దే. స్థానము, వ్యవధానము, భేదము, సంది, విఘ్నము, నైవేద్యమునకు సిద్ధముగా నుంచఁబడినవస్తువు, యౌవనము గలది, అడ్డంకి
ఎడ. త. హృదయము
ఎడఁజెందు. దే. సొమ్మసిల్లు, మూర్ఛిల్లు
ఎడఁజేయు. దే. తొలగించు
ఎడఁద. త. హృదయము
ఎడఁబాటు. దే. ఎడఁబాయుట
ఎడఁబాపు. దే. ఎడఁబాయఁజేయు
ఎడఁబాయు. దే. వదలు
ఎడకట్టు. దే. చేర్చు, ఆఱినపుండు మరల చీముపట్టు, గడ్డకట్టు
ఎడకడ. దే. ఇతరము
ఎడకడవాఁడు. దే. అన్యుఁడు
ఎడకత్తియ } దే. దూతిక, తార్చునది
ఎడకత్తె }

ఎడకాఁడు. దే. దూత, తార్చువాఁడు
ఎడకారు. దే. మాఘమాసము మొదలు జ్యేష్ఠమాసములోపల పండించెడుపంట
ఎడగడ్డ. దే. ఒడ్డు, తీరము
ఎడగిల్లు. దే. తొలఁగు, అపసరిల్లు
ఎడతాఁకు. దే చేరు, సంధించు
ఎడతీయు. దే ఎడతెగు
ఎడతెగు. దే. ఎడపడు, విడిపడు
ఎడతెఱపి } దే. వ్యవధానము
ఎడతెర్పి }
ఎడత్రెచ్చు. దే. ఎడతెగు, తగ్గు
ఎడనెడ. దే. అప్పుడప్పుడు, అచ్చటచ్చట
ఎడత్రోవకాపరి. దే. దారియందు దొంగిలించువాఁడు
ఎడదవ్వు. దే. అతిదూరము
ఎడనీరు. దే. లేఁత టెంకాయనీరు
ఎడపక. దే. సంతతము
ఎడపడు. దే. ఎడతెగు, పూఁటపడు
ఎడపదడప. దే. అప్పుడప్పుడు
ఎడపు. దే. ఎడయఁజేయు, వేఱుచేయు
ఎడపెట్టు. దే. తొలగించు, మాఱువడ్డించు కొనుటకు అన్నమును తీసిపెట్టు
ఎడపోవు. దే. దూతగానుండు
ఎడమ. దే. వామభాగము, సవ్యము
ఎడమకేలు. దే. వామహస్తము
ఎడమగు. దే. దూరమగు, వీఁడు, వేఱగు
ఎడమడుగు } దే. వ్యత్యాసము, వ్యత్యస్తము
ఎడమడుపు }
ఎడము. దే. చోటు, అవకాశము
ఎడయిక. దే. వియోగము
ఎడయు. దే. తొలఁగు, వేఱగు

ఎడరు. దే. ఆపద, భంగము, సందు, ఎడారి, భగ్నమగు

ఎడలించు. దే. వేఱుచేయు, తొలగించు

ఎడలు. దే. పోవు, విచ్ఛిన్నమగు, వికలమగు, విసర్జించు

ఎడవాఁడు. దే. కడవాఁడు, అన్యుఁడు, స్తన్యము వీడినచిన్నవాఁడు

ఎడవు. దే. దూరము

ఎడసాల. దే. ప్రత్యేకమైన గది

ఎడాటము. దే. విషయము, ఆట

ఎడారి. దే. చెట్టుచేమలు లేని విశాలమైన నిర్జలభూమి

ఎడారె. దే. చెప్పులుకుట్టెడు చిన్నసూది

ఎడ్డ. త. హృదయము

ఎడ్డమి. దే. ఆపద

ఎడ్డము. దే. అడ్డంకి

ఎడ్డియ, ఎడ్డె, ఎడ్డెడు } త. మూఢుఁడు

ఎడ్డెన. దే. భోజనపాత్రమును ఉంచుకొనెడి ఎత్తైన పీఁట

ఎడ్లు. దే. ఎద్దులు

ఎతఁడు. దే. ఏపూజ్యుఁడు, ఏవాఁడు

ఎతుబరికాఁడు. దే. దొంగ

ఎత్తనగోల. దే. గోనెలెత్తుకట్టె

ఎత్తనగోలు. దే. మొదలు

ఎత్తరతత్తరలు. దే. తునకలు, చెడిపోయినవి

ఎత్తరము, ఎత్తరవు } దే. ఉన్నతము

ఎత్తళి. దే. పనిముట్టు

ఎత్తికొను. దే. యత్నించు, అపహరించు, వహించు

ఎత్తికోలు. దే. ప్రయత్నము, సంకల్పము

ఎత్తిపొడుచు. దే. దోషము నెంచి ఆక్షేపించు

ఎత్తిలి. దే. గట్టిగా

ఎత్తివేయు. దే. తీసివేయు, అలక్ష్యము చేయు

ఎత్తు. దే. ఔన్నత్యము, ఉన్నతము, రెండు వీసెలకొలఁది, పూలదండ, యుక్తి, ఉపాయము, తూనిక, ప్రయత్నము, కలుగు, బయలుదేరు, దండెత్తు, అపహరించు, పైకెత్తు, తీయు, పాటించు, ప్రస్తావించు, వహించు, సంగ్రహించు, పుట్టు, చేదరంగపుటెత్తు

ఎత్తుకొయ్య. దే. బరువునెత్తెడు కొయ్య, లేక పనిముట్టు

ఎత్తుగడ. దే. యత్నము, ఉపాయము

ఎత్తుగడచేయు. దే. ప్రయత్నించు

ఎత్తుగడ్డలు. దే. ఎత్తుడుప్రొయ్యిగడ్డలు

ఎత్తుగున్న. దే. ఏనుఁగుపిల్ల

ఎత్తుదెంచు. దే. దండెత్తివచ్చు

ఎత్తుపడు. దే. లేవలేక పోవు, నాశనమగు

ఎత్తుపెట్టు. దే. పురికొల్పు, సంచిమొదలొసఁగు, పెట్టుబడి పెట్టు

ఎత్తుబరికాఁడు. దే. దొంగ

ఎత్తుభారము. దే. పాడు

ఎత్తులమారి. దే. నేర్పరి

ఎత్తువచ్చు. దే. సరిపోలు [పడు

ఎత్తువడు. దే. ఎత్తుపడు, చెడు, లేవలేక

ఎత్తువేయు. దే. తూఁచు

ఎత్తువోవు. దే. చెడు, తగ్గు

ఎత్తెల. దే. చేపఁలఁబట్టెడివల

ఎద. త. హృదయము, భయము, ఱొమ్ము

ఎద. దే. పశుఋతువు

ఎదపుట్టువులు. దే. కుచములు

ఎదపడు. దే. భయపడు
ఎదాయెదలు. దే. చెదరినవి
ఎదావు. దే. ఆఁబోతు చేరుటకు సమయమగు ఆవు
ఎది. దే. ఏది
ఎదిరించు. దే. ఎదురు
ఎదుగు. త. వృద్ధిపొందు
ఎదురాడు. దే. మాఱాడు
ఎదురు. దే. ఎదిరించు, సమ్ముఖము, ప్రతి విరోధి, వలపుకత్తె, వలచిన వానికిచ్చు ధనము, అన్యుఁడు, ఎదుటివాఁడు, మాఱు
ఎదురుకట్టుల, ఎదురుకట్ల } దే. ఎదుట
ఎదురుకత్తుక. దే. అంకిళ్లు పట్టుకొనెడి ఒక పశురోగము
ఎదురుకొను, ఎదుర్కొను } దే. ఎదురగు, ఎదిరించు, ప్రతిఘటించు
ఎదురుకోలు, ఎదుర్కోలు { దే. వివాహమునందు పెండ్లి కూఁతురు వారు వరుని కెదురుగాఁ బోవుట, ఎదురుకొను
ఎదురుగడ. దే. మాఱువ్రాసినయొడంబడిక లోనగునది
ఎదురుచు, ఎద్రుచు, ఎదుర్చు } దే. ఎదిరించు, ప్రతికూలమగు
ఎదురుచుక్క. దే. కూడనిది
ఎదురుచూచు. దే. ప్రతీక్షించు
ఎదురుపడు, ఎదుర్పడు } దే. ఎదురుగావచ్చు, ఎదురు తిరుగు
ఎదురుపాటు, ఎదుర్పాటు } దే. ఎదురుపడుట
ఎదురుప్రాయు. దే. మాఱుచెలఁగు
ఎదురుబొమ్ము. దే. బొమ్మనడిమిభాగము

ఎదురేగు. దే. ఎదురుగాఁబోవు
ఎదురొత్తు. దే. మాఱొత్తు
ఎదురొత్తులు. దే. మాఱొత్తులు
ఎద్దడి. దే. దరిద్రము, శూన్యము, కఱవు, నీరుదూరమునుండి తెచ్చుకొనుట, దారిద్ర్యము
ఎద్దడినేల. దే. నిర్జలభూమి
ఎద్దము. దే. పట్టైతీరినఅంచు
ఎద్ది. దే. ఏది
ఎద్దు. దే. వృషభము
ఎద్దునాలుక. దే. గోజిహ్వావృక్షము
ఎద్దుపట్టు. దే. ఎద్దువట్టలుకొట్టు
ఎద్దురాశి. దే. వృషభరాశి
ఎద్రుచు. దే. ప్రతికూలమగు
ఎన. దే. సమానము
ఎనమంద్రు. దే. ఎనిమిదిమంది
ఎనమందుము. దే. ఎనిమిదితూములు
ఎనమనూఱు, ఎనమన్నూఱు } దే. ఎనిమిదినూర్లు
ఎనయించు. దే. కలయఁ, పొందించు
ఎనయిక. దే. పొందిక, సామ్యము
ఎనయు. దే. సరిపోలు, పొందు
ఎని. దే. ఎన్ని
ఎనిక. దే. గణనము, నాలుగుపోఁగుల నూలుదారము
ఎనిమిది, ఎన్మిది } దే. ఏడుపై నొకటి
ఎనిమిదికాళ్లచుక్క. దే. పూర్వాభాద్ర నక్షత్రము
ఎనిమిదికాళ్లరిక్కనెల. దే. భాద్రపదమాసము
ఎనియు. దే. కలసికొను
ఎనుచు. దే. ఎనుపు, ఎనియఁజేయు
ఎనుపతేలు. దే. నల్లతేలు

ఎనుపమోఁకాలు. దే. ఒకానొకచెట్టు
ఎనుపసరము. దే. గేదె, బఱ్ఱె
ఎనుపు. దే. ఎనుచు
ఎనుపుడు. దే. ఎనుచుట
ఎనుపెంటి. దే. బఱ్ఱె, గేదె
ఎనుపోతు. దే. దున్నపోతు
ఎనుబంద్రు. దే. ఎనుబదిమంది
ఎనుబది. దే. ఎనిమిదిపదులు
ఎనుము. త. బఱ్ఱె
ఎన్నఁడు. దే. ఎప్పుడు, ఏకాలము, ఎల్లప్పుడు
ఎన్నాళ్లు. దే. ఎన్నిదినములు
ఎన్ని. దే. ఎంతసంఖ్యగలవి, అన్ని
ఎన్నిక. దే. గణనము
ఎన్నికచేయు } దే. ఎంచు
ఎన్నికపెట్టు }
ఎన్ను. దే. గణించు, ఆక్షేపించు, వరిమొదలైనవానికంకి
ఎన్నువ. దే. ఆఁడువారుఏడ్చునపుడుతలఁచుకొని తలంచుకొని పాటగాపాడెడు చేచ్చినవారి చారిత్రము
ఎన్నెము. దే. పుఱిటిపురుగు
ఎన్బది. దే. ఎనుబది
ఎపుడు } దే. ఎప్పుడు
ఎప్డు }
ఎప్పటి. దే. మఱల, అప్పటి
ఎప్పుడు. దే. ఏకాలము, ఎల్లప్పుడు
ఎబ్బె. దే. అసహ్యించుకొనునప్పుడు ఉపయోగింపఁబడుమాట
ఎబ్బెట్టు. దే. అసహ్యము, అభ్యంతరము
ఎబ్బెరాసి. దే. రోఁతగలవాఁడు
ఎబ్బెఱికము. దే. రోఁత
ఎమిడిక. దే. కడుపులోఁగలుగు తెల్లని పురుగు

ఎముక. దే. ఎమ్ముక
ఎముకలవట్టు. దే. రోగముచేఁజిక్కినవాఁడు
ఎమ్ము } దే. ఎముక
ఎమ్ముక }
ఎమ్మూట. దే. మూలగ, ఎముకలలోనిక్రొవ్వు
ఎమ్మె. దే. అందము, విలాసము
ఎమ్మెకాఁడు. దే. విలాసవంతుఁడు
ఎమ్మెలాఁడి. దే. విలాసముగల యాఁడుది
ఎయిదు } దే. వెంబడించు, పొందు
ఎడ్డు }
ఎయ్యది. దే. ఏది
ఎర. దే. ఆహారము, బలి, వ్యసనము
ఎరఁగు. దే. దిగు, నమస్కరించు
ఎరఁగుడు. దే. నమస్కారము
ఎరగలి. దే. కార్చిచ్చు, అడవినిదహించెడు అగ్ని
ఎరగొను. దే. పరవశమగు, మ్రింగు
ఎరవలి. దే. ఎరగలి
ఎరవు. దే. ఒకటి రెండు దినములు వాడుకొనుటకై యడిగితెచ్చుకొనెడిసొమ్ము, యాచితకము, భేదము, అన్యము
ఎరియించు. దే. కాల్చు, బాధించు
ఎరియు. దే. కాలు, మండు, పరితపించు
ఎరువాటు. దే. ఎరువువేయుట
ఎరువు. దే. పైరుకై అనేకదినములు చేర్చిపెట్టినపేఁడ లోనగునవి
ఎరుసు. త. ఈర్ష్య
ఎర్క. దే. ఎఱుక
ఎఱ. త. వానపాము, ఎఱ్ఱనైనది
ఎఱఁగు. దే. దిగు, నమస్కరించు
ఎఱక. దే. ఱెక్క, భుజము
ఎఱగందు. దే. లేఁతబిడ్డ

ఎఱకన్ను. దే. శివునియొక్క అగ్నినేత్రము
ఎఱగొను. దే. కోపగించు
ఎఱచి. దే. మాంసము
ఎఱచిదిండి. దే. రాక్షసుఁడు
ఎఱబఱికము. దే. రోఁత
ఎఱసంజె. త. సంధ్యాకాలము
ఎఱుఁగమి. దే. తెలియమి, అజ్ఞానము
ఎఱుఁగు. దే. తెలియు
ఎఱుక. దే. తెలివి, పరిచయము, సోదె, గుఱుతు, జోస్యము
ఎఱుకచేయు. దే. తెలియఁజేయు
ఎఱుకత. దే. సోదెచెప్పునది
ఎఱుకపడు. దే. విదితమగు
ఎఱుకసాని. దే. ఎఱుకత
ఎఱుకు. దే. కిరాతుఁడు
ఎఱుకువ. దే. తెలివి, జ్ఞానము
ఎఱుపు త. ఎఱ్ఱన
ఎఱ్ఱ. త. వానపాము, ఎఱుపు, ఎఱ్ఱనైనది
ఎఱ్ఱగడ్డ. దే. నీరుల్లి
ఎఱ్ఱగొల్ల. దే. ఒకానొకజాతి గొల్లవాఁడు
ఎఱ్ఱన. త. ఎఱుపు, ఎఱ్ఱనిది
ఎఱ్ఱనివేలుపు. దే. సూర్యుఁడు, అగ్ని
ఎఱ్ఱవాఱు. దే. ఎఱ్ఱనగు, కోపగిల్లు
ఎల. దే. యౌవనముగలది, లేఁత, స్వల్పముగా, సాక్షి
ఎలగోలు. దే. కలకలము, ముందునడచుట, మొదటిది,పటపటమనివచ్చువాన, సేనకు ముందుభాగము
ఎలదోఁట. దే. ఆరామము
ఎలనవ్వు. దే. మందహాసము
ఎలనాఁగ. దే. యౌవనముగల ఆఁడుది
ఎలనీరు. దే. లేఁతటెంకాయనీరు

ఎలప్రాయము. దే. యౌవనము
ఎలమావి. దే. తియ్యమామిడిచెట్టు
ఎలమి. దే. వికాసము, ప్రేమ, సంతోషము
ఎలమికాఁడు. దే. వికాసవంతుఁడు
ఎలయు. దే. చేరు, ప్రవేశించు, పొందు, ఆసక్తిపడు, కలుగు
ఎలరారు. దే. ఒప్పు, అతిశయించు
ఎలరు. దే. అతిశయము, వికసనము
ఎలరుచు } దే. అతిశయించు, వికసించు,
ఎలర్చు } సంతోషించు
ఎలరుపు } దే. సంతోషము
ఎలర్పు }
ఎలిసె. దే. గోడపైకప్పునకుఁ గ్రిందనుండు స్థలము
ఎలుఁగించు. దే. కూయు
ఎలుఁగు } దే. కంఠస్వరము, ఎలుఁగు
ఎల్గు } గొడ్డు
ఎలుఁగుగొడ్డు } దే. ఎలుఁగు, భల్లూకము
ఎలుఁగుబంటి }
ఎలుక. దే. మూషకము
ఎలుచు. దే. తలఁచు, భావించు
ఎలువు. దే. ఎలుఁగు
ఎల్ల. దే. పొలిమేర, సమస్తము
ఎల్లరు. దే. అందఱు
ఎల్లవాఁడు. దే. ఎవ్వఁడును
ఎల్లాఁపి. దే. దొంగ
ఎల్లాఁపికత్తియ } దే. దొంగతనముగలస్త్రీ
ఎల్లాఁపికత్తె }
ఎల్లి. దే. గొడుగు, జేపు
ఎల్లితము. దే. తిరస్కారము, ఎల్లిదము
ఎల్లిదము. దే. చులుకఁదనము, చులుకనిది
ఎల్లిదుఁడు. దే. చులుకనివాఁడు

ఎల్లుండి. దే. తేపటికి ఆవలిదినము
ఎల్లెడలు. దే. మేలుకట్లు
ఎవఁడు. దే. ఏవాఁడు
ఎవత, ఎవతి } దే. ఏస్త్రీ
ఎవతుక, ఎవతె } దే. ఏస్త్రీ
ఎవము. దే. ఎగయు
ఎవరిత, ఎవర్త, ఎవరితి, ఎవర్తి, ఎవరితె, ఎవర్తె } దే. ఏస్త్రీ
ఎవర్తుక, ఎవతుక } దే. ఏస్త్రీ
ఎవుచు. దే. ఎగుచు
ఎవ్వఁడు. దే. ఏవాఁడు
ఎవ్వత, ఎవ్వతి, ఎవ్వతుక, ఎవ్వతె, ఎవ్వరిత, ఎవ్వర్త, ఎవ్వరితి, ఎవ్వర్తి, ఎవ్వరితె, ఎవ్వర్తె, ఎవ్వర్తుక } దే. ఏస్త్రీ
ఎవ్వల. దే. ఏవైపున
ఎవ్వాఁడు. దే. ఎవఁడు
ఎవి, ఎవ్వి } దే. ఏవి

ఎస. దే. ఆధిక్యము, మిక్కిలి
ఎసఁగు. దే. తనరు, అతిశయించు
ఎసకము. దే. అతిశయము, విధము, ఉద్రేకము
ఎసకొను. దే. పురికొను
ఎసగొట్టు. దే. పనికిమాలినవాఁడు
ఎసటిపోఁతలు. దే. ఎసటవేయఁదగిన బియ్యము
ఎసరు. దే. మీఱు, వంటకై కాఁగఁబెట్టిన నీరు
ఎసరేఁగు. దే. విజృంభించు
ఎసల. దే. చేట్టి, అటిక
ఎసలారు. దే. అతిశయించు
ఎసలిక. దే. తీఱిక
ఎసలు. దే. దొమ్మియుద్ధము
ఎసవు. దే. ఎసఁగు
ఎసవెట్టు. దే. పురికొల్పు, ప్రేరించు
ఎళ్లము. దే. ఏడుపలములు

## ఏ

ఏ. ఒకయక్షరము. దే. ప్రశ్నమును, వ్యతిరేకమును, దుఃఖమును, ఆఁడుదగుటను తెలుపును
ఏ. త. మఱియొక దానిలేమిని దెలిపెడి, చూపుటను దెలిపెడి, తనంతట అను నర్థమును దెలిపెడి
ఏఁకట. దే. మిక్కిలి అపేక్ష
ఏఁకరి. దే. కిరాతభేదము
ఏఁకరు. దే. వాఁచిపోవు, కృశించు, ఉడుగు
ఏఁకారు. దే. ఏకరు
ఏఁచు. దే. బాధించు
ఏఁజెల్ల. దే. సంతాపమును దెలుపును
ఏఁడాది. దే. ఏఁడు, సంవత్సరము
ఏఁడి, ఏఁడీ } దే. ఎక్కడనున్నాఁడు

ఏఁడికోల. దే. నాఁగటికొయ్య

ఏఁడు. దే. సంవత్సరము, ఏపురుషుఁడు, ఎల్లవాఁడు

ఏఁడుడి. దే. ఆబ్దికము, సంవత్సరీకము

ఏఁదర. దే. కుటుంబముతోఁ జేరని స్వతంత్ర పుసొమ్ము మొదలైనవి

ఏఁదుము. దే. అయిదుతూములు

ఏఁపు. దే. బాధ

ఏఁబండ్రు. దే. ఏఁబదిమంది

ఏఁబది. దే. అయిదుపదులు

ఏఁబలము. దే. అయిదుపలములు

ఏకకుండలుఁడు. స. బలరాముఁడు, కుబేరుఁడు

ఏకకుఁడు. స. అసహాయుఁడు, ఎక్కటి

ఏకగురువు. స. సహపాఠి

ఏకచరము. స. అడవిపంది, ఒంటిగాఁడు, ఏకాంతమైనది

ఏకడ. దే. ఎక్కడ

ఏకతమాడు. దే. ఆలోచించు

ఏకతము. త. ఆలోచన, ఆలోచనకుఁదగిన చోటు

ఏకతానుఁడు. స. ఒకటేమనసుచెల్లినవాఁడు

ఏకతాళము. స. లయతోడికూడిక, తాళభేదము

ఏకదంతుఁడు. స. విఘ్నేశ్వరుఁడు

ఏకదృష్టి. స. కాకి, ఒకచూపుగలది

ఏకదేశము. స. అంశము, భాగము

ఏకన. దే. అంచు

ఏకపత్ని. స. పతివ్రత

ఏకపది. స. మార్గము

ఏకపింగళుఁడు. స. కుబేరుఁడు

ఏకభుక్తికుఁడు. స. దినమునకు ఒకసారి భోజనముచేయువాఁడు

ఏకము. స. అన్యము, ఒక్కటి, ముఖ్యము, అసహాయము

ఏకలము. స. అడవిపంది, అసహాయము

ఏకలీఁడు. త. అడవిపంది

ఏకసర్గుఁడు. స. ఏకతానుఁడు

ఏకస్థులు. స. కలసియున్నవారు

ఏకహాయని. స. ఒకసంవత్సరము ఈడుగల ఆఁడుపెయ్య

ఏకాంగి. స. ఒంటివాఁడు, విరక్తుఁడైన విష్ణుభక్తుఁడు

ఏకాండము. త. ఖండముకానిది

ఏకాంతము. స. రహస్యము, మిక్కిలి

ఏకాకి. స. అసహాయుఁడు, ఒంటరికాఁడు

ఏకాక్షము. స. కాకి, ఒకకన్నుగలది

ఏకాగ్రుఁడు. స. ఒకటుమనసుచెల్లినవాఁడు, కలఁకఁబాఱనివాఁడు

ఏకాదశము. స. పదునొకండు, పదునొకండవది

ఏకాదశి. స. పదునొకండవతిథి

ఏకాధ్యాయి. స. ఒంటరిగా చేదువుకొను వాఁడు

ఏకాయనగతుఁడు, ఏకాయనుఁడు } స. ఏకతానుఁడు

ఏకావళి. స. ఒంటిపేటహారము

ఏకాష్ఠీల. స. చిఱుబొద్దిచెట్టు

ఏకాష్ఠీలము. స. ఒకపుష్పవృక్షము

ఏకాహము. స. ఒకదినము

ఏకాహారము. స. దినమున కొక్కసారి భోజనము

ఏకీకరించు. స. ఒకటిగాఁజేయు, చేర్చు

ఏకీకృతము. స. ఒకటిగాఁ జేయఁబడినది, కలుపఁబడినది

ఏకీభవించు. స. ఒక్కటియగు

ఏకీభావము. స. ఒక్కటియగుట

ఏకీభూతము. స. ఒకటిగానైనది, కలిసినది

ఏకు. దే. దూదినిచక్కఁజేయు, నిందించు, ఏకినదూదిచుట్ట

ఏకుఁడు. దే. దూదిఏకుట
ఏకె. దే. ఏమె
ఏకోత్తరము. స. ఒకటి ఒకటివంతున అధికము చేయఁబడినది
ఏకోత్తరశతము. స. నూటఒకటి
ఏకోదరులు స. ఏకగర్భజనితులు
ఏకోద్దిష్టము. స. ఒకఁ డుద్దేశింపఁబడినవాఁడుగాఁగలది, ఒకని జ్ఞాపకార్థమైనది. ఒకశ్రాద్ధము [మెంత?]
ఏకోను. దే. సమష్టి (ఏకోనుకు మొత్తము
ఏగాని. దే. దుగ్గాని, రెండుపైసలు
ఏగించు. దే. ఏగునట్లుచేయు, పంపు
ఏగు. దే. పోవు, మరణించు
ఏగుదెంచు. దే. వచ్చు, పోవు
ఏగుపెండ్లి. దే. పెండ్లియూరేఁగింపు
ఏగురు. దే. అయిదుగురు
ఏగుస. దే. అయిదుకుంచములు
ఏచె. దే. వంకర, గ్రామ్యము
ఏచు. దే. అతిశయించు, విజృంభించు
ఏట, ఏటము } దే. పక్షము, పక్షపాతము, అతిశయము
ఏటవాలు. దే. వంపు, పక్షపాతము
ఏటి. దే. ఎట్టి, ఎటువంటి
ఏటికపాము. దే. ఎమిడిక
ఏటికోళ్లు. దే. నమస్కారము
ఏటిరింత. దే. ఏట్రింత
ఏటిఱేఁడు. దే. సముద్రుఁడు
ఏటు. దే. బాణప్రయోగము, దెబ్బ
ఏటులాడు. దే. ఆయుధమునుధరించి పోట్లాడు
ఏట్రింత. దే. భరద్వాజపక్షి
ఏడ. దే. ఎక్కడ
ఏడక. స. గొఱ్ఱె

ఏడకము. స. పొట్టేలు
ఏడగజము. స. తగిరిసచెట్టు
ఏడము. దే. చెవుడు
ఏడము. స. చెవిటి, ఒకవిధమగుగొఱ్ఱె
ఏడమూఁకుడు. స. చెవిటిమూఁగ, మోసకాఁడు
ఏడాకుపొన్న. దే. ఒకదినుసుపొన్న
ఏడాకులరఁటి. దే. ఒకదినుసుఅరఁటి
ఏడాగోడము. దే. విరుద్ధము, ఎగతాళి
ఏడాటలాడించు. దే. మిక్కిలిబాధపెట్టు
ఏడి. త. పొట్టేలు
ఏడు. దే. ఆఱునొకటి
ఏడుఁడు. స. చెవిటివాఁడు
ఏడుగడ. దే. రక్షకము, రక్షకుఁడు, దిక్కు
ఏడుగురు. దే. ఏడుమంది
ఏడుచు, ఏడ్చు } దే. రోదనముచేయు
ఏడుపు, ఏడ్పు } దే. రోదనము
ఏడుకము, ఏడూకము } స. మెత్తినగోడ, నడుమనుంచఁబడిన ఎముకలుగలగోడ
ఏడ్గడ. దే. ఏడుగడ
ఏడ్తెఱ. దే. విజృంభణము, పరాక్రమము, అతిశయము, యుద్ధము, శీఘ్రముగా
ఏడ్దుము. దే. ఏడుతూములు
ఏణము. స. నల్లయిఱ్ఱి
ఏణి. స. లేఁడి, జింక
ఏతఁడు. దే. ఎతఁడు
ఏతదీయము. స. దీనిసంబంధమగునది
ఏతము. త. నీళ్లెత్తెడియంత్రము
ఏతము. స. చిత్రవర్ణము, చిత్రవర్ణముగలది, వచ్చినది, లేడి

ఏతరి. దే. కుజనుఁడు, దుర్ణయపరుఁడు
ఏతాదృశము. స. ఇటువంటిది
ఏతాము. త. ఏతము
ఏతు. దే. ఉద్ధతి
ఏతుల. దే. చాఁపలల్లెడు మనుష్యజాతి విశేషము
ఏతెంచు. దే. వచ్చు, పోవు
ఏద. దే. ఒకానొకచెట్టు
ఏదడి. దే. ఒకదినుసు ఎలుఁగుబంటి
ఏది. దే. ఎది, ఎట్లు
ఏదీ. దే. ఎక్కడనున్నది, ఎట్లు
ఏదు. దే. నశించు, ముండ్లపంది, ఏడుచు
ఏదు. త. పెంచు, పోషించు
ఏదుదు. దే. విడుపు
ఏధ. స. ధనాదిసమృద్ధి, నింపు
ఏధము. స. వంటచెఱకు, సమిధలు
ఏధితము. స. వృద్ధిపొందినది
ఏనస్సు. స. అపరాధము, పాపము
ఏనాదము. దే. సముద్రతీరము
ఏనాది. దే. ఒకహీనజాతివాఁడు
ఏనాళ్ళు. దే. అయిదుదినములు, పెండ్లియైన పిమ్మట పంపఁబడుసారె
ఏని. దే. పక్షాంతరమును, అనిశ్చయమును దెలుపును
ఏని. స. నది
ఏనిక. త. ఏనుఁగు
ఏనికతిండి. దే. సింహము
ఏనికదోమ. దే. పెద్దదోమ
ఏను. దే. అయిదు, నేను
ఏనుఁగు. త. ఏనిక, పెద్దది
ఏనుఁగుకలబంద. దే. పెద్దకలబంద
ఏనుఁగుకాలు. దే. ఏనుఁగుకాలివలె కాలుబ్బురోగము
ఏనుఁగుకొమ్ములు. దే. శాలిధాన్యవిశేషము
ఏనుఁగుఁబల్లేరు. దే. పెద్దపల్లేరు
ఏనుఁగుగొంగ. దే. సింహము
ఏనుఁగుమోముసామి. త. విఘ్నేశ్వరుఁడు
ఏనుఁగురాకాసిగొంగ. దే. శివుఁడు
ఏనుఁగుసోరము. దే. సప్తస్వరములలో నొకటి, నిషాదము
ఏనూఱు. దే. అయిదునూఱు
ఏపరించు. దే. దుఃఖపఱచు
ఏపారు. దే. అతిశయించు, గర్వించు
ఏపి. దే. కుక్క
ఏపు. దే. ఆధిక్యము, ఔద్ధత్యము, గర్వము, విలాసము, మదము
ఏపె. దే. ఏమొ, ఏపిచెట్టు
ఏబిడ. దే. ఏపె
ఏమఱించు. దే. పరాకుకలుగునట్లుచేయు, మోసపుచ్చు
ఏమఱిల్లు. దే. ప్రమాదపడు
ఏమఱు. దే. ఏమఱిల్లు
ఏమఱుచు } దే. ఏమఱఁజేయు
ఏమాఱుచు }
ఏమఱుపాటు. దే. అకస్మాత్తుగా, వంచనగా
ఏమి. దే. ఏది
ఏము. దే. మేము
ఏమె. దే. విపూజ్యురాలు
ఏయది. దే. ఎది
ఏయు. దే. బాణము ప్రయోగించు
ఏరండము. స. ఆముదపుఁజెట్టు
ఏరక. స. ముసలములు అనఁగా రోఁకళ్లు అయి యాదవులను నాశముచేసిన తుంగగడ్డి
ఏరకము. స. రత్నకంబళి, తివాసీ
ఏరాడి. దే. ఒకదాని సంతతియైనగుఱ్ఱము

ఏరాలు. దే. తోడికోడలు
ఏరాళము. త. అధికము, హేరాళము
ఏరు. దే. ఎద్దులనుకట్టియున్న నాఁగలి, తల నొప్పి
ఏరుగడము. దే. ఏరుగు, విష్ఠ
ఏరుగు. దే. విష్ఠించు, విష్ఠ
ఏరునేల. దే. భూపరిమాణవిశేషము, ఒక్కనాటిలో దున్నగలభూమి
ఏరుపడు / ఏర్పడు } దే. తేటపడు, నిర్ణయింపఁబడు, బయలుపడు, రూపువడు, వేఱుపడు, సిద్ధించు, సిద్ధపడు
ఏరుపాటు / ఏర్పాటు } దే. నిర్ణయము, వివరణము
ఏరువాక. దే. దుక్కియొక్క ఆరంభము
ఏర్చు. దే. ఏర్పఱచు, చక్కఁబఱచు, కాల్చు, తలనొచ్చు
ఏర్పడు. దే. తేటపడు, రూపముగలుగు, నిర్ణయింపఁబడు
ఏర్పాటు. దే. నిర్ణయము
ఏర్పు. దే. మంట
ఏఱు. దే. నది, క్రిందనుండు వస్తువులను ఒకటిఒకటిగా తీసికొను
ఏఱువ. దే. దేశము
ఏల / ఏలా } దే. ఎందుకు, శృంగారపుమాట
ఏల. త. ఒకఏఱు, ఇది గోదావరిమండలము లోని ఏలేఱు
ఏలకి. త. ఏలాలత [లోనిభేదము
ఏలకికాయ. దే. ఏలాఫలము పిండివంట
ఏలపాటలు. దే. బాలక్రీడావిశేషములు
ఏలము. త. కల్లుగీచేవాఁడు ఆతోఁపునందు వేసికొనెడు గుడిసె
ఏలము / ఏలాము } దే. వేలము, ప్రకటనము
ఏలలు. త. జోలపాటలు, శృంగారపుఁ బాటలు
ఏలా. స. పెద్దఏలకిచెట్టు
ఏలాము. త. ఏలము
ఏలావాలుకము. స. నూఁగుదోస
ఏలి. దే. కృత్రిమము
ఏలిక. దే. రాజు, ప్రభువు
ఏలికసాని. దే. దొరసాని
ఏలిదము. దే. చేలుకఁదనము, చేలుకనిది
ఏలినవాఁడు. దే. రాజు
ఏలు. దే. పోషించు, పాలించు, పరిగ్రహించు
ఏలుకొను. దే. ఏలు, పరిగ్రహించు
ఏలుకోటి. దే. ఏలుబడికి లోఁబడినజనము, ప్రకృతిజనము
ఏలుబడి. దే. పాలనము
ఏవ / ఏవము } దే. రోఁత, అసహ్యమైనది
ఏవకాఁడు. దే. రోఁతగలవాఁడు, ఓర్వ లేనితనముకలవాఁడు [విడుచు
ఏవగించు. దే. అసహ్యపడు, నిందించు,
ఏవపడు. దే. రోఁతపడు
ఏవము. స. వేగముగలది, మార్గము, వడి గలగుఱ్ఱము, వాడుక
ఏవాఁడు. దే. ఎవ్వఁడు, ఎల్లవాఁడు
ఏవురు. దే. అయిదుగురు
ఏష / ఏషణము } స. కోరిక
ఏషణి. స. పుంటిలోనికిఁ జెక్కించెడు శలాక
ఏషణిక. స. త్రాసు
ఏషము. స. కోరఁదగినది, పరుగు, కోరిక
ఏష్యము. స. కాఁగలది, కోరఁదగినది, రాఁదగినది, జరుగఁబోవునది, జరుగఁ బోవుదానికి గుఱుతు

ఏష్టి. స. కోరిక
ఏస. దే. విజృంభణము, గ్రామ్యము, వంకర
ఏసరు. దే. మీఱు
ఏసరేఁగు. దే. విజృంభించు
ఏసి. దే. వంతున (కొలఁదిని తెల్పును)
ఏసె. దే. నారపోఁచె
ఏహస్సు. స. కోపము
ఏహ్యాము. స. అసహ్యామైనది

## ఐ

ఐ. ఒకయక్షరము
ఐంగుదము. స. గారపండు
ఐందవము. స. చంద్రసంబంధమైనది
ఐంద్రజాలికుఁడు. స. ఇంద్రజాలవిద్య నేర్చినవాఁడు
ఐంద్రము. స. ఒకగ్రహయోగము, మాల కాకి
ఐంద్రలుప్తికుఁడు. స. పేనుకొఱికినతలగల వాఁడు, బట్టతలగలవాఁడు
ఐంద్ర్యము. స. విషయాసక్తి
ఐంద్రియకము. స. ప్రత్యక్షము
ఐకకంర్యము. స. ఏకకంఠత్వము, ఒద్దిక
ఐకపత్యము. స. సర్వాధికారము
ఐకభావ్యము. స. ఏకీభావము
ఐకమత్యము. స. ఒద్దిక
ఐకాగారికుఁడు. స. దొంగ, ఒకయిల్లు గల వాఁడు
ఐకాగ్ర్యము. స. ఒక్కకార్యమందే తలంపు గలది
ఐకాగ్రుఁడు. స. ఏకాగ్రుఁడు
ఐకాత్మ్యము. స. చేరిక, పరమాత్మతోఁ జేరి యొకటియగుట
ఐకాహికము. స. ఒకదినముండునది
ఐక్యము. స. ఏకీభావము
ఐక్షవము. స. చెక్కెర, బెల్లము
ఐక్షవ్యము. స. చెఱకుగడతోఁ జేయఁబడి నది
ఐచ్ఛికము. స. ఇష్టమువచ్చినది
ఐణము. స. ఇఱ్ఱియొక్కచర్మము మొదలైనది
ఐణికుఁడు. స. జింకలను వేఁటాడువాఁడు
ఐణేయము. స. లేడియొక్క చర్మము మొదలైనది
ఐతి. దే. శక్యము, వల్ల, అయితి
ఐతిహాసికుఁడు. స. ఇతిహాసము తెలిసిన [వాఁడు
ఐతిహ్యము. స. అనాదిప్రవాద
ఐదు. దే. నాలుగునొకటి, అయిదు
ఐదుపది చేయు. దే. నమస్కరించు, ఓడి పోవు
ఐదు మోములవేలుపు. దే. శివుఁడు పంచ ముఖుఁడు
ఐదవ / ఐదువరాలు } దే. మాంగల్యముగలస్త్రీ
ఐద్దాయులు. దే. ఐదువృత్తులు (అనఁగా వడ్రంగి, కమ్మరి, కంసాలి, కంచరి, తాపీ పనివాఁడు, వీరివృత్తులు)
ఐన. దే. అయినప్పటికి
ఐనిల్లు. దే. నట్టిల్లు
ఐపు. దే. పప్పు, దోషము, జాడ, అయిపు
ఐపోవు. దే. మఱియు, వెచ్చమై తీఱు, అయిపోవు
ఐమూల. దే. మూలకాటు, అయిమూల
ఐర. దే. నేత్రరోగము, అయిర
ఐరకొను. దే. చక్కఁబడు, అయిరకొను
ఐరావణము / ఐరావతము } స. ఇంద్రుని యేనుఁగు

ఐరావతి. స. మెఱపు
ఐరేని. దే. పెండ్లికుండలు, అయిరేని
ఐరేయము. స. నూఁగుదోస, సారాయి
ఐలబిలుఁడు. స. కుబేరుఁడు
ఐలేయము. స. నూఁగుదోస, ఒకదినుసు పరిమళద్రవ్యము
ఐవచ్చు. దే. అచ్చువచ్చు, అయివచ్చు
ఐశ్యము. స. ప్రభుత్వము
ఐశ్వర్యము. స. సంపద, అణిమాది
ఐష్టికము. స. ఇటికలతోఁ జేయఁబడినది
ఐహలౌకికము. స. ఈలోకసంబంధమైనది
ఐహికము. స. ఇహలోక సంబంధమైనది, ఈలోకమును గుఱించినది

## ఒ

ఒ. ఒకయక్షరము. దే. సందేహమును దెలుపును
ఒంకియ. దే. ఒంకె
ఒంకె. త. చిలుకకొయ్య
ఒంజిలి. దే. దుఃఖము, దుఃఖముకలవాఁడు
ఒంటనివాఁడు. దే. విరోధి
ఒంటమి. దే. విరోధము, భేదము
ఒంటరము. దే. విరోధము
ఒంటరి. దే. అసహాయుఁడైనబంటు, ఏకాకి
ఒంటరికత్తె. దే. ఒక్కతె
ఒంటరికము. దే. ఒంటరిగానుండుట
ఒంటరికాఁడు. దే. ఏకాకి, పంది, అసహాయుఁడైన బంటు
ఒంటరిపాటు. దే. ఏకాకిత్వము
ఒంటరివాఁడు. దే. ఏకాకి
ఒంటరీఁడు. దే. అసహాయుఁడైన బంటు
ఒంటరులు. దే. కాలిబంట్లు
ఒంటి. త. ఏకాకిత్వము, ఒకటి
ఒంటింపు. దే. అనుకూల్యము, సహాయము ఈపని వీనికి, వీఁడు ఈపని సేయవలెనని యేర్పఱచు నేర్పాటు
ఒంటికంటిగాము. దే. శుక్రుఁడు
ఒంటికాఁడు. దే. ఏకాకి, పంది, సన్యాసి, వియోగి
ఒంటికొమ్ముదేలుపు. దే. విఘ్నేశ్వరుఁడు
ఒంటిజెందెపువాఁడు. దే. బ్రహ్మచారి
ఒంటిపాటు. దే. ఏకాంతము
ఒంటిపోఁగు. దే. బలరాముఁడు, ఏకకుండలుఁడు
ఒంటియ, ఒంటె } త. లొట్టిపిట, ఉష్ట్రము
ఒంటు. దే. అనుకూలించు, సరిపడు, ఇముడు, చేరు, గ్రా. మసహూహము
ఒంటుకొను. దే. చేరు
ఒంట్రిపు. దే. అసహాయుఁడైన బంటు
ఒంటులు, ఒంట్లు } దే. చెవులపోగులు
ఒంట్లు. త. ఒకటిమొదలైన అంకెలు
ఒండ. దే. చెఱుపు, గోరుచుట్టు
ఒండమిండరిమాటలు. దే. వ్యర్థవచనములు
ఒండు. త. అన్యము, ఏకము
ఒండె. దే. అటుగానిపక్షమున, కాని
ఒండేని. దే. అట్లుకానిపక్షమున, కాని
ఒండొండ. దే. క్రమక్రమముగా
ఒండొరుల. దే. పరస్పరము
ఒందించు. దే. పొందించు
ఒందిక. దే. ఒద్దిక
ఒందిలి. దే. దుఃఖము, దుఃఖముకలవాఁడు
ఒందు. దే. కలుగు, పొందు

ఒక. త. ఒకానొక, ఒక్క

ఒకఁడు. త. అన్యుఁడు, ఏకాకి, అన్యము, ఏకము

ఒకట. త. ఏకకాలమున, కూడ

ఒకటి. త. ఏకము, అన్యము

ఒకత, ఒకతి, ఒకతుక, ఒకతె, ఒకరిత, ఒకరితి, ఒకరితె } త. ఏకస్త్రీ, ఒకఆఁడుది

ఒకతల. దే. ఒకవైపు

ఒకరుఁడు, ఒకరువుఁడు } త. ఒకఁడు

ఒకర్తు, ఒకర్తుక } త. ఒకఆఁడుది

ఒకానొక. త. ఉద్దేశింపఁబడని

ఒకింత. దే. కొంచెము, ఇంచుక

ఒకొ, ఒకో } దే. సందేహమును దెలుపును

ఒకోఁడు. త. ఒకఁడు

ఒకోట. త. ఒకట

ఒకోటి. త. ఒకటి

ఒకోత, ఒకోతి, ఒకోతుక, ఒకోతె, ఒకోరిత, ఒకోరితి, ఒకోరితె } త. ఒకతె

ఒకోరుఁడు, ఒకోరువుఁడు } త. ఒకఁడు

ఒకోర్తు, ఒకోర్తుక } త. ఒకతె

ఒక్క. త. ఒక

ఒక్కఁడు. త. ఒకఁడు

ఒక్కట. త. ఏకకాలమున

ఒక్కటి. త. ఒకటి

ఒక్కత, ఒక్కతి, ఒక్కతుక, ఒక్కతె } త. ఒకతె

ఒక్కప్రొద్దు. త. వ్రతనియమముతోఁ జేయునట్టి ఒక్కపూఁటభోజనము, ఉపవాసము

ఒక్కరిత, ఒక్కరితి, ఒక్కరితె } త. ఒకతె

ఒక్కరుఁడు, ఒక్కరువుఁడు } త. ఒకఁడు

ఒక్కర్తు, ఒక్కర్తుక } త. ఒకతె

ఒక్కుమ్మడి. దే ఒకపెట్టున

ఒక్కెఱ. త. ఉగ్రము, ఉగ్రభావము

ఒక్కొ, ఒక్కో } దే. ఒకో

ఒక్కోఁడు. దే. ఒక్కఁడు

ఒక్కోలు. దే. ఒక్కసారిగా

ఒగరు. దే. పచ్చిదానిమ్మ మొదలగువాని రుచి

ఒగరుచు. త. ఒగరగు

ఒగి. దే. క్రమముగా, వరుస

ఒగిదిగ. దే. జేడవిల్లు

ఒగుడు. దే. ఎండినజొన్న, చొప్ప

ఒగుడుకఱచు. దే. కృశించు

ఒగ్గము. దే. ఏనుఁగులను పట్టుటకై చేయఁబడినపల్లము
ఒగ్గు. దే. ఒడ్డు, సిద్ధపడు, స్వాధీనపడు, చేఁచు
ఒచ్చెము. దే. కొఱఁత, అవమానము
ఒచ్చెల. దే. ఓచెల్ల [రోహితుఁడు
ఒజ్జ. త. ఉపాధ్యాయుఁడు, గురువు, పు
ఒజ్జనము. త. ఒజ్జదనము, ఉపాధ్యాయత్వము
ఒజ్జబంతి. త. ఉపాధ్యాయుఁడు చూపిన పద్ధతి, మేలుబంతి
ఒజ్జసాని. త. ఉపాధ్యాయునిభార్య
ఒట్టు. దే. కలుగు, ఉంచు, రగుల్చు, కాల్చు, ఆన, శపథము, మొత్తము
ఒడఁగూడు. దే. సిద్ధించు, చేరు
ఒడఁబడిక } దే. సమ్మతి, సమ్మతించి వ్రాసి
ఒడంబడిక } ఇచ్చినవ్రాఁత
ఒడఁబడు. దే. సమ్మతించు, అనుకూలించు, సంతోషించు
ఒడఁబాటు. దే. సమ్మతి
ఒడపి. దే. గండి, రంధ్రము
ఒడమి } దే. ధనము, నగ
ఒడమె }
ఒడయఁడు } దే. మగఁడు, స్వామి
ఒడయుఁడు }
ఒడయురాలు. దే. స్వామిని, ప్రభువుభార్య
ఒడలిమోపాడయఁడు. దే. ఇంద్రుఁడు
ఒడలు. దే. శరీరము
ఒడి. దే. తొడపైభాగము, ఒడుపు, జట్టు ముంగొంగు, పశుయోని [ను
ఒడిఁబ్రాలు. దే. ఒడియందుఁ బోసెడిబియ్యు
ఒడికట్టు. దే. యత్నించు, ఒడ్డాణము
ఒడికము. దే. యుక్తము, ఉపాయము, అందము
ఒడికారము. దే. ఉద్రేకము
ఒడిదారము. దే. ఆఁడుదాని మొలనూలు
ఒడియు. దే. పైకెగరు, ఆకర్షించు, ప్రవహించు, పైకెగిరిపట్టుకొను, లాగు
ఒడిసియ. దే. ఒడిసె, ఒడిసెగడ్డ
ఒడిసెల. దే. రాళ్లువిసరివేయుత్రాడు
ఒడిసెలకాఁడు. దే. ఒడిసెలవేయువాఁడు
ఒడుచు. దే. ఓడించు, పొడుచు
ఒడుదొడుకు. దే. సమముకామి, సంకటము, సమముకానిది
ఒడుపు. దే. పూనిక, లాభము, లక్ష్యము పెట్టి దాఁటినదాఁటు, ఉపాయము, ఎత్తుకొనిపోవఁజూచు [ప్పొంగు
ఒడ్డగిల్లు. దే. ఒత్తిగిలు, అతిశయించు, ఉ
ఒడ్డగెడవు. దే. బండివాటుపడు
ఒడ్డనము. దే. వ్యూహము, పందెము
ఒడ్డనము. త. కేడెము
ఒడ్డాణము. త. యోగపట్టె, స్త్రీలునడుమునకు వేసికొనెడి ఆభరణము
ఒడ్డాది. త. ఓఢ్రదేశము
ఒడ్డారము. దే. ద్వేషము, ప్రతిఘటించుట
ఒడ్డారించు. దే. ద్వేషించు, మాఱొడ్డు
ఒడ్డిమి. త. ఒడ్డు, పందెము
ఒడ్డియ. త. ఒడ్డెవాఁడు [గల పావురాయి
ఒడ్డిఁడు. త. ఓఢ్రదేశపురాజు, ఉడ్డీనగతి
ఒడ్డు. దే పందెమువేయు, చేఁచు, ఉంచు, దాఁటు, తీరము, పందెము, వ్యూహము, పూనిక, అడ్డపాటు, స్థూలము, పెద్ద, అధికము, విశాలము
ఒడ్డు. త. అన్యుఁడు, ఏకరుఁడు
ఒడ్డె. త. ఒడ్డియ

ఒడ్డోఱకము. దే. ఎగుడుదిగుడైనభూమి
ఒడ్డోలగము. దే. పెద్దసభ
ఒత్తగిల్లు. దే. ఒఱగు, అంటుకొను
ఒత్తడము. దే. తఱచు, ఒత్తుట
ఒత్తడి. దే. రాపు, తఱచుఁదనము, బాధ, సమ్మర్దము
ఒత్తరము. దే. ఉద్రేకము, ముమ్మరము
ఒత్తిరించు. దే. మించు, ఆక్రమించు
ఒత్తిలి. దే. గట్టిగా, పట్టుగా
ఒత్తిలు } దే. ప్రక్కకుఒఱగు
ఒత్తిల్లు }
ఒత్తు. దే. పొడుచుకొను,దట్టమగు,అదుము, కాళ్లొపిసుకు, శంఖములు ఊఁదు, బలాత్కరించు, తుడుచు, ఒఱగు, త్రోయు, చేర్చు, ఆక్రమించు, ఒత్తుడు, దట్టము, ఆక్రమణము, తఱచు, పిడుచు, ఊనిపలుకుటకై కొన్ని యక్షరముల క్రింద వేయఁబడుగుర్తు, మెత్త
ఒత్తుకాఁడు. దే. సుటిపోయువాఁడు
ఒత్తుకొను. దే. పొడుచుకొను, ఆక్రమించుకొను
ఒత్తుడు. దే. అదుముడు, పీడనము, వ్రాయునపుడు కాగితము క్రింద నుంచఁబడినది
ఒత్తులు. దే బిడ్డలచేతి యొకదినుసు బంగారుసొమ్ము
ఒత్తువడు. దే. అదుముడు
ఒత్తొరవు. దే. మిక్కిలి యసనుడు
ఒదరు. దే. సంభ్రమించు, నిందించు, విజృంభించు
ఒదరుచు } దే. ఊడఁదీయు
ఒదర్చు }
ఒదలు. దే. వృద్ధిపొందు, పొదలు
ఒదవు. త. ఉపయోగించు, యుక్తమగు
ఒదవుబడి. దే. ఉపయోగము
ఒదిఁగిలు. దే ఒత్తగిల్లు, ప్రక్కకొఱగు
ఒదుఁగఁబాఱు. దే. ఒదుఁగు
ఒదుఁగు. దే. తొలఁగు, దాఁగు
ఒదుఁగువడు. దే. తొలఁగు
ఒదుఁగువాటు. దే. తొలఁగుట
ఒదుగు. దే. సమృద్ధి, సమృద్ధము, అధికము
ఒదుగుబడి. దే. సమృద్ధి
ఒదువు. దే క్రమ్ము, సమృద్ధమగు, సమృద్ధి
ఒద్ద. దే. సమీపము
ఒద్ది. దే. ఒకానొకచెట్టు
ఒద్దిక. దే. అనుకూల్యము, ఒక వస్తువునకు సరియగు తూనికతాయి మొదలగునవి
ఒద్దియ } దే. విస్తారము
ఒద్దె }
ఒనగూడు. దే. సిద్ధించు
ఒనగూర్చు. దే. సిద్ధించునట్లుచేయు, కలుగఁజేయు
ఒనరఁజేయు. దే. పొసఁగఁజేయు, అలంకరించు
ఒనరించు. దే. చేయు
ఒనరిక. దే. పొంకము, పొందిక
ఒనరు. దే. ఒప్పు, సరిపడు, కలుగు, ఇంపు, వీలు, వాటము, పొందిక
ఒనరుచు } దే. ఒనరించు, చేయు
ఒనర్చు }
ఒనరుపడు. దే. పొందుపడు
ఒనవెట్టుకొను. దే. పొంచువేయు
ఒప్పందము. దే. ఒప్పగించిన నిర్ణయము, బేరము, వెలలవిషయమై ఏర్పఱచిన ఏర్పాటు

ఒప్పగించే. త. అప్పగించే
ఒప్పగించుకొను. దే. స్వాధీనముచేసికొను, బాలునిపారమును విను
ఒప్పగింత. త. అప్పగింత
ఒప్పచెప్పు. దే. ఒప్పగించు
ఒప్పనము. త. అప్పనము, అర్పణము
ఒప్పనసేయు. త. అప్పగించే
ఒప్పమి. దే. అంగీకరింపకుండుట, కీడు, తప్పు, నింద
ఒప్పరము. దే. జలదారి, నీళ్లుపోవుతూము
ఒప్పరికము. త. ఉపేక్ష
ఒప్పరించే. త. ఉపేక్షించే
ఒప్పారు. దే. ఒప్పు [సమ్మతింపఁజేయు
ఒప్పించు. త. ఒప్పగించే, స్వాధీనపఱచే,
ఒప్పిదము. దే. అంగీకారము, అందము, అలంకారము, విధము
ఒప్పు. దే. తగు, సమ్మతించే, అందము, తప్పుకామి, సమ్మతి, నేర్పు, యుక్తమగు
ఒప్పుకోలు. దే. ఒప్పుకొనుట
ఒప్పులాఁడి. దే. చక్కఁదనముగల ఆఁడుది
ఒప్పెసలార. దే. మనోహరముగ
ఒబ్బట్లు. దే. పోళీలు, హోళిగలు, భక్ష్య విశేషము
ఒబ్బిడి. దే. పంటనుఱిపిడి, నాశము, చక్కపెట్టుట
ఒమ్మచ్చు. దే. మణులను పొదుగుటకు చేయఁబడిన బంగారునగ
ఒమ్మమి. దే. సరిపడమి, పగ
ఒమ్మిక. దే. పొందిక, ఇమిడిక
ఒమ్మివచ్చు. దే. అచ్చివచ్చు [ఒప్పు
ఒమ్ము. దే. సరిపడు, బలుపు, స్థూలము,
ఒయారము దే. విలాసము, గర్వము, సౌందర్యము [దర్యముగలది
ఒయారి. దే. శృంగారచేష్టలుగలస్త్రీ, సౌం

ఒయ్య. దే. మెల్లఁగా, తిన్నఁగా
ఒయ్యన. దే. తిన్నన, మెల్లన
ఒయ్యారము. దే. విలాసము, గర్వము, అందము
ఒయ్యారి. దే. ఒయారి
ఒర. దే. ఒరపెట్టుట, సామ్యము
ఒరగట్టు. దే. చేట్టగాఁజుట్టికట్టినవస్త్రపు కట్టు
ఒరగడుగు. దే. రెండవసారి బియ్యము కడిగిననీరు
ఒరగల్లు. దే. బంగారమును ఒరపెట్టెడు
ఒరగాలు. దే. ఒరగినకాలు [ఱాయి
ఒరగు. దే. పడు, వంగు, వ్రాలు, వంపు
ఒరగొను. దే ఒరపెట్టు
ఒరచాలుదుక్కి. దే. చాలుతేలికగాఁబాఱినదుక్కి
ఒరపదను. దే. కొంచెపుతడి
ఒరపిడి. దే. రాయిడి
ఒరపెట్టు. దే. బంగారును ఒరయు
ఒరము. దే. వేడెక్కు
ఒరయిక. దే. రాపిడి
ఒరయు. దే. ఒరపెట్టు, రాచే, పొందు, పరీక్షించే, వెదకు, విచారించే
ఒరవడి. దే. విద్యార్థులు అక్షరములు కుదురుటకై మేలుబంతిఁజూచి వ్రాసెడు వ్రాత
ఒరసికొనిపోవు. దే. రాచుకొనిపోవు, దోగిపోవు
ఒరిగ. దే. నమస్కారము
ఒరిజె. దే. ఏనుఁగుమెడగొలుసు
ఒరిమ. త. అనుకూల్యము, ఒద్దిక, ఐకమత్యము, మైత్రి
ఒరిమిక. దే. ఒరిమ, వినయము
ఒరుఁడు. త. ఒకరుఁడు, ఇతరుఁడు

ఒరుదల. దే. కొండెకానితనము
ఒరుదలకాఁడు. దే. కొండెకాఁడు
ఒరుము. దే. కలయు
ఒరువుఁడు. దే. అన్యుఁడు, ఒకఁడు
ఒఱ. దే. కత్తిమూఁత, గౌసెన, బావియొఱ
ఒఱకటము. దే. సంకటము, విషయము
ఒఱకము } దే. పల్లము, సంకటము
ఒఱకాటము
ఒఱఁగఁబడు. దే. ఒఱగు
ఒఱగడ్డము. దే. సంకటము, విషయము
ఒఱగు. దే. వంగు, వ్రాలు, ఒఱగుదిండు
ఒఱగుబిల్ల. దే. ఒఱగుదిండు
ఒఱగువోవు. దే. ఒఱగఁబడు
ఒఱగొడ్డెము. దే. మనస్సు నొప్పించెడు వంకరమాట, వఱగొడ్డము
ఒఱటు. దే. దుశ్శీలుఁడు
ఒఱపరి. దే. సౌందర్యవంతుఁడు
ఒఱపిఁడి. దే. అయోగ్యుఁడు
ఒఱపు. దే. సౌందర్యము, ఉపాయము, యోగ్యత, దృఢము, యోగ్యము, నీతి, తాపము
ఒఱపులాఁడి. దే. సౌందర్యవతియైన స్త్రీ
ఒఱపెంకు. దే. బావియొఱ
ఒఱలు. దే. విలపించు, మ్రోఁగు
ఒఱవ. దే. వక్రము, వ్యత్యస్తము, వికృతము
ఒఱవఁబడు. దే. ఒఱగఁబడు
ఒఱవు. దే. ఒఱగు
ఒఱుబీజము. దే.ఒక్కప్రక్కబీజము వాఁచెడి వ్యాధివిశేషము
ఒట్టి. దే. కారమైనది
ఒట్టన. దే. కారము, వేడి
ఒట్టియ } దే. సాధువుకానియూవు,వక్రము
ఒట్టె
ఒజ్జు. దే. గొప్పది, పెద్దది
ఒలయు. దే. వ్యాపించు, కఱుగు, ప్రవేశించు, చుట్టుకొను, కలయు, చేరు
ఒలి. దే. ఒలుపు, దోఁపుడు
ఒలికి. దే. సొదపేర్చెడుచోటు
ఒలిపుచ్చుకొను. దే. బయటఁబడునట్లు చేయు, పోఁగొట్టుకొను
ఒలియు. దే. తోలు ఊడిపోవు
ఒలివడు. దే. దోఁపుడుపోవు
ఒలుకు. దే. చిందు, కాఱు, చల్లు, పోయు
ఒలుకులమిట్ట. దే. శ్మశానము, కాడు
ఒలుచు దే. తోలూడ్చు, అపహరించు
ఒలుపు. దే. ఒలుచుట
ఒలె. దే. ఒల్లె, వస్త్రము, ఉత్తరీయము
ఒల్లఁబాటు. దే. అపేక్షలేమి, ఒల్లమి, అపేక్షింపఁబడనిది
ఒల్లఁబోక. దే అనాదరము, తాపము
ఒల్లఁబోవు. దే. మూర్ఛిల్లువాఁడు, ఆదరింపఁబడనిదగు, చిన్నఁబోవు
ఒల్లగిల్లు దే. ఆదరింపఁబడనిదగు
ఒల్లన. త. తిన్నఁదనము, అల్లన
ఒల్లమి. దే. వలవమి, వలపులేకయుండుట, విరోధము
ఒల్లము. దే. మూర్ఛ
ఒల్లియ } దే. వస్త్రము, ఉత్తరీయము
ఒల్లె
ఒల్లు. దే. ఇష్టపడు, కోరు, ప్రేమించు
ఒల్లెవాటు. దే. ఉత్తరీయమును మెడచుట్టిరా భుజములమీఁద వైచుకొనుట

కల్ల. దే. అసత్యము, తప్పు, మోసము, కరినపుమాట, కంచె
కల్లచ్చు. దే. ఒరగల్లు, మూస
కల్లత. స. చెవుడు, అస్పష్టత
కల్లతనము. దే. చెడ్డనడత, వంచనత్వత ములు
కల్లము. స. చెవుడుగలది
కల్లము. దే. మల్లబంధవిశేషము, పాన్పు
కల్లరి. దే. అసత్యము చెప్పువాఁడు, దుష్టుఁడు, వంచకుఁడు, తప్పు చేసినవాఁడు
కల్లరీఁడు. దే. కల్లరి
కల్లరుజే. దే. మత్స్యవిశేషము
కల్లు. దే. కన్ను, బండికన్ను, ఱాయి
కల్లు. త. మద్యము
కల్లుపెంట. దే. కల్లమ్మెడుచోటు
కల్లువడు. దే. స్తంభించు
కల్లెలుక. దే. పొలములోని ఎలుక
కల్లేడు. దే. పక్షివిశేషము
కల్లేఱు. దే. సెలయేఱు
కల్లోలము. స. పెద్దయల, సంతోషము, దుఃఖము
కల్లోలవతి. స. నది
కల్లోలిని. స. నది
కల్లోలుఁడు. స. శత్రువు
కల్వ. త. కలువ
కల్వము. దే. కలువము
కల్హారము. స. ఇంచుకయెఱుపును దెలుపునుగలిగి, మిక్కిలి పరిమళముగలకలువ
కవ. దే. జేత, యుఁగళము
కవచము. స. బొందలము, తప్పెట
కవట. దే. పెద్దకొమ్మ, లేఁత
కవడె. దే. వాద్యవిశేషము
కవణకాఁడు. దే. మల్లగమనమును దెలిసినవాఁడు
కవణము. త. గుఱ్ఱములకు వేయుసాహారము
కవనము. స. కవిత్వము, నీళ్లు
కవను. దే. గడ్డి
కవయు. దే. కలియు, సంభోగించు
కవలము. స. నోరుపట్టఁదగిన అన్నపుముద్ద
కవలవారు. దే. యమళశిశువులు
కవలితము. స. తినఁబడినది, మ్రింగఁబడినది
కవలు. దే. వేదపారసంకేతము, కుశలవులు, నకుల సహదేవులు
కవలులు. దే. పాచికలు
కవాటము. స. తలుపు
కవి. స. కష్టెము, కవిత్వము చెప్పువాఁడు, పండితుఁడు, శుక్రుఁడు, వాల్మీకి
కవించు. దే. కవియించు, కవియఁజేయు
కవిక. స. కళ్లెము
కవిచేయు. దే. కవియు, వ్యాపించు, సహాగమనముచేయు
కవిత. స. కవిత్వము, కావ్యము
కవిత్వము. స. కవి చెప్పిన పద్యాదికము
కవియు. దే. పర్వు, వ్యాపించు
కవియుదెంచు. దే. కవియు
కవిరి. త. కాఁచు; అనఁగా పోకచెక్కల మడ్డి
కవిల. త. కపిలవర్ణము
కవిలియ. దే. కవిలె
కవిలె. దే. లెక్కవ్రాయు తాటాకులపుస్తకము
కవోష్ణము. స. కొంచెమువేఁడి
కవ్యము. స. పితృదేవతలకీయఁదగిన యన్నము
కవ్యవాహనుఁడు. స. అగ్నిహోత్రుఁడు

కవ్వడి. దే. రెండుచేతుల వడిగలవాఁడు, అర్జునుఁడు
కవ్వపుఁగొండ. దే. మంథాద్రి
కవ్వము. దే. పెరుఁగుఁజిలికెడుసాధనము
కవ్వు. దే. కబళించు, అపహరించు
కశ. స. చేబుకు, కొరడా
కశిపువు. స. అన్నవస్త్రములు, పఱుపు
కశేరుక. స. వెన్నెముక
కశ్మలము. స. మూర్ఛ, మలినము
కశ్యము. స. మద్యము, గుఱ్ఱపునడుము
కషణము. స. ఒరయిక
కషము. స. ఒరగల్లు, సాన
కషాయము. స. ఒగరు, ఔషధరసము, చందనాదులపూఁత, ఎఱ్ఱనిది, వాసన గలది
కషాయిగ. స. నీరుదోమ
కషితము. స. హాని చేయఁబడినది
కషుఁడు. స. సానపెట్టుట మొదలగు పనులచే జీవించెడు నొకనికృష్టపుజాతి వాఁడు
కష్టపడు. దే. దుఃఖపడు, శ్రమపడు
కష్టపాటు. దే. కష్టపడుట
కష్టము. స చెడ్డ, హీనస్థితి, దుఃఖము, బాధ, శ్రమము, పాపము, ప్రయత్నము, అశక్యము, హానికర మగునది, దుఃఖము కలది
కసటు. త. పాపము, మాలిన్యము
కసమస. దే. తొట్రుపాటు
కసరు. దే. చలించు, కోపించు, కోపము, వానగాలి, సిగ్గు, తిట్టు
కసవు. త. గడ్డి, ఇంటిపెంట
కసవుఁగుప్ప. దే. చీపురుతో నూడ్చి చేర్చిన పెంట, గడ్డివామి
కసాయి. దే. కటికవాఁడు
కసి. దే. కోపము, దురద, కోరిక, పచ్చి, లేఁత, అల్పము
కసింద. త. కాసమర్దవృక్షము
కసిడి. దే. అల్పము
కసిమసఁగు. దే. విజృంభించు, ఖండించు, చేఁపు
కసిమసి. దే. తొట్రుపాటు
కసిమిరి. దే. తీఁట
కసీసము. త. నల్లనిది
కసు. దే. లేఁత, పచ్చి
కసుఁగందు. దే లేఁతబిడ్డ, నలుపు
కసుగందు. దే. మిక్కిలి వాడు
కసుగందులు. దే. మిక్కిలి వాడుటలు
కసుగాయ. దే. లేఁతకాయ, కసురు
కసుగు. దే. నలఁగు, పులుము, బాధించు
కసుమాలము. త. మలినము, నీచము
కసురు. దే. లేఁతకాయ
కసెము. త. కషాయము, బురదనేల
కస్తి. దే. దుఃఖము, ఆపద
కస్తురి. త. కస్తూరి
కస్తురిపట్టియలు. దే. పుష్పవిశేషము, ధాన్యవిశేషము
కస్తురిపిల్లి. త. గంధమృగము
కస్తూరి. దే. కుక్కపేరు
కస్తూరి. స. కస్తురి, మృగమదము
కస్సెము త. బురదనేల, కషాయము
కహకహ. దే. యుద్ధమందు శూరునికేక
కహారము. స. ఇంటినడిమి కంబము, నిట్రాడు
కహ్వాము. స. కొంగ
కళ. దే. మూర్ఛ, రెమ్మ, నకారమంతమందు లేనిశబ్దము

**కళ.** స. ముప్పదికాష్ఠలకాలము, చంద్రునిలోపలపదునాఱవభాగము, భాగము, శిల్పము, విద్య, శోభ, స్త్రీరజస్సు, మొదలిసొమ్మువడ్డి

కళత్రము. స. పెండ్లాము, పిఱుఁదు, కోట

కళపెళ. దే. ఉడుకుటయందగు ననుకరణము

కళవరము. దే. మల్లబంధవిశేషము

కళవసము. దే. తోలు

కళవళపడు. దే. కలఁతపడు

కళవళపాటు. దే. కలఁతపాటు, తొట్రుపాటు

కళవళము. దే. కలఁత, తొట్రుపాటు

కళవళించు. దే. కలఁతపడు, తొట్రుపడు

కళాచిక. దే. తమ్మ పడిగము

కళానిధి. స. చంద్రుఁడు

కళాయి. దే. సీలిమంటుకాఁచెడు గంగాళము, ఇత్తడిపాత్రలు మొదలగువానికిఁ బూసెడు తగరపుఁబూఁత

కళావంతుఁడు. స. శిల్పి, నటుఁడు, మోసగాఁడు

కళావతి. స. కళలను దెలిసినయూఁడుది, వేశ్య, తుంబురుని వీణ

కళాసము. దే. తోలు

కళాసించు. దే. అలయు

కళింగ. స. ఆఁడుది

కళింగము. స. ఒకానొకదేశము, ఒకానొకపక్షి

కళుకు. దే. కాంతి, పొడి

కళేబరము. స. శరీరము, పీనుఁగు

కళ్యము. త. కళ్లెము

కళ్ల. దే. శైత్యముచేత గట్టిపడిన యుమ్మి

కళ్లము. త. ధాన్యము నుఱిచెడుచోటు

కళ్లాము. త. కళ్లము

కళ్లెసము. త. కళ్లెము

కళ్లెము. త. గుఱ్ఱమునోటఁ దగిలించి త్రిప్పుసాధనము

## కా

కా. దే. కదా

కా. స. కాకియొక్కధ్వని, కుత్సితమగు

కాంక్ష. స. కోరిక

కాంక్షించు. స. కోరు

కాంక్షితము. స. కోరఁబడినది

కాంచనము. స. బంగారు, ఉమ్మెత్త, సంపెగ

కాంచనము. త. కోవిదారవృక్షము

కాంచనారము. స. కోవిదారవృక్షము

కాంచని. స. పసుపు

కాంచి. స. మొలనూలు, ఒడ్డాణము, ఒకానొక పట్టణము

కాంచికము. స. పులియఁబెట్టినకడుగు

కాంచు. దే. చూచు, పొందు, బిడ్డనుకను, భాగ్యముఁ బొందు

కాంజికము. స. కలి, పులియఁబెట్టినకడుగు

కాండపటము. స. తెఱ

కాండపృష్ఠుఁడు. స. ఆయుధములచే బ్రదుకువాఁడు

కాండము. స. గ్రంథములోని నొకభాగము, సమూహము, ఉదకము, బాణము, ఆకుయొక్కఈనె, కాఁడ, పరిపోఁచే, చెట్టుబోదె, గఱ్ఱము, సమయము, ముండ్లదుబ్బు, దండము, ఏకాంతము

కాండీరుఁడు. స. బాణమునుధరించినవాఁడు

కాండేక్షువు. స. ములుగోలిమిడిచెట్టు

కాండ్రక. దే. ఒకానొక దినుసుగడ్డి

కాండ్రించు. దే. ఉమియుటలోకేనరించు, సకిలించునట్లు శబ్దించు

కాండ్రు. దే. పులికూఁతయొక్కధ్వన్యనుకరణము

కాంత. స. కోరఁదగినయాఁడుది, ఆఁడుది, ప్రేంకణపుఁదీఁగ

కాంతము. స. ఇనుము, ఱాయి, మనోహరము

కాంతలకము. స. నందివృక్షము

కాంతారము. స. అడవి, పోరానిత్రోవ, తెలుపుకలసిన పచ్చిచెఱకు

కాంతాళపడు. దే. ఈర్ష్యపడు

కాంతాళము. దే. ఈర్ష్య, తాలిమిలేమి, కోపము

కాంతి. స. జిగి, శోభ, కోరిక

కాంతుఁడు. స. మగఁడు, చక్కనివాఁడు, ఒప్పిదము గలవాఁడు [వాఁడు

కాందవికుఁడు. స. పిండివంటలు చేయు

కాందిశీకుఁడు. స. భయముచేఁ బాఱెడు వాఁడు

కాంపిల్యము. స. కంపిల్లవృక్షము

కాంబవము. స. శంఖసంబంధము

కాంబవికుఁడు. స. పూసలు మొదలగునవి చేసి యమ్మెడువాఁడు

కాంబళము. స. కంబళిచేతఁ గప్పఁబడినది

కాంబోది. దే. సస్యవిశేషము

కాంభోజము. స. ఒకానొక దేశము, కాంభోజదేశపు గుఱ్ఱము, పొన్నచెట్టు

కాంభోజి. స. ఒకానొకరాగము, కాఱుమినుము

కాంస్యకారుఁడు. స. కంచెరవాఁడు

కాంస్యము. స. కంచు, పానపాత్రము

కాఁక. దే. జ్వరము, తాపము, తపము, కోపము, వేఁడిమి

కాఁకర. త. కారవేల్లము, ఒకానొకతీఁగ

కాఁకరవత్తి. త. బాణసంచువిశేషము

కాఁకవెలుఁగు. దే. సూర్యుఁడు, ఉష్ణరశ్మి

కాఁగు. దే. తపించు. కోపపడు, పెద్దబాన

కాఁగుడు. దే. తపించుట

కాఁచెర. త. కాసరచెట్టు

కాఁచి. త. కాకమాచివృక్షము

కాఁచు. దే. కాఁగఁజేయు, కవిరి

కాఁచుపడియము. దే. కవిరియుండ

కాఁజేయు. దే. సాధించు, అపహరించు, వ్యయము చేయు

కాఁడ. త. కూరాకులోనగువాని కామ, తొడిమ

కాఁడి. దే. పులియఁబెట్టిన కడుగునీరు, బండిలోనగు వాని యుగము

కాఁడిగట్టు. దే. ఒకరొకరి నేలలకుహద్దుగా నేర్పఱచినకట్ట

కాఁడు. దే. ఒకానొక ప్రత్యయము, నాటు

కాఁదారి. దే. అర్ధరాత్రము

కాఁదారిమాఁదారి. దే. అర్ధరాత్రము

కాఁపడము. దే. నొప్పిగలచోట్లవేఁడివస్తువుతోఁగాఁచుట

కాఁపత. దే. కాఁపుది

కాఁపు. దే. కాఁపురము, గృహస్థుఁడు, సేద్యము చేయువాఁడు, శూద్రుఁడు

కాఁపుడు. దే. కాఁచుట

కాఁపురము. దే. నివాసము, సంసారము

కాఁపురించు. దే. కాఁపురముచేయు, వసించు

కాఁబట్టి. దే. కనుక

కాఁబట్టు. దే. కావలసియుండు

కాఁబడు. దే. అగు

కాఁబోలు. దే. ఔనేమో

కాక. దే. ఆశీరాద్యర్థముచు, తప్పయను నర్థమును దెలుపును

కాక. స. కాంచిచెట్టు, కాకిదొండచెట్టు
కాకచించ. స. గురిజేచెట్టు
కాకజంఘ. స. కాకిదొండచెట్టు
కాకజంబుక. స. కాకినేరేడుచెట్టు
కాకతాళీయము. స. కాకివ్రాలంగాం దాటి పండుపడినవిధమువంటిది, హఠాత్తుగా కలిగినది
కాకతిందుకము. స. కాకి తుమ్మికచెట్టు
కాకతుండఫల. స. కాకిదొండచెట్టు
కాకతుండము. స. అగరువు, వాద్యవిశేషము, బాణవిశేషము
కాకదంతపరీక్ష. స. పనికిమాలినపని
కాకనాసికము. స. కాకిదొండచెట్టు
కాకపక్షము. స. పిల్లజుట్టు
కాకపీలుకము. స. కారి తుమ్మికచెట్టు
కాకపుష్టము. స. కోవెల
కాకమల్లి. స. అడవి మల్లెమొక్క
కాకమాచి. స. కాంచిచెట్టు
కాకము. స. కాకి, కాకుల సమూహము, అల్పము
కాకముద్గ. స. కాకిపెసర మొక్క
కాకరుహము. స. నువ్వులు
కాకరూకము. స. పిఱికి
కాకలము. స. కాగితము
కాకలి. స. సూక్ష్మమైన యవ్యక్తమధుర ధ్వని
కాకాంగి. స. కాకిదొండ
కాకాక్షిన్యాయము. స. కాకిచూపువలె రెండుప్రక్కలలో నేప్రక్కకైననొఱగుట
కాకాదు. దే. కాదు
కాకి. త. కాకము, అల్పము
కాకి. స. ఆఁడుకాకి, కాంచిమొక్క
కాకికలువ. త. అల్లిపువ్వు
కాకిచిప్ప. దే నత్తగుల్ల
కాకిచెఱకు. దే. చెఱకువంటితృణవిశేషము
కాకిచెమ్మ. దే. మూర్ఛ
కాకిచోపు. దే. ఆకస్మికపుమృతి
కాకిణి. స. కర్షణమునందు నాల్గవపాలు, ఒకగవ్వ
కాకితీపు. దే. మూర్ఛావిశేషము
కాకితుమ్మికి. దే. నల్లతుమ్మికి
కాకిదొండ. త. అడవిదొండ
కాకిని. స. గవ్వ
కాకిబంగారు. దే. పీతాభ్రకము
కాకిఱెక్కలు. దే. ధాన్యవిశేషము
కాకిఱెల్లు. దే. తృణవిశేషము
కాకిసొమ్మ. త. కాకితీపు, మూర్ఛావిశేషము
కాకు. దే. గాసి, తిరస్కారము, వ్యర్థము, శూన్యము
కాకుండు. స. కాళ్లులేనివాఁడు
కాకుదము. స. దవుడ
కాకుస్నె. దే. నిశ్చయమును దెలుపును
కాకువు. స. శోకభయాదులచేఁ గలిగెడు ధ్వనివికారము [పము
కాకృత్యము. స. అకార్యము, పశ్చాత్తా
కాకేందువు. స. కాకితుమ్మికిచెట్టు
కాకేమి. దే. కాకయేమి
కాకోత్పలము. స. కాకికలువ, అల్లిపువ్వు
కాకోదరము. స. పాము
కాకోదుంబరిక. స. కాకిమేడిచెట్టు
కాకోలము. స. విషభేదము, మాలకాకి
కాకోలుండు. స. కుమ్మరి
కాక్షము. స. ప్రక్కచూపు, కోపదృష్టి
కాక్షి. స. తొగరిచెట్టు, ఒకపరిమళద్రవ్యము

కాగడా. దే. చేతిదివ్వటి
కాగితము. త. కాకలము,పటనిర్మితపత్రము
కాచకారుఁడు. స. గాజుపనివాఁడు
కాచనకము. స. కాగితములను కట్టగాకట్టు దారము, లేక నాడా
కాచము. స. గాజుప్పు, గాజుపూస, కావడి, యుట్టి
కాచస్థాలి. స. కలిగొట్టుచెట్టు
కాచికోలు. దే. రక్షణము
కాచితము. స. ఉట్టియందుంచఁబడినది
కాచు. దే. కాయకాచు, ఎండకాయు, రక్షించు, ఎదురుచూచు, సహించు, కావలియుండు
కాజి. దే. ఒకానొకచెట్టు
కాటకము. దే. కఱవు
కాటా. దే. గొప్పబరువులను తూఁచుట కుపయోగించు త్రాసు [ముండువాఁడు
కాటికాఁపరి. దే. శ్మశానమందుఁ గాఁపుర
కాటిగాఁడు. దే. పక్షివిశేషము
కాటిపాపఁడు. దే. గొల్లవాఁడు
కాటిపాపలవాండ్రు. దే. హస్తలాఘవము చేయు ఆటవికజనులు
కాటిఱేఁడు. దే. శివుఁడు
కాటు. దే. కఱచుట, కఱచిన గాయము, మాఁడి యడుగంటుట
కాటుక. దే. అంజనము
కాటుకకొండ. దే. అంజనపర్వతము
కాటుకపట్టు. దే. నలుపుపాటు
కాటుకపిట్ట. దే. ఖంజరీటము
కాటుకఱాయి. దే. సౌవీరాంజనము
కాటులాడు. దే. కలహించు
కాటువోవు. దే. మాఁడియడుగంటు

కాట్రగడ. దే. కంపకోట, ఊరిచుట్టు వేయఁబడు కంచె
కాట్రేఁడు. దే. శివుఁడు
కాఠము. స. ఱాయి
కాడారంబము. దే. మెట్టవ్యవసాయము
కాడు. త. శ్మశానము, అడవి, నాశము
కాడుచేయు. త. నాశముచేయు
కాడుపడు. త. కలఁతపడు, కనఁబడకపోవు, నష్టమగు
కాడ్పడు. త. కాడుపడు
కాణము. దే. గుఱ్ఱపుమేఁత
కాణము. స కాకి
కాణయాచి
కాణాచి } దే. చిరకాలవాసస్థానము
కాణాదము. స. కణాదఋషిచే రచియింపఁ బడిన న్యాయశాస్త్రము
కాణుఁడు. స. ఒంటికంటివాఁడు
కాత. దే. తద్ధర్మార్థక క్రియలకు ఆశీరర్థము నందు వచ్చు ప్రత్యయము
కాతరుఁడు. స. భయశీలుఁడు
కాతర్యము. స. భయము, పిఱికితనము
కాతాళము. దే. కోపము
కాత్యాయని. స. పార్వతి, సగమువయస్సు చెల్లి యెఱ్ఱచీరఁ గట్టిన విధవ
కాథికుఁడు. స. కథలను జెప్పువాఁడు, లేక వ్రాయువాఁడు
కాదంబము. స. ధూమ్రవర్ణములైనముక్కు కాళ్లు ఱెక్కలుగల హంస, బాణము
కాదంబరి. స. మద్యము, ఒకానొకకావ్యము, ఆఁడుకోయిల, సరస్వతి, మదజలము
కాదంబిని. స. మేఘపంక్తి
కాదాచిత్కము. స. ఒకానొకప్పుడుకలుగునది

కాదే. దే. కదా
కాద్రవేయుఁడు. స కద్రువకొడుకు,పాము
కాన. దే. కనుక
కాన. త. అడవి
కానఁబట్టు. దే. కనఁబడు
కానకము. స. బంగారుతోఁ జేయఁబడినది
కాననము. స. అడవి, ఇల్లు
కాననివాఁడు. దే అంధుఁడు
కాని. దే. వికల్పమును దెలియఁజేయును
కాని. దే. అంగీకారమును దెలుపును
కాని. త. మూఁడుదమ్మిడీలు
కానిక. దే. కానుక
కానిపించు. దే. ప్రత్యక్షమగు, కనఁజేయు
కానీనుఁడు. స. కన్యకకొడుకు, వ్యాసుఁడు, కర్ణుఁడు
కాను. దే. నీళ్లుకలియని మజ్జిగ
కానుక. దే. కానిక, రాజదర్శనార్థము తెచ్చిన ద్రవ్యము
కానుగు. దే. ఒకానొకచెట్టు
కానుపు. దే. ప్రసవము, వీక్షణము
కాన్క. దే. కానుక
కాన్పించు } దే. కన్పట్టు, అగపడుచు
కానిపించు }
కాపంతము. దే. కుక్కను గట్టెడికొయ్య
కాపటికము. స. కపటముకలది
కాపటికుఁడు. స. కపటముగలవాఁడు, మోసము చేయువాఁడు, స్తోత్రము చేయువాఁడు, విద్యార్థి
కాపట్యము. స. కపటము
కాపథము. స. కుచ్ఛితపుత్రోవ, నీటి వట్టి వేరు

కాపరి. దే. రక్షకుఁడు
కాపాడు. దే. రక్షించు
కాపాలికత్వము. స. క్రౌర్యము
కాపాలికుఁడు. స. ఒకశైవ మతస్థుఁడు, మనుష్య పుఱ్ఱెలను దండగా వేసికొని తిరుగువాఁడు
కాపికము. స. కోఁతివంటిది
కాపిలము స. సాంఖ్యశాస్త్రము
కాపిశము } స. కల్లు
కాపిశాయనము }
కాపిశేయము. స. పిశాచము
కాపు. దే. కాయలుకాచుట, రక్షించుట
కాపుగడ. దే. రక్షణము
కాపురుషుఁడు. స. కుత్సితపురుషుఁడు
కాపేయము. దే. కృపణత, లోభితనము
కాపేయము. స. కపిస్వభావము, కోఁతిచేష్ట
కాపోతము. స. కపోతముల సమూహము
కాప్యకారము. స. మనస్సునఁబాపముంచి మాటాడుట, చేసినపాపమును ఒప్పుకొనుట
కాప్యకారుఁడు. స. పశ్చాత్తాపముగలవాఁడు
కామ. దే. తామర లోనగువానికాఁడ, గొడుగు లోనగువానిదండము, మగగుఱి, కనుమొన
కామంచి. త. కామంచిగడ్డి
కామంజిక. స. కామంచిగడ్డి
కామకూటము. స. వేశ్యాస్నేహము
కామకృతము. స. మనఃస్ఫూర్తిగా చేసినపని
కామకేళి. స. సురతము
కామదేవుఁడు. స. మన్మథుఁడు

కామధేనువు. స. కోరినవస్తువులిచ్చెడు వేల్పుటావు
కామన. స. ఇచ్ఛ
కామనము. స. ఇచ్ఛగలది, చెక్కనిది, అశోకవృక్షము, కోరిక
కామనుఁడు. స. ఇచ్ఛగలవాఁడు, చక్కని వాఁడు
కామపాలుఁడు. స. బలరాముఁడు
కామభోగము. స. సంభోగము
కామము. స. ఇచ్ఛ, కోరిక, రేతస్సు, మోహము, ఇచ్ఛవచ్చినట్లు, ప్రేమ, సంభోగేచ్ఛ
కామయిత. స. కాముకుఁడు
కామరూపి. స. తనకిష్టమువచ్చినరూపమును పొందువాఁడు
కామలము. స. మరుభూమి, పైత్యరోగము, విషయేచ్ఛగలది, వసంతఋతువు
కామలుఁడు. స. కాముకుఁడు
కామవాదము. స. ఇష్టమువచ్చినట్లుమాటాడుట
కామశాస్త్రము. స. రతిశాస్త్రము
కామాంకుశము. స. గోరు, కామమును వృద్ధిపఱచు మందు
కామాంగము. స. మామిడిచెట్టు
కామాటము. త. మోటపని
కామాటి. త. మోటపనిచేయువాఁడు
కామాల. త. రోగవిశేషము
కామాలి. స. కామాలరోగము గలవాఁడు
కామి. స. కాముకుఁడు, పావురము, ఇచ్ఛ
కామికము. స. కోరఁబడినది, కోరిక
కామిని. స. ఆఁడుది, ఆఁడుపావురము
కాముఁడు. స. మన్మథుఁడు
కాముకము. స. ఇచ్ఛగలది
కాముకి. స. కామముగల ఆఁడుది
కాముకుఁడు. స. ఇచ్ఛగలవాఁడు
కామ్య. స. కోరిక, ప్రార్థన
కామ్యము. స. కోరఁదగినది, మనోహరమైనది
కాయ. దే. చెట్టునఁగాచెడు కాయ, చేతులయందుఁ గాచెడుకాయ, నేత్రరోగ విశేషము, వీణసొరకాయ, జూదము నందలిపాచిక, కందులు లోనగువాని పైతోలు
కాయకంటి. దే. కుబేరుఁడు
కాయకన్ను. దే. కాయకాచినకన్ను
కాయకము. దే. జీవనము
కాయజలము. స. మూత్రము
కాయజుఁడు. స. మన్మథుఁడు
కాయదండము. స. శరీరమును స్వాధీనము చేసికొనుట
కాయధాన్యములు. దే. పెసలు, కందులు మొదలగునవి
కాయమానము. స. పందిరి, గడ్డిగుడిసె
కాయము. దే. బాలెంతకిచ్చెడు మందు
కాయము. స. శరీరము, సమూహము
కాయస్థ. స. ఉసిరికచెట్టు, కరకచెట్టు
కాయస్థుఁడు. స. కరణమువాఁడు, పరమాత్మ
కాయక } కాయిక } దే. నానాఁటివడ్డి, శరీరసంబంధమైనది
కాయు. త. ఎండ, వెన్నెల, ప్రకాశించు
కాయువు } కాయ్వు } దే. అనురాగము
కార. స. చెరసాల, దూతిక
కారండవము. స. ఒకానొకపక్షి

కారంధమి. స. కంచుపనివాఁడు
కారంభ. స. ప్రేంకణపుతీఁగ
కారకము. స. చేయునది
కారకము. దే. కాఁక, వేఁడి
కారగ్గి. త. దావానలము
కారడుగు. త. రెండవకారు, అల్పధాన్యము
కారణ. స. యాతన
కారణము. స. హేతువు, పనిముట్టు, ఉద్దేశము, సాధనము, పని, వధము, తండ్రి
కారణికుఁడు. స. పరీక్షకుఁడు
కారపుఁజెక్క. త. ద్రాక్షత్వక్కు
కారపుఁబడుగు. దే. గట్టినూలిపడుగు
కారము. త. షడ్రసములలో నొకటి, కటువు, చేవుడు, బిడ్డలకుఁ బోసెడు మందు
కారము. స. కష్టము, యత్నము, నిశ్చయము, వధము
కారయిత. స. చేయించువాఁడు
కారవము. స. కాకి
కారవి. స. ఇంగువమ్రాను, నల్లజీలకఱ్ఱ
కారవేల్లము. స. కాఁకరతీఁగ
కారాకు. దే. పండుటాకు
కారాకూలము. దే. కలఁగినది
కారాగృహము. స. చెఱసాల
కారాట. దే. వ్యాపనము
కారించు. స. బాధించు
కారిక. స. సూత్రాదివివరణశ్లోకము, యాతన
కారికము. దే. చేలువచేయనిక్రొత్తవస్త్రము
కారిజేము. త. కడుపులో నీరుతిత్తిక్రింద నుండెడు మాంసఖండ విశేషము

కారిత. స. అప్పు తీసికొన్నవాఁడు తన యక్కఱకొలఁదిని తానుగా నేర్పఱచుకొన్నవడ్డి, ఒడఁబాటువడ్డి
కారీషము. స. కరీషముల (పిఱుపిడకల) సమూహము
కారు. దే. అడవి,ఎండకాలమందుఁ జల్లెడు వరిధాన్యము, ముదిమి, నసచేవుఁడు
కారు. త. కాలము, వర్షాకాలము, జ్యేష్ఠ మాసము మొదలు నాలుగేసి నెలల కాలము, నలుపు
కారుకొను. దే. కల్లఁబాఱు
కారుకొమ్మమెకము. దే. దుప్పి
కారుకొఱ్ఱి } త. కాకోలివృక్షము
కారుకొల్లి }
కారుకోడి. దే. అడవికోడి
కారుచిచ్చు. దే. దావానలము
కారుచు } దే. కారించు, కాఱఁజేయు
కార్చు }
కారుణికుఁడు. స. కనికరముగలవాఁడు
కారుణ్యము. స. దయ, కనికరము
కారునూవు. దే. జెర్రిలపు మొక్క
కారుపెసర. దే. ముద్గపర్ణిమొక్క
కారుపోఁక. దే. శైలపూగము
కారుపోతు. దే. అడవిదున్న
కారుబుడమ. దే. తీవ్రగంధపుమొక్క
కారుమునగ. దే. వనశిగ్రువృక్షము
కారువు. స. విశ్వకర్మ, శిల్పి, చేయువాఁడు
కారూరు. దే. అడవిపల్లె
కారె. త. క్షారతృణము
కారెము. దే. మళ్లకునీళ్లుతోడెడు తాటి దోనె
కారేలకి. దే. ఏలాపర్ణి మొక్క
కారోత్తమము. స. కల్లుతేట

కార్కరకము. స. పాలసురుగు
కార్కశ్యము. స. కఠినత్వము, కాఠిన్యము
కార్కొను. దే. నల్లబాఱు, సందడించు
కార్చిచ్చు. దే. కారుచిచ్చు
కార్ణము. స. చెవిలోని గులిమి, పోగులు
కార్తయుగము. స. కృతయుగసంబంధ మైనవి
కార్తస్వరము. స. బంగారము
కార్తాంతికుడు. స. జ్యోస్యుడు
కార్తికము }
కార్తికికము } స. ఒకానొక నెల
కార్తికేయుడు. స. కుమారస్వామి
కార్తె. త. కృత్తికానక్షత్రము, సూర్యుడుండు నక్షత్రము
కార్పటికుడు. స. కోమటి, తీర్థము మోసికొనిపోయెడి బాటసారి
కార్పణ్యము. స. కృపణత్వము, లోభిత నము, దారిద్ర్యము, దుస్థితి, జాలి
కార్పాసము. స. నూలిబట్ట, ప్రత్తి
కార్పాసి. స. ప్రత్తిచెట్టు
కార్పాసికము. స. దూదితో చేయబడినది
కార్మణము. స. మూలికచేత జేసెడి యుచ్చాటనాదిక్రియ, చిల్లింగి, నేఱవేఱు దాఁకఁ బనిచేయునది
కార్మికము. స. పనిగలది
కార్ముడు. స. కర్మశీలుడు [నేర్పరి
కార్ముకము. స. విల్లు, వెదురు, పనియందు
కార్యదర్శి. స. పని నిర్వహించువాడు
కార్యము. స. పని, హేతువు, సంగతి, విధాయకకృత్యము, మతసంబంధమగు కర్మము, అవసరము, వివాదము, వ్యాజ్యము, ఫలము
కార్శ్యము. స. చిక్కుట, కృశించుట
కార్ష్ణము. స. కృష్ణసంబంధమైనవి
కార్ష్ణ్యము. స. నలుపు
కార్షాపణము }
కార్షికము } స. కర్షమెత్తు వెండిచే చేయఁబడిన టంకము
కార్ష్యుడు. స. దున్నుకొని బ్రదుకువాఁడు
కార్ష్యము. స. మద్దిచెట్టు
కాఱియ. త. యాతన, బాధ
కాఱియపడు. త. యాతనపడు
కాఱియపెట్టు. త. యాతనపఱచు
కాఱు. దే. స్రవించు, రాలు, అజ్ఞానము కట్టు, అగసాలెవాని పనిముట్టు, పరుష వచనము, దట్టము, వ్యర్థవచనము
కాఱుకొను. దే. సందడించు
కాఱులు. దే. అనృతవచనములు
కాఱొడ్డెము. దే. పరుషవచనము
కాల. స. నల్లజీలకఱ్ఱ, నీలిచెట్టు
కాలకంఠము. స. నెమలి, ఊరబిచ్చుక, కాటుకపిట్ట
కాలకంఠిక. స. పెద్దమ్మ
కాలకంఠుడు. స. శివుడు, యముడు
కాలకము. స. పుట్టుమచ్చ
కాలకూటము. స. విషభేదము
కాలక్రయము. స. అప్పటిధర
కాలక్షేపము. స. కాలమును గడపుట
కాలఖండము. స. కడుపులోనీరు తిత్తిక్రిందనుండెడు మాంసఖండవిశేషము
కాలజ్ఞము. స. కోడి, కోవెల
కాలజ్ఞాని. స. కోడి

కారంధమి. స. కంచుపనివాఁడు
కారంభ. స ప్రేంకణపుతీఁగ
కారకము. స. చేయునది
కారకము. దే. కాఁక, వేఁడి
కారగ్గి. త. దావానలము
కారడుగు. త. రెండవకారు, అల్పధాన్యము
కారణ. స. యాతన
కారణము. స. హేతువు, పనిముట్టు, ఉద్దేశము, సాధనము, పని, వధము, తండ్రి
కారణికుఁడు. స. పరీక్షకుఁడు
కారపుఁజెక్క. త. ద్రాక్షత్వక్కు
కారపుఁబడుగు. దే. గట్టినూలిపడుగు
కారము. త. షడ్రసములలో నొకటి, కటువు, చేవుడు, బిడ్డలకుఁ బోసెడు మందు
కారము. స. కప్పము, యత్నము, నిశ్చయము, వధము
కారయిత. స. చేయించువాఁడు
కారవము. స కాకి
కారవి. స. ఇంగువమ్రాను, నల్లజీలకఱ్ఱ
కారవేల్లము. స. కాఁకరతీఁగ
కారాకు. దే. పండుటాకు
కారాకూలము. దే. కలఁగినది
కారాగృహము. స. చెఱసాల
కారాట. దే. వ్యాపనము
కారించు. స. బాధించు
కారిక. స. సూత్రాదివివరణశ్లోకము, యాతన
కారికము. దే. చేలువచేయనిక్రొత్తవస్త్రము
కారిజెము. త. కడుపులో నీరుతిత్తిక్రింద నుండెడు మాంసఖండ విశేషము

కారిత. స. అప్పు తీసికొన్నవాఁడు తన యక్కఱకోలఁదిని తానుగా నేర్పఱచు కొన్నవడ్డి, ఒడఁబాటువడ్డి
కారీషము. స. కరీషముల (పిడుకల) సమూహము
కారు. దే. అడవి,ఎండకాలమందుఁ జల్లెడు వరిధాన్యము, ముదిమి, నసచేవుఁడు
కారు. త. కాలము, వర్షాకాలము, జ్యేష్ఠ మాసము మొదలు నాలుగేసి నెలల కాలము, నలుపు
కారుకొను. దే. కల్లఁబాఱు
కారుకొమ్ముమెకము. దే. దుప్పి
కారుకొఱ్ఱి } త. కాకోలివృక్షము
కారుకొల్లి }
కారుకోడి. దే. అడవికోడి
కారుచిచ్చు. దే. దావానలము
కారుచు } దే. కారించు, కాఱఁజేయు
కార్చు }
కారుణికుఁడు. స. కనికరముగలవాఁడు
కారుణ్యము. స. దయ, కనికరము
కారునూవు. దే. జెర్తిలపు మొక్క
కారు పెసర. దే. ముద్గపర్ణి మొక్క
కారుపోఁక. దే. శైలపూగము
కారుపోతు. దే. అడవిదున్న
కారుబుడమ. దే. తీవ్రగంధపుమొక్క
కారుమునగ. దే. వనశిగ్రువృక్షము
కారువు. స. విశ్వకర్మ, శిల్పి, చేయువాఁడు
కారూరు. దే. అడవిపల్లె
కారె. త. క్షారతృణము
కారెము. దే. మళ్లకునీళ్లుతోడెడు తాటిదోనె
కారేలకి. దే. ఏలాపర్ణి మొక్క
కారోత్తమము. స. కల్లుతేట

కార్కరకము. స. పాలసురుఁగు
కార్కశ్యము. స. కఱకుదనము, కాఠిన్యము
కార్కొను. దే. నల్లఁబాఱు, సందడించు
కార్చిచ్చు. దే. కారుచిచ్చు
కార్ణము. స. చెవిలోని గులిమి, పోఁగులు
కార్తయుగము. స. కృతయుగసంబంధమైనవి
కార్తస్వరము. స. బంగారము
కార్తాంతికుఁడు. స. జ్యోస్యుఁడు
కార్తికము } స. ఒకానొక నెల
కార్తికికము }
కార్తికేయుఁడు. స. కుమారస్వామి
కార్తె. త. కృత్తికానక్షత్రము, సూర్యుఁడుండు నక్షత్రము
కార్పటికుఁడు. స. కోమటి, తీర్థము మోసికొనిపోయెడి బాటసారి
కార్పణ్యము. స. కృపణత్వము, లోభితనము, దారిద్ర్యము, దుస్థితి, జాలి
కార్పాసము. స. నూలిబట్ట, ప్రత్తి
కార్పాసి. స. ప్రత్తిచెట్టు
కార్పాసికము. స. దూదితో చేయఁబడినది
కార్మణము. స. మూలికచేతఁ జేసెడి యుచ్చాటనాదిక్రియ, చిల్లింగి, నెఱవేఱు దాఁకఁ బనిచేయునది
కార్మికము. స. పనిగలది
కార్ముఁడు. స. కర్మశీలుఁడు [నేర్పరి
కార్ముకము. స. విల్లు, వెదురు, పనియందు
కార్యదర్శి. స. పని నిర్వహించువాఁడు
కార్యము. స. పని, హేతువు, సంగతి, విధాయకకృత్యము, మతసంబంధమగు కర్మము, అవసరము, వివాదము, వ్యాజ్యము, ఫలము

కార్శ్యము. స. చిక్కుట, కృశించుట
కార్ష్ణము. స. కృష్ణసంబంధమైనవి
కార్ష్ణ్యము. స. నలుపు
కార్షాపణము } స. కర్షమెత్తు వెండిచేత చేయఁబడిన టంకము
కార్షికము }
కార్షుఁడు. స. దున్నుకొని బ్రదుకువాఁడు
కార్ష్యము. స. మద్దిచెట్టు
కాఱియ. త. యాతన, బాధ
కాఱియపడు. త. యాతనపడు
కాఱియపెట్టు. త. యాతనపఱచు
కాఱు. దే. స్రవించు, రాలు, అజ్ఞానము, కట్టు, అగసాలెవాని పనిముట్టు, పరుషవచనము, దట్టము, వ్యర్థవచనము
కాఱుకొను. దే. సందడించు
కాఱులు. దే. అనృతవచనములు
కాఱొడ్డెము. దే. పరుషవచనము
కాల. స. నల్లజీలకఱ్ఱ, నీలిచెట్టు
కాలకంఠము. స. నెమలి, ఊరఁబిచ్చుక, కాటుకపిట్ట
కాలకంఠిక. స. పెద్దమ్మ
కాలకంఠుఁడు. స. శివుఁడు, యముఁడు
కాలకము. స. పుట్టుమచ్చ
కాలకూటము. స. విషభేదము
కాలక్రయము. స. అప్పటిధర
కాలక్షేపము. స. కాలమును గడపుట
కాలఖండము. స. కడుపులోనీరు తిత్తిక్రిందనుండెడు మాంసఖండవిశేషము
కాలజ్ఞము. స. కోడి, కోవెల
కాలజ్ఞాని. స. కోడి

కాలజ్ఞుఁడు. స. జ్యోత్స్యుఁడు
కాలధర్మము. స. చావు
కాలపత్రి. స. గచ్చ మొక్క
కాలపాశికుఁడు. స. ఉరితీయువాఁడు
కాలపృష్ఠము. స. కర్ణునివిల్లు, విల్లు, రాపులుఁగుపక్షి
కాలప్రవృత్తి. స. విరేచనము
కాలమిత్తి. దే. కాలమృత్యువు
కాలము. స. సమయము, నలుపు, చావు, నల్లనిది, దురదృష్టము
కాలమేషి. స. కారుగచ్చమొక్క
కాలమేషిక. స. నల్లతెగడ
కాలయాపనము. స. ప్రొద్దు పుచ్చుట, ఆలస్యము
కాలరి. దే. పదాతి, దూత, నడచేవాఁడిచ్చేడుపన్ను
కాలవహ్ని. స. ప్రళయకాలమందలియగ్ని
కాలశాకము. స. కటివేపచెట్టు
కాలశేయము. స. గోరసము, చల్ల
కాలసూత్రము. స. ఇనుపతంతులుగల నరకవిశేషము
కాలస్కంధము. స. చీకటిమ్రాను
కాలస్థాలి. స. కలిగొట్టుచెట్టు
కాలాంతకుఁడు. స. శివుఁడు
కాలానుసార్యము. స. ఇరుగుడుచెట్టు
కాలాయసము. స. ఇనుము
కాలావసానము. స. మరణము, కాలముమొక్కతుద
కాలిక. స. పార్వతి, ద్రౌపది, బొగ్గు, నలుపు, చీఁకటి, ఆఁడుకాకి, మద్యము, నెలపడ్డి, తేలుకొండి, పొగగుమి
కాలికము. స. కాలసంబంధమైనది
కాలిత్రోవ. దే. ఒకఁడునడచిపోఁదగిన మార్గము
కాలినడ. దే. పాదచారము
కాలిపుట్టువు. దే. శూద్రుఁడు
కాలిబంటు. దే. పదాతి
కాలిబోను. దే. మృగములనుబట్టు యంత్రము
కాలిమ. స. నలుపు
కాలియ. త. పిశాచము
కాలియము. స. కాలసంబంధమగునది, కలియుగము
కాలీచి. స. న్యాయవిచారణస్థలము
కాలీనము. స. ఒకనిర్ణీతకాలమునకు సంబంధించినది
కాలీయము స. కాలసంబంధమైనది
కాలు. దే. దగ్ధమగు, పాదము, పాతిక, మంచపుఁగోడు మొదలైనది
కాలుఁడు. స. యముఁడు, శివుఁడు, శనైశ్చరుఁడు
కాలుకొను } దే. కాలూఁదు
కాల్కొను }
కాలుచు } దే. దహించు
కాల్చు }
కాదివి యు. దే. కాగడా
కాలుద్రవ్వు. దే. కారణములేకయే పోట్లాటకు యత్నించు
కాలుద్రొక్కు } దే. కదియు
కాల్ద్రొక్కు }
కాలుబలము. దే. పదాతిసేన
కాలుమడి. దే. మూత్రము
కాలుమడుచు } దే. మూత్రవిసర్జనము చేయు
కాల్మడుచు }
కాలుమానిసి. దే. పదాతి
కాలువ. దే. నీళ్లుపాఱుటకుఁ ద్రవ్విన మార్గము, పరంపర

కాలుష్యము. స. కలంక
కాలేయకము. స. మ్రానిపసుపు, రోగ భేదము
కాలేయము. స. కాలఖండము, కలియుగ సంబంధమగునది
కాలేయులు. స. కాలకేయు లనెడురాక్షసులు
కాల్ద్రివ్వ. దే. కాలుద్రవ్వ
కాల్నడ. దే. కాలినడ
కాల్పనికము. స. కల్పింపఁబడినది, నిజేము గాలేనిది
కాల్మడి. దే. కాలుమడి
కాల్యకము. స. కచోరము
కాల్యము. స. వేకువ, కచోరము, కాలము నందు యోగ్యమైనది
కాల్యాణకము. స. మంగళప్రదమైనది
కాల్వ. దే. కాలువ
కాల్వురు. దే. పదాతి
కావచికము. స. కవచముఁ దొడిగిన వారి సమూహము
కావటి. స. కావడి
కావడి. త. నీళ్లు మొదలైనవి మోసికొని వచ్చుటకై రెండుకొనలయందును ఉట్లమర్చిన వెదురుబద్ద
కావడించు. త. కావడియందెత్తు
కావరము. దే. క్రొవ్వు, మదము
కావరి. దే. ధూర్తుఁడు
కావరించు. దే. మదించు
కావరుఁడు. దే దుర్మదుఁడు
కావలము. దే. పాపము [అపేక్ష్యమగు
కావలయు. దే. అగుట యావశ్యకమగు,
కావలి. దే. రక్షణము
కావలికాఁడు. దే. రక్షకుఁడు
కావా. దే. అశ్వమండలగతి
కావాడి. స. మొగలాయు లోనగువానితో నేర్పఱుపఁబడిన గొడుగు
కావి. దే. ఎఱుపు, కాషాయవస్త్రము
కావించు. దే. కాఁజేయు
కావిగొను. దే. ఎఱ్ఱనగు
కావితాలుపు. దే. సన్న్యాసి
కావిరి. దే. నలుపు
కావిరిబొట్టు } దే. బిడ్డలకురక్షగానుంచెడు
కావిలిబొట్టు } నల్లని తిలకము
కావిజాయి. దే. ఎఱ్ఱని సుద్దజాయి
కావు. దే. పిడ్చుట లోనగువానియందగు ననుకరణము, కావిరిబొట్టు, పాంతఱ లోనగువాని పైకప్పు
కావుట. దే. అగుట
కావుత. త. కాత
కావున. దే. కనుక
కావులు. దే. కాషాయవస్త్రము
కావేరి. స. ఒకానొకయేఱు, పసుపు, వెలయాలు
కావేషము. గ్రా. ఓర్వలేమి, విరోధము
కావ్యము స. కబ్బము, సౌఖ్యము, క్షేమము
కావ్యుఁడు. స. శుక్రుఁడు
కాశము. స. ఱెల్లు
కాశి. స. ఒకానొకపట్టణము, శ్రమము
కాశ్మరి } స. గుమ్ముడుచెట్టు
కాశ్మర్యము }
కాశ్మీరజన్మము. స. కుంకుమపువ్వు
కాశ్మీరము. స. ఒకానొకదేశము, కుంకుమ పువ్వు, మెట్టతామరదుంప
కాశ్యపి. స. భూమి, అనూరుఁడు
కాషాయము. స. కావిచీర

కాష్ఠ. స. పదునెనిమిది రెప్పపాట్లకాలము, దిక్కు, మేర, ప్రానిపసుపు
కాష్ఠతక్షుఁడు. స. వడ్లవాఁడు
కాష్ఠము. స. కట్టె
కాష్ఠికుఁడు. స. కట్టెలు మోయువాఁడు
కాష్ఠీల. త. అరఁటిచెట్టు
కాస. త. కాసె, దట్టి
కాసమర్దము. స. కసిందచెట్టు
కాసము. స. దగ్గు
కాసర. త. ఒకానొకచెట్టు
కాసరము. స. దున్నపోతు
కాసరవడ్లు. దే. శాలిధాన్యవిశేషము
కాసా. దే దాసీపుత్త్రుఁడు
కాసారము. స. సరస్సు
కాసించు. త. కాసెగాఁగట్టు
కాసిక. స. దగ్గు
కాసియ. త. కాసె
కాసీఁడు. దే. తాతిపనివాఁడు
కాసీసము. స. మయిలుతుత్తము
కాసు. త. ధనము, దమ్మిడీలో సగము
కాసె. దే. తాయితొలుచుపని
కాసె. త. దట్టి, కాసెకోక
కాసెనిల్కడ. దే. మల్లబంధవిశేషము
కాసెయులి. దే. తాయితొలిచెడునులి
కాసెపోయు. దే. వస్త్రపు చెంగును గోఁచి వలె వెనుకకుఁ బెట్టుకొను
కాహళ. స. వాద్యవిశేషము
కాహళము. స కోడె, సద్దు, చెడ్డది, ఎండినది
కాహళి } స. వాద్యవిశేషము
కాహళిక } స. వాద్యవిశేషము
కాహళికుఁడు. స. కాహళియూఁదువాఁడు
కాళంజి. త. తమ్మపడిగము
కాళయుక్తి. స. ఒకసంవత్సరము
కాళరాత్రి. స. ప్రళయకాలమందలి గొప్పరాత్రి
కాళి. స. పార్వతి, బొగ్గు, రాత్రి
కాళింగము. స. ఏనుఁగు
కాళింగి. స. పుచ్చచెట్టు
కాళింది. స. యమునానది
కాళిందీభేదనుఁడు. స. బలరాముఁడు
కాళిక. స. పార్వతీదేవి, కాలిక
కాళియ } త. వాద్యవిశేషము
కాళె } త. వాద్యవిశేషము
కాళీయుఁడు. స. సర్పవిశేషము

## కి

కి. దే. షష్ఠివిభక్తియందువచ్చెడు ప్రత్యయము
కింక. దే. కోపము, పశువులకు వచ్చెడు రోగవిశేషము
కింకరుఁడు. స. పరిచారకుఁడు, బంటు
కింకర్తవ్యతామూఢుఁడు. స. ఏమిచేయుటకును తోఁచేనివాఁడు, కలవరపడిన వాఁడు
కింకిణి. స. గజ్జె, చిఱుగంట
కింకిరాటము } స. కోయిల, చిలుక
కింకిరాతము } స. కోయిల, చిలుక
కింకిరాటుఁడు } స. మన్మథుఁడు
కింకిరాతుఁడు } స. మన్మథుఁడు
కింకిరి. దే. కోపము, రోఁత
కింకిరిపడు. దే. కోపగిల్లు, రోఁతపడు
కింకిరిపాటు. దే. కోపపడుట, రోఁతపడుట
కింకుర్వాణుఁడు. స. సేవకుఁడు, ఏమి చేయుదునని విచారించువాఁడు

కింక్షణుఁడు. స. సోమరి
కింగాణి. దే. కొఱగానిది, పని
కింగిరి. దే. అల్పము
కించ. దే. వ్యాకులము, దుఃఖము
కించిజ్ఞుఁడు. స. కొంత తెలిసినవాఁడు
కించిత్తు. స. కొంచెము
కించులికము. స. ఎఱ్ఱ, మహీలత
కించేలుకము. స. మీఁదిగాలి
కించే. త. అల్పుఁడు
కింజల్కము. స. తామరపువ్వులోని కేసరములు
కింజుఁడు స. నిరర్థకజన్మముకలవాఁడు
కింపచానుఁడు. స. లోభి
కింపాకము. స. కాంజీరవృక్షము
కింపాకుఁడు. స. నిరర్థకుఁడు, మూఢుఁడు
కింపురుషము. స. భారతాదివర్షములలో నొకటి
కింపురుషుఁడు. స. అశ్వముఖమును నరశరీరమును గల దేవవిశేషము, చెడ్డమనుష్యుఁడు, నీచుఁడు
కింప్రభువు. స. చెడ్డరాజు
కింవదంతి. స జనులాడుకొనుమాట, నానుడి
కింవరాటకుఁడు. స. లక్ష్యములేక ధనవ్యయము చేయువాఁడు
కింశారువు. స. బాణము, వరిముల్లు
కింశుక. స. బాణము, వరిముల్లు
కింశుక. స. మానేరుచెట్టు
కింశుకము. స. మోదుగుచెట్టు
కింసఖుఁడు. స. చెడ్డస్నేహితుఁడు
కింస్తుఘ్నము. స. బవాదికరణములలో నొకటి
కికకిక }
కికాకిక } దే. నవ్వుటయందగు ధ్వన్యనుకరణము

కికి }
కికీదివి } స. పాలపిట్ట
కిచురించు. దే. వంచించు
కిచురింత }
కిచుర } దే. మోసము, వంచన
కిచురువెట్టు }
కిచురువాడుచు } దే. మోసము చేయు
కిక్కస. దే. తృణవిశేషము
కిక్కురించు. దే. కిచురించు
కిక్కురింత }
కిక్కురు } దే. కిచురు
కిక్కురువెట్టు. దే. కిచురువెట్టు
కిక్కెస. దే. మిక్కిలికదియిక, బలాత్కారము
కిఖి. స. కొంకనక్క
కిగ్గాడి. త. క్షుద్రుఁడు, అంబేద
కిచ్చిలిచెట్టు. దే. నారింజచెట్టు
కిచేకిచే. దే. పక్షులు మొదలగువాని కూఁత
కిచేకొట్టు. దే. కూయు
కిచ్చడి. దే. చిత్రాన్నవిశేషము, పులగము
కిటి. స. పంది
కిటికీ. దే. గవాక్షము
కిటుకు. దే. కపటము, చిక్కు, మర్మము
కిట్టమి. దే. వైరము, విరోధము
కిట్టము. స. మలము, సామాన్యము
కిట్టిషము. స. ఉప్పునీళ్లు
కిట్టు. దే. సమీపించు, అనుకూలమగు
కిణము. స. చేతియందు కాచెడుకాయ, మచ్చ, పుట్టుమచ్చ, పులిపిరికాయ
కిణిహి. స. ఉత్తరేనుమొక్క
కిణ్వము. స. పాపము, సారాయములు చేయుటలో పొంగుటకై యుపయోగింపఁబడు నొకమూలిక

కిత. దే. దేవతార్పణమునకై కళ్లమున నొకదెసఁ బోసెడు మూఁడుదోసిళ్ల ధాన్యరాశి
కితము. దే. పూర్వము
కితవము. స. ఉమ్మెత్తచెట్టు, మోసము, మాయ
కితవుఁడు. స. జూదరి, వంచకుఁడు
కిత్తనార. దే. చేఁగనార
కిత్తలి. దే. కిచ్చిలిచెట్టు
కిత్తి. త. అగ్ని
కిదుకు. దే. బిడ్డలు నిద్ర లేచునపుడు ఆలస్యముచే నొకవిధముగా మూలుగు, బిడ్డలు మారాముచేయు
కినియు. దే. కోపించు, సమీపించు
కినుక. దే. కోపము
కినుకకాఁడు. దే. కోపముగలవాఁడు
కినుపు. దే. కోపము
కినువడు, కిన్వడు } దే. కోపపడు
కిన్క. దే. కినుక
కిన్నర. స. వీణావిశేషము
కిన్నరుఁడు. స. దేవతావిశేషము, చెడ్డమనుష్యుఁడు, కురూపి
కిన్నరేశుఁడు. స. కుబేరుఁడు
కిన్నెర. త. వీణావిశేషము
కిముడు. దే. అల్పము
కిమ్మీరము. స. చిత్రవర్ణముగలది, నారదబ్బ
కిమ్మీరుఁడు. స. ఒకానొకరాక్షసుఁడు
కియ్య, కియ్యవడి } దే. ఒకయక్షరము క్రింది యకారము
కిరణము. స. మయూఖము
కిరము. స. పంది
కిరాటుఁడు. స. కోమటి
కిరాతము. స. అల్పతనువు, నేలవేము
కిరాతతిక్తము. స. నేలవేము
కిరాతి. స. కిరాతస్త్రీ, పార్వతి
కిరాతుఁడు. స. అడవియందుతిరిగెడుబోయ
కిరి. దే. చిన్న
కిరి. స. పంది
కిరీటము. స. ఒకవిధమైన రాజులతలపాగ
కిరీటి. స. అర్జునుఁడు, కోడి
కిరీటిపచ్చ. త. మరకతము
కిరుదెస. త. నడుములోని వాతరోగము
కిరుసు. దే. రెండుప్రక్కలపదనుగలకత్తి
కిర్లి. దే. మల్లబంధవిశేషము
కిఱకిఱ. దే. రథనేమిధ్వని
కిఱుఁజెప్పు, కిఱ్ఱుఁజెప్పు } దే. కిఱ్ఱుమనుచెప్పు
కిఱుకు. దే. త్రిప్పు, వంచన
కిఱుకుపాడుచే. దే. తిరుగు
కిఱుదు. దే. హీనము
కిఱ్ఱు. దే. ధ్వన్యనుకరణవిశేషము
కిలకిల. దే. నవ్వుటయందగుధ్వని
కిలకిలలాడు. దే. కిలకిలధ్వనిచేయు
కిలకొట్టు. దే. మ్రోఁగు, శబ్దించు
కిలాతము. దే. గఱ్ఱము
కిలారము. దే. పశువులమంద
కిలారి. దే. గొల్లవాఁడు
కిలారించు, కిలారుచు, కిలార్చు } దే. కిలకిలమని మ్రోఁగు
కిలాసము. స. సిబ్బెము, దేహమందుఁ గలుగుపొడ
కిలాసి. స. సిబ్బెముగలవాఁడు

కిలింజకము. స. చాఁప, కటము
కిలికించితము. స. రోషాశ్రుహర్ష భీత్యాదుల సంకరరూపమగుస్త్రీయొక్క శృంగార చేష్టావిశేషము, తత్తరపాటు
కిల్బిషము. స. పాపము, తప్పు, రోగము
కిల్లాకు. దే. చీటి
కివకివ. దే. ధ్వన్యనుకరణవిశేషము
కివ్వు. దే. మడియు, చచ్చు
కిశోరము. స. గుఱ్ఱపుపిల్ల, మృగాదులపిల్ల
కిశోరి. స. కన్యక
కిశోరుఁడు. స. సూర్యుఁడు, యౌవనవంతుఁడు, 15 సంవత్సరములలోనిబాలుఁడు, అప్రాప్తవ్యవహారుఁడు
కిష్కువు. స. జేన, మూర, ముంజేయి
కిసమస. దే. వ్యథ
కిసరు. దే. పసిబిడ్డలకుఁగలిగెడి దోషము, రోపవికారము
కిసలము } స. చిగురు
కిసలయము }
కిసుమిసు. దే. లఘుద్రాక్ష

## కీ

కీఁచెట్లాడు. దే. కలహించు
కీఁచు. దే. ఒకవిధమగు ధ్వని
కీఁచుబిళ్ల } దే. పిల్లవాండ్రు ఆడుకొను కీఁచుకీఁచనునట్లు తోలు తోఁజేయఁబడిన ఒక వస్తువు, అదిమితే కీఁచు కీఁచుమను తలగడ
కీఁచుబుఱ్ఱ }
కీఁచుటాయి. దే. ముదురుకుమ్మరపురుగు, ఇలకోడి
కీకటము. స. గుఱ్ఱము, పేదవాఁడు
కీకటుఁడు. స. మోటువాఁడు
కీకసము. స. ఎముక, నులిపురుగు
కీకారణ్యము. దే. దట్టమగునడవి
కీచకము. స. గాలికి ధ్వనించెడునొకానొక సన్నవెదురు
కీచకుఁడు. స. ఒకానొకరాక్షసుఁడు
కీచేరబాచేర. దే. కలవరము, గాబరా
కీటకము. స. పురుగు, కఠినము
కీటమణి స. మిడుఁగుఱుఁబురుగు
కీటము. స. పురుగు, కఠినము, నింద్యము
కీటరాజము. స. కుమ్మరపురుగు
కీటు. దే. గోడపెట్టునపుడు ఒకతడవయుంచెడు మట్టిపొడవు, ఉపేక్ష
కీడు. త. అశుభము, ఆపద, తప్పు, దోషము, అధమము, అశుభకరము, అపకారము, పాపము
కీడుపడు } త. తక్కువపడు
కీడ్పడు }
కీడుపాటు } త. తక్కువపాటు, అశుభము
కీడ్పాటు }
కీత. దే. తక్కువ, నికృష్టము
కీతు. దే. కొబ్బరియాకుచాఁప, మట్ట
కీదృశము. స. ఎటువంటిది
కీనాశము. స. పేదయైనది, చిన్నది
కీనాశుఁడు. స. యముఁడు, రాక్షసుఁడు, పేదవాఁడు
కీరము. స. చిలుక
కీరవాణి. స. స్త్రీ
కీరితి. త. యశము, కీర్తి
కీర్ణము. స. కప్పఁబడినది, చెదరినది
కీర్తన. స. పాటచెప్పుట, కీర్తి, పాట
కీర్తనము. స. స్తుతి, చెప్పుట
కీర్తనీయము. స. పొగడఁదగినది

కీర్తన. స. యశము, బురద, ప్రకాశము
కీర్తించు. స. పొగడు, చెప్పు
కీర్తితము. స. పొగడఁబడినది
కీల. స. అగ్నిజ్వాల
కీలక. స. ఒకసంవత్సరము
కీలకము. స. పసులఁగట్టెడుగూటము
కీలకము. దే. మర్మము
కీలము. స. మేకు, మోఁచేయి, లేశము, మంట
కీలరి. త. కీలెఱిఁగినవాఁడు
కీలారము. దే. పసులమంద
కీలారి. దే. గొల్లవాఁడు
కీలాలము. స. నెత్తురు, నీళ్లు
కీలి. స. అగ్ని, నిప్పు
కీలించు. స. తగులు్చు
కీలితము. స. కట్టఁబడినది, కూర్పఁబడినది
కీలు. త. మఱ, మర్మము, ఉపాయము, అవయవసంధి, కట్టుపైపూసెడిఒకానొక నల్లని ద్రవద్రవ్యము, సూత్రము
కీలుకత్తి. దే. మడిచెడుకత్తి, మంగలకత్తి
కీలుకాఁడు. త. సూత్రధారి
కీలుకొను. దే. తగులు, నాఁటు
కీలుకొలుపు. దే. చేర్చు, నేయు, ఉంచు, కూడుకొను
కీలుగంటు. దే. జాఱుగాముడిచినవెంద్రుకల దూముడి
కీలుపడు. త. తగులు
కీశపర్ణి. స. ఉత్తరేనుమొక్క
కీశము. స. కోఁతి, దిసమొలది
కీశవల్లి. స. ఉత్తరేనుమొక్క
కీస. దే. కొంచెము
కీసర. దే. సంచిలోనగువాని లోపలిపొర, అల్పము

# కు.

కు. దే. షష్ఠీవిభక్తియందువచ్చెడు ప్రత్యయము
కుంక. దే. బాలవిధవ
కుంకటి. త. జోట్టు, పిల్లజోట్టు, ప్రధానము
కుంకటివేరు. దే. ప్రధానమైనవేరు
కుంకట్లు. దే. ముంగురులు
కుంకుడు. దే. ఒకానొకచెట్టు
కుంకుడుఁబురుగు. దే. ఎఱ్ఱని ఒకపురుగు
కుంకుమపువ్వు. దే. ఒకానొక పరిమళద్రవ్యము
కుంకుమము. స. కుంకుమపూవు [పొడి
కుంకుమ. త. నుదుటఁ బెట్టికొను ఎఱ్ఱని
కుంచనము. స. ముడుఁచుకొనుట
కుంచము. స. తూములో నాల్గవభాగము, కుంచేము
కుంచిక. స. కుంచెకోల
కుంచితము. స. వంకరైనది
కుంచిని. దే. పటచిత్రకారులు వ్రాయు తూలిక
కుంచియ. త. కుచ్చు, చిత్రము వ్రాసెడు తూలిక, చామరము, సాలెవాఁడు పడుగు సరిచేసెడు సాధనము
కుంచె. త. కుంచియ, గోడకు సున్నము కొట్టెడు మట్ట
కుంచెకోల. దే. కుంచిక
కుంచేము. త. తూములో నాల్గవభాగము
కుంచు. దే. కుంగఁజేయు
కుంజము. స. పొదరిల్లు, ఏనుఁగుకొమ్ము
కుంజర. స. కలిగొట్టుచెట్టు
కుంజరము. స. ఏనుఁగు, వెంద్రుక, శ్రేష్ఠము
కుంజరాశనము. స. రావిచెట్టు
కుంజలము. స. పులియఁబెట్టిన కడుగునీరు

కుంట. త. కొలను, పల్లము, భూపరిమాణ విశేషము

కుంటదూలము. దే. కడదూలమునకును గోడకును నడ్డముగానుంచే చిన్నదూలము

కుంటి. దే. కాలువిఱిగినవాఁడు, కాలులేనివాఁడు

కుంటిగాము. దే. శనిగ్రహము

కుంటు. దే. కాలుచక్కఁగా నేలమీఁద మోఁపకనడఁచు, కాలులేనివాఁడు

కుంటుగించు. దే. కుంటు

కుంటుపడు. దే. కుంటియగు, చెడు, తగ్గు, తెగు

కుంటుపిచ్చుక. దే. కాలులేనివాఁడు, పిచ్చుకకుంటు

కుంటువాఱు. దే. బలహీనమగు

కుంటెన. త. తార్చెడువాఁడు

కుంటెనకత్తె. త. తార్చునట్టిస్త్రీ

కుంటెనకాఁడు. త. తార్చువాఁడు

కుంటెనకుచ్చెలు. దే. ఈడ్పులనెడు కర్ణభూషావిశేషము

కుంటెనముడి. దే. తాటాకుల పుస్తకము దారము నడుమనుండెడు ముడి

కుంటెనీఁడు. త. కుంటెనకాఁడు

కుంఠనము. స. మొక్కపోవుట

కుంఠితము. స. మొక్కపోయినది

కుంఠుఁడు. స. మూఢుఁడు, సోమరి

కుండ. త. మట్టిపాత్రము, బండి చక్రపు నడిమిగుబ్బ, మేడమీఁది కలశము

కుండకీటుఁడు. స. చెడిపోయిన బ్రాహ్మణస్త్రీకొడుకు, దాసిని కామించినవాఁడు

కుండగోఁకరి. దే. వంటవాఁడు

**కుండపోఁగులు. దే. కుండలవిశేషము**

కుండమార్చు. దే. ఒకటినిచ్చిమఱియొకటిని బుచ్చుకొను

కుండమార్పు. దే. ఒకటినిచ్చిమఱియొకటిని బుచ్చుకొనుట, వినిమయము

కుండము. స. వంటకుండ, నిప్పులగుండము, కొండ

కుండలము. స. పోఁగులు, గుండ్రన, త్రాడు

కుండలి. స. తిప్పతీఁగె, పాము, నెమలి, పోఁగులు గలవాఁడు, నృత్యము

కుండలించు. స. సున్నచుట్టు

కుండలీకరణము. స. సున్నచుట్టుట, ఒక దిక్కును గుఱుతు

కుండలు. త. ఏనుఁగు కుంభస్థలము, మట్టిపాత్రములు

కుండి, కుండిక } స. కమండలువు, గిండి

కుండుఁడు. స. మగఁడుండఁగా ఱంకుమగనికిఁ బుట్టినకొడుకు

కుంద్రుణాచి. స. తెల్లబల్లి

కుంతము. స. ఈఁటె

కుంతలము. స వెండ్రుక, నాఁగలి, ఒకానొకదేశము

కుంతాలము. స. శ్రీతాళపుఁజెట్టు

కుంతి స. పాండురాజు పెండ్లాము

కుంథనము. స. మూలుగు

కుంద. త. స్తంభము

కుందకము. దే. లోపము, అభ్యంతరము

కుందనము. దే. మేలిమిబంగారు, అపరంజి

కుందము. స. మొల్లచెట్టు

కుందారము. స. పంది.

కుంది. దే. ఱాతిఱోటిమీఁద వస్తువుచెదిరి క్రిందఁబడకుండునటుల నమర్చినఱాతి వలయము, ఱాతికుదురు, ఱోలగుంట

కుందించు. దే. దుఃఖింపఁజేయు, అణఁచు
కుందికాళ్లు. దే. బాలక్రీడావిశేషము
కుందియన. దే. కుంది, ఒకానొకచెట్టు
కుందిరికి. స. అందుగుచెట్టు
కుందు. దే. క్రుంగు, తగ్గు, శోకించు, దుః ఖించు, ఒంటికాలితోనడచు, తక్కువ, దుఃఖము
కుందుఁడు. స. వెన్నుఁడు
కుందుటెల్లు. దే. ఇక్ష్వారికవృక్షము
కుందెన. దే. కుంది, ఒకానొకచెట్టు
కుందెనగుడి. దే. బాలక్రీడావిశేషము
కుందెలు. దే. కుందేలు
కుందేటికొమ్ము. దే. గడ్డదినుసు, శశశృంగము, శూన్యము
కుందేలు. దే. చెవులపిల్లి
కుంపటి. దే. చలికాఁచుకొనుట మొదలగు వానికై నిప్పులుండెడు పాత్రవిశేషము
కుంపె. దే. తాంబూలపాత్రము
కుంపెరుఁగు. దే. కుండఅడుగు పెరుఁగు
కుంబ. స. యజ్ఞశాలకుఁజుట్టు వేయఁబడిన కంచె
కుంభకము. స. ఊపిరిబిగఁబట్టుట
కుంభకారుఁడు. స. కుమ్మరి
కుంభము. స. కుండ, ఏనుఁగుకుంభస్థలము, ఒకానొకరాశి, పరిమాణవిశేషము, దేవాదులకువేయు బల్యన్నము
కుంభసంభవుఁడు. స. అగస్త్యుఁడు, ద్రోణుఁడు
కుంభాండము. స. గుమ్మడిచెట్టు
కుంభి. స. వంటకుండ, ఏనుఁగు, కుమ్మరవాఁడు, మొసలి
కుంభిక. స. నాఁచు
కుంభించు. స. ఊపిరిబిగఁబట్టు
కుంభిని. స. భూమి, నేల
కుంభీనసము. స. పాము
కుంభీరకుఁడు. స. దొంగ
కుంభీరము. స. మొసలి
కుంభుఁడు. స. శృంగారనాయకుఁడు
కుకరుఁడు. స. ఈచఁబోయిన చేయిగల వాఁడు
కుకవి స. చెడ్డకవి
కుకీలము. స. చిన్నకొండ
కుకుందరము. స. పిఱుఁదిమీఁదిగుంత
కుకూలము. స. కుమ్ము
కుక్క. త. శునకము, కుత్సితము
కుక్కగోదుగు. దే. పుట్టగోదుగు
కుక్కతొళసి. త. ఫణిర్జకవృక్షము
కుక్కపాల. దే. వటపత్త్రికవృక్షము
కుక్కముల్లు. దే. పొక్కులవ్యాధి
కుక్కమూతిపిందె. దే. కాపుడిగినప్పుడు కలిగెడు కుక్కమూతివంటి మూతిగల పిందె
కుక్కి. దే. పల్లము, త్రాళ్లువదలి పల్లము పడినమంచము, లోఁతు
కుక్కివడు. దే. పల్లముపడు
కుక్కుటము. స. కోడి, కుక్క, కపటము
కుక్కుటి. స. ఆఁడుకోడి
కుక్కుడు. దే. అదుముడు, పీడనము
కుక్కుభము. స. గంపపులుఁగు
కుక్కురము. స. మాచిపత్త్రి, కుక్క
కుక్షి. స. కడుపు
కుక్షింభరి. స. పొట్టపోసికొనువాఁడు
కుగ్రామము. దే. చిన్నపల్లె
కుచందనము. స. ఎఱ్ఱగందము
కుచము. స. స్తనము

కుచరుఁడు. స. పరులదోషమును జెప్పెడి వాఁడు
కుచర్య. స. దుష్టప్రవర్తన
కుచాననము. స. కుచాగ్రము, చనుమొన
కుచితము. స. మూయఁబడినది, సన్నమైనది, ముడుఁచుకొన్నది
కుచోద్యము. దే. అపహాస్యము, మోసము
కుచ్చితము. త. కుత్సితము, నాలి
కుచ్చితుఁడు. త. చెనఁటి, కుత్సితుఁడు
కుచ్చె. త. కుప్ప, వస్త్రభంగము, సెఱి
కుచ్చెతీయు. దే. రత్నములను సానఁబట్టు
కుచ్చెల. దే. ఎనిమిది గొఱ్ఱులభూమి, కంకులుగల జొన్న చొప్పప్రోగు
కుచ్చెళ్లు. త. వస్త్రపుకుచ్చెళ్లు
కుచ్చెలిగంత, కుచ్చెలిబొంత } త. సన్యాసులులోనగువారుధరించెడుబొంత
కుచ్చు. త. పట్టులోనగువానికుచ్చు, జడకుచ్చు
కుచ్చులమెకము. త. చమరీమృగము
కుచ్చులు. త. కొనచెవినుంచుకొనెడిభూషణ విశేషము
కుజ. స. సీత. పార్వతి
కుజంభిరుఁడు. స. చంపిదోఁచుకొనుదొంగ
కుజనుఁడు. స. కుత్సితపురుషుఁడు
కుజము. స. చెట్టు
కుజుఁడు. స. అంగారకుఁడు
కుటజము. స కొండమల్లె
కుటజుఁడు. స. అగస్త్యుఁడు, ద్రోణుఁడు
కుటన్నటము. స. దుండిగపుచెట్టు
కుటపము. స. ఇంటితోఁట
కుటము. స. గుడిసె, చెట్టు, నీళ్లకుండ
కుటరము, స. పెరుఁగుచిలికెడు కంబము
కుటాక. దే. పక్షివిశేషము
కుటి. స. బుడిపి, గుడిసె, నీళ్లమోసెడు పనికత్తె
కుటిక. స. గుడిసె
కుటిల. స. ఒకానొక ఏఱు, వంకరైనది
కుటిలము. స. వంకర, మోసము, జబ్బు
కుటిలిక. స. మంగలవాఁడు వెండ్రుకలూడఁదీసెడు సాధనము, తండసము
కుటిలుఁడు. స. దుర్మార్గుఁడు, కపటముగలవాఁడు
కుటీరము. స. గుడిసె
కుటుంబము. స. పెండ్లాము బిడ్డలులోనగువారు
కుటుంబి. స. కుటుంబ పోషకుఁడైనవాఁడు
కుటుంబిని. స. కుటుంబపోషకురాలైనస్త్రీ
కుటుఁడు. స కూలిపనివాఁడు
కుట్టకుఁడు. స. ఛేదించువాఁడు
కుట్టడము. దే. కుట్టుపని
కుట్టనము. స. ఛేదనము
కుట్టని. స. కుంటెనకత్తె
కుట్టమితము. స. స్త్రీలయొక్క శృంగార చేష్టావిశేషము
కుట్టాకుఁడు. స. ఛేదించువాఁడు
కుట్టారము. స. పర్వతము
కుట్టారుగలు. దే. చిన్నఅరుగలు
కుట్టావలు. దే. సన్నావాలు
కుట్టిమము. స. కూలికట్టడపునేల, తిన్నె
కుట్టియ. దే. గుదస్థానము
కుట్టు. దే. ఆకుకుట్టు, గుడ్డలుకుట్టు, తేలులోనగునవికుట్టు, కుట్టుడు, ప్రాయిలోదట్టముగా నుండుబూడిద, కొంచెము కడుపునొప్పి, అసూయ. చెవికి కుట్టిన బెజ్జము
కుట్టుకాఁడ. దే. చెవికుట్టుకమ్మి, కుట్టుపోగు

కుట్టుడాకు. దే. పుల్లియ, విస్తర
కుట్టుడు. దే. కుట్టుట
కుట్టుతేలు. దే. ముల్లు, క్షుద్రుఁడు
కుట్టుపోఁగులు. దే. ఉంగరమువంటి పట్టి పోఁగులు
కుట్టుపోయు. దే. కుట్టు
కుట్టుసుఱు. దే. కొంచెము మిగిలియున్న ప్రాణము
కుట్టె. దే. గుదస్థానము
కుట్మలము. స. మొగ్గ
కుట్ర. దే. కుత్సితము, మోసము, తంత్రము
కుట్రపువాఁడు. దే. కుట్టుపనిచేయువాఁడు
కుఠరము. స. కుటరము
కుఠారము. స. గొడ్డలి
కుఠారికుఁడు. స. కట్టెలు కొట్టువాఁడు
కుఠేరకము. స. నల్లగగ్గెరచెట్టు
కుడక. దే. గంధము మొదలగునవి యుంచు పాత్ర
కుడపము. స. మానిక
కుడి. దే. కుడుపు, అపసవ్యము
కుడిలి. దే. బియ్యములోనగు వాని కడుగు నీరు
కుడిపేరు. దే. త్రాఁగఁదగినజలము
కుడిపి. త. కురూపి
కుడిమివాఁడు. దే. విషవైద్యుఁడు, పాముల వాఁడు
కుడిశము. స. మత్స్యవిశేషము
కుడుంగము. స. పొదరిల్లు
కుడుక. దే. తక్కెడతట్ట
కుడుచు. దే. అనుభవించు, తిను, త్రాగు
కుడుపరి. దే. అనుభవించువాఁడు, భుజించువాఁడు [భోజనము
కుడుపు. దే. కుడువఁజేయు, అనుభవము,
కుడుము. దే. భక్ష్యవిశేషము

కుడ్చు. దే. కుడుచు
కుడ్యకారుఁడు. స. గోడపెట్టువాఁడు
కుడ్యమత్స్య. స. బల్లి
కుడ్యము. స. గోడ, పూఁత
కుణకము. స. పిల్ల
కుణపము. స. పీనుఁగు, దుర్గంధము
కుణి. స. ఈచఁబోయనచేయిగలవాఁడు
కుణుంజము. స. చెంచలికూర
కుతపము. స. కంబళి, వాద్యము
కుతపుఁడు. స. తోడఁబుట్టినదానికొడుకు, సూర్యుఁడు, ద్విజుఁడు, అగ్ని, అతిథి, కూఁతురుకొడుకు
కుతర్కము. స. సహేతుకముగానివాదము
కుతలము. స. భూమి, ప్రపంచము, ఒక లోకము
కుతస్త్యము. స. అసభ్యమగుమాట
కుతిక. దే. కంఠము
కుతికంటు. దే. స్త్రీభూషణవిశేషము
కుతిని. దే. ఒకవిధమగుపట్టు
కుతిల. దే. బాధ
కుతిలపడు. దే. బాధపడు
కుతిలపాటు. దే. కుతిలపడుట
కుతిలపెట్టు. దే. బాధపెట్టు, కుతిలపఱచు
కుతుక. దే. కంఠము
కుతుకము. స. అనుభవింపవలెననియాస
కుతుపము. స. చేతిసిద్దె, కుతపము
కుతువు. స. సిద్దె
కుతూహలము. స. కుతుకము, ఆశ్చర్యకరమైనది, శ్రేష్ఠమైనది, సంతోషము
కుత్కీలము. స. కొండ

కుత్తిక } దే. కంఠము
కుత్తుక

కుత్స } స. నింద
కుత్సనము

కుత్సకుఁడు. స. దుర్మార్గుఁడు

కుత్సించు. స. రోఁతపడు, నిందించు

కుత్సితము. స. నికృష్టము, నీచము

కుత్సితుఁడు. స. నికృష్టుఁడు

కుథము. స. దర్భ, ఏనుఁగుమీఁదఁబఱచెడి యెఱ్ఱకంబళి

కుదప. దే. రొంపిదుక్క, పెరుఁగుగడ్డ

కుదరము. స. గుజ్జము

కుదించు. దే. కుదియించు, గట్టిగాకదలించు

కుదికిలఁబడు } దే. గొంతుగూర్చుండు
కుదికిలు

కుదియఁబట్టు. దే. గట్టిగా పట్టుకొను

కుదియు. దే. అడఁగు, క్రుంగు, తగ్గు, మరలు

కుదిర. త. గుజ్జము

కుదిరిక. దే. నిలుకడ, నెమ్మది, అమరిక

కుదిలించు. దే. కుదించు

కుదిలిక. దే. కుదులుట

కుదుకనగోలు. దే. వంచన

కుదుచు. దే. కుదించు

కుదుటఁబడు. దే. యథాస్థితికివచ్చు, శాంతినొందు

కుదుప. దే. దుర్మాంసపిండము, వంచన

కుదుపు. దే. స్వభావమునఁ గాలులేనివాఁడు

కుదురు. దే. అనుకూలమగు, స్థిరమగు, స్వస్థమగు, అమరిక, నిలుకడ, నెమ్మది, అగసాలెవాని కుంపటి, కుండలు మొదలైనవానిక్రింద నుంచుసాధనము, పాదు, ప్రాపు, వంశము

కుదురుకొను. దే. నెలకొను, కదలకనిలుచు

కుదురుచు } దే. కుదిరించు
కుదుర్చు

కుదురుపడు } దే. నెలకొను, స్థిరపడు
కుదుర్పడు

కుదురుపాటు. దే. కుదురుపడుట

కుదులు. దే. అదురు, చలించు

కుదువ. దే. తాకట్టు, ఆధి

కుదువపెట్టు. దే. తాకట్టుంచు

కుద్దాలము. స. గుద్దలి, ఒకానొకవృక్షము

కుధరము. స. పర్వతము

కునటి. స. మణిసిల

కునాశకము. స. తీఁటకసిందమొక్క

కుని. దే. సన్ననిభూభాగము

కునికిపడు. దే. తూఁగిపడు

కునికిపాటు. దే. తూఁగిపడుట

కునుకు. దే. తూఁగు, నిద్రించు

కునుష్టు. దే. ప్రజ్ఞలేనివాఁడు, పంగువు

కున్న. త. కూన

కున్నఁడు. త. బాలుఁడు

కున్ననము. స. గాజేచిప్ప, పెద్దకుండ

కుపసము. త. అరచట్టు, ఆవిక, పాము యొక్కపైతోలు

కుపితుఁడు. స. కోపించినవాఁడు

కుపుత్రుఁడు. స. అంగారకుఁడు

కుపూయము. స. కుత్సితము, నీచము

కుపూయుఁడు. స. జాత్యాచారాదులచేత నిందితుఁడు

కుప్ప. దే. ధాన్యము మొదలగువానిరాశి

కుప్పఁగూర. దే. కుప్పవడుట

కుప్పకోలుగొన. దే. విశేషముగ

కుప్పతిలు. దే. కుప్పవడు
కుప్పతెప్పలుగ. దే. విశేషముగ
కుప్పనఁగూర. దే. కుప్పవడుట
కుప్పము. దే. గ్రామము, బెస్తవారిపల్లె
కుప్పవడు. దే కుప్పగాఁజేరు
కుప్పసము. త. అరచెట్ట, అవిక, పాము యొక్క పైతోలు
కుప్పి. తే. అవాక్పుష్పివృక్షము
కుప్పించే. త. ఊపెరిపట్టు
కుప్పిగంతుకొను. దే. దుముకు
కుప్పిగంతులు. దే. బాలక్రీడావిశేషము
కుప్పీలు. దే. బాలికాక్రీడావిశేషము
కుప్పె. దే. జాడి, శిరోభూషణము, గొడుగుమీఁది గుబ్బ
కుప్పెంట. దే. హరితమంజరివృక్షము
కుప్పెకోల. దే. బాణవిశేషము, క్షుద్రకము
కుప్యము. స. వెండి, బంగారు, తప్పతక్కిన లోహములు
కుబుసము. దే. తలుపునకుఁ గ్రిందుమీఁదుల నుంచెడు కూచేము, పాముయొక్క పైతోలు, చొక్కా
కుబేరకము. స. నందివృక్షము
కుబేరాక్షము. స. బాలక్రీడావిశేషము
కుబేరాక్షి. స. కలిగొట్టుచెట్టు
కుబేరుఁడు. స. ఉత్తరదిక్కునకధిపతి, ధనదుఁడు
కుబ్జ. స. పొట్టమొక్క
కుబ్జము. స. మఱుగుజ్జు
కుబ్జిక. స. గొజ్జెఁగమొక్క
కుబ్జుఁడు. స. కుంటివాఁడు,గూనుగలవాఁడు
కుమతి. స చెడ్డమనసు
కుమారము. స. బంగారు, గుజ్జుపుపిల్ల, ఉలిమిరిచెట్టు, చిలుక

కుమారి. స. కూఁతురు, పెండ్లికానిపిల్ల, పార్వతి
కుమారిలు. దే. కుములు
కుమారుఁడు. స. కొడుకు, బాలుఁడు, కుమారస్వామి
కుమి } దే. పొడక (పొణక), బొట్ట,
కుమ్మి } బాలికలాడుకొను నొకయాట
కుముఖము. స. పంది
కుముటు. దే. కక్కునపుడు కంఠమందుఁ గలుగు వికారము
కుముద. స. గుమ్ముడుచెట్టు, టేఁకుచెట్టు
కుముదబాంధవుఁడు. స. చంద్రుఁడు
కుముదము. స. ఎఱ్ఱదామర, తెల్లగలువ, నిరృతిదిక్కునందలి యేనుఁగు
కుముదిక. స. పినగుమ్ముడుచెట్టు
కుముదిని. స. తెల్లకలువతీఁగ
కుముద్వంతము. స. తెల్లకలువలు విశేషముగాఁ గలప్రదేశము
కుముద్వతి. స. తెల్లకలువతీఁగ
కుములు. దే. లోలోపలఁ దపించు
కుమ్మర. త. కుమ్మరజాతి
కుమ్మరగువ్వ. దే. పక్షివిశేషము
కుమ్మరత. దే. కుమ్మరది
కుమ్మరపురుగు. త. ఒకానొకపురుగు, మృత్కీటము
కుమ్మరసారె. దే. కుమ్మరవాని చక్రము
కుమ్మరసారెచుక్క. దే. విశాఖానక్షత్రము
కుమ్మరస్వరూపములు. దే. కుండలు మొదలగునవి
కుమ్మరి. త. కుమ్మరవాఁడు
కుమ్మరించు. దే. కుమ్మరిలఁజేయు
కుమ్మరిలు. దే. పాత్రములోనుండి నీళ్లు మొదలగునవి పడు, రాలు [నిప్పు
కుమ్ము. దే. పొడుచు, నలియఁగొట్టు, పొట్టు

కుమ్ముసుద్ది. దే. సంకేతవృత్తాంతము
కుమ్మె. దే. పోటు
కుమ్మెలువోవు. దే. గాయమగు
కుయి
కుయ్యి } దే. మొఱ, రక్షణము
కుయుక్తి. దే. కపటోపాయము, మోసము
కురంగనాభము. స. కస్తూరి
కురంగమము. స. జింక
కురంగము. స. జింక, కోఁతి
కురంటక. స. తుమ్మిచెట్టు
కురంటకము. స. పచ్చగోరంటమొక్క
కురంటము. స. వృషణములవాఁపు, నీటిబుడ్డ
కురండము. స. బుడ్డ
కురటుఁడు. స. ముచ్చెలుకుట్టువాఁడు
కురపము. స. గుఱ్ఱమును దోమెడు గొఱపము
కురము. దే. పశువులకుఁ గలిగెడు వాతరోగము
కురరము. స. గోరువంక, లకుముకిపిట్ట
కురరి. స. ఆఁడులకుముకి, గొఱ్ఱె
కురవకము. స. ఎఱ్ఱగోరంట
కురాళము. దే. చప్పరము, అశ్వాద్యాచ్ఛాదనవస్త్రము
కురాసాని. దే. ఒకానొకదేశము
కురిచీ. దే. కూర్చుండునట్టి ఎత్తైనపీఠము
కురిడి. దే. లోపలి నీరుహరించిన కొబ్బెర
కురిమిడి. దే. గనిమ, నీళ్లకువేసెడు గట్టు
కురియు. దే. వర్షించే
కురుంబము. స. సమూహము
కురుఁజు. దే. దూలము మీఁదిగుజ్జు, మంచె
కురుక్షేత్రము. స. భారతయుద్ధము జరిగిన చోటు

కురుజీ. దే. చిన్నకంట్లము
కురుజు. దే. జేన్ను, డేగ, ఈఁకలురాల్చిన పక్షి
కురుజుతేనె. దే. మిక్కిలి మధురమగు తేనె, జుంటితేనె
కురుప. దే. కంబళ్లునేయు ఒకగొల్లజాతి
కురుపగొఱ్ఱె. దే. దేహమందంతట బొచ్చు గలగొఱ్ఱె
కురులు. త. ముంగురులు, వెండ్రుకలు
కురువ. దే. కొండమీఁది త్రోవ
కురువిందము. స. అద్దము, మాణిక్య విశేషము
కురువు. స. ఒకానొకదేశము, అన్నము
కురువేరు. దే. ఒకానొకవేరు
కురుళము. స. ముంగురులు
కురూపి. స. వికారముగనుండువాఁడు
కుర్కురము. స. కుక్క
కుర్దనము. స. క్రీడ
కుర్పరము. స. మోఁచెయి
కుర్వాణుఁడు. స. చేయువాఁడు, పనివాఁడు
కుఱుఁగలి. దే. సమీపము
కుఱుకుఱు. దే. అల్పము
కుఱినువ్వులు. దే. సన్ననూవులు
కుఱు. దే. చిన్న, కుఱుచే
కుఱుకు. దే. ప్రోగు, రాశి
కుఱుగడ. దే. కుఱుచేగడ
కుఱుచే. దే హ్రస్వము, హ్రస్వస్వరము
కుఱుచే. త. తొడిగికొను వస్త్రవిశేషము
కుఱుచేపడు. దే. తగ్గు
కుఱుచేలు. దే. నాట్యవిశేషము
కుఱుపు దే. వ్రణము
కుఱుమట్టము. దే. లెస్సగావంగినది, పొట్టిది, వినయముగలది

కుఱుమాడు. దే. ఇంటిమూలకప్పు
కుఱువు. దే. తొడ
కుఱ్ఱ దే. కొడుకు, బాలుఁడు, కోడె, యెను పోతు, చిన్న, పొట్టి
కుఱ్ఱఁడు. దే. కొడుకు, బాలుఁడు
కుఱ్ఱి. దే. పాఁడియావు
కుఱ్ఱు. దే. కూయు
కులకము. స. ఒక క్రియతో ముగిసెడు పద్యములసమూహము, పుట్ట
కులకాంత. స. భార్య
కులకాయకము. దే. కులవృత్తి
కులకుఁడు. స. కులశ్రేష్ఠుఁడు
కులట. స. ఱంకుటాలు
కులటుఁడు. స. ఔరసపుత్రుఁడు కాని వాఁడు, దత్తపుత్రుఁడు
కులధ్వజుఁడు. స. కులములో ప్రసిద్ధపురుషుఁడు
కులపర్వతము. స. ప్రధానపర్వతము
కులపాలిక. స. తల్లిదండ్రులచే నియ్యఁబడి పెండ్లిచేయఁబడిన స్త్రీ
కులము. స. వంశము, తెగ, ఇల్లు, శరీరము
కులవిద్య. స. వంశపారంపర్యముగా కులము నందుఁ గలవిద్య
కులసతి. స. కులస్త్రీ
కులసంభవుఁడు. స. మంచికులమునందుఁ బుట్టినవాఁడు
కులసేవకుఁడు. స. ఉత్తమభృత్యుఁడు
కులస్థులు. స. ఏకకులమువారు
కులస్త్రీ. స. కులపాలిక
కులాంగారము. స. కొఱవి, కులనాశకుఁడు
కులాన్వయము. స. గొప్పవంశము
కులాయము. స. పక్షిగూఁడు, శరీరము, స్థానము, సాలెగూఁడు
కులాలము. స. పక్షివిశేషము
కులాలి. స. కనుపాలవిత్తులు
కులాలుఁడు. స. కుమ్మరవాఁడు
కులి. స. చేయి, వాకుఁడుమొక్క, భార్య యొక్క అక్క
కులికుఁడు. స. కులశ్రేష్ఠుఁడు
కులిపి. దే. మేఁకలను కాచుకొనువాఁడు
కులిశము. స. వజ్రాయుధము
కులీనుఁడు. స. మంచికులమునఁ బుట్టిన వాఁడు
కులుకము. స. నాలుకముతికి
కులుకరించు. దే. విజృంభించు, అతిశయించు
కులుకు. దే శృంగారచేష్ట, శృంగారముగ చలించు, పూయు, వేయు, పోయు, వణఁకుట, ఒయ్యారము, సొగసైన
కులుకులాఁడి. దే. కులుకుగలస్త్రీ
కులుప. దే. శోఫ
కులుపుజాయి. దే. ఒకవిధమగు రత్నము, రాజావర్తము
కుల్మాషము. స. పులియఁబెట్టిన కడుగునీరు, గుగ్గిళ్లు, గంజి, జావ
కుల్య. స. కాలువ, తిప్పతీఁగ
కుల్యము. స. ఎముక, మంచికులమునఁ బుట్టినది, మాంసము
కుల్యుఁడు. స. గౌరవింపఁదగిన మనుష్యుఁడు
కువ. దే. కుప్ప
కువము. స. పుష్పము
కువలము. స. కలువ, ముత్యము
కువలయము. స. కలువ, భూమండలము
కువలాయికము. స. హంసవిశేషము
కువాటము. స. మడతతలుపు

కువాడము. త. కపటము
కువాదుఁడు. స. పరులదోషమును పలుకు వాఁడు
కువాసన. స. తప్పు అభిప్రాయము
కువాళము. దే. వాహనముయొక్కగవుసెన
కువాళము. త. కపటము
కువిందుఁడు. స. సాలెవాఁడు
కువేణి. స. చేఁపలఁబట్టివేయుబుట్ట
కువేలము. స. కలువ
కువ్వ. దే. కుప్ప, రాశి
కువ్వాడము. త. కపటము
కుశంక. స. కుత్సితపుశంక
కుశ. స. త్రాడు, మూఁతవేయు చెక్క, కళ్లెము
కుశము. స. దుర్మార్గమైనది, పిచ్చియైనది, దర్భ, పలుపు, ఒకద్వీపము, నీళ్లు
కుశలత. స. నేర్పు, శక్తి, క్షేమము
కుశలము. స. క్షేమము, తృప్తి, నేర్పు, పుణ్యము
కుశలుఁడు. స. నేర్పరి, శివుఁడు
కుశాగ్రబుద్ధి. స. సూక్ష్మబుద్ధి
కుశి. స. కఱ్ఱు, ఇనుపవస్తువు
కుశికము. స. అయోవికారము
కుశికుఁడు. స. విశ్వామిత్రుని తండ్రి
కుశీలవుఁడు. స. అనేకదేశములుతిరుగునట్టి బట్టువాఁడు, వాల్మీకి
కుశుఁడు. స. రాముని పెద్దకొడుకు, పాపము చేసినవాఁడు
కుశేశయము. స. పద్మము
కుశ్రుతము. స. సరిగావినఁబడనిది, దుర్వార్త
కుషితము. స. నీళ్లతోఁ గలుపఁబడినది

కుష్ఠము. స. వ్యాధివిశేషము
కుసంధి. స. ఇఱుకుచోటు
కుసి. దే. మంచేపుపట్టెచివర
కుసిగుంపులు. దే. బాధ, శ్రమము
కుసిలించు. దే. అతృప్తిచే దుఃఖించు
కుసిలింత. దే. అతృప్తిచే దుఃఖించుట
కుసీదము. స. వడ్డికిచ్చి జీవనముచేయుట
కుసీదికుఁడు } స. వడ్డికిచ్చి జీవనముచేయు
కుసీదుఁడు } వాఁడు
కుసుంభము. స కుసుమపువ్వు, బంగారు
కుసుంభరాగము. స. బయటికిమాత్రము విశేషముగాఁ గనఁబడి లోపల బొత్తిగా లేని అనురాగము
కుసుమ. దే. ఒకానొకచెట్టు, సస్యవిశేషము, పుండుచందలిమొలక
కుసుమ. త. కుసుంభపుష్పము, కుసుంభ వర్ణము
కుసుమము. త. కుసుంభవర్ణము
కుసుమము. స. పువ్వు, కంటితెవులు, స్త్రీ రజస్సు
కుసుమములు } దే. ధాన్యవిశేషము
కుసుమలు }
కుసుమాలుఁడు. స. దొంగ
కుసుమించు. స. పుష్పించు
కుసుమితము. స. పుష్పించినది
కుసుమేషువు. స. మన్మథుఁడు
కుసులి. దే. పొట్టివాఁడు
కుసులు. దే. కుసిలించు
కుసుళ్లు. దే. సందిటధరింపఁబడునాభరణము
కుసూలము. స. ధాన్యముంచెడు గరిసె
కుసృతి. స. కుత్సితభావము
కుస్తరించు. దే. ఊఱడించు, సమాధాన పఱచు, చేఱచు, సవరించు

కుస్తుంబరి } స. కొత్తిమిరి
కుస్తుంబురువు }

కుస్తుభుఁడు. స. విష్ణువు, సముద్రుఁడు

కుహకము. స. మోసము

కుహన. స. కపటచర్య

కుహనము. స. ఎలుక, పాము

కుహనుఁడు. స. అంకుమగఁడు, జారుఁడు

కుహరము. స. గుహ, బెజ్జము

కుహాళ. స. వాద్యవిశేషము

కుహాళి. స. పోఁకపొత్తి

కుహోళ. స. వాద్యవిశేషము

కుహునిక. స. దంభము

కుహువు. స. చంద్రకళ కనఁబడనియమావాస్య, కోకిలధ్వని

కుహేళిక. స. పొగమంచు

కుళాయ } త. టోపి
కుళ్లాయ }

కుళింగము. స. అడవిపిచ్చుక

కుళీరము. స. ఎండ్రకాయ

కుళుత్థము. స. ఉలవలు

కుళుత్థిక. స. కనుపాలవిత్తు

కుళుపు. దే. ఉంగరమునకుఁ బొదిగెడు పెద్దమణివిశేషము

కుళ్లగించు. దే. కొంచెము త్రవ్వు, కెల్లగించు

కుళ్లా. త. కుళ్లాయ

కుళ్లు. దే. చెడుట, క్రుళ్లుట, క్రుళ్ళు, దుఃఖించు

కుళ్లుపోతు. దే. ఏడుపుగొట్టు, క్రుళ్లుపోతు

## కూ

కూ. దే. పిలువఁగా పామరజను లెచ్చరించుకొనుటయందు వచ్చును

కూఁక. దే. అఱపు

కూఁకటి. త. జుట్టు, పిల్లజుట్టు, ప్రధానము

కూఁకటిపువ్వు. దే. పక్షివిశేషము

కూఁకటిమూఁగ. దే. ఒకదినుసుపక్షి

కూఁకటివేరు. దే. పెద్దవేరు

కూఁకరించు. దే. కూఁకలువేయు

కూఁకు. దే. అస్తమించు, క్రుంకు

కూఁత. దే. కూయుట

కూఁతకైదువు. దే. శంఖము

కూఁతనేల }
కూఁతపట్టు } దే. కోసునేల, కోసు
కూఁతవేటు }

కూఁతు } దే. కొమార్త
కూఁతురు }

కూఁతురుబుడమ. దే. ఒకానొకతీఁగ

కూకీ. దే. పావురము

కూకు. దే. పాలవిఱుగుడు

కూకుడువత్తి. దే. జిల్లేడుకాయగాని బూరుగుకాయగాని పిగిలి గాలికి కొట్టుకొనిపోవు దూది లేశము

కూకుడువత్తులు. దే. తుత్తుమురు,నలినూకలు

కూకుదుఁడు. స. వరుని సత్కరించి సాలంకృతముగఁ గన్యనిచ్చువాఁడు

కూకురుగుండఁగి. దే. పక్షివిశేషము

కూచి. దే. యుద్ధసమయమునందు వాద్యములను వాయించుట, వాఁడి

కూచిచేయు. దే. దండుప్రయాణమగు

కూచిమతము. దే. సాతానులలో నొక మతము

కూచిమారము. స. పోకిరితనము

కూచిమారుఁడు. స. పురుషజాతుల నాలుగింటిలో నొకజాతివాఁడు

కూచేము. దే. చిన్న స్తంభము,గూటము,కుసి

కూజనము
కూజితము } స. పక్షికూఁత, బండిచక్రముల ధ్వని

కూటకము. దే. కొప్పు, ఏడికోలలేని నాఁగలి, మోసము

కూటపాకలము. స. ఏనుఁగులకువచ్చునొక జ్వరము, పిత్తజ్వరము

కూటబెట్టు. దే. ఒకవిధమగు పాము

కూటమి. దే. కూడిక, సురతము

కూటము. దే. కొలుపుకూటము, చోపడి

కూటము. స. అమ్ము, కపటము, ప్రోగు, బొంకు, దుఃఖము, ఇల్లు, కుట్ర, శిఖరము

కూటశాల్మలి. స. కొండబూరుగుచెట్టు

కూటసాక్ష్యము. స. అబద్ధపుసాక్ష్యము

కూటస్థము. స. సర్వకాలమును నొక్క విధముననుండెడు ఆకాశము మొదలైనది

కూటస్థానము. స. నలుగురుకూడుచోటు

కూటహర్మ్యము. స. రాజనగరులోనికచ్చేరి సావడి

కూటాగారము. స. మేడమీఁదియిల్లు

కూటాము. దే. కూటము

కూటినీళ్లు. దే. పుల్లనీళ్లు

కూటిముత్యము. దే. మనుష్యులచేతచేయఁబడు ఒకదినుసు ముత్యము

కూటు. దే. వెంటితో చేయఁబడినగరిసె

కూటుఁడు. స. జాయితొలఁచేవాఁడు

కూటువ. దే. గుంపు, ప్రోగు

కూటువమూఁక. దే. ప్రోత్సాహపఱచి యక్కడక్కడ వెదకితెచ్చిన పిఱికి బలము

కూటువసరులు. దే. మెడలోవేసికొను చంద్రహారములు మొదలగునగలు

కూటువు. దే. గుంపు, ప్రోగు

కూడ. దే. సహితము

కూడఁబడు. దే. చేరు

కూడఁబెట్టు. దే. చేర్చు, తార్చు

కూడముట్టు. దే. తఱుముకొనిపోవు

కూడలి. దే. రెంటిమూఁటికూడిక

కూడలితాయి. దే. ఎల్లతాయి

కూడలివాయి. దే. రెండుపంచెలు చేరెడు మూల నేర్పఱచిన నీటిదారి

కూడిక. దే. చేరిక, సంయోగము, రతి

కూడు. దే. అన్నము, పొందు, తగు, అంకములను మొత్తముచేయు

కూడుదల. దే. లాభము

కూణి. స. ఈచేఁబోయిన చేయిగలవాఁడు

కూణితము. స. మూయఁబడినది, ముడుచుకొన్నది

కూన. త. పిల్ల, బిడ్డ

కూనగుంత. త. మీటుమొదలుఆనెడుపల్లము

కూనరాగము. దే. కీచుమని అఱచుట

కూనరోగము. దే. కంటితెవులు

కూపకము. స. ఓడకంబము, పిఱుఁదిమీఁది గుంత, చెలమ, చేతిసిద్దె

కూపము. స. నుయ్యి, ఓడకంబము, పిఱుఁది మీఁదిగుంత, చెలమ

కూపారము
కూవారము } స. సముద్రము

కూపి. స. కుప్పె, గాజుకుప్పె

కూపెట్టు. దే. అఱచు, మొఱయిడు

కూబరము. దే. బండినొగ, మనోహరము

కూయి. దే. మొఱ, రక్షణము

కూయు. దే. అఱచు, మొఱపెట్టు

కూర. త. వ్యంజనము, తోఁటకూర మొద లైనవి, వండినవంకాయ మొదలగునవి
కూరట. దే. పొరలుట
కూరపసుపు. దే. కూరలో వేసెడు పసుపు
కూరము. స. అన్నము, వంటకము
కూరాడు. దే. కాఁచినకలి
కూరిచి / కూర్చి } దే. గుఱించి
కూరిమి / కూర్మి } దే. స్నేహము
కూరు. దే. కలుగు, పొందు, దుస్సిపోవు
కూరుకు / కూర్కు } దే. నిద్రించు, నిద్ర
కూరుకుపాటు. దే. నిద్ర
కూరుకొను / కూర్కొను } దే. చొచ్చు, చొప్పించు
కూరుచు / కూర్చు } దే. కూడఁబెట్టు, ప్రియపడు
కూరుచుండు / కూర్చుండు } దే. ఆసీనుఁడగు
కూరుపరి / కూర్పరి } దే. కూర్చునట్టివాఁడు, ఘటకుఁడు
కూరుపు / కూర్పు } దే. ఘటన, గుడ్డలను కలిసి కుట్టు
కూర్చము. స. దర్భపిడికిలి, కనుబొమల నడుము, మోసము
కూర్చిక. స. కుంచెకోల, జున్ను, చిత్రము వ్రాసెడు తూలిక, సూది
కూర్చుండఁబడు. దే. కూర్చుండు
కూర్పరము. స. మోఁచెయి, మోఁకాలు
కూర్పాసము. స. చొక్కా, అవిక
కూర్మము. స. తాఁబేలు, ఒకయుపవాయువు
కూలంకష. స. ఏఱు
కూలంకషము. స. సముద్రము, పూర్తియయిన
కూలఁబడు. దే. కూలు, పడు
కూలము. స. దరి, గుంట, దిబ్బ
కూలవతి. స. నది
కూలవేయు. దే. పడవేయు, తటాలున కూర్చుండఁబెట్టు
కూలి. దే. పనిచేసినందుకిచ్చెడు ధనము, పన్ను
కూలు. దే. పడు, చచ్చు
కూలుచు / కూల్చు } దే. పడఁజేయు, చంపు
కూశ్మాండము / కూష్మాండము } స. గుమ్మడి, పిశాచభేదము
కూస. దే. కుప్ప, కువ్వ
కూసము. త. అరచొక్కా, నిండుచొక్కా, అవికె, పాముయొక్కపైతోలు
కూసు. దే. నీచము, తక్కువ
కూళ. త. క్రూరుఁడు, కుత్సితుఁడు
కూళుఁడు. త. కుత్సితుఁడు, మూఢుఁడు

## కృ

కృంతనము. స. కోయుట
కృకణము. స. పక్షివిశేషము, కక్కెర
కృకము. స. కంఠనాళము, బొండుగు
కృకరము. స. కక్కెరయనుపక్షి, ఒక యుపవాయువు
కృకలాసము. స. తొండ, ఊసరవెల్లి
కృకవాకువు. స. కోడి, నెమలి
కృకాటిక. స. పెడతల
కృచ్ఛ్రము. స. ఒకవ్రతము, పాపము, బాధ
కృతకము. స. మనుష్యులచేతఁజేయఁబడినది

కృతకర్ముఁడు. స. నేర్పరి
కృతకాద్రి. స. క్రీడించుటకొఱకు నేర్పఱుపఁబడిన పర్వతము, చేతగట్టు
కృతకృత్యుఁడు. స. కృతార్థుఁడు
కృతఘ్నుఁడు.స. చేసినమేలుమఱచినవాఁడు
కృతజ్ఞము. స. కుక్క
కృతజ్ఞుఁడు. స. చేసినమేలు నెఱుఁగువాఁడు
కృతపడు. దే. కడచు, విడఁబడు
కృతపుంఖుఁడు. స. గుఱితప్పక బాణమును వేయువాఁడు
కృతమాలకము. స. నల్లగూబ
కృతమాలము. స. ఱేలచెట్టు
కృతము. స. చేయఁబడినది, ఒకయుగము
కృతముఖుఁడు. స. నేర్పరి
కృతలక్షణుఁడు. స. సద్గుణములచేతఁబ్రసిద్ధి నొందినవాఁడు
కృతసాపత్నిక. స. మొదటిపెండ్లాము
కృతహస్తుఁడు. స. గుఱితప్పక బాణమును వేయువాఁడు, నేర్పరి
కృతాంతము. స. భాగ్యము, అశుభకర్మము
కృతాంతుఁడు. స. యముఁడు
కృతార్థుఁడు. స. ధన్యుఁడు
కృతి. స. చేయుట, ప్రబంధము, చదువరి, ధన్యుఁడు, నేర్పరి
కృతుఁడు. స. కడుపుకూటివాఁడు
కృత్తము. స. ఛేదింపఁబడినది
కృత్తి. స. తోలు, చెట్టుపైపట్ట, ఒకానొక దేవత
కృత్తిక. స. ఒకనక్షత్రము
కృత్తివాసుఁడు. స. శివుఁడు
కృత్య. స. చేయుట, సంహారకదేవత
కృత్యము. స. పని, చేయఁదగినది
కృత్రిమధూపకము. స. అనేకపరిమళవస్తువులను కలిపి చేసిన ధూపము

కృత్రిమము. స. మనుష్యులచేఁ జేయఁబడినది, ఉప్పుదినుసు
కృత్స్నము. స. కడుపు, నీళ్లు, అంతయు
కృప. స. దయ, కనికరము
కృపణము. స. పురుగు, నీచము, బీద, నిరాధారమైనది, లోభియైనది
కృపణుఁడు. స. లోభి, కుత్సితుఁడు
కృపాణము. స. కత్తి
కృపాణి. స. కత్తి, కత్తెర
కృపాళువు. స. కనికరము గలవాఁడు
కృపీటము. స. కడుపు, నీళ్లు
కృపీటయోని. స. అగ్ని
కృపుఁడు. స. ద్రోణాచార్యుని మఱఁది
కృమి. స. పురుగు, లక్క
కృశత. స. కృశత్వము, చిక్కిపోవుట
కృశము. స. బక్క, సన్నము
కృశరము. స. పులగము
కృశానువు. స. అగ్ని
కృశానురేతసుఁడు. స. శివుఁడు
కృశాశ్వి. స. నటుఁడు
కృశించు. స. సన్నగిల్లు
కృషకము
కృషికము } స. కఱ్ఱు
కృషాణుఁడు. స. సేద్యకాఁడు
కృషి. స. సేద్యము, ప్రయత్నము
కృషికుఁడు
కృషకుఁడు } స. సేద్యకాఁడు
కృషీవలుఁడు
కృష్టము. స. లాగఁబడినది, ఒకసారిదున్నఁబడిన భూమి
కృష్టి. స. దుక్కి, చదువరి
కృష్ణ. స. ఒకానొకనది, ద్రౌపది, ద్రాక్ష

కృష్ణకర్ముఁడు. స. దురాచారుఁడు
కృష్ణదోషము. స. ఒకవిధమగుజ్వరము
కృష్ణపాకఫలము. స. కలివెచెట్టు
కృష్ణపాకి. స. నల్లగురిగింజ
కృష్ణఫల. స. కారుగచ్చే మొక్క
కృష్ణభేది. స. కటుకరోహిణి
కృష్ణము. స. నల్లనిది, ఇనుము, మిరియము, నలుపు, కృష్ణపక్షము, కాకి, కోవెల
కృష్ణల. స. గురిజచెట్టు
కృష్ణలోహితము. స. హెచ్చు నలుపుగలసిన ఎఱుపు
కృష్ణవల్లి. స. కమ్మేరాకుతీఁగ
కృష్ణవర్త్మ. స. అగ్ని, దురాచారుఁడు, రాహువు
కృష్ణవృంత. స. కలిగొట్టుచెట్టు
కృష్ణసారకము. స. నల్లవెదురుచెట్టు
కృష్ణసారము. స. నల్లఇఱ్ఱి, జముడుమొక్క
కృష్ణాజినము. స. నల్లయిఱ్ఱిచర్మము
కృష్ణిక. స. నల్లావాలు, తవిఁదలు
కృష్ణిమ. స. నలుపు
కృష్ణీకరణము. స. నలుపుచేయుట
కృష్ణుఁడు. స. విష్ణువు, అర్జునుఁడు, వ్యాసుఁడు
కృసరము. స. పులగము

## క్లృ.

క్లృప్తము. స. ఏర్పాటుచేయఁబడినది, సంగ్రహము
క్లృప్తి. స. ఏర్పాటు

## కె.

కెందమ్మి. దే. ఎఱ్ఱదామర
కెంపు. దే. పద్మరాగమణి, ఎఱుపు, ఎఱ్ఱనిది
కెంపుకంటి. దే. కోవెల
కెంపుగాము. దే. అంగారకుఁడు
కెంపుసవతు. దే. స్వాతీనక్షత్రము
కెడ. దే. పార్శ్వము
కెడపు. దే. పడఁజేయు, త్రోయు, చంపు
కెడయిక. దే. పడుట, చావు
కెడయు. దే. పడు, చచ్చు
కెడవు. దే. పడుట, పతనము
కెరకొట్టు. దే. కలకలకూయు
కెరలిమూడు. దే. చెలరేఁగు
కెరలు. దే. అతిశయించు, ఆగ్రహించు, విజృంభించు, కూయు, సంభ్రమించు
కెరలుచు, కెరల్చు. దే. కెరలఁజేయు, ప్రేరేపించు, కోపింపఁజేయు
కెరలుఁవొడుచు దే. వర్ధిల్లు, విజృంభించు
కెలఁకు. దే. కలపెట్టు, పెల్లగించు, దిక్కు, పార్శ్వభాగము
కెలన. దే. సమీపము
కెలను, కెలఁకు. దే. దిక్కు, పార్శ్వము
కెలయు. దే. విజృంభించు
కెలవు. దే. సంభోగేచ్ఛ, అనురాగము
కెలసము. దే. పని, అక్కఱ, ఉత్సాహము
కెల్లగించు. దే. పెల్లగించు, రేచు
కెల్లువారు. దే. సంతోషించు, పైఁబడు
కెళకుళి. త. కేళాకూళి
కెళవు. దే. దూరము, పార్శ్వము
కెళాకుళి, కెళాకూళి. త. కేళాకూళి

## కే.

కే. దే. ధ్వన్యనుకరణము, కూఁత
కేంద్రము. స. వృత్తముయొక్క మధ్యభాగము, నాభి

కేక. దే. పెద్దకూఁత
కేక. స. నెమలికూఁత, పెద్దకూఁత
కేకయము. స. ఒకానొకదేశము
కేకరము. స. మెల్లకన్ను, కడకన్ను
కేకరించు. దే. కేకలువేయు, సకిలించు నట్లుశబ్దించు, కటాక్షించు
కేకరింత. దే. కేకలువేయుట, గొంతడు పుటీయుటకు సకిలించునట్లు శబ్దించుట
కేకరుఁడు. స. మెల్లకంటివాఁడు
కేకారవము. స. నెమలికూఁత
కేకి. స. నెమలి
కేకిసలు. దే. చప్పట్లు, నతివిశేషము
కేటత్రాడు దే. యమపాశము
కేడ. దే. ధూర్తుఁడు
కేడించు. దే. తొలఁగు, అలక్ష్యముచేయు
కేడెము. త. డాలువాలు, ఖేటకము
కేతకి. స. మొగలి, గేదఁగి
కేతనము. స. టెక్కెము, గుఱుతు, ఇల్లు
కేతము. స. తెలిసినది, ఇల్లు, జెండా, కోరిక, పిలుపు, భాగ్యము, బుద్ధి, ఆకృతి
కేతి. త. ఖ్యాతి
కేతువు. స. ఒకగ్రహము, ధూమకేతువు, టెక్కెము,గుఱుతు, అగ్ని, ముఖ్యుఁడు, ప్రకాశము, ఆకృతి, బుద్ధి
కేదరము } స. వరిమడి, కొండ, పాదు,
కేదారము } శివక్షేత్రము
కేదారకంకణము. దే. ఒకదినుసుకంకణము
కేదారుఁడు. స. శివుఁడు
కేనిపాతకము. స. చుక్కాని, ఓడనడపెడు తెడ్డు
కేమము. స. పులిపిరికాయ
కేయూరము. స. బాహుపురి
కేరజేము. త. ఒకానొకపక్షి
కేరడము. దే. ఉపేక్ష, తిరస్కారము, తిరస్కారపుమాట, వంకరమాట
కేరడించు. దే. వక్రముచేయు, పరిహాసము చేయు
కేరళము. స. ఒకానొకదేశము, ఒకవిధమగు జ్యోతిషము
కేరించు. దే. విజృంభించు
కేరు. దే. ఉత్సహించు, విజృంభించు,పరిహసించు, తిరస్కరించు, కుతూహలపడు, కూయు
కేరుపు. దే. విజృంభణము
కేలు. త. చేయి, తొండము
కేలుమొగ్గ. త. చేమోడ్పు
కేల్పట్టు. దే. వివాహము
కేవడము. త. కేడెము, డాలు
కేవరి. దే. కేలుపుచ్చుకొనువాఁడు
కేవలము. స. నిర్ణయింపఁబడినది, అంత, ఒకటి, స్వచ్ఛము
కేవలుఁడు. స. పరమాత్మ
కేవు. దే. ఓడకిచ్చెడు కూలి
కేశకారము. స. గొఱపము
కేశకుఁడు. స. వెండ్రుకలు చక్కఁజేయుటలో నేర్పరి
కేశఘ్నము. స. బట్టతల
కేశపాశము. స. కొప్పు
కేశపాశి. స. సిగ, జుట్టు
కేశబంధము. స. పువ్వులుముడిచిన కొప్పు
కేశమార్జనము. స. దువ్వెన
కేశము. స. వెండ్రుక, కురువేరు

కేశముష్టి. స. తేనెమ్రాను

కేశవము. స పొన్నచెట్టు

కేశవుఁడు. స. విష్ణువు, మంచివెండ్రుకలు గలవాఁడు

కేశవేశము. స. కొప్పు

కేశాంబునామము. స. కురువేరు

కేశి. స. ఒకానొక రాక్షసుఁడు, మంచి వెండ్రుకలు గలవాఁడు

కేశికుఁడు. స. మంచివెండ్రుకలుగలవాఁడు

కేశిని. స. పద్మపుతీఁగ, మంచివెండ్రుకలు గలయాఁడుది

కేశుఁడు. స. వరుణుఁడు

కేసరము. స. ఇంగువ, జూలు, నాగకేసరము, పొన్నచెట్టు, కింజల్కము

కేసరి. త. ఒకానొకమృగము, సస్యవిశేషము

కేసరి. స. సింహము, గుఱ్ఱము, నాగకేసరము, పొన్నచెట్టు

కేసరులు. త. వడ్లలోని భేదము

కేళకుళి, కేళకూళి, కేళాకూళి } త. క్రీడాసరస్సు, మడుఁగు, జలయంత్రము

కేళి. స. ఆట, స్త్రీపురుషపరిహాసము

కేళిక. త. నృత్యము

కేళికాగృహము. స. శయనగృహము, ఎండకాలములోచెల్లఁదనమునకుపయోగించే గృహము

కేళికాడుట. త. నాట్యముచేయుట

కేళికాసచివుఁడు. స. కూడనాడువాఁడు

కేళిశీలుఁడు. స. నవ్వించువాఁడు

## కై

కై, కయి } దే. చతుర్థీ విభక్తియందువచ్చెడు ఒకప్రత్యయము, చేయి, తొండము

కైంకర్యము. స. సేవ, దేవునికిఁజేయుసేవ

కైక, కయిక } త. కైకేయి, దశరథుని భార్య

కైకట్టు, కయికట్టు } దే. సందర్భము

కైకర్ణిక. దే. వశ్యక్రియ

కైకానుక, కయికానుక } దే. చేతిలో నియ్యఁదగిన కానుక, వస్తువు

కైకేయి. స. కేకయరాజు కూఁతురు

కైకొను, కయికొను } దే. పూను, గ్రహించు, లక్ష్యపెట్టు

కైకొలుపు, కయికొలుపు } దే. కైకొనఁజేయు

కైకోల, కయికోల } దే. సాలెభేదము

కైకోలు, కయికోలు } దే. అంగీకారము, గ్రహించుట

కైచాఁపులు, కయిచాఁపులు } దే. నమస్కారము

కైజీతము, కయిజీతము } దే. బత్తెము

కైజో, కయిజో } దే. వాగెను అనఁగా గుఱ్ఱపునోటికళ్లెమునకు తగిలించెడు పగ్గమును వెనుక కీడ్చికట్టుట

కైజోఱు, కయిజోఱు } దే. ఒఱగు

కైజే, కయిజే } దే. కాఁజేపిట్ట

కైటభారి. స. వెన్నుఁడు

కైడర్యము. స. కఱివేపచెట్టు

కైత, కయిత } త. కవిత్వము

కైతప్పు } దే. చేతిపొరబాటు
కయితప్పు }

కైతవము. స. కపటము, జోదము

కైతాళము } దే. చేతవాయించే కంచే తాళము
కయితాళము }

కైదండ } దే. హస్తావలంబనము
కయిదండ }

కైదారకము } స. కేదారముల (వరిమళ్ల) సమూహము
కైదారికము }
కైదార్యము }

కైదు } దే. కాఁజేపిట్ట
కయిదు }

కైదువు } దే. ఆయుధము
కయిదువు }

కైపదము } దే. సమస్య
కయిపదము }

కైపు } దే. మత్తు, కపటము, విధము, అందము
కయిపు }

కైముడి } దే. తాళవాద్యవిశేషము
కయిముడి }

కైమోడుపు } దే. నమస్కారము
కయిమోడుపు }

కైరేఁడు } దే. ఈపేరుగల గుఱ్ఱము
కయిరేఁడు }

కైరవడి } దే. కవిరియుంట
కయిరవడి }

కైరవబంధువు } స. చంద్రుఁడు
కైరవమిత్రుఁడు }

కైరవము. స. తెల్లగలువ

కైరవిణి. స. తెల్లగలువలుగల కొలను

కైరవుఁడు. స. జోదరి, పగవాఁడు

కైలాగు } దే. కైదండ
కయిలాగు }

కైలాటకాఁడు } దే. కుత్సితుఁడు
కయిలాటకాఁడు }

కైలాటము } దే. మాయోపాయము
కయిలాటము }

కైలాసము. స. వెండికొండ

కైలు } దే. ధాన్యరాశికొలత
కయిలు }

కైవడి } దే. విధము, పోలిక, ప్రకారము
కయివడి }

కైవడిముస్తె } త. తుంగముస్తె
కయివడిముస్తె }

కైవర్తము } స. తుంగముస్తె
కైవర్తి }

కైవర్తుఁడు. స. చేపలఁబట్టువాఁడు

కైవల్యము. స. మోక్షము

కైవసము. దే. అధీనము

కైవారపుచేతులు. దే. నమస్కారము

కైవారము } దే. గనిమయంచే, చేట్టు కొలత
కయివారము }

కైవారము } త. స్తోత్రము
కయివారము }

కైవారము. స. వందిస్తోత్రము

కైవారి. స. వంది, స్తుతిచేసి జీవించేవాఁడు

కైవు } దే. కైపు
కయివు }

కైవ్రాలు } దే. ఒఱగు, పక్షులు క్రిందికి దిగు, పడు
కయివ్రాలు }

కైవ్రాలుచే } దే. కైవ్రాలఁజేయు
కయివ్రాలుచే }

కైశికము. స. వెంట్రుకలసమూహము,కొప్పు
కైశికి. స. ఒకకావ్యవృత్తి
కైశోరము. స. వయోవిశేషము
కైశ్యము. స. కైశికము
కైసన్న. దే. పిలుపు
కైసరుఁడు. త. కవీశ్వరుఁడు
కైసాటిచుక్క, కయిసాటిచుక్క } దే. హస్తనక్షత్రము
కైసేఁత, కయిసేఁత } దే. అలంకారము
కైసేయు, కయిసేయు } దే. అలంకరించు, పూజించు

## కొ

కొంకనక్క. దే. చిన్నజాతినక్క
కొంకర. దే. వంపు
కొంకరలువోవు. దే. వాతముచేఁ గాళ్లు చేతులు వంకరలుపోవు
కొంకి. దే. వంపుచీల, దోఁటి, వంపుగా నుండు పక్షిగోరు
కొంకు. దే. భయము, సందేహము, భయపడు, వెనుదీయు, పిఱికితనము, సంకోచించు
కొంకుపాటు. దే. భయపడుట, సంకోచపడుట
కొంకులు. దే. ముచ్చిలిగుంటకుఁ బార్శ్వములయందుండెడియెముకలు, మోఁకాలి చిప్పకు లోతట్టు రెండుప్రక్కల నుండెడి యెముకలు
కొంకువోవు. దే. కొంకరలువోవు
కొంగ. త. బకము
కొంగకాళ్లవాఁడు. దే. నిడుపు మోఁకాళ్లవాఁడు
కొంగవాలు. త. మాదిగవానికత్తి
కొంగు. దే. వస్త్రపుచెఱఁగు
కొంగుమాయు. దే. బహిష్ఠయగు
కొంగోడువడు, కొంగోడువోవు } దే. ఒఱగు, కుక్కిపడు
కొంచించు. దే సంకోచించు
కొంచియము. త. కొంచెము, అల్పము
కొంచెకత్తె. త. అల్పురాలు, సామాన్యురాలు
కొంచెకాఁడు. దే. అల్పుఁడు, సామాన్యుఁడు
కొంచెతనము. త. అల్పభావము
కొంచెపడు. త. తక్కువపడు, సన్నగిల్లు
కొంచెము. త. అల్పము, న్యూనత
కొంచే. త. ఒకానొకకొండ, ఒకానొక పక్షి
కొంచేదీవి. త. క్రౌంచద్వీపము
కొంచేమల. త. క్రౌంచపర్వతము
కొంచేమొగ్గరము. దే. క్రౌంచవ్యూహము
కొంచేసారము. త. మధ్యమస్వరము
కొంచు. దే. ముఱికి,చెమట,కొఱఁత, కొంజు
కొంచు. త. సంకోచించు
కొంజు. త. సంకోచించు
కొంట. దే. కొనుట
కొంటె. దే. తుచ్ఛుఁడు, అకార్యశీలుఁడు
కొంటెతనము. దే. అల్లరి, దుశ్చేష్ట
కొండ. త. పర్వతము
కొండంగి, కుండంగి } త. కొండముచ్చు
కొండకంది. దే. సస్యవిశేషము
కొండకాకి. త. ఒకదినుసుకాకి
కొండకాలువ. త. సెలయేఱు
కొండకోట. దే. ప్రాకారాకారమైనపర్వతము

కొండకోలు. దే. కొద్దియగుట
కొండగుఱుతు. దే. సామాన్యలక్షణము
కొండగోనుగు. దే. అక్షోటవృక్షము
కొండగొఱ్ఱె. దే. రోహిషమృగము
కొండగోఁగు. దే. కర్ణికారవృక్షము
కొండచిలువ. దే. కొండపాము
కొండచీమ. దే. ఒకదినుసు చీమ
కొండచూలి. దే. పార్వతి
కొండత్రిమ్మరి. దే. కోఁతి
కొండనాలుక. దే. చిఱునాలుక
కొండపగతుఁడు. దే. ఇంద్రుఁడు
కొండపలుకు. దే. పర్వతబిలమునందలి ప్రతిధ్వని
కొండపిండి. త. వృక్షవిశేషము
కొండప్రత్తి. దే. ఒకదినుసుప్రత్తి
కొండబూరుగు. దే. కూటశాల్మలివృక్షము
కొండబెండ. దే కచ్ఛూరకవృక్షము
కొండమల్లె. త. గిరిమల్లిక
కొండమామిడి. దే. కోశామ్రవృక్షము
కొండమారేడు. దే. గంధగర్భవృక్షము
కొండము. త. గుండము
కొండముచ్చు, కొండముసువ } దే. ఒకదినుసుకోఁతి
కొండయల్లుఁడు. దే. శివుఁడు
కొండరులు. దే. కొండయందుండువారు
కొండఱేఁడు. దే. హిమవంతుఁడు
కొండవీటిచేంత్రాడు. దే. మిగుల నిడివిగల చేంత్రాడు
కొండల్లము. త. ఒకదినుసు అల్లము
కొండవారు. దే. కొండయందుండెడు బోయలు
కొండవీటిజెంగము. దే. శివుఁడు
కొండాటము. దే. సంతోషము, బాధ
కొండాడు. దే. స్తుతించు
కొండి. దే. తేలుతోఁక, ఇనుపగొళ్లెము
కొండిక. త. చిన్న, బాలుఁడు
కొండికనాఁడు. దే. బాల్యకాలము
కొండియ. దే. కొండె
కొండియము. దే. కొండెము
కొండియుఁడు, కొండీఁడు } దే. కొండెముచెప్పువాఁడు
కొండె. దే వెండ్రుకలముడి, కొండెసిగ
కొండెంగ. త. నల్లకోఁతి
కొండెకత్తె. దే. కొండెముచెప్పునది
కొండెకాఁడు. దే. కొండెముచెప్పువాఁడు
కొండెము. దే. చాడి
కొండెవల. దే. చేఁపలఁ బట్టుటకు ఒకఁడు వేసెడువల
కొండొక. త. కొంచెము, చిన్న, బాలుఁడు
కొండ్ర. దే. మళ్లించిదున్నినచాలు, పొలము
కొండ్రకయిదువు. దే. నాఁగలి
కొండ్రచేసికొను. దే. సేద్యముచేసికొను
కొంత. త. ఇంచుక, కొలఁది
కొంతము త. ఆయుధవిశేషము, ఈఁటె
కొంతఱు. త. కొంతమంది
కొందలపడు. దే. కలఁతపడు, దుఃఖపడు
కొందలపాటు. దే. దుఃఖపడుట, దుఃఖము
కొందలము. దే. కలఁత, దుఃఖము, క్షోభము
కొందలించు. దే. కలఁతపడు
కొందు. దే. నజ్జుగనఱకు
కొంప. దే. ఇల్లు, అల్పగృహము
కొంపచెఱుపు. దే. పనికిమాలినవాఁడు
కొంపోవు. దే. తీసికొనిపోవు
కొకిబికి. దే. చక్కనతప్పినది

కొక్కరాయి. త. కొక్కెర, కొంగ

కొక్కరించు. దే. పక్షులుకాళ్లతో కెల్లగించు, కోఁతులు వెక్కిరించు

కొక్కరింత. దే. కొక్కరించుట

కొక్కి. దే. గొగ్గి, ఎచ్చుతక్కువైనది

కొక్కిస. దే. మల్లబంధవిశేషము

కొక్కు. దే. పందికొక్కు

కొక్కురవుతు. దే. విఘ్నేశ్వరుఁడు, వినాయకుఁడు

కొక్కెర. త. కొంగ

కొక్కెరతాలివేల్పు. దే. బకాసురుఁడు

కొక్కెస. దే. ఒకానొకచెట్టు

కొకొక్కొగొకో / కొకొక్కొరోకో. దే. కోడికూయుటయందగు ధ్వన్యనుకరణము

కొక్కోకము. దే. రతిరహస్య మనునొక గ్రంథము, రతిశాస్త్రము

కొజ్జా. దే. రాణివాసపు కావలివాఁడు

కొటారము / కొటారు. దే. ధాన్యము ఉప్పు మొదలగు రాసు లుండెడిచోటు

కొటారి. దే. ఉగ్రాణపువాఁడు

కొటిక. త. గ్రామము, లోభి

కొటిక. దే. పొట్టివాఁడు

కొటికాఁడు. దే. వేగరి

కొట్టకొన. దే. అన్నిటికిఁ గొన

కొట్టడి. త. సరుకులుంచెడు గది

కొట్టము / కొట్టాము. త. పశువులను గట్టెడిచోటు

కొట్టము. దే. నృత్యవిశేషము

కొట్టరువు. దే. కొటారు

కొట్టాడు. దే. జగడమాడు, బాధపడు

కొట్టి. దే. వేగు

కొట్టిక. త. గ్రామము, లోభి

కొట్టికాఁడు. దే. వేగరి

కొట్టు. దే. ప్రహరించు

కొట్టు. త. సామగ్రు లుంచెడుగది

కొట్టుకాఁడు. దే. చెలించు, దుఃఖించు

కొట్టుపడు. దే. వ్యయమగు

కొట్టులాట. దే. కొట్టులాడుట

కొట్టులాడు. దే. పోట్లాడు

కొట్టె. దే. పొడక, మిక్కిలి దళము గల కాఁగు

కొట్నము. దే. వడ్లదంపకము, వివాహతంత్రవిశేషము, ఊడిగము

కొట్ర. దే. పిండిని ఉడుకఁబెట్టుటకుఁబెట్టెడి యెసరు

కొట్ర. త. వామనుఁడు

కొట్లమారి. దే. కొట్టుపడుస్వభావము గలవాఁడు

కొట్లాట. దే. కొట్టులాట

కొడమ. దే. చేఁపలఁబట్టుసాధనము

కొడవలి. దే. కోసెడుసాధనము

కొడి. త. దీపశిఖ

కొడిది. దే. ఒకానొకచెట్టు

కొడిపిలి. దే. పుడిసిలి

కొడిమె. దే. ఆపదూఱు, పాపము, చేఁపల బుట్ట

కొడిమెలాఁడు. దే. పాపాత్ముఁడు

కొడిసె. త. కొండమల్లె

కొడిసెపాల. దే. కొడిసెవిత్తు

కొడుఁగురు. దే. దీపముయొక్కచిట్టెము

కొడుకఁడు / కొడుకు. త. కొడుకు, పుత్త్రుఁడు

కొడుపు. దే. గంటవాయించెడు సన్నకొయ్య, బలపపుకోఫు, వెదురుకనుపుల నడిమిభాగము

కొడుము. దే. బిందెవంటికుండ

కొడ్కు. త. కొడుకు

కొడ్డి. దే. కొడిది

కొణజో. దే. వాకిటికావలియిల్లు

కొణత } దే. కుక్కనుగట్టెడుకొయ్య,
కొణతము } మల్లవిద్యాసాధనము

కొణిఁగె. దే. కుప్ప, దిబ్బ

కొణిగ. దే. ముంజూరు

కొణిద. దే. జాతిభేదము

కొణిదిలి. దే. పుడిసిలి

కొణుఁగురు. దే. దీపపుచిట్టెము

కొణుజే. దే. కుక్కపేరు, పిడుఁజే

కొతిమిరి. త. కొత్తిమిరి

కొతుకు. దే. సంకోచించు, వర్ణలోపము గామాటాడు, వర్ణలోపము గలమాట, సంకోచము

కొతుకుపడు. దే.సంకుచితమగు (మాటలుప్త వర్ణమగు)

కొత్తిమిరులు. త. దనియాలు

కొత్తెము. దే. తాటిపండ్లకండ

కొద. దే. కొదవ

కొదమ. దే. పశుపక్ష్యాదులపిల్ల, దృఢము, ఆఁడుమేఁకపిల్ల, యౌవనము తలచూపినది (పశుపక్ష్యాదికము)

కొదరు. దే. అతిశయించు, చెదరు, రేఁగు

కొదవ. దే. కొఱఁత

కొదవపెట్టు. దే. తక్కువపఱచు, ముగింపకయుండు

కొదుక. దే. తక్కువ

కొదుకు. దే. కొతుకు, సంకోచించు

కొదుపు. దే. ఏదేనినోటవేసికొని మ్రింగక ఊరకనములు, ఊరించు

కొద్ది. దే. కొలఁది

కొద్దికాఁడు. దే. అల్పుఁడు

కొన. త. చివర

కొనకొను. దే. యత్నించు

కొనచెవి. దే. చెవియొక్కయూర్ధ్వభాగము

కొనటి. త. అంగహీనుఁడు

కొనరిక్క. త. రేవతీనక్షత్రము

కొనలిడు } దే. వర్ధిల్లు
కొనలొత్తు }

కొనసాగించు. దే. పూర్తిచేయు

కొనసాగు. దే. వర్ధిల్లు, సిద్ధించు

కొని. దే కొన్ని

కొనిపోవు. దే. తీసికొనిపోవు

కొనియాట. దే. నుతించుట, ఆదరించుట, కాపాడుట, కొలుచుట

కొనియాడు. దే. నుతించు, ఆదరించు, కాపాడు

కొనివచ్చు. దే తెచ్చు

కొను. దే. అపహరించు, వెలకుఁదీయు, గ్రహించు, తీసికొను, పట్టుకొను, సరిపడు, నాటు

కొనుగోలు. దే. క్రయము, నట్టువుఁడు కొలిపించుట

కొనుజు. దే. పిడుఁజే

కొనుబడి. దే. కొనుగోలు, క్రయము

కొనుమొదలు. దే. కొనుటకిచ్చినధనము

కొన్నాళ్లు. దే. కొన్నిదినములు

కొన్ని. దే. కొంతసంఖ్యగలవి

కొపురు. త. శిఖరము, ఉన్నతి

కొప్పరము. త. శిఖరము, మూఁపు, అతిశయము

కొప్పరించు. త. అతిశయించు,విజృంభించు, కుమ్మరించు,పుటమువేయు, షండ్లిగిలించు

కొప్పరింత. త. అతిశయించేట
కొప్పు. దే. తలయందు దోఁపిన వెండ్రుకల ముడి, వింటికొన, ఇంటిసడికప్పు
కొప్పెర. త. వెడల్పు ముఖముగల పెద్ద పాత్రము
కొప్పెర. దే. కొబ్బరి
కొప్రము. త. శిఖరము
కొబ్బరిపువ్వు. దే. మొక్క మొలచిన కొబ్బరికాయలోని పువ్వు
కొబ్బెర. దే. చిప్పతీసిన టెంకాయ, కొబ్బరి
కొబ్బెరకాయ. దే. టెంకాయ, కొబ్బరికాయ
కొబ్బెరపండు. దే. కొబ్బెరకాయ
కొబ్బెరయుండ. దే. భక్ష్యవిశేషము
కొమ. దే. ఆఁడుది, శాఖ
కొమరసామి. త. కుమారస్వామి
కొమరాలు. దే. యౌవనవతి, సౌందర్యవతి
కొమరిత. త. కూఁతురు
కొమరు. త. సౌందర్యము, మనోజ్ఞము
కొమరుఁడు. త. కొడుకు, పిన్నవయసు వాఁడు, కుమారస్వామి
కొమరుఁదనము, కొమరుబాయము } త. యౌవనము
కొమరులు. దే. దూలముమీఁది గుజ్జులు, కొడుకులు
కొమరుసామి. దే. కుమారస్వామి
కొమరేఱు. దే. స్వామి పుష్కరిణి
కొమారి, కొమారిత, కొమారితె } త. కూఁతురు
కొమారుఁడు. త. కొడుకు
కొమార్త, కొమార్తె } త. కొమారిత, పుత్త్రిక

కొమిరె. త. యౌవనముగల స్త్రీ
కొమ్మ. దే. శాఖ, ఆఁడుది, కోటకొమ్మ
కొమ్మటెంకిమెకము. దే. కోఁతి
కొమ్మత్రిమ్మరి. దే. కోఁతి
కొమ్మనఁటి. దే. కదళీవిశేషము, కొమ్మరఁటి
కొమ్మమెకము. దే. కోఁతి
కొమ్మి. దే. ఒకానొకచెట్టు
కొమ్ము. దే. ఉకారముయొక్క రూపాంతరనామము, పశువులకొమ్ము, చెప్పులు కుట్టువాఁడు క్రొవ్వుంచుకొనెడిపాత్రము, పసుపుకొమ్ము, చిమ్మనఁగ్రోవి, పల్లకీబొంగు, ఏనుఁగుయొక్క దంతము, పందికోఱ, ఊఁదెడివాద్యము, శిఖరము, కొన, ఉత్సాహము, బలము, శాఖ
కొమ్ముకాఁకర. దే. కాఁకరలోని భేదము
కొమ్ముకాఁడు. దే. పంది, అగసాలెవాఁడు, కొమ్మూఁదెడు మాదిగవాఁడు
కొమ్ముచేఁప. దే. మత్స్యవిశేషము
కొమ్ముటేనుఁగు. దే. మగయేనుఁగు
కొమ్ముపెసర. దే. సస్యవిశేషము
కొమ్ముమాచేకమ్మ. దే. లోఁకొమ్ములుగల మాచేకమ్మ
కొమ్మువాఁడు. దే. కొమ్మూఁదెడు మాదిగవాఁడు
కొయికండ. దే. పెరిగిన దుర్మాంసము
కొయ్యగూర, కొయ్యకూర } దే. కోయఁదగిన తోఁటకూర
కొయ్య. దే. కఱ్ఱ, మ్రాను
కొయ్యగాలు. దే. కోఁతకోసిన మోడు
కొయ్యతనము. దే. మూర్ఖత్వము
కొయ్యఁద్రిప్పు. దే. ఆకతాయ

కొరడు. త. గుడ్లగూబ

కొరడు. దే. వంకరగాక సరిగా నుండెడి యింద్రధనుస్సు

కొరద. దే. మత్స్యవిశేషము

కొరవంజి. దే. ఎఱుకువాఁడు, ఎఱుకుది

కొరవి. త. ఎఱ్ఱగోరంట

కొరసానిగండు. దే. మృగవిశేషము

కొరి. దే. ఱెప్పనడిమివెంట్రుక

కొర్నవగండు. దే. కొరసానిగండు, కణఁతి మృగము

కొఱ. దే. కొఱఁత, ప్రయోజనము,మత్స్య విశేషము, శిల్పము

కొఱఁకు. దే. పశువులు మేయుఁకంచె, పక్షు లెరయేఱి తినుచోటు

కొఱఁత. దే. తక్కువ, కొఱ

కొఱఁతనుఱుకు.దే.అకార్యము చేయు, అకార్యము జేయువాఁడు

కొఱకచ్చు. దే. కొఱవి, సగముకాలినకఱ్ఱ

కొఱకు. దే. చతుర్థీవిభక్తియందు వచ్చెడి ఒకప్రత్యయము

కొఱకొఱ. దే. కోపవికారము

కొఱకొఱలాడు. దే. కోపగించు

కొఱగామి. దే. అకార్యము, దుర్లక్షణము, దోషము

కొఱడు.దే.ఆయుధవిశేషము, ప్రాని మోడు

కొఱడుకోల. దే. ఆయుధవిశేషము

కొఱడుపాఱు. దే. తిమురుపట్టు

కొఱను. దే. పశువులుమేయుఁకంచె, పక్షు లాహారము నేఱితినుచోటు

కొఱనోము. దే. తక్కువనోము

కొఱపనికొయ్య. దే. పనికిమాలినవాఁడు

కొఱపము.-త. గుఱ్ఱమునుదోమెడుగొఱపము

కొఱప్రాణము. దే. కుట్టుసుఱు

కొఱముట్టు. దే. పనిముట్టు

కొఱలు. దే. ప్రకాశించు, ఉండు, పొందు

కొఱవ. దే. ఒకానొకహీనజాతి

కొఱవత. దే. కొఱవది

కొఱవి. దే. కొఱకచ్చు

కొఱవిచీమ. దే. పెద్దఎఱ్ఱచీమ

కొఱవిదయ్యము. దే. పిశాచభేదము

కొఱవోవు. దే. మూర్ఛిల్లు

కొఱసంది. దే. ఆయము, జీవస్థానము

కొఱు. దే. కొఱ్ఱు

కొఱుకు. దే. కఱచు, మేహరోగవిశేషము

కొఱ్ఱ. దే. మత్స్యవిశేషము, సస్యవిశేషము

కొఱ్ఱు. దే. మేకు, శూలము

కొల. దే. పాపము, పరిమాణము, హింస

కొలఁకు<br>కొలఁకువు } త. కొలను

కొలఁది. దే. పరిమితి, శక్యము

కొలకొల. త. కలకలము

కొలగాఁడు. దే. ధాన్యము కొలుచువాఁడు

కొలగారము. దే. ధాన్యపుకొలత, కొలత కిచ్చెడు కూలి

కొలత. దే. పరిమాణము, కొలుచుట

కొలను<br>కొలఁకు } త. గుంట, సరస్సు

కొలపాత్రము. దే. కొలిచెడు మానికలో నగునది

కొలము. త. కులము, సజాతీయప్రాణి సమూహము

కొలారకము. దే. ధాన్యమును కొలుచుట

కొలారము<br>కొలారు } దే. నడుమ బయలును నాలుగు ప్రక్కలఁ గట్టడమును గల యిల్లు

కొలారుబండి. దే. గాడీ
కొలి. దే. చిన్నపల్లము
కొలికి. దే. కన్గొన, కొక్కి, పరిపాకము
కొలికిపూస. దే. కొలికికిఁదగిలించెడు పూస
కొలికిముడి దే. వదలుముడి
కొలిపించే. దే. వడ్లుమొదలైనవానినికొలువఁజేయు, నట్టువుఁడుకొనుగోలుచేయు
కొలిమి. దే. కమ్మరివాఁడు నిప్పునుంచుపల్లము
కొలిమితిత్తి. దే. కొలిమి యూఁదెడుతిత్తి
కొలుచే. దే. ఉపాసించే, సేవించే, ధాన్యమునుకొలుచే, వరిధాన్యము
కొలుపు. దే. సమ్మతించే, సరిపడు, చెల్లు, పుట్టించే, సైఁగచేయు, గ్రామదేవతోత్సవము, పురికొల్పు, నట్టువుఁడుకొలిపించే
కొలువడి. దే. కొలత
కొలువాసములు. దే. మత్స్యవిశేషము
కొలువు. దే. రాజసభ, సేవ, ఉద్యోగము
కొలువుకాఁడు, దే. సేవకుఁడు
కొలువుకూటము. దే. ఆస్థానము, సభాభవనము
కొలువుగొను. దే. సేవకునిగా పరిగ్రహించు
కొలువుడుకాఁడు. దే. సేవకుఁడు
కొలె. దే. మొదలుకొని
కొల్చు. దే. కొలను
కొల్ల. దే. కొలఁది
కొల్ల. దే. దోఁపుడు, విశేషము
కొల్లకత్తె. దే. కొల్లపెట్టునది
కొల్లకాఁడు. దే. కొల్ల పెట్టువాఁడు
కొల్లకొట్టు. దే. కొల్లపెట్టు, విశేషలాభము నొందు
కొల్లగొను. దే. కొల్ల పెట్టు
కొల్లపెట్టు. దే. అపహరించే
కొల్లరి. దే. కొల్లగొనువాఁడు

కొల్లలాడు. దే. దోఁచుకొను, అపహరించే
కొల్లవోవు. దే. చూఱపోవు
కొల్లాడు. దే. కొల్లపెట్టు
కొల్లాబండి. దే. గాడీ
కొల్లారము, కొల్లారు } దే. నడుమబయలును నాలుగు ప్రక్కలఁ గట్టడమును గలయిల్లు
కొల్లారుబండి. దే. కొల్లాబండి
కొల్లి. దే. ఒకానొకచెట్టు
కొల్లు. దే. నీటిగుంట, వంపు
కొల్లేరు. దే. ఒకానొకసరస్సు
కొస. దే. కొస, పనికిరానితృణాదులచివర
కొసరు. దే. విజృంభించే, సంకోచించే, ప్రార్థించు, కోరిక, ఒకవస్తువును కొన్నదానికిచ్చెడు పెచ్చు, ప్రార్థనము, సంకోచము
కొస్సె. త. కుశ, దర్భ

## కో

కో. దే. అఱపునందగు ధ్వన్యనుకరణము
కోంకణము. స. ఆయుధవిశేషము, ఒకానొకదేశము
కోఁగు. దే. గోఱుగు, నాఱు
కోఁచే. దే. పిఱికివాఁడు
కోఁచేవాఱు. దే. భయపడు
కోఁడు. దే. బియ్యము మొదలగునవిచేఁటలోఁబోసి రాళ్లు మొదలగునవి వేఱుపడునట్లు ప్రక్కవాటుగాఁ జెరగుట
కోఁత. దే. కోయుట
కోఁతపట్టు. దే. చేనుకోయనారంభించే
కోఁతపడు. దే ఖండితమగు
కోఁతి. దే. వానరము
కోఁతిపుల్లలు. దే. మగ్గపుపలకదారములను మీఁదికిఁదగిల్చెడు పుల్లలు

కోఁదాడు. త. తాళవృక్షవిశేషము
కోక. దే. వస్త్రము, చీర
కోకనదము. స. చెంగలువ
కోకము. స. జెక్కువ, తోఁడేలు
కోకశాస్త్రము. స. రతిశాస్త్రము
కోకిలము. స. కోయిల
కోకిలాక్షము. స. ములుగోలిమిడిచెట్టు
కోగెల. త. కోవెల, కోకిలము
కోచము. స. ముడుఁచుకొనిపోవుట, వాడిపోవుట
కోట. త. దుర్గపురము, పట్టణముచుట్టుగల ప్రహరి
కోటఁడు. త. గుడ్లగూబ
కోటకొమ్మ. దే. కోటమీఁది బురుజు
కోటము. స. గుడ్లగూబ
కోటరము. దే. కోడంట్రము
కోటరము. స. చెట్టుతొఱ్ఱ
కోటరి. స. దిసమొలగల ఆఁడుది
కోటరింపు. దే. పెద్దపులికూఁత
కోటలికము. దే. కోడలికము
కోటవి. స. దిసమొలది
కోటానగోఁటులు. దే. అసంఖ్యములు
కోటి. దే. వేగు
కోటి. స. అంచు, వింటికొప్పు, చివర, సంఖ్యావిశేషము, అతిశయము
కోటికాఁడు. దే. వేగువాఁడు
కోటివర్ష. స. పిక్కచెట్టు
కోటిశము } స. మట్టిగడ్డలు కొట్టెడి
కోటీరము } కొయ్య
కోటీరము. స. కిరీటము
కోటేరు. దే. తలక్రిందుగావేసిననాఁగేలు
కోట్టము. స. దుర్గపురము
కోట్టారము. స. నీటిపల్లము
కోట్రము. దే. కోడంట్రము
కోరము. స. గుండ్రని ఎఱ్ఱకుష్ఠు
కోడంట్రము } దే. కోడలికము, స్నుషాత్వము, కోడలితనము
కోడంట్రికము }
కోడలికము. దే. కోడంట్రము
కోడలు. దే. కొడుకుయొక్క పెండ్లాము
కోడాడు. దే. బాధపడు
కోడి. దే. కుక్కుటము
కోడిగ. దే. పగడము మొదలగువాని ఇరువదింటి సంజ్ఞ
కోడిగము. దే. అపహాస్యము, విలాసచేష్ట
కోడిగించు. దే. హాస్యముచేయు
కోడిగీఁడు. దే. కోడిగము చేయువాఁడు
కోడిపీఁట. త. నొగచివరక్రింద నెత్తుగా నుంచెడు మోపుడుకొయ్య
కోడిబడి. దే. భక్ష్యవిశేషము
కోడియ. దే. కోడెదూడ
కోడీ. దే. కోడిగ
కోడు. దే. మంచములోనగువాని కంబము, ఊరిదరినీటికాల్వ
కోడుతాఱు. దే. పండినపైరు మిక్కిలి ఎండు
కోడె. దే. కోడెదూడ, విటుఁడు, తరుణము
కోడెకాఁడు. దే. పిన్నవయసువాఁడు, విటుఁడు [సర్పము
కోడెత్రాఁచు. దే. నడివయస్సులో నున్న
కోడెరవుతు. దే. శివుఁడు
కోణంగి. త. హాస్యనాటకుఁడు, అంగములను వికారముగాఁజూపిబిచ్చమెత్తెడుదాసరి
కోణపుఁడు. స. నైరృతుఁడు
కోణము. స. ఇల్లు లోనగువాని మూల, అంచు, దుడ్డుగోల

కోణుఁడు. స. శనైశ్చరుఁడు

కోదండము. స. విల్లు, కనుబొమ, వెదురు విల్లు

కోదండము. దే. పూర్వకాలమందు ఉపాధ్యాయుఁడు బాలురను శిక్షించుటకై వారు పట్టుకొని వ్రేలాడునట్లు మీఁదఁ గట్టెడుత్రాడు

కోద్రంగము. స. మంచె

కోద్రవము. స. ఆళ్లు

కోన. దే. గోసమూహము

కోన. త. అడవి, కొన, మూల, కొండల యందలి మఱుఁగుచోటు, అడవినుండెడు పల్లె

కోనటెంకి. దే. కోఁతి

కోనత్రిమ్మరి. దే. కోఁతి

కోనమనికి. దే. కోఁతి

కోనఱేఁడు. దే. నైరృతుఁడు

కోనఱు, కోనేఱు. దే. చుట్టు మెట్లు కలిగి నలుచదరముగా నుండుచెఱువు

కోపకత్తె. దే. కోపముగలది

కోపకాఁడు. దే. కోపము గలవాఁడు

కోపగించు. త. కోపించు

కోపగిల్లు. త. కోపపడు

కోపన. స. కోపముగల ఆఁడుది

కోపనుఁడు. స. కోపము గలవాఁడు

కోపము. స. క్రోధము, కినుక, వాతపిత్తశ్లేష్మములలో నొకదాని యతిశయము

కోపి. స. కోపముగలవాఁడు

కోపించు. స. కోపగించు

కోపు. దే. బలపము మొదలగువానికడ్డి, కడ్డి, అందము, వింటికొప్పు, పార్శ్వము, సారాయి, సమయము, విధము, చేఁపలగుది గ్రుచ్చునట్టిసూది, నిమిత్తము, నాట్యము తీర్పు

కోపుదారుఁడు. దే. సరకులను బయటనుండి తెచ్చి యమ్మెడువాఁడు

కోపులు. దే. నమస్కారము

కోపువాఱు. దే. అందగించు

కోమ. దే. పుట్టచివర, ఆఁడుది

కోమటి. త. వైశ్యుఁడు

కోమలము. స. మృదువు, నీళ్లు

కోమలి. త. చక్కఁదనముగల యాఁడుది

కోమలికము. త. చక్కఁదనము

కోయ. దే. ఒకజాతిబోయ

కోయష్టికము. స. చీకుఁగొక్కెర

కోయిల. దే. గుడి

కోయిల. త. కోకిలము

కోయు. దే. ఛేదించు, పువ్వులు మొదలగు వానిని గిల్లు

కోర. దే. గిన్నె, కల్లుత్రాగెడుగిన్నె, పెద్ద, పళ్లెము, కంకర

కోరంగి. స. చిట్టేలకితీఁగ

కోరకము. స. మొగ్గ, తామరతూఁడు

కోరకొండె. దే. బిడ్డలకు ముఖపార్శ్వమున వేసెడుకొండె

కోరగించు. త. ముకుళించు, మొలకెత్తు

కోరడి. దే. ఆవరణముగా వేసిన పొడి మట్టిగోడ

కోరదూషము. స. ఆళ్లు

కోరము. స. మొగ్గ, వ్రేలికణుపు

కోరవాయి. దే. కోష్ణశీర్షస్థమగు వాయువు

కోరవోవు. దే. కొంకరలువోవు

కోరసిగ. స. కోరకొండె

కోరా. దే. కారికము, చలువచేయని గుడ్డ

కోరాడు. దే. ఏనుఁగులోనగునవికొమ్ములతో నేలఁబొడిచి దుమ్మెత్తి పైకిచల్లు, పంది ముట్టెతో నేల కెల్లగించు

కోరాబంగారు. దే. మట్టుపుబంగారు

కోరింద. దే. లక్కగలిగెడి ఒకానొకతీఁగ

కోరిక. దే. కోరుట, ఇచ్ఛ, వరము, అభీష్టము

కోరికి, కోర్కి. దే. ఇచ్ఛ, కోరుట

కోరిక, కోర్కె. దే. కోరుట, ఇచ్ఛ

కోరు. దే. ఇచ్ఛించు

కోరు. త. ధనముగాక వస్తురూపకమైన కప్పము

కోఱ. త. దంష్ట్ర

కోఱడము. దే. అపహాస్యము, బాధ

కోఱడములు. దే. అపహాస్యవచనము

కోల. దే. దండము, బాణము, వంటకట్టె, మగగుఱి, దీర్ఘము

కోల. స. పిప్పలి

కోలంబకము. స. వీణెయొక్కసర్వాంగము

కోలకము. స. మిరియము, తక్కోలపుచెట్టు

కోలక్రోఁతులు. దే. కోఁతికొమ్మంచియను బాలక్రీడావిశేషము

కోలగగ్గెర. దే. ఎద్దుకాళ్లకు దారమును వేసి ఎద్దును మూటకట్టుగా కట్టెడుకట్టు

కోలజొన్న. దే. ఒకదినుసుజొన్న

కోలతలచేయు. దే. రణోద్యోగముచేయు, ఎచ్చరికచేయు

కోలదబ్బ. దే. దబ్బచెట్లలోభేదము

కోలదివియ. దే. వెలుతురుకట్టెలదివటీ

కోలనిమ్మ. దే. నిడుపునిమ్మ

కోలపాల. దే. అర్కపుష్పికవృక్షము

కోలపొన్న. దే. అంఘ్రిపర్ణికవృక్షము

కోలము. దే. వేషము, నాట్యము

కోలము. స. రేఁగుఁబండు, పంది, తెప్ప, ఒడి, కౌఁగిలి

కోలమెఱుఁగు. దే. నిలువుమెఱుఁగు

కోలలవారు. దే. వేత్రధరులు

కోలవల్లి. స. గజపిప్పలి

కోలాటకమ్మ. దే. చెవికిపెట్టుకొను ఒక దినుసుకమ్మ

కోలాటము. దే. కోలలు చేతులలో నుంచుకొనియాడెడి నృత్యము

కోలాహలము. స. కలకలము

కోలాహలుఁడు. స. కోలాహలముచేయువాఁడు

కోలి. స. గంగరేఁగు

కోలు. దే. కొల్ల, పెద్ద, ధాతువుతో వచ్చు కొనుధాతువుయొక్కభావార్థకరూపము, మిక్కిలి

కోలుకాఁడు. దే. నియమించెడి యధికారి, కావలివాఁడు

కోలుకొను, కోల్కొను. దే. ఉత్సహించు, వర్ధిల్లు, తేఱుకొను

కోలుతల, కోల్తల. దే. ఎదుటనిలిచి యుద్ధముచేయుట, యుద్ధసన్నాహము

కోలుపడు, కోల్పడు. దే. చెడు, నశించు, పోఁగొట్టుకొను, అగపడు

కోలుపఱచు, కోల్పఱచు. దే. కోలుపడునట్లు చేయు

కోలుపాటు, కోల్పాటు. దే. పోఁగొట్టుకొనుట, చేటు

కోలుపోక, కోల్పోక. దే. పోఁగొట్టుకొనుట, కోలుపోవుట

కోలుపోవు, కోల్పోవు. దే. చెడు, పోఁగొట్టుకొను

కోలుమసఁగు. దే. చెలరేఁగు

కోలె. దే. వెన్నుకోసినకాఁడ, మొదలుకొని

కోలెమ్ము } దే. వీఁపునడుమఁ బూసపూసగా
కోలెముక } గొలుసువలెఁ బెనఁచుకొని
కోలెమ్ముక } యుండెడియెముక

కోల్తలచేయు. దే. యుద్ధమందు హెచ్చరిక చేయు

కోవ. దే. పిల్లలకు కంఠమందుకల్గెడు ఒక వ్యాధి, పుట్టుకోమ

కోవిదత. స. నేర్పు

కోవిదారము. స. కాంచనవృక్షము

కోవిదుఁడు. స. విద్వాంసుఁడు

కోవు. దే. అఱచుటయందగు ధ్వన్యనుకరణము

కోవురము. దే. శత్రువునుబట్టుటకై పొంచెడి పొంచు

కోవెల. దే. గుడి

కోవెల. త. కోకిలము

కోశకారకము. స. పట్టుపురుగు

కోశకారము. స. ఒకదినుసుచెఱకు

కోశకారుఁడు. స. నిఘంటు వ్రాసినవాఁడు, కత్తియొఱలను చేయువాఁడు

కోశఫలము. స. తక్కోలపుచెట్టు

కోశము. స. కత్తియొఱ, గ్రుడ్డు, జాజికాయబరడు, పుస్తకము, బొక్కసము, ముకుళము, మొగ్గ, నిఘంటువు,ముంత, గిన్నె, పెట్టె, పండులోనిగింజ, కాయ, గర్భము, బంతి, గృహము, మేఘము, ఒట్టు

కోశాతకి. స. ఉత్తరేనుమొక్క, పొట్లకాయ, బీఱకాయ

కోశామ్రము. స. కొండమామిడి

కోశిక. స. పానపాత్రము

కోష్టు. త. చెంగల్వకోష్టు

కోష్ఠము. స. సామగ్రులుంచెడుకొట్టు,గాదె, లోకడుపు

కోష్ణము. స. ఇంచుక వేఁడి

కోసము } దే. నిమిత్తమును దెలుపునది
కోసరము }

కోసలము. స. ఒకానొకదేశము

కోసు. త. క్రోశప్రమాణదూరము

కోహకము స. దేహమణఁచుకొన్న పిల్లి

కోహళము. స. కాహళమనువాద్యము, బజాఋమాట

కోహళుఁడు. స. నాట్యశాస్త్రప్రవర్తకుఁడైన యొకముని

కోహో. దే. పరిహాసమునందగు ధ్వన్యనుకరణము

కోళి. దే. ఆశ్చర్యము నొందినవాఁడు, వెఱఁగుపడువాఁడు

## కౌ.

కౌంజరము. స. ఏనుఁగు

కౌంతి. స. రేణుకయను గంధద్రవ్యము

కౌంతికుఁడు. స. ఈఁటెకాఁడు

కౌఁగిలి } త. భుజాంతరము, ఆలింగనము
కవుఁగిలి }

కౌఁగిలించు } త. ఆలింగనముచేయు
కవుఁగిలించు }

కౌఁగిలింత } త. ఆలింగనము
కవుఁగిలింత }

కౌఁగిలింపు } త. కౌఁగిలింత
కవుఁగిలింపు }

కౌఁజు } త. కపింజలము
కవుఁజు }

కౌకృత్యము. స. అకార్యము చేయుట, పశ్చాత్తాపపడుట, హానిచేయుట, దుర్మార్గము

కౌక్కుటము. స. కోడిసంబంధమగునది, అబద్ధపు సాక్ష్యమిచ్చునది

కౌక్కుటికుఁడు. స. కపటముగలవాఁడు

కౌక్షింభర్యము. స. పొట్టపోసికొనువాని తనము

కౌక్షేయకము. స. కత్తి, ఖడ్గము

కౌచు<br>కవుచు } దే. చేపమీఁదిపొలుసు

కౌటతక్షుఁడు. స. స్వతంత్రముగా పని చేయు వడ్లంగి

కౌటము. స. స్వతంత్రమైన మోసము, అబద్ధపు సాక్ష్యమిచ్చునది

కౌటికుఁడు. స. మృగపక్ష్యాదులను జంపి విక్రయించి జీవించువాఁడు

కౌటిల్యము. స. వంకరతనము

కౌడు<br>కవుడు } త. కపటము

కౌణపుఁడు. స. నైరృతుఁడు

కౌతుకము. స. కోరిక, పెండ్లియందు చేతఁ గట్టుకొనెడు తోరము, పండుగ, స్త్రీపురుషపరిహాసము, సంతోషము

కౌతూహలము. స. అనుభవింపనికోరికయందలి యాస

కౌదాలికుఁడు. స, బెస్తవాఁడు

కౌద్రవీణము. స. ఆళ్లపండుపొలము

కౌను<br>కవును } దే. నడుము, వింటెనడుము

కౌపము. స. నూతిజలము

కౌపీనము. స. గోఁచి, గుహ్యప్రదేశము, అకార్యము

కౌబేరము. స చెంగల్వకోష్టు, ఒకానొక పిండివంట

కౌమారము. స. బాల్యమునకుఁ బిమ్మట వచ్చువయోవస్థ, బాల్యము, మెత్తనిది

కౌమారి. స. ఒకమాతృక

కౌమారికము. స. బాల్యము

కౌమారికుఁడు. స. ఆఁడుపిల్లలు మాత్రము గలతండ్రి

కౌమారికేయుఁడు. స. పెండ్లికాని స్త్రీయొక్క కొడుకు

కౌముదము. స. కార్తికమాసము

కౌముది. స. చంద్రిక, వెన్నెల

కౌమోదకి. స. విష్ణువుయొక్క గద

కౌరవుఁడు<br>కౌరవ్యుఁడు } స. కురుసంతతివాఁడు

కౌరు<br>కవురు } దే. వర్ణాధిక్యము

కౌర్ప్యము. స. వృశ్చికరాశి

కౌర్మము. స. తాఁబేటి సంబంధమైనది

కౌలకేయుఁడు. స. జారిణికొడుకు

కౌలటినేయుఁడు. స భిక్షుకియైన పతివ్రత కొడుకు

కౌలటేయుఁడు. స. భిక్షుకియైన పతివ్రత కొడుకు, అంకుటాలికొడుకు

కౌలటేరుఁడు. స. అంకుటాలికొడుకు

కౌలము. స. కులసంబంధమైనది

కౌలవ. స. ఒకకరణము

కౌలాలకము. స. కుమ్మరిసంబంధమైనది

కౌలికము. స. కులసంబంధమైనది

కౌలికుఁడు స. సాలెవాఁడు, మోసగాఁడు

కౌలీనము. స. గొప్పవంశమునందలిపుట్టుక, పశుపక్ష్యాదుల జగడము, నిందింపఁదగినపని

కౌలు<br>కవులు } దే. ఒడంబడిక

కౌలేయకము. స. కుక్క, మంచికులమునఁ బుట్టినది

కౌశము. స. దర్భసంబంధమైనది

కౌశలము. స. నేర్పరితనము

కౌశలి. స. కుశలప్రశ్నము

కౌశల్యము. స. కౌశలము
కౌశాలిక. స. బహుమానము, సన్మానము
కౌశాలికము. స. లంచేము
కౌశికము. స. గుగ్గిలపుచెట్టు, గుడ్లగూబ, ముంగిస
కౌశికి. స. ఒకానొక ఏఱు, పార్వతి
కౌశికుఁడు. స. విశ్వామిత్రుఁడు, ఇంద్రుఁడు, నిఘంటువు వ్రాసినవాఁడు, పాములవాఁడు
కౌశేయము. స. పట్టుచీర
కౌసీద్యము. స. కుసీదభావము, ఆలస్యము, కునికిపాటు
కౌసు, కవుసు } దే. మాంసము
కౌసుమము. స. పుష్పసంబంధమగునది
కౌసృతికుఁడు. స. మోసగాఁడు, గారడీవాఁడు
కౌస్తుభము. స. విష్ణు వక్షస్స్థలమునందలి మణి
కౌలత్థీయము. స. ఉలవలుపండు పొలము

## క్ర

క్రంగు. దే. మ్రోగుటయం దగుధ్వన్యనుకరణము
క్రంత. దే. పెండ్లికొడుకువారు పెండ్లికూతునకుఁ దీసికొనిపోయెడి ప్రధాన ద్రవ్యము, రచ్చె
క్రంత. త. సందుత్రోవ, రంధ్రము
క్రందనము. స. అరుపు, ఏడుపు, పిలుపు
క్రందితము. స. ఏడుపు, పిలుపు
క్రందిల్లు. త. మ్రోఁగు
క్రందు. త. మ్రోఁగు, విలపించు, మ్రోఁత, సందడి, తఱచు, దారుణధ్వని, ఉపద్రవము
క్రందుకయ్యము. దే. దొమ్మియుద్ధము
క్రందుకొను. దే. అతిశయించు, తఱచేగు
క్రందుకొలుపు. దే. అతిశయింపఁజేయు
క్రందున. దే. విశేషముగా
క్రంప. దే. ఎండినముండ్లమండ, కంప
క్రకచచ్ఛదము. స. మొగలిచెట్టు
క్రకచపత్త్రము. స. టేఁకుచెట్టు
క్రకచపాదము. స. బల్లి
క్రకచము. స. ఱంపము
క్రకరము. స. కక్కెర, బీదవాఁడు, ఱంపము
క్రక్కస. త. కఠినము
క్రక్కు. దే. కడుపులో వికారము గలిగి తిన్నది వెడలనుమియు, ఒకానొకరోగము, కక్కు
క్రక్కెర. త. పక్షివిశేషము
క్రచ్చఱ. దే. నిష్కల్మషముగా, శీఘ్రముగా
క్రచ్చు. దే. చుట్టుకొనుమాలిన్యము, పేని నత్రాడు లోనగువానియందు ఉపయుక్తముకానితృణాదులయంశము, కాంతి
క్రచ్చుకొను. దే. చుట్టుకొను
క్రతుధ్వంసి. స. శివుఁడు
క్రతుభుజుఁడు. స. దేవత
క్రతువు. స. యజ్ఞము, తెలివి, సామర్థ్యము, శక్తి, నిశ్చయము, కోరిక, ఉద్దేశము, అర్హత, అమితయిష్టము
క్రథనము. స. వధ
క్రన్న. దే. పిమ్మట, మరల, శీఘ్రముగా
క్రమకుఁడు. స. క్రమపద్ధతి నెఱిఁగినవాఁడు
క్రమణము. స. అడుగిడుట

క్రమము. స. సొరిది, అడుగిడుట, బలిమి, పాదము, పోవుట, మార్గము, చేయుట, ప్రారంభము, కట్టుకొనుట, సిద్ధము, పూనిక, వేదముచదువురీతిలో భేదము

క్రమించు. స. అతిక్రమించు, ఆక్రమించు

క్రమికము. స. పూర్వపుది

క్రముకము. స. పోఁక, తమ్ములము, పోఁకచెట్టు, ప్రత్తిచెట్టు

క్రమేలకము. స. ఒంటె

క్రమ్మఱ. దే. మఱల

క్రమ్మఱఁబడు / క్రమ్మఱిల్లు / క్రమ్మఱిలు } దే. క్రమ్మఱు

క్రమ్మఱు. దే. మరలు

క్రమ్మఱుచు. దే. క్రమ్మఱఁజేయు

క్రమ్ము. దే. వ్యాపించు, కవియు, పైకుబుకు

క్రమ్ముదనము. దే. కపటభావము

క్రమ్ముదల. దే. క్రమ్ముట

క్రమ్ముదెంచు. దే. పైకుబుకు

క్రమ్మున. దే. త్వరగా

క్రయణము. స. కొనుట

క్రయము. స. వెల, వెలయిచ్చికొనుట

క్రయవిక్రయికుఁడు. స. సరకులను కొని అమ్మెడువాఁడు

క్రయించు. స. వెలయిచ్చికొను

క్రయికుఁడు. స. వెలయిచ్చికొనువాఁడు

క్రయ్య. దే. కాలువ

క్రయ్యఁబడు. దే. కలయు

క్రయ్యము. స. అమ్ముటకు అంగడియందు పఱపఁబడిన సరకు, కొనఁదగినది

క్రయ్యు. దే. కలయు

క్రల్లపడు. దే. ఎండు

క్రవ్యము. స. మాంసము

క్రవ్యాత్తు / క్రవ్యాదుఁడు / క్రవ్యాశి } స. రాక్షసుఁడు, మాంసము తినువాఁడు

క్రశిమ. స. కార్శ్యము

## క్రా

క్రాంతము. స. పోయినది, గఱ్ఱము, అడుగు

క్రాంతి. స. క్రమణము, తిరుగుట

క్రాఁక. దే. కాఁక

క్రాఁగు. దే. కాఁగు, తపించు

క్రాఁగుడు. దే. కాగుఁడు

క్రాఁచు. దే. కాఁచు, కాఁగఁజేయు

క్రాకచికుఁడు. స. అంపపుకోఁతవాఁడు

క్రాచు దే. కాండ్రించు

క్రాయకుఁడు. స. క్రయికుఁడు

క్రాయు. దే. క్రక్కు, ఉమియు

క్రార / క్రారవడి } దే. ఒక యక్షరము క్రింది రేఫము

క్రాలు. దే. గిరగిరఁదిరుగు, చెదరు, సంచరించు, సంభ్రమించు, ప్రకాశించు, ప్రవర్తిల్లు

క్రాలుగంటి / క్రాల్గంటి } దే. చలించునట్టి కన్నులుగల ఆఁడుది, ఆఁడుది

## క్రి

క్రించు / క్రించెఁడు } త. అల్పుఁడు

క్రించెఁదనము. దే. నీచత్వము

క్రిందల. దే. క్రిందగుతల
క్రిందు. దే. అధోభాగము, గతకాలము
క్రిందుపడు. దే. అడుగుపడు
క్రిందుపఱచు. దే. క్రిందుపడఁజేయు, హీనపఱచు
క్రిక్క. దే. బట్టువాఁడు, వంది
క్రిక్కిఱించు. దే. క్రిక్కిఱియు
క్రిక్కిఱియు. దే. ఎడములేక వ్యాపించు
క్రిక్కు. దే. కిఱుకు, త్రిప్పు
క్రిమి. స. పురుగు, లక్క
క్రిమిఘ్నము. స. వాయువిళంగము
క్రిమిజము. స. అగురువు
క్రియ. స. ధాత్వర్థము, చేయుట, చేష్ట, శ్రాద్ధము, పని, ఆరంభము, పూజ, చికిత్స, ప్రాయశ్చిత్తము, శిక్ష, విధము, (కడపటియర్థమునకు తెనుఁగునమాత్ర ముపయోగము)
క్రియాకారము. స. ప్రతిజ్ఞ
క్రియాకారుఁడు. స. క్రొత్తశిష్యుఁడు
క్రియాకులుఁడు. స. విశేషము పనిగలవాఁడు
క్రియావంతుఁడు. స. పనియందు పూనికగలవాఁడు
క్రియ్యు. త. కృశించు

## క్రీ

క్రీఁగడుపు. దే. పొత్తికడుపు
క్రీఁదొడ. దే. తొడకు లోపలిభాగము
క్రీడ / క్రీడము } స. ఆట్లాట, పరిహాసము
క్రీడకుఁడు. స. ఆడువాఁడు, ద్వారపాలకుఁడు
క్రీడనము. స. ఆడుట
క్రీడి. త. అర్జునుఁడు
క్రీడించు. స. ఆట్లాడు
క్రీతకుఁడు / క్రీతుఁడు } స. తల్లిదండ్రుల వద్దనుండి దత్తతకై కొనఁబడినవాఁడు
క్రీతము. స. కొనఁబడినది
క్రీవాడ. దే. పాటిపొలము

## క్రు

క్రుంకు. దే. మునుఁగు, అస్తమించు, చెచ్చు, మునుక, స్నానము
క్రుంకుడు. దే. అస్తమయము
క్రుంకుడుగట్టు / క్రుంకుమల } దే. అస్తపర్వతము
క్రుంగఁబడు / క్రుంగిలు } దే క్రుంగు
క్రుంగు. దే. క్రిందికి అడఁగు, దిగఁబడు
క్రుంచము. స. క్రౌంచపక్షి
క్రుక్కు. చేతి బొటనవ్రేలి గోటితో వేలు మొదలగువాని నొక్కు, అడఁచు, తుఱుగు
క్రుక్కుడు. దే. క్రుక్కుట
క్రుధ. స. కోపము
క్రుద్ధుఁడు. స. కోపగించినవాఁడు
క్రుమ్మరిల్లు / క్రుమ్మరిలు } దే. తిరుగు, సంచరించు
క్రుమ్మరు. దే. తిరుగు, సంచరించు
క్రుమ్ము. దే. పొడుచు, పొడుపు
క్రుమ్ముడు. దే. కొమ్ములపొడుపు
క్రుమ్ముడుపడు. దే. పోటుపడు
క్రుమ్ములాడు. దే. క్రుమ్ముకొని పోట్లాడు

క్రుయ్యఁబాఱు. దే. క్రుయ్యు
క్రుయ్యు. త. కృశించు, వెనుకదీయు
క్రుష్టము. స. ఏడుపు, సద్దు
క్రుళ్లగించు. దే. దుఃఖించు
క్రుళ్లగింత. దే. దుఃఖించుట
క్రుళ్లు. దే. క్రుళ్లగించు, అవియు, నలుపు పాఱిచెడు, మనస్సులో దుఃఖించు
క్రుళ్లుపోతు. దే. క్రుళ్లగించు స్వభావము గలవాఁడు

## క్రూ

క్రూరము. స. నొప్పించునది, భయంకరమైనది, గట్టిది, గాయము, వధ
క్రూరు. దే. వాఁడి
క్రూరుఁడు. స. పరులను బీడించువాఁడు

## క్రే

క్రేంకారము. స. ధ్వని
క్రేఁటు. దే. తొట్రుపడు
క్రేఁటుకొను. దే. సకిలించునట్లు శబ్దించు
క్రేగన్ను. దే. కడకన్ను
క్రేగయి. దే. హస్తాగ్రము
క్రేడి. దే. మంచివడ్లలోఁగలిపిన ఎఱ్ఱవడ్లు
క్రేడించు. దే. తొలఁగు, అలక్ష్యముచేయు
క్రేడిసేయు దే. పరిహాసముచేయు
క్రేణి. దే. ఉన్నతపదము, పరిహాసము
క్రేణి. స. కొనుట
క్రేణించు, క్రేణిసేయు } దే. పరిహాసముచేయు
క్రేత. స. కొనువాఁడు
క్రేతొట్టు. దే. గట్టొరయు
క్రేపు. దే. దూడ, శిఖరము
క్రేయము. స. కొనఁదగినది
క్రేయో. దే. వెడలఁగొట్టుటయందగు ధ్వన్యనుకరణము
క్రేవ. దే. పార్శ్వము
క్రేవు. దే. అరచుటయందగు ధ్వన్యనుకరణము
క్రేళ్లు. దే. ఉన్నతి, గంతులు
క్రేళ్లుదాఁటు. దే. ఎగిరిపడు, గంతులిడు
క్రేళ్లుబ్బు. దే. అతిశయించు
క్రేళ్లువాఱు. దే. గంతులిడు
క్రేళ్లుఱుకు. దే. ఎగిరిపడు, దూఁకు

## క్రై

క్రైలు. దే. ధాన్యము నుఱిచి కొలుచుట, కైలు, ఒబ్బిడి
క్రైలుదారి. దే. క్రైలుచేయించెడు అధికారి

## క్రొ

క్రొ. దే. సమాసమందు క్రొత్త శబ్దము యొక్క లుప్తశేషము
క్రొంకి. దే. కొంకి
క్రొంచె. త. కొంచె
క్రొంజాయ. దే. క్రొత్తరంగు
క్రొంజెమట. దే. క్రొత్తచెమట
క్రొందమ్మి. దే. క్రొత్తకమలము
క్రొందలిరు. దే. క్రొత్తచిగురు
క్రొంబంట. దే. క్రొత్తపంట
క్రొంబదను. దే. క్రొత్తపదను
క్రొంబసిడి. దే. క్రొత్తబంగారు

క్రొంబసిమి. దే. క్రొత్త పచ్చనిరంగు
క్రొంబులకలు. దే. క్రొత్తపులకలు
క్రొంబుట్టము. దే. క్రొత్తవస్త్రము
క్రొంబువ్వు. దే. క్రొత్తపుష్పము
క్రొంబొగ. దే. క్రొత్తపొగ
క్రొంబొగడ. దే. క్రొత్తబొగడ
క్రొక్కన్ను. దే. క్రొత్తకన్ను
క్రొక్కారు. దే. క్రొత్తకారు
క్రొగ్గండి. దే. క్రొత్తగండి
క్రొచ్చెలిక. దే. క్రొత్తబీఁటినేల
క్రొత్త. దే. నూతనము, అపూర్వము
క్రొత్తడము. దే. కోటబురుజు
క్రొత్తడి. దే. మగనాలు, పతివ్రత
క్రొత్తముట్టు. దే. ప్రథమరజస్వల, వడుక నారంభించే నప్పుడు కదురున కంటిం చెడు నూలుపోగు
క్రొత్తరఁగ. దే. క్రొత్తతరంగము
క్రొత్తలిరు. దే. క్రొత్తచిగురు
క్రొత్తళము. దే. క్రొత్తడము
క్రొత్తావి. దే. క్రొత్తపరిమళము
క్రొన్నన. దే. క్రొత్తచిగురు
క్రొన్నలుపు. దే. క్రొత్తనలుపు
క్రొన్నురువు. దే. క్రొత్తనురుఁగు
క్రొన్నెత్తురు. దే. క్రొత్తనెత్తురు
క్రొన్నెల. దే. క్రొత్తనెల
క్రొన్నెలలు. దే. నఖక్షతవిశేషము
క్రొమ్మంచు. దే. క్రొత్తమంచు
క్రొమ్మడుఁగు. దే. క్రొత్తమడుఁగు
క్రొమ్మావి. దే. క్రొత్తమామిడి
క్రొమ్మి. త. ఎఱ్ఱగోరంటమొక్క
క్రొమ్మించు. దే. క్రొత్తమెఱపు
క్రొమ్మిడుఁగుఱు. దే. క్రొత్తమిడుఁగుఱు
క్రొమ్ముడి. దే. క్రొత్తముడి
క్రొమ్మెఱుఁగు. దే. క్రొత్తమెఱుఁగు
క్రొమ్మొగడ. దే. క్రొత్తమొగ్గ
క్రొమ్మొన. దే. క్రొత్తమొన
క్రొమ్మొలక. దే. క్రొత్తమొలక
క్రొవ్వాఁడి. దే. మిక్కిలివాఁడియైన
క్రొవ్విదము. దే. దుష్కార్యము, పరువము
క్రొవ్విరి. దే. క్రొత్తపుష్పము
క్రొవ్వు. దే. మదించు, మదము, మెదడు
క్రొవ్వుగొను. దే. మదించు
క్రొవ్వెద. దే. కొప్పు
క్రొవ్వేఁడి. దే. క్రొత్తవేఁడి

## క్రో

క్రోఁతి. దే. కోఁతి
క్రోడపత్త్రము. స. పత్త్రమునకు చేర్పఁబడిన కాగితము
క్రోడము. స. ఒడి, రొమ్ము, పంది, చెట్టు, తొఱట, ఒకవస్తువుయొక్క లోపలి భాగము
క్రోడాడు. దే. ఏనుఁగు మొదలైనవి కొమ్ములతోఁ బొడుచు, ముట్టెతో నేల పెల్లగించు, కొమ్ములతో దుమ్మెత్తిచల్లు
క్రోడీకరణము. స. క్రోడీకరించు, ఆలింగనము
క్రోడీకరించు. స. ఒకటిగా చేర్చు
క్రోడుఁడు. స. శనిగ్రహము
క్రోధన. స. బెండచెట్టు, ఒక సంవత్సరము, కోపముగలది

క్రోధనము. స. కోపముగానుండుట, కోపము

క్రోధము. స. కోపము, వధ, చంపుట

క్రోధాళువు. స. కోపస్వభావముగలవాఁడు

క్రోధి. స. కోపముగలవాఁడు, ఒకసంవత్సరము, కుక్క, దున్నపోతు

క్రోధించు. స. కోపగిల్లు

క్రోయు. దే. విషమముగాచాఁచు

క్రోలు. దే. అనుభవించు, తిను, త్రాగు, గ్రహించు, క్రోవి

క్రోలుకసవు. దే. తృణవిశేషము

క్రోలుచు / క్రోల్చు } దే. కూయు, శబ్దించు, క్రోలఁజేయు

క్రోల్పులి. దే. పెద్దపులి

క్రోవ. దే. సరము

క్రోవి. దే. గొట్టము, తుపాకి, బుడ్డి, మూస

క్రోవి. త. కురువకవృక్షము

క్రోశనము. స. ఏడుపు

క్రోశము. స కోసు, ఏడుపు, ధ్వని

క్రోష్టము. స. గెనుసుగడ్డ

క్రోష్టుపుచ్ఛిక. స. కోలపొన్నచెట్టు

క్రోష్టువిన్న. స. నక్కతోఁకపొన్న

క్రోష్టువు. స. నక్క

క్రోష్ట్రి. స. తెల్ల నేలగుమ్మడిచెట్టు, ఆఁడు [నక్క

## క్రౌ

క్రౌంచదారణుఁడు. స కుమారస్వామి

క్రౌంచము. స. ఒకానొకపక్షి, ఒకానొక కొండ, ఒకానొకద్వీపము

క్రౌర్యము. స. క్రూరభావము

## క్ల

క్లమథము / క్లమము } స శ్రమము, బడలిక, వాడుట

## క్లా

క్లాంతము. స. బడలినది, వాడినది

క్లాంతి. స. బడలిక

క్లాంతుఁడు. స. అలసినవాఁడు

## క్లి

క్లిన్నము. స. తడిసినది

క్లిశితము. స. క్లేశమునొందినది

క్లిష్టము. స. ఒకానొకశబ్దదోషము, పూర్వోత్తరవిరుద్ధమైన వాక్కు, క్లేశము నొందినది

క్లిష్టి. స. దుఃఖము, బాధ

## క్లీ

క్లీతకము. స. అతిమధురము

క్లీతకిక. స. నీలిచెట్టు

క్లీబము. స. నపుంసకము, విక్రమములేనిది, పిఱికిది, నీచము, సోమరి తనముగలది

క్లీబుఁడు. స. నపుంసకుఁడు, పంద

## క్లే

క్లేదనము. స. తడుపుట, తెమడ

క్లేదము. స. తడి

క్లేశకము. స. బాధకరమైనది

క్లేశము. స. దుఃఖము, కోపము, వ్యవసాయము

క్లేశికము. స. బాధింపఁబడినది

## క్లై

క్లైబ్యము. స. నపుంసకత్వము, మగతనము లేమి, పిఱికితనము, శక్తిహీనత

## క్లో

క్లోమము. స. కడుపులో నొకప్రక్క నుండెడి యెఱ్ఱనిమాంసము, నీరుతిత్తి

## క్వ

క్వచిత్తు. స. అక్కడక్కడ
క్వణనము } స. వీణలోనగువాని మ్రోత
క్వణము
క్వథనము. స. కాచుట
క్వథము } స. కషాయము
క్వాథము
క్వథితము. స. చక్కగా కాగినది

## క్వా

క్వాచిత్కము. స. అరుదైనది
క్వాణము. స. వీణాదివాద్యధ్వని
క్వాథము. స. బాధ
క్వాథోద్భవము. స. అంజనవిశేషము

## క్ష

క్షంత. స. ఓర్పుగలవాఁడు
క్షంతవ్యము. స. క్షమింపఁదగినది, సహింపఁ దగినది
క్షణద. స. రాత్రి
క్షణదము. స. నీళ్లు
క్షణదుఁడు. స. జోస్యుఁడు
క్షణనము. స. వధము
క్షణప్రభ. స. మెఱపు
క్షణభంగురము. స. క్షణములో నాశమగు నది, స్వల్పకాలముండునది
క్షణము. స. పదివిగడియలకాలము, సమయము, నిమిషము, తీఱిక, పండుగ, సంతోషము, వ్యాపారములేమి, సేవ, తిరునాళ్లు
క్షణిక. స. మెఱపు
క్షణికము. స. నిమిషకాలముండునది
క్షణించు } స. భోజనార్థము వరించు,
క్షణియించు } క్షణము సేపు ఆపు
క్షతజము. స. రక్తము
క్షతము. స. గాయము, గాయమునొందినది, నాశము నొందినది
క్షతి. స. గాయము, నాశము
క్షత్త. స. శూద్రస్త్రీయందుక్షత్త్రియునకుఁ బుట్టినవాఁడు, ద్వారపాలకుఁడు, దాసీపుత్త్రుఁడు, సారథి
క్షత్త్రబంధువు. స. స్వధర్మములేక క్షత్త్రియుఁ డను బంధుమాత్రుఁడైనవాఁడు
క్షత్త్రము. స. శరీరము, క్షత్త్రియజాతి
క్షత్త్రియ } స. రాచేది
క్షత్త్రియాణి }
క్షత్త్రియి. స. రాచేవాని పెండ్లాము
క్షత్త్రియుఁడు } స. రాచేవాఁడు
క్షత్త్రుఁడు }
క్షప. స. రాత్రి
క్షపణకుఁడు. స. బౌద్ధమతస్థుఁడు
క్షపణము. స. అశుచిభావము, సిగ్గులేనిది
క్షపాంత్యము. స. ప్రాతఃకాలము
క్షపాకరుఁడు. స. చంద్రుఁడు
క్షపితవ్యము. స. గడపఁదగినది

క్షమ. స. ఓర్పు, నేల, మన్నించుట
క్షమము. స. యుక్తము, చాలునది, ఓర్పు గలది
క్షమాపణము, క్షమార్పణము } స. మన్నన, క్షమించుట
క్షమి. స. ఓర్పుగలవాఁడు
క్షమించు, క్షమియించు } స. ఓర్చు, మన్నించు
క్షమిత. స. ఓర్పుగలవాఁడు
క్షముఁడు. స. శక్తుఁడు
క్షయథువు. స. క్షయరోగము
క్షయము. స. అఱుఁదెవులు, తగ్గుదల, ప్రళయము, ఇల్లు, కుటుంబము, నష్టము
క్షయించు. స. క్షీణించు
క్షయ్యము. స. క్షయింపఁదగినది
క్షరణము. స. కాఱుట, ప్రవహించుట
క్షరము. స. నీళ్లు, మబ్బు, నాశము కాఁగలది
క్షరితము. స. కాఱినది, జాఱినది
క్షరుఁడు. స. పరమాత్మ
క్షవథువు. స. దగ్గు, తుమ్ము, గొంతుపుండు
క్షవము. స. తుమ్ము, నల్లావాలు, దగ్గు

## క్షా

క్షాంతము. స. ఓర్వఁబడినది
క్షాంతి. స. క్షమ, ఓర్పు
క్షాత్త్రము. స. క్షత్త్రధర్మము
క్షాత్త్రవంతుఁడు. స. శూరుఁడు
క్షామము. స. కఱవు, కృశము, సన్నము, కొంచెము తగ్గింపఁబడినది, బలహీన మైనది
క్షారకము. స. కసుగాయ, పసరుమొగ్గ, చేఁపలబుట్ట



క్షారకుఁడు. స. చాకలవాఁడు
క్షారణము. స. వ్యభిచారమునుగూర్చినిందించుట, క్షారమును గలుఁగఁజేయుట
క్షారము. స. ఉప్పు, కారము, గాజు, బూడిద
క్షారాబ్ధి. స. ఉప్పుసముద్రము
క్షారితము. స. కాఱినది, నిందింపఁబడినది
క్షారితుఁడు. స. పరస్త్రీగమనాదిదోషములచే దూఱఁబడినవాఁడు
క్షాళనము. స. కడుగుట
క్షాళితము. స. కడుగఁబడినది

## క్షి

క్షితి. స. నేల, నాశము, ఉనికి, చిటిక వేయునంతకాలము
క్షితిదేవుఁడు. స. బ్రాహ్మణుఁడు
క్షితిధరము. స. పర్వతము
క్షితిపతి. స. రాజు
క్షిప. స. క్షేపణము, ప్రేరేపించుట
క్షిపకుఁడు. స. విలుకాఁడు, శూరుఁడు
క్షిపణము. స. త్రోయుట, పంపుట, నిందించుట
క్షిపము. స. త్రోయుట, కొట్టుట, నిందించుట
క్షిప్తము. స. త్రోయఁబడినది, ఉంచఁబడినది, వైవఁబడినది, విడువఁబడినది, అలక్ష్యముచేయఁబడినది
క్షిప్నువు. స. తిరస్కరించువాఁడు
క్షిప్రము. స. శీఘ్రము, వడిగలది
క్షిప్రశ్యేనము. స. ఏత్రింతపక్షి
క్షియ. స. క్షయము, తగ్గుదల

## క్షీ

క్షీణము. స. క్షయించినది, కృశించినది, తగ్గినది

క్షీణించు. స. క్షీణమగు

క్షీబము. స. సురాపానమత్తత

క్షీబుఁడు. స. సురాపానమత్తుఁడు, త్రావినవాఁడు

క్షీరకాకోలి. స. పిన్నపాలచెట్టు

క్షీరగ్రాహి. స. హంస, నీలరత్నము

క్షీరము. స. పాలు, నీరు, జిల్లేడు మొదలైనవాని పాలు

క్షీరవిదారి. స. నల్ల నేలగుమ్ముడు

క్షీరశుక్ల. స. తెల్ల నేలగుమ్ముడు

క్షీరసాగరము<br>
క్షీరాకరము } స. పాలసముద్రము<br>
క్షీరాబ్ధి

క్షీరాన్నము. స. పరమాన్నము

క్షీరావి. స. చిఱుపాలమొక్క

క్షీరాశము. స. హంస

క్షీరిక. స. పాలచెట్టు, పాలతో వండఁబడిన పిండివంట

క్షీరోదకన్యాయము. స. పాలును నీళ్లను గలిసిన ట్లొక్కటిగాఁగలసియుండు ధర్మము

క్షీరోదము. స. పాలసముద్రము

## క్షు

క్షుణ్ణము. స. పొడిచేయఁబడినది, అభ్యస్తము

క్షుణ్ణుఁడు స. వ్యుత్పన్నుఁడు

క్షుతము. స. తుమ్ము

క్షుతాభిజననము. స. నల్లావలు

క్షుత్తు. స. ఆఁకలి

క్షుద్ర. స. ఈఁగ, తేనెటీఁగ, వేశ్య, అంగహీనయగునాఁడుది, నాట్యమాడెడు స్త్రీ, హింసించెడు నాఁడుది, పులిచింత, వాఁకుడుమొక్క

క్షుద్రకము. స. బాణవిశేషము

క్షుద్రము. స. అల్పము, తుచ్ఛము, సూక్ష్మము, కొంచెము, నింద

క్షుద్రమూలకము. స. పిన్నముల్లంగి మొక్క

క్షుద్రశంఖము. స. నత్తగుల్ల

క్షుద్రుఁడు. స. అధముఁడు, అల్పుఁడు, లోభి, హింసకుఁడు

క్షుధ. స. ఆఁకలి

క్షుధాతురుఁడు. స. ఆకలిగొన్నవాఁడు

క్షుధితము. స. ఆఁకలిగొన్నది

క్షుపము. స. కుఱుచకొమ్మలును, ఊడలును గలచెట్టు

క్షుబ్ధము<br>
క్షుభితము } స. కలతపెట్టఁబడినది

క్షుమ. స. నీలిచెట్టు

క్షురకము. స. పల్లేరుమొక్క

క్షురకర్మ<br>
క్షురక్రియ } స. క్షౌరము

క్షురప్రము. స. అర్ధచంద్రబాణము

క్షురము. స. మంగలికత్తి, పల్లేరుమొక్క, గిట్ట, బాణము, మంచెపుకోడు

క్షురి. స. మంగలి

క్షురిణి. స. మంగలవానిభార్య

క్షురిక. స. మంగలికత్తి

క్షుల్లకము. స. నత్తగుల్ల, అల్పము, నీచము, పేద

క్షుల్లకుఁడు. స. అల్పుఁడు, నీచుఁడు

క్షుల్లము. స. చిన్నది, కొంచెము

## క్షే

క్షేత్రకర్మ. స. వ్యవసాయము
క్షేత్రజ్ఞుఁడు. స. జీవుఁడు, కాపువాఁడు
క్షేత్రపాలుఁడు. స. భైరవుఁడు
క్షేత్రము. స. వరిమడి, పెండ్లాము, శరీరము, సిద్ధస్థానము, పుణ్యభూమి, గణితశాస్త్రవిశేషము, స్థలము, ఉపవాసము, భూవసతి, వాసస్థానము, సారముగల భూమి, మనస్సు
క్షేత్రాజీవుఁడు. స. దున్నుకొని బ్రదుకువాఁడు
క్షేత్రి, క్షేత్రికుఁడు } స. వ్యవసాయదారుఁడు
క్షేత్రియము. స.మడియందుఁబుట్టినది,కుదురనిజాడ్యము, పచ్చిగడ్డి
క్షేత్రియుఁడు. స. పరదారరతుఁడు
క్షేపకము. స. వ్రాతలో మధ్య ఇఱికించిన పదము
క్షేపకుఁడు. స. త్రోయువాఁడు, పంపువాఁడు
క్షేపణము. స. ప్రేరేపించుట, చిమ్ముట, త్రోయుట, కాలము జరుపుట
క్షేపణి. స. ఓడనడపుగడ, ఒకానొకవల
క్షేపము. స. చిమ్ముట, త్రుళ్లు,నింద, పూఁత, ఆలస్యము, కాలముపుచ్చుట,ప్రేరణము, గర్వము
క్షేపిష్ఠము, క్షేపీయము } స. మిక్కిలి శీఘ్రము
క్షేమ. స. పార్వతి
క్షేమంకరుఁడు. స. మేలుచేయువాఁడు
క్షేమతండులము. స. ప్రయాణకాలమందింటనుండి తీసికొనిపోయెడిబియ్యము
క్షేమము. స. కలిగినదిచెడకుండుట, శుభము
క్షేమ్యము. స. క్షేమముగా నుండఁదగినది, ఆరోగ్యమైనది

## క్షై

క్షైణ్యము. స. నాశము, కార్శ్యము
క్షైత్రము. స. క్షేత్రములసమూహము
క్షైప్రము. స. వేగము
క్షైరేయము. స. పాలుగలది

## క్షో

క్షోణి. స. నేల, బ్రహ్మచారి మొలత్రాడు, సంఖ్యావిశేషము
క్షోణిరథుఁడు. స. శివుఁడు
క్షోదము. స. చూర్ణము, పొడి, నూఱుట
క్షోదిమ. స. అల్పత్వము
క్షోదిష్ఠము, క్షోదీయము } స. మిక్కిలి క్షుద్రము
క్షోభము. స. కలఁత, దుఃఖము, దోఁపుడు, వ్యాకులము
క్షోభించు. స. కలఁతపడు
క్షోభితము. స. కలఁతపెట్టఁబడినది
క్షోమము. స. తెల్లపట్టువస్త్రము

## క్షౌ

క్షౌద్రము. స. తేనె, నీళ్లు, స్వల్పత, నీచత, ధూళి
క్షౌద్రేయము. స. మైనము
క్షౌమము. స నారచీర, తెల్లచీర, తెల్లపట్టువస్త్రము, కోటవాకిలిమీఁదియిల్లు
క్షౌరము. స. ముండనము, మంగలిపని
క్షౌరి. స. మంగలికత్తి
క్షౌరికుఁడు. స. మంగలి

## క్ష్ణు

క్ష్ణుతము. స. వాఁడిచేయఁబడినది

## క్ష్మా

క్ష్మా. స. నేల, నిద్ర
క్ష్మాజము. స. చెట్టు
క్ష్మాధరము. స. పర్వతము
క్ష్మాపతి. స. రాజు
క్ష్మాభృత్తు. స. పర్వతము, రాజు
క్ష్మావరుఁడు. స. రాజు

## క్ష్వి

క్ష్వింక. స. ఎఱ్ఱని మొగముగల ఆఁడుకోఁతి
క్ష్వింకము. స. ఎఱ్ఱని మొగముగల మగకోఁతి

## క్ష్వే

క్ష్వేడ. స. సింహనాదము, యుద్ధమందు వీరుని పెడబొబ్బ
క్ష్వేడము. స. చెవుడు, మ్రోఁత, విషము, వంకరైనది, పొందరానిది
క్ష్వేడితము. స. సింహనాదము
క్ష్వేళ. స. సింహనాదము
క్ష్వేళము. స. విషము
క్ష్వేళి. స. పాము
క్ష్వేళితము. స. సింహనాదము

## ఖ

ఖ. ఒకయక్షరము
ఖంజ. స. కుంటిది
ఖంజనము. స. కాటుకపిట్ట
ఖంజపాదము. స. బాలక్రీడావిశేషము
ఖంజము. స. కుంటి
ఖంజరి. స. వాద్యవిశేషము
ఖంజరీటము. స. కాటుకపిట్ట
ఖంజుఁడు. స. కుంటివాఁడు
ఖండ. స. కర్మను దెలియఁజేయు నొక గ్రంథము
ఖండకము. స. గోఁచి, పగులఁగొట్టునది, ముక్క, కండచెక్కెర
ఖండకుఁడు. స. గోళ్లులేనివాఁడు
ఖండనము. స. నఱకుట, కోయుట, పగులఁ గొట్టుట, నాశనముచేయుట, చంపుట. ఆక్షేపించుట
ఖండనుఁడు. స. చంపువాఁడు, పగులఁగొట్టు వాఁడు
ఖండపరశువు. స. శివుఁడు, పరశురాముఁడు, సున్నము పూయువాఁడు
ఖండము. స. తునుక, పులకండము, పగులు, లోపముగలది, శిథిలమగుదేవళము, ఒక భాగము
ఖండశర్కర. స. పులకండము, పటిక బెల్లము
ఖండా. దే. పెద్దకత్తి
ఖండించు. స. ఖండముచేయు, నఱకు
ఖండికము. స. ధాన్యవిశేషము
ఖండిత. స. ఒకానొకనాయిక
ఖండితము. స. నఱకఁబడినది
ఖండితవృత్తుఁడు. స. చెడ్డనడవడిగలవాఁడు
ఖండీకృతము. స. ముక్కలుగాఁ జేయఁ బడినది
ఖండీరము. స. పచ్చపెసలు
ఖండేందుభూషణుఁడు. స. శివుఁడు
ఖండ్యము. స. ఖండింపఁదగినది
ఖంబు. స. ఆకాశము, స్వర్గము, అభావము, తెలివి, సుఖము

ఖగపతి. స. గరుత్మంతుఁడు
ఖగము. స. పక్షి, బాణము, గ్రహము
ఖగుఁడు. స. సూర్యుఁడు
ఖగేశ్వరుఁడు. స. గరుత్మంతుఁడు
ఖచరము. స. పక్షి, మేఘము, గాలి
ఖచరుఁడు. స. దేవుఁడు, సూర్యుఁడు
ఖచించు. స. చెక్కు, పొదుఁగు
ఖచితము. స. చెక్కఁబడినది, కూర్పఁబడినది
ఖజ, ఖజపము } స. కవ్వము
ఖజపము. స. మిల్లి, కొయ్యతెడ్డు, నెయ్యి
ఖజాక. స. గరిఁటె
ఖటకుఁడు. స. పెండ్లికుదుర్చువాఁడు
ఖటము. స. పిడికిలి, గడ్డి, తెమడ, పాడునూయి
ఖటిక, ఖటిని } స. బలపము
ఖట్టి. స. పాడె
ఖట్టిక. స. గద్దియ, పాడె
ఖట్టికుఁడు. స. వేఁటకాఁడు
ఖట్వ. స. మంచము
ఖట్వాంగము. స. మంచపుకోడు
ఖడ్గబంధము. స. ఒకవిధమగు బంధకవిత్వము
ఖడ్గము. స. కత్తి, ఖడ్గమృగము
ఖడ్గవాదము. స. గొప్పవాగ్వాదము, ఇద్దఱు పోట్లాడుట
ఖడ్గి. స. ఖడ్గమృగము, కత్తిగలవాఁడు
ఖడ్గికుఁడు. స. ఖడ్గముకలవాఁడు, కటికవాఁడు
ఖతమాలము. స. పొగ, మబ్బు
ఖతలము. స. ఆకాశము
ఖతిలకము. స. సూర్యుఁడు
ఖదిర. స. మఁదుఁగుఁదామర
ఖదిరము. స. చండ్రచెట్టు
ఖదిరుఁడు. స. ఇంద్రుఁడు
ఖద్ది. దే. బలము
ఖద్యోతము. స. మిడుఁగుఱుఁబురుగు
ఖద్యోతుఁడు. స సూర్యుఁడు
ఖనకము, ఖానకము } స ఎలుక, పందికొక్కు
ఖనకుఁడు. స. త్రవ్వెడువాఁడు, ఉప్పరవాఁడు, కన్నపుదొంగ
ఖననము. స. త్రవ్వుట
ఖని. స. గని, ఖాని
ఖనిత్రము. స. గడ్డపాఱ, గుద్దలి
ఖనిత్రి. స. పాఱ
ఖపుటుఁడు. స. అన్నమాకులోఁబెట్టుకొనక చేతఁబెట్టుకొని భుజించువ్రతము గలవాఁడు
ఖపురము. స. పోఁకమ్రాను, బంక
ఖర. స. ఒకసంవత్సరము
ఖరకరుఁడు. స. సూర్యుఁడు
ఖరకుటి. స. మంగలియిల్లు
ఖరణసుఁడు. స. వాఁడియైన ముక్కుగలవాఁడు, గద్దముక్కుగలవాఁడు
ఖరపుష్ప. స. వాయింటచెట్టు
ఖరమంజరి. స. ఉత్తరేను
ఖరము. స. గాడిద, ఎండుపోఁక, వాఁడిమి, వేఁడిమి, వేఁడిమిగలది
ఖరాశ్వ. స. ఓమము
ఖరాళికుఁడు. స. మంగలవాఁడు
ఖరుఁడు. స. ఒకరాక్షసుఁడు, వాఁడిమి గలవాఁడు, వేఁడిమిగలవాఁడు
ఖరువు. స. గర్వము, గఱ్ఱము, తెల్లనిది

ఖర్జనము. స. గోఁకుట
ఖర్జువు. స. తీఁట, దురద
ఖర్జూరము. స. వెండి, తేలు, ఒకానొకచెట్టు
ఖర్జూరి. స. చిట్టీఁదుచెట్టు
ఖర్పరము. స. బిచ్చె మెత్తుదుకప్పెర, తల పుఱ్ఱె
ఖర్పరి. స. పాలతుత్తము
ఖర్పరుఁడు. స. దొంగ
ఖర్వటము. స. కొండక్రిందిపల్లె
ఖర్వము. స. సంఖ్యావిశేషము, అధమము, పొట్టి
ఖర్వుఁడు. స. పొట్టివాఁడు
ఖలత. స. దౌష్ట్యము
ఖలతి. స. బట్టతలవాఁడు
ఖలపువు. స. కళ్లమునూడ్చువాఁడు
ఖలము. స. చోటు, పాపము, కళ్లము, నీచము, క్రూరము
ఖలిని. స. కళ్లములసమూహము, ఖలుల సమూహము
ఖలీకారము. స. హానిచేయుట, హాని
ఖలీనము } స. గుఱ్ఱపుకళ్లెము
ఖలినము }
ఖలుఁడు. స. దుర్జనుఁడు
ఖల్య. స. కళ్లములసమూహము, ఖలుల సమూహము
ఖల్లము. స. తోలు, పల్లము, వానకోయిల
ఖల్లిక. స. పెనము
ఖల్వాటుఁడు. స. బట్టతలగలవాఁడు
ఖసూచి. స. ప్రతిభలేనివాఁడు, మందమతి
ఖస్థసము. స. గసగసాచెట్టు
ఖస్థసరసము. స. నల్లమందు
ఖళూరిక. స. సాముకూటము, గరిడీ

## ఖా

ఖాండవము. స. ఇంద్రునియొక్క ఒకానొక వనము
ఖాండవికుఁడు. స. మిఠాయిచేయువాఁడు
ఖాటి. స. పాడె, ఖాటిక
ఖాణము. దే. గుఱ్ఱము మొదలగువాని యొక్క యులవలు మొదలుగాఁ గల భక్ష్యము
ఖాతకుఁడు. స. త్రవ్వెడువాఁడు, అప్పు తీసెడువాఁడు
ఖాతకము. స. అగడ్త, ఖాతిక
ఖాతము. స. పుష్కరిణి, కోనేఱు, త్రవ్వఁ బడినది, తొలువఁబడినది, బొక్క, అగడ్త
ఖాదకుఁడు. స. తినువాఁడు, అప్పుతీసెడు వాఁడు
ఖాదనము. స. తినుట, తిండి, పల్లు
ఖాదము. స. తినుట, ఆహారము
ఖాదితము. స. తినఁబడినది
ఖాదిరము. స. కవిరియుండ
ఖాద్యము. స. తినఁదగినది
ఖానకుఁడు. స. గనిత్రవ్వువాఁడు, కన్నపు దొంగ
ఖాని. స. గని
ఖారి. స. పుట్టి
ఖారీకము. స. పుట్టెడు విత్తులు విత్తఁదగినది
ఖాలత్యము. స. బట్టతల గలిగియుండుట

## ఖి

ఖిఖి. స. నక్క
ఖిద్రుఁడు. స. బీదవాఁడు
ఖిన్నత్వము. స. ఖేదము
ఖిన్నము. స. ఖేదమునొందినది
ఖిన్నుఁడు. స. ఖేదమునొందినవాఁడు

ఖలము. స. దున్ననిది, చెడినది
ఖలీభవించు. స. చెడు

## ఖు

ఖురణసుఁడు. స. బుఱ్ఱముక్కుగలవాఁడు
ఖురము. స. గొరిజె. మంగలకత్తి, మంచెపు కోడు
ఖురముఖము. స. బూరగొమ్ము
ఖురళి
ఖురళిక } స. సాము
ఖురాకము. స. మృగవిశేషము
ఖురాలకము. స. ఇనుపబాణము
ఖురాలికము. స. మంగలపొది, బాణముల పొది, తలగడ
ఖుర్దనము. స. ఆట
ఖుల్లకము. స. అల్పము, క్షుల్లకము

## ఖే

ఖేంఖాణము. స. గుఱ్ఱము
ఖేచరము. స. మృగవిశేషము
ఖేచరుఁడు. స. వేలుపు, ఆకాశమున సంచే రించువాఁడు
ఖేటకము. స. డాలువాఱు. గ్రామవిశేషము
ఖేటము. స. పంటకాఁపు లుండెడిపల్లె, డాలు వాఱు, కఫము, అధమము
ఖేదనము. స. అలసట, బాధ, దుఃఖము, దరిద్రము
ఖేదము. స. శోకము, అలసట, బాధ
ఖేదించు
ఖేదిల్లు } స. దుఃఖించు
ఖేయము. స. అగడ్త, నీళ్లుపాఱుటకుఁ గట్టిన అనకట్ట
ఖేల
ఖేలనము } స. ఆట
ఖేలి. స. ఆట, బాణము, సూర్యుఁడు
ఖేసరము. స. కంచెరగాడిద

## ఖో

ఖోడుఁడు. స. కుంటివాఁడు
ఖోలకము. స. కుల్లాయ, పుట్ట.పోఁకచిప్ప

## ఖ్యా

ఖ్యాతము. స. ప్రసిద్ధికెక్కినది, తెలియఁ బడినది, తెలుపఁబడినది, చెప్పఁబడినది, ప్రకటనము
ఖ్యాతవ్యము. స. ప్రసిద్ధికెక్కఁదగినది
ఖ్యాతి. స. ప్రసిద్ధి, కీర్తి, స్తుతి
ఖ్యాతుఁడు. స. ప్రసిద్ధుఁడు
ఖ్యాపకము. స. తెలియపఱచునది
ఖ్యాపనము. స. తెలియపఱచుట, ఒప్పు కొనుట, ప్రసిద్ధికెక్కఁజేయుట

## గ

గ. ఒకయక్షరము
గంగ. దే. పూజ్యము, పెద్ద
గంగ. స. ఒకానొక నది
గంగడోలు. దే. ఆవులకును ఎడ్లకును మెడ క్రింద వ్రేలాడెడు తోలు
గంగమైలావు. దే. నలుపును పసుపును గలసిన వర్ణముగల ఆవు
గంగమ్మ
గంగవమ్మ } దే. ఒకానొక గ్రామదేవత
గంగరావి. దే. బ్రహ్మదారువృక్షము
గంగరేను. దే. పెద్దరేఁగు
గంగాజలములు. స. ధాన్యవిశేషము

గంగాధరుఁడు. స. శివుఁడు
గంగానమ్మ. దే. ఒక గ్రామదేవత
గంగాళము. దే. లోహముతోఁజేయఁబడిన నీళ్లపాత్ర
గంగి. దే. పూజ్యము
గంగిరెద్దు } దే. బిచ్చెపువాండ్రు శృంగారించి తీసికొనివచ్చెడి ఎద్దు
గంగెద్దు
గంజ. స. కల్లమ్మెడియిల్లు, గని
గంజము. స. బండారము, తిరస్కారము, గని, పశువులదొడ్డి, సంత, ధాన్యమును నిలువయుంచుచోటు
గంజి. త. అన్నరసము
గంజికాలు. దే. వంచిన మోఁకాలు
గంజిగుల్ల. త. నీటిబుగ్గవలెలేచెడు బొబ్బ
గంజితొరక. దే. గంజిమీఁది మీఁగడ
గంజె. దే. కృషికియోగ్యమైనభూమి
గంజెనగాలు. దే. బాలక్రీడావిశేషము
గంజోయి. త. మత్తుపుట్టించునట్టి యొక వస్తువు
గంజే. దే. బజోరు
గంట. దే. గడ్డిమబ్బు
గంట. త. వాద్యవిశేషము, కాలవిశేషము
గంటకట్టు. దే. గంటయేర్పడినదగు
గంటము. దే. తాటాకుమీఁద వ్రాయుటకు నుపయుక్తమైన యుక్కుసాధనము
గంటలమ్మ. త. ఒకానొక గ్రామదేవత
గంటవేఁట. దే. వేఁటలోభేదము
గంటి. దే. గాయము, దుఃఖము
గంటు. దే. గాయముచేయు, గనుపు ముడి, రూకలముడి, వెండ్రుకలముడి, క్రోధము, గాయము
గంటుబారంగి. దే. ఒకానొక మందుచెట్టు
గంటువెట్టు. దే. కోపముచే మొగము ముడుచుకొను
గంటె. దే. గరిటె, సజ్జపైరు
గంటెకామ. దే. ఒకానొకచెట్టు
గంటెలు. దే. సజ్జలు
గంట్లము. దే. గర్భిణులకోరిక, దోహదము
గండ. దే. మ్రొక్కుబడి
గండంగి. దే. కొండముచ్చు
గండఁడు. త. శూరుఁడు
గండకత్తెర. త. మెడను కత్తిరించుకొనెడి యొక విధమగు కత్తెర, ఇబ్బంది
గండకము. స. ఖడ్గమృగము, విఘ్నము, జ్యోస్యము
గండగొడ్డలి. త. పరశువు
గండగొడ్డలితాలుపు. దే. పరశురాముఁడు
గండడఁగు. దే.పరాక్రమహీనుఁడగు,చచ్చు
గండదల. దే. మ్రొక్కుబడి
గండ పెండరము } దే. శూరులు బిరుదుగా కాలనుధరించెడియందియ
గండ పెండారము
గండభేరుండము. స. పక్షివిశేషము
గండమాల. స. మెడచుట్టు గడ్డలులేచెడు వ్యాధివిశేషము
గండము. స. చెక్కిలి, ఏనుఁగు చెక్కిలి, ఒక గ్రహయోగము, అపాయము, ఖడ్గమృగము, పుండు
గండరగండఁడు. త. శూరులకెల్లశూరుఁడు
గండరించు. దే. పుట్టు, పుట్టించు
గండరులు. త. తునుకలు
గండరువు. దే. పడియచ్చు
గండవడము. త. తెర

గండశైలము. స. కొండనుండి జాఱిపడిన పెద్దఱాయి
గండాడు. దే. రమించు
గండారు. దే. చెఱసాల
గండాలి. స. తీఁగగఱిక
గండిక, గండి } త. బిలము, రంధ్రము, సందు, పగులు, నీళ్లధికముగా వచ్చుట చేతఁ దెగిన చెఱువుకట్టలోనగు వానిసందు
గండిదొంగ. దే. కన్నపుదొంగ
గండివనము. త. గ్రంథిపర్ణము, పచ్చాకు
గండీరము. స. చిత్తిహూర, ఏఱువంగచెట్టు
గండీరి. స. చిత్తిహూర, ముల్లుజెముడు
గండు. త. పౌరుషము, బలము, పశుజాతి యందు మగది, అసాధ్యము, కష్టము
గండుఁడు. స. శూరుఁడు
గండూపదము. స. ఎఱ్ఱి, వానపాము
గండూపది. స. ఆఁడు ఎఱ్ఱి
గండూషము. స. పుక్కిలింత, పుడిసిలి
గండూషించు. స. పుక్కిలించు
గండె. త. చేప
గండోలము. స. కుచ్చులమీఁకు
గండోలి, గంఢోలి } స. ఎఱ్ఱతుమ్మెద, కణుఁదు రీఁగ
గండ్ర. దే. దిట్టతనముకలవాఁడు, పెద్దది, దుష్టుఁడు
గండ్రలు. దే. పరుషవచనములు
గండ్రలు. త. ఖండములు, తునుకలు
గండ్రచీమ. దే. పెద్దనల్లచీమ
గండ్రించు. త. ఖండించు
గండ్రికలు. త. ఖండములు
గంత. త. మెత్తగాఁబఱచుకొనుటకై ప్రాఁత గుడ్డలను జేర్చి దట్టముగాఁగుట్టినబొంత, ఎద్దు మొదలగువానిమీఁదవేసెడుగంత
గంత. స. పోవువాఁడు
గంతవ్యుఁడు. స. పోఁదగినవాఁడు
గంతు. దే. దుముకు
గంతుకొను. దే. దుముకు, చచ్చు
గంత్రి. స. ఎడ్లబండి
గందకము. త. గంధకము
గందపటకి. త. చందనలేపనము
గందపట్టె. త. తలుపుమీఁద నమర్చెడి యడ్డుకొయ్య
గందపుఁగొండ. త. మలయపర్వతము
గందపుకుడక. దే. బొట్టుకై చందనముంచు కొనుపాత్ర
గందపుమ్రాను. దే. చందనవృక్షము
గందపొడి. దే. కొన్ని గంధద్రవ్యములఁ జేర్చి చేసినపొడి
గందము. త, చందనము
గందరగోళము. త. సందడి
గంధకము. స. మందులోను తుపాకిమందు లోను వేయఁబడు పచ్చని యొకవస్తువు
గంధకారి. స. ముడుఁగుఁదామర
గంధకుటి. స. మురయనెడు గంధద్రవ్యము
గంధగజము. స. మదపుటేనుఁగు
గంధగర్భము. స. కొండమారెడుచెట్టు
గంధనము. స. ఎత్తిఁగించుట, నొప్పించుట, నలుగిడుట
గంధనాకులి. స. సర్పాక్షీవృక్షము
గంధఫలి, గంధఫలీ } స. సంపెగమొగ్గ, ప్రేంకణపు చెట్టు
గంధమాదనము. స. ఒకానొకకొండ, మదపు టేనుఁగు
గంధమార్జాలము. స. పునుఁగుపిల్లి

గంధము. స. వాసన, గంధకము, గర్వము, లేశము, సంబంధము, పరిమళద్రవ్యము, చందనము

గంధమూలము. స. అడవికచోరము

గంధమూలి. స. గంట్లకచోరము

గంధమూషి. స. చేంచే

గంధమృగము. స. పునుఁగుపిల్లి

గంధరసము. స. బోళము

గంధరాజము. స. ఒకానొక గంధద్రవ్యము, చందనము

గంధర్వము. స. మృగవిశేషము, గుఱ్ఱము, మగకోయిల

గంధర్వహస్తకము. స. ఆముదపుచెట్టు

గంధర్వుఁడు. స. దేవయోనివిశేషము, పాటపాడువాఁడు

గంధవతి. స. కల్లు, వ్యాసునితల్లి, నేల

గంధవహ. స. ముక్కు

గంధవహము. స. వాయువు, ముక్కు

గంధవహుఁడు } స. వాయువు
గంధవాహుఁడు }

గంధసారము. స. చందనము

గంధాఖువు. స. చేంచే

గంధాత్మము } స. గంధకము
గంధికము }

గంధికుఁడు. స. పరిమళద్రవ్యముల నమ్మువాఁడు

గంధిని. స. మురయనెడి గంధద్రవ్యము

గంధిలము. స. పెద్దజాతినక్క, వఱదు, వాసనగలది

గంధేభము. స. మదపుటేనుఁగు

గంధోత్తమ. స. కల్లు

గంధోళి. స. కందురీఁగ, సొంటి

గంప. దే. వెదురుబద్దలు మొదలగువానితో నల్లినతట్ట

గంపపులుఁగు దే. కుక్కుభము

గంబుర }
గంబురము }
గంబురా } త. కర్పూరము
గంబూర }
గంబూరము }

గంభారి. స. గుమ్ముడు

గంభీరము. స. లోఁతుగలది

గంభీరవేది. స. అంకుశముతోఁ బొడిచి యెంతబాధపెట్టినను ఒళ్లెఱుఁగని మదపుటేనుఁగు

గంభీరిమ స. గంభీరభావము

గగనకుసుమము. స. శూన్యము

గగనప్రయత్నము. స. మిక్కిలి గొప్పప్రయత్నము

గగనము. త. దుర్లభము

గగనము. స. ఆకాశము, మహావాయువు, శూన్యము, సున్న, స్వర్గము

గగనరత్నము. స. సూర్యుఁడు

గగురు. దే. భయహర్షాదులచేత మేని వెండ్రుకలునిక్కపొడుచుట, రోమాంచము

గగురుపాటు. దే. రోమాంచముకలుగుట

గగురుపు } దే. రోమాంచము
గగుర్పు }

గగురుపొడుచు. దే. రోమాంచితమగు

గగురుపొడుపు } దే. గగురుపాటు
గగుర్పొడుపు }

గగ్గు. దే. సంకోచించు

గగ్గు. త. గద్దదిక

గగ్గురు. దే. గగురు

గగ్గులకాడు. దే. ధాన్యమురాల్చిన కంకుల సమూహము, నిస్సారము

గగ్గులు. దే. గింజలురాల్చినకంకులు
గగ్గెర. దే. ఒకానొకచెట్టు
గగ్గోలు. దే. కలఁత, క్షోభము
గగ్గోలువడు. దే. కలఁగు, క్షోభించు
గచ్చ. దే. గ్రచ్చచెట్టు
గచ్చు. దే కాంతి, పూఁత, గారపూఁత
గచ్చు. త. వర్ణలోపముగాని, పదలోపము గాని, కలిగినమాట
గచ్చుకొను. దే. పట్టుకొను,వాయురోగము చేత బిగిసికొను
గచ్చులాఁడి. దే. బయటికి యోగ్యురాలి వలె నటించునట్టి స్త్రీ
గచ్చువిచ్చగు. దే. కార్యవైకల్యమగు,ఆఱు మూఁడగు
గజకర్ణము. స. ఏనుఁగు చెవివంటి యొక విసనకఱ్ఱ
గజత. స. గజసమూహము
గజదంతము. స. అభినయ హస్తవిశేషము
గజనిమీలనము. స. కపటము
గజభక్ష్య. స. అందుగుచెట్టు
గజము. స. ఏనుఁగు, మూఁడడుగులకొలఁత
గజయాన. స. ఏనుఁగునడవంటి నడగల ఆఁడుది, ఆఁడుది
గజరిపువు. స. సింహము
గజాననుఁడు. స. విఘ్నేశ్వరుఁడు,వినాయ కుఁడు
గజిబిజి. దే. కలఁత, నలఁగుడు, సందడి, నలఁగినది
గజిబిజించు. దే. కలఁగు
గజేంద్రగజము. స. పదిగజములకు సమాన మగు గొప్ప గజము కొలత
గజ్జి. త. తీఁటకుఱుపు
గజ్జియ } దే. గజ్జె, కింకిణి, చిఱుగంట, గజ్జె } మువ్వ
గజ్జెగోలుసు. దే. స్త్రీపాదాభరణవిశేషము
గజేగజే. దే. వడఁకుటయందగునను కరణము
గజేనిమ్మ. దే. పెద్దనిమ్మ, లకుచము
గజేసు. దే. కపటము
గజేము. దే. తుపాకికి మందుఁగట్టించెడి ఇనుపసలాక
గజ్జ. త. పెద్ద
గజ్జె. దే. తొడసందు
గజ్జ. దే. మదము
గజ్జేరము. త. ఖర్జూరము
గటక. దే. పిండితోఁజేసినజావ
గట్ట. త. సిద్దెనోటికి వేసిగట్టించెడు బిరడ
గట్టన. త. గట్టించుట
గట్టి దే. కఠినము, దృఢము, ఉచ్చైశ్శ్రావ్యమ దముకలది
గట్టించు. త. గట్టనచేయు
గట్టినబోది. దే. బాలక్రీడావిశేషము
గట్టివ. దే. ధూర్తుఁడు
గట్టివా. దే. గట్టిగమాటలాడునాఁడు, గట్టిగ మాటలాడునది, ధూర్తుఁడు, ధూర్త రాలు
గట్టివాఁడు. దే. సమర్థుఁడు
గట్టివాయి. దే. గయ్యాళి, ధూర్తురాలు
గట్టు. త. తీరము, కొండ, గనిమ
గట్టుఁదిమ్మరి. దే. కోఁతి
గట్టుతాలుపు. దే. విష్ణువు
గట్టుదాయ. త. ఇంద్రుఁడు
గట్టురాచూలి. దే. పార్వతి
గట్టులఱేఁడు. దే. హిమవంతుఁడు
గట్టువకాఁడు. దే. శూరుఁడు

గట్టువాలు. దే. సైరంధ్రి, పర్వతమువలెఁ ప్రవర్తించునది, అనఁగా పురుషసాంగత్యముఁ గోరక ధైర్యముతో నుండునది యని వ్యుత్పత్త్యర్థము
గట్టువిలుకాఁడు } దే. శివుఁడు
గట్టువిలుతుఁడు }
గట్రాచూలి. దే. పార్వతి
గడ. త. నిడుపాటికోల, సమూహము, కంబము, ఓడకంబము
గడగడ. దే. వడఁకుటయందగు ననుకరణము
గడగడలాడు. దే. వడఁకు
గడచీల. దే. ఏతపుబానయందుండుచీల
గడన. త. ఎన్నిక, స్తోత్రము, సంపాదనము
గడనకత్తె } త. భోగమది, వేశ్య
గడనపడఁతి }
గడప. దే. వాకిటిక్రిందిభాగము
గడము. దే. కుండమొదలగువానిమూఁత
గడము. స. గండెచేఁప, విఘ్నము
గడసాదన. త. సాము, వ్యాయామము
గడసె. దే. అటుక
గడి. దే. ఎల్ల, మరియాద, బలము, పెద్ద
గడించు } త. సంపాదించు, కల్పించు
గడియించు }
గడికాళ్లువేయు. దే. రెండురెండు పశువులను ఒక్కొక్కకాలుచేర్చిలంకెవేయు
గడితపడు. త. గట్టిపడు
గడితము. త. తఱచు, ముదుగు, తఱచైనది, ముదుగైనది
గడిత్రాడు. దే. రెండుపశువులను లంకెవేసెడిపలుపు
గడిదేఱు. దే. సమర్థుఁడగు

గడిదొంగ. దే. మర్మమెఱిఁగినదొంగ, కన్నగాఁడు
గడిపోతు. దే. ఆఁబోతు, చెడుగొడ్డు
గడియ. త. ఇరువదినాలుగు నిమిషముల కాలము, గడెమ్రాను
గడియారము. త. కాలపరిమాణమును తెలుపునట్టియొక యంత్రము
గడు. దే. దారువిశేషము, చెక్క
గడులుఁడు. స. కుబ్జుఁడు
గడువు. దే. నిర్ణయకాలము
గడువు. స. కణఁతి [వాఁడు, కఠినుఁడు
గడుసరి. దే. అసాధ్యుఁడు, ధైర్యముగల
గడుసు. దే. కాఠిన్యము, ధైర్యము, కఠినము, అసాధ్యము, కుజనుఁడు, కుత్సితస్త్రీ
గడుసువడు. దే. ధీరుఁడగు
గడె. త. గడియ
గడ్డ. త. దుంప, వ్రణము, మట్టిపెల్ల, ద్వీపము
గడ్డపలుగు } దే. నేల పెల్లగించెడుసాధనవిశేషము, గునపము
గడ్డపాఱ }
గడ్డప్రొయ్యి. దే. గడ్డలుగా ఏర్పఱచిన పొయ్యి
గడ్డము. త. చిబుకము, శ్మశ్రువు
గడ్డి. దే. కసవు, తృణము
గడ్డిపిట్ట. దే. పక్షివిశేషము
గడ్డిబొద్దు. దే. చుట్టకుదురు, పెద్దగడ్డిమోపు
గడ్డు. దే. అసాధ్యము, మిక్కిలి
గడ్డుకొను. దే. అతిశయించు
గడ్డెనబొద్దు. దే. బాలక్రీడావిశేషము
గణకుఁడు. స. జోస్యుఁడు, కరణమువాఁడు
గణగణ. దే. ఘంటాధ్వనియందగు ననుకరణము
గణన. స. ఎన్నిక
గణనీయము. స. ఎంచఁదగినది

గణపతి. స. విఘ్నేశ్వరుఁడు
గణము. స. సమూహము, ప్రముఖులసమూహము, సేనావిశేషము, సేవకజనము, జాతి, తరగతి, సమాజము
గణరాత్రము. స. పెక్కురాత్రుల సమూహము
గణరూపము. స. జిల్లేడు
గణహాసకము. స. నల్లకచోరము
గణాధిపుఁడు. స. విఘ్నేశ్వరుఁడు, శివుఁడు
గణి. స. సాంగముగా వేదాధ్యయనముచేసి [నవాఁడు
గణించు. స. ఎంచు, లక్ష్యపెట్టు
గణిక. స. వేశ్య, ఆఁడేనుఁగు
గణికారిక. స. నెల్లిచెట్టు
గణికుఁడు. స. లెక్కపెట్టువాఁడు, కరణము, మహాగణితశాస్త్రజ్ఞుఁడు
గణితము. స. గణితశాస్త్రము, అంకవిద్య, ఎంచఁబడినది
గణితవ్యము. స. ఎంచఁదగినది
గణితి. స. గణితశాస్త్రజ్ఞుఁడు
గణిల్లు. దే. ఎద్దుఱంకెవేయుట, గంట మ్రోఁగుట మొదలగు వానియందగు ధ్వన్యనుకరణము
గణుతి. త. ఎన్నిక, స్తోత్రము, లక్ష్యము
గణుతించు. త. ఎంచు, స్తోత్రముచేయు, లక్ష్యముచేయు
గణెము. దే. వేషధారులుధరించెడు లక్కసొమ్ము
గణేయము. స. ఎంచఁదగినది
గణ్యుఁడు. స. ఎంచఁదగినవాఁడు, గౌరవనీయుఁడు
గతపడు. దే. కడచు, చచ్చు
గతము. స. పోక, పోయినది, తెలియఁబడినది, చచ్చినది, పొందినది, చలనము, నడక, సంగతి, పద్ధతి
గతాగతము. స. పోవుచువచ్చుచుండినది
గతానుగతికుఁడు స. జరిగినవానిని అనుసరించి పోవువాఁడు
గతి. స. పోక, త్రోవ, ఉపాయము, శరణము, విధము, దశ, ఆధారము, చలనము, నడక, ప్రవేశము, స్వర్గప్రాప్తి, బ్రతుకుతెరువు, ఫలితము
గతికుఁడు. స. గతిగలవాఁడు
గతుఁడు. స. పోయినవాఁడు, పొందినవాఁడు
గతుకు. దే. ఎంగిలితిను, కుక్కవలెనాకు, గొయ్యి
గత్త, గత్తము, గత్తర } దే. ఎరువు
గత్తు. దే. మూత్రగంధము
గత్యంతరము. స. మఱియొకగతి
గద. స. గుదియ
గదము. స. తెవులు, పలుకుట, మాట
గదాగ్రజుఁడు. స. గదునియన్న, విష్ణువు
గదాధరుఁడు. స విష్ణువు
గది. దే. ఇంటిలోపలియఱ
గది. స. గదను ధరించినవాఁడు, విష్ణువు, తెవులు గలవాఁడు
గదితము. స. చెప్పఁబడినది
గదుకు. దే. గతుకు, ఎంగిలితిను
గదుము, గదుముకొను } దే. గద్దించు, త్రోయు
గదురు. దే. చెడుకంపు, వ్యాపించు
గద్గదము. స. డగ్గుత్తికపడిన మాట, నత్తి, అస్ఫుటవాక్కు
గద్గదస్వరము. స. డగ్గుత్తికపడినస్వరము, ఎనుపోతు

గద్గదిక. స. డగ్గుత్తిక
గద్ద. త. పక్షివిశేషము, గృధ్రము
గద్దగోరు. త. చోరసాధనవిశేషము, కిటికీ తలుపునువేయు నిత్తడికొక్కెము
గద్దన. దే. గద్దింపు
గద్దరి. దే. దిట్టతనముగలది
గద్దరించు. దే. వణఁకు
గద్దరికాఁడు. దే. దిట్టతనము గలవాఁడు, గడుసువాఁడు
గద్దించు దే. కోపముచేత అదలించు
గద్దియ. త. ఉన్నతపీఠము, సింహాసనము
గద్దువ. దే. గడ్డము
గద్దె. త. ఉన్నతపీఠము, సింహాసనము, వరహా, సోదె
గద్దెపొంకము. దే. పరువునకుఁ దగిన మర్యాదమాట
గద్యము. స. వచనము, చెప్పఁదగినది
గద్యాణము. స. వరహా
గనప. దే. పెద్ద
గనము. త. అధికము
గనయము. దే. పోఁకముడి, వింటికొప్పు
గని. త. లోహములుపుట్టుచోటు, బిలము
గనిమ. దే. కట్ట, గట్టు
గనియ. త. ఖండము
గనివాఁడు. దే. గనులు త్రవ్వువాఁడు
గనీబు. దే. ఒఱ
గనుపు. దే. పర్వము, కనుపు
గనె. త. గనియ, ముక్క
గన్నెరు, గన్నేరు } దే. కరవీరపుష్పము
గపటిక. స. వరిగపైరు
గబీలు. దే. మంటయందగు ధ్వన్యనుకరణము

గబ్బాటు. దే. వెలతక్కువైనది, కలఁత
గబ్బ. త. కపటము
గబ్బి. త. కుక్కకీయఁబడినపేరు, గర్వము కలవాఁడు, ధీరుఁడు, గొప్పది
గబ్బిడాయి, గబ్బిలాయి } దే. గబ్బిలము
గబ్బిలి. దే. పిడికిలి
గబ్బు. దే. దుర్గంధము
గబ్బు. త. గర్వము, మదము
గబ్బుచీఁకటి. దే. గాఢాంధకారము
గబ్బుచెంకమెకము. దే. ఏనుఁగు
గబ్బులుఁగు. దే. ఒకానొక శకునపుపక్షి, భాసంతము
గభస్తి. స. అగ్నిపెండ్లాము, సూర్యకిరణము, సూర్యుఁడు
గభీరము. స. గంభీరము, లోఁతు
గభీరిమ. స. గంభీరిమ
గభోళి. స. ఒఱగుబెండు
గమకము. దే. యత్నము, అధికము, మనోజ్ఞము
గమకము. స. సంగీతశాస్త్రమునందు స్వరవిన్యాసభేదముల తోఁపఁజేయునది
గమకించు. దే. యత్నించు
గమగమించు. దే. గమగమ యని వాసనకొట్టు
గమనము. స. పోక, ప్రయాణము, తలఁపు
గమనించు. స. పోవు, తలఁచు
గమనిక. దే. విధము
గమనిక. స. నడపు
గమనీయము. స. పొందఁదగినది, గ్రహింపఁదగినది
గమము. స. పోక, ప్రయాణము, త్రోవ
గమాయించు. దే. గమగమించు
గమి. దే. సమూహము, తఱచు
గమించు. స. పోవు, గమియించు

గమికత్తె. దే. అంతఃపురమునందు కావలి యుండెడు నాఁడుది
గమికాఁడు. దే. అధిపతి, సేనాధిపతి, ముఖ్యజనుఁడు
గమికొను. దే. ప్రోగుపడు
గమ్యము. స. పొందఁదగినది, కోరఁదగినది, తలఁపఁబడినది
గమ్యుఁడు. స. స్త్రీపొందఁదగినవాఁడు
గయ. స. తీర్థవిశేషము
గయము. స. పశువు, గయ, భాగ్యము, ఇల్లు, కుటుంబము, సంతానము
గయాళము / గయ్యాళము } దే. ధిక్కారపుమాట
గయాళి / గయ్యాళి } దే. ధిక్కరించి మాటాడునది
గయాళించు / గయ్యాళించు } దే. ధిక్కరించిమాటాడు
గయాళు. దే. సేద్యముచేయుటకుఁ దగని పొలము
గర. దే. గడ్డ, ముద్ద
గరకట్టు. దే. గడకట్టు
గరకొను. దే. గడ్డకట్టు
గరగ. త. చిన్నకుండ, చిన్నపాత్రము
గరగడ. దే. సీసాలో చేమురు పోయుట కుపయోగించు గరాటీ
గరగర. దే. నిర్దోషము, నిర్మలము
గరగరిక. దే. నైర్మల్యము, అందము
గరజి. స. ఒకానొక కరణము
గరణము. స. మ్రింగుట, విషము
గరదుఁడు. స. విషముపెట్టువాఁడు
గరము. స. ఒకకరణము, కృత్రిమవిషము
గరపడు. దే. గడ్డకట్టు
గరసించు. దే. ఘర్షించు, ముట్టడించు
గరళము. స. విషము

గరాగరి. స. డావరదంగిచెట్టు
గరాసు. త. దుష్టుఁడు, దుష్టురాలు
గరాసులు. దే. రాక్షసులు
గరిఁటె. దే. లోహపుతెడ్డు, గంటె
గరికొను. దే. గట్టిపడు
గరిగట్టు. దే. మూర్తీకరించు, కనఁబడు
గరిడి. త. సాము, సాముకూటము,చోటు, సమీపము
గరిడిముచ్చు. దే. మంచివానివలె దగ్గఱఁ జేరియుండి సమయముకనిపెట్టి దొంగిలించెడివాఁడు
గరిడియ. త. బుట్ట
గరిత. త. ఇల్లాలు, పతివ్రత
గరితము. స. విషము కలుపఁబడినది
గరిమ / గరిమము } స. గొప్పతనము,శ్రేష్ఠము, అష్టైశ్వర్యములలో నొకటి
గరిమిడి. దే. గణిక
గరిమిడికొక్కు. దే పందికొక్కు
గరివించు త. గర్వపడు
గరిష్ఠము. స. మిక్కిలి గురువు
గరిసె. త. ధాన్యముంచెడు కొట్టు, మాన విశేషము
గరు. దే. రోమాంచము
గరుగు. దే. ఒకానొకచెట్టు
గరుటామంతుఁడు / గరుటాలమంతుఁడు } త. గరుత్మంతుఁడు
గరుడకంబము. త. దేవళమందలిగరుడస్తంభము
గరుడధ్వజుఁడు. స. విష్ణువు
గరుడపచ్చ. త. మరకతము
గరుడసరులు. త. శాలిధాన్యవిశేషము
గరుడస్తంభము. స. దేవళము వాకిటచివర గంటలు గల్గి నాటఁబడియున్న ధ్వజస్తంభము

గరుడాగ్రజుఁడు. స. గరుత్మంతునియన్న, అనూరుఁడు
గరుడి. త. గరుత్మంతుఁడు
గరుడిరవుతు. త. విష్ణువు
గరుడుఁడు. స. గరుత్మంతుఁడు
గరుత్తు. స. ఱెక్క
గరుత్మంతము. స. పక్షి
గరుత్మంతుఁడు. స. గరుడుఁడు
గరుపాటు. దే. గగురుపాటుపు
గరుపాటుమొన. దే. పందిమూఁతిముట్టె
గరుపాఱు. దే. రోమాంచితమగు
గరుము. త. గులకరాళ్ల చేత గట్టిదైనది, గరుపనేల
గరువతనము. దే. మగఁటిమి
గరువపుటెండ. దే. తీక్ష్ణమైన యెండ
గరువము. త. గర్వము, గౌరవము, విరివి
గరువు. దే. చెంప
గరువు. త. గరుపనేల
గరుసు. దే. మర్యాద, మేర, తోలు
గరుసు. త. గరుపనేల
గర్గరము. స. సుడిగుండము, కవ్వము
గర్గరి. స. పెరుఁగుచిలికెడు కుండ
గర్జ. స. మేఘము మొదలగువానిధ్వని, సింహనాదము
గర్జనము. స. మేఘము మొదలగువానిధ్వని, కోపము, యుద్ధము, చీవాట్లు
గర్జించు. స. గర్జనముచేయు, కోపించు
గర్జితము. స. మేఘము మొదలగువానిధ్వని
గర్తము. స. పల్లము, శ్మశానము
గర్తిక. స. సాలెవాఁడు నేయుచోటు
గర్తాటము. స. ఎలుక, పందికొక్కు
గర్దభము. స. గాడిద
గర్దభాండము. స. కలజువ్విచెట్టు
గర్దనము. స. ఇచ్ఛగలది
గర్దము. స. కోరిక
గర్భకము. స. వెండ్రుకలలోపల ముడుచుకొన్న పూలదండ
గర్భదరిద్రుఁడు. స. తిండికిలేని దిక్కుమాలినవాఁడు
గర్భదీక్ష. స. భార్య గర్భిణిగానున్నప్పుడు భర్తక్షౌరముచేయించుకొనక యుండుట
గర్భము. స. కడుపు, కడుపులోనిపిండము, బిడ్డ, ప్రసవకాలము, లోపలిభాగము, లోపలిగది, బిలము, నదియొక్కమధ్యభాగము
గర్భవతి. స. గర్భిణీస్త్రీ
గర్భశత్రువు. స. పైకివిరోధముగాఁ గనఁబడని గొప్పశత్రువు
గర్భాగారము. స. లోపలిగది
గర్భాధానము. స. నిషేకము
గర్భాశయము. స. గర్భముసు బెట్టుకొని యుండెడు సంచి, మావి
గర్భిణి. స. చూలాలు
గర్భితము. స. కడుపుతోనున్నది, నిండినది
గర్ముత్తు. స. తృణసస్యము, గంటె
గర్వభంగము. స. అవమానము
గర్వము. స. అహంకారము, మదము
గర్వి. స. గర్వముకలవాఁడు
గర్వించు. స. గర్వపడు
గర్వితుఁడు. స. గర్వించినవాఁడు
గర్హణము. స. నింద
గర్హించు. స. నిందించు

గర్హితము. స. నిందింపఁబడినది
గర్హ్యము. స. నింద్యము
గర్హ్యవాది. స. కొఱ్ఱమాలినమాటలాడు వాఁడు
గర్హ్యుఁడు. స. అధముఁడు
గలగల. దే. భక్ష్యములునమలుటయందగు ధ్వన్యనుకరణము
గలగలలాడు. దే. గలగలయనిమ్రోఁగు
గలగోల. దే. తక్కువ
గలి. త. ఱెక్క, బాణముఱెక్క
గలిక దే. ఒకదినుసుకసవు
గలికచెక్క. దే. పచ్చికతోడిమట్టిపెల్ల
గలికమ్మి. దే. గలుకుతోడికమ్మి
గలిచిప్ప. దే. ముత్యపుఁజిప్ప
గలిబద్ద. దే. గలుకుతోడి తాటాకుబద్ద
గలుకు. దే. కొడవలి మొదలగువానికక్కు
గలుగు. దే. ఒకానొకచెట్టు
గలువ. త. పెద్ద, గొప్పవాఁడు
గల్టె. దే. చేఁపలను బట్టెడు సాధనము
గలఁతియ. త. గిండిచెంబు
గలతరించు. దే. ఒడలు జల్లుమను
గలబ. దే. కలఁత
గలబరించు. దే. కలఁగు
గలజేరు, గలిజేరు } దే. ఒకవిధమగు మొక్క
గలిబిలి. దే. సందడి
గలీబు. దే. గవుసెన, ఒఱ
గల్ల. దే. పొల్ల, మాదిగవాఁడు తోలునాన వేసెడుచేట్టి
గల్లకము. స. సారాయిఁబోసికొను కాచ పాత్రము
గల్లము. స చెక్కిలి

గవతము. దే. కసవు
గవను, గవఁకు } దే. గోపురము, సింహద్వారము
గవయము. స. గురుపోతు, ఒకదినుసుఎద్దు
గవరన. త. ఎఱుపు
గవలము. స. ఎనుపకొమ్ము
గవాంపతి. స. ఎద్దు, గొల్లవాఁడు
గవాక్షము. స. కిటికీ
గవాక్షి. స. పిన్నపాఁపరచెట్టు
గవాదని. దే. పసులుమేయఁకంచె
గవి. దే. గుహ, పల్లము
గవి. స. ఆవు
గవిలెము. దే. గంధములోరాచికలిపెడు విత్తు
గవీనము. స. ఆవులుమేసినచోటు
గవుండ్లవాఁడు. త. సారాయినమ్మువాఁడు, కల్లుగీఁచువాఁడు
గవేధుక, గవేధువు } స. అడవిగోదుమలు
గవేరుకము. స. ఎఱ్ఱసీమసున్నము
గవేషణ, గవేషము } స. వెదుకుట
గవేషించు. స. వెదకు
గవేషితము. స. వెదకఁబడినది
గవ్య. స. ఆవులమంద
గవ్యము. స. అల్లెత్రాడు, ఆవుపాలు మొదలగునది, ఆవునకు హితమైనది, పశువులు, పశువుల మేఁతగలబీడు
గవ్యూతి. స. రెండుకోసులకొలఁది
గవ్వ. దే. శంఖముదినుసు
గవ్వచౌకము. దే. వెలిగారము
గశికము. స. గసి

గస. దే. ఉబ్బసము

గసగసలు } త. ఒకదినుసువిత్తులు
గసగసాలు }

గసి. దే. మేకు

గసి. త. నేతిమడ్డి

గసిక. దే. కొనచెక్కినకొయ్య, బాణము

గసిబిసి. దే. కలఁగినది, గజిబిజి

గస్తీలు. దే. కావలివారు

గస్తు. దే. ఊరుతిరిగికాచేకావలి, దుర్వా సన

గహనము. స. అడవి, గుహ, దుఃఖము, చొరరానిది, ఎఱుఁగ శక్యముకానిది

గహరము. స. పొయికిఁబెట్టెడు కట్టె

గహీయము. స. గుహాసంబంధమైనది

గహ్వరము. స. అడవి, గుహ, పొదరిల్లు, కపటము, లోఁతైనది, చొరశక్యము కానిది, దాఁగునట్టిచోటు

గహ్వరి. స. భూమి

గహ్వరితము. స. దాఁచేఁబడినది

గళంతిక. స. గిండిచెంబు

గళకంబళము. స. గంగడోలు

గళగండము. స. గండమాల

గళనము. స. జాఱుట, కాఱుట

గళము స. కుత్తుక

గళశుండిక. స. కొండనాలుక

గళాంకురము. స. కొండనాలుక, అంగిటి ముల్లు

గళితము. స. జాఱినది, తినఁబడినది

గళ్యా. స. కంఠములసమూహము

గళ్ల. దే. కళ్ల, గట్టిపడినయుమ్మి

గళ్లెము. దే. పాలమీఁగడవంటి లేఁత కొబ్బెర

## గా

గాంగము. స. గంగది

గాంగుఁడు. స. భీష్ముఁడు, కుమారస్వామి

గాంగేయము. స. బంగారు

గాంగేయుఁడు. స. భీష్ముఁడు, కుమారస్వామి

గాంగేరుకము. స. బలుసుమొక్క

గాంగేరుకి. స. బీఱమొక్క

గాండివము } స. అర్జునునివిల్లు, విల్లు
గాండీవము }

గాండ్రించు. దే. ముఖముఉబ్బు

గాండ్ల. దే. నూనెఅమ్మి జీవించెడుజాతి

గాంత్రి. స. ఎడ్లబండి

గాంధర్వము. స. పాట, కన్యావరులు పర స్పరేచ్ఛచేతఁ జేసికొనువివాహము, దిన సప్తమాంశము

గాంధర్వుఁడు. స. గంధర్వుఁడు

గాంధారము. స. ఒకస్వరము, ఒకానొక దేశము, దినసప్తమాంశము

గాంధారి. స. గంజాయి, ధృతరాష్ట్రుని భార్య

గాంధారేయుఁడు. స. దుర్యోధనుఁడు

గాంధికుఁడు. స. పరిమళద్రవ్యముల నమ్ము వాఁడు

గాంభీర్యము. స. గంభీరభావము

గాఁజెర. దే. ఒకానొకదుంప

గాఁడి. దే. నిడుపుగా నేర్పఱచినపల్లము

గాఁడిగదుగు. దే. సంచయనముచేయు

గాఁడు. దే. కామమదము

గాగర. దే. స్త్రీలుకట్టుకొనుపావడ

గాజె. త. ధాన్యముపోవుటకు ఒఱలచే నేర్పఱచఁబడినతావు

గాజే. త. ఒకదినుసుమన్ను, గాజేమట్టితో చేసిన వలయములు
గాజేప్పు. దే. ఒకానొకఉప్పు
గాజేలవాండ్రు. దే. గాజులమ్మెడివారు
గాజేవాఱు. దే. కాంతిహీనమగు
గాటము. త. అధికము
గాటు. త. కారము
గాడి } దే. రథవిశేషము, బండి
గాడీ
గాడిద } త. గార్దభము
గాడ్ద
గాడిదకాళ్లవాఁడు. దే. మోఁకాళ్లు తగులువాఁడు
గాడిదపులి. దే. దుమ్ములగొండి
గాడు. దే. గ్రుచ్చుకొను, నాటు
గాడుపు } దే. గాలి
గాడ్పు
గాడుపుచూలి } దే భీముఁడు, హనుమంతుఁడు
గాడుపుపట్టి
గాడుపుమేపరి. దే. సర్పము
గాడుపుసంగడీఁడు. దే. అగ్ని
గాఢము. స. అధికము, లోఁతులేనిది, లాభమందలి కోరిక, అడుగుభాగము
గాణ. త. పాటకాఁడు, పాటకత్తె
గాణపత్యము. స. గణేశునిపూజించుట
గాణాపత్యము. స. ఒకమతము
గాణిక్యము. స. గణికలసమూహము
గాణీ. త. పాటకత్తె
గాణుఁడు. త. పాటకాఁడు
గాణేయము. స. గణనీయము
గాణేశుఁడు. స. గణేశునిపూజించువాఁడు
గాత. త. దెబ్బ
గాత. స. పాటపాడువాఁడు
గాతము. త. పల్లము
గాతవ్యము. స. పాడఁదగినది
గాతి. త. తిండి
గాతుకలఁగు. దే. భేదిల్లు
గాతు. దే. ధైర్యము
గాత్రము. దే. స్థూలము
గాత్రము. స. శరీరము, అవయవము
గాథ. స. చరిత్రము, పద్యము, పాట, చక్కఁబఱుపఁబడనిభాష
గాథకుఁడు. స. పాటకాఁడు
గాథము. స. పాట
గాద. దే. చెమటకాయలకఱచు
గాదము. దే. పైరులోని కసవు, ఆకు
గానిలి. దే. ప్రేమము, చుట్టము
గాజె. త. గాజె
గాధము. స. మిట్ట, కోరిక, లోఁతులేనిది, లాభమందలి కోరిక, అడుగుభాగము
గాధి. స. విశ్వామిత్రునితండ్రి
గాధేయుఁడు. స. విశ్వామిత్రుఁడు
గానము. స. పాట, గీతము, పాడుట, ధ్వని, స్తోత్రము
గానుఁగ. దే. నూనెదీసెడియంత్రము
గానుఁగపిండి. దే. తెలికపిండి
గాబ. దే. తృణవిశేషము, గాబము
గాబు. దే. కొప్పెర, పెద్దపాత్రము, కలుపు, చెత్త
గామ. దే. పిపీలికావిశేషము
గామిడి. త. శ్రేష్ఠుఁడు, శ్రేష్ఠము
గాము. త. సూర్యాదిగ్రహము, పిశాచము
గాములఱేఁడు. దే. సూర్యుఁడు

గాయకము. దే. మర్మము, గూఢము

గాయకుఁడు. త. గ్రహణశక్తికలవాఁడు

గాయకుఁడు. స. పాటపాడువాఁడు

గాయత్రి. స. మంత్రవిశేషము, ఒకఛందస్సు, చంద్రచెట్టు

గాయని. స. పాటపాడునది

గాయనుఁడు. స. పాటపాడువాఁడు

గాయమానము. దే. శస్త్రవిద్యావిశేషము

గాయము. దే. కత్తిదెబ్బ, పుండు

గాయము. స. పాడుట, పాట

గార. దే. గచ్చు

గారడము. త. విషమంత్రము, మాయ

గారడి, గారడీఁడు } త. పాములవాఁడు

గారము, గారవము } త. గొప్పతనము, ప్రేమము

గారవించు. త. గౌరవపఱచు, ఆదరించు

గారవిలు, గారవిల్లు } త. గౌరవపడు

గారాబము, గారాబు, గారాము } త. గొప్పతనము, ప్రేమము

గారు. దే. పూజ్యత్వమును దెలుపునది

గారుడము. స. గరుడపచ్చ, విషమంత్రము, గరుడునిది

గారుడికుఁడు స. పాములవాఁడు

గారుత్మతము. స. పచ్చ, మరకతము

గారె. త. పడ, మినుములతో చేయఁబడు నొకపిండివంట

గార్దభము. స. గాడిద

గార్భము. స. గర్భసంబంధమగునది

గార్భిణము. స. చూలాండ్రసమూహము

గార్హపత్యము. స. ఒకశ్రౌతాగ్ని

గార్హస్థ్యము. స. గృహస్థధర్మము

గార్హ్యము. స. గృహసంబంధమగునది

గాలకాఁడు దే. చేపలను బట్టువాఁడు

గాలనము. స. వడియఁగట్టుట, కఱఁగుట

గాలము, గాలాము } దే. చేపలను బట్టుసాధనము

గాలవము. స. లొద్దుగచెట్టు

గాలి. దే. వాయువు, మృగముల దేహవాసన, పిశాచము

గాలి. స. నింద, దుర్భాష

గాలించు. దే. శోధించు, వెదకు

గాలికుంటు. దే. పశువులకు గొరిజలయందు పుండుపడెడు వ్యాధి

గాలికుక్క. దే. వేటకుక్క

గాలిగాఁడు. దే. గాడిద

గాలిగుడి. దే. సూర్యచంద్రులకుఁ జుట్టు నేర్పడెడు మండలము, పరివేషము

గాలిగొను. దే. గాలిపాఱు

గాలిగోపురము. దే. దేవళముయొక్క ఎత్తైన గోపురము

గాలిగ్రుడ్డు. దే. పేద, మూఢుఁడు

గాలిచూలి. దే. అగ్ని, భీముఁడు, హనుమంతుఁడు

గాలితము. స. వడపోయఁబడినది, కరఁగఁబడినది

గాలిదిండి. దే. సర్పము

గాలినెచ్చెలి. దే. అగ్ని

గాలిపంట. దే. నిర్ణయములేనిపంట

గాలిపటము. దే. బాలక్రీడాసాధనవిశేషము

గాలిపడగ. దే. గాలిపటము

గాలిమాట. దే. లోకప్రవాదము

గాలిమేపరి. దే. సర్పము

గాలివాన దే. గాలితోడివాన
గాలివేఁత. దే. గాలికొట్టుట, జ్వరభేదము
గావు. దే. బలి
గావుకోడి. దే. మూలికావిశేషము
గావుపట్టు దే. చేంపు, నాశముచేయు, గట్టిపట్టు
గాసటబీసట. దే. సలక్షణముగాని చదువు, గందరగోళము, పనికిమాలిన సంగతులు
గాసము. త. ఆహారము, గడ్డి, జీవనము
గాసి. దే. శ్రమము
గాసిఁబడు. దే. బాధపడు
గాసిఁబెట్టు. దే. బాధించే
గాసించే. దే. బాధపెట్టు, శ్రమపఱచే, ధరించే
గాసిచేయు. దే. నాశముచేయు
గాసియగు. దే. నాశమగు
గాసిల్లు, గాసిలు } దే. బాధపడు, శ్రమపడు, కోపపడు
గాహనము. స. స్నానము, మునుక
గాహము. స. మునుఁగుట, లోఁతు, అంతర్భాగము
గాహితము. స. మునిఁగినది, స్నానము చేయఁబడినది, ప్రవేశించినది
గాళుఁడు. దే. ధీరుఁడు, ప్రౌఢుఁడు

## గి

గింజె. దే. విత్తు
గింజెలు. దే. ధాన్యము
గింజేకొను. దే. బిడ్డలు వెలికలఁ బండుకొని యేడ్చునప్పుడు కాళ్లు విదిలించే
గింటెన. దే. దింటెనచెట్టు
గింటెము. దే. జంట నేఁతవస్త్రము
గిండి. దే. సన్నపుమెడగల చెంబు
గిచ్చు. దే. గీచే
గిజిగాఁడు, గిజ్జిగాఁడు } దే. పచ్చపిట్ట
గిజేగిజే. దే. తన్నుకొనుటయందగుధ్వన్యనుకరణము
గిజేగిజేగొను, గిజేగిజేలాడు } దే. తత్తఱపడు
గిజేరు. దే. మామిడిపండు మొదలగువాని యందుండు గుజ్జు
గిటక. దే. పొట్టి, వామనుఁడు
గిటగిట. దే. పండ్లు కొఱుకుటయం దగు ధ్వన్యనుకరణము
గిటగిటన. దే. అల్పము, సూక్ష్మము, కృశము
గిటగిటమను. దే. వడఁకు
గిట్ట దే. పశువుల కాలిగోరు, బాణము
గిట్టించే. దే. గిట్టుబడియగు, చేవఁజేయు
గిట్టింపు. దే. గిట్టుబడి
గిట్టు. దే. అనుకూలించే, చచ్చు, నశించు
గిట్టుబడి. దే. అమ్మకమునందలి లాభము
గిడస. దే. ఎదుగక పొట్టియగుట, గిటక
గిడిగిల్లు. దే. నమస్కారము
గిడిగొను. దే. బిగియు
గిడియ. దే. తప్పెట
గిడుగు. దే. కామలేని గొడుగు
గిడ్డ. దే. పొట్టి, వామనుఁడు
గిడ్డంగి. దే. సరకులుంచి యమ్మెడుఇల్లు
గిడ్డి. త. ఆవు
గిడ్డు. దే. శ్యేనవిశేషము
గిత్త. దే. కోడె, ఎద్దు
గిద్ద. దే. సోలయందు నాలవభాగము
గిద్దు. దే. డేగ
గినియ. త. కటభిపృతము

గినుమాడు. దే. వంచించు
గినుము. దే. వంచన
గిన్నియ } దే. త్రాగెడుగిన్నె, గిన్నె
గిన్నె }
గిబ్బ. దే. అచ్చుటెద్దు, వృషభము
గిబ్బరౌతు. దే. శివుఁడు
గిర. స. వాక్కు
గిరక. దే. నూతిరాట్నము, ఘటయంత్రము
గిరగిర. దే. తిరుగుటయందగు ధ్వన్యనుకరణము
గిరణము. స. మ్రింగుట
గిరవు. దే. కుదువ
గిరస. దే. పాఱుఁబోతు, పిఱికి
గిరాటువేయు. దే. ఱువ్వు
గిరి. స. మ్రింగుట, కొండ, అచ్చనగాయలు
గిరిక. స. చిట్టెలుక, జెంగ, వసురాజుభార్య, పార్వతి
గిరికన్య. స. పార్వతి
గిరికము. స. బొంగరము
గిరికర్ణి. స. దింటెనచెట్టు
గిరిగిటలు } దే. ఆడునప్పుడు వాయించెడు
గిర్గిటలు } కంచుతాళము
గిరిజ. స. పార్వతి, మాదిఫలము
గిరిజము. స. అభ్రకము, లోహము, కొండయందుఁ బుట్టినది, సిలాజిత్తు
గిరిధరుఁడు. స. విష్ణువు
గిరిభిత్తు. స. వజ్రాయుధము
గిరిమల్లిక. స. కొండమల్లె
గిరియకము. స. అచ్చనగాయలు, బాలురాడుకొను వస్తువు
గిరిశుఁడు. స. శివుఁడు
గిరిసెము. త. శిరీషవృక్షము
గిరిస్తని. స. భూమి
గిరీశుఁడు. స. శివుఁడు, హిమవంతుఁడు, బృహస్పతి
గిఱక. దే. గిటక, పొట్టి
గిఱకతాఁడు. దే. హింతాలవృక్షము
గిఱకపడు. దే. తగ్గు, చెడిపోవు
గిఱి. దే. వలయాకారపురేఖ
గిఱికొను. దే. చుట్టుకొను
గిఱుకు. దే. అక్షరములను వంకరకొంకరగా గీఁచు, తప్పువ్రాఁతను తుడుచు
గిఱుక్కు. దే. మరలుటయందగు ననుకరణము
గిఱుపు. దే. కన్నుత్రిప్పు, కదలించు
గిఱ్ఱు. దే. తిరుగుటయందగు ననుకరణము
గిలక. దే. గిలగిలమ్రోఁగు బాలక్రీడోపకరణము
గిలకచెట్టు. దే. ఘంటారవవృక్షము
గిలకబండి. దే. చిన్నచక్రములబండి
గిలకరించు. దే. గిలకొట్టు, చిలుకు, మ్రోఁగు
గిలకొట్టు. దే. వ్రేళ్లతో కదలించు, కుదిలించు
గిలగిలచెట్టు. దే. గిలగిచ్చెచెట్టు
గిలి. దే. భయము
గిలిగించు. దే. గిలిగింతపెట్టు
గిలిగింత. దే. చక్కిలిగింత
గిలిగిలి. దే. గిలిగింత
గిలిగిలించు. దే. గిలిగించు
గిలిగిలింత. దే. గిలిగింత
గిలుకు. దే. మెట్టెలు మొదలగువానియందగు, ధ్వన్యనుకరణము
గిలుపు. దే. కన్నుగిఱుపు
గిలుబాడు. దే. అపహరించు

గిలుబు. దే. అపహరణము, చౌర్యము

గిలుబుకొను } దే. అపహరించు
గిలుబుసేయు }

గిలువు. దే. చౌర్యము

గిల్లకన్ను. దే. మెల్లకన్ను

గిల్లచూపు. దే. మెల్లచూపు

గిల్లు. దే. నఖక్షతముచేయు, పూవులు మొదలగువానిఁగోయు, నఖక్షతము

గిల్లుడు. దే. నఖక్షతము

గివుఱు. దే. గీఱు

గిళనము. స. తినుట

గిళితము. స. తినఁబడినది

## గీ

గీఁక. త. ఏనుఁగుఘీఁత

గీఁకు. దే. కత్తిమొదలగువానితో గీఁచు

గీఁటు. దే. పండ్లుకొఱుకు, కన్నుగిఱుపు, చిమ్ము, అనాదరము

గీఁత. దే. గీటు, రేఖ

గీఁతకట్టియ } దే.వడ్లవాఁడుగీఁతలుగీయుట
గీఁతకట్టె } కుపయోగించెడుపలక

గీచు. దే. గీటుగీచు, కల్లుకై తాటిచెట్టును గీయు

గీటడఁగు. దే. చచ్చు

గీటు. దే. గీఁత, రేఖ

గీటునఁబుచ్చు. దే. అనాదరించు

గీట్లబద్ద. దే. కాగితములు మొదలగువాని యందు గీట్లువేయుట కుపయోగించెడు బద్ద

గీత. స. భగవద్గీత శివగీత మొదలయినవి

గీతము. స. పాట, పలుకఁబడినది

గీతాచార్యుఁడు. స. సంగీతమునేర్పువాఁడు

గీతి. స. పద్యభేదము, పాట

గీథ. స. సంగీతము, పాట

గీపెట్టు. దే. ఏనుఁగుకూయు, మొఱపెట్టు, శబ్దించు

గీము. త. ఇల్లు

గీయు. దే. గీఁతగీయు, గీఁచు

గీరనగింజెలు. దే. బాలికాక్రీడావిశేషము

గీర్ణి. స. మ్రింగుట

గీర్వాణము. స. దేవభాష, సంస్కృతము

గీర్వాణుఁడు. స. దేవుఁడు

గీఱ. దే. గీఁత, రేఖ

గీఱు. దే. గోఁకు, భేదించు

గీఱుడు. దే. గోఁకుడు, భేదనము

గీఱునామము. దే. గీఱకలిగిననామము

గీలు. దే. స్రవించు

గీలుకొను. దే. అభిముఖమగు

గీవు. దే. కుదువ, గిరవు

గీష్పతి } స. బృహస్పతి
గీర్పతి }

## గు

గుంజ. స. గురిజెవృక్షము, తప్పెట

గుంజనము. స. ఝుంకారము

గుంజము. స. ఝుంకారము, పూగుత్తి

గుంజిలిపెట్టు. దే. గోపనముచేయు

గుంజిళ్లు. దే. చేతులుకట్టుకొని రెండుకాళ్లు చేర్చిపెట్టి కూర్చుండిలేచుట, మ్రొక్కు

గుంజె. త. స్తంభము, పశువుల కట్టుకట్టి

గుంజెనుసుఁగు. దే. పరిహాసముచేయు. ఎ లుఁగుగొడ్డాట

గుంజోటన. దే. వ్యసనము

**గుంజా.** దే. ఈడ్చు, ఊడుకు, గిజారు

**గుంజాలాడు.** దే. లాగులాడు, పెనఁగొను

**గుంట.** త. కొలను, పల్లము, చెఱువు, భూపరిమాణవిశేషము

**గుంటక.** దే. దున్ని విత్తులు చల్లినవెనుక నేలను సవరణచేయు సాధనము

**గుంటకలగర** / **గుంటగలిజేరు** / **గుంటగలగర** } దే. భృంగరాజము, నీటియొద్దున మొలిచెడి ఒకదినుసు మొక్క

**గుంటక్రోవ.** దే. ఒకదినుసుపిరంగి

**గుంటచేళ్లు.** దే. బాలక్రీడావిశేషము

**గుంటదూలము.** త. చిన్నదూలము

**గుంటనక్క.** త. చిన్నజాతినక్క

**గుంటి.** దే. దున్నుట మొదలగువాని కేర్పఱచుకొన్నభాగము

**గుంఠనము.** స. కప్పుట, దాఁచుట

**గుంఠితము.** స. ధూళిచేఁ గప్పఁబడినది

**గుండ.** దే. గడ్డ

**గుండ.** త. పొడి

**గుండఁగి.** దే. నీరుకోడి

**గుండఁడు.** దే. దాసుఁడు

**గుండకము.** స. దుమ్ము, నూనెపాత్రము

**గుండగొయ్య.** దే. దుష్టుఁడు

**గుండతనము.** దే. కఠినస్వభావము

**గుండనము.** స. దాఁచుట, కప్పుట

**గుండము.** స. సువాసనగల యొకగడ్డి, నూఱుట, పొడిచేయుట

**గుండము.** త. నిప్పులగుంట, గొయ్యి

**గుండవర్ధనము.** స. వృక్షవిశేషము

**గుండా.** దే. ధీరుఁడు

**గుండాతనము.** దే. మోటుతనము

**గుండికము.** స. పిండి, చూర్ణము

**గుండిగ.** త. వెడల్పునోరుగల లోహపాత్రము

**గుండితము.** స. దంచఁబడినది, పొడిచేయఁబడినది, దుమ్ముతోఁ గప్పఁబడినది

**గుండియ.** దే. హృదయము

**గుండిలము.** స. మద్దెలమ్రోఁత

**గుండీ.** త. బరణి

**గుండు.** త. గుండ్రపుఱాయి, తూనికగుండు, పిరంగిగుండు, పెద్దఱాయి, కొండ, గుండ్రని

**గుండుకొను.** దే. చుట్టుకొను

**గుండుగిలు.** త. చుట్టువడు

**గుండుగుత్త.** త. సమస్తస్వాతంత్ర్యముతోడ నిచ్చెడుగుత్త

**గుండుజెల్ల.** దే. పెద్దగంప

**గుండుపులుఁగు.** దే. చక్రవాకము

**గుండె.** దే. హృదయము, మనసు

**గుండెకాయ.** త. హృదయము

**గుండెకుళ్లు.** దే. అప్రయోజకుఁడు

**గుండెతల్లడము.** దే. భయంకరము

**గుండ్రన.** త. వర్తులత

**గుండ్రము.** త. వర్తులము

**గుండ్రలు.** దే. పిండికొట్టిచెరుగఁగా వెనుక నిలిచిన ఉండలు, చెఱకురాట్నపుకంబములు

**గుండ్రలుకొలుపు.** దే. గడ్డగూబకూయు

**గుండ్రాయి.** దే. పొత్తరము

**గుండ్రించు.** దే. కడుపుత్రిప్పు [గుంట

**గుంత.** త. పల్లము, గుంట, పిఱుఁదిమీఁది

గుంద్ర. స. నాగముస్తె, ప్రేంకణపుమొక్క
గుంద్రము. స. కాకిచెఱకు
గుంధము. స. గుంజె
గుంపించు. దే. కుప్పవేయు, అతిక్రమించు
గుంపు. దే. ప్రాణిసమూహము
గుంపెన. దే. ఒకానొకచెట్టు, విజృంభణము
గుంఫన. స. దారమునకు గ్రుచ్చుట, వాక్యరచనలోని మంచివిర్పాటు
గుంఫనము. స. మాటలు లోనగువాని కూర్చుట
గుంఫము. స. మాటలు లోనగువానికూర్పు, బాహుభూషణము, కట్టుట, కూర్చుట, మీసము
గుంఫించు. స. గుంఫితమగు
గుంఫితము. స. కూర్పఁబడినది
గుంబము. దే. గుమ్మము
గుంభనము. స. మాటలులోనగువానిని కూర్చుట, రహస్యము, గుంఫనము
గుంభము. స. గుంఫము
గుంభించు. స. దండగాకట్టు, చేర్చు
గుంభితము. స. గుంఫితము, దండగా కూర్పఁబడినది, కట్టఁబడినది, రహస్యమైనది, చిక్కుమాట
గుగ్గిలపుఁజెట్టు. దే. గుగ్గులువృక్షము
గుగ్గిలము. త. గుగ్గులువృక్షపుబంక
గుగ్గిళ్లు. దే. ఉడుకవేసినసెనగలు మొదలగునవి, అభ్యూషము
గుగ్గులము. స. గుగ్గిలము
గుగ్గులువు. స. గుగ్గిలపుఁజెట్టు
గుచ్ఛకము / గుచ్ఛము } స. పూగుత్తి, నెమలిపురి, పొద

గుజెగుంపులు. దే. చెవిలో చెప్పుమాటలు, గుసగుసలు, సంకోచము, బాధ
గుజెగుజె. దే. పీడితము
గుజెగుజెరేకులు. దే. బాలికాక్రీడావిశేషము
గుజెగుజెలాడు / గుజెగుజెపోవు } దే త్రొక్కటపడు
గుజెరాతి. ఘూర్జరదేశము, ఘూర్జరభాష, నాట్యవిశేషము
గుజెకి. త. ఘూర్జరదేశము
గుజాఱి. దే. ధనవంతుఁడు
గుజెరు. దే. గిజెరు
గుజెరాతి. త. గుజెరాతి
గుజ్జరి / గుజ్జరీ } త. ఘూర్జరదేశము
గుజ్జు. దే. అనుకగు రసద్రవ్యము
గుజ్జు. త. కుబ్జత్వము, పొట్టియెద్దు, పొట్టివాఁడు, గుంజె
గుజ్జుపొట్ల. త. పొట్టికాయలుగల పొట్ల
గుజ్జుమామిడి. దే పొట్టిమామిడి
గుజ్జువేలుపు. దే. వినాయకుఁడు
గుజ్జెన. దే. శిశుసంబంధమైనది
గుజ్జెనగూళ్లు. దే. బాలికలాఁడుకొనునప్పుడు గుజుగులతో వండినవంటకము
గుటక. దే. ఒకతూరి నోటఁబోసికొని మ్రింగెడునీళ్లు మొదలగువానికొలఁది
గుటగుట. దే. అన్నముడుకుట మొదలగువానియందగు ధ్వన్యనుకరణము, పంది కూఁత
గుటగుటలు. దే. పెద్దఱికపుమాటలు
గుటికాస్త్రము. స. ఉండటవిల్లు

గుటుకు<br>గుటుక్కు } దే. మ్రింగుటయందగుధ్వన్యనుకరణము

గుటుక్కను. దే. చేచ్చు

గుట్ట. త. చిన్నకొండ, రాశి, కొండ

గుట్టకూల్చు. దే. పాడుచేయు

గుట్టు. త. మర్మము, కీర్తి, గౌరవము

గుట్టుఁబేడు. దే. రాజమంత్రము, బయలుపడుట

గుట్టుకీడు. దే. రహస్యశత్రువు

గుట్టుసాకిరి. త. వాది తనవ్యవహారము గెలుచేటకొఱకు రప్పింపఁగా వచ్చి దాఁగియుండి ప్రతివాదియొక్క మాట లన్నియుఁ జక్కఁగా విన్నసాక్షి

గుడ. స. జెముడు, ద్రాక్ష

గుడక. త. టెంకాయబుఱ్ఱ, పాలడ

గుడత్వక్కు<br>గుడత్వచము } స. లవంగపుఁబట్ట

గుడపుష్పము. స. ఇప్పచెట్టు

గుడఫలము. స. గోనుగుచెట్టు

గుడము. స. బెల్లము, బంతి

గుడాక. స. నిద్ర, ఆలస్యము

గుడాకు. దే. బెల్లముతోఁ జేర్చి మర్దించిన పొగాకు

గుడాకేశుఁడు. స. అర్జునుఁడు, శివుఁడు

గుడారము<br>గుడారు } త. వస్త్రముచేత నేర్పఱచిన ఇల్లు, డేరా

గుడి. దే. ఇకారరూపాంతరము, పరివేషము, వలయాకారపు రేఖ

గుడి. త. దేవాలయము

గుడిక. స. గుళిక, మాత్ర, ఉండ, ముత్యము

గుడికట్టు. దే. గ్రామము నాలుగుదిక్కుల ఎల్లలవిర్పాటు

గుడికొను. దే. క్రమ్ము

గుడిగి. దే. మోఁకాలివఱకుఁ దొడిగికొను వస్త్రకవచము

గుడిగుడి. దే. అల్పము

గుడిచుట్టు. దే. చంద్రసూర్యులకుఁ జుట్టు నేర్పడు మండలాకారము, పరివేషము

గుడిజెల్ల. దే. మత్స్యవిశేషము

గుడిదిరుగు. దే. గుండ్రముగాఁ దిరుగు

గుడిసె. దే. ఒకవిత్తుచింతపండు

గుడిసె. త. కుటీరము

గుడిసెవాటు. దే. కులట

గుడుక్కు. దే. గుటుక్కు

గుడుగుడాయనము. స. దగ్గువలన కంఠమందుఁ గల్గు గుడగుడధ్వని

గుడుగుడుగుంచేములు. దే. బాలక్రీడా విశేషము

గుడుసరి. దే. కపటముగలవాఁడు

గుడుసు. దే. పరివేషము, గుండ్రము

గుడుసుకైదువు. దే. విష్ణుచక్రము

గుడుసువడు. దే. గుండ్రమగు

గుడూచి. స. తిప్పతీఁగ

గుడోదనము. స. పరమాన్నము

గుడ్డ. దే. వస్త్రము

గుడ్డము<br>గుడ్డాము } దే. చేను

గుడ్డి. దే. అట్టచెమ్మఆటలో వెలికిలఁబడ్డ ఒంటికాయ

గుణకము. స. పెంచెడులెక్క

గుణనము. స. గణించుట, గుణముల నెంచుట

గుణపడు. దే. చక్కఁబడు

గుణమయము. స. గుణములుగలది

గుణము. స. స్వభావము, త్రాడు, అల్లె త్రాడు, అలవాటు, మడుఁగు, అప్రధానము, సుగుణము, శ్రైష్ఠ్యము,ఉపయోగము, ఫలితము, దారము, వస్తుధర్మము, సత్త్వాది, శబ్దాది, అధికము, వత్తి, గుణసంధి

గుణరాగము. స. పుణ్యకార్యములయందలి సంతోషము

గుణవృక్షకము. స. ఓడకంబము

గుణాలయము. స. గుడారము

గుణి. స. విల్లు, గుణముగలవాఁడు

గుణించు. స. గుణకముచేయు

గుణిక. స. కంతి

గుణితము. స. హల్లులతో అచ్చులను, హల్లులను జేర్చిచెప్పుట, గుణింపబడినది

గుణుఁడు. స. భీముఁడు, వంటవాఁడు

గుణ్యత. స. శ్రేష్ఠము, యోగ్యత

గుణ్యము. స. గుణింపఁదగినది

గుత్త. త. ఒకవస్తువును కొంత ధనమిచ్చి యనుభవమునకుఁ దీసికొనుట

గుత్తకాఁడు. దే. గుత్తకుఁ దీసికొన్నవాఁడు

గుత్తగొను. దే. గుత్తకుఁ దీసికొను

గుత్తము. త. కచ్చితము, బిగువు

గుత్తి. త. పూవులుమొదలగువాని గుచ్ఛము, చీలమండ

గుత్తికగువ్వ. దే. గువ్వగుత్తికచెట్టు

గుత్తికవ్వము. దే. వెదురుకొయ్య చివరను చీల్చి దారముతోఁ గట్టి యేర్పఱచిన కవ్వము

గుత్తిమల్లెలు. త. ధాన్యవిశేషము

గుత్తివడు. త. ముడుఁగు

గుత్సకము. స. పూగుత్తి

గుత్సము. స. పూగుత్తి, వరిమొదలగువానిగంట

గుథితము. స. చుట్టఁబడినది, కప్పఁబడినది

గుదగుదలాడు. దే. డగ్గుత్తికతో నేడ్చు

గుదము. స. పాయువు, మూడి

గుది. దే. ఆకులు మొదలగువానిని గ్రుచ్చిన సరము, గుత్తి

గుదికాలు. దే. చీలమండకు దిగువనుండు పాదము వెనుకటిభాగము

గుదికూర్పు. దే. గుంఫనము, మాటలుమొదలగువాని కూర్పు

గుదిగట్టె. దే. ఆవుమొదలగువానికి మెడను గట్టెడుకొయ్య

గుదిగుంజెలు. దే. పసులదొడ్డి లోనగువాని ద్వారమందు నిలువుగాఁ బాఁతిన కంబములు

గుదిగొను. దే. అతిశయించు, దట్టమగు, మూటకట్టుగాఁ గూలఁబడు

గుదిగ్రుచ్చు. దే. గుదికూర్చు, సవరించు, ఏర్పాటుచేయు

గుదిత్రాడు. దే. దూడకాలికిఁ గట్టుత్రాడు

గుదిత్రోయు. దే. కాళ్లకట్టిత్రోయు

గుదియ. త. నాలుగుమూరల నిడివిగల దండము, గుదిగట్టె

గుదియకట్టెలు. దే. గుదిగుంజెల కడ్డముగాఁ జొప్పించెడు కట్టెలు

గుదియతాలుపు. దే. యముఁడు

గుదిలకొను. దే. బాధపడు

గుదెవడు. దే. కట్టువడు, వణఁకు

గుదె. త. గుదియ

గుద్దలి. త. వేళ్లు మొదలగునవి పెల్లగించెడు సాధనము

గుద్దలించు. త. గుద్దలితోఁ బెల్లగించు, వెదకు
గునగున. దే. వేగముగా నడచుటయందగు ననుకరణము
గునపనకోడి. దే. వనకుక్కుటము
గునపము. దే. గడ్డపాఱ
గునామొలనూలు. దే. బిడ్డలుకట్టుకొనెడి కటిసూత్రవిశేషము
గునియు / గునిసాడు } దే నర్తించు, కులుకు
గుఱుకు. దే. మెల్లగా పరువెత్తు, తృణవిశేషము
గుఱుకులు. దే. తృణధాన్యవిశేషము
గుఱుపు. దే. విలాసవిశేషము
గున్న. త. పిల్ల, పొట్టి, కూన
గున్నంగి. దే. పక్షివిశేషము [వాఁడు
గుప్తుఁడు. స. దాఁచువాఁడు, కాపాడు
గుప్తకేళి. స. దాఁగిలిమూఁతలు, రతి
గుప్తము. స. కావఁబడినది, దాఁచఁబడినది
గుప్తరాగము. స. మొగలిచెట్టు
గుప్తి. స. కాపాడు, దాఁచుట, చెఱసాల, పాఁతఱ
గుప్పన. దే. మాధుర్యముగ
గుప్పళించు. దే. ఉసుము, పుక్కిలించు, ఊంచు
గుప్పించు. దే. బాణాదులను బ్రయోగించు, కురియు
గుప్పిలి. దే. పిడికిలి
గుప్పు. దే. ఉంచు, చల్లు, పొదుచు, ప్రయోగించు, విసరివైచు
గుప్పున. దే. శీఘ్రముగా
గుబక. త. తలుపు గందపట్టెమీఁది గుబ్బ
గుబాళించు. దే. వాసనకొట్టు, పావురము కూయు

గుబిలి. దే. ఒకానొకపక్షి, గులిమి
గుబురు. దే. దట్టము, సమూహము
గుబులు. దే. గుప్పనికొట్టువాసన
గుబులుకొను. దే. గుప్పనివాసనకొట్టు
గుబుసు. దే. కిటుకు, కపటము
గుబేలు. దే. పడుటయందగు ధ్వన్యనుకరణము
గుబ్బ త. కుచము, గొడుగుమీఁది గుబ్బ, తలుపు గందపట్టెమీఁదిగుబ్బ, గుండ్రమైనది [లమగుకాయ
గుబ్బకాయ. దే. వీణాగ్రమందమర్చువర్తు
గుబ్బటిల్లు / గుబ్బటిలు } త. తిరుగుడుపడు
గుబ్బతిల్లు / గుబ్బతిలు } త. అతిశయించు, ఉప్పొంగు
గుబ్బన. దే. శీఘ్రముగా
గుబ్బలాఁడి. దే. యౌవనముగల ఆఁడుది
గుబ్బలి. దే. కొండ, పర్వతము
గుబ్బలివిలుకాఁడు. దే. శివుఁడు
గుబ్బసరము. త. పెక్కుదినుసు మణులు గ్రుచ్చినసరము
గుబ్బిక. దే. పక్షులు మొదలగువానికి పెట్టెడునురి
గుబ్బిలికాఁడు. దే. పక్షివిశేషము
గుబ్బు. దే. గుండె యదురుటయందగునను కరణము
గుబ్బుమను / గుబ్బురను } దే. గుండె గుబ్బనియదరు
గుబ్బెత. త. గుబ్బలాఁడి
గుమగుమ. దే. గుమగుమయను వాసన
గుమి. దే. గుంపు
గుమికాఁడు. దే. కాకి
గుమితి / గుమ్మితి } దే. ఆయుధవిశేషము

గుమిరిక. దే. ఒకవిధమగునవల
గుమిలి. దే. పక్షివిశేషము
గుముకు. దే. పిడికిటితోఁ బొడుచు
గుముడు
గుమ్ముడు } త. శ్రీపర్ణివృక్షము
గుమురు. దే. గుబురు [ధార, పడుచే, గాడె
గుమ్మ. దే. పాలుపిండునపుడు వచ్చెడు
గుమ్మఁడు. దే. అలంకరించుకొనువాఁడు, సొగసుకాఁడు
గుమ్మటము. దే. దీపముంచెడు కాగితపు గూఁడు
గుమ్మడి. త. కూశ్మాండము
గుమ్మతీలు. దే. చెవితమ్మెలనుంచెడు సొమ్ము
గుమ్మము. దే. వాకిలి, ద్వారము
గుమ్మి. దే. బొట్టు, బురద, పట్టి [పోటు
గుమ్ము. దే. పిడికిటితోఁ పొడుచు, పిడికిటి
గుమ్మె. దే. నొక్కు, చిన్నగుడారము
గుమ్మెట
గుమ్మెత } దే. వాద్యవిశేషము
గుమ్మెతకాఁడు. దే. గుమ్మెతవాయించు వాఁడు
గురగుర. త. పందికూఁత
గురణము
గూరణము } స. యత్నము
గురిగి. దే. ఆఁడుపడుచులు ఆడుకొను చిన్నపిడత
గురిగింజ. దే. గురిజపూస
గురిజ. త. గుంజవృక్షము
గురివెంద. దే. గుంజవృక్షము
గురుకు. దే. కుప్ప
గురుకులము. స. ఉపాధ్యాయుని యిల్లు
గురుగు. దే. ఒకదినుసు కూరాకుచెట్టు
గురుజ. దే. ఒకదినుసు కూరాకుచెట్టు
గురుతముఁడు స. మంచియుపాధ్యాయుఁడు
గురుతల్పగుఁడు. స. గురుభార్యను పొందిన వాఁడు
గురుత్వము. స. గొప్పతనము, భారము, ముఖ్యత
గురువు. దే. వేగపుపరుగు
గురువు. స. ఉపాధ్యాయుఁడు, బృహస్పతి, కులముపెద్ద, తండ్రి, తాత, అన్న, రాజు, కాపాడువాఁడు, గొప్పది, భరింపఁగూడనిది, అలఘువు
గురువుదేఱు. దే. జిట్టునచిప్పిలు
గురువులువాఱు. దే. వేగపుపరువుగాపాఱు, అతిశయించు
గురుసు. దే. జీవస్థానము, మేర
గుర్తించు. దే. గురుతుపట్టు
గుర్విణి. స. గర్భిణి
గుర్వు. త. అధికము
గుర్వెట్టు. దే. గురువెట్టు
గుఱక. దే. నిద్రయందలి ధ్వని
గుఱగుఱ. దే. ఒకవిధమైన దురద, గులగుల
గుఱి. దే. లక్ష్యము, గుఱుతు, దృష్టాంతము, మితి, నిర్ణయము
గుఱించు దే. ఉద్దేశించు, నిర్ణయించు
గుఱికట్టు. దే. అంచు, మితి
గుఱికాఁడు. దే. లక్ష్యము తప్పకయేయు వాఁడు
గుఱికొండి. దే. ఆయువు, జీవస్థానము
గుఱికొను. దే. లక్షించు
గుఱిచి. దే. కూర్చిప్రత్యయము
గుఱు. దే. చిట్టున చిప్పలు
గుఱుకొను. దే. యత్నించు
గుఱుతు దే. చిహ్నము, మేర
గుఱుపొడుచు. దే. గుఱకపెట్టు
గుఱుములు. దే. గింజలు

గుఱువెట్టు. దే. గుఱకయిడు

గుఱ్ఱపుఁజుక్క. దే. అశ్వినీనక్షత్రము

గుఱ్ఱపుఁబీఁట. త. ద్వారబంధము మీఁద నుంచెడు గుఱ్ఱపుమూఁతి కొయ్య

గుఱ్ఱపుమోమువేల్పు. దే. కింపురుషుఁడు

గుఱ్ఱపుసారము. త. సప్తస్వరములలో నొకటి

గుఱ్ఱము. త. అశ్వము [నిద్రయందగుధ్వని

గుఱ్ఱు. దే. కోపమునందగు ననుకరణము,

గులక. త. ఒకదినుసుతాయి

గులకరించు. దే. రమ్యమగు

గులగుల. దే. నలఁగుడు, దురద

గులగులలు. దే. చూర్ణము

గులప. దే. గుఱ్ఱపువాఁడు

గులాము. త. దాసుఁడు, దాసురాలు

గులి. స. గోలీ, తీఁటగుల్ల

గులిబి. దే. గులిమి

గులిమి. దే. కర్ణమలము, పింజూషము

గులిమికదురు. దే. గులిమి తీసికొనెడు వెండిలోనగువానిపుల్ల

గుల్ఫము. స. చీలమండ

గుల్మము. స. బోదెలోనిచెట్టు, వ్యాధివిశేషము, సేనావిశేషము, సైన్యరక్షణము, పురాభిముఖమైన రాజమార్గము, పొద

గుల్మిని. స. చట్టముగా నల్లుకొనెడు తీఁగ

గుల్ల. త. కప్పుచిప్ప, బొబ్బ, అల్పము, బోలు

గుల్లకాఁడు. దే. ఏమియులేనివాఁడు

గుల్లపడు. త. అవమానపడు

గుల్లపఱచు. దే. ఏమియులేకుండఁజేయు, అవమానపఱచు

గుల్లపుటికె. దే. చిన్నగంప

గుల్లాము. త. గులాము

గుల్లించు. దే. కదిలించు

గువాకము
గూవాకము } స. పోఁకచెట్టు

గువ్వ. దే. అడవిపావురము

గువ్వకరిగొను. దే. చుట్టుకొను

గువ్వకుత్తుక. దే. హీనస్వరము

గువ్వకుత్తుకపడు. దే. హీనస్వరమగు

గువ్వకోలుకొను
గువ్వకోల్కొను } దే. చుట్టుకొను, గుంపుగూడు

గువ్వగుత్తి
గువ్వగుత్తుక } దే. కపోతాంఘ్రివృక్షము

గుసగుస. దే. రహస్యపుమాటలచప్పుడు

గుసగుసలువోవు. దే. గుసగుసయని మాటలాడు

గుహ. స. కొండయందు తొలువఁబడిన గొప్పబిలము, పల్లము, దాఁగదగినచోటు, దాఁగుట, గొయ్యి, హృదయము

గుహాశయము. స. పులి

గుహుఁడు. స. కుమారస్వామి

గుహ్యకుఁడు. స. దేవయోనివిశేషము

గుహ్యకేశ్వరుఁడు. స. కుబేరుఁడు

గుహ్యము. స. ఏకాంతము, స్త్రీపురుషుల గుఱి, తాఁబేలు, సెపము, దాచఁదగినది

గుళిక
గుళిగ } స. రసమణిలోనగునది, మాత్ర

గుళుచ్ఛము. స. పూవు మొదలగు వాని గుత్తి

గుళ్లు. దే. కుంచెనగుడియనుబాలక్రీడావిశేషము

## గూ

గూండ్ర. దే. గుడ్లగూబకూఁత

గూండ్రించు. దే. గుడ్లగూబకూయు

గూఁటి. త. పంది

గూఁటిగువ్వ. దే. ఈఁకలురాల్చినపక్షి

గూఁడు. దే. పక్షిగృహము, గోడయందు దీపముంచుట కేర్పఱచినచోటు; పంజరము, ఆకుగుడిసె

గూఁడుకానుపు. దే. పక్షి

గూఁడుబండి. దే. చాఁపకట్టినబండి

గూటము, గూటాము } త. గుంజె మేకు, మాదిగవాని ఒకకోలముట్టు, వడ్లవానియొకకోలముట్టు

గూడ. దే. వానకుతలమీఁదవేసికొనుటకై యల్లిన జెమ్మగూడ, లిరుపగూడ, నీళ్లు చల్లెడువెదురుబుట్ట, పూవులు మొదలగునవి యుంచెడుబుట్ట, దొప్ప

గూడకట్టు. దే. కచ్ఛములేక కట్టిన దోవతి యడ్డకట్టు

గూడపాల. దే. శారిబవృక్షము

గూడబాతు. దే. బకవిశేషము

గూడారము, గూడారు } త. గుడారము

గూడెము. దే. కొండదొననాశ్రయించి యుండెడుబోయపల్లె

గూఢచారి. స. వేగులవాఁడు

గూఢజుఁడు. స. తల్లిదండ్రులు దెలియని రహస్యపుజన్మగలవాఁడు

గూఢపాత్తు. స. పాము

గూఢపురుషుఁడు. స. వేగువాఁడు

గూఢమణి, గూఢరత్నము } స. బాలికాక్రీడావిశేషము

గూఢము. స. రహస్యము, స్త్రీపురుషులగుఱి, దాచఁబడినది

గూఢసాక్షి. స. గుట్టుసాకిరి, నిజమును చక్కఁగా నెఱిఁగినసాక్షి, లంచేముతీసి కొనినసాక్షి

గూఢాగారము. స. చెఱసాల

గూథము. స. పురీషము, విష్ఠ

గూన. దే. పెద్దకుండ

గూనము. స. విష్ఠింపఁబడినది

గూనివాఁడు. దే. కుబ్జుఁడు

గూను. దే. నడుముమీఁది వంపు

గూనుఁడు. స. విష్ఠించినవాఁడు

గూనుగిల్లు. దే. గూనుకలుగు

గూబ. త. కర్ణమూలము

గూబ. దే. గుడ్లగూబ

గూబతడ. దే. మహాబలవృక్షము

గూబరి. దే. మాదిగవాఁడు

గూవనాలు. దే. బాలక్రీడావిశేషము

గూహనము. స. గోపనము, దాఁచేట

## గృ

గృంజనము. స. వెల్లుల్లి, విషముతిన్నపశువుయొక్క మాంసము

గృత్నము. స. తెలివిగలది

గృధ్నువు. స. ఇచ్ఛగలవాఁడు, గర్ధనుఁడు

గృధ్రము. స. గద్ద, పిసినివాఁడు

గృధ్రసి. స. కిరుదెసచెట్టు

గృష్టి. స. ఒకతూరి ఈనినయావు, నాఁచే

గృహకచ్ఛపము. స. నూరెడుసన్నెకల్లు

గృహగోధిక. స. బల్లి

గృహచ్ఛిద్రము. స. కుటుంబరహస్యము, కుటుంబాపమానము, కుటుంబకలహము
గృహపతి. స. గృహస్థుఁడు,విడుపకయిచ్చువాఁడు
గృహము. స. ఇల్లు, పెండ్లాము, రాశి
గృహమృగము. స. కుక్క
గృహమేధి. స. గృహస్థుఁడు
గృహస్థుఁడు } స. భార్యను పరిగ్రహించి ధర్మార్థకామముల నడపుచు వేదపారము,వైశ్వదేవాదిహోమము,అతిథిపూజ, పితృతర్పణము, భూతబలియను నెదుపంచయజ్ఞములఁ జేయుచు ప్రవర్తించువాఁడు
గృహస్థూణము. స. ఇంటినడిమికంబము, నిట్రాడు
గృహాగతుఁడు. స. అతిథి
గృహాయమానము. స. గృహముపలెకాఁపురముండఁదగినది
గృహావగ్రహణి. స. గడప
గృహి. స. గృహస్థుఁడు
గృహిణి. స. ఇల్లాలు, ఎజ్జుతుమ్మెద
గృహీతము. స గ్రహింపఁబడినది, సంపాదింపఁబడినది, పోగుచేయఁబడినది, హరింపఁబడినది, అంగీకరింపఁబడినది, నేర్చుకొనఁబడినది, ధరింపఁబడినది
గృహీతి. స. గ్రహింపఁజాలినబుద్ధి
గృహీభూతము. స. ఇల్లుగా పనికివచ్చునది
గృహ్యకము. స. పెంపుడుమృగము మొదలగునది, దీమము, పరాధీనము
గృహ్యా. స. శాఖానగరము
గృహ్యము. స. కర్మబోధకగ్రంథము, పెంపుడుమృగములోనగునది, స్వాధీనము, పరాధీనము

## గె

గెంటని. దే. స్థిరమైన, ఎడతెగని
గెంటనము. దే. పరుషవచనము
గెంటించు. దే. చలించు, త్రోచివైచు
గెంటు. దే. చలించు, తొలఁగు, త్రోయు, ప్రయోగించు, చలనము, త్రోపు
గెంటువడు. దే. తప్పుట
గెంటెము. దే. జంటనేతవస్త్రము, దట్టము
గెగ్గలు. దే. పరిహాసము
గెడ. దే. జేత, సమీపము. వేటసాధనము
గెడ్డ. దే. నీటిప్రవాహము, చిన్నఏఱు
గెనయు. దే. పుష్టియగు
గెనసు. దే. ఒకానొకగడ్డ, ఆలుపు
గెపితి. త. జ్ఞప్తి
గెబ్బు. దే. అపహరించు, గ్రహించు,
గెబ్బు. త. గర్వము
గెఱ. దే. రేఖ, గీఱ
గెల. దే. గొల
గెలివి, గెలివిడి } దే. సంతోషము
గెలుచు. దే. పోవు, పుచ్చు, జయించు
గెలుపు. దే. జయించుట, జయము
గెలుపుకాఁడు. దే. జయశీలుఁడు
గెలుపుగొను, గెలుపుకొను } దే. జయించు
గెలువము. దే. గెలుపు

గెల్లి. దే. ఉప్పుకుప్ప
గెల్లు. త. కలకలధ్వని

## గే

గేందుకము. స. బాలు రాడుకొనుచెండు, కందుకము
గేడెకాళ్లవాఁడు. దే. కొంగకాళ్లవాఁడు
గేదఁగి. త. పచ్చేపూ మొగలి
గేద. దే. బఱ్ఱె
గేదెచెలప. దే. మూఁడేండ్ల ఎనుపదూఁడ
గేయము. స. పాట, పాడఁదగినది, పాడునది
గేయుఁడు. స. పాడువాఁడు
గేరంజము. స. ఒకానొకపక్షి
గేరి. దే. వీథి
గేలి. త. పరిహాసము
గేలికొట్టు, గేలికొను } దే. పరిహసించు
గేస్తు, గేస్తుఁడు } త. గృహస్థుఁడు
గేస్తురాలు. దే. ఇల్లాలు
గేహము. స. ఇల్లు
గేహాళి. స. ఇంటికడప
గేహి. స. గృహస్థుఁడు
గేహిని. స. ఇల్లాలు
గేహుఁడు స. ఇల్లుగలవాఁడు

## గై

గైరము. స. పర్వతమువలనఁగలిగినది
గైరికము. స. పర్వతధాతువిశేషము, బంగారు, జేగురు
గైరేయకము. స. కాఱుపోఁక
గైరేయము. స. సిలాజిత్తు

## గొ

గొంగ. దే. శత్రువు
గొంగడి. దే. కంబళి
గొంగడికాఁడు. దే.' పక్షివిశేషము
గొంగళి. దే. కంబళి
గొంజి. దే. గొడ్రాలు
గొంటరి. దే. కుత్సితుఁడు, కఠినుఁడు
గొంటి. దే. దుష్టురాలు
గొంటు. దే. దుష్టుఁడు
గొంటు. త. బందనలేనివక్క
గొంటుకాఁడు. దే. కఠినుఁడు
గొండిలి, గొండ్లి } త. కుండలాకారనృత్యము, నృత్యము, నర్తకి
గొండ్లెము, గొండెము } దే. తలుపుచిలుకు
గొంతి. త. పాండురాజుభార్య, ఆఁడుది
గొంతు. దే. కంఠము, కంఠధ్వని, కుక్కుటాసనము
గొంతుక. దే. కంఠము, గొంతు
గొంతుకపోఁక. దే. గొంతుముందటిప్రక్కపోఁకవలెనుండెడి యెముక, గొంతుముడి
గొంతుముడి. దే. గొంతుకపోఁక
గొంతెమకోరిక. దే. కోరఁదగని కోరికలను గోరుట
గొంబె. దే. మూల
గొగ్గి. దే. ఎచ్చుతక్కువైనది
గొజ్జఁగ, గొజ్జెఁగ } త. ఒకానొకపూఁజెట్టు
గొట్టము. దే. క్రోవి
గొట్టు. దే. దౌష్ట్యము, విరోధి, కఠినము, దుర్లభము, దుష్టము

గొట్టె / గొట్లె } త. రేఁగుచెట్టు

గొడఁగు. దే. గొణఁగు

గొడగ / గొణగ } త. ఏఁడిక్రోలలేని నాఁగలి

గొడగర. దే. చెప్పులుకుట్టి జీవించెడుజాతి

గొడగరి. దే. మాదిగవాఁడు

గొడవ. దే. ఆపద. తప్పు, దుఃఖము, అడ్డి, కలఁత

గొడారి. దే. గొడగరి

గొడిగ. త. గులకతాయి [అవయవము

గొడియ. దే. అందలముయొక్క ఒకానొక

గొడుగు. దే. ఛత్రము

గొడుగుబల్ల. దే. తలుపుమీఁది కుబుసము తిరిగెడుపట్టె [సైనవాఁడు

గొడ్డ. దే బిఱుసు, బిఱుసుమాట, బిఱు

గొడ్డగము. త. బాధకము

గొడ్డతనము. దే. మొండితనము

గొడ్డము. దే. ఉపద్రవము

గొడ్డలి. త. చెట్టునఱకెడు సాధనము, కుఠారము

గొడ్డు. దే. గొడ్రాలు, గొడ్రాలితనము, ఈనని పశువు, పశువు, శూన్యము

గొడ్డుకారము. దే. ఎక్కువకారము

గొడ్డుపోతు. దే. నిష్ప్రయోజకుఁడు

గొడ్డురాలు. దే. బిడ్డలుకనని యాఁడుది

గొడ్డువోవు. దే. వ్యర్థమగు, గొడ్రాలగు

గొడ్డేఱు. దే. గుత్తకుఁదీసికొను, నీళ్లులేని యేఱు

గొడ్రాలు. దే. గొడ్డురాలు

గొణఁగు. దే. మాటవెడలనీక నోటనెగొణ గొణయను [నుకరణము

గొణగొణ. దే. గొణగుటయందగు ధ్వన్య

గొతుపు. దే. నీలమణివిశేషము

గొత్తు. దే. వెన్న మొదలగునవి పాసిపోయిన కంపు

గొత్తు. త. గుత్తి

గొద. దే. ఆఁకలి, కోపము

గొదకొను. దే. అతిశయించు, త్వరపడు, విజృంభించు, ఆఁకలిగొను

గొదగొద. దే. పగ, విరోధము

గొనకొను. దే. యత్నించు, కొనకొను

గొనప / గొనమ } దే. అఱిగిననాఁగేలు, పొట్టి

గొనబు. దే. మనోజ్ఞము, మనోజ్ఞత

గొనబుకాఁడు. దే. అందగాఁడు, సుందరుఁడు

గొనము. త. శౌర్యాదిగుణము

గొనయము. త. వింటినారి, ధనురగ్రము

గొనిసె. దే. పొట్టివాఁడు

గొప్ప. దే. పెద్ద, అధికము

గొప్పలు. దే. వరిమడియందు కొంచెము మెట్టగానుండెడు చోట్లు

గొప్పలు. త. చూరుపట్టె

గొబ. త. గుహ, గొంది

గొబ్బండు. దే. పెద్దపండు

గొబ్బరము దే. ఎరువు

గొబ్బి. దే. పాడుచు బాలికలు జరిపించెడు నొకవేడుక

గొబ్బిళ్లు. దే. బాలికా క్రీడావిశేషము, నమస్కారము, ధనుర్మాసములో బాలికలు వాకిటనుంచు గోమయఘుటికలు

గొబ్బున. దే. శీఘ్రముగా

గొయ్యి. దే. పల్లము

గొరక. త. ఇషుపబాణము, మృగవిశేషము

గొరకకట్టె. త. అలుఁగుగల చేతికఱ్ఱ

గొరగొర. దే. వేగము

గౌరిజ } త. పశువుల కాలిగిట్ట
గౌరిసె }

గౌరిసెగాలి. దే. పశువులగౌరిసెల నడుమ పుండయి పురుగులుపడెడు వ్యాధి

గౌరువంక. త. గోరువంక

గౌఱకు. త. నీచేఁడు

గౌఱపము. త. గుఱ్ఱమును దోమెడు సాధనము

గౌఱియ } త. గౌఱ్ఱె
గౌఱ్ఱియ }

గౌఱుగు. దే. క్షౌరముచేయు

గౌఱె. త. గౌఱ్ఱె

గౌఱ్ఱు. దే. ముప్పదిరెండు కుంటలకొలఁది, దున్నిన పొలము మీఁద దున్నెడు యంత్రము

గౌఱ్ఱె. త. మేషి

గౌల. త. గెల

గౌలకి. త. కలకలధ్వని

గౌలకలు. దే. తాటిచేన్నులు

గౌలగౌల. త. కలకలధ్వని, ధ్వన్యనుకరణము

గౌలుసు. దే. చేతధరించెడి యొక సొమ్ము, సంకెల [ములు

గౌలుసుమోడి. దే. గౌలుసుకట్టు అక్షర

గౌల్ల. దే. ద్వారపాలుఁడు

గౌల్ల. త. పశువులను మేపియు పాలు పెరుఁగు అమ్మియు జీవించెడుజాతి

గౌల్లఁడు. త. గోపాలకుఁడు

గౌల్లత. త. గోపిక

గౌల్లతనము. దే. మోటుతనము

గౌల్లదొందు. దే. మత్స్యవిశేషము

గౌల్లము. త. లోఁతుగలపల్లము

గౌల్లభామ. దే. గౌల్లది, పొడుగుకాళ్లుగల యొకవిధమగు పచ్చని ఆకుపురుగు.

గౌల్లియన. దే. గుడారము

గౌల్లు. త. కలకలధ్వని

గౌల్లెన. దే. గుడారము

గౌల్లెనబండి. దే. గాడీ

గౌవరు. దే. తాపము

గౌవరువోవు. దే. తపించు, ఎండిపోవు

గౌహౌరు. దే. ఉపద్రవము

## గో.

గో. దే. చూపుటయందు వచ్చును. అదిగో

గోంగూర. దే. గోఁగాకు

గోండుఁడు. స. పామరజాతివాఁడు, ఊఱుకుబొడ్డువాఁడు

గోండ్రించు. దే. పులి, ఎలుఁగు కూయు

గోండ్రిల్లు } దే. పులి కూయు
గోండ్రిలు }

గోండ్రు. దే. అంగలార్చుటయందగు ధ్వన్యనుకరణము

గోండ్రుపెట్టు. దే. పశ్వాదులు కూయు

గోఁకు. దే. గీఁకు, గీఱు

గోఁకుడుపాఱ. దే. దోఁకుడు పాఱ

గోఁగు. దే. గోను

గోఁగుట. దే. గౌఱుగుట

గోఁచి. దే. కౌపీనము

గోఁచికట్టు }
గోఁచికాఁడు } దే. బ్రహ్మచారి
గోఁచిబొఁపఁడు }

గోఁజోట. దే. గోఁజోడుట

గోఁజోడు. దే. పీడించియడుగు

గోఁజు. దే. గోఁజోడు

గోఁటు. దే. కోకయంచుననేర్చి కుట్టెడు సన్న నిసరిగపట్టె, ఒయ్యారము, రేఖ
గోఁటుకత్తె. దే. ఒయ్యారముకలది
గోఁటుకాఁడు. దే. ఒయ్యారముకలవాఁడు
గోఁటుపోఁక. దే గొంటుపోఁక
గోఁటులు. దే. చేతనుంచుకొనెడు స్వర్ణకటక విశేషము
గోఁదు. దే. బందన, బంక
గోఁదురు. దే. పెద్దకప్ప, పెద్ద
గోకంటకము. స. పల్లేరు, గోవులగొరిసె
గోకర్ణము. స. కడితిమృగము, పాము
గోకర్ణి. స. చోఁగచెట్టు
గోకిలము. స. రోఁకలి, నాఁగలి
గోకులము. స. ఆవులమంద, గొల్లకులము
గోకులికము. స. ఆడుసునఁబడిన ఎద్దు
గోక్షురకము. స. పల్లేరు
గోగంధనము. స. ఎదురుగాలి
గోగ్రంధి. స. పసులకొట్టము, ఏఱుపిడక, బెండ
గోచరము. స. ఇంద్రియార్థము, విషయము
గోచరించు. స. అగపడు
గోచారము. స. సూర్యాది గ్రహముల యొక్క మేషాదిరాసుల సంచారము
గోజిహ్వ. స. ఎద్దునాలుకచెట్టు, బెండ
గోటాపన. త. పక్షిఈఁక, విజృంభణము
గోడ. త. కుడ్యము
గోడకాలు. దే కరగోడ
గోడగించు. దే. మాటాడు, శబ్దించు, తిరస్కరించు
గోడచేర్పు. దే. జేమఁడు
గోడా. త. గుఱ్ఱము
గోడాడు. దే. దుఃఖించు
గోడి. దే. అణఁగుడు, వంపు
గోడిగ. త. ఆఁడుగుఱ్ఱము
గోడిపట్టెలు. దే. బాలక్రీడావిశేషము
గోడివడు. దే. అణఁగు, వంపగు
గోడివెట్టు. దే. వంచు
గోడు. దే. దుఃఖము
గోడుబిళ్లలు. దే. బాలక్రీడావిశేషము
గోడెము. దే. కొండదొన నాశ్రయించి యుండెడు బోయపల్లె
గోణము / గోణాము } త. కౌపీనము
గోణి. దే. ఎద్దు
గోణి. స. గోనె
గోతము / గోతాము } దే. జేపనార సంచి
గోతి. దే. ఆఁడుది
గోతుంబ. స. బుడమచెట్టు, పుచ్చెచెట్టు
గోత్ర. స. నేల, గోవులగుంపు
గోత్రభిదుఁడు. స. ఇంద్రుఁడు
గోత్రము. స. వంశము, పేరు, గొడుగు, వరిమడి, కొండ
గోత్రుఁడు. స. గోవులగాచువాఁడు
గోద. దే. ఎద్దు
గోదము. త. మెదడు
గోదరి. దే. ముచ్చివాఁడు
గోదారణము. స. నాఁగలి
గోదారి. దే. వెన్నకాఁచినమడ్డి
గోదావరి. స. నదీవిశేషము
గోదుమ. త. సస్యవిశేషము
గోదుమపూసలు. దే. స్త్రీకంఠభూషా విశేషము

గోదుహుఁడు. స. పాలు పితుకువాఁడు, గొల్లవాఁడు
గోధ. స. ఉడుము, వింటినారిదెబ్బ తగులకుండ చేతికిఁ గట్టినచర్మము
గోధనము. స. గోకులము
గోధి. స. నొసలు, ఫాలము
గోధిక. స. ఉడుము, నీరుడుము
గోధూమము. స. గోదుమలు
గోనర్దము. స. బెగ్గురుపక్షి
గోనసము } స. కొండచిలువ
గోనాసము }
గోనియ. త. గోనె
గోను. దే. గోఁగు. గోఁగుమొక్క
గోనె. త. జనుపనారపట్టలసంచి
గోనెసంచి. దే. గోతము
గోపతి. స. ఆఁబోతు, ఇంద్రుఁడు, రాజు, శివుఁడు, సూర్యుఁడు
గోపనము. స. దాఁచుట, కాపాడుట
గోపనీయము. స. దాఁచఁదగినది
గోపము. స. బోళము
గోపయితవ్యము. స. దాఁచేఁదగినది
గోపానసి. స. చూరుపట్టె
గోపాయితము. స. కావఁబడినది
గోపాలుఁడు. స. గొల్లవాఁడు, రాజు, కృష్ణుఁడు
గోపి } స. గొల్లది
గోపిక }
గోపి. స. కావిడాయి
గోపిచందనము } స. ఒక దిసుసు సుద్ద మన్ను
గోపీచందనము }
గోపీతము. స. ప్రభాతము. వేకువ
గోపీథము. స. నీటిదొన
గోపుఁడు. స. గొల్లవాఁడు, రాజు. గోవులకధిపతి, అనేకగ్రామముల కధికారి
గోపుచ్ఛము. స. కోఁతి
గోపురము. స. గవను, వాకిలి, దేవళము వాకిట మిగుల నెత్తుగా కొన్ని అంతస్తులు గల పొడుగాటి కట్టడము
గోప్త. స. కాపాడువాఁడు, దాఁచువాఁడు
గోప్యకుఁడు. స. భృత్యుఁడు
గోప్యము. స. దాఁచఁబడినది, కాపాడఁబడినది
గోప్యుఁడు. స. ఊడిగపువాఁడు, కావఁదగినవాఁడు
గోమంతుఁడు. స. గోవులకధిపతి
గోమయచ్ఛత్రము. స. కుక్కగొడుగు
గోమయము. స. పేఁడ
గోమాయువు. స. నక్క
గోమారి. దే. పశువులకుఁబట్టెడి చెక్క, పిడుఁజు
గోమి. స. గోవులకధిపతి, నక్క, గోవులు గలవాఁడు
గోమించే. దే. గోముచేయు
గోము. దే. శ్రమమెఱుఁగని తనము, సౌకుమార్యము, మెత్తనిది
గోముఖము. స. అలుకుట, వాద్యవిశేషము, సురంగ విశేషము, మొసలి, వంకర కొంకరయిల్లు
గోమేధికము. స. పసుపువన్నెగల రత్నవిశేషము
గోయి. దే. పల్లము, గొయ్యి
గోర } త. గోరువంకపక్షి
గోరంక }
గోరంకువు. స. గోరువంకపక్షి, దిసమొలవాఁడు, బట్టువాఁడు

జాబిలిమేపరి. దే. రాహువు

జాబిలిఱాయి. దే. చంద్రకాంతము

జాబిలిరిక్క. దే. మృగశీర్షనక్షత్రము

జాబిల్లి. దే. చంద్రుఁడు

జాబిల్లు. దే. బాలికాక్రీడావిశేషము

జాబు. దే. లేఖ, పత్రిక

జాబర / జాబరా } దే. ఒకానొకచెట్టు

జామ. త. ఒకానొకచెట్టు

జామారు. దే. సెల్లా, దోవతులచాపు

జాము. త. ఏడున్నరగడియకాలము

జారి. దే. గిండి, కమండలువు, కొమ్ముచెంబు

జార్చు / జాఱించు } దే. జాఱఁజేయు

జాఱు. దే. జరఁగు, ఊఱుకు, వదలు, స్రవించు, జాఱుడు

జాఱుడు. దే. జాఱుట, గళనము

జాఱుపాటు. దే. స్ఖలనము, స్ఖాలిత్యము

జాఱువు. దే. జాఱుడు, కొండజెఱి

జాఱువాఱు. దే. జాఱు

జాల. త. చేఁపలనుబట్టువల, కిటికి

జాలకట్టు. దే. నల్లఱాతియందు బెజ్జము లేర్పఱచి యుంచినకిటికి

జాలకాఁడు. దే. ఆలస్యము చేయువాఁడు

జాలకాఁడు. త. చేఁపలను బట్టువాఁడు

జాలము. దే. జాగు, ఆలస్యము

జాలరి. త. చేఁపలనుబట్టువాఁడు

జాలరు. త. గొడుగు మొదలగువాని చివర వ్రేలెడుకుచ్చు

జాలవల్లిక. దే. చిత్రపుపనిచేసిన తముల పాకుల పళ్లెము

జాలారి. దే. హింస్రవృక్షము

జాలి. దే. మనఃక్లేశము, విచారము, బొంగరపుత్రాడు

జాలిఁబడు. దే. దుఃఖపడు, విచారపడు

జాలిఁబెట్టు. దే. దుఃఖపెట్టు

జాలికుఁడు. దే. చేఁపలను బట్టువాఁడు

జాలిగొను. దే. జాలిఁబడు

జాలియ. దే. జాలెడేఁగ, జాలెసంచి, బొంగరపుత్రాడు

జాలియము / జాలెము } దే. జాలెసంచి

జాలి. దే. జాలరు

జాలు. త. ఏఱు, అల్పప్రవాహము

జాలుకొను / జాలువాఱు } దే. ప్రవహించు

జాలువు. త. జాలు

జాలె దే. ఒకజాతిడేఁగ, పైకమువేసెడి ఒకచిన్నసంచి, బొంగరపుత్రాడు

జాలెత్రాడు. దే. జెట్టియొక్క యుపకరణ విశేషము

జావ. త. నూకలువేసిపలుచగాఁ గాఁచిన గంజి

జావడము. దే. అపౌరుషము, గుజ్జుపొట్టు, పిఱికితనము, ఒకజాతిడేఁగ

జావడి. దే. చాఁకలవాఁడు

జావళము. దే. గుజ్జుపొట్టు

జావళి. దే. గీతవిశేషము

జావాహిరి. దే. రత్నపుసొమ్ము

జాళించు. దే. జాడించు

జాళియ / జాళె } దే. జాలె, ఒకజాతిడేఁగ, ఒకదినుసుసంచి, బొంగరపుత్రాడు

జాళియము / జాళెము } దే. అశ్వగతిభేదము

జాళువా }
జాలువా } దే. అపరంజి, బంగారు
జాళ్వా }

## ఝు

ఝం. దే. ధ్వన్యనుకరణము

ఝంఝము }
ఝంఝాము } దే. దీపావళి పండుగనాఁటి రాత్రి బాలురు కాల్చి త్రిప్పెడు జమ్ముకట్ట, ఎగ తాళి, అబద్ధము

ఝంఝాఱు. దే. చింపిఱి, ఝంఝాఱుకట్ట

ఝంఝాఱుకట్ట. దే. వెలుతురుపుల్లలు మొద లగువానితో నేర్పఱచిన దివ్వటీ

ఝంటితేనె. దే. ఝంటీగలుగూర్చిన తేనె

ఝంటీఁగ. దే. తేనెటీఁగ

ఝఝురు. దే. గుబురు

ఝఝురుకొను. దే. గుబురుకొను

ఝట్టనవ్రేలు }
ఝట్టవ్రేలు } దే. తర్జని

ఝట్టిలి. దే. చాఁపఁబడిన బొట్టనవ్రేలిచూ పుడువ్రేలినడిమికొలఁత, ప్రాదేశము

ఝట్టు. త. సిగ, కేశబంధము

ఝట్టుఁబులుఁగు. దే. నెమలి

ఝట్టువట్టెలుఁపు. దే. కుమారస్వామి

ఝట్టువు. దే. అజశృంగిచెట్టు

ఝడుఁగు }
ఝణుఁగు } దే. భయాదులచే ఒదుఁగు, డాఁగు, వెనుదీయు,వంచన

ఝత్త. దే. చాఁపఁబడినబొటనవ్రేలికుఁగ రవ్రేలి నడిమికొలఁత, గోకర్ణము

ఝత్తనవ్రేలు. దే. ఝట్టనవ్రేలు

ఝత్తిలి. దే. ఝట్టిలి

ఝన్ను. దే. ఝన్నుఁబాలు, ఝన్నుగడ్డ, తేనె, తేనెతెట్టె

ఝన్నుఁబాలు. దే. ఈనిన అయిదాఱుదిన ములలోనిపాలు, పీయూషము

ఝన్నుగడ్డ. దే. కాఁగిగడ్డకట్టిన యీనిన అయిదాఱుదినములలోని పాలు

ఝబ్బ. త. బాహుపురి, దండకడియము

ఝమాయించు. దే. కష్టిముగ ఈడ్చిపట్టు

ఝమికీలు. దే. స్త్రీకర్ణభూషావిశేషము

ఝమ్మ. దే. పక్షివిశేషము

ఝమ్మఁడు }
ఝమ్మకాఁడు } దే. విటుఁడు

ఝట్టు. దే. పీల్చు, పీల్చుట, పీల్చుటయం దగు ధ్వన్యనుకరణము

ఝలిమి. దే. దుండగము

ఝవ్వ. దే. ఉచ్చు, సన్ననికోల

ఝవ్వరించు. దే. విజృంభించు

ఝవ్వి. దే. ప్లక్షవృక్షము

ఝవ్విదీవి. దే. ప్లక్షద్వీపము

## ఝూ

ఝూఁక. దే. తత్తఱపాటు

ఝూఁకించు. దే. తత్తఱపడు, వగచు

ఝూజము. త. జూదము, మోసము

ఝూజి. త. దూతిక

ఝూటాడు. దే. మోసముచేయు

ఝూటు }
ఝూటుఁదనము } త. మోసము

ఝూదకత్తియ }
ఝూదకత్తె } త. జూదమాడెడి యాఁ డుది

ఝూదకాఁడు }
ఝూజకాఁడు } త. జూదమాడెడువాఁడు

ఝూదము. త. ద్యూతము

జూదరి } త. జూదకాఁడు
జూజరి

జూలు. దే. సింహము మెడమీఁదివెండ్రుకలు, ఏనుఁగుమీఁదఁ బఱచెడు నెఱ్ఱ కంబళి

జూవరము. త. సంతాపము, వ్యగ్రత

## జొ

జొంపము. దే. ఆకులులోనగువానిగుంపు, గుబురు, రెమ్మ, నిరంతరధార, జోలరు

జొంపు. దే. కొండయందలి యూటనీరు

జొగ్గు. దే. భిక్షము

జొగ్గెత్తు. దే. బిచ్చమెత్తు

జొత్తిల్లు } దే. ఎఱ్ఱపాఱు, రంజిల్లు
జొత్తిలు

జొత్తు. దే. ఎఱుపు

జొత్తుపాప. దే. లేఁతబిడ్డ

జొన్న. త. సస్యవిశేషము

జొన్న. దే. వృక్షవిశేషము

జొబ్బిల్లు } దే. స్రవించు, నిండారు, ఉప్పతిల్లు
జొబ్బిలు

జొరము. త. జ్వరము

జొట్టీఁగ. దే. జోటీఁగ

జొల్ల. దే. చిన్నయేఱు

జొల్లు. దే. చొంగ

జొహారు } దే. నమస్కారము
జొహారువు

## జో

జోక. దే. సామ్యము, సౌందర్యము, బాగు, జత, విధము, ఉత్సాహము, మొత్తము, స్వాధీనము, యుక్తము, స్వరూపము, అధికము

జోకచేయు. దే. సంపాదించు, సిద్ధపఱచు

జోకపడు. దే. జతపడు

జోకపఱచు. దే. జతపఱచు

జోకు. దే. తిట్టు, తిట్టుట

జోకొట్టు. దే. పిల్లలనిద్రపోవుటకై వీఁపున మెల్లఁగాతట్టు, చేఱచు

జోక్యము } దే. జోలి, సంబంధము, నష్టము, అపాయము, నరకు
జోకెము

జోగపట్టియ } త. యోగపట్టము
జోగపట్టె

జోగము. త. యోగము

జోగి. దే. భిక్షుకుఁడు

జోగి. త. యోగి

జోగిణి. త. సోదకత్తె, ఒకస్త్రీదేవత

జోగు. దే. భిక్షము, ఓడ, ఏఱుదాఁటించు పడవ

జోగురాలు. దే. భిక్షుకురాలు

జోజో. దే. సుఖముగ నుండుమని దీవన

జోటి } త. ఆఁడుది
జోటిక

జోటికత్తియ } త. చెలికత్తె
జోటికత్తె

జోటిపని. దే. మిథునకృత్యము

జోడఁగి. దే. వేటకుక్క

జోడగించు. దే. జోడననడతోనడపించు

జోడన. దే. అశ్వగతివిశేషము

జోడమ్ము. త. ధనస్సునఁ జేర్చక చేతితో విసరుబాణము

జోడాలు. త. నతివిశేషము

జోడించు. త. జతచేయు

జోడింపు. త. మల్లబంధవిశేషము
జోడు. దే. కవచము
జోడు. త. జత, సమానము
జోడుకూర్చు. దే. కౌఁగిలించుకొను
జోడుకోడియ / జోడుకోడె } దే. సమానము, సమానుఁడు, జత
జోడుఁబేల్పులరిక్క. దే. విశాఖనక్షత్రము
జోణఁగి. దే. వేఁటకుక్క
జోత / జోతము / జోతాము } దే. నమస్కారము
జోతి. త. కాంతి, దీపము
జోదు. త. యుద్ధముచేయుబంటు
జోనడ. దే. జోడన, అశ్వగతివిశేషము
జోబిల్లి. దే. నమస్కారము
జోము. దే. సొమ్మ, తిమ్మిరి, చేదువు నపుడు తల ఊఁగించు
జోరావరి. దే. బలాత్కారము
జోరు. దే. కురియుటయందగు ధ్వన్యను కరణము
జోలీఁగ. దే. పశుమక్షిక
జోఱు. దే. ధ్వన్యనుకరణము
జోల. దే. బిడ్డల నిద్దుర పుచ్చునప్పుడు పాడెడుపాట
జోలి. దే. సంగతి, సంబంధము, వృత్తాంతము, ప్రమేయము, ప్రశంస
జోలియ / జోలె } దే చంకను వ్రేలాడవేసికొనెడు గుడ్డసంచి
జోష జై. ఘోష
జోసి. త. జోస్యుఁడు
జోస్యము. త. జ్యోతిశ్శాస్త్రము
జోస్యుఁడు. త. జోస్యము నెఱిఁగినవాఁడు, జ్యోతిషికుఁడు

జోహారు / జోహారువు } దే. నమస్కారము

## జౌ

జౌకించు. దే. వ్రేలాడఁజేయు
జౌకు / జేవుకు } దే. మిక్కిలిమెత్తగిల్లు, బురద
జౌజెవ్వ / జెవ్వజెవ్వు } దే. పాఱుటయందగు ధ్వన్యను కరణము
జౌరు / జేవురు } దే. కొట్టు, చేతులతో కుప్పచేసి యెత్తు

## ఝ

ఝ. ఒకయక్షరము
ఝంకరించు. స. ఝంకారముచేయు
ఝంకారము. స. తుమ్మెదరొద
ఝంకారిణి. స. గంగానది
ఝంకృతి. స. ఝంకారము
ఝంఝ. స. వానగాలి, ధ్వనివిశేషము
ఝంప. స. జంపెతాళము, దూఁకుడు
ఝంపాకము. స. కోఁతి
ఝకటము. స. జేగడము
ఝట. స. నేలయుసిరికమొక్క
ఝటి. స. చిన్నచెట్టు, పొద
ఝరము. స. సెలయేఱు, ప్రవాహము
ఝరసి. స. చేఁతరాసిమొక్క
ఝరి / ఝూరి } స. సెలయేఱు, తేళ్లపుట్ట
ఝర్ఝరము / ఝర్ఝరి } స. వాద్యవిశేషము, మణిదోషవిశేషము, కలియుగము
ఝల్లరి / ఝల్లారి } స. పెద్దడోలు, జాలరు, నీటిసుడి

ఝష. స. బీఱమొక్క
ఝషకేతుఁడు. స. మన్మథుఁడు
ఝషము. స. చేఁప, మొసలి, అడవి

## ఝా

ఝాటము. స. సమూహము, కాఱడవి, పొదరిల్లు, చీఁపురుకట్ట
ఝాటలము } స. మొక్కపుఁజెట్టు, పొదరిల్లు
ఝాటలి }
ఝామకము. స. కాల్చినఇటిక

## ఝి

ఝింగిని. స. కాగడా, ఒకజినుసుదోసకాయ
ఝింటి. స. గోరంటమొక్క
ఝిల్లి } స. ఈలపురుగు, ఈలపురుగుకూఁత, ఎండజిగి, తుడిచెడుగుడ్డ
ఝిల్లిక }

## ఝీ

ఝీరుక. స. ఈలపురుగు

## ట

ట. ఒకయక్షరము
టంకకము. స. వెండినాణెము
టంకణము. స. వెలిగారము
టంకము. త. పదియాఱుడబ్బుల బంగారునాణెము, పదియాఱుడబ్బులు
టంకము. స. వెలిగారము, గడ్డపాఱ, కోపము, కత్తి, కత్తియొఱ, రాళ్లుమలిచెడియులి
టంకరించు. స. టం అనినారినిమ్రోయించు
టంకవాఁడు. దే. ఒకానొక బంగారునాణెము
టంకసాల. త. నాణెములు ముద్రించెడు చోటు
టంకసాలవాటు. దే. టంకవాటు
టంకారము } స. వింటినారియొక్క ధ్వని, ఆశ్చర్యము, ప్రసిద్ధి
టంకృతి }
టంకు. దే. మాయావి, ధూర్తుఁడు, నాగరకతకలవాఁడు, డాంబికుఁడు
టంగణము. స. వెలిగారము
టంగము. స. పాఁ. వెలిగారము
టంగు } దే. గుఱ్ఱముమీఁది గంత జాఱక బిగించికట్టెడు వాఱు
టంగువాఱు }
టకటొంకు. దే. కుత్సితము, మాయావి
టక్కరి. త. మోసకాఁడు, మోసకత్తె
టక్కరికాఁడు. త. మోసకాఁడు
టక్కియము } దే. ధ్వజము
టక్కము }
టక్కు. త. మోసము
టక్కులాఁడి. దే. టక్కులుచేయునాఁడుది
టక్కులాఁడు. దే. టక్కులుచేయువాఁడు
టగరము. స. వెలిగారము, కలవరము
టపా. దే. అంచె, అంచెలమీఁదవచ్చునుత్తరములోనగునవి
టవటవ. దే. బొంకు
టవలి. దే. ఆసత్యము, ధూర్తుఁడు

## టా

టాకు. దే. సాదాఉంగరము, ఓర
టాటోటు. దే. మోసము, కపటము
టాటోటుకాఁడు. దే. మోసకాఁడు
టాట్యా. స. స్నేహితులతోఁగూడి విహారమునకుఁబోవుట
టాపు. దే. ద్వీపము, తావు

## టి

టింగ } దే. పొట్టివాఁడు
టింగణా }

టిశము. త. ముడ్డిపూస

టిట్టిభకము } స. లకుముకిపిట్ట, కాటుకపిట్ట
టిట్టీభము }

టిప్పణము. స. టీక, టీకకు టీక

టిట్టి. దే. మోసెడుజంతువు

## టీ

టీక. స. అర్థవివరణము

టీకము. దే. ఒరగల్లు

టీకా. దే. ఒకదినుసుపతకము, స్ఫోటకము పొడిపించేట

టీకు. దే. నడచేటయందలి విలాసము

టీపు. దే. మంచినడవడికకు జామీనుగాఁ గట్టినధనము

## టూ

టూకి. దే. సంగ్రహము

టూకించే. దే. సంగ్రహించే

## టె

టెంక. దే. మామిడికాయలోనివిత్తు

టెంకణము. దే. నమస్కారము

టెంకాయ. దే. నారికేళఫలము

టెంకాయచెట్టు. దే. నారికేళవృక్షము

టెంకి. దే. గృహము, స్థానము, తాటాకు లకు బెజ్జముచేసెడుసాధనము

టెం[illegible] } దే. మా[illegible]వాఁడు బెజ్జము
టె[illegible] } [illegible]

టె[illegible]. దే. [illegible]

టెక్కియము } దే. ధ్వజము
టెక్కెము }

టెక్కు. దే. గర్వచేష్ట, విలాసము

టెక్కులాఁడి. దే. టెక్కులుగలయాఁడుది

టెక్కులాఁడు. దే. టెక్కులుగలవాఁడు

టెక్కువ. దే. టెక్కు

టెక్కెపుగాము. దే. కేతుగ్రహము

టెక్కెమెగురఁగొట్టు. దే. ఖ్యాతినొందు

## టే

టేంకణము. స. ఒకానొకదేశము

టేఁకి. దే. మత్స్యవిశేషము

టేఁకు. దే. టేఁకుచెట్టు

టేఁకుదీవి. దే. శాకద్వీపము

## టొ

టొంకు. దే. వంకర, సుదురు

టొంపు } దే. నింద
టొకరము }

## టో

టోకు. దే. మొత్తము, జెట్లు భుజముతో భుజముతాఁకించేట

టోపె. దే. పట్టు మొదలగువానితో నేర్ప అచినకిరీటము

## ఠ

ఠ. ఒకయక్షరము

ఠక్కుఁడు. స. మోసకాఁడు

ఠక్కురుఁడు. స. దేవత

ఠవఠవ. దే. శ్రమము, ఆయాసము, అడ్డంకి

ఠవణించు. దే. ఠవణిల్లజేయు, కావించే

ఠవణిల్లు. దే. ప్రవర్తిల్లు, ఒప్పు

ఠవర. దే. నేర్పరి

ఠవళి. దే. మోసము, కపటము

ఠవళికాఁడు. దే. మోసకాఁడు

ఠవిణ. దే. డంకా

## ఠా

ఠాక్కు. గ్రా. దేవత, అధిపతి, తండ్రి, గురువు

ఠాణము. దే. స్థానము

ఠాయము } దే. స్వరస్థాయి
ఠాయి

ఠాలిని. స. దట్టి

ఠావు. త. స్థానము

ఠి

ఠింగణా. దే. బాలుఁడు, పొట్టివాఁడు

ఠీ

ఠీవి. దే. ఒయ్యారము, వైభవము

ఠే

ఠేవ. దే. ఒప్పిదము, ప్రాభవము, విధము

ఠో

ఠోలా. దే. తెగ, సమూహము

డ

డ. ఒకయక్షరము

డంక. దే. దిట్ట

డంకా. త. వాద్యవిశేషము, ఢక్క

డంగు. దే. దంగు, బియ్యముయొక్కపై తవుడుపోవునట్లు మెదుగు

డంగురము. దే. వీరణమనుచర్మవాద్యము

డంచు. దే. దంచు

డంబము. త. స్థితికిమించిన వేషము, పటాటోపము, ప్రతిష్ఠ, ప్రకాశము, గర్వము, కపటము, విధము, అధికము, డంబు

డంబరము. స. విజృంభణము, పొంగు, గర్వము, గుంపు

డంబు. త. కపటము, స్థితికిమించినవేషము, కాంతి, గర్వము, విధము, పటాటోపము, ప్రతిష్ఠ, అధికము

డక్క. త. వాద్యవిశేషము, ఢక్క, భయము

డక్కగొను. దే. వశముచేసికొను

డక్కి. త. ఢక్క

డక్కించుకొను. దే. దక్కించుకొను

డక్కు. దే. దక్కు, లభించు, అనుభవయోగ్యమగు, భయము

డక్కొను. దే. దక్కొను, స్వతంత్రుఁడగు

డగర. దే. పిశాచము, గండు

డగరము. దే. దగరము, కీడు

డగ్గఱ. దే. దగ్గఱ

డగ్గఱించు. దే. దగ్గఱించు, సమీపించు

డగ్గఱు. దే. దగ్గఱు, సమీపించు

డగ్గు. దే. డగ్గు, కాసము

డగ్గుత్తిక. దే. గద్గదస్వరము

డప్పి. దే. దప్పి, శ్రమము, నీరుపట్టు

డప్పు. దే. తప్పెట

డబడబ. దే. ఉద్ధతి

డబర. దే. గిన్నె

డబ్బఱ. దే. దబ్బఱ, బొంకు

డబ్బా. దే. తుపాకీమందు లోనగునవి యుంచుకొనెడి తోలుపెట్టె నెయ్యి మొదలైనవి పోసికొనెడి మూఁతగల చీనారేకుపాత్రము

డబ్బాటు. దే అకస్మాత్తుగ

డబ్బాటుసాకిరి. దే. ప్రసంగవశమునవచ్చి యెల్లకార్యములు తెలిసికొనినసాక్షి

డబ్బి. దే. బరిణి

డబ్బు. దే. బొంకాడు, బొంకు, రెండు దుగ్గానులరాగినాణెము, ధనము

డబ్బు. త. డంబము, దంభము

డబ్బర. దే. గిన్నె, దబ్బర
డమరము. స. కొల్ల మొదలగు దేశోపద్ర
 వము
డమరుకము } స. చర్మవాద్యవిశేషము, చ
డమరువు } మత్కారము
డమరుగము. త. చర్మవాద్యవిశేషము
డమాయి } త. చర్మవాద్యవిశేషము
డమారము }
డమ్మను. దే. చేచ్చే
డమ్మారము. త. డమారము
డయనము. స. బాలకాదుల క్రీడాశకట
 ము, పక్షిగతి
డస్స్యు. దే. అలయు, బడలు, బలహీన
 మగు, కృశించే
డవిణ. దే. డంకా
డహువు. స. గజనిమ్మచెట్టు

## డా

డా. దే. ఎడమ, సవ్యము
డాంబరము. స. యుద్ధము
డాంబికము. స. గర్వము
డాంబికుఁడు. స. ఇంద్రజాలాదిమాయలు
 చేయువాఁడు, గర్వముగలవాఁడు
డాఁకొను. దే. దాఁకొను, మఱుఁగుపడు
డాఁగనమ్రుచ్చులు } దే. డాఁగురుమూఁ
డాఁగనమ్రుచ్చిల్లు } తలు
డాఁగిలిమూఁతలు }
దాఁగిలిమూఁతలు }
డాఁగిలిమ్రుచ్చులు } దే. డాఁగురుమూఁతలు
దాఁగిలిమ్రుచ్చులు }
డాఁగు. దే. దాఁగు
డాఁగుడుమూఁతలు. దే. డాఁగురుమూఁ [తలు
డాఁగురించే. దే. దాఁచే, వంచించే
డాఁగురింత. దే. డాఁగురించేట, డాఁగురు
 మూఁతలు, మాటు

డాఁగురుమూఁతలు. దే. బాలక్రీడావిశేష
 ము, అక్షినిమీలనకేళి
డాఁచే. దే. దాఁచు
డాఁపు. దే. దాఁపు
డాక. దే. విజృంభణము, శౌర్యము
డాకడ. దే. ఎడమపార్శ్వము, ఉత్తరపు
 దిక్కు
డాకలి. దే. దాకలి, ఇనుము మొదలగునవి
 సాఁగఁగొట్టుటకు యోగ్యమగునిను
 పదిమ్మె
డాకల్లు. దే. దాకల్లు, బండికంటికడకమ్మి,
 నేమి
డాకిని. స. పిశాచస్త్రీ
డాకురు. దే. కాళ్లుతేలగిలవేయు
డాకూళ్లమారి. దే. పనికిమాలినవాఁడు
డాకొను. దే. దాకొను, సమీపించే
డాగు. దే గుఱుతు, వాఁత, మఱక
డాత్కారము. స. చేఁదుగలచేప
డాపల. దే. ఎడమభాగము
డాపలించే. దే. ప్రదక్షిణమగు
డాపు. దే. దాపు, సమీపము, భయము
డాపురము. దే. దాపురము, ప్రాప్తి
డాబ. దే. పక్షివిశేషము, జంబెమువలె
 వేసికొనెడు తోలుపట్టె
డాబా. దే. బోడిమిద్దె
డాబు. దే. దినుసులపట్టిక
డాబు. త. డంబము
డామరము. స. కొల్ల మొదలగు దేశోప
 ద్రవము
డాయి. దే. దాకలి, దాయి
డాయు. దే. దాయు, సమీపించే
డాలించే. దే. డాలువాఱుపూను
డాలు. దే. కాంతి, టెక్కము

డాలు. త. డాలువాలు, శేడెము

డాలుకాఁడు. దే. డాలువాలుచేతఁబట్టిన వాఁడు

డాలువాలు. దే. డాలు, శేడెము

డావరడంగి. దే. దేవతాళవృక్షము

## డి

డింకవేయు. దే. చేచ్చు

డింకిలు. దే మల్లవిద్యావిశేషము

డింకు. దే. చేచ్చు

డింగ. దే. పాత్రము

డింగరీఁడు. త. సేవకుఁడు, భర్తుఁడు

డింగరుఁడు. స. సేవకుఁడు

డింగిల్లు. దే. నమస్కారవిశేషము

డించు. దే. దించు

డిండిమము. స. వాద్యవిశేషము

డిండీరము. స. నురుఁగు

డిందు. దే. అడఁగు, ఇంకు, క్రుంగు, మ్రొగ్గు, అడఁకువ, న్యూనము

డిందుపడు. దే. అడఁగు, శమించు, సమాధానపడు

డిందుపఱచు. దే. డిందుపడఁజేయు

డిందుపాటు. దే. ఉపశాంతి

డింపు. దే. దింపు, దీనత్వము

డింబము. స. దేశోపద్రవము, భయము పక్షిగ్రుడ్డు, తోలుసంచి

డింభకుఁడు. స. పిల్లవాఁడు

డింభము. స. పిల్ల, గ్రుడ్డు

డింభుఁడు. స. పిల్లవాఁడు, మూర్ఖుఁడు

డిక్కి. దే. తలతోఁగొట్టుట, డీకొట్టుట

డిగఁద్రావు. దే. దిగు, విడుచు

డిగఁబడు. దే. దిగఁబడు

డిగనాడు. దే. దిగనాడు

డిగనుఱుకు. దే. దిగుపడు దుముకు

డిగియ. త. డిగ్గియ, నడబావి

డిగు. దే. దిగు, తగ్గు

డిగుడు. దే. దిగుడు

డిగువ. దే. దిగువ

డిగ్గఁద్రావు. దే. దిగు, విడుచు

డిగ్గఁదాఁటు. దే. దిగి దుముకు

డిగ్గన. దే. దిగ్గన

డిగ్గనాడు. దే. దిగనాడు

డిగ్గనుఱుకు. దే. డిగనుఱుకు

డిగ్గి. దే. అగ్ని

డిగ్గియ. త. నడబావి

డిగ్గు. దే. దిగు

డిగ్గుడు. దే. దిగుడు

డిగ్గువ. దే. దిగ్గన

డిగ్గుపడు. దే. తక్కువపడు

డిప్పకాయ. దే. సొరకాయబుఱ్ఱ

డిబ్బెము. దే. దేవునికిఁగాని బీదవాండ్రకుఁగాని యియ్య నిశ్చయించుకొన్న ధనాదికము, ముడుపు

డిమము. స. నాటకభేదము

డిమ్మరి. దే. దిమ్మరి, భ్రమకలవాఁడు

డిల్లపడు. దే. భయముచే సత్త్వహీనమగు

డిల్లపాటు. దే. డిల్లపడుట

డిల్లపోవు. దే. డిల్లపడుట

డిల్లము. దే. భయాదులచే పాటవహీనమైనది

## డీ

డీ. దే. తలతోఁపోడుచేట

డీకు. దే. ప్రేరేపణ

డీకొను. దే. ఎదుర్కొను, పురికొను, కవియు
డీకొలుపు. దే. పురికొలుపు
డీకోలు. దే. డీకొనుట
డీనము. స. మీఁదికెగురుట
డీలించు. దే. డీలుఁజేయు, సడలించు
డీలు. దే. డిల్లపడు, డిల్లము, వదులైన
డీలుపడు. దే. డిల్లపడు
డీలుపాటు. దే. డీలుపడుట

## డు

డుంకు. దే. తగ్గు
డుండుకము. స. దుండిగపుచెట్టు, అల్పము, క్రూరము
డుండుకుఁడు. స. అల్పుఁడు, క్రూరుఁడు
డుండుభము. స. ఇరుదలపాము
డుక్కు. దే. మఱుఁగుపడు
డుబుడక్క. దే. వాద్యవిశేషము
డుబుడక్కవాఁడు దే. డుబుడక్కను వాయించుచు బిచ్చమెత్తువాఁడు
డుయ్యు. దే. దుయ్యు, బాణాదికమునాటి వెడలు
డుఱ్ఱుచ్చి. దే. కలహమునకుపిలుచుటయం దుపయోగింపఁబడునది

డులుచు, డుల్చు } దే. డుల్లఁజేయు

డుల్లు. దే. పడు, ఊడు

## డూ

డూయు. దే. దూయు

## డె

డెందము. దే. హృదయము
డెక్క. దే. పశువులకాలిగిట్ట
డెక్కు. దే. అడ్డగించు, నివారించు
డెక్కొను. దే. నెలకొను
డెప్ప. దే. కొండమీఁది సమమైనచోటు
డెప్పరము. దే. ఆపద, అశక్యము, దుస్సహము
డెప్పరించు. దే. అశక్యమగు
డెప్పి. దే. దెప్పి
డెబ్బంద్రు. దే. డెబ్బదిమంది
డెబ్బది. దే. ఏడుపదులు

## డే

డేంగుర. స. జేగంట, జయఘంటిక
డేగ. దే. సాధారణపక్షులను వేటాడెడు ఒకదినుసుపక్షి
డేగాట. దే. పెండ్లిలోనైదవనాఁడుచేయు నుత్సవవిశేషము
డేరా. దే. గుడారము

## డొ

డొంక. దే. పశువులదారి, కాలిదారి, పొద, కోన
డొంకు. దే. ఇంకు, ఎండు, వంకర, అడఁగు
డొంకెన. దే. ఒకవిధమగు ఈఁటె
డొంగ. దే. దొంగ
డొంగు. దే. దొంగు, దాఁగు
డొకారము. దే. అంతరాళము, లోను
డొకారముసొచ్చు. దే. లోపడు లోనగు
డొక్క. దే. ఒడలియెముకలగూఁడు, టెంకాయబొండ్లపుపెచ్చు, కడుపు
డొక్కబుఱ్ఱ. దే. తేగపాఱిన పిమ్మట విడిన తాటివిత్తు
డొక్కరము. త. మల్లబంధవిశేషము
డొక్కు. దే. ముదియు, ముదిసినది, చేచ్చు

డొగరు. దే. నింద, అపరాధము

డొప్ప. దే. దొప్ప, దొన్నె

డొలుచు } దే. డొల్లఁజేయు
డొల్చు

డొల్ల. దే. బుఱ్ఱ

డొల్లు. దే. దొర్లు, పొర్లు, పడు

## డో

డోఁకు. దే. వాంతిచేసికొను, గడ్డిపెకుక్కు, ఓకిలింత

డోఁగియాడు } దే. దోఁగాడు
డోఁగాడు

డోఁగు. దే. దోఁగు

డోకడా. దే. నూఱవపాలు

డోరము. స. తోరము

డోరములు. దే. కత్తిమీఁదిచాఱలు

డోల. స. డోలి, తొట్ల

డోలనము. స. ఊఁచుట, ఊపు

డోలము. స. అభినయ హస్తవిశేషము

డోలాబ్జము. స. కలువపువ్వు

డోలాయమానము. స. ఊఁగులాడెడునది

డోలి } త. ఉయ్యాలవంటి అందలము, డోల
డోలిక

డోలు. త. చర్మవాద్యవిశేషము

## డౌ

డౌకనము. స. కానుక, లంచము

డౌలు } దే. మదింపు, దంభము
డవులు

## ఢ

ఢ. ఒకయక్షరము

ఢక్క. స. ఢంకా

ఢమామిక. స. ఢమాయి

## ఢా

ఢాక. దే. ఔద్ధత్యము, ముట్టడి, కష్టము

ఢామర. స. జాతు

ఢాలము. స. డాలువాఱు, ఫలకము

## ఢు

ఢుంఢి. స. గణేశుఁడు

ఢులి } స. ఆఁడుతాఁబేలు
డులి

## ఢో

ఢోలము. స. డోలు

## ణ

ణ. ఒకయక్షరము

## త

త. ఒకయక్షరము

తంకము. స. దుఃఖము, భయము

తంకర. దే. తుచ్ఛధాన్యము, పొల్లు

తంకవము. స. మిగుల రిక్తదశలోనుండుట

తంగు. దే. టంగు

తంగువాఱు. దే. టంగువాఱు

తంగెడు } దే. గోక్షురిణివృక్షము
తంగేడు

తంట } దే. కలహము, చేడి, శ్రమము, అప్పు, మోసము
తంటా

తంటలమారి } దే. కొండెకాఁడు, కలహకారి
తంటాలమారి

తంటసము. దే. తండసము, చిమటాయను మంగలవాని పనిముట్టు

తంటెయము } దే. తంటెపుచెట్టు
తంటెము

తండకము. స. అలంకారము, దండకము
తండకము. దే. మిద్దెటింటికి అడ్డముగా వేసెడుదంతె, వృత్తవిశేషము
తండకుఁడు. స. మోసగాఁడు
తండము. స. గుంపు
తండసము. దే. మంగలవాఁడు వెండ్రుకలను ఊడఁబెఱికెడు సాధనము
తండసము. స. కమ్మరకొలిమి
తండా. త. లంబాడీల సమూహము, సరకుల గోనెలసమూహము
తండు. దే. రావలసిన పైకముకు పోయి అడుగు, పోగుచేయు
తండుగోల. దే. చేపలఁ బొడిచెడు చిల్లకోల, మండపము
తండురీణము. స. కడుగునీరు, పురుగు, బొబ్బరలు
తండురీణుఁడు. స. మూఢుఁడు
తండులము. స. బియ్యము, వాయువిడంగములు
తండులీయము. స. ధాన్యము, చిట్టికూర
తండువు. స. త్రెడ్డుకొయ్య
తండెలు } తండేలు } దే. పడవయందు పెత్తనగాఁడు
తండ్రి } తండిరి } దే. అబ్బ. జనకుఁడు
తండ్రితండ్రి. దే. తాత, పితామహుఁడు
తంతన్యమానము. స. పరిపక్వమైనది
తంతరము. త. తంత్రము
తంతి. త. లోహపుకమ్మి, తంతిమీఁదనడపు సమాచారము
తంతికుఱుపు. దే. నారికుఱుపు
తంతియలు. దే. మెట్లు
తంతు. దే. ఉత్సవవిశేషము, కపటోపాయము
తంతు. త. వివాహాదులలోఁ జేయుకార్యవిశేషము
తంతుకము. స. దారము
తంతుకాష్ఠము. స. సాలెవానినాడె, నూలు వడికెడుకదురు
తంతుకీటము. స. పట్టుపురుగు
తంతునాగము. స. సర్పాకారమైన జలజంతువిశేషము
తంతునాభము. స. సాలెపురుగు
తంతుభము. స. ఆవాలు
తంతువాయము. స. సాలెపురుగు
తంతువాయుఁడు. స. సాలెవాఁడు
తంతువు. స. నూలిపోఁగు, తంతునాగము
తంతెలు. దే. మెట్లు
తంత్రకము. స. క్రొత్తవస్త్రము
తంత్రకారుఁడు. స. ఏదేని యొకవిషయమునుగూర్చి చిన్నగ్రంథముకు వ్రాసినవాఁడు
తంత్రజ్ఞుఁడు. స. కుట్రచేయువాఁడు
తంత్రణము. స. పాలనము, క్రమశిక్షను గల్గియుండునట్లు చేయుట
తంత్రత. స. క్రమపఱచుట
తంత్రము. స. తంతు, స్వరాష్ట్రచింత, ఉపాయము, పరివారము, హేతువు, చేయఁదగినవిధము, ప్రధానము, ఉత్తమమైన ఔషధము, మగ్గము, నూలిపడుగు, కుటుంబవ్యాపారము, వ్యాకరణశాస్త్రము
తంత్రవాది. స. మంచినేర్పుగలవాఁడు
తంత్రి. స. తంతి, లిప్పతీఁగ, నరము

తందనము. త. మాటిమాటికి తానశబ్దపూర్వకముగాచేసెడు రాగాలాపము
తందర. త. తూఁగు, కునికిపాటు
తంద్ర, తంద్రి } స. తూఁగు, కునికిపాటు
తంద్రాళువు స. అలసినవాఁడు
తంద్రితము. స. అలసినది
తంపటి. దే. గొప్పమంట
తంపర. దే. తామరగుంపు, షండము, సాంద్రము
తంపి. దే. దాలిగుంట, కలహము
తంపిపెట్టు. దే. మంటపెట్టు,కలహముపెట్టు
తంబ. దే. ఒకానొకతీఁగ
తంబళ. దే. శివార్చనచేసి బ్రతికెడుజాతి
తంబళవాఁడు. దే. శివార్చకుఁడు
తంబళి. దే. తంబళవాఁడు
తంబు. దే. తమ్ముఁడు
తంబుగ. దే. మెడనిడుపుగానుండెడుచెంబు
తంబుర, తంబురా } దే. తంత్రీవాద్యవిశేషము
తకతక. దే. తాళమునందగు ధ్వన్యనుకరణము
తకపికలాడు. దే. ఇట్టట్టుచలించు
తక్కటి. దే. మూఁడుముఖములుగలదీపారాత్రికపుతట్ట, త్రిముఖదీపిక, ఇతరము
తక్కరి. త. టక్కరి
తక్కిడి. త. మోసము
తక్కిడికాఁడు. త. మోసకాఁడు
తక్కిలి. త. ఒకానొకచెట్టు
తక్కు. దే. తప్పు, విడుచు, మిగులు, ఇతరము, న్యూనము
తక్కు. త. టక్కుచేయు, టక్కు
తక్కుడు. దే. తక్కుట
తక్కుపిక్కు. దే. కొద్దిపొంగతనము
తక్కులాఁడి. దే. టక్కులాఁడి
తక్కులాఁడు. దే. టక్కులాఁడు
తక్కువ. దే. న్యూనము
తక్కువపడు. దే. కొఱఁతపడు
తక్కువపాటు. దే కొఱఁతపాటు
తక్కె. దే. రెండుపీసెలమెత్తు
తక్కె. త. తక్కిలిచెట్టు
తక్కెడ. త. పేములతోఁగాని వెదురుబద్దలతోఁగాని యల్లినపళ్లెములు గ్రుచ్చివ్రేల వేసినత్రాసు, తక్కిలిచెట్టు
తక్కెఱ. దే. అల్పము
తక్కెల. త. తక్కిలిచెట్టు
తక్కేడ. త. తక్కెడ
తక్కేల. త. తక్కెల
తక్కోను. దే. పూచుకోను
తక్కోలకము. స. తక్కోలపుచెట్టు
తక్రము. స. మజ్జిగ
తక్రాటము. స. పెరుఁగుచిలికెడుకవ్వము
తక్షకుఁడు స. వడ్లవాఁడు, ఒకసర్పరాజు
తక్షణము. స. కొయ్యచెక్కుట, కోయుట
తక్షణి. స. మానుచెక్కెడు సాధనము, బాడిస
తక్ష్ణుఁడు. స. వడ్లవాఁడు
తగటి, తగటీ } దే. సరిగది, జరీది
తగటు. దే. సరిగ
తగడు. దే. బంగారులోనగువాని ఱేకు
తగర. దే. మోసగాఁడు, నందివర్ధనపుచెట్టు
తగరము. త. లోహవిశేషము

తగరము. స. పొట్టేలు

తగరు. త. పొట్టేలు

తగరురవుతు. త. అగ్ని

తగవరి. దే. న్యాయాధిపతి

తగవు. దే. తగుట, న్యాయము, జగడము, వ్యాజ్యము, పెండ్లికాలమందు పెండ్లి కూఁతునకు తల్లిదండ్రులిచ్చెడు బహుమానము, తగినది

తగవుగోరి. దే. సంధిచేయువాఁడు

తగిరిస. దే. తంటెపుచెట్టు

తగు. దే. యుక్తమగు

తగుకత్తి. దే. సాధనకు ఉపయుక్తమైన ఆయుధవిశేషము

తగులఁగట్టు. దే. తగిలించు

తగులఁబడు. దే. తగులు, చిక్కు, కాల్చు

తగులఁబెట్టు. దే. తగిలించు, కాల్చు

తగులము. దే. ఆసక్తి, అడ్డపాటు, వలపు, సంబంధము

తగులాటకత్తె. దే. తగులాటముగలఆఁడుది

తగులాటము. దే. తగులు, బంధము

తగులు. దే. చిక్కు, పట్టు, తాఁకు, సక్తమగు, అంటు, పొసఁగు, వెంబడించు, ఆసక్తి, అభిలాష, తగులాటము

తగులుకొను. దే. రగులుకొను, వలచు

తగులుకోలు. దే. తగులుకొనుట

తగులుగొండి. దే. తగులుకొనునట్టిది

తగులుచు, తగుల్చు } దే. తగులఁజేయు

తగులుడు, తగులుదల } దే. తగులుట

తగులుబడి. దే. పటుబడి, వెల

తగులుబాటు. దే. తగులుబడి

తగులువడు. దే. పట్టువడు, చిక్కు

తగులువాటు. దే. తగులువడుట

తగ్గు. దే. తక్కువగు, వెనుకకు దీయు, తెగిపడు, తక్కువ

తగ్గుదల. దే. తక్కువ

తచ్చన. దే. కపటము, పరిహాసము, తంత్రము

తచ్చనలాడు. దే. పరిహాసముచేయు

తచ్చనసేయు. దే. పరిహసించు

తచ్చాడు. దే. సంచరించు

తటకా. దే. నిశ్చేష్టత

తటకాపడు. దే. చేష్టలుతక్కు

తటకాపాటు. దే. తటకాపడుట

తటతట. దే. గుండె లదరుటలోనగువాని యందగు ననుకరణము

తటమట. దే. మోసము, మోసముగలది, కలఁతనొందినది

తటమటించు. దే. మోసపుచ్చు, కలఁచు

తటము. స. వరిమడి, ఏటియొడ్డు, ప్రదేశము, కొండచేఱియ, ఒడ్డు, పల్లము, దిగంతము, పొలము

తటపట. దే. మోసము, మోసముగలది

తటపటచేయు. దే. మోసపుచ్చు

తటస్థము. స. సమీపమునందున్నది, ఒనఁగూడినది

తటస్థించు. స. సమీపించు, ఒనఁగూడు

తటస్థుఁడు. స. న్యాయస్థుఁడు, తగులని వాఁడు

తటాకము, తటాగము } స. చెఱువు

తటాన. దే. తటాలున

తటాయించు. దే. అడ్డగించు, నివారించు
తటాకించు. దే. చేతితో రాయు
తటాలు. దే. గుండెయదరుటయందగు ననుకరణము
తటాలున. దే. అతిశీఘ్రముగ
తటి. స. ఏటియొడ్డు, ప్రదేశము
తటిత్తు. స. మెఱపు, విద్యుత్తు
తటిత్వంతము. స. మేఘము, మబ్బు
తటిని. స. నది, ఏఱు
తటుకున, తటుక్కున } దే. తటాలున
తట్ట. దే. వెదురుబద్దలులోనగు వానితో నల్లినపల్లిక, తబుకు, చిన్నగంప
తట్టగిల్లు. దే. తట్టయగు, అనఁగా బల్లపఱుపుగా నుండు
తట్టము. దే. టంగువాఱు
తట్టస. త. ధైర్యము
తట్టాట. దే. కలహము
తట్టాడు. దే. అడుగులు ఇట్టట్టు ఇడు
తట్టి. దే. కంచెము, వేట, తెర
తట్టు. దే. కలుగు, తోఁచు, చేఱచు, దద్దురు, స్ఫోటకమువంటి యొకజాడ్యము
తట్టు. త. దరి, పార్శ్వము
తట్టుకొను. దే. దొరకినమట్టుకు తీసికొను, ఆలస్యముచేయు, సంకోచించు
తట్టుచేయి. దే. కోటకొమ్మమీఁది అవయవవిశేషము [పునుఁగు
తట్టుపునుఁగు. దే. తట్టియెత్తిన మేలైన
తట్టుముట్టాడు. దే. దారిద్ర్యముచేట్టుకొను
తట్టుముట్లు. దే. గృహోపకరణములు
తట్టువ, తట్టువము } త. గుఱ్ఱము, కుత్సితాశ్వము
తట్టువడు. దే. బాధపడు



తట్ర. త. బంగారుపనిచేసి బ్రతికెడుజాతి
తట్రవాఁడు. దే. కంసాలి
తడ. దే. అడ్డి, కడ, ఒకానొకవృక్షము, తంత్రము
తడఁబడు. దే. తొట్రుపడు, వ్యత్యాసపడు, చలించు
తడఁబఱచు. దే. తొట్రుపడఁజేయు
తడఁబాటు. దే. వ్యత్యాసము, చలనము, తొట్రుపాటు
తడక. దే. వెదురుబద్దలు లోనగువానితో నల్లఁబడినది, పక్షులవేఁటాఁడువాఁడు, మఱుఁగుగా నుంచుకొనుసాధనము
తడకట్టు. దే. అడ్డగించు, అడ్డగింత
తడకాలు. దే. మల్లబంధవిశేషము
తడగము. దే. ఎద్దుమీఁద నీళ్లుతెచ్చెడు తోలుసంచి
తడగాళ్లుపడు. దే. తొట్రుపడు
తడప. దే. పట్టగానుండు నార
తడపపెట్టు. దే. తడఁబఱచు
తడయు. దే. ఆలస్యముచేయు
తడవ. దే. తేప, మాఱు, ఆవృత్తి
తడవాటు. దే. బాధ, కలవరము
తడవాడు. దే. దోఁగాడు, తడఁబడు, నృత్యముచేయు
తడవిల్లు. దే తడబ్రద్దలతోఁజేసినవిల్లు
తడవు. దే. చేతులతో అట్టిట్టుప్రాఁకు, దోఁగాడు, వెదకు, ప్రస్తావించు, నిమురు, విచారించు, రక్షించు, ఆలస్యము, చిరకాలము, స్పృశించు
తడవుడు. దే. వెదకుట, అన్వేషణము
తడవులనిడుపడు. దే. శేషుఁడు

తడాకము, తడాగము. స. తటాకము

తడి. దే. తేమ, నీరు, తేమకలది, తడిసినది

తడిక. దే. తడక

తడికద్రోపరి. దే. తడికత్రోసివేసిలోపలఁ దూఱెడు దొంగ

తడిపొడి. దే. కొంచెము తడిగలిగిపొడిగా నుండునది

తడియు. దే. ఆర్ద్రమగు

తడియొత్తు. దే. తడితుడుచుకొనుగుడ్డ

తడుకు. దే. తోఁటలోనగువానిచుట్టు నేర్పఱచెడు వెలుగు

తడుకున. దే. తటుకున

తడుపంచ. దే. బాలాచ్ఛాదనము, పొత్తియ, పొత్తె, పొత్తిలి, భుజశిరమందు వైచికొనుబట్ట

తడుపు. దే. తడియఁజేయు, గోఁచి, చిన్నవస్త్రము, తడిసినవస్త్రము

తడుపుదాలుపు. దే. బ్రహ్మచారి

తడుము. దే. ఆలోచించు, నిమురు, తడవులాడు

తణగము, తణగాము. దే. ఎద్దుమీఁద నీళ్లుతెచ్చెడు తోలుసంచి

తతగము. స. వాయువు

తతము. స. వీణలోనగువాద్యము, గాలి, విరివియైనది, వ్యాపించినది

తతి. దే. సమయము, కాలము

తతి. స. సమూహము

తత్తడి. దే. గుఱ్ఱము, వాహనము

తత్తబడ. దే. పరివారము

తత్తఱ, తత్తఱము. దే. సంభ్రమము

తత్తఱపడు. దే. సంభ్రమించు

తత్తఱపాటు. దే. తత్తఱపడుట

తత్తఱపెట్టు. దే. తత్తఱపఱచు

తత్తఱించు. దే. సంభ్రమించు, చలించు

తత్తఱిల్లు, తత్తఱిలు. దే. సంభ్రమించు, చలించు

తత్తెర. దే. సారాయిపోసెడుతిత్తి

తత్పరుఁడు. స. దేనియందేనిఆశగలవాఁడు

తత్రత్యము. స. అక్కడకలిగినది

తత్వజ్ఞుఁడు. స. తత్వముతెలిసినవాఁడు

తత్వము. స. పరమాత్మస్వరూపము, స్వభావము

తత్త్వము. స. నిజస్థితి, యథార్థము, మనస్సు

తత్సమము. స. సంస్కృతముతో సమమై తెనుఁగు విభక్తిగల శబ్దము

తథాగతుఁడు. స. బుద్ధదేవుఁడు

తథ్యము. స. సత్యము, సత్యమైనది

తదనంతరము. స. పిమ్మట

తదాత్వము. స. ఆకాలము

తదియ. త. పక్షమునందు మూఁడవతిథి

తదీయము. స. తత్సంబంధమైనది

తదేకము. స. స్థిరము, ఒక్కటే విధము

తద్గుణము. స. అగుణము, ఒకయలంకారము

తద్ద. దే. అత్యంతము

తద్దినము. స. ఆదినము, పైతృకపర్వతిథి

తద్దె. దే. ఆఁడుపిల్లలపండుగ

తద్భవము. స. సంస్కృతమునుండి పుట్టి మాఱురూపము పొందిన పదము

తనకలి. దే. చిక్కు, చిక్కుగలది, చిక్కులఁబెట్టువాఁడు

తనకు. దే. ప్రకాశించు, పొందు, కంపించు సహించు
తనము. త. ఒక ప్రత్యయము
తనము. స. చందనము, చిత్తము
తనయ. స. పుత్త్రిక, కూఁతురు
తనయుఁడు. స. పుత్త్రుఁడు, కొడుకు
తనరారు. దే. ఉన్నతమగు, అతిశయించు
తనరు. త. అతిశయించు, విజృంభించు, ఒప్పు
తనరుచు } దే. తనరఁజేయు
తనర్చు
తనరుపు } త. పొడవు, వెడల్పు, అతిశయము
తనర్పు
తనాబి. దే. స్తంభములమీఁదిగోడకు క్రింద వేసెడు పెద్దపలక
తని. త. అల్పము, సూక్ష్మము
తనిమము. స. కార్శ్యము, విస్తారము, శరీరత
తనియు. దే. ఆపోవు, తృప్తిపడు
తనివి. దే. ఆపోక, తృప్తి
తనివు. దే. తనివి
తనివోవు } దే. తనియు
తనిసను
తనిష్ఠము. స. మిగులసూక్ష్మమగునది
తనుకు } దే. కలుగు, జ్వలించు, ప్రకాశించు, తపించు, తాపము
తన్కు
తనుత. స. స్వల్పము
తనుత్రము } స. కవచము, బొందలము
తనుత్రాణము
తనుపారు. దే. తనియు, చల్లనగు
తనుపు } దే. తనియఁజేయు, తనివి, శైత్యము, శైత్యోపచారము, పితృయజ్ఞము, తడి
తన్పు
తనుమధ్య. స. సన్ననినడుముగలయాఁడుది, ఆఁడుది
తనురుహము } స. వెండ్రుక, ఱెక్క
తనూరుహము
తనువడు. దే. చేల్లఁబడు
తనువు. స. దేహము, తోలు, చిన్న, బక్క, సన్నము
తనువెప్పి. దే. ఇసుమంతకాఁక
తనూకరణము. స. చిన్నదిగాచేయుట, తగ్గించుట
తనూజ. స. కూతుఁరు
తనూజుఁడు. స. కొడుకు
తనూనపాత్తు. స. అగ్ని
తనూభవుఁడు. స. కొడుకు
తన్ను. దే. పాదముతో తాడనముచేయు, ఒరయు, పాదతాడనము
తన్నుఁగోల. దే. ఏటవాలుగా పోటిపెట్టిన కోల
తన్నుబల్ల. దే. ద్వారముయొక్క అరిగాళ్ల మీఁదవేసెఁడుపలక
తన్నుబిల్ల. దే. బాలక్రీడావిశేషము
తన్నులాడు. దే. తన్నుకొను, ఒకరినొకరు తన్నుకొను
తన్నువడు. దే. కొట్టఁబడు
తన్మయము. స. తత్స్వరూపమైనది
తన్మాత్రము. స. శబ్దస్పర్శరూపరసగంధము
తన్వి. దే. తనివి
తన్వి. స. ఆఁడుది, కృశించినదేహముగల ఆఁడుది
తపతప. దే. ఱెక్కలు కొట్టుకొనుటయందగుధ్వన్యనుకరణము
తపతి. స. ఒకానొకయేఱు, సూర్యునికూఁతురు
తపనము. స తాపము, వేసంగికాలము, నరకవిశేషము, జీడిచెట్టు [దగినది
తపనీయము. స. బంగారు, తపింపఁజేయఁ
తపనుఁడు. స. సూర్యుఁడు

తపము. స. వేసంగికాలము, తపస్సు, ఒక లోకము, చాంద్రాయణాదిపుణ్యకర్మము, శిశిర ఋతువు, మాఘమాసము
తపర్తువు. స. వేసవికాలము
తపసి. త. తపస్వి, గారచెట్టు
తపసికన్నాప. దే. చంద్రుఁడు
తపస్య. స. వ్రతచర్య
తపస్యము. స. ఫాల్గునమాసము
తపస్వి. స. తపముచేయువాఁడు, కనికరింపఁదగినవాఁడు
తపస్విని. స. తాపసురాలు, కటుకరోహిణి, జటామాంసి
తపస్సు. స. తపము
తపారము } దే. తలను జుట్టుకొనువస్త్రము,
తపాసు } ఒకదినుసు కుళ్లాయి
తపించు. స. తపస్సుచేయు, తాపమునొందు
తపితము }
తప్తము } స. కాల్పఁబడినది
తపోధనుఁడు. స. తపస్సే ధనముగాఁగల వాఁడు, తపస్వి
తప్త. స. తపింపఁజేయఁబడినది, కాచఁబడినది
తప్ప. దే. గింజపట్టనిధాన్యము, వినా
తప్పకాయ. దే విత్తుపట్టనికాయ
తప్పచూచు. దే దయలేకపోవు
తప్పరించు. దే. తప్పించుకొను, భంగపెట్టు
తప్పించు. దే. విడిపించు
తప్పిదము. దే. దోషము
తప్పు. దే. తప్పు, తప్పిపోవు
తప్పు. త. తప్పుచేయు, అతిక్రమించు, తప్పిదము
తప్పుడు. త. తప్పుట
తప్పుడువడు. దే. తప్పుపడు, సరితప్పు
తప్పుదల. దే. తప్పుట
తప్పుదారి. త. తప్పుత్రోవ
తప్పుదెబ్బలు. దే. బళ్లయందు ప్రొద్దుపోయి వచ్చినందులకై వచ్చిన క్రమముఁబట్టి పిల్లకాయలను పంతులుకొట్టెడు ఒకటి రెండు మొదలగుదెబ్బలు, సిరిమొక్కలు
తప్పెట. త. చర్మవాద్యవిశేషము
తబక. దే. తుచ్ఛధాన్యము
తబము. త. తపము, తపస్సు
తబిసి. త. తపస్వి
తబుకు. దే. తములపాకుతట్ట, లేక పళ్లెము
తబ్బిబ్బు. దే. తడఁబాటు, విపర్యయము
తమంగము. స. మంచె
తమకపడు. దే. త్వరపడు, మోహపడు
తమకము. దే. త్వర, మోహము, సంభ్రమము
తమకి. దే. త్వరగలవాఁడు, మోహముగలవాఁడు
తమకించు. దే. త్వరపడు, చలించు
తమకు. దే. చలించు, విధము
తమగము. త. మంచె, మంటపము
తమటము. స. తప్పెట
తమము. స. చీఁకటి, ఒకగుణము, శోకము, రాహుగ్రహము
తమరము. స. తగరము
తమస్విని. స. రాత్రి
తమస్సు. స. చీఁకటి, ఒకగుణము
తమాయించు. దే. స్తిమితమగు, ఆఁగు, సహించు
తమాలపత్త్రము. స. బొట్టు, మకరికాపత్త్రము, చీఁకటిమ్రాను
తమాలము. స. బొట్టు, కత్తి, ఉలిమిరిచెట్టు, చీఁకటిమ్రాను

తమి. దే. త్వర, కుతూహలము, అపేక్ష, వలపు, మోహము
తమి. స. రాత్రి, చీకటి
తమిఁద. దే. రాగిపైరు
తమిఁదలు. దే. రాగులు, చోళ్లు
తమికొను. దే. త్వరపడు, కుతూహలపడు, అపేక్షపడు, మోహపడు
తమిరె. దే. కాఁడినడిమిచీల
తమిస్ర. స. చీకటిరేయి, చిమ్మచీకటి
తమిస్రము. స. చీకటి, కోపము
తముకు. దే. చాటించెడుభేరి, తుడుము
తములపాకు / తములపుటాకు. దే. నాగవల్లీదళము
తములము. త. తాంబూలము
తమోపహుఁడు. స. సూర్యుఁడు, చంద్రుఁడు, అగ్ని
తమోమణి. స. మెఱుఁగుడుఁ బురుగు
తమ్మ. దే. చర్విత తాంబూలము, తంబళీఁగ
తమ్మంటు. దే. కుండలము
తమ్మకళ. దే. తాంబూలపుమడక
తమ్మటము. స. తమటము, తప్పెట
తమ్మతసుకు / తమ్మపడిగ / తమ్మపడిగము. దే. పతద్గ్రహము, తాంబూలము ఉమియు పాత్ర
తమ్మళ. దే. తంబళ
తమ్మళి. దే. తంబళి
తమ్మి. దే. వృక్షవిశేషము
తమ్మి. త. పద్మము, పద్మవ్యూహము
తమ్మికంటి. దే. కమలములవంటి కన్నులు గలయాఁడుది, ఆఁడుది. విష్ణువు
తమ్మికెంపు. దే. పద్మరాగమణి
తమ్మిచూలి. దే. బ్రహ్మ
తమ్మిచెలి. దే. సూర్యుఁడు
తమ్మిదీవి. త. పుష్కరద్వీపము
తమ్మిదొర. దే. సూర్యుఁడు
తమ్మిపగతుఁడు. దే. చంద్రుఁడు
తమ్మిపుట్టు. దే. బ్రహ్మ
తమ్మియ. దే. చెవితమ్మె, పలుపుతమ్మె
తమ్మియింటికలికి. దే. లక్ష్మి
తమ్ముఁడు. దే. వెనుకఁ బుట్టినవాఁడు
తమ్ముపెండు. దే. తమ్ములగుంపు
తమ్ములపగవాఁడు. దే. చంద్రుఁడు
తమ్ములము. త. తాంబూలము
తమ్ములవిందు. దే. సూర్యుఁడు
తమ్మువాఁడు. దే. తమ్ముఁడు
తమ్మె. దే. చెవియొక్క అడుగుభాగము, పశువులమెడనుతగిలించెడు పలుపుయొక్క ముందుభాగము
తమ్మెట. దే. ఒకవిధమగుతప్పెట
తమ్మెట్లు. దే. పోఁగులు
తరంగము. స. అల, దుముకు, గంతు, ఒక గ్రంథభాగము, కదలుట
తరంగిణి. స. నది
తరండము. స. ఓడ, ఏరుదాఁటెడిపుట్టి, గాలపుదారముకట్టిన కొయ్య లోనగు నది
తరఁగ. త. అల
తరకటించు. త. తర్కించు
తరకటింపు. త. తర్కము
తరకసము / తరకసా. దే. అమ్ముఁబొది, తూణీరము
తరక్షువు. స. సివంగి
తరగంపియ / తరగంపె. దే. ఒకదినుసు అంపము
తరగతి. దే. తరమును జెలిపెడుభాగము

తరగతిగుండ్లు. దే. మెడనుంచుకొనునగ
తరణము. స. దాఁటుట, ఓడ
తరణి. స. ఓడ, దాఁటుట, పిన్నగోరంట మొక్క, సూర్యుఁడు, సముద్రము
తరణోపాయము. స. ఆధారము, సాధనము
తరపరము. దే. క్రమముగా, పరంపరగా
తరపణ్యము. స. ఓడనడపువానికిచ్చెగు కూలి, కేవు
తరపు. దే. పోఁగొట్టు, హరించు
తరబడి. దే. తరము
తరమిడి. దే. శీఘ్రము, అత్యంతము
తరము. దే. పురుషాంతరము, మానము, సామ్యము, వరుస, దినుసు, శక్యము, సమానము, ఇద్దఱుమోయు బరువు
తరము. స. దాఁటుట
తరలించుకొను. దే. తీసికొను
తరలిక. దే. ప్రయాణము
తరలు } దే. ప్రయాణముగు
తర్లు }
తరవరి } త. పట్టాకత్తి
తరవలి }
తరవాణి. దే. పుల్లనీళ్లు
తరవాయి. దే. సమయము, ఉపక్రమము, అనుక్రమము, తడవ
తరవారి. స. కత్తి, పట్టాకత్తి
తరసము. స. మాంసము
తరస్వి. స. బలిమిగలవాఁడు, వడిగలవాఁడు, పెద్దపులి
తరస్సు. స. బలిమి, వడి
తరళము. స. హారమధ్యరత్నము. చలించే నది, ప్రకాశించునది
తరళితము. స. చలించినది
తరళేక్షణ. స. చలించే కన్నులుగలఆఁడుది, ఆఁడుది

తరాజు } దే. త్రాసు
తరాసు }
తరి. త. త్రచ్చుట, మథనము, వెన్నచిలుకుట
తరి. స. ఓడ, మబ్బు, పొగ
తరించు. స. నది మొదలగువానిని ఓడ లోనగు సాధనములచే దాఁటు, ముక్తుఁడగు
తరికాఁడు. త. త్రచ్చువాఁడు
తరిగంబము. త. పెరుఁగుత్రచ్చెడు స్తంభము, చల్లరాడు, కుటరము
తరిగడవ. త. పెరుగుత్రచ్చెడు కుండ
తరిగల. దే. విశేషము వెన్నగల
తరిగలా. దే. వెన్న చాల వచ్చునట్టిపాలు గల యావు
తరిగొండ. త. మంథాద్రి
తరిగొఱ్ఱు. దే. ఒకదినుసు కూరాకు
తరిగోల. దే. కవ్వము
తరిచేల్ల. దే. తియ్యనిమజ్జిగ
తరిచుట్టు } దే. పెరుఁగు దేవతలకునివేదనముచేయు
తరిపట్టు }
తరిటి } దే. రెండుపెండెలు బిగించుగోనెపట్ట
తరిటీ }
తరితవ్యము. స. దాఁటఁదగినది
తరితీపు. దే. ఉపేక్ష, ఉద్ధృతి, ప్రేమ, ఆలస్యము, అడియాస
తరితీపుసేయు. దే. గర్వించు, ఉపేక్షించు, ప్రీతిచేయు
తరిత్రాడు. దే. కవ్వమునకుఁ జుట్టి త్రిప్పెడు త్రాడు
తరిదాలుపు } దే. విష్ణువు
తరిదాల్పు }
తరివట్టు. దే. దేవతలనుద్దేశించి పెరుఁగును త్రచ్చక నిలుపు

తరీషము. స. పడవ, తెప్ప, సముద్రము, స్వర్గము, పని, వృత్తి, అలంకారము, ఏఱుపిడక

తరీషుఁడు. స. తగినవాఁడు

తరుచే. త. చిలుకు, మథించు

తరుణము. దే. సమయము

తరుణము. స. కుబ్జపుష్పము, ఆముదపుఁ జెట్టు, యౌవనముగలది, క్రొత్తది, లేఁతది

తరుణి. స యౌవనముగల ఆఁడుది, ఆఁడుది

తరుణిమ. స. యౌవనము

తరుణుఁడు. స. యౌవనముగలవాఁడు

తరువడి. దే. తఱిమెన, మ్రానుచిలుకుట

తరువాయి, తర్వాత } దే. అనంతరము, మిగత

తరువు, తరుము } దే. ఇయ్యవలసిన ధనాదికము నిమ్మని చేయునిర్బంధము

తరువు. స. చెట్టు

తరువుకత్తె. దే. తరువువచ్చినది

తరువుకాఁడు. దే. తరువువచ్చినవాఁడు

తర్కణము. స. ఊహించుట

తర్కము. స. ఊహ, అధ్యాహారము, కారణము, కోరిక, ఒకశాస్త్రము

తర్కారి. స. తక్కిలిచెట్టు

తర్కించు. స. తర్కముచేయు, సందేహించు

తర్కితము. స. ఊహింపఁబడినది, సందేహింపఁబడినది

తర్కుటము. స. నూలువడుకుట

తర్కులాసకము. స. నూలు వడుకునప్పుడు కదురు క్రిందనుంచేకొనెడు చిప్ప

తర్కువు. స. నూలువడికెడు కదురు

తర్చు. త. తరుచే

తర్జనము. స. అదలుపు

తర్జని. స. జేట్టనవ్రేలు

తర్జించు. స అదలించు

తర్దువు. స. త్రెడ్డు

తర్ణకము. స. అప్పుడు పుట్టినదూడ

తర్తనికము. స. కాకిగూఁడు

తర్పణము. స. తృప్తి, తనివి, పితృదేవతలకై నీళ్లువిడుచుట

తర్పితము. స. తృప్తిపఱుపఁబడినది

తర్మము. స. యూపస్తంభపుకొన

తర్షణము. స. దప్పిగొనుట

తర్షము. స. దప్పి, ఇచ్ఛ

తర్షితుఁడు. స. దప్పిగొన్నవాఁడు

తఱక. దే. గింజెపట్టనిధాన్యము

తఱచే. దే. బాహుళ్యము, అధికము

తఱటు. దే. కళతోకొట్టు, కళ, మౌర్ఖ్యము, మూర్ఖము, తాడించే

తఱటుగొను, తఱటుసేయు } దే. కళతోకొట్టు

తఱటువెట్టి. దే. గొప్పమూఢుఁడు, మూర్ఖము

తఱతఱ. దే. తత్తఱ

తఱతఱలాడు. దే. తత్తఱపడు

తఱపి. దే. ఆఱునెలలదూడ, తారుణ్యము, తరుణము

తఱపియావు. దే. బహుకాలమునకు ముందీనినయావు

తఱలు దే. చలించే, సంభ్రమించే,విడుచే

తఱలుచే, తఱల్చు } దే. తఱలఁజేయు

తఱి. దే. సమయము, సమీపము, త్రాడు లోనగువానియొత్తుడు రేఖ

తటిగొను. దే. యత్నించు

తటిగొల్పు. దే. ప్రేరేపించు

తటిమెన. దే. మ్రానుచిలుకుట

తటిమెనఁబెట్టు. దే. మ్రానుచిలుకు

తటియఁబడు. త. తటియు

తటిసారు. దే. సమీపించు

తటిరాయు. త. అతిక్రమించు, దాఁటు

తటివడు. దే. ఒత్తుడుపడు

తఱుఁగు. దే. తగ్గు, క్షయించు

తఱుగరి. దే. తఱుగుబేరకాఁడు

తఱుగాకు. దే. కొయ్యకూర

తఱుగు. దే. ఖండించు, -ంచు, బేరమును పొందించువానికి నూటికింతయనిఇచ్చు ద్రవ్యము

తఱుచు. దే. తఱచు

తఱుపు. దే. ఏడాది వయసుచెల్లిన ఆఁడు దూడ, మణివిశేషము

తఱుము. దే. కవియు, త్వరితపడు, వెంబడించి పరుగెత్తించు, బలాత్కరించు, తటిమెనఁబెట్టు

తఱులమెకము / తఱులమోరమెకము } దే. కోఁతి

తఱులు. దే. పశులు

తఱువు. దే. తగ్గు, ఖండించు

తఱుసలి. దే. ఉద్ధతుఁడు

తఱ్ఱి / తఱ్ఱు } దే. సెచుఁడు

తల. దే. శిరసు, శిరసువెండ్రుకలు, కొన, పూనిక, ఎత్తు, మునిమిభాగము, [illegible]ము, ఎడ, సమయము, మొదలు

తల. త. చోటు, రంగము, పక్షము

తలంటు. దే. తలయంటు

తలఁకించు. దే. చలించు, తలఁగఁజేయు

తలఁకు. దే. చలించు, భయపడు, చలనము, భయము

తలఁగు. దే. తొలఁగు, తొలఁగించు

తలఁగుడు. దే. తొలఁగుట

తలఁచు. దే. ఎంచు, ధ్యానించు, స్మరించు, యోచించు, ఊహించు, ఉద్దేశించు

తలఁడు. దే భయము, చలనము

తలఁపు. దే. తలఁచుట,అభిప్రాయము,కోరిక, చింత, జ్ఞప్తి, హృదయము, ఊహ

తలఁపుచేయు. దే. ఎంచు, భావించు

తలఁపుచూలి. దే. మన్మథుఁడు,భావజుఁడు

తలఁపుమిన్న / తలఁపుతాయి } దే. చింతామణి

తలఁపుసాకిరి. దే. ఈకార్యము నీవెఱిఁగి యుండుమని పలుమాఱు వాదిచే తెలిపింపఁబడినసాక్షి, స్మారితుఁడు

తలఁబ్రాలు. దే. వివాహకాలమందు వధూవరులు దోసిళ్లతో తలమీఁదఁబోసి కొనెడు నక్షతలు

తలకట్టు. దే. అకారముయొక్క రూపాంతరము, పాగ, పాగకట్టుట, కిరీటము, శ్రేష్ఠుఁడు, శ్రేష్ఠమైనది, ముఖ్యము, తలమీఁది వెండ్రుకలు

తలకడచు. దే. తలమీఱు, అతిక్రమించు

తలకప్పు. దే. కప్పపిల్ల

తలకము. స. పెద్దచెఱువు

తలకాఁడి. దే. బరువుఅధికమై రెండెద్దుల కంటె హెచ్చుగా కట్టవలసినపుడు సంతనచేసి మొదటికాఁడికి ముందుకట్టెడు మఱియొక కాఁడి, ప్రాంసగము

తలకాయ. దే. తల, శిరము

తలకూడు. దే. సిద్ధించు

తలకూర్చు. దే. సిద్ధింపఁజేయు

తలకెడవు. దే. తలక్రిందు

తలకొట్లమారి. దే. శిరశ్ఛేదనము పొందిన వాఁడు, అవినీతుఁడు

తలకొను. దే. కలఁగు, యత్నించు, తొల్చు, వహించు, పాటుమరించు, వ్యాపించు

తలకొనవించు. దే. తలకొను, కలుగు

తలకొఱివి. దే. అపరకర్మముచేయువాఁడు, శవము తలక్రిందనుంచెడి నిప్పు

తలకొలుపు } దే. తలకొనఁజేయు, సంధాన
తలకొల్పు } పఱచు

తలకొవ్వు. దే. మదించు, మూర్ఖముగా నుండు, మదము

తలకోల. దే. సాధువుకానియావునుపిదుకునపుడు కొనను త్రాడుకట్టి దానికొమ్ములకు తగిలించి పట్టుకొనెడుకోల

తలకోలు. దే. తలకొనుట

తలక్రిందు. దే. అధోముఖము, విలోమము

తలగడ. దే. పండుకొనునపుడు తలయుంచుకొనెడిదిక్కు, తలక్రింద ఎత్తుగానుంచుకొనెడి నిడుపాటిదిండు

తలగడుగు. దే. తలంటు, అభ్యంగము

తలగాము. దే. రాహుగ్రహము

తలగుంజ. దే. ఇంటికివేసెడు నిట్రాడు

తలచించు. దే. కాగితముయొక్క పైభాగము చించు

తలచీదఱ. దే. తలనొప్పి

తలచీల. దే. ఏతపు మీటనుమనసనుజేర్చి బిగించెడుచీల

తలచేమురు. దే. నూనె

తలచావడి. దే. ఇంటిముందఱిచావడి

తలచుంచు. దే. ముందఱినెత్తిజుట్టు

తలచుట్టు. దే. పాగచుట్టుట, పాగ, తలగుడ్డ

తలచూపు. దే. పొడచూపు, తోఁచు

తలడించు. దే. తల్లడించు

తలడిల్లు. దే. తల్లడిల్లు

తలతల. దే. మనుష్యునికి మనుష్యునికి, ప్రతి మనుష్యునికి

తలతిక్క. దే. తలనొప్పి, పిచ్చి. గర్వము

తలత్రాడు. దే. ఎద్దుకొమ్ములకుఁ గట్టెడు త్రాడు

తలదన్ను. దే. మీఱు, అతిశయించు

తలదువారము. దే. తలవాకిలి

తలనట్టు. దే. వేరుపురుగుకొఱికి మోవు లెండుట

తలనొప్పి. దే. తలలోనినొప్పి, అసూయ, కలహకారణము

తలపడు. దే. ప్రారంభించు, ఏర్పడు, ఎదిరించు, తాఁకు

తలపాటు. దే. తలపడుట, ప్రారంభము, ఎదిరించుట

తలపించు. దే. జ్ఞప్తికిఁ దెచ్చు, పోలు, ప్రోత్సాహముచేయు

తలపెట్టు. దే. ప్రారంభించు, ప్రస్తావించు

తలపొలము. దే. పొలిమేర వెంబడినున్న పొలము

తలపోఁత. దే. చింత, ఆలోచన, విచారము

తలపోయు. దే. తలఁచుకొను, చింతించు, ఆలోచించు, విచారించు

తలబిరుసు. దే. మూర్ఖము

తలబీకనకాయ } దే. కలఁతనొందినది
తలబీకరకాయ }

తలమాటు. దే. చేటు, నాశము

తలమానికము. దే. అలంకారార్థము శిరమునం దుంచుకొనెడురత్నము, శ్రేష్ఠము

తలమించు. దే. ముందుమించు

తలమిగులు. దే. ముందుమిగులు

తలమీఱు. దే. ముందుమీఱు

తలము. దే. ఏతము, శక్యము, తరము

తలము. స. వింటిదెబ్బ తగులకుండ చేతికి తొడుగుకొనెడి అత్తెము, అడవి, కారణము, పాతాళలోకము, స్వరూపము, క్రిందిభాగము, కాళ్లచేతుల క్రింది భాగము, తాటిచెట్టు, చాఁచినవ్రేళ్లుగల అఱచేయి, కత్తియొక్కపిడి, ఎడమచేతితంతిమీటు, సమప్రదేశము

తలముదప్పు. దే. అశక్యమగు, మేరమీఱు

తలమునుక } దే. శిరస్స్నానము, శిరఃప్రమాణము, తలబంటి
తలమునక }

తలమునుకలు. దే. హాని, బాధ

తలముళ్లు. దే. వేఁటకాని సాధనములు, దొంగయొక్క సాధనములు

తలయంటు. దే. తలకునూనెరాచు, తలకునూనెరాచుట, అభ్యంగనము

తలయంపి. దే. పండుకొనునపుడు తలయుంచుకొనెడుదిక్కు, తలగడ

తలయెత్తు. దే. వర్ధిల్లు, మొలచు

తలయేఱు. దే. ఆకాశగంగ, తలనొప్పి

తలరు. దే. చలించు, చింతించు, కలఁగు, సంభ్రమించు, ఒప్పు

తలవంపు. దే. తలవంచుట, మానభంగము

తలవరి. త. తలారివాఁడు

తలవాకిలి. దే. ఇల్లులోనగువాని మొదటి ద్వారము

తలవిడి. దే. తలనఱికిన తాటిచెట్టులోనగు తృణద్రుమముయొక్క తలగుండు

తలవీఁడు. దే. పురఃప్రదేశము, సమీపప్రదేశము

తలవు. దే. తొలఁగు

తలసాల. దే. ఇంటితలవాకిలి

తలా. దే. చెఱి, ప్రతిమనుష్యునకు

తలాఁపి. దే. తలయంపి

తలాటము. దే. గుఱ్ఱమునెత్తిని నిలువుగా నమర్చెడు తురాయి

తలాడ. దే. తలగడ

తలారి. త. రాత్రులయందు దొంగతనము జరుగకుండ కావలికాచు దొరతనపు బంటు

తలారించు. దే. మరలు

తలారిదొర. దే. కొత్వాలు

తలి. దే. తల్లి

తలికె. దే. ముందు

తలిమము. స. దూదిపఱపు, మేలుకట్టు, ఱాతికట్టనపు నేల, కత్తి, మృదువు

తళియ. త. భోజనపాత్రము

తలిరు. దే. చిగురు, పల్లవము

తలిరుఁబోఁడి. దే. చిగురువలె మనోజ్ఞ రాలగు నాఁడుది, ఆఁడుది

తలిరుచు } దే. చిగిరించు, సంతోషించు, అతిశయించు
తలిర్చు }

తలిరుదిండి. దే. కోయిల

తలిరు } దే. తలిర్చుట, చిగుర్చుట
తలిర్పు }

తలిరువిలుతుఁడు } దే. మన్మథుఁడు
తలిరువిల్తుఁడు }

తలివము. త. శయ్య

తలుకు. దే. తళుకు

తలుగు. దే. పశువులను కట్టెడుపలుపు, సందానము

తలుపు. దే. పనిచేసినవాకిటిమూఁతపలక

తలోదరి. స. ఆఁడుది

తల్గడ. దే. తలగడ

తల్గు. దే. తలుగు, తొలఁగించు

తల్పకుఁడు. స. పఱుపులు మొదలైనవి వేయు సేవకుఁడు, వ్యభిచారి

తల్పనము } స. ఏనుఁగుయొక్క వీఁపు
తల్పలము }

తల్పము. స. దూదిపఱుపు, భార్య, అట్టడి

తల్లఁపి. దే. తలాఁపి

తల్లకుడవు. దే. తలకెడవు

తల్లక్రిందు. దే. తలక్రిందు

తల్లజము. స. శ్రేష్ఠము

తల్లడకుడుచు. దే. తల్లడించు

తల్లడపడు. దే. చలించు

తల్లడపాటు. దే. తల్లడపడుట, చలనము

తల్లడపెట్టు. దే. చలింపఁజేయు, బాధపెట్టు

తల్లడము. త. చలనము, బాధ

తల్లడించు } త. చలించు, బాధనొందు
తల్లడిల్లు }

తల్లము. స. చెఱువు, గోయి

తల్లి. దే. జనని, మొదటిది, ముఖ్యము

తల్లి. స. జవరాలు

తల్లికొండ్ర. దే. మొదటికొండ్ర

తల్లిగోడ. దే. ఇంటికి ముఖ్యమైన ప్రక్కగోడ

తల్లితల్లి. దే. తల్లినిగన్నతల్లి, లక్ష్మి

తల్లియొఱ. దే. నూతిపైయొఱ

తల్లివేరు. దే. ముఖ్యమైనవేరు

తవక్షీరము. స. వెదురుపుండిగాని గోదుమ బియ్యమునుండిగాని తీయఁబడు గింజల వంటిసారము

తవన. దే. క్లుప్తకాలము, నిర్ణయకాలము

తవరము. దే. తగరము

తవళి. దే. అసత్యము

తవాయి. దే. చెఱువులోని చిన్న చిన్న అలలు, యుద్ధము, ఉపద్రవము

తవిస. దే. రాగిపైస

తవిదలు } దే. రాగులు, చోళ్లు
తవ్విఁదలు }

తవు. దే. తగు

తవుటిపాము. దే. మలుఁగుఁజేఁప

తవుడు. దే. బియ్యముమీఁది సన్నపొట్టు

తవులఁబడు. దే. తగులఁబడు

తవులు. దే. తగులు, చిక్కు, సక్తమగు, తగులము, ఆక్రమణము

తవులుకొను. దే. తగులుకొను

తవులుకొలుపు. దే. తగులుకొనఁజేయు

తవులుచు } దే. తగులుచు
తవులుచ్చు }

తవులువడు. దే. తగులువడు

తవెల. దే. నోరువెడల్పుగానుండు కుండవంటి లోహపాత్రము

తవ్వ. దే. మానికలోని సగముప్రమాణము

తష్ట. స. వడ్లవాఁడు

తష్టము. స. బాడిసలోనగువానిచే చెక్కఁబడినది

తసి. దే. దట్టమగునాఱువరుస, సడ

తసుకు. దే. ప్రేమకలిగినట్టు చేష్టించు, ప్రేమకలిగినట్టు చేయుచేష్ట, టక్కు

తసుకులాఁడి. దే. తసుకులుగలది

తస్కరత. స. దొంగతనము
తస్కరి. స. కామముగల స్త్రీ
తస్కరించు. స. దొంగిలించు
తస్కరుఁడు. స. దొంగ, చోరుఁడు
తస్స. దే. దుర్మాంసము, కొవ్వు
తహతహ. దే. తమకము, వ్యాకులము
తహతహపడు. దే. కుతూహలపడు
తహతహపెట్టు. దే. కుతూహలపఱచు
తళతళ. దే. మిఱుమిట్లుగొలుపు కాంతి, మెఱయుటయందగు ననుకరణము
తళిగ. త. భోజనపాత్రము, భగవన్నివేదనార్థమైనయన్నము, వంట
తళియ. త. తళిగ
తళుకు. దే. మిక్కిలిప్రకాశము
తళుకొత్తు } దే. మిక్కిలిప్రకాశించు
తళ్కొత్తు }
తళుక్కు. దే. మెఱయుటయందగు ననుకరణము
తళ్లు. దే. చెఱువులోనగు వానియందు గాలిచేత ఉబికి దరినికొట్టెడు చిన్నచిన్న అలలు

## తా

తా. దే. తానుఅనుదానికి ప్రాతిపదికము
తాండవము. స. ఉద్ధతమైననృత్యము
తాండవించు. స. ఉద్ధతముగా నృత్యము చేయు [తాండ్ర
తాండ్ర. దే. విభీతకవృక్షము, మామిడి
తాండ్రపుపుసుగు. దే. నాలెపురుగు
తాంతము. స. బడలినది
తాంతి. స. బడలిక
తాంత్రికము. స. తంత్రసంబంధమైనది
తాంత్రికుఁడు. స. తంత్రము నెఱిఁగినవాఁడు, విషవైద్యుఁడు, శాస్త్రజ్ఞుఁడు, మోసగాఁడు
తాంబాళము. దే. ఇత్తడిలోనగువానితోఁ జేసిన పెద్దపళ్లెము, లేక తట్ట
తాంబూలము. స. వక్కాకు, పోఁక
తాంబూలవల్లి } స. తమలపాకుతీఁగ
తాంబూలి }
తాంబూలికుఁడు. స. తమలపాకు లమ్మువాఁడు
తాఁకించు. దే. శ్రమపఱచు, తాఁకఁజేయు
తాఁకు. దే. మార్కొను, అంటు, యుద్ధమందుముట్టు, తాఁకుట
తాఁకుడు. దే. తాఁకుట, స్పర్శము
తాఁకుడువేఁకి. దే. వరుసమేరకు వచ్చెడు జ్వరము
తాఁకుదల. దే. యుద్ధప్రారంభము
తాఁగలి. దే. పల్లపుమడి
తాఁచు. దే. తన్ను
తాఁట. దే. చెట్టుపైపట్టు, మోసము
తాఁటకత్తె. దే. మోసకత్తె
తాఁటదమ్మఁడు. దే. జీవనార్థము సన్న్యాసివేషము ధరించినవాఁడు, లింగి
తాఁడి. దే. విభీతకవృక్షము
తాఁపు. దే. తన్ను, పాదతాడనము
తాఁబేలు. దే. తాఁమేలు, కూర్మము
తాకట్టు. దే. అప్పుతీసికొన్నవానియొద్ద నుంచెడు బదులువస్తువు
తాకు. దే. కాలిటాకు
తాగడించు. దే. నిర్బంధించు

తాగాఁడి / తాగాశి } దే. కాలువంచి నీళ్లతో దూను టకు పైపైకెత్తఁబడెడు ఱాటిపలక, లేక కొయ్య

తాగు. దే. నీళ్లు మొదలగునవి త్రాగు

తాగుఁబోతు. దే. నిర్ణయము లేక మద్య పానముచేయుస్వభావము గలవాఁడు

తాచే. త. చెక్కు, ఖచించే, తొలచే, అవలంబించు

తాజే. దే. కుళ్లాయి

తాటంకము. స. చెవికమ్మ

తాటదూటము. దే. చక్కనతప్పినది

తాటించు. త. కొట్టు, దొడలుకదలించు

తాటికట్టెడ. దే. తాటిగిఱిపాము

తాటిగిఱిపాము. దే. తాఁటిచెట్టుమీఁద నుండెడిపాము

తాటిపడగవాఁడు. దే. బలరాముఁడు, భీష్ముఁడు

తాటిరిక్క. త. జ్యేష్ఠానక్షత్రము

తాటిరిక్కనెల. దే. జ్యేష్ఠమాసము

తాటోటు. దే. టక్కు, మోసము, మోస గాఁడు

తాడఘు. స. సుత్తె

తాడనము / తాడము } స. కొట్టుట, దండించుట

తాడయమానము. స. కొట్టఁబడుచున్నది

తాడి. స. తాఁడిచెట్టు

తాడించే. స. తాడించే, కొట్టు

తాడితము. స. కొట్టఁబడినది

తాడు. దే. త్రాడు

తాడు. త. తాటిచెట్టు

తాత. దే. తండ్రికి తండ్రి, తల్లికితండ్రి

తాత. త. బ్రహ్మ

తాత. స. తండ్రి, కనికరించుకొనువాఁడు

తాత్పర్యము. స. అభిప్రాయము, ఉద్దేశము

తాత్కాలికదాత. స. అప్పుడేగానేయిచ్చు వాఁడు

తాత్కాలికము. స. ఆకాలమునకు సంబంధించినది, తత్క్షణము

తాత్త్వికత్వము. స. ఒకవిధమగుతర్కము

తాత్త్వికము. స. నిజమైనది, తత్త్వసంబంధమైనది, ముఖ్యమగునది

తాత్పర్యము / తాత్కారము / తాత్సార్యము } స. అలక్ష్యము, ఆలస్యము, కాలయాపనము, తిరస్కారము

తాదృశము. స. అటువంటిది

తానకము. త. చెట్లుకూర్చుండుటయందలి భేదము, స్థానము

తానము. త. స్నానము, స్థానము

తానము. స. తన్నకారముతో పాడెడుపాట

తానవము. స. తనుత్వము

తాను. దే. తాశబ్దమునకు ప్రథమైకవచనము

తాప. దే. నిచ్చెన, మెట్టు

తాపనీయము. స బంగారుతోఁజేయఁబడినది

తాపనుఁడు. స. సూర్యుఁడు

తాపము. స. సంతాపము, బాధ

తాపసతరువు. స. గారచెట్టు

తాపసుఁడు. స. తపస్సుచేయువాఁడు,తపసి

తాపి. దే. మర్మము, జోడ

తాపి / తాపీ } త సున్నపుగచ్చుచేయుసాధనము, కానెవాఁడు, బేలుదారి, చెక్కుతాపి

తాపించు. త. నెలకొలుపు, నిలుపు, చెక్కు, మోఁదు

తాపింఛము. స. చీఁకటిమ్రాను

తాపికత్తియ / తాపికత్తె } దే. సంధానము చేయునది

తాపికాఁడు. దే. సంధానము చేయువాఁడు

తాపిత / తాపితా } దే. మేలైనపట్టువస్త్రము

తాపితము. స. తపింపఁజేయఁబడినది, కాల్పఁబడినది, బాధింపఁబడినది

తాపు. త. చెక్కు, అవలంబము

తాబందు. దే. పావడ, గాగర

తామర. త. తామరపువ్వు, కమలము, ఒకానొకచర్మజాడ్యము

తామరచెలి. దే. సూర్యుఁడు, పద్మమిత్రుఁడు

తామరతంపము / తామరతంపర } దే. తామరల సమూహము, అభివృద్ధి

తామరతూపరి. స. మన్మథుఁడు

తామరపాకు. దే. పద్మపత్త్రము

తామరము. స. నీళ్లు, నేయి

తామరసము. దే. తామర, బంగారు, రాగి

తామలకి. స. నేలయుసిరికచెట్టు

తామసము. దే. ఆలస్యము

తామసము. స. పాము, తమోగుణముగలది అజ్ఞానము, దుష్టము, చీకటి

తామసి. స. చీఁకటి, పార్వతి, తమోగుణయుక్తుఁడు

తామసించు. దే. ఆలస్యము చేయు

తామసుఁడు. స. తమోగుణముగలవాఁడు, దుష్టుఁడు, ఓర్వలేనివాఁడు

తామిస్రము. స. చీఁకటి, చీఁకటిమయమైన నరకము

తామేలు. దే. తాఁబేలు

తామ్రకుట్టకుఁడు. స. రాగిపనివాఁడు

తామ్రచూడము. స. కోడి, అభినయహస్తవిశేషము

తామ్రపర్ణి. స. ఒకానొకయేఱు

తామ్రము. స. రాగి, ఎఱుపు, ఎఱ్ఱనిది

తామ్రాక్షము. స. కోయిల, ఎఱ్ఱనికన్నులు గలది

తాయము. దే. అరుదగువస్తువు

తాయి. త. తల్లి

తాయెతు / తాయెత్తు } దే. తల్లి బిడ్డలకు కట్టెడు రక్షాభూషణము

తార. దే. సుషిరవాద్యవిశేషము

తార. స. బృహస్పతిభార్య, వాలిభార్య, నక్షత్రము, కనుగ్రుడ్డు

తారక. స. కంటినల్లగ్రుడ్డు, నక్షత్రము

తారకజిత్తు. స. కుమారస్వామి

తారకము. స. కన్ను, ఆధారము, నక్షత్రము, కంటిపాప, ముత్యము, కష్టకాలమందు సాహాయ్యము చేయుట, తెప్ప

తారకాణ / తారకాణము } దే. దృష్టాంతము

తారకాణించు. దే. దృష్టాంతపఱచు, మూదలించు

తారకిణి. స. నక్షత్రములు గలరాత్రి

తారకితము. స. నక్షత్రములు గలది

తారకుఁడు. స. మాలిమికాఁడు, దాఁటించువాఁడు, ఒకానొక రాక్షసుఁడు

తారకేశ్వరుఁడు. స. చంద్రుఁడు

తారణ. స. ఒకసంవత్సరము, తరింపఁజేయునది

తారణము. స. తరింపఁజేయునది, కాపాడుట, తెప్ప, జయించుట, దాఁటించుట

తారణి. స. తెప్ప
తారతమ్యము. స. తరతమభావము, న్యూనాధిక్యము
తారము. దే. నాలుగుకాసులనాణెము
తారము. స. వెండి, ప్రలుఁగడిగినముత్యము, ప్రకాశమానమైనది, నదియొడ్డు, శ్రేష్ఠమైనది, గట్టిమ్రోఁత, నక్షత్రము, కంటిపాప
తారలుఁడు. స. కాముకుఁడు, విటుఁడు
తారసము. దే. సమీపము, సమీపించినది, తలపాటు
తారసించు. దే. తారసిల్లు, తారసమగు
తారసిల్లు<br>తారసిలు } దే. సమీపించు, వ్యాపించు
తారాచువ్వ. దే. ఆకాశమునకెగరెడుబాణసంచు
తారాడు. దే. తిరుగులాడు, జీరాడు
తారాపథము. స. ఆకాశము
తారాపీఁట. దే. ఎద్దువెన్నుమీఁద వేసెడుపీఁట
తారి. త. ఆటాడించెడు సూత్రధారి
తారితము. స. తరింపఁజేయఁబడినది
తారు. దే. సంచరించు, పోవు, కదియు
తారుకొను<br>తార్కొను } దే. కదియు
తారుకొలుపు<br>తారుకొల్పు } దే. కదియఁజేయు
తారుచు<br>తార్చు } దే. తారఁజేయు, కదియించు
తారుపు<br>తార్పు } దే. తార్చుట, బరణి
తారుణ్యము. స. యౌవనము, జవ్వనము
తారేయుఁడు. స. అంగదుఁడు, బుధుఁడు
తార్కవము. స. నేయఁబడినది, పడకఁబడినది
తార్కాణ<br>తార్కాణము } దే. దృష్టాంతము
తార్కాణించు. దే. దృష్టాంతపఱచు
తార్కికుఁడు. స. తర్కశాస్త్రము తెలిసినవాఁడు
తార్క్ష్యుఁడు. స. గరుత్మంతుఁడు, అనూరుఁడు
తార్ణము. స. గడ్డితోఁజేయఁబడినది, అగ్ని
తార్తీయము. స. మూఁడవది
తార్పులాడు. దే. పెంపుడుపొట్టేలు కోడి మొదలగువాని జగడమాడు
తార్పుకత్తియ<br>తార్పుకత్తె } దే. కుంటెనకత్తె
తార్యము. స. తరింపఁ దగినది
తాఱు. దే. అడఁగు, మఱుఁగుపడు, దాఁగు
తాఱుమాఱు. దే. క్రమముతప్పుట, క్రమముతప్పినది, వ్యత్యస్తము
తాఱుమాఱుపడు. దే. వ్యత్యస్తమగు
తాలకి. స. తాటికల్లు
తాలధ్వజుఁడు. స. బలరాముఁడు, భీష్ముఁడు
తాలపర్ణి. స. మురయనియెడుగంధద్రవ్యము
తాలము. స. హరిదళము, చాఁపఁబడిన బొటనవ్రేలి నడిమివ్రేలి నడిమికొలఁత, తాటిచెట్టు
తాలాంకుఁడు. స. బలరాముఁడు
తాలి. దే. మంగళసూత్రము
తాలి. స. నేలయుసిరికమొక్క
తాలించు. దే. కూర మొదలగుదానిని తిరుగఁబోయు, తిరుగఁబోఁతపెట్టు
తాలింపు. దే. తిరుగఁబోఁత, తాలించిన కూర
తాలిక. దే. మెలిక
తాలిబొట్టు. దే. మంగళసూత్రపుబొట్టు

తాలిమి. దే. క్షమ, ధైర్యము

తాలిమికత్తె. దే. క్షమావంతురాలు

తాలిమికాఁడు. దే. క్షమావంతుఁడు

తాలిశము. స. పర్వతము

తాలీశివ. స. నేలయుసిరికమొక్క

తాలీసపత్త్రము. స. తాళిసపత్త్రి, నేలయుసిరిక

తాలు. దే. ఎన్ను తీసి ఎండిపోయినపైరు

తాలుచే } తాల్చు } దే. ధరించే, నూలు పురిఁబెట్టు, తిరికలుచేయు, దారములో నగువానిని పేను, పిండిలోనగు వాని యందలి మెతికలను చేటతో తట్టి యెత్తు

తాలువు. స. దవుడ

తాలూరము. స. సుడిగుండము

తాలూషకము. స. అంగిలి

తాల్మి. దే. తాలిమి

తావకాళు } తావకోళ్లు } దే. ఏతము తోడువాఁడు కాళ్లుంచుకొనుటకు నమర్చినపట్టెలు

తావకీనము. స. నీది, త్వదీయము

తావడము. దే. రుద్రాక్షలు లోనగునవి గ్రుచ్చినహారము, దండ

తావరము. స. వింటినారి

తావరము. త. స్థిరమైనది

తావలము. దే. స్థానము, ఆధారము, గృహము, రక్షకము

తావళము. దే. తావడము

తావారము. దే. స్తంభములమీఁదికి దించిన చోపా, పంచోది

తావి. దే. పరిమళము

తావిగట్టు. త. మలయపర్వతము

తావినూనె. దే. తావిగలనూనె, అత్తరు

తావిమోపరి. దే. గాలి, గంధవహుఁడు

తావివిలుకాఁడు. దే. మన్మథుఁడు

తావు. దే. గృహము, స్థానము, ఒకటావు కాగితము

తావుకొను. దే. నెలకొను, నిలుచే

తాస్కర్యము. స. దొంగతనము

తాళకము. స. హరిదళము, పర్వతధాతువిశేషము, తొగరిమన్ను, చిన్నబీగము

తాళగించే. త. లయకై తాళమువేయు

తాళగిరి. త. తాళమువేయువాఁడు

తాళపత్త్రము. స. తాటాకు, చెవ్వాకు

తాళము. దే. మల్లబంధవిశేషము

తాళము. స. బీగము, పాడునపుడు చేతులతో చఱచెడిచఱపు, తాడిచెట్టు, తాళమువేసెడు కంచువాద్యము, కత్తిపిడి, పాడునపుడు జరిగెడు కాలపరిమాణము

తాళమూలిక. స. నేలతాటిచెట్టు

తాళవృంతము. స. విసనకఱ్ఱ

తాళి } తాళీ } దే. పతకము, హారవిశేషము

తాళి. స. శ్రీతాళవృక్షము

తాళించే. దే. జోగమాడునపుడు క్రింద వేయుటకై చేత నుంచుకొని పాచికలను ఇటునటు త్రిప్పు

తాళిక. దే. క్షమ, ఓర్పు, చాలినది, క్షమము

తాళికగలవాఁడు. దే. ఆస్తికలవాఁడు

తాళిసపత్త్రి } తాళిసపత్త్రి } దే. ఒకానొక మందుదినుసు

తాళీకుఁడు. దే. కార్యమును ముగించేవాఁడు, కార్యకర్త

తాళు. దే. తాళికయగు, సహించే, నిదానించే

తాళుగొను. దే. తాళు

తాళ్వారము. దే. స్తంభములమీఁదికి దించిన చోపా, పంచోరి

## తి

తింట. దే. తినుట, భుజించుట

తిండి. దే. భోజనము, ఆహారము, తిను వాఁడు

తిండికత్తియ } దే. మిక్కిలి తినునట్టిస్వభావముగలది, భక్షకురాలు
తిండికత్తె

తిండికాఁడు. దే. మిక్కిలి తినునట్టిస్వభావముగలవాఁడు, భక్షకుఁడు

తిండిపోతు. దే. తిండికాఁడు, తిండికత్తె

తిండీఁడు. దే. తిండికాఁడు

తింత్రిణి } స. చింతచెట్టు
తింతిడి

తింత్రిణీకము } స. చింతపండు
తింతిడీకము

తిందుకము. స. తుమ్మికిచెట్టు

తికమక. దే. కలఁత, తొట్రుపాటు, అంగములయొక్క అస్వాధీనత

తికమకగొను } దే. తొట్రుపడు, అంగములుఅస్వాధీనతనుపొందు
తికమకలాడు

తిక్క. దే. పిచ్చి, త్రిక్క

తిక్కగొను. దే. వెఱ్ఱెత్తు

తిక్కటమక్కట. దే. కలఁత, క్షోభము

తిక్కడి. దే. నూలువడికెడు చిప్ప కదురు

తిక్కణిక. స. ఇటికపగడము

తిక్త. స. కటుకరోహిణి

తిక్తము. స. చేఁదిపొట్ల, చేఁదు, చేఁదైనది

తిక్తశాకము. స. ఉలిమిరిచెట్టు

తిగ. త. మూఁడు, త్రికము

తిగకంటి. దే. శివుఁడు

తిగటు. దే. వెక

తిగమంచె. దే. వాలుగు

తిగియు } దే. తివియు, ఆకర్షించు
తిగుచు

తిగ్మకరుఁడు. స. సూర్యుఁడు

తిగ్మము. స. వేఁడిమి, వేఁడిమికలది

తిట్ట. దే. రాశి, దిబ్బ

తిట్టాట. దే. తిట్టాడుట

తిట్టాడు. దే. తిట్టు

తిట్టు. దే. శపించు, నిందించు, శాపము, నింద

తిట్టుపోతు. దే. పనికిమాలిన మాటలతో తిట్టువాఁడుది

తిట్టువడు. దే. నిందింపఁబడు

తిట్టువాటు. దే. తిట్టువడుట, నింద

తిడిమి } దే. రక్తముపాఱునప్పటి స్రోఁతయందగు ధ్వన్యనుకరణము
తిడిమ్మి

తితఉవు. స. జల్లెడ

తితిక్ష. స. క్షాంతి, ఓర్పు

తితిక్షువు. స. క్షమించునట్టి స్వభావముగలవాఁడు, ఓర్పరి

తితీర్ష. స. దాఁటవలెననునిచ్ఛ

తిత్తి. త. ఒలిచికొలిమియూఁదుటకు అనువుగా నేర్పఱచినమేఁకతోలు, మృగములతోలు, తోలుసంచి, సంచి

తిత్తికాఁడు. దే. తిత్తిపోయువాఁడు

తిత్తిరి. స. తీతువుపిట్ట

తిథి. స. పాడ్యమిమొదలగునది, శ్రాద్ధదినము

తిథిపత్త్రము. స. పంచాంగము

తినాసము. త. నెమ్మిచెట్టు, తినిశవృక్షము

తినిశము. స. తినాసము

తిను. దే. భుజించు, అనుభవించు

తినుకు. దే. ముక్కి ముక్కి విష్ఠించు, ముక్కి ముక్కి విష్ఠించుట

దంటపిల్లలు. దే. కవలు

దంటమోములదేవర. దే. అగ్ని

దంటు. త. జొన్నలోనగువానికాఁడ

దండ. దే. సమీపము, ప్రాపు, ఎద్దుముడ్డి మీఁద ముల్లుకోలతో పొడువఁగా నేర్పడిన బొరుసు, ప్రక్క

దండ. త. హారము

దండకడియము. త. సందిదండ, కేయూరము

దండకము. స. వృత్తవిశేషము, అరణ్యవిశేషము, చెట్టుబోదె, మోసముగలది

దండకవిలియ. దే. ప్రాఁతలెక్కపుస్తకపుకట్ట

దండగోల. దే. ఊఁత, అవలంబము

దండచేయి, దండచే } త. సందిలి, ప్రగండము

దండచేప. దే. సందిటఁ గట్టుకొనెడు తోరము

దండదాసుఁడు. స. అప్పుదీర్పలేక సేవచేయు వాఁడు

దండధరుఁడు. స. యముఁడు, రాజు

దండధారకుఁడు. స. దండనాధికారి

దండనము. స. దండించుట

దండనాయకుఁడు. స. సేనాధిపతి

దండనీతి. స. కామందకాద్యర్థశాస్త్రము, రాజ్యాంగవిషయికమగు నీతిశాస్త్రము

దండనీయము. స. దండింపఁదగినది

దండపడు. దే. సమీపించు, ఎద్దుముడ్డిమీఁద ముల్లుకోలతో పొడువఁగా బొరుసుగా నేర్పడు

దండపాటు. దే. దండపడుట, సమీపించుట

దండపాణి. స. యముఁడు,పోలీసుబంట్రౌతు

దండపారుష్యము. స. కఠినశిక్ష

దండపాశికుఁడు. స. చోరోపద్రవములేక పట్టణమును గాపాడెడి యధికారి

దండప్రణామము. స. కట్టెవలె సాగిలఁబడి చేయు నమస్కారము

దండము. దే. నమస్కారము

దండము. స. దుడ్డుకఱ్ఱ, చతురుపాయములలో నొకటి, రాజశిక్ష, కాఁడ,కవ్వము, వాద్యమువాయించెడు కోదుపు, దండు, గర్వము, వధము, బార, గుఱ్ఱము, కప్పము, జేత, సమూహము

దండయాత్ర. స. దిగ్విజయము, యుద్ధయాత్ర

దండలాసకము. స. నృత్యవిశేషము, కోలాటము

దండవిష్కంభము. స. తరిగంబము

దండసరిమాటలు. దే. నిజమైనమాటలు

దండసిల్లు, దండసిలు } దే. ఇఱుకుకొను, అదుముడుపడు, అణఁగు

దండాట, దండాడింపు } దే. డేగాట, ఉల్లాసము

దండాధిపతి, దండాధిపుఁడు } స. న్యాయపుఁ దీర్పరులలో ముఖ్యుఁడు, సేనాధిపతి, ముఖ్యదండనాధికారి

దండాహతము. స. మజ్జిగ, కాలశేయము

దండి. దే. ప్రతాపము, శౌర్యము, ప్రతాపవంతుఁడు, శౌర్యవంతుఁడు, సమృద్ధము, గొప్ప

దండి. స. ఒకానొకకవి, యముఁడు, ద్వారపాలకుఁడు, దండముగలవాఁడు

దండించు. స. దండనముచేయు

దండిక. స. కిన్నెర, హారమునందలి పేట

దండితుఁడు. స. దండింపఁబడినవాఁడు

దండియ. త. కిన్నెర. పేరె, తంబుఱ, పల్లకి బొంగు, త్రాసుకోల

దండియము. త. వస్త్రములు ఎండవేయుటకు లోనగువానికిఁ గాను అడ్డముగా కట్టెడు వెదురుకఱ్ఱ, లేక దారము, గరిడిసాధనములలో నొకవిధము

దండు. త. సేన, సమూహము

దండుఁడు. స. సూర్యునిప్రక్కనుండు వారలలోనొకఁడు, యముఁడు

దండుగ } త. రాజు బలాత్కారముగా
దండుగు } పుచ్చుకొనెడు ధనము, అధికారి యపరాధమునకుఁగాను పుచ్చుకొనెడు ధనము, నష్టము

దండుదివియ. త. దీపపుసెమ్మె

దండుబాట. దే. రాజమార్గము

దండులంజె. త. బజారి

దండువ. త. దండుగ

దండువు. త. దండుగు

దండె. త. దండియ

దండెత్తు. దే. యుద్ధప్రయత్నముచేయు, ముట్టడించు

దండెపుఁబీఁటలు. త. గడచీల తగుల్చుటకు దండెకు నడుమ గ్రుచ్చినరంధ్రములుగల రెండుపీఁటలు

దండెము. త. దండియము

దండోరా. దే. తప్పెట వాయించుచు చేయు చాటింపు

దండ్యుఁడు. స. దండింపఁదగినవాఁడు

దంతకారుఁడు. స. ఏనుఁగు దంతములతో పనిచేయువాఁడు

దంతకాష్ఠము. స. పండ్లుతోము పుడక

దంతచ్ఛదము. స. పెదవి

దంతధావనము. స. పలుదోముట, చండ్ర చెట్టు

దంతభాగము. స. ఏనుఁగుముంపటిభాగము

దంతము. స. పల్లు, కొండ నడుము, పొద చిల్లు, ఏనుఁగుదంతము

దంతశఠ. స. పుల్లచింతమొక్క

దంతశఠము. స. నిమ్మచెట్టు, వెలఁగచెట్టు, చింతచెట్టు, పుల్లనిది

దంతావళము. స. ఏనుఁగు

దంతి. స. ఒకచెట్టు, ఏనుఁగు, కొండ, కోఱ పంటివాఁడు

దంతియ } దే. మిద్దెటింటికి నడ్డముగా వే
దంతె } సెడుపట్టె, కృషిసాధనము

దంతురము. స. ప్రక్కలణఁగినదుముపొడవైనది

దంతురితము. స. మిట్ట పండ్లుగలది, మెరక పల్లములు గలది, రోమాంచముగలది, కప్పఁబడినది, అలుకఁబడినది

దంతురుఁడు. స. మిట్టపండ్లవాఁడు

దంత్యము. స. దంతమునందు పుట్టినది

దంపడి. దే. తఱచు, తఱచైనది

దంపడించు. దే. తఱచగు

దందడిపెట్టు. దే. రాయిడిచేయు

దందన. త. మాయ, ఆలస్యము, జాలము

దందనకత్తియ } త. ఆలస్యము చేయు
దందనకత్తె } నది

దందనకాఁడు. దే. ఆలస్యము చేయువాఁడు

దందశూకము. స. సర్పము

దందహ్యమానము. స. మండుచున్నది

దంధనము. స. శాశ్వతముకానిది

దంపకఱ్ఱ. దే. దంపనాఁగలి

దంపతులు. స. ఆలుమగలు [గలి
దంపనాఁగలి. త. అదుసున దున్నెడునాఁ
దంపు. దే. దంచు, దంపుడు
దంపుటిల్లు. దే. దంచునట్టియిల్లు
దంపుడు. దే. దంచేట, దంపు
దంభనము. స. మోసము చేయుట
దంభము. స. కపటము, తప్పు, డంబము, మోసము, గర్వము, దుర్మార్గము, పాపము, వజ్రాయుధము, వ్యాజము
దంభోళి. స. వజ్రాయుధము, ఱాతివాలు, పిడుగు [యీఁగ
దంశకము. స. కొఱుకునది, కుక్క, అడవి
దంశనము } స. కాటు, కవచము, పల్లు
దంసనము }
దంశము. స. అడవియీఁగ, కాటు, కవచము
దంశి. స. అడవిదోమ
దంశిక. స. పటుకాఱు
దంశితము. స. కొఱుకఁబడినది, కవచము గలది, కాపాడఁబడినది, కాటు
దంశితుఁడు. స. కాటుపడ్డవాఁడు, కవచము తొడిగినవాఁడు
దంష్ట్ర. స. కోఱపల్లు
దంష్ట్రాయుధము } స. పంది
దంష్ట్రి }
దక్కించు. దే. చెప్పినప్రకారము జేకప్పు, కాపాడు
దక్కించుకొను. దే. ప్రాప్తమైనదానిఁగఁ జేసికొను
దక్కినసంపుఁద్రోవ. దే. దక్షిణాయనము
దక్కినసంపురాయఁడు. త. దక్షిణదిక్కున కధిపతి, యముఁడు
దక్కినము. త. దక్షిణపుదిక్కు

దక్కు. దే. ప్రాప్తమగు, అనుభవయోగ్యమగు, అనుభవయోగ్యము
దక్కొను. దే. స్వతంత్రుఁడగు, కలుగు
దక్కోలు. దే. దక్కొనుట, స్వాధీనము కలుగుట
దక్కోలుపడు. దే. దక్కొను
దక్షత. స. నేర్పు, రక్షణము
దక్షాయ్యము. స. గద్ద
దక్షిణ. స. యజ్ఞము మొదలైనవానియందు ఋత్విజులు లోనగు వారికి నిచ్చెడు ధనము, కుడిదిక్కు
దక్షిణము. స. కుడి, కుడిదిక్కుది, నేర్పు గలది, మర్యాదగలది, నిష్పక్షపాతమైనది, మనోహరమైనది
దక్షిణస్థుఁడు. స. తేరునడపువాఁడు
దక్షిణాగ్ని. స. ఒకశ్రౌతాగ్ని
దక్షిణాపథము. స. వింధ్యపర్వతము మొదలుకొని సేతువువఱకుఁ గలదేశము
దక్షిణాయనము. స. ఉత్తరమునుండి దక్షిణమునకుఁ బోవునట్టి సూర్యగతి
దక్షిణేయుఁడు. స. దక్షిణ యీయఁదగినవాఁడు
దక్షిణుఁడు. స. అనేకనాయికలయందు సమముగా ప్రవర్తించే నాయకుఁడు, దాక్షిణ్యము కలవాఁడు, నేర్పుకలవాఁడు
దక్షిణేర్మము. స. బోయవానిచేత కుడిప్రక్క గాయముచేయఁబడిన మృగము
దక్షిణ్యుఁడు. స. దక్షిణకుఁదగినవాఁడు
దక్షుఁడు. స. ఒకబ్రహ్మ, ఒకానొకముని, నేర్పరి
దగ. త. తాపము, దప్పి
దగదగ. దే. మెఱయుట మొదలగువాని యందగు ననుకరణము

దగదగమను. దే. దగదగయని ప్రకాశించు
దగర. దే. ప్రతాపము, దగ
దగరము. దే. పేడు. దగఱము
దగదు. దే. యుద్ధసాధనవిశేషము, ఇనుక

దగ్గఱ
డగ్గఱ } దే. సమీపము

దగ్గఱించు
డగ్గఱించు } దే. సమీపించు

దగ్గఱు
డగ్గఱు } దే. సమీపించు

దగ్గు. దే. కాసముచేయు, కాసము
దగ్ధ. స. సూర్యుఁడున్నదిక్కు
దగ్ధము. స. కాల్పఁబడినది
దగ్ధవ్యము. స. కాల్పఁదగినది
దగ్ధిక. స. మాఁడినవంటకము, మాఁడు
దఘ్నము. స. మేరను తెలియఁజేయు ఒక పదము, బంటి, కొలఁది
దచ్చేవుక. త. ఇరువనాలుగు, దచ్చి
దచ్చి. దే. దచ్చేవుక, అష్టకము
దచ్చికడలు. దే. అష్టదిక్కులు
దచ్చికాళ్ళమెకము. దే. శరభము, అష్టాపదము
దటాయించు. దే. చీవాట్లుపెట్టు
దట్టడుగులు. దే. శిశువులువేయు తప్పటడుగులు
దట్టన. దే. అదలుపు, తర్జనము
దట్టపడు. దే. గట్టిపడు, తఱచగు
దట్టము. దే. పావడ, తఱచు, సమూహము. గట్టి
దట్టా. దే. సిద్దెమూతికివేసెడుమంటిమూఁత, బిరడా
దట్టి. త. దిండు, కాసె.
దట్టించు. దే అదలించు
దట్టించు. త. దట్టికట్టు
దట్టీ. త దట్టి
దట్టుఁడు. త. దిట్టతనముగలవాఁడు
దడ. దే. వణఁకు
దడ. త. గొయ్యత్రాసు. డాళా
దడకట్టు. దే. తాఁచేసపుడు దడికట్టు
దడదడ. దే. దడిగా
దడదడమను దే. దడదడకొట్టుకొను
దడబడ. దే. ఆటోపము. ఆవేగము
దడము. దే. దట్టము
దడము. త. సేన, సమూహము
దడాలున. దే హఠాత్తుగా
దడి. దే. వెనుకచోఁప లోనగువానితో నేర్పఱచిన మఱుఁగు
దడిగ. దే. కేడెము
దడిబము. త. దళపు, దయ్యా
దడిబియ్యము. దే. రజస్వలయిన దినముచే విషయములో జరగించు నొకతంతు
దడిమము. దే. దన్నము
దడిమము. త. దళపు
దడియ. దే. కొండచేరువనేల

దడియఁబడు
దడియఁగఁబడు } దే. వణఁకు

దడియము
దడెము
దడ్డియము } దే. పదిసేరులయెత్తు, ఎత్తెడు

దడియు. దే. వణఁకు
దడ్డు. దే. దిగంబరియయిన
దణా. త. సేన
దణాయఁడు. త. సేనానాయకుఁడు
దణి. త. ప్రభువు
దత్తకుఁడు. స. దత్తపుత్త్రుఁడు, పెంపుడు కొడుకు

దత్తత. స. పెంపుడు, స్వీకారము

దత్తము. స. ఈయఁబడినది, పెంపుడు ఈయఁబడినది

దత్తి. స. ఈవి, దానము

దత్తు. త. స్వీకారము

దత్తుఁడు. స. స్వీకరింపఁబడినవాఁడు, కుదువ యుంచఁబడినవాఁడు, దత్తాత్రేయుఁడు

దద్దడము, దద్దళము } దే. చిన్నగుడి, పైకప్పులేని ఇంటిమిద్దె, బోడిమిద్దె

దద్దఱిల్లు, దద్దఱు, దద్దర్లు } దే. తబ్బిబ్బుపడు, భయపడు

దద్దు, దద్దురు } త. రోగవిశేషము, గోఁకుట, చీమకుట్టుట మొదలగువాని చేత నైనబొబ్బ, పొక్కు

దద్రుఘ్నము. స. తగిరిసచెట్టు

దద్రుణుఁడు. స. దద్దురోగముగలవాఁడు

దద్రువు. స. రోగవిశేషము, దద్దు

దధి. స. పెరుఁగు, మద్దిచెట్టు

దధిత్థము, దధిఫలము } స. వెలఁగచెట్టు

దధిబుసము. స. మీఁగడతీసిన పెరుఁగు

దధ్న్యవము. స. పెరుఁగుసముద్రము

దనము. త. ధనము

దనియాలు. త. కొత్తిమిరివిత్తులు, ధాన్యాకము

దనియు. దే. కూడు, సంగమించు

దనివు. దే. కూడిక, సంగమము

దనుక. దే. వఱకు, పర్యంతము

దనుప, దన్కు } దే. తాఁకు, పొందు, సక్తమగు, నిప్పుఅంటుకొను

దనుజుఁడు. స. అసురుఁడు, తొలివేల్పు

దప్పము. దే. దట్టము

దప్పళము. దే. కాయగూరలువేసి పలుచగాఁ గాఁచినపులుసు

దప్పి, దప్పి } దే. నీరువట్టు, శ్రమము

దప్పిక. దే. దప్పి

దబదబ. దే. వడచుట మొదలగువాని యను కరణధ్వని

దబము. త. తపస్సు

దబలకము. దే. మోఁకాలు దాఁచునట్టి యొకరోగము

దబ్బ. దే. నారంగవిశేషము

దబ్బ. త. దర్భ, బద్ద, వెదురుబద్ద

దబ్బకట్టు. దే. రక్తమువలెగడ్డకట్టు

దబ్బడము. దే. మూఁకుడు

దబ్బడించు. దే. మూఁకుటితోఁగాని చేతి తోఁగానిమూయు, చేతులతో చేఱచు

దబ్బనము. దే. గోనెలుకుట్టు పెద్దసూది

దబ్బయుంగరము. దే. పవిత్రపు ముడివలె బంగారుతో చేసినయుంగరము

దబ్బర. దే. గిన్నె, అరివాణము

దబ్బఱ. దే. బొంకు, మోసము, విపత్తు, బొంకుకాఁడు, మోసకాఁడు, తప్పు

దబ్బఱకత్తియ. దే. దబ్బఱలాడునది

దబ్బఱకాఁడు. దే. దబ్బఱలాడువాఁడు

దబ్బఱి. దే. దబ్బఱకాఁడు, దబ్బఱకత్తియ

దబ్బవాఁడు. దే. మేదరవాఁడు

దబ్బవ్రేలు. దే. పవిత్రపువ్రేలు, అనామిక

దబ్బాటు. దే. డబ్బాటు, అకస్మాత్తుగా

దబ్బిచిప్ప. దే. తాటిచెట్టు బద్దలు చేసెడు సాధనము, కొయ్యమేకు

దబ్బిలి. దే. ధూర్తుఁడు, బాధ, కలహము

దబ్బు. దే. చెప్పు, మాట, అనృతము, మూఁకుడు

దబ్బుడు. దే. మూఁగ, దబ్బిదము
దబ్బున. దే. శీఘ్రముగా
దబ్బుర. దే. దబ్బర, గిన్నె
దబ్బువెట్టు. దే. మూయు
దభ్రము. స. సన్నము, సూక్ష్మము [నము
దమథము. స. క్లేశమునోర్చుతనము, దండ
దమనము. స. అణఁచుట, దవనము
దమనుఁడు. స. ఒకానొకముని, శూరుఁడు, అణఁచువాఁడు, సారథి
దమము.స. క్లేశమునోర్చుతనము, ఇంద్రియనిగ్రహము, దండోపాయము, అణఁచుట, అడుసు
దమి స. అణఁచువాఁడు
దమించు / దమియించు } స. అణఁగఁద్రొక్కు, అణఁచు
దమితము. స. అణఁపఁబడినది , శాంతింపఁబడినది
దమితుఁడు. స. అణఁపఁబడినవాఁడు, తపఃక్లేశసహనముకలవాఁడు
దమునసుఁడు. స. అగ్నిహోత్రుఁడు
దమ్మఁడు. త. ఏమియు నెఱుఁగనివాఁడు, కపటములేనివాఁడు, ఎడ్డె
దమ్మము. దే. నాలుగుకాసులనాణెము
దమ్మము. త. ధర్మము
దమ్మిడి. దే. అయిదుకాసులనాణెము, ఒకపైస
దమ్ము. త. అడుసు, బురద
దమ్ముకొను. దే. అడుసగు
దమ్ముచేయు. దే. సస్యమూడ్చుటకు సిద్ధముచేయు
దమ్యము. స. మోయుటకును దున్నుటకును దగినవయసుగల దూడ
దయ. •స కృప, కనికరము, ప్రేమ

దయచేయు / దయసేయు } దే. ప్రసాదించు, ఇచ్చు, గొప్పవారిని కూర్చుండుము పొమ్ము అని చెప్పు
దయనీయము. స. దయతలఁపఁదగినది
దయాళుఁడు / దయాళువు } స. కనికరముగలవాఁడు
దయిత. స. ప్రియురాలు. ఆఁడుది
దయితుఁడు. స. ప్రియుఁడు. ఇష్టుఁడు
దయివాఱు. దే. ఒప్పు, అతిశయించు, కోరిక సఫలమగు, పొరలిపాఱు
దయ్యము. త. దేవుఁడు, వేలుపు, పిశాచము, విధి
దయ్యాలపోతు. దే. దయ్యములను పెట్టువాఁడు
దయ్యు / దయ్యూ } దే. బలహీనమగు, బడలు
దర. త. వెల
దరకము. స. పిఱికితనము గలది
దరణము. స. చీల్చుట, పగులఁగొట్టుట
దరణము. దే. ఎనిమిదిడబ్బులనాణెము
దరదము. స. ఇంగిలీకము, భయంకరము
దరము. స. భయము, శంఖము, గొయ్యి
దరహాసము. స. చిఱునగవు
దరి. త. గట్టు, మేర, సమీపము, కొంచెము
దరి. స. గుహ
దరికొను. దే. మండు, కాలు, రగులు
దరికొలుపు. దే. మండఁజేయు
దరిచేరు. దే. నెఱవేఱు, గట్టుచేరు, స్వర్గమునకుఁ బోవు, ముగియు
దరితుఁడు స. భయపడినవాఁడు
దరిద్ర. స. దరిద్రురాలు
దరిద్రత / దరిద్రాణము } స. దారిద్ర్యము, బీదతనము

దరిద్రము. స. బీదదైనది
దరిద్రుఁడు. స. బీదవాఁడు
దరిజేసి. దే. దైన్యముగలవాఁడు, దీనుఁడు
దరిసించు. త. చూచు, కానుకగా నిచ్చు
దరిసెనము. త. గొప్పవారిని చూచుట, గొప్పవారిని చూడఁబోవునపుడు తీసి కొనిపోయి యిచ్చెడు కానుక
దరువు. త. గీతవిశేషము, తాళము
దరువుచేయు. త. తాళమువేయు
దర్దర. స. దగ్గ
దర్దరము. స. కప్ప, మబ్బు
దర్దరీకము. స. కప్ప,మబ్బు,వాద్యవిశేషము
దర్పకుఁడు. స. మన్మథుఁడు
దర్పణము. స. అద్దము
దర్పము. స. గర్వము, కస్తూరి
దర్పించు. స. గర్వించు, త్రుళ్లు
దర్పితుఁడు. స. గర్వముగలవాఁడు
దర్భ. స. కుశము
దర్భముద్రిక. స. దబ్బయుంగరము
దర్వాటుఁడు. స. గ్రామముఠలాతె, పోలీసు ఉద్యోగి, ద్వారపాలకుఁడు
దర్వి. స. మిక్కి, గరిటె, పాముయొక్క పడగ
దర్వీకరము. స. పాము
దర్శకుఁడు. స. ద్వారపాలకుఁడు,చూపెడు వాఁడు, నేర్పరి
దర్శనము. స. చూపు, కన్ను, అద్దము,బుద్ధి, తెలివి, శాస్త్రము, ధర్మము
దర్శని. స. పశువులు మొదలగునవి రాకపోకలచేత నేర్పడిన ఊటిముండని దారి, పుంత, ఉపరక్ష్య

దర్శనీయము. స. చూడఁదగినది
దర్శము. స. సూర్యచంద్రుల సంగమము, అమావాస్య, చూపు, ఇష్టి
దర్శయిత. స. చూపువాఁడు
దర్శించు. స. చూచు, వీక్షించు, ఇచ్చు
దర్శితము. స. చూపఁబడినది
దర్సెనము. త. దరిసెనము
దలపము. స. ముఖత్రాణము
దలిమము. దే. సన్నము, దడిమము
దల్లు. త. జల్లు, వర్షము
దవ. దే. దుమ్ము, చెఱకుకొన
దవంత్రి. దే. అగడ్త, కందకము
దవగడు. దే. ఎండాకు
దవనము. త. వాసనగల మూలికావిశేషము
దవము. స. కార్చిచ్చు, అడవి, ఆఁకలి యొక్కగాని జ్వరముయొక్కగాని తీవ్రత
దవసము. దే. ధాన్యము
దవానలము. స. వనవహ్ని, గొప్పమంట
దవిష్ఠము, దవీయము } స. మిక్కిలి దవ్వైనది
దవ్వ. దే. మ్రానినడిమి మెత్తనిభాగము, చెఱకుకొన
దవ్వు. త. దూరము
దవ్వులవారు. దే. దూరమందున్నవారు
దశ. స. అవస్థ,వత్తి,ప్రభుత్వము, అదృష్టము, వస్త్రపుబద్దె, జీవితకాలము, బాల్యాదికాలము, స్థితి, మనస్సు, గ్రహస్థితి
దశకంఠుఁడు. స. రావణుఁడు
దశకము, దశము } స. పది
దశనము. స. కవచము, పల్లు

దశనవాసస్సు. స. పెదవి, పలుపలుక
దశబంధము. స. ఒకపీఫమగు ఈనాము భూమి
దశబలుఁడు. స. బుద్ధదేవుఁడు
దశమము. స. పదియవది
దశమి. స. పక్షమునందు పదియవతిథి, పదియవది, మిక్కిలి వృద్ధుఁడు
దశమిస్థుఁడు. స. నష్టవీర్యుఁడు, వృద్ధుఁడు
దశాస్యుఁడు. స. రావణుఁడు
దశాహము. స. మృతిపొందినవానికి పది యవనాఁడు చేయు శ్రాద్ధము
దష్టము. స. కఱవఁబడినది
దష్టించు. స. కఱచు, పండ్లు పెట్టు
దసనము. స. నాశమగుట, త్రోసివేయుట, తీసివేయుట
దసిలీ. దే. ఒకవిధసుపట్టు, వదలు
దసువంది. దే. గుఱ్ఱములాటకు జెట్టీలనుగూర్చు వాఁడు
దసెన. దే. ఆయుధవిశేషము
దస్తము. స. నాశమయినది. త్రోయఁబడినది
దస్తూరీ. దే. వ్రాఁత
దస్యుఁడు. స. దొంగ, శత్రువు
దస్రులు. స. అశ్వినీదేవతలు
దహనము. స. కాల్చుట. చిత్రమూలము, జేడి, నిప్పు, కృత్తిక
దహనసారథి. స వాయువు
దహనుఁడు. స. అగ్ని, దుష్టుఁడు
దహరము. స. హృదయము, అభిప్రాయము చిన్నది
దహరుఁడు. స. బిడ్డ
దహించు. స. కాల్చు
దళకర్త. స. సేనాధిపతి, దండనాధికారి

దళగొను } దే. దళముగొను, దట్టమగు
దళించు }
దళనము. స. ఖండించుట. ఛేదించుట
దళము. దే. ఆధిక్యము, అనేకము, తఱచు, దట్టము
దళము. స. ఆకు. ఖండము, హాదిదళము, సైన్యము
దళముగొను. దే. అధికమగు, దట్టమగు
దళముగొలుపు. దే. దళముగొనఁజేయు
దళవరి. దే. ఆస్తి
దళపతి. స. సేనాధిపతి
దళవాయి. స. సేనాధిపతి
దళసంచు. దే. దళముజాతి, ఒకసేన
దళసరి. దే. ఘనత, తఱచు, మందము
దళించు. స. ఖండించు, ఛేదించు
దళితము. స. ఖండింపఁబడినది, ఛేదింపఁబడినది, వికసించినది

## దా

దా. దే. ఎడమ, రా, దాపల
దాండికుఁడు. స. శిక్షించువాఁడు
దాంతము. స. ఓర్పు, దైన్యము
దాంతి. స. బ్రహ్మచర్యాదితపఃక్లేశము నో ర్చుటనము, ఇంద్రియనిగ్రహము
దాంతికము. స. దంతముతో చేయఁబడినది
దాంతుఁడు. స. తపఃక్లేశమునోర్చువాఁడు, అడపఁబడినవాఁడు
దాంపత్యము. స. దంపతిభావము
దాంభికుఁడు. స. డంభముగలవాఁడు
దాఁక. దే. దనుక
దాఁకొను. దే. మఱుఁగుపడు
దాఁగినమ్ముచ్చులు } దే. దాఁగిలిమూఁతలు
దాఁగిలిమ్ముచ్చులు }

దాఁగర. దే. ఎండుపుఁదట్ట, ప్రసేవకము
దాఁగిలిమూఁతలు.దే. బాలక్రీడావిశేషము, గుప్తక్రీడ
దాఁగు. దే. మఱుఁగుపడు, తిరోహితమగు
దాఁగురించే. దే. దాఁచే, వంచించే, డాఁగురించే
దాఁగురింత. దే. దాఁగురించుట
దాఁగురింతలు. దే. దాఁగురుమూఁతలు
దాఁచు. దే. దాఁగఁజేయు
దాఁటడుగుపరువడి } దే. మల్లబంధవిశేషము
దాఁటడుగుమొన }
దాఁటు. దే. లంఘించే, తరించే, ఉల్లంఘించే, లంఘనము
దాఁటు. త. సమూహము
దాఁటుకట్టు. త. గుంపుకూడు
దాఁటుకొను. దే. లంఘించు
దాఁపన. దే. దాఁచేట
దాఁపరము. దే. దొంగిలించేట, మోసము
దాఁపరించే. దే. దొంగిలించే
దాఁపరీఁడు. దే. దొంగ
దాఁపఱికము. దే దాఁపురము, గోపనము
దాఁపు. దే. దాఁచే
దాఁపుడు. దే. దాఁచుట, గోపనము
దాఁపురము. దే. మఱుఁగుపుచ్చేట
దాక. దే. వెడలుపునోరుగలఅటిక, బోగిణి
దాక. త. ద్రాక్ష
దాకలి. దే. లోహములను కాఁచి సాఁగఁగొట్టునపుడు ఊఁతగా క్రిందనుంచెడు ఇనుపదిమ్మ లోనగునది, నిఘాతిక, దాగలి
దాకల్లు. దే. బండికంటికడకమ్మి, నేమి
దాకొను. దే. సమీపించే
దాక్షాయణి. స. పార్వతి, అశ్విన్యాది నక్షత్రము, భూమి
దాక్షాయ్యము. స. గద్ద
దాక్షిణాత్యులు. స. దక్షిణదేశస్థులు
దాక్షిణ్యము. స. మొగమోటము, మర్యాద, నీతి, దయ, దక్షిణభావము, ఐకమత్యము, నేర్పు
దాక్షిణ్యుఁడు } స. దక్షిణకుతగినవాఁడు
దక్షిణ్యుఁడు }
దాక్ష్యము. స. నేర్పు, శక్తి, అర్హత, మర్యాద
దాగలి. దే. దాకలి
దాడి. త. దండెత్తిపోవుట, దండయాత్ర, సేన
దాడికాఁడు. త. వేగులవాఁడు
దాడిచేయు. త. దండెత్తు
దాడినిమ్మ. త. దానిమ్మ
దాడిమపుష్పకము. స. ములుమోదుగచెట్టు
దాడిమము } స. దానిమ్మ, ఏలకిచెట్టు
దాడింబము }
దాడిమ్మ. త. దానిమ్మ
దాడియాడు. దే. మార్కొను
దాఢ. స. కోరపల్లు సమూహము
దాణ. త. ఉలవలులోనగు గుఱ్ఱము నాహారము
దాణము. దే. సుంకము, శుల్కము
దాత. స. ఇచ్చేవాఁడు
దాతవ్యము. స. ఇయ్యఁదగినది
దాతికట్ట. దే. చెక్కెడుకొయ్యకు ఊఁతగా క్రిందనుంచేకొనెడిబల్ల చెక్కలోనగునది, దాయి, ఉద్ఘనము
దాతృత్వము. స. ఈవి, ఔదార్యము
దాత్యూహము. స. కూకురుగుండఁగిపిట్ట, వానకోయిల, భరతపక్షి
దాత్రము. స. కొడవలి

దాదాపు. దే. కొంచెమెచ్చుతక్కువ

దాది } త. పాలిచ్చిపెంచే స్త్రీ, కసి
దాదిలి } కత్తె

దాదుంగ. దే. వడ్లవాఁడుచెక్కకట్టకుసా
  సానుగా నుంచే దుంగ

దాధికుఁడు. స. పెరుఁగమ్మువాఁడు

దానకము. స. కొద్దిబహుమానము

దానము. స. ఈవి, ఏనుఁగుయొక్క కపోల
  మదము, ఛేదనము, చేతురుపాయము
  లలో నొకటి, బహుమానము

దానవారి. స. దేవత

దానవుఁడు. స. రాక్షసుఁడు

దానశౌండుఁడు. స. మిక్కిలియీవికాఁడు

దాని. స. ఏనుఁగు

దానిమ్మ. త. దాడిమము [మానము

దానీయము. స. ఇయ్యఁదగినది, బహు

దానులు. స. దానము చేయువారు

దాపనము. స. దండుగ గొనుట,ఇప్పించుట

దాపరము. దే. ప్రాప్తి

దాపరించు. దే. ప్రాప్తించు

దాపల } దే. ఎడమభాగము
డాపల }

దాపలించు } దే. ప్రదక్షిణమగు
డాపలించు }

దాపించు. దే. సమీపించు

దాపితము. స. ఇప్పింపఁబడినది, దండుగ
  విధింపఁబడినది [సాధితుఁడు

దాపితుఁడు. స. దండుగగొనఁబడినవాఁడు,

దాపు. దే. సమీపము, భయము

దాపురమగు. దే. ప్రాప్తించు

దాపురము. దే. ప్రాప్తి

దాప్యము. స. దండుగగొనఁదగినది

దామని. స. దామెనత్రాడు [రము

దామము. స. పశువులఁగట్టెడుపలుపు, హా

దామన. దే. ఉరిత్రాడు, మండలాకార
  కష్టము [త్రాడు

దామెన. త. పెద్ద పలుపులుగల నిడివి

దామోదరుఁడు. స. విష్ణువు

దాయ. దే. శత్రువు, జ్ఞాతి

దాయఁగట్టు. దే. పాలుపిండునపుడు ఆవు
  కాళ్లను కట్టు

దాయకుఁడు. స. ఇచ్చువాఁడు

దాయము. దే. పాచికలు మొదలైనవాని
  యందలి పందెము, గవ్వలాట, విపత్తు

దాయము. స. పంచుకొనఁదగిన తండ్రిసొ
  త్తు, ఈవి, అరణము, కట్నము, ఉల్ల
  కట్టుమాట, ఖిడము, బహుమానము,
  భాగము, నష్టము, తావు

దాయాదుఁడు. స. జ్ఞాతి, పుత్రుఁడు

దాయి. దే. దాకలి

దాయి. స. ఇచ్చువాఁడు

దాయు } దే. సమీపించు
డాయు }

దార. త. సీటిచీలు, దానము, క్రమము,
  కత్తియంచు [డ్లాము

దార. స. అగ్నిసాక్షిగా పెండ్లాడిన పెం

దారకము. స. బద్దలు చేయునట్టిది

దారకాచార్యుఁడు. స. బడిపంతులు

దారకుఁడు. స. బాలకుఁడు, కృష్ణునిసారధి,

దారణ. త. వెల [చీల్చువాఁడు

దారణము. స. చీల్చుట [ఇంగువ

దారదము. స. విషభేదము, పాదరసము,

దారపోయు. దే. మంత్రపూర్వకముగా నిచ్చు, పోఁగొట్టుకొను
దారబంధము. త. ద్వారబంధము
దారము. స. రంధ్రము, పగులు, మన్నుఁ బడినపొలము
దారము. దే. నూలిత్రాఁడు
దారవము. స. కొయ్యతోఁ జేయఁబడినది
దారి. త. మార్గము, ధరించువాఁడు
దారించు. స. చీల్చు
దారిక. స. బిడ్డ, పగులుట
దారికొట్టు. దే. మార్గములో దోఁచుకొను
దారితము. స. చీల్చఁబడినది
దారిద్ర్యము. స. బీదతనము
దారిబడి. దే. మార్గమందు సహాయముగా వచ్చువాఁడు
దారుకీటము. స. మ్రానుతొలుచు పురుగు
దారుణము. స. భయానకరసము, భయంకరము, కఠినము
దారుణ్యము. స. కఠినము
దారున. దే. తటాలున [ఇత్తడి
దారువు. స. కొయ్య, దేవదారుచెట్టు,
దారుహరిద్ర. స. మ్రానిపసుపు
దారుహస్తకము. స. కొయ్యతెడ్డు
దార్ఢ్యము. స. దిటవు
దార్వాఘాటము. స. వడ్రంగిపిట్ట
దార్వి. స. మ్రానిపసుపు, దెండచెట్టు
దార్వీక. స. దెండచెట్టు, రసాంజనము ఎద్దు నాలుకచెట్టు [బడినది
దార్ష్టాంతికము. స. దృష్టాంతముతోఁ జెప్పఁ
దాలనము. స. పంటినొప్పి
దాలి. దే. పాలుకాఁచేట లోనగువానికిఁ జేర్చిన పిడకలప్రోగు
దావ. దే. తగవు, వ్యాజ్యము
దావంతము. దే. దుఃఖము
దావము. స. అడవి, కారుచిచ్చు
దావరడంగి. దే. దేవతాళవృక్షము
దావరము. దే. దొంగతనము
దావరి. దే. వీరుఁడు
దావరీఁడు. దే. వీరుఁడు
దావళి. దే. మడికిఁధరించుకొను కంబళివస్త్రము
దావానలము. స. వనవహ్ని, గొప్పమంట
దావికము. స. దేవికానదియందుఁబుట్టినది
దాశపురము. స. కయివడిముస్తె
దాశరథి. స. రాముఁడు
దాశార్హుఁడు. స. హరి
దాశుఁడు. స. పల్లెవాఁడు, సేవకుఁడు
దాశేరుఁడు. స. పల్లెవాఁడు, పల్లెవాని కొడుకు [గర్వము
దాష్టికము. స. దౌష్ట్యము, అహంభావము,
దాసనము. దే. దాసనచెట్టు
దాసరయ్య. త. తాఁబేలు
దాసరి. త. విష్ణుసేవకుఁడైన శూద్రుఁడు, భిక్షమెత్తుకొని జీవించెడు విష్ణుభక్తుఁడు
దాసరికొయ్య. దే. మీనభేదము
దాసరిగాఁడు. దే. తాఁబేలు
దాసరిపాము. దే. సర్పవిశేషము
దాసి. స. వెలకుఁగొన్న పనికత్తె, నల్లగొరంటమొక్క, పరిచారిక, పల్లెది, శూద్రునిభార్య, వెశ్య

దిగు. దే. మీఁదనుండి క్రిందికివచ్చు, దిగు మతియగు. దిగఁబడు, ప్రయాణమై పోవునపుడు దారిలో విడియు
దిగుచు. దే. దించు
దిగుడు. దే. ఆనతము, తక్కువ
దిగువల. దే. క్రిందిభాగము
దిగుమతి. దే. ఓడలోనుండి సరకులను దించేట
దిగులు. దే. గుండెయదురు, భయము
దిగులుపడు. దే. దిగులొందు
దిగులుపాటు. దే. దిగులుపడుట
దిగువ. దే. క్రింది, క్రిందైనది
దిగువాటు. దే. దిగువ
దిగుబాయి. దే. తక్కువ
దిగునాఱు. దే. మీఁదనుండి క్రిందికిపడు, కాఱు
దిగ్గజము. స. దిక్కులనందుండెడి యేనుఁగు
దిగ్గన. దే. తటాలున
దిగ్గనాడు. దే. దిగనాడు
దిగ్గియ. త. నడబావి
దిగ్గు. దే. భయమునందగుననుకరణము, దిగు
దిగ్గుడు. దే. దిగుడు
దిగ్గున. దే దిగ్గన
దిగ్గురను. దే. భయముచేత హృదయము దిగ్గురను
దిగ్గోలు. దే. కోయుపైరునకుముందుపైరు
దిగ్దేశము. స. దూరదేశము
దిగ్ధము. స. విషము పూసిన బాణము, పూయఁబడినది
దిగ్బంధము. స. మంత్రముచేత కట్టెడు దిక్కులకట్టు, సాలెపురుగు
దిగ్భ్రమము. స. దిక్కులతబ్బిబ్బు, భ్రమము
దిగ్విజయము. స. భూలోకము నంతయు జయించుట
దిగ్విభాగము } స. దిక్సూచకయంత్రము
దిఙ్ముఖము } లోని ముల్లు మొన
దిఙ్మోహము. స. దిక్కులు తెలియకపోవుట
దిచ్చేరి. త. వ్యభిచారిణి
దిచ్చెమొగము. దే. అదృశ్యము
దిట. త. దార్ఢ్యము, శక్తి
దిటమరి. దే. ప్రౌఢ, ప్రౌఢుఁడు
దిటము. త. ధైర్యము, దృఢము
దిటవరి. దే. ధీరుఁడు, దిట్టరి
దిటవు. త. దార్ఢ్యము, దృఢము
దిట్ట. త. దార్ఢ్యము, శక్తి, దార్ఢ్యముగల వాఁడు, ధైర్యముగలవాఁడు, సామర్థ్యము గలవాఁడు
దిట్టఁడు. త. ధైర్యముగలవాఁడు
దిట్టకూళ. దే. దుర్మార్గుఁడు
దిట్టపడు. దే. తగు, క్రమపడు, దృఢపడు
దిట్టము. త. నిర్ణయము, చిక్కఁబట్టు, గట్టి
దిట్టముచేయు. దే. ఏర్పాటుచేయు
దిడ్డి. దే. గవనిమొదలగువాని ప్రక్కనుండు చిన్నవాకిలి, చిన్నవాకిలి
దితము. స. నఱకఁబడినది
దితి. స. అసురులతల్లి, నఱకుడు
దితిసుతుఁడు. స. దితికొడుకు, దైత్యుఁడు
దిత్స. స. ఇయ్యవలెనను నిచ్చ
దిద్దు. దే. శిక్షించు, సవరించు, సింగారించు, చేక్కఁబెట్టు, నేర్పు

దిద్దుగడ
దిద్దుడు
దిద్దుపాటు
దిద్దుబడి
} దే. సవరించుట, శిక్షించుట

దిదృక్ష. స. చూడనిచ్ఛ
దిదృక్షువు. స. చూడనిచ్ఛగలవాడు
దిధక్ష. స. కాలుపనిచ్ఛ
దిధక్షువు. స. కాలువ నిచ్ఛగలవాడు
దిధిషువు. స. మాఱుమనువైనది, మాఱుమనువు దానిమగడు
దిధీర్ష. స. కాపాడవలెనను నిచ్ఛ
దినకరుడు. స. సూర్యుడు
దినచర్య. స. ప్రతిదినము జరుగు సంగతులను వ్రాసియుంచుకొనెడి పుస్తకము
దినబత్తెము. గ్రా. దినదినము నిచ్చెడు బత్తెము
దినమణి. స. సూర్యుడు
దినము. స. దివసము, పగలు
దినవారము. దే. ఉత్తరక్రియలు
దినవెచ్చము. గ్రా. దినదినము జరిగెడు వెచ్చము
దినసరి. దే. సస్యవిశేషము
దినసరులు. దే. ధాన్యవిశేషము
దినాంతము. స. సాయంకాలము, మాపు
దినారి. త. పైడిటంకము. దీనారము
దినుసు / దినుస్సు } దే. వస్తువు, ప్రకారము
దిన్న. దే. వృక్షవిశేషము
దిబదిబ. దే. అనుకరణము
దిబ్బ. త. ఉన్నతభూమి, కుప్ప
దిబ్బడము. దే. మూకుడు, దబ్బడము
దిబ్బెడ. త. కొంచెముచెవుడు
దిబ్బెము. త. దీపము [కరణము
దిమిదిమి. దే. మద్దెలమ్రోతయందగు అను
దిమ్మ. త. దిబ్బ, భ్రమము
దిమ్మరి. త. భ్రమకలవాడు, భ్రమకలది, మత్తు కలవాడు, మత్తుకలది
దిమ్మరించు. దే. కమ్మరించు
దిమ్మరీడు. త. మత్తుకలవాడు
దిమ్మస. దే. నేలచేయుదు
దిమ్ము. దే. సమూహము, వర్గము
దిమ్ము. త. భ్రమము, మత్తు
దిమ్ముకట్టు. దే. భ్రమగొను, మత్తుగొను
దిమ్మె. దే. తామరపువ్వులోని దుద్దు, గొయ్యి బిళ్ళ, కాల్తోగడువానితో చేర్చిఆడిన చిన్నమిట్ట
దిమ్మెస. దే. తాపినపనివాని ఒకపనిముట్టు
దిరదిర / దిర్దిర } దే. తిరుగుటయందగు అనుకరణము
దిరిసెనము / దిరిసెను } త. శిరీషవృక్షము
దివటీ / దివ్వటీ } త. ఇనుపకమ్మికి గుడ్డలు చుట్టి ముట్టించెడు దీపము
దివము. స. ఆకాశము, స్వర్గము, పగలు
దివసము. స. దినము, పగలు
దివసముఖము. స. వేకువ
దివసములుచేయు / దివసముపెట్టు } దే. దినవారములు చేయుట
దివస్పతి. స. ఇంద్రుడు
దివాంధము. స. గుడ్లగూబ
దివాకరుడు. స. సూర్యుడు. పగటివేల్పు
దివాకీర్తి. స. మంగలవాడు, మాలవాడు
దివాణము. త. రాజుకొలువుకూటము, కొలువుకూటము
దివాతనము. స. దినసంబంధమైనది
దివాభీతము. స. గుడ్లగూబ, కలువకొలను
దివాభీతి. స. నిర్నిమిత్తముగా భయపడువాడు

దివాభీతుఁడు. స. చోరుఁడు, దొంగ
దివి. స. ఆకాశము, స్వర్గము, పాలపిట్ట
దివిజాధిపుఁడు. స. ఇంద్రుఁడు
దివిజుఁడు. స. దేవత
దివిదారికొమ్ము. దే. రెండుఇత్తికొమ్ములకు ఇరుప్రక్కల మొనలుంగా జేతపట్టి యేర్పఱచిన మల్లసాధనవిశేషము
దివియ } త. దీపము, దివిటీ
దివె }
దివియకంబము. త. దీపస్తంభము
దివియకోల. దే. దివటీ
దివిషదుఁడు. స. దేవత
దివు. దే. దిగు
దివెకంబము. త. దీపస్తంభము
దివెదారికొమ్ము. దే. దాసరులదీపస్తంభము
దివౌకసము } స. పక్షి, చాతకపక్షి
దివోకసము }
దివౌకసుఁడు } స. వేల్పు
దివోకసుఁడు }
దివ్య. త. దివియ
దివ్య. స. ఉసిరికచెట్టు
దివ్యచక్షువు. స. సుగంధవిశేషము, జ్ఞానదృష్టికలవాఁడు, మంచి కన్నులుగలవాఁడు, గ్రుడ్డివాఁడు
దివ్యము. స. మహాభ్యవహారములయందు జయింపఁబడినసత్యము, బాస, లవంగము, ఉత్పాతవిశేషము, దివియందుఁ బుట్టినది, ఒప్పునది, శ్రేష్ఠమైనది, ఆశ్చర్యకరమైనది, సాంబ్రాణి, ఆకాశము, చందనము
దివ్యాఱుపుఁబుర్వు. దే. దీపమునార్చునట్టి యొకానొకపురుగు
దివ్యులు. స. దేవతలు, తత్త్వవేత్తలు
దివ్యోదకము. స. వాననీళ్లు
దివ్యోపపాదుకుఁడు. స. అయోని సంభవులగు దేవాదులు
దివ్వటీ } త. కరదీపిక, దివటీ
దివ్వటి }
దివ్వియ } త. దీపము, దివటీ
దివ్వె }
దివ్వియకంబము } త. దీపస్తంభము
దివ్వెకంబము }
దివ్వు. దే. ఈడ్చు, లాగు, తీసివేయు
దివ్వెకోల } దే. దివటీ
దివ్వెనకోల }
దివ్వెయార్పు. దే. శలభము [గాఁడు
దివ్వెసుడి. దే. గోడయందు దీపము పెట్టు
దిశ. స. దిక్కు, ఆశ
దిశ్యము. స. దిక్కునందుఁ బుట్టినది
దిష్టము. స. భాగ్యము, సమయము, ఉపదేశింపఁబడినది
దిష్టాంతము. స. మరణము
దిష్ణువు. స. ఇచ్చువాఁడు, దాత
దిసంతడుచే. దే. దూఱు, నిందించే
దిసంతు. దే. దూఱు, నింద
దిసంతుకొట్టు } దే. నిందించే
దిసంతులుకొట్టు }
దిసమొల } దే. వస్త్రహీనమైన మొల
దిస్సమొల }
దిసమొలవాఁడు } దే. వస్త్రహీనమైన మొలగల వాఁడు, దిగంబరుఁడు
దిస్సమొలవాఁడు }
దిసమొలవేల్పు } దే. శివుఁడు, కాలభైరవుఁడు
దిస్సమొలవేల్పు }

దీర్ఘపాదము. స. కొంగ
దీర్ఘపృష్ఠము. స. పాము
దీర్ఘము. స. నిడుద, ఆయతము, ఆకారము యొక్క గుఱుతు
దీర్ఘరతము. స. కుక్క
దీర్ఘరదము. స. పంది
దీర్ఘవృంతము. స. దుండిగపుచెట్టు
దీర్ఘసూత్రుఁడు. స. చిరక్రియుఁడు, విచారించి మెల్లగా కార్యము చేయువాఁడు
దీర్ఘాయువు. స. కాకి, మార్కండేయుఁడు, బూరుగుచెట్టు, పెక్కేండ్లుబ్రతుకువాఁ[డు
దీర్ఘిక. స. డిగ్గియ
దీర్ణము. స. చీల్పఁబడినది, భయపడినది
దీలు } దే. డిల్లపడు, డిల్లము, కృశించినది
డీలు }
దీలుపడు. దే. డీలుపడు, సొమ్మసిల్లు
దీవన. దే. ఆశీర్వాదము
దీవనబ్రాలు. దే. అక్షతలు, మంత్రాక్షతలు
దీవనము. స. పాచికలతో నాడుట
దీవసము. దే. ధైర్యము
దీవి. త. నీటినడిమిదిబ్బ, ద్వీపము
దీవించు. దే. ఆశీర్వదించు
దీవియ } దే. దివ్వె, దీపము
దీవె }
దీవియకంబము. దే. దీపస్తంభము
దీవెన. దే. దీవన
దీవెనకోల. దే. నమస్కారము

## దు

దుంకము. దే. రంధ్రము
దుంగము. దే. మ్రానిమొద్దు
దుండగము. త. దౌష్ట్యము, కీడు
దుండతికము. త. దుండగము
దుండి. దే. దొరసాని
దుండిగము. త. పెనుమ్రాను, మండూకపర్ణి యనుచెట్టు
దుండుబలి. దే. సోమరి
దుంత. దే. దున్న, మహిషము
దుంతరవుతు. దే. యముఁడు
దుందిలము } త. దుండిగపుచెట్టు
దుందుకము }
దుందుభి. స. పాచికయందలి యిత్తిగ, భేరి, వరుణుఁడు, ఒకసంవత్సరము, ఒకానొక రాక్షసుఁడు
దుంపము. దే. చక్రాకారపు దివటీ
దుందుఱు. దే. జొంజొఱు, చింపిఱి
దుంప. దే. గడ్డ, నాఁగేటిగొడగ
దుంపబచ్చెలి. దే. ఉపోదకి
దుంపనాశనము. దే. మొదలంట నశించుట
దుంపరాష్టము. దే. రాస్నావిశేషము
దుంబొడి. దే. మెంతి జిలకఱచేర్చి చేసిన నున్ననికూరపిండి
దుఃఖపడు. దే. నొగులు
దుఃఖపాటు. దే. దుఃఖపడుట
దుఃఖపెట్టు. దే. దుఃఖపఱచు
దుఃఖము. స. బాధ, నొగులు, వ్యసనము
దుఃఖాయమానము. స. దుఃఖము నొందుచున్నది
దుఃఖించు. స. దుఃఖపడు
దుకాణము. దే. అంగడి
దుకూలము. స. తెల్లవస్త్రము, సన్నవస్త్రము

దుక్కి. దే దున్నుట, కృషి

దుక్కిటెద్దు. దే. దున్నుట కుపయోగించెడి ఎద్దు

దుక్కిముచ్చు. దే. కమతగాఁడు

దుక్కిపాలు. దే. నాగలి

దుక్కిపాలువాలుపు. దే. బలరాముఁడు

దుగ. త. రెండు, ద్వయము

దుగమొగములపులుఁగు. దే. గండభేరుండ

దుగమొగముల వేల్పు. దే. అగ్ని

దుగినుఁడు. త. బ్రహ్మ

దుగుణము. త. దుగ, రెండింతలు, ద్విగుణము

దుగులము. దే. వరపాటలో పడియుండు భాగము

దుగ్గ } త. కాళి, పార్వతి
దుగ్గి }

దుగ్గు. దే. చెడిపోయినగడ్డి

దుగ్ధ. దే. అసూయ, కోపము, బాధ

దుగ్ధము. స. పాలు, పిదుకఁబడినది

దుగ్ధిక. స. చిఱుపాలమొక్క

దుట్టుపు. దే. జొట్టుపుమొక్క, అజశృంగి యను చెట్టు

దుడిదుడి దే. గునగున

దుడుకఁడు. త. దుష్టుఁడు

దుడుకు. త దౌష్ట్యము, ఉద్ధతి, దుష్టము, ఉద్ధతము, ఉద్ధతుఁడు, ఉద్ధతురాలు

దుడ్డు. దే. డబ్బు

దుడ్డు. త. లావుకఱ్ఱ, గద, దండము

దుడ్డుఁగఱ్ఱ } దే. లావుకఱ్ఱ
దుడ్డుఁగోల }

దుడ్డె. దే. బాలకుఁడు, ధూర్తుఁడు, ధూర్త రాలు

దుత్త. దే చిన్నమూతికుండ, చిన్నబుంగ

దుత్తాయి. దే. కుఱుచేఅరచేట్ట

దుత్తూరము దే. కపటము

దుత్తూరకము. స. ఉమ్మెత్తచెట్టు

దుద్దు. దే. [illegible], తామర [illegible], అసత్యము

దుద్దులు. దే. [illegible] చెవి [illegible]లు

దుద్దెక్కు. దే [illegible]ము

దుద్రుకము. స. [illegible]

దుధ. దే. [illegible]

దునక. దే [illegible]

దునేదారి } స. [illegible] తానుఁ
దునేదారి } డు, [illegible]

దున్న } దే. మహిషము, పురుష
దున్నపోతు } పశువు

దున్ను. దే. [illegible], కృషిచేయు

దుప్పటము } దే. రెండు [illegible] పాటివెడల్పు
దుప్పటా } వస్త్రము

దుప్పటి } దే. [illegible] వస్త్రము, [illegible]
దుప్పటి } [illegible]. దుప్పటము

దుప్పి. దే. జింక. మృగము

దుబ్బ. దే. ఆ. [illegible], [illegible]

దుబ్బు. దే. గడ్డి [illegible] గుంపు, తృణ స్తంబము

దుమారితేకు. త. [illegible]త్ర [illegible] శేషము, [illegible]

దుమదుమ. దే మిక్కిలి [illegible], కోపము

దుమదుమలాడు. దే కోపముగానుండు

దుమారము. దే. దుమ్ము

దుమాలు. దే. రుమాలము

దుము దే. దుమ్ము

దుముకు. దే. ఉఱుకు, గంతులువేయు, గంతు

దుముకులాడు. దే. గంతులు వేయు

దుముక్కు. దే. ఉఱుకుట యందగు నను కరణధ్వని

దుముదారు. దే. దండు

దుముదారుగ. దే. గుంపుగ
దుముదుములాడు. దే. దుమ్ము రేఁగు, నిప్పులు రేఁగు, దుమదుమలాడు
దుమ్మాడు. దే. దుమ్ములో నాడు. బుక్కా మొదలగు చూర్ణమును పైచల్లుకొను
దుమ్ము. దే. దుమారము, ధూళి, ఎముక
దుమ్ములగొండి. దే. మృగవిశేషము, కొర్నవగండు
దుయుముడి. దే. దూముడి
దుయ్యు. దే. దూయు, పాఱు, ప్రాణము నాటివెడలు, తీయు, ఆకులనూడఁదీయు
దురంతము. స. అంతములేనిది
దురటిల్లు. దే. దురపిల్లు
దురతిక్రమము. స. అతిక్రమింపఁగూడనిది
దురత్యయము. స. చేటులేనిది
దురద. దే. జిల, కసరు
దురదకంద. దే. కసరుగలకంద
దురదగొండి } దే. మాలగొండి
దురదగోవెల }
దురదుర. త. శీఘ్రముగా
దురదృష్టము. స. దౌర్భాగ్యము, అదృష్టము లేమి, ఆపద
దురదృష్టుఁడు. స. దౌర్భాగ్యుఁడు
దురధిగమము. స. కష్టముచేత పొందఁదగినది, కష్టముచేత చదువఁదగినది
దురధ్వము. స. చెడ్డత్రోవ
దురపిల్లు. దే. శోకించు, తపించు, కలఁగు
దురభిగ్రహము. స. ఉత్తరేను మొక్క, గ్రహింపఁగూడనిది
దురభిమానము. స. గర్వము
దురభ్యాసము. స. చెడ్డవాడుక
దురము. త. యుద్ధము, వేగము
దురవస్థ. స. సంకటస్థితి
దురవాపము. స. పొందఁగూడనిది
దురా } దే. ఆజ్ఞ, ఉత్తరువు
దురాయి }
దురాకృతము. స. అకృత్యము, అకృత్యముగా
దురాగతము. స. అన్యాయము
దురాచారము. స. చెడ్డనడవడి, చెడ్డనడవడి గలది
దురాచారుఁడు. స. చెడ్డనడవడికలవాఁడు
దురాడము. దే. ఒఱుగుదిండు
దురాత్ముఁడు. స. చెడ్డమనస్సుకలవాఁడు
దురాధర్షము. స. తిరస్కరింపఁదగనిది, తెల్లావలు
దురాధర్షుఁడు. స. తిరస్కరింపఁదగనివాఁడు
దురాపము. స. పొందఁగూడనిది
దురారోహ. స. ఖూరుగుచెట్టు [నిది
దురారోహము. స. తొండ, ఎక్కఁగూడ
దురాలభ. స. తీఁటకసింద చెట్టు, లభింపనిది
దురాలాపము. స. చెడుమాట
దురాలోకము. స. చూడఁగూడనిది
దురాశ. స. వ్యర్థమైనయాశ
దురాశయుఁడు. స. చెడ్డతలంపులుగలవాఁడు
దురాసదము. స. పొందఁగూడనిది
దురితము. స. పాపము
దురుసు. దే. కాఠిన్యము, కఠినము, శీఘ్రము
దురూహ్యము. స. ఊహింపశక్యముకానిది
దురోదరము. స. జూదము, పందెము
దురోదరుఁడు. స. జూదరి

దుర్గ. స. పార్వతి, నల్లవుచ్చెక, నీలిచెట్టు
దుర్గంధము. స. చెడువాసన, చెడువాస[నగలది
దుర్గతి. స పేదతనము, నరకము
దుర్గతుఁడు స. దరిద్రుఁడు, పేదవాఁడు
దుర్గమము. స. పోఁగూడనిది, పొందఁగూ[డనిది
దుర్గము. స. కోట, పోఁగూడనిది
దుర్గి. స. దుర్గ, పార్వతి
దుర్గుణము. స. చెడుబుద్ధి
దుర్ఘటము. స. ఘటింపనిది
దుర్జనుఁడు స. దుష్టుఁడు
దుర్జయుఁడు. స గెలువఁగూడనివాఁడు
దుర్జాతి. స. దుర్జనుఁడు, దురదృష్టము
దుర్జ్ఞేయము. స. ఎఱుఁగఁగూడనిది
దుర్దశ. స. దురదృష్టము
దుర్దాంతము. స. అణఁపఁబడనిది [ప్రౌఢు
దుర్దినము. స. మబ్బుకమ్మినదినము, మునుపు
దుర్దురూటుఁడు. స నాస్తికుఁడు
దుర్దృష్టము. స. పొరపాటుగాఁజూడఁబడినది, తప్పుగాఁ దీర్పుచెప్పఁబడినది
దుర్ధరము. స. ధరింపఁగూడనిది
దుర్ధర్ష. స. నల్లయుప్పిచెట్టు
దుర్ధర్షము. స. తిరస్కరింపఁదగనిది, పొంద శక్యము కానిది, భయంకరమగునది
దుర్ధర్షుఁడు. స. తిరస్కరింపఁదగనివాఁడు
దుర్నయము స. అన్యాయము, దుర్నీతి
దుర్నామ. స. పిఱుఁగుజెలగ
దుర్నామకము }
దుర్నామము } స. మూలరోగము
దుర్నిరీక్ష్యము. స. చూడఁగూడనిది
దుర్నివారము. స. నివారింపఁగూడనిది

దుర్బలుఁడు. స బలహీనుఁడు
దుర్బుద్ధి. స. చెడుబుద్ధి, చెడుబుద్ధికలవాఁడు
దుర్బోధుఁడు. స. బోధింపరానివాఁడు
దుర్బోధము. స. బోధింపఁగూడనిది
దుర్భాగ్యుఁడు. స. దురదృష్టుఁడు
దుర్భాష స. బూతు, తిట్టు
దుర్భిక్షము. స. క్షామము. కఱవు
దుర్మతి. స. ఒకసంవత్సరము, దుర్బుద్ధికల వాఁడు
దుర్మదము. స. అధికగర్వము [దు
దుర్మనస్కుఁడు. స. దుఃఖాక్రాంతమనస్కుఁ
దుర్మరణము. స. విషభక్షణాదులచేత కలిగెడు చెడ్డచావు [సము
దుర్మాంసము. స. వ్రణమునందు పెరుఁగుమాం
దుర్మానము. స. గర్వము
దుర్మార్గము. స. చెడుప్రవర్తన, దౌర్జన్యము
దుర్ముఖి. స. ఒకసంవత్సరము
దుర్ముఖుఁడు. స. ఒకరాక్షసుఁడు, అసంబద్ధవచనములాడువాఁడు
దుర్ముహూర్తము. స. చెడ్డముహూర్తము
దుర్యోగము. స. కష్టదశ
దుర్లభము. స. పొందనశక్యమైనది
దుర్వర్ణము. స వెండి, చెడ్డవర్ణముగలది
దుర్వహము. స. వహింపఁగూడనిది
దుర్వాంఛ. స. కోరఁగూడని కోరిక
దుర్వారము. స. నివారింపశక్యముకానిది
దుర్వార్త. స చెడ్డసమాచారము
దుర్విధుఁడు స. దరిద్రుఁడు, దుర్జనుఁడు
దుర్వినీతుఁడు. స. వినయములేనివాఁడు, అవినీతుఁడు

దుర్వృత్తుఁడు. స. దుర్మార్గుఁడు, దుశ్చరి[తుఁడు
దుర్వ్యాపారము. స. చెడునడత
దుర్హృదుఁడు. స. పగవాఁడు, చెడ్డమనసు కలవాఁడు
దులదుల. దే. సంభ్రమము
దులి. స. ఆఁడుతాఁబేలు, ముని
దులుపు. దే. రాల్చు, విదిలించు
దువ. త. దుగ
దువారము. త. వాకిలి
దువాళము } దేః అంతమేరయు వేగమున
దువాళి } సమముగా పాఱెడియశ్వ[ధార
దువాళించు. దే. దువాళముచేయు
దువ్వు. దే. దుమ్ము. ధూళి
దువ్వటము. త. దుప్పటము
దువ్వలువ. దే. దుప్పటము, కట్టుకోక
దువ్వి. త. పులి, చిఱుతపులి
దువ్వు. దే. దువ్వెనతో తలచిక్కుదీయు, [నిమురు
దువ్వు. త. పులి, చిఱుతపులి
దువ్వెన. దే. దువ్వుట కుపయుక్తమైన సాధనము, కంకతిక
దుశ్చేష్ట. స. దుర్మార్గపుపని
దుశ్చ్యవనుఁడు. స. ఇంద్రుఁడు
దుశ్శిరము. స. దూసరితీఁగ
దుష్కరము. స. చేయఁగూడనిది
దుష్కృతము. స. పాపము, దుష్టముగా చేయఁబడినది
దుష్టము. స. చెడ్డది, చెడిపోయినది, నాశమైనది, నేరముగలది, పాపముగలది, నీచమైనది, పనికిమాలినది, పాపము
దుష్టుఁడు. స. చెడ్డవాఁడు
దుష్పత్త్రము. స. నల్లకచోరము, బలు[రక్కెస
దుష్ఫలము. స. చెడ్డత్రోవ
దుష్ప్రధర్షిణి. స. ములకచెట్టు
దుష్ప్రభ. స. మైలచాయతొండ
దుష్ప్రాపము. స. పొందఁగూడనిది
దుసికిల్లు } దే. జాఱు, తప్పించుకొను
దుసికిలు }
దుస్తంత్రము. స. కపటోపాయము
దుస్తరము. స. తరింపఁగూడనిది, కష్టము
దుస్తు. దే. వస్త్రము, అందము
దుస్త్యజము. స. విడువఁగూడనిది
దుస్పర్శ. స. వాఁకుడుచెట్టు
దుస్పర్శము. స. తీఁటకసిందచెట్టు, తీక్ష్ణమైన స్పర్శముకలది
దుస్సంగము. స. కూడనికూడిక
దుస్సంధి. స. వ్యాకరణములోకూడనిసంధి
దుస్సర. దే. దూసరమొక్క
దుస్ససేనుఁడు. త. దుర్యోధనునితమ్ముఁడు
దుస్సహము. స. సహింపఁగూడనిది
దుస్స్వప్నము. స. చెడ్డకల
దుహిత. స. కూఁతురు
దుహ్యము. స. పాలు పిదుకఁదగినది

## దూ

దూఁకలి. త. బాధ
దూఁకు. దే. దుముకు
దూఁకుడు. దే. ఎగుడుదిగుడు, ఉద్ధతి
దూఁకొను. దే. ఆస్వాదించు, పొందు, ప్రవేశించు
దూఁగర. దే. వడ్లుమొదలైనవానిలోనిదుమ్ము
దూంట. దే. అరఁటియూఁచె

దూఁటిపోవు. దే. పరుగెత్తు
దూఁటు. దే. పొడుచు
దూఁటుకొను. దే. పొడుచుకొను, ఎగురు
దూఁబఱబండి. దే. ఎంతయున్నను మిగులఁ బెట్టక అంతయుం వెచ్చించితిను వాఁడు, అతివ్యయము
దూఁబిడి. దే. నూలు తోఁడుచున్నప్పుడు ఏదు తగిలించుటకు నిలిపెడు పేరముచ్చిన కొయ్య
దూగఱ. దే. కటుదూపము
దూడ. దే. పశుశిశువు
దూడపాల. దే. శాకబవృక్షము
దూత / దూతుఁడు } స. రాయబారి, కుంటెన కాఁడు
దూతము. స. బాధింపఁబడినది, కాల్పఁబడినది
దూతి / దూతిక } స. కుంటెనకత్తె
దూత్యము. స. దూతభావము, దూతకర్మము, దూతస్వభావము
దూది. దే. విత్తుతీసిన ప్రత్తి, తూలము
దూదిదబ్బ. దే. తోలుదళముగానుండెడుదబ్బ
దూదినిమ్మ. దే. మాతులుంగవృక్షము
దూనము. స. తపింపఁజేయఁబడినది, సంతాపితము
దూప. దే. దప్పి
దూపటిల్లు / దూపటిలు } దే. దప్పిగొను, పరితపించు, బడలు
దూపము. త. వాసనగలపొగ
దూపార్తి. త. దూపమువేసెడు పాత్ర
దూపించు / దూపిల్లు / దూపిలు } దే. దప్పిగొను, పరితపించు

దూబ. దే. అధముఁడు, హీనుఁడు
దూబాచి. దే. బాలక్రీడావిశేషముచందుగు కనుకెంపము
దూబాచేలు. దే. బాలక్రీడావిశేషము
దూము. దే. పాడుచేయుట, కొల్ల, దోఁపిడి, మూఁకి తెప్పలు
దూముడి. దే. దూపాంముకై
దూయు. దే. పాఁకు, ఆకులను పిడికిటితో నూడఁజేయు, తీయు
దూయుతీఁగ. దే. దూసరతీఁగ
దూయుముడి. దే. సులభముగా నూడఁ దీయునట్లు పెనఁబడిచివేసిన ముడి
దూరగుఁడు. స. దూరముగనున్నవాఁడు
దూరదర్శి. స. విద్వాంసుఁడు, గద్ద, దూరపు యోచన కలవాఁడు
దూరదృష్టి. స. దూరదృష్టిగలవాఁడు
దూరభారము. స. మిక్కిలి దూరము
దూరము. స. దవ్వు
దూర్వ. స. గఱిక
దూఱు. దే. నిందించు, నింద, తూఱు, చొచ్చు
దూఱుదుంకెన. దే. బాలక్రీడా విశేషము
దూఱువడు. దే. నిందింపఁబడు
దూల. దే. దురద, జిల
దూలగొండి. దే. దురదగొండి
దూలపోతు. దే. ఎప్పుడునుదూలగలవాఁడు
దూలము. దే. గోడలపైగాని స్తంభములపైగాని గుజ్జులకు నాధారముగ వేయు పెద్దదారువు
దూషణము. స. దూషించుట, నిందించుట
దూషణీయము. స. దూషింపఁదగినది

దూషించు. స. నిందించు, తిట్టు
దూషిక. స కంటిపుసి, పాతెపురుగు
దూష్యా. స. పిసుఁగునడుమునఁ గట్టెడు తోలుమోకు
దూష్యము. స. గుడారము,దూషింపఁదగినది
దూసర. దే. పత్నాదనివృక్షము
దూసరి. దే. తృణవిశేషము
దూసరులు. దే. తృణధాన్యవిశేషము

## దృ

దృంభువు. స. పాము [వాఁడు
దృక్కు. స. కన్ను, చూపు, బుద్ధి, చూచు
దృగాయుధుఁడు. స. శివుఁడు
దృగ్ధము. స. కూర్పఁబడినది [బలిసినది
దృఢము. స. అత్యంతము. అధికము, గట్టిది,
దృఢసంధి. స. బెస్సగానతికినకీలు
దృఢీకరణము. స. స్థిరపఱచుట
దృఢుఁడు. స. బలిసినవాఁడు
దృతము స. ఆదరింపఁబడినది
దృతి. స. తిత్తి
దృతిహారుఁడు. స. నీళ్లుమోయువాఁడు
దృత్యము. స. మర్యాద
దృప్తుఁడు. స. దర్పించినవాఁడు [ములు
దృబ్ధము. స. కూర్పఁబడిన పుష్పమాలికా
దృశ. స. దృక్కు, చూపు
దృశ్యము. స చూడఁదగినది
దృశ్యుఁడు. స. చూడఁదగినవాఁడు
దృషత్తు. స. రాయి, సన్నెకల్లు
దృషత్పుత్రి. స. కల్వపుగుండు, పొత్తరము
దృష్టకష్టుఁడు. స కష్టముల ననుభవించిన వాఁడు
దృష్టము. స. చూడఁబడినది, రాజునకు తనబలమువలననైనను శత్రుబలమువలన నైనను పుట్టినభయము, కనఁబడినది, తెలియఁబడినది, నిశ్చయింపఁ బడినది, అనుభవింపఁబడినది
దృష్టరజ. స. సమర్తాడినపడుచు
దృష్టాంతము. స ఉదాహరణము. ఒకయలంకారము, శాస్త్రము, చేవు
దృష్టాంతీకరించు. స. ఉదాహరించు
దృష్టి. స. చూపు, కన్ను, బుద్ధి
దృష్టించు. స. చూచు
దృష్టితగులు. దే. చెడ్డకండ్లవారి దృష్టిచే దోషము సంభవించు
దృష్టిదోషము. స. దృష్టితగులుట

## దె

దెంచేనము. దే. పెద్దపిరంగి, దంచేనము[ము
దెందము. దే. మనస్సు, హృదయము, డెంద
దెత్తి. దే. దయ్యము
దెప్పము. దే. బాణాదుల కెదుట నిలిపిన కృత్రిమ లక్ష్యము, కూటలక్ష్యము
దెప్పరము. దే. ఆపద, అశక్యము, దుస్సహము, దుస్సహావనము, డెప్పరము
దెప్పరిల్లు } దే. ఆపదనొందు,బాధఁజెందు
దెప్పరిలు }
దెప్పుతీకము. దే. దుస్సహత్వము
దెప్పు. దే. ఒకఁడుచేసినకీడును మేలును ఎదుట చెప్పు, కృతప్రశంసము
దెప్పుడు. దే. దెప్పుట
దెబ్బ. దే. కొట్టు, తాడనము
దెబ్బాటు. దే. బలిష్ఠమైనవాన

దెబ్బన. దే. గొబ్బున
దెస. త. దిక్కు, అవస్థ, ప్రాపు, పార్శ్వము, కాపు

## దే

జేంద్ర. దే. జేంద్రపులము, తంతువాయభేదము
దేఁకు. దే. కూర్చుండిముడ్డితో జరుగు
దేదీప్యమానము. స. మిగుల ప్రకాశించునది
దేనము. స. ధ్యానము
దేబె. దే. దేవురగొట్టు, దీనుఁడు
దేయము. స. ఈయఁదగినది
దేరిజ. దే. గుడారము
దేవకము. స. పాచిక
దేవకాంచనము. స. కోవిదారవృక్షము
దేవకీనందనుఁడు. స. కృష్ణుఁడు
దేవకుసుమము. స. లవంగము
దేవఖాతకము. స. దేవతలు త్రవ్వినది, మనుష్యులచేత త్రవ్వఁబడనికోనేఱు మొదలగునది, అఖాతము
దేవచ్ఛందము. స. నూఱుపేటలహారము
దేవజగ్ధకము. స. కామంచిగడ్డి
దేవత. స. వేలుపు, దేవుఁడు
దేవతరువు. స. కల్పవృక్షము, వేల్పుఁజెట్టు
దేవతాజీవము. స. దేవునివంటిది, దోషమెఱుఁగనిది
దేవతాడి. త. దేవతాళవృక్షము
దేవతాళము. స. డావరడంగిచెట్టు
దేవదత్తము. స. ఒకఉపవాయువు, అర్జునుని శంఖము
దేవదారి. త. దేవదారువృక్షము
దేవదారువు. స. ఒక[illegible]వృక్షము
దేవదాసి. స. దేవళములో సేవచేయు భోగముది
దేవదేవుఁడు. స. విష్ణువు, పరమాత్మ
దేవద్ర్యఙ్ఙు. స. దేవతలఁగూర్చి పోవువాఁడు, దేవపూజకుఁడు
దేవనము. స. క్రీడ, జూదము, గెలువనిచ్ఛ, వ్యవహారము, పాచిక
దేవనాళము. స. అడవికిక్కెనసవు
దేవభూయము. స. దేవత్వము
దేవమణి. స. కౌస్తుభము, గుఱ్ఱము మెడ సుడి, శివుఁడు [పైరుగలదేశము
దేవమాతృకము. స. వానచేత పండెడు
దేవమాసము. స. గర్భాష్టమమాసము
దేవయజ్ఞము. స. హోమము, వేలిమి
దేవయానము. స. విమానము
దేవర. త. దేవుఁడు, ప్రభువు
దేవరుఁడు. స. మగనితోఁబుట్టువు
దేవలుఁడు. స. అర్చకుఁడు, పూజారి
దేవళము. త. దేవాలయము, గుడి
దేవళ్లు. త. దేవతలు, దేవరలు
దేవవర్ధకి. స. విశ్వకర్మ
దేవవల్లభము. స. పొన్నచెట్టు
దేవసాయుజ్యము. స. దేవత్వము
దేవాంగులు. స. జేంద్రవారు
దేవాజీవి } స. అర్చకుఁడు, పూజారి, ఎవరికిని హానిచేయని, దేవునివంటిజంతువు
దేవాజీవుఁడు }
దేవాదాయము. స. గుడి మాన్యము
దేవానాంప్రియము. స. మేఁక
దేవానాంప్రియుఁడు. స. మూర్ఖుఁడు
దేవాయుధములు. స. రాళ్లు, దుడ్డుకఱ్ఱలు ఆకస్మికముగఁ గలిగిన యుపద్రవము

దేవాలయము. స. దేవళము, గుడి

దేవి. స. పార్వతి, రాణి, చేంగచెట్టు

దేవు. దే. పిడింతపడఁగొట్టు, పెరుకు

దేవుఁడు. స. దేవత, వేలుపు

దేవుకొను. దే. కష్టపడి ప్రోగుచేసికొను, బలాత్కారముగా తీసికొను

దేవురించు. దే. దైన్యము నొందు, దైన్యముతో యాచించు

దేవురింపు. దే. దేవురించుట

దేవుర. దే. దైన్యము

దేవురుగొట్టు. దే. దరిద్రుఁడు, పేదయాచకుఁడు

దేవులాడు దే. వెదకులాడు

దేవృఁడు. స. దేవరుఁడు

దేవేరి } స. దొరసాని, రాజపత్ని
దేవెరి }

దేశకాకి. దే. ఇల్లులేకతిరుగువాఁడు

దేశపాండ్య } స. గొప్పకరగ్రాహి
దేశముఖి }

దేశము. స. అనేకపట్టణములుగల గొప్ప భూభాగము, రాజ్యము, ప్రదేశము

దేశరూపము. స. న్యాయము, పాడి

దేశవాళి. దే. స్వదేశమందుఁ గలిగినది

దేశాంతరము. స. ఇతరదేశము

దేశాచారము. స. దేశమందలిమర్యాద

దేశాటనము. స. దేశసంచారము

దేశాధిపతి. స. రాజు

దేశికుఁడు. స. గురువు, దేశముతిరుగువాఁడు, పాలించువాఁడు

దేశీయము } స. దేశమునకుఁ దగినది
దేశ్యము }

దేహంభరుఁడు. స. తిండిపోతు

దేహము. స. శరీరము, మేను

దేహయాత్ర. స. తిండి, చావు

దేహళి. స. గడప, కడప

దేహాంతము. స. చావు

దేహి. స. దేహముగలవాఁడు, ఆత్మ

## దై

దైతేయుఁడు. స. తొలువేల్పు, రాక్షసుఁడు

దైత్యగురుఁడు. స. శుక్రుఁడు

దైత్యారి. స. విష్ణువు, వేలుపు

దైత్యుఁడు. స. రాక్షసుఁడు

దైనము. స. దినసంబంధమైనది

దైనికి. స దినముకూలి

దైన్యపడు దే. దీనత్వమునొందు

దైన్యపాటు. దే. దైన్యపడుట

దైన్యము. స. దారిద్ర్యాదులచేత కలుగు దురవస్థ, దీనత్వము

దైర్ఘ్యము. స. నిడుపు

దైవజ్ఞ. స. సోదెకత్తె, బల్లి

దైవజ్ఞుఁడు. స. జోస్యుఁడు, గణకుఁడు

దైవతము. స. వేలుపు, దేవతది

దైవప్రశ్నము. స. ఉపశ్రుతి

దైవము. స. అదృష్టము, దేవత

దైవయోగము. స. అదృష్టము

దైవాఱు. దే. అతిశయించు, పొరలిపాఱు

దైవి. స. దేవసంబంధమైనది, జ్యోతిష్కుఁడు

దైవికము. స. దైవమువలనఁ గలిగినది [డు

దైశికము. స. దేశసంబంధమైనది [వాఁడు

దైష్టికుఁడు. స. ప్రతిదైవకృతమనినమ్ము

దొని త. ధ్వని
దొసుకు. దే. విచారము, వ్యథ
దొన్నియ } త. త్రాగుట కుపయోగమైన
దొన్నె } దొప్ప
దొపారము. దే. దేగలముక్కులకు కన్ను లగపడకుండ కట్టివేసినగంతలు
దొప్ప } దే. దొన్నె
దొప్ప }
దొప్పదోఁగు. దే. విశేషముగా తడియు
దొబ్బ దే. మాంసఖండము, ముద్ద, నెత్తురు కండ [స్త్రీనిచెఱచు
దొబ్బు. దే. త్రోయు, సంగమముచేయు,
దొబ్బుడాయి. దే. రోగవిశేషము, మదము, గర్వము
దొబ్బులాట. దే. గుద్దులాట
దొబ్బులు. దే. త్రోపులు, చివాట్లు
దొమ్మ. దే. పశువులకు కలిగెడివ్యాధి
దొమ్మడోలు. దే. ఆశ్వగంధివృక్షము
దొమ్మర. దే. ఒకానొకజాతి
దొమ్మరి. దే. దొమ్మరివాఁడు
దొమ్మి. త. అంఱు కలియఁబడి చేయు యుద్ధము, అందఱు కలియఁబడుట, సందడి [పెనఁగులాడు
దొమ్ములాడు. దే. దొమ్మియుద్ధముచేయు,
దొర. దే. రాజు, సేనానాయకుఁడు, యోధవరుఁడు, ప్రభువు, గొప్పవాఁడు, సమానుఁడు, సామ్యము, యజమానుఁడు
దొరఁకుసన్యాసి. దే నమ్మించి మోసపుచ్చి దొంగిలించుకొనిపోయెడుదొంగ
దొరఁకొను. దే. యత్నించు, మొదలుకొను
దొరకడలు. దే. గొప్పఅల
దొరకు. దే. చిక్కు లభించు
దొరకుపడు. దే. చిక్కుకొను
దొరకొను. దే. లభించు, సంభవించు, సిద్ధించు [ఆరంభించుట
దొరకోలు. దే. యత్నించుట, లభించుట,
దొరకోలుసన్యాసి. దే. దొంగ
దొరగడలు. దే. గొప్పఅల, కల్లోలము
దొరతనము. దే. ప్రభుత్వము, పాలనము
దొరయు దే. అంటు, సమానమగు, కలుగు, జేరగు, పోలు. పొందు, ప్రకాశించు [కొను, అనుభవించు
దొరలు. దే. దొర్లు, పడు, కలయు, మాఱు
దొరవి. దే. కొలను [మానురాలు
దొరసాని. దే. రాజుభార్య, రాణి, యజ
దొరుగండి. దే. నీళ్లు వెలుపటికిఁబోవుటకై యేర్పఱచిన దొరువుతూము
దొరువు. దే. నడబావి, చెలమ, కొలను
దొరువుపట్టెడ. దే గంతయెద్దులతోఁక క్రిందఁ దగిలించెడు పట్టెడ
దొర్లు. దే. పొర్లు
దొఱయు. దే. పొందు
దొలుపు. దే. దొర్లఁజేయు
దొసఁగు } దే. ఆపద, విఘ్నము
దొసవు }

## దో

దో. స. బాహువు
దోఁకిస. దే. దోఁకుట
దోఁకు. దే. గడ్డిమొదఁలైనవానిని చెక్కు
దోఁకుడు. దే. దోఁకుట

దోరగిల్లు } దే. ఎట్టిపాఱు, వ్రాలు
దోరగిలు }

దోరణ } త. తోరణము, వాకిలి మొదలగు ప్రదేశములందు కట్టెడు మామిడాకులు మొదలగునవి గ్రుచ్చిన దండ
దోరణము }

దోరణపుఁగమ్మి. త. ద్వారముమీఁదియడ్డకమ్మి, లక్ష్మీకమ్మి

దోరణపుఁబట్టె. త. కపిలెబిల్లక్రింది యడ్డపట్టె

దోరణపుసాటెరిక్క. దే. అనూరాధానక్షత్రము

దోరపాక. దే. ఓరపాక

దోరము. స. త్రాడు

దోరము. త. ద్వారము, దువారము

దోరు. దే. చేచ్చు, వ్రాలు, తొలఁగిపోవు

దోరుచు } దే. చేంపు, వ్రాల్చు
దోర్చు }

దోరువా. దే. పక్షివిశేషము

దోరెము. దే. దేగలకు కట్టెడుత్రాడు

దోర్బలుఁడు. స. భుజబలముగలవాఁడు

దోర్మధ్యము. స. పిడికిటిపోటు

దోర్మూలము. స. చంక

దోల } స. తొట్ల, డోలి, సిలిచెట్టు
డోల }

దోవతి. దే. మగవానికట్టువస్త్రము, పరిధానము

దోష. స. భుజము, రాత్రి

దోషకము. స. దోసె, అట్టు

దోషకారి. స. దోషముచేయువాఁడు

దోషగుణము. స. లోపాలోపములు, రోగముగందలి అపాయచిహ్నము

దోషగ్రాహము. స. ఇందుపుఁజెట్టు

దోషజ్ఞుఁడు. స. విద్వాంసుఁడు, వైద్యుఁడు, దోషము నెఱిఁగినవాఁడు

దోషము. స. తప్పు, పాపము, దూషణము, రోగమందలి అపాయచిహ్నము, కావ్యదోషము, నేరము, రోగము

దోషాకరుఁడు స. చంద్రుఁడు

దోషాక్షరము. స శాపము, తిట్టు

దోషాచరుఁడు. స. చంద్రుఁడు, రాక్షసుఁడు

దోషి. స. దోషముగలవాఁడు

దోషించు. స. దోషముపుట్టు

దోస. దే. కర్కటి

దోసకారి. త. దుష్టుఁడు, దుష్టురాలు

దోసము. త. పాపము, తప్పు

దోసి. త. తప్పుగలవాఁడు, తప్పుగలది, పాపిష్ఠుఁడు, పాపిష్ఠురాలు

దోసిలి. త. దోయిలి

దోసిలించు. త. దోయిలించు

దోసె } త. ఒకదినుసుపిండివంట, అట్టు
దోసియ }

దోహదము. స. ఇచ్ఛ, గర్భిణికిఁగల వేవిళ్లు, ఎరువు, తరుగుల్మలతాదులకు అకాలమునందు పుష్పాదులను బుట్టించెడు స్త్రీల పాదతాడనాదిక్రియ, వృక్షములను పెంచునట్టి క్రియలను తెలుపుశాస్త్రము

దోహదలక్షణము. స. స్త్రీలవయస్సంధి, గర్భము

దోహదవతి. స. వేవిళ్లుగలఆఁడుది

దోహనము. స. పాలుపిదుకుట

దోహలము. స. ఉత్సాహము, ఇచ్ఛ, పాలుపితుకుపాత్ర

దోహలి. స. సమర్థుఁడు

దోహలుఁడు. స. విశేషముకోరికగలవాఁడు

## దా

దా
దవ్వ } దే. దూరము

దౌడ
దవుడ } దే. బుగ్గలోపలి భాగము, తాలువు

దౌడు
దవుడు } త జోడన, అశ్వగలిపిశేషము

దౌత్యము. స.దూతభావము, దూతకర్మము. దూతస్వభావము

దౌదవ్వుల. దే. దూరదూరముగ [త్రనము

దౌరాత్మ్యము. స. దురాత్మభావము, చెడ్డ

దౌరితము. స. హాని

దౌరు
దవురు } దే. కాంతి

దౌరుగోడ. దే. బావిచేట్టుగ నుండుగోడ

దౌర్జన్యము. స దుర్జనభావము, చెడ్డతనము

దౌర్బల్యము. స. బలహీనత

దౌర్మనస్యము. స. దుఃఖము

దౌర్హృదుఁడు. స. దొంగ, మోసగాఁడు

దౌర్భాగ్యము. స. దురదృష్టము

దౌవారికుఁడు. స. ద్వారపాలకుఁడు

దౌవు. దే. దవ్వు

దౌశ్చర్మ్యము. స. చర్మవ్యాధి [వర్తనము

దౌశ్శీల్యము. స. చెడ్డస్వభావము, దుష్ప్ర

దౌష్ట్యము. స. దుష్టస్వభావము, చెడ్డతనము

దౌహిత్రాయణుఁడు. స. దౌహిత్రునికొడుకు

దౌహిత్రి. స. కూఁతునికూఁతురు

దౌహిత్రుఁడు. స. దుహితకొడుకు, మను మఁడు

దౌహృదము. స. దోహదము, వేవిళ్లు

## ద్యా

ద్యావాపృథివ్యలు. స. మిన్ను మన్నులు

## ద్యు

ద్యుగము. స. పక్షి

ద్యుతి. స. కాంతి, వెలుగు

ద్యుమణి. స. సూర్యుఁడు, చేవలుమానికము

ద్యుమ్నము. స. ధనము, బలము

## ద్యూ

ద్యూతకరుఁడు
ద్యూతకృత్తు } స. జూదమాడువాఁడు

ద్యూతకారుఁడు
ద్యూతకారకుఁడు } స. జూదమాడువాఁడు, జూదమునకై యొకయింటిని ఏర్పాటుచేసికొని యుండువాఁడు

ద్యూతము. స. జూదము

## ద్యో

ద్యోతకము. స. ప్రకాశింపఁజేయునది

ద్యోతటిని. స. ఆకాశగంగ

ద్యోతనము. స. ప్రకాశించుట

ద్యోతనిక. స. తేటపఱచుట

ద్యోతమానము. స. ప్రకాశించుచున్నది

ద్యోతము. స. ప్రకాశము, ఎండ

ద్యోతించు. స. ప్రకాశించు

ద్యోతితము. స. ప్రకాశితము

ద్యోవీథి. స. ఆకాశము

# ద్ర

ద్రఢిమ. స. స్థిరత్వము
ద్రఢిష్ఠము. స. మిగులదృఢమైనది
ద్రఢిష్ఠుఁడు. స. మిగులదృఢమైనవాఁడు
ద్రప్సము. స జలబిందువు, తుంపురు, అడుగు పెరుఁగు, నీళ్లుకలసిన పెరుఁగు
ద్రబ్బెడ. దే. భక్ష్యవిశేషము
ద్రవంతి. స. ఎలుకజీడిమొక్క, నది
ద్రవద్రవ్యము. స. జలమువంటి ద్రవరూప
ద్రవము. స. రసము, తడి, పరుగు, పరిహాసము
ద్రవించే. స. కాఱు [పదార్థము
ద్రవిడము. స. దక్షిణదేశము
ద్రవిణము. స. ధనము, బంగారు, బలము
ద్రవ్యము. స. ధనము, ఇత్తడి, మందు, భవ్యము, మంచిపదార్థము, లక్క
ద్రష్ట. స. చూచువాఁడు, న్యాయపుఁదీర్పరి
ద్రష్టవ్యము. స. చూడఁదగినది

# ద్రా

ద్రాక్ష. స. ఒకానొకతీఁగె, దాక
ద్రాఘిష్ఠము. స. మిక్కిలిదీర్ఘము
ద్రాపము. స. బురద, స్వర్గము, ఆకాశము
ద్రాపుఁడు స. బుద్ధిహీనుఁడు
ద్రాబ. దే. వ్యర్థుఁడు, అసారము, అసారుఁడు, అధమము, అధముఁడు
ద్రావకము. స. వస్తువులయందుఁ దీసెడి రస విశేషము, బరువైనబాయి, తైలము
ద్రావకుఁడు. స. నేర్పరి, మోసకాఁడు, దొంగ [చేట
ద్రావణము. స. పరుగెత్తించేట, కరఁగిం
ద్రావము. స. పరుగు, కరఁగుట
ద్రావిడప్రాణాయామము. స. చిక్కుగల్గి సరళము గానిపని
ద్రావిడము. స ద్రవిడభాష, గంధకచోరము [బుట్టినవాఁడు
ద్రావిడుఁడు. స. ద్రవిడదేశమునందుఁ

# ద్రు

ద్రుఘణము. స. ఇనుపసుద్దు, గండగొడ్డలి
ద్రుడ్డు. త. దుడ్డు
ద్రుణము. స. కత్తి, విల్లు, తేలు
ద్రుతము. స. త్వరితము, వడిగలది, కరఁగినది, చీలినది, నకారము
ద్రుతి. స. కరఁగుట
ద్రుపదము. స. బొండకొయ్య
ద్రుమనఖము. స. ముల్లు
ద్రుమము. స. వృక్షము, పారిజాతవృక్షము
ద్రుమామయము. స. లక్క
ద్రుమోత్పలము. స కొండగోఁగు
ద్రువయము. స. త్రాసు, మూర, తూము లోనగు మానము
ద్రువు. స. చెట్టు
ద్రుహిణుఁడు } స. బ్రహ్మ
ద్రుఘణుఁడు }

# ద్రూ

ద్రూణము. స. ఎఱ్ఱతేలు, తేలు

# ద్రొ

ద్రొబ్బు. దే. గెంటు, పడఁద్రోయు

ద్విగుణాకృతము. స రెండుచోట్ల దున్నిన పొలము
ద్విజ. స. బారంగి మొక్క, రేణుకయను
ద్విజన్మము. స. పక్షి, పల్లు [గంధద్రవ్యము
ద్విజన్ముఁడు. స. బ్రాహ్మణుఁడు, క్షత్రియుఁడు, వైశ్యుఁడు
ద్విజము. స. పక్షి, పల్లు, పాము
ద్విజరాజు. స. చంద్రుఁడు, గరుత్మంతుఁడు, శేషుఁడు [బ్రాహ్మణుఁడు
ద్విజాతి. స. పక్షి, పాము మొదలగునది,
ద్విజిహ్వము. స. పాము
ద్విజిహ్వుఁడు. స. కొండెగాఁడు
ద్విజుఁడు. స. బ్రాహ్మణుఁడు, క్షత్రియుఁడు, వైశ్యుఁడు
ద్వితయము. స. జేత, రెండు
ద్వితీయ. స. భార్య, విదియ
ద్వితీయము. స. రెండవది [పొలము
ద్వితీయాకృతము. స. రెండుచాల్లు దున్నిన
ద్వితీయుఁడు. స కొడుకు, రెండవవాఁడు
ద్విపటి. స. దుప్పటము, కప్పుకుదుప్పటి
ద్విపద. స. పద్యభేదము
ద్విపదుఁడు. స. మనుష్యుఁడు
ద్విపము. స. ఏనుఁగు, రెంటఁద్రావుడు
ద్విపాద్యము. స. రెట్టింపగుదండుగ
ద్విప్రవ్రజిని. స. ఇద్దఱివెంటఁబోవునది, జారిణి [తుపాసి
ద్విభాషి. స. రెండుభాషలు తెలిసినవాఁడు,
ద్విరదము. స. ఏనుఁగు
ద్విరసనము. స. పాము
ద్విరుక్తి. స. రెండుసార్లు చెప్పఁబడినది

ద్విరేఫము. స. తుమ్మెద
ద్విషత్తు } స. శత్రువు
ద్విషుఁడు }
ద్విష్టము. స. విరోధమైనది, రాగి
ద్విసీత్యము } స. రెండుమాఱులు దున్నిన పొలము
ద్విహల్యము }
ద్విహాయని స రెండేండ్లపెయ్య

# ద్వీ

ద్వీపము. స. పులితోలు, దీవి
ద్వీపవతి. స. నగి
ద్వీపి. స. పులి, సముద్రము

# ద్వే

ద్వేషణుఁడు. స. పగవాఁడు
ద్వేషము స. శత్రుత్వము, పగ
ద్వేషి. స. ద్వేషముగలవాఁడు
ద్వేషించు. స. విరోధించు
ద్వేష్ట. స. ద్వేషించువాఁడు
ద్వేష్యము. స. అసహ్యమైనది, విరోధింపఁదగినది [పగవాఁడు
ద్వేష్యుఁడు. స. ద్వేషింపఁదగినవాఁడు,

# ద్వై

ద్వైగుణికుఁడు. స. నూటికి నూఱువంతున వడ్డిపుచ్చుకొనువాఁడు
ద్వైతము. స. జీవాత్మపరమాత్మలకు భేదము చెప్పెడియొకమతము, ఒకానొకవనము
ద్వైధము. స. షడ్గుణములలోనొకటి, భేదము పుట్టించుట

ద్వైధీభావము స. రెండుగా నగుట, అని శ్చయము, సందేహము
ద్వైపము. స. ద్వీపిచర్మముచేత కప్పఁబడి నది, ద్వీపిసంబంధమైనది, ద్వీపసంబంధ మైనది
ద్వైపాయనుఁడు. స. వ్యాసుఁడు
ద్వైమాతురుఁడు స. వినాయకుఁడు,జరా సంధుఁడు
ద్వైవార్షికము. స. రెండు సంవత్సరములకు కొకసారి కలుగునది [దము
ద్వైవిధ్యము. స. రెండువిధములుగలది, భే

# ద్వ్య

ద్వ్యర్థి. స. రెండర్థములుగలది
ద్వ్యష్టము. స తామ్రము, రాగి

# ధ

ధ. ఒకయక్షరము
ధగధగ. స. ప్రకాశము
ధగద్ధగీయము. స. ధగధగయని వెలుఁగునది
ధట. స. త్రాసు, ధటము
ధటి. స. బట్ట, గోఁచి
ధటిని. స. నూలిమొలత్రాడు
ధట్ట. స. సేన
ధట్టము. స. సమూహము
ధనంజయపురము. స. అగ్నిపర్వతము
ధనంజయము. స. ఒకఉపవాయువు, సర్ప విశేషము, మద్దిచెట్టు
ధనంజయుఁడు. స. అర్జునుఁడు, అగ్ని
ధనకము. స. అత్యాశ

ధనదుఁడు. స. కుబేరుఁడు, దాత
ధనము. స. విత్తము, ఆవులమంద, ఆస్తి, భాగ్యము, మిక్కిలి ప్రేమాస్పదమగు వస్తువు, పందెముకై ఆసలు, దోఁచుకొన్న సొమ్ము, ఆటలో గెలిచిన బహుమానము, సంకలనపుగుణితు, ధ్వని
ధనహారి. స. పల్లకపురోకము, బలురక్కెస
ధనాధికారి } స. కోశాధికారి
ధనాధ్యక్షుఁడు } స. కోశాధికారి
ధనాధిపుఁడు. స. కుబేరుఁడు
ధని. స. ధనముగలవాఁడు
ధనిక. స. మంచిఆఁడుది, యౌవనముగల ఆఁడుది
ధనికము. స. ధనియాలు
ధనికుఁడు. స. ధనముగలవాఁడు, మంచి వాఁడు, అప్పిచ్చువాఁడు, భర్త
ధనిష్ఠ. స. నక్షత్రవిశేషము
ధనిష్ఠము. స. మిక్కిలి భాగ్యముగలది
ధనుఃపటము. స. మోరటిచెట్టు
ధనుర్ధరుఁడు. స. విలుకాఁడు
ధనుర్వేదము. స. విలువిద్య
ధనువు } స. విల్లు, ఒకరాశి, నాలుగుమూ రలకొలఁది, మోరటిచెట్టు, విలుకాఁడు
ధనుస్సు } స. విల్లు, ఒకరాశి, నాలుగుమూ రలకొలఁది, మోరటిచెట్టు, విలుకాఁడు
ధనుశ్శ్రేణి స. చాఁగచెట్టు
ధనుష్మంతుఁడు. స. విలుకాఁడు [వాఁడు
ధన్య. స. ఉసిరిక, దాది, ధన్యురాలు
ధన్యంమన్యుఁడు.స. ధన్యుఁడననితలఁచేకొను వాఁడు
ధన్యము. స. భాగ్యము, భాగ్యవంతమగు
ధన్యవాదము. స. వందనము లర్పించుట
ధన్యుఁడు. స. పుణ్యవంతుఁడు
ధన్వంతరము. స. వింటిపట్టు

ధన్వంతరి. స. దేవవైద్యుఁడు, సూర్యుఁడు, మహేశ్వరుఁడు
ధన్వము. స. మెట్టనేల, విల్లు, నిర్జలభూమి
ధన్వయాసము. స. తీఁటకసింద చెట్టు
ధన్వి. స. ఏఱుమద్దిచెట్టు, అర్జునుఁడు, విలుకాఁడు, నేర్పరి
ధమకుఁడు. స. కమ్మరవాఁడు
ధమనము. స. కిక్కసకసవు
ధమని. స. నరము, నఖము నెడు గంధద్రవ్యము, మెడ, అగసాలెవానిగొట్టము
ధమనుఁడు. స. అగ్ని, కొలిమితిత్తినూఁదువాఁడు, క్రూరుఁడు
ధమ్మిల్లము. స. కొప్పు
ధర. స. నేల, మావి, మెదడు [ము
ధరణము. స. ధరించుట, టంకముతో సగ
ధరణి. స. భూమి
ధరణీధరము. స. కొండ, నేలతాలుపు
ధరణీధరుఁడు. స. విష్ణువు, శేషుఁడు, రాజు
ధరణీయము. స. ధరింపఁదగినది
ధరణీశ్వరుఁడు. స. రాజు, శివుఁడు
ధరణీసుతుఁడు. స. అంగారకుఁడు
ధరము. స. కొండ, పత్తి
ధరాధరము. స. కొండ, తాఁబేలు
ధరామరుఁడు. స. బ్రాహ్మణుఁడు, నేలవేల్పు
ధరించు. స. తాల్చు
ధరిత్రి. స. భూమి
ధర్త. స. ధరించువాఁడు
ధర్తవ్యము. స. ధరింపఁదగినది
ధర్మకర్త. స. దేవళమందలి కార్యనిర్వాహకుఁడు, న్యాయము తీర్చువాఁడు

ధర్మచారిణి. స. భార్య
ధర్మజుఁడు. స. ధర్మపత్నికిపుట్టిన కొడుకు
ధర్మజ్ఞుఁడు. స. ధర్మము నెఱిఁగినవాఁడు
ధర్మధ్వజి. స. జీవనార్థము లింగజటాభస్మాదులను ధరించినవాఁడు, తాఁటదమ్ముఁడు, ధర్మధ్వజుఁడు
ధర్మధ్వజుఁడు. స. పైకి భక్తిగలవానివలె నటించుచు నిజమైన భక్తిలేనివాఁడు
ధర్మపత్ని. స. అగ్నిసాక్షిగఁ బెండ్లాడిన పెండ్లాము
ధర్మపుత్త్రుఁడు. స. యుధిష్ఠిరుఁడు
ధర్మము. స. పుణ్యము, న్యాయము, స్వభావము, ఆచారము, వేదోక్తవిధి, ఉపనిషత్తు, యజ్ఞము, విల్లు, సత్కార్యము, నీతి
ధర్మరాజు. స. యుధిష్ఠిరుఁడు, యముఁడు, బుద్ధదేవుఁడు
ధర్మవాణిజకుఁడు. స. తానుపుణ్యకార్యములను చేయుమనని వర్తకునివలె జనుల వలన లాభమును పొందువాఁడు
ధర్మవైతంసికుఁడు స. తాను దాతయని కనఁబడుటకై యన్యాయార్జితమగు తన ధనమును దానముచేయువాఁడు
ధర్మశాస్త్రము. స. న్యాయశాస్త్రము
ధర్మసంహిత. స. మన్వాది ధర్మశాస్త్రము, స్మృతి [సత్త్రము
ధర్మసత్త్రము. స. అన్నదానముచేయు
ధర్మాత్ముఁడు. స. పుణ్యాత్ముఁడు
ధర్మాధికరణము. స. న్యాయవిచారణస్థలము [రించువాఁడు
ధర్మాధికృతుఁడు. స. న్యాయము విచా

ధర్మాసనము స ధర్మాధికారికూర్చుండుపీఠ
ధర్మి. స. ధర్మముగలది [ము
ధర్మిష్ఠుఁడు. స. ధర్మాత్ముఁడు, విష్ణువు
ధర్ముఁడు. స. యముఁడు, సోమయాజి
ధర్మువు. త. ధర్మము
ధర్మోపదేశము. స. నీతిని బోధించుట
ధర్మ్యము. స. ధర్మమువలన తొలఁగనిది
ధర్షణము } స. ధైర్యము, గర్వము, స్త్రీని
ధర్షము } చెఱుపుట, తిరస్కారము, బెదరించుట
ధర్షణి. స. అంకుటాలు
ధర్షించు. స. తిరస్కరించు
ధవము. స ఉమ్మెత్తచెట్టు, చేంద్రచెట్టు, [కదపుట, వణఁకుట
ధవళి. స. ఆవు
ధవళము. స. తెలుపు, తెల్లనిది, ఆబోతు
ధవళములు. గ్రా. పాటలభేదము
ధవళాంగి. స. సరస్వతి
ధవళిమ } స. తెలుపు
ధవళిమము }
ధవిత్రము. స. యజ్ఞమునందు అగ్నిని విస రుటకై కృష్ణాజినములో చేయఁబడిన విసనకఱ్ఱ
ధవుఁడు. స. పెనిమిటి, రాజు, మనుష్యుఁడు

## ధా

ధాటి. స. దండయాత్ర, దాడి
దాత. స. బ్రహ్మ, ఒకసంవత్సరము, ధరించు వాఁడు, రక్షించువాఁడు
ధాతకి } స. ఆరెచెట్టు
ధాతుపుష్పిక }
ధాతుపాఠము. స.శబ్దపాఠము, వ్యాకరణము
ధాతువు. స. పాకముఁగానగునది, వసగా నగునది, గైరికధాతువు, పృథివిగానగు నది, త్వక్కుగానగునది, భూధాతువు లోనగునది, నాడి
ధాత్రి. స. నేల, దాది, తల్లి, ఉసిరిక, ధరించునది, ధరింపఁజేయునది
ధాత్రేయి } స. సవతితోడఁ బుట్టినది,
ధాత్రేయిక } పాలిచ్చువాది, భూమి
ధాన. స. దనియాలు, మొగ్గ
ధానము. స. స్థానము, పోషణము
ధానలు. స. బొదగులు, వేఁపుడుబియ్యము
ధానుష్కుఁడు. స. విలుకాఁడు
ధాన్యము. స. కొలుచు, గోదుమలు మొద లగునవి, దనియాలు
ధాన్యాకము. స. దనియాలు
ధాన్యామ్లము. స. పులియఁబెట్టిన కడుగు
ధామనిధి. స. సూర్యుఁడు [నిరు, కలి
ధామము. స. ఇల్లు, చోటు, కాంతి, ప్ర భావము, శరీరము, జన్మము [మొక్క
ధామార్గవము. స. ఆవడచెట్టు, ఉత్తరేను
ధాయ్య. స. యజ్ఞమునందు అగ్నిని ప్రజ్వ లింపఁజేయునపుడు పఠించెడు ఋక్కు
ధార. స. పైనుండిపడు నీరు లోనగువాని చాలు, వానకాలు, కత్తిలోనగువాని పదను, కుండలోనగువాని చిల్లి, అశ్వ గతి, ప్రవాహము, పరంపర
ధారకము. స. ఆహారము, పథ్యమునకు ముందిచ్చుజావ మొదలగునది
ధారణ. స. భగవంతునిఁదప్ప మఱియొకటి నెఱుఁగమి, మేర, వస్తువినిమయము

ధారణము. స. ధరించేట
ధారణి. స. భూమి [చేయు
ధారపోయు. దే. చేతనీళ్లుపోసికొని దత్తము
ధారము. స. అప్పు
ధారయితవ్యము. స. ధరింపఁదగినది
ధారయిత్రి. స. భూమి
ధారాకదంబము. స. నీరుకడిమిచెట్టు
ధారాగృహీతము. స. దానముగా పొందఁ బడినది
ధారాటము. స. గుఱ్ఱము, వానకోయిల
ధారాదత్తము. స. మంత్రపూర్వకముగ నీయఁబడినది
ధారాధరము. స. మేఘము, ఖడ్గము
ధారాళము. స. అడ్డపాటులేనిది [రముగా
ధారాళముగ. దే. సులభముగా, నిరభ్యంత
ధారిక. స. చెవిచోరుపాము, జెఱ్ఱి
ధార్తరాష్ట్రము. స. నల్లనిముక్కు కాళ్లు గలహంస
ధార్తరాష్ట్రుఁడు. స. ధృతరాష్ట్రుని కొడుకు
ధార్మపత్తనము. స. మిరియము [ష్కుఁడు
ధార్మికుఁడు. స. పుణ్యాత్ముఁడు, ధాను
ధార్మిణము. స. ధర్మాత్ములగుంపు
ధార్య. స. ఒకబుక్కు, యజ్ఞమునందు అగ్నిభేదము, కొండచెట్టు, ధరింపఁ దగినది [దగినది
ధార్యము. స. ధరింపఁదగినది, సహింపఁ
ధార్ష్ట్యము. స. దిట్టతనము
ధావకుఁడు. స. చాకలవాఁడు
ధావనము. స. పరుగెత్తుట, ప్రవహించేట, ఉతుకుట, శుద్ధిచేయుట, తోముట
ధావని. స. నక్కతోక పొన్నచెట్టు
ధావళ్యము. స. తెలుపు

## ధి

ధిక్కరించు. స. తిరస్కరించు
ధిక్కారము. స. తిరస్కారము
ధిక్కారి. స. ధిక్కరించువాఁడు
ధిక్కృతుఁడు. స. తిరస్కరింపఁబడినవాఁడు, వెలివేయఁబడినవాఁడు
ధిక్క్రియ. స. ధిక్కారము
ధిగ్దండము. స. ఛీవాట్లుపెట్టుట
ధిత్సువు. స. మోసముచేయనిచ్ఛగలవాఁడు
ధిషణ. స. బుద్ధి
ధిషణము. స. నివాసస్థానము
ధిషణుఁడు. స. బృహస్పతి
ధిష్ణ్యము. స. గృహము, స్థానము, బలము, నక్షత్రము

## ధీ

ధీ. స. బుద్ధి, మతి
ధీంద్రియము. స. జ్ఞానేంద్రియము
ధీతము. స. పానముచేయఁబడినది, తలఁపఁ
ధీతి. స. తలంపు, ధ్యానము [బడినది
ధీపతి. స. బృహస్పతి
ధీమంతుఁడు. స. విద్వాంసుఁడు, బృహస్పతి, బుద్ధిగలవాఁడు
ధీమతి. స. బుద్ధిమంతురాలు
ధీర. స. వ్యంగ్యముగా కోప ప్రకాశము చేయునాయిక, ధీరురాలు
ధీరత్వము. స. ధైర్యము
ధీరము. స. కుంకుమపువ్వు, ధైర్యముగలది

ధీరలలితుఁడు / ధీరశాంతుఁడు } స. చతుర్విధనాయకులలో నొకఁడు

ధీరాధీర. స. వ్యంగ్యావ్యంగ్యముగా కోప ప్రకాశము చేయునాయిక

ధీరుఁడు. స. విద్వాంసుఁడు, ధైర్యముగల వాఁడు, స్వాతంత్ర్యము గలవాఁడు

ధీరోదాత్తుఁడు / ధీరోద్ధతుఁడు } స. చతుర్విధ నాయకుల లో నొకఁడు

ధీవరుఁడు. స. జాలరి, కైవర్తుఁడు

ధీసచివుఁడు. స. కార్యాలోచనయోగ్యుఁ డగు మంత్రి

## ధు

ధుంధుమారము. స. కఱదూపము, పట్టుపురుగు

ధుతము. స. కదలింపఁబడినది, విడువఁబడినది

ధుత్తూరము / దస్తూరము } స. ఉమ్మెత్తచెట్టు

ధుని. స. నది

ధుర / ధురి } స. బరువు

ధురంధరము. స. బరువుమోసెడి యెద్దు, బరువుమోయునది

ధురంధరుఁడు. స. భారమువహించువాఁడు

ధురీణము. స. బరువు మోసెడియెద్దు, బరువు మోయునది [నేర్పరి

ధురీణుఁడు. స. భారమువహించువాఁడు,

ధుర్యత. స. భారవహనసామర్థ్యము

ధుర్యము. స. బరువుమోసెడియెద్దు, బరువు మోయునది

ధుర్యుఁడు. స. భారము వహించువాఁడు

## ధూ

ధూంక్ష్మము. స. తెల్లకాకి

ధూతము. స. కదలింపఁబడినది, విడువఁబడి [నది

ధూననము. స. కదలించుట

ధూపము. స. వాసనగలపొగ, ధూపము

ధూపాయితము. స. తపింపఁజేయఁబడినది

ధూపితము. స. ధూపము వేయఁబడినది, తపింపఁజేయఁబడినది

ధూమకేతువు. స. ఉత్పాతము, అగ్ని,

ధూమధ్వజుఁడు. స. అగ్ని [తోఁకచుక్క

ధూమము. స. పొగ

ధూమయోని. స. మేఘము, అగ్ని

ధూమలము. స. ఎక్కువనలుపు తక్కువ యెఱుపుగలసినరంగు

ధూమిక. స. దట్టమగుమంచు

ధూమ్య. స. ధూమములసమూహము

ధూమ్యాటము. స. పక్షివిశేషము, కూఁకటి మూఁగ

ధూమ్రకము. స. ఒంటె

ధూమ్రపత్త్రిక. స. పొగచెట్టు

ధూమ్రము. స. ఎక్కువనలుపు తక్కువ యెఱుపుగలసినరంగు

ధూర్జటి. స. శివుఁడు

ధూర్తజంతువు. స. మనుష్యుఁడు

ధూర్తము. స. ఒకవిధపుఉప్పు, ఉమ్మెత్తచెట్టు, హానికరము, త్రుప్పు

ధూర్తుఁడు / ధూర్తు } స. జూదరి, మోసకాఁడు

ధూర్వహత. స. వహించుట

ధూర్వహము. స. బరువు మోసెడియెద్దు, బరువు మోయునది
ధూర్వహుఁడు. స. భారమువహించేవాఁడు
ధూళి. స. దుమ్ము, పరాగము
ధూళికదంబము. స. బట్టకడిమిచెట్టు
ధూళిధ్వజుఁడు. స. వాయువు
ధూసరము. స. బూడిదవర్ణము, బూడిద వర్ణముగలది, గాడిద

## ధృ

ధృతము. స. ధరింపఁబడినది
ధృతరాష్ట్రుఁడు. స. దుర్యోధనునితండ్రి, సర్పవిశేషము, రాజు
ధృతాత్ముఁడు. స. చాంచల్యములేనివాఁడు
ధృతి. స. ధరించుట, ధైర్యము, సంతోషము, సౌఖ్యము, ఒకగ్రహయోగము, యజ్ఞము, ద్రావకము
ధృవ. స. ముయ్యాకుఁబొన్న
ధృష్టి. స. దిట్టతనము
ధృష్టుఁడు. స. చతుర్విధశృంగారనాయకులలో నొకఁడు, దిట్టతనము గలవాఁడు

## ధే

ధేనుక. స. లేఁగటియావు, ఆఁడేనుఁగు, ఆఁడుగుఱ్ఱము, చిన్నకత్తి, పార్వతి
ధేనుకము. స. చీరపేను, ఆవులమంద
ధేనువు. స. లేఁగటియావు
ధేనుష్య. స. బందెపడ్డ, లేక కుదువపెట్టఁబడిన యావు, లేక యెనుము

## ధై

ధైనుకము. స. ధేనుకల సమూహము
ధైర్యము. స. ధీరత్వము
ధైవతము. స. సప్తస్వరములలో నొకటి
ధైవత్యము. స. దిట్టతనము, నేర్పు

## ధో

ధోరణము. స. వాహనము, ఎక్కఁదగిన యేనుఁగు మొదలగునది
ధోరణి. స. పద్ధతి, పఙ్క్తి

## ధౌ

ధౌతము. స. కడుగఁబడినది, తెల్లనిది
ధౌరంధర్యము. స. ధురంధరత్వము
ధౌరితకము. స. జోడన, అశ్వగతిభేదము
ధౌరేయము. స. బరువుమోసెడియెద్దు, బరువుమోయునది
ధౌరేయుఁడు. స. భారమువహించువాఁడు
ధౌర్త్యము. స. ధూర్తత్వము

## ధ్యా

ధ్యాత. స. ధ్యానించేవాఁడు
ధ్యాతము. స. ధ్యానింపఁబడినది
ధ్యాతవ్యము. స. ధ్యానింపఁదగినది
ధ్యానము. స. చాంచల్యము లేక దేవుని మనస్సులో తలఁచుట
ధ్యానించు. స ధ్యానముచేయు
ధ్యామము. స. కామంచిగడ్డి, దవనము, నల్లనిది
ధ్యాయము. స. కామంచిగడ్డి

## ధ్యే

ధ్యేయము. స ధ్యానింపఁదగినది

## ధ్రు

ధ్రువ. స. స్రుగ్భేదము, గుఱ్ఱపుసుడి, ముయ్యాకుఁబొన్న

ధ్రువపఱచు. దే. నిశ్చయపఱచు
ధ్రువము. స. ఊహ, నిశ్చయము, మఱ్ఱిచెట్టు, మ్రాను, గసిక, గ్రహయోగవిశేషము, తాళవిశేషము, ఎడరెగసిరి. కదలనిది
ధ్రువశీలుఁడు. స. ఒక్కచోటనే నిలుకడగా నుండఁ గోరువాఁడు
ధ్రువుఁడు. స. నక్షత్రవిశేషము, ఒకవస్తువు, విష్ణువు, శివుఁడు

## ధ్వ

ధ్వంసకుఁడు. స. నాశముచేయువాఁడు
ధ్వంసము. స. నాశము
ధ్వంసితము. స. ధ్వంసము చేయఁబడినది
ధ్వజద్రుమము. స. తాటిచెట్టు
ధ్వజపటము. స. జెండాగుడ్డ
ధ్వజపాతము } స. బిడ్డలను పుట్టించే లేక
ధ్వజభంగము } పోవుట
ధ్వజము. స. టెక్కెము, టెక్కెపుకంబము, గుఱుతు, మగగుఱి, గర్వము
ధ్వజారోహణము. స. దేవళములో యుత్సవారంభమందు ధ్వజమెత్తి చేయునొక కర్మము [నటించువాఁడు
ధ్వజికుఁడు స. మతమందు అభిమానమున్నట్లు
ధ్వజిని. స. సేన
ధ్వజుఁడు. స. కల్లమ్మెడువాఁడు
ధ్వననము. స. ధ్వనించుట [న శబ్దము
ధ్వని స. శబ్దము, చెప్పడు, వ్యంగ్యప్రధా
ధ్వనించు. స. శబ్దించు, మ్రోయు
ధ్వనితము. స. మ్రోయునది
ధ్వస్తము. స. నశించినది, జాఱినది

## ధ్మా

ధ్మాకారుఁడు. స. కమ్మరవాఁడు
ధ్మాతము. స. తిత్తితో ఊఁదఁబడినది, రగుల్పఁబడినది
ధ్మానము. స. ఊదుట
ధ్మాపితము. స భస్మము చేయఁబడినది

## ధ్వా

ధ్వాంక్షము. స. కాకి, కొక్కెర
ధ్వాంక్షి. స. అడవికాకి
ధ్వాంక్షుఁడు. స. బిచ్చమెత్తువాఁడు, మొండివాఁడు, పద్దవాఁడు
ధ్వాంతము. స. చీఁకటి
ధ్వానము. స. ధ్వని, మ్రోత

## న

న. ఒక యక్షరము
నంకు. దే. నేలకుకోరాడు
నంగ. దే. నంగనాచి
నంగనాచి. దే. పిట్టతనము కలిగియు బయటికి ఏమియు తెలియని దానివలె నుండునది, పద్దబిలుక
నంగి. దే. ముక్కుతో పలుకఁబడినమాట
నంగు. దే. ముక్కుతో మాటాడు
నంగుఁడు. స. జారుఁడు [మడి
నంజే. దే. నంజుకొనువస్తువు, ఉపదంశము,
నంజు. దే.కూర లోనగువ్యంజనములను తిను, విషము, శత్రువుచచ్చి తెల్లపాఱుట
నంజుడు. దే. మాంసము [తినువాఁడు
నంజుడుదిండి. దే. రాక్షసుఁడు, మాంసము

నంజేలు. దే. ఊరఁగాయలు లోనగునవి
నంజేవాఱు. దే. నెత్తురుచేచ్చి తెల్లపాఱు
నంటు. దే. స్నేహము, స్నేహితుఁడు
నంటుకత్తె. దే. స్నేహితురాలు
నంటుకాఁడు. దే. స్నేహితుఁడు
నంద్రకాయ. దే. పీత
నంద. స. తిథివిశేషము, ముంత, కలిమి, జిత్తులమారితనము
నందకము. స. విష్ణునిఖడ్గము, సంతోషించేనది
నందన. స. కూఁతురు, ఒకసంవత్సరము
నందనము. స. ఇంద్రునియుద్యానవనము, ఉద్యానవనము
నందనుఁడు. స. కొడుకు, సంతోషించువాఁడు
నందము. స. సుఖము, సంతోషము, కప్ప
నంది. స. శివునివృషభము, ఎద్దుమ, ఱ్ఱిచెట్టు సంతోషము, జోదము
నందించే. స. సంతోషించు
నందిని. స. కూఁతురు
నందిముఖి. స. నక్కతోఁకబియ్యము
నందివర్ధనము. గ్రా. ఒకానొకపూఁచెట్టు
నందివర్ధనము. స. అమావాస్య, పున్నమ
నందివృక్షము. స. వృక్షవిశేషము
నందుఁడు. స. ఒకగోపకుఁడు
నంద్యావర్తము. స. పడమటఁ దక్కఁ దక్కినమూఁడుదిక్కుల వాకిళ్లుగలరాజగృహము, నందివర్ధనవృక్షము
నంబి. దే. విష్ణుపూజకుఁడు
నంశుకము. స. హాసికరమైనది, సూక్ష్మమైనది
నకనకఁబడు. దే. కృశించు, వాడు
నకనకలాడు. దే. నకినకఁబడు
నకనకలు. దే. కార్శ్యము
నకనకలుగుడుచే } దే. నకనకఁబడు
నకనకగుడుచే }
నకీబు. దే. వెండిబెత్తమువాఁడు, వేత్రధరుఁడు
నకులము. స. ముంగిస
నకులుఁడు. స. ధర్మరాజుతమ్ముఁడు
నకులేష్ట. స. సర్పాక్షిచెట్టు
నక్క. త. జంబుకము, క్షుద్రము
నక్కజిత్తు. దే. నక్కచేయు మోసము, జిత్తులమారితనము
నక్కతోఁకకసవు. దే. సింహపుచ్ఛి
నక్కతోఁకపొన్న. దే. క్రోష్టువిన్నవృక్షము
నక్కతోఁకబియ్యము. దే. ధాన్యవిశేషము
నక్కదోస. దే. క్షుద్రోర్వారుకము
నక్కనరము. దే. ఒకదినుసువేఱు
నక్కనేరెడు. దే. భూజంబూవృక్షము
నక్కనైచ్యము. దే. అతివినయము, సంతోషము, సుఖము
నక్కవిరిగి. దే. క్షుద్రశ్లేష్మాతకవృక్షము
నక్కిళ్లు. దే. ప్రక్కపండ్లకీళ్లు
నక్కు. దే. ఒదుఁగు, మ్రానియతుకు, బంగారపుబిళ్ల, బంగారు నఱకఁగా నడుమఁగనుపట్టెడునిగ్గు, నాఁగటికఱ్ఱు, దాఁగు
నక్కెర. దే. కంది, తొఁగరిచెట్టు
నక్కెఱు. దే. ఒకానొకచెట్టు
నక్తంకరుఁడు. స. చంద్రుఁడు
నక్తంచరము. స. గుడ్లగూబ
నక్తంచరుఁడు. స. రాక్షసుఁడు, రేద్రిమ్మరి
నక్తకము. స. వస్త్రము, చినిఁగినవస్త్రము, మాసినవస్త్రము

నక్తమారము } స. కానుగుచెట్టు
నక్తమాలము }

నక్తము. స. రాత్రి, వ్రతనియమముతో రాత్రియందు మాత్రము భోజనము చేయుట [మొసలి

నక్రము. స. అడ్డకమ్మి, త్రొక్కుడుకమ్మి,

నక్షత్రమాల. స. ఇరువదియేడుముత్యములు గ్రుచ్చిన యొంటిపేటహారము

నక్షత్రము. స. అశ్విని మొదలగు చుక్క

నక్షత్రసూచకుడు. స. చెడ్డజ్యోతిష్కుడు జ్యోతిషము చక్కగా తెలియనివాడు

నక్షత్రేశుడు. స. చంద్రుడు, చుక్కరా

నఖంపచము. స. గోరుకాల్చునది [యడు

నఖక్షతము. స. గిల్లుటవలనచర్మముమీద నేర్పడినగోటిగురుతు

నఖఖాది. స. గోళ్లు కొరుకుకొనువాడు

నఖము. స. గోరు

నఖముఖాలనుండి. దే. ప్రతిచోటినుండి

నఖముఖాలు. స. అంకుశము, పైపన్క్తి౦చు

నఖరము. స. నఖము, గోరు, ఆయుధము

నఖరాయుధము. స. పులి

నఖవిష్కిరము. స. మనుష్యుడు

నఖోత్పాటని. స. గోరుగల్లు

నగ. దే. భూషణము, లోహపాత్రము సిద్దెలజోడు, దూది, పొగాకు మొద లగువానికంట్లపు మూట

నగధరుడు. స. విష్ణువు

నగము. స. కొండ, చెట్టు

నగరమార్గము. స. రాజమార్గము

నగరము. స. పట్టణము

నగరి. స. పట్టణము

నగరీయము. స. నగరసంబంధమగునది

నగరు. దే. రాజగృహము, దేవగృహము

నగిరి. దే. నవ్వగలవాడు

నగవు. దే. నవ్వు

నగారి. స. ఇంద్రుడు

నగాధిపుడు. స. హిమవంతుడు

నగారా. దే. చిప్రము

నగించు. దే. నవ్వించు [ము, నవ్వ

నగు. దే. హసించు, ఉపహసించు, హాస

నగుబాటు. దే. ఉపహాసము

నగౌకసము. స. పక్షి, సింహము

నగ్గు దే నుగ్గు

నగ్న. స. దిసమొలదానిది [చేయుట

నగ్నంకరణము స. దిసమొలగనుండునట్లు

నగ్నము. స దిగంబరమైనది

నగ్నిక. స. కన్య, దిసమొలదానిది, సిగ్గులేని స్త్రీ

నగ్నుడు. స. బుద్ధదేవుడు, బట్టువాడు, దిసమొలవాడు

నచ్చిక } దే. నమ్మిక, నమ్మిగ
నచ్చిగ }

నచ్చు. దే. నమ్ము, అలస్యము, బాధ

నచ్చుకాడు. దే. అలసుడు, బాధకుడు

నచ్చుపప్పు. దే. నచ్చుగొట్టు

నచ్చుగొట్టు. దే. నచ్చుపెట్టువాడు

నచ్చుపెట్టు. దే. తొందరపెట్టు, బాధించు

నజ్జు. దే. అణచు, మిక్కిలి నలగినది

నటనము. స. నాట్యము, నటన, కపట ప్రవర్తనము

నటము. స దుండిగిపుప్పాను

నటవాలు. దే. అశ్వగతివిశేషము
నటి. స. వేశ్య, నట్టువుని పెండ్లాము, కాకి దొండచెట్టు, నాట్యముచేసెడి స్త్రీ
నటించు. స. నర్తించు, వర్తించు, కపటముగా ప్రవర్తించు
నటుఁడు. స. నట్టువుఁడు
నటేశ్వరుఁడు. స. శివుఁడు
నట్ట. దే. పాచిక
నట్టడవి దే. అరణ్యమధ్యము
నట్టనడుము, నట్టకనడుము } దే. సరిమధ్యము
నట్టాడు. దే. నర్తించు, చలించు
నట్టిల్లు. దే. గృహమధ్యము, గర్భగృహము
నట్టు. దే. వాసస్థానము, స్థానము, ఆలస్యము, ఆటంకము, సస్యరోగవిశేషము
నట్టు. త. నట్టువుఁడు
నట్టుక. దే. అటక
నట్టుకొట్టు. దే. ఆలస్యముచేయు
నట్టుకొను. దే. కుదురుకొను, నెలకొను
నట్టుగుఁడు. త. నట్టువుఁడు
నట్టుపులుఁగు దే. నట్టువపులుఁగు, నెమిలి
నట్టువ. త. ఆట, నర్తనము, నట్టువుఁడు
నట్టువకాఁడు. దే నట్టువుఁడు
నట్టువడు. దే. అడ్డిపడు
నట్టువపులుఁగు, నట్టువపిట్ట } దే. నెమిలి, నర్తనప్రియము
నట్టువచావడి. దే. నాట్యశాల
నట్టువాఁడు దే. నట్టువుఁడు
నట్టువుఁడు. త. వేశ్యల కాటఁగఱపునటుఁడు
నట్టువొజ్జ. త. నాట్యోపాధ్యాయుఁడు
నట్టేఱు. దే. నదీమధ్యము

నట్టొట్లు. దే. వానకురిసి వెలిసిన పిమ్మట చూరులోనుండిగాని చెట్ల ఆకులనుండి గాని జలధారలు లోనగునవి నిరంతరముగా పడి యుడిగినవెనుక అచ్చోటఁ గాని నిలిచినిలిచిపడెడుబొట్లు, అట్టొట్లు
నట్వాలు. దే. నటవాలు, అశ్వరేచితగతి
నడ. దే. నడక, గమనము
నడక. దే. గమనము, నడవడి, ప్రవర్తనము
నడగఁడు. దే. గుఱ్ఱము
నడగొట్టు. దే. ఉండు, నిలుచు
నడచు. దే. గమనించు, ప్రవర్తించు
నడచుకొను. దే. ప్రవర్తించు
నడజోదు దే. కాలిబంటు, పదాతి
నడత. దే. నడవడి, ప్రవర్తనము
నడతెంచు. దే. నడచు, పోవు
నడదివియ. దే. దివటీ
నడపు. దే. నడవఁజేయు, గమనము, ప్రవర్తనము
నడబావి. దే. నడచిపోవుటకు మెట్లేర్పఱచినబావి
నడము, నళము } స. కిక్కసగడ్డి
నడయాడు. దే. సంచరించు, చలించు
నడవ. దే. తలవాకిటికిని నడిమివాకిటికిని నడిమిచోటు, అళిందము, సేతువు, మార్గము
నడవడి, నడవడిక } దే. నడత, చరిత్రము
నడి. దే. మధ్యము
నడికట్టు దే. మగవారు బిగువునకై నడుమునఁ గట్టుకొనెడు కట్టు, పటకా, సారసనము

నడికట్టుత్రాడు. దే. పిఱుఁగు నడుమునఁ గట్టెడుత్రాడు
నడికిరేయి } దే. అర్ధరాత్రము
నడికిరే
నడికొప్పు. దే. ఇంటినడుముకొప్పు
నడితి. దే. నడవడి
నడినూకలు. దే. నలినూకలు, అర్ధశంఖులములు
నడినెత్తి } దే. బ్రహ్మరంధ్రస్థానము
నడునెత్తి
నడిమి. దే. మధ్యము
నడిమిదిన్నె. దే. ద్వీపము
నడిమివాఁడు. దే. మధ్యవాఁడు
నడిప్రేలు. దే. మధ్యమ
నడు. దే. నడి, మధ్యము
నడుఁకు. దే. వడఁకు, కంపించే, కంపము
నడుకొను. దే. కంపించే
నడుగలను. దే. యుద్ధభూమి మధ్యము
నడుగుంట. దే. తలనడిమిపల్లము, బ్రహ్మరంధ్రము
నడుచే. దే. నడచు
నడుచొచ్చు. దే. నడుమప్రవేశించే
నడుదింపు. దే. మాంసవిశేషము [ణము
నడనడు. దే. వడఁకుటయందగు నయకర
నడుపు. దే. నడపు, ఆచరించే
నడుమంతరము } దే. కొను, మధ్యకాలము, మధ్యకాలమునఁ గలిగినది
నడుమంత్రము
నడుము } దే. కౌను, మధ్యభాగము
నడ్ము
నడుముకట్టుకొను. దే. సిద్ధపడు
నడురేయి } దే. అర్ధరాత్రము
నడురే

నడుపడి. దే. నడపడి
నడుసిరి. దే. [illegible]
నడ్డి. దే. నడుము వెనుకను వంగెడుచోటులు, కూను, వీపు
నడ్డిగుంట. దే. కుకుందరము
నడ్డిముక్కలాడు. దే. ఇసుకలాడు
నడ్తి. దే. నడితి, నడత
నడ్య. స. రెల్లుసమూహము
నడ్వంతము } స. రెల్లుగడ్డిగల దేశము
నడ్వలము
నతము. స. వంగినది, వంగియున్నది, లోతైనది
నతి. స. నమస్కారము, వ్రక్కు
నతుడు. స. వంగినవాడు
నత్త. దే. గుల్లయందుండుపురుగు
నత్తగుల్ల. దే. క్షుద్రశంఖము
నత్తి. దే. తడబడుచుమాటాడెడు వ్యాధి విశేషము |కుడు
నత్తివాఁడు. దే. నత్తిగలవాఁడు, ఆక్షేప
నత్తు. దే. తడఁబడుచుమాటాడు, ముక్కుపోగు
నదము. స. పడమరగాఁ బాఱెడినది, మ్రోఁత, సముద్రము
నది. స. ఆమడకుమీఱితే పాఱెడియేఱు, ఏఱు
నదిక. స. చిన్ననది
నదీమాతృకము. స. ఏఱులచేత పండెడు పైరుగల దేశము
నదీసర్జము. స. ఏఱుమద్దిచెట్టు
నద్ధము. స. కట్టఁబడినది, పైకెత్తఁబడినది
నద్యము. స. నదిసంబంధమైనది
నధ్రి. స. టంగువాఱు

నన. దే. చిగురు, మొగ్గ, పుష్పము

నసంద
ననాంద } స. మగనితోడఁ బుట్టినది

ననఁబోఁడి. దే. ఆఁడుది, పుష్పమువలె మనోజ్ఞురాలయిన స్త్రీ

ననకారు. దే. వసంతఋతువు

ననసీరు. దే. పుష్పరసము, మకరందము

ననయు. దే. పూచే, చిగురించే

ననవిలుకాఁడు
ననవిలుతుఁడు
ననవిల్తుఁడు } దే. మన్మథుఁడు

ననుఁబ్రాయి. దే. చక్కఁగా ఉడుకని బియ్యము

ననుఁబ్రాయివడు. దే. ననుఁబ్రాయియగు

ననుచే. దే. పూచే, చిగిరించే, మొగ్గ యెత్తు, అనురాగమొందు, అతిశయించే, ఇంపగు

ననుపు. దే. అనురాగము, ఇంపు, శరీరమున కనుకూలము, అతిశయము

ననుపుకత్తె. దే. ప్రియురాలు, విటురాలు

ననుపుకాఁడు
నన్పుకాఁడు } దే. ప్రియుఁడు, విటుఁడు

ననుపువడు. దే. స్నేహపడు

నన్న. దే. కుఱచే

నన్నూఱు. దే. చతుశ్శతము

నన్బ్రాయి. దే. ననుఁబ్రాయి

నపుంసకుఁడు. స. షండుఁడు, పేడి

నప్త. స. మనుమరాలు, మనుమఁడు, మున్మనుమఁడు

నప్త్రి. స. మనుమరాలు

నప్ప. దే. బాలకుఁడు

నభము. స. ఆకాశము, శ్రావణమాసము, మేఘము, వర్షాకాలము, ముక్కు

నభశ్చరము
నభసంగమము } స. పక్షి

నభస్యము. స. భాద్రపదమాసము

నభస్వంతుఁడు. స. వాయువు

నభోగజము. స. మేఘము

నభోమణి. స. సూర్యుఁడు

నభోవచనము. స. ఆకాశవాణి

నమనము. స. వంగుట

నమలు. దే. తిను, భక్షించే

నమసితుఁడు. స. అర్చితుఁడు

నమస్కరించే. స. చేమోడ్చు

నమస్కారము. స. చేమోడ్పు

నమస్కారి. స. ముడుఁగుఁదామర

నమస్కృతి. స. నమస్కారము

నమస్య. స. పూజ, సపర్య

నమస్యితుఁడు. స. అర్చితుఁడు

నమస్సు. స. నమస్కారము

నమించే. స. నమస్కరించే

నమితము
నమతము } స. వంగినది

నమిలి. దే. నెమిలి

నముగాములు. దే. మంచిచెడ్డలు

నముచిసూదనుఁడు. స. ఇంద్రుఁడు

నమేరువు. స. సురపొన్నచెట్టు

నమ్మకము. దే. నమ్మిక, విశ్వాసము

నమ్మదుంప. దే. గొట్టిగడ్డ, కశేరుకము

నమ్మించే. దే. నమ్మఁజేయు

నమ్మి. దే. నెమిలి, నెమ్మి

నమ్మిక
నమ్మిగ } దే. నమ్మకము

నమ్ము. దే. నమ్మకముచేయు, విశ్వసించే

నమ్రము. స. వంగినది
నయ. దే. అందము
నయకుఁడు. స. తెలివితో నిర్వహించువాఁడు, రాజ్యతంత్రము నెఱిఁగినవాఁడు
నయగారము. దే. మృదుత్వము, మృదువచనము
నయగారి. దే. మృదుత్వముగలవాఁడు
నయనము. స. కన్ను, పొందించుట
నయము. దే. లాభము, నునుపు, మృదుత్వము, చౌక, మేలైనది. నునుపైనది, అందమైనది, మృదువైనది, ఆరోగ్యము
నయము. స. నీతి, పొందించుట
నయశాలి. స. నీతివంతుఁడు
నయార్థితము. స. వినయముతో వేఁడుకోనఁబడినది
నయించు. స. పొందించు, సంపాదించు
నర. దే. ముదిమిచే వెండ్రుకలయందుఁగలుగు తెలుపు, పలితము, తెల్లఁబాఱినవెండ్రుక
నరకుఁడు. త. దుష్టుఁడు
నరకము. స. దుర్గతి, పాపాత్ములను బాధపఱచు నొకానొకలోకము
నరకాంతకుఁడు. స. కృష్ణుఁడు
నరగ } దే. భేరి
నరగజము }
నరపశువు. స. పశువువంటి నరుఁడు
నరపాలుఁడు. స. రాజు
నరపు. దే. నర, పలితము
నరము. దే. నాడి
నరము. స. రామకర్పూరవృక్షము
నరయానము. స. పల్లకి
నరయు. దే. ముదిమిచే వెండ్రుకలు తెలుపగు
నరస. దే. గొంతత్రోవ
నరవాహనుఁడు. స. కుబేరుఁడు
నరసింగఁడు. త. నృసింహుఁడు
నరసింగము. త. మల్లబంధవిశేషము [డు
నరాంతకుఁడు. స. మనుష్యులను చంపువాఁ
నరాజి } దే. కత్తి, ఖడ్గము
నరాజీ }
నరి. స. ఆఁకురి
నరిగె. దే. గొఱ్ఱెల శరీరవర్ణవిశేషము
నరిడి. దే. కుందేలను బోలు పశుభోగ [విశేషము
నరియఁడు. దే. నక్క
నరియు. దే. నరము
నరుఁడు. స. మనుష్యుఁడు, అర్జునుఁడు
నరుసో. దే. గ్రుడ్డులెత్తుకొని బయటికివచ్చుచున్నచీమలబారు
నరుపు. దే. నరపు, పలితము
నరేంద్రుఁడు. స. రాజు, పాములవాఁడు
నర్తకి. స. ఆటకత్తె, ఆఁడేనుఁగు
నర్తకుఁడు. స. నట్టువుఁడు, పాములవాఁడు, ఆడెడువాఁడు
నర్తకప్రియము. స. నెమిలి
నర్తనము. స. నటనము, ఆట
నర్తము. స. నాట్యము
నర్తయిత. స. నాట్యము నేర్పువాఁడు
నర్తించు }
నర్తిల్లు } స. నర్తనముచేయు, ఆడు
నర్తిలు }
నర్దనము. స. అఱచుట, స్తోత్రముచేయుట
నర్మగర్భము. స. పరిహాసముగలమాట
నర్మద. స. ఒకయేఱు
నర్మదుఁడు. స. నర్మసచివుఁడు [షము
నర్మము. స. పరిహాసము, మేలము, సంతో

నర్శిలి. దే. అపేక్ష, అర్శిలి
నఱకు. దే. ఖండించు, నఱకుడు
నఱకుడు. దే. ఖండనము
నఱకుడుపడు. దే ఖండితమగు
నఱవ దే. అఱవ, సాధువుకానియావు
నఱుకు. దే. నఱకు, నఱకుడు
నఱుకుడు. దే. నఱకుడు
నఱుకుపరువడి. దే శస్త్రవిద్యావిశేషము
నఱుకుబియ్యము. దే. నుఁబ్రాయి
నఱుకులాడు. దే. ఒకరునొకరు నఱుకుకొను
నఱుజే. దే. అణువు
నఱుమాడు. దే పొడిచేయు
నఱుము. దే. పొడిచేయు, పొడి
నఱ్ఱి. దే. ప్రయాసముచేత పిదుకఁదగిన యావు, ప్రయాసముచేత బండికి పూన్పఁదగినయెద్దు
నల. త. నల్ల
నలఁక. దే. నలఁకువ
నలఁకువ. దే. వ్యాధి, శ్రమము, బాధ
నలఁగు. దే నలియగు, పీడితమగు, చెడు, శ్రమపడు
నలఁగుడు. దే. పీడనము
నలఁగుడువడు. దే. పీడితమగు
నలఁగుడువెట్టు. దే. పీడించు
నలఁచు. దే. నలఁగఁజేయు
నలకు. దే. భాండవిశేషము
నలకూబరుఁడు. స కుబేరునికొడుకు
నలత, నల } దే. పురాణించినరోగము, బలహీనము, రోగము
నలదము. స. పట్టివేరు, పూఁదేనె
నలమేనిదొర. దే. విష్ణువు, కృష్ణుఁడు
నలి. దే. రోగము, పొడి, నలఁగినది, సన్నము, అత్యంతము, యోగ్యముగా, ప్రేమ, స్వల్పము
నలి. స. గువ్వగుత్తిక చెట్టు
నలిక. స. గొట్టము
నలికండ్లపాము. దే. నలికీఁచు, రక్తపుచ్ఛిక
నలికము. దే. సన్నఁదనము, సూక్ష్మము
నలికిరి, నలికీఁచు } దే. నలికండ్లపాము
నలిగులి. దే. మిక్కిలి నలఁగినది
నలిగొట్టు దే. సన్నమగునది
నలితిండి. దే. చిఱుదిండి
నలితిండికాఁడు. దే. సోమరి
నలినము. స. తామర, నీరు
నలిని. స. తామర, తామరకొలను, తామరతీఁగె
నలినూకలు. దే అర్ధతండులములు, పొడి
నలిబులి. దే. అల్లకల్లోలము
నలియు. దే. నలఁగు, భయము నొందు
నలిరేఁగు. దే. విజృంభించు
నలు. దే. నాలుగు
నలుఁగు. దే. నలియగు, స్నానమప్పుడు దేహమందు రాచుకొనుటకు కొన్ని గంధద్రవ్యములుచేర్చియుంచిన సున్నిపిండి, వధూవరులకు నలుఁగుపిండితో నలుఁగు పెట్టుట
నలుఁగుడు. దే. నలఁగుడు
నలుఁడు. స. ఒకరాజు, ఒకవానరుఁడు
నలుకువ. దే. రోగము, బాధ
నలుగడ. దే. నాలుగుదిక్కులసమాహారము
నలుగాళ్లు. దే. నాలుగుకాళ్లజంతువులు
నలుగురు. దే. నలుగురు జనులు
నలుచు. దే. నలియఁజేయు, తోము
నలుతుము. దే. నాలుగుతూములు
నలుపు. దే. నీలవర్ణము, నీలవర్ణముగలది

నలువ. దే. బ్రహ్మ
నలువమ్రొక్కు దే. నలుపదెమంది
నలువది. దే. నాలుగుపదులు
నలువపడఁతి. దే. సరస్వతి
నలువు. దే. సౌందర్యము, సామర్థ్యము, నేర్పు, ఒప్పినమైనది
నలువురు. దే. నలుగురు
నలుసాల. దే. చుట్టుకొల్లారు, చతుశ్శాల
నలుసు. దే. తృణాదిలేశము, రేణువు
నల్చదరము. దే. నలుచేదరము
నల్గురు. దే. నలుగురు
నల్తుము. దే. నలుతుము
నల్ల. దే. నెత్తురు
నల్ల. త. నలుపు, బొగ్గు, నలుపైనది
నల్లగఱిక. దే. బాలతృణము
నల్లగలువ. దే. ఇందీవరము
నల్లగిల్లు. దే. నల్లపడు
నల్లగ్రుడ్డు దే కంటిలోనినల్లనిగ్రుడ్డు
నల్లచీమ. దే మర్కటపిపీలిక
నల్లచిగాఁడు. దే. భరద్వాజపక్షి
నల్లజీడి. దే. భల్లాతకి
నల్లజీలకఱ్ఱ. దే. ఒకమందువిత్తు
నల్లతీఁగ. త. కమ్మెరామతీఁగ
నల్లత్రాఁచు దే. కృష్ణసర్పము
నల్లదాసరిగాఁడు. దే. తాఁబేలు
నల్లదిరిసెనము. దే. ఇరుగుడుచెట్టు
నల్లద్రావుడు. దే. రాక్షసుఁడు
నల్లన. త. నలుపు, కృష్ణవర్ణము
నల్లనయ్య. త. కృష్ణుఁడు, కఱివేల్పు
నల్లనేల. దే. కృష్ణభూమి

నల్లపెసలు. దే. శింబికములు
నల్లపూస. దే. చిన్నినల్లగాజుపూస
నల్లమందు. దే. అఫీని
నల్లమసుకు దే మిక్కిలి నల్లనైన [మసువు]
నల్లయుమ్మెత్త. దే. హేమిక
నల్లవడు దే. నల్లనగు
నల్లవలువతాలుపు. దే. బలరాముడు
నల్లకొ } దే. డొంక
నల్లవో }
నల్లి. దే. పరుపులయందుండి నెత్తురుత్రాగు పురుగు, మత్కుణము
నల్లిండ్లు. దే. అగ్రహారము
నల్లిక. దే నరికంట్లపాము
నల్లె. దే. జేన
నల్లెరు } దే. ఒకవిధమగుతీఁగ, వజ్రవల్లి
నల్లేరు }
నల్వది. దే. నలువది
నల్వము. స. నన్నూఱుమూరల దూరము
నల్వురు దే. నలువురు
నవ. దే. జిల, దురద
నవంత. దే. నవయుట, దుఃఖము, దీర్ఘజాడ్యము, క్షయరోగము
నవకము. దే. మృదుత్వము, యౌవనము
నవకము. స. తొమ్మిది
నవక్షారము. స. నవాసారము
నవగోజి. దే. పెద్దగుడారము
నవత్. స ఒకసించెడి
నవత స. నూతనత్వము
నవతి. స. తొంబది
నవనము. స. స్తోత్రము

నవనవలాడు. దే. మొక్కలు మొదలైనవి చక్కగా వృద్ధిపొందు
నవనీతము స. అప్పుడు చిలికియెత్తినవెన్న
నవపాఠకుఁడు. స. క్రొత్త యుపాధ్యా [యుఁడు
నవప్రసూత. స. బాలెంతరాలు
నవమము. స. తొమ్మిదవది
నవమాలిక. స. విరజాజిచెట్టు [తొమ్మిదవది
నవమి. స. పక్షమునందు తొమ్మిదవతిథి,
నవము. స. స్తోత్రము, నూతనము
నవయు. దే. రోగాదులచేతఁ గృశించు, శుష్కించు
నవరంగము. స. గృహవిశేషము
నవరంధ్రములు. స. దేహమందలి తొమ్మిది రంధ్రములు
నవరాత్రము. స. ఆశ్వయుజ శుద్ధమందు తొమ్మిదిదినములు జరుగు దుర్గాపూజ
నవరు. దే. నగరు, రాజభవనము, సొగసు
నవల } దే. స్త్రీ
నవలా }
నవాతు. దే. మిక్కిలి తెల్లనిగడ్డచక్కెర
నవారు. దే. మంచేమునకల్లునాడా
నవాసాగరము. దే. ఒకదినుసుఉప్పు
నవి. దే. గోడపెట్టుటకై మట్టిత్రవ్వియెత్తిన పల్లము
నవీకరణము. స. క్రొత్తదిగాచేయుట
నవీనము. స. నూతనము, క్రొత్త
నవేతరము. స. ప్రాఁతది
నవోఢ } స. క్రొత్తగా పెండ్లియయిన ఆఁడుది
నవ్యస్త్రీ }
నవ్యము. స. క్రొత్తది, నుతింపఁదగినది
నవు } దే. హసించు, వికసించు, పరిహసించు, అపహసించు, హాసము, వికాసము, పరిహాసము, అపహాసము
నవ్వు }
నవ్వుఁబాటు. దే. నగుఁబాటు
నవ్వుటాల } దే. నవ్వులాట
నవ్వుటాలు }
నవ్వులబండి. దే. నవ్వెడుస్వభావము గలస్త్రీ
నవ్వులాట. దే. పరిహాసము, నగుట
నశించు. స. నాశమగు
నశింపు. స. నాశము
నశ్వరము. స. నశించునది
నష్టజాతకము. స. పోయినజాతకమును మరల నేర్పఱచుట
నష్టము. స. నాశమునొందినది, మఱుఁగు పడినది, మరణము
నష్టి. స. నాశము, ద్రవ్యనాశము [వాఁడు
నష్టేంద్రియుఁడు. స. పుంస్త్వముపోయిన
నస దే. దురద, ఉపద్రవము
నస. స. నాసిక [రిఁడి
నసగూఁటి. దే. కామోద్రేకముగలది, జా
నసగూఁడు. దే. కామోద్రేకము
నసలించు. దే. వికలముచేయు
నసిమిరి. దే. దురద [సూచన
నసుకు. దే. అసత్యము, అసత్యపుమాట,
నస్తితము } స. ముక్కుత్రాడు కుట్టిన యెద్దు
నస్యోతము }
నస్య. స. ముక్కుత్రాడు, ముక్కు
నస్యము. స. పొగాకుతోఁ జేయఁబడిన ముక్కుపొడి, ఆఘ్రాణౌషధము
నళ. స. ఒకసంవత్సరము

# నా

నా. దే. నేను అనుదానికి ప్రాతిపదికము
నాంతము. స. అంతములేనిది
నాంతరీయకము. స. వేఱుచేయఁగూడనిది
నాంత్రము. స. స్తోత్రము
నాంది. స. బ్రాహ్మణులుచేయునట్టి ఆశీర్వాదము, నాటకారంభమునందు జరిపెడు మంగళము, భేరి

నాందీకరుఁడు } స. ఆశీర్వాదము చేయువాఁడు, భేరివాయించే
నాందీవాది } వాఁడు

నాఁగటిచాలుకూర. దే. లాంగలీశాకము
నాఁగటిచాలుపేరియలివ. దే. సీత
నాఁగటివిప్పు. దే. నాఁగటిమంప, పణక
నాఁగటిజోదు. త. బలరాముఁడు
నాఁగలి. త. దున్నెడు సాధనము
నాఁగు. దే. ధాన్యమునకు వడ్డిగా నిచ్చు
నాఁగురు. త. నాగిరిచెట్టు [ధాన్యము

నాఁగేలు } త. నాఁగలి
నాఁగేలు }

నాఁచికోలు. దే. నాఁచికొనుట, అపహరించుకొనుట [దొంగ
నాఁచు. దే. అపహరించు, తీఁగపాఁచి,
నాఁడు దే. ఆకాలము, ఆదినము, కాలము
నాఁడెకాఁడు. దే. నాణెకాఁడు
నాఁడెము. త. నాణెము
నాఁపరాయి. దే. విషశిలనున్ననిపెద్దరాయి
నాకబలి. స. నాగవల్లి
నాకము. స. స్వర్గము, ఆకాశము
నాకిని. స. దేవతాస్త్రీ

నాకు. దే. లేహనముచేయుట
నాకువు. స. సర్పాశ్రితవృక్షము
నాకులు. స. దేవతలు
నాకువు. స. పుట్ట, కొండ
నాకేశుఁడు. స. ఇంద్రుఁడు
నాక్రము. స. క్రముకము, [illegible]
నాగ. త. పూర్వము, పెద్ద
నాగడు. త. [illegible]
నాగకేసరము. స. ఒకానొకచెట్టు
నాగకేసులు. దే. ధాన్యవిశేషము
నాగగన్నేరు. దే. ఒకవిధమగు గన్నేరు
నాగజిహ్వక. స. మణిసిల [నాగవాసము
నాగదంతకము. స. గొండ్లెము తగిలించెడు
నాగదాళి. దే. ఒకవిధమగు ముండ్లచెట్టు
నాగపడగలపంట. గ్రా. స్త్రీకంఠభూషావిశేషము
నాగపడగలు. గ్రా. పాముపడగపైనెన్నడియగుండు కర్ణభూషావిశేషము

నాగపాని } త. నాగవల్లి నడపెడు
నాగపుపాని } ముత్తైదువ

నాగపాశము. స. వరుణునియాయుధము
నాగపొంజెర. దే. ఒకవిధపుపొంజెర
నాగబంధము. త. సర్పాకారరచన
నాగబల స. బిఱ్ఱచెట్టు
నాగపెత్తము. త. పొన్నుచేసిన మంత్రపూతమైన చిన్న పేము
నాగమల్లె. త. ఒకవిధపుమల్లె
నాగము. స. తగరము, పాము, ఏనుఁగు, కొండ, గ్రహము, మబ్బు, ఒకఉపవాయువు, గొండ్లెముతగిలించెడు నాగవాసము, ముస్తె, నాగకేసరము, పొన్నచెట్టు, శ్లేష్మము, సీసము

నాగముస్తె. త. భద్రముస్తకము
నాగరంగము. స. నారంగము, నారంజచెట్టు
నాగరము. స. సొంటి, ముస్తె, నాగరదేశీ యాక్షరము, గోరంటమొక్క, నగరమునఁబుట్టినది
నాగరము (గ్రా.) స్త్రీలు తలయందుధరించెడు సర్పాకృతియగుభూషణవిశేషము
నాగరికత. స. నాణెము
నాగరికము. స. నాణెమైనది
నాగరుఁడు. స. పట్టణమందుకాఁపురముండు మనుష్యుఁడు, తెలివిగలవాఁడు
నాగరుకము. స. నారింజకాయ
నాగరేయకము. స. నగరసంబంధమైనది
నాగర్యము. స. తెలివి, నేర్పు
నాగలోకము. స. పాతాళము
నాగవము. స. ఒకకరణము
నాగవలి. త. నాగవల్లి
నాగవల్లి. త. పెండ్లిలో నాలవనాఁడు జేరుగు శుభకార్యము
నాగవల్లి స. తమలపాకుతీఁగె
నాగవాసము. దే. గొండ్లెము తగిలించెడు రెండుకొనలు రచించిన యినుపకమ్మి
నాగవాసము. త. వేశ్యాసమూహము, ఆటమేళము
నాగవాసము. స. నాగలోకము
నాగసంభవము. స. సిందూరము
నాగసరము. త. పాములవాఁడు ఊఁదెడుబుఱ్ఱ, సన్నాయి
నాగసుగంధ. స సర్పాక్షిమొక్క [బుఱ్ఱ
నాగస్వరము. స. పాములవాఁడు ఊఁదెడు
నాగాంతకుఁడు. స. గరుత్మంతుఁడు
నాగిని. త. లోకాంతరముపొంది దేవతాత్వము వహించిన ముత్తయిదువ
నాగిని. స. గొల్లజిడ్డుమొక్క
నాగుఁబాము. దే. నాగము
నాగులు. త. నాగుఁబాము
నాగువు. త. నాగుఁబాము
నాగోదము. స. ఉదరత్రాణము
నాచికేతుఁడు. స. అగ్ని
నాట. స. రాగవిశేషము
నాటకము. త. నర్తనము, ప్రవర్తనము
నాటకము. స. గ్రంథవిశేషము, పూర్వచరిత్రముల వేషములతోఁ గనుపఱచి యాడుట
నాటకసాల. త. నాట్యశాల [ది
నాటకీయము.స. నాటకమునకుసంబంధించిన
నాటకుఁడు. స. వేషగాఁడు, నాట్యమాడువాఁడు [ది
నాటయితవ్యము.స. నాటకముగానాడఁదగిన
నాటిక. స. ఆట, ఒకనాటకము
నాటు. దే. గ్రుచ్చుకొను, భూమిలో నాఱులోనగువాని గ్రుచ్చు, నాట్నము
నాటుకొను. దే. నెలకొను
నాటుకొలుపు. దే. నాటుకొనఁజేయు
నాట్నము } దే. నాఱులోనగువాని నాటుట
నాటనము }
నాట్యప్రియుఁడు. స. శివుఁడు
నాట్యము. స. నృత్యము, నృత్తగీతవాద్యములకూడిక
నాడి. స. నరము, గడియకాలము, నారికుఱుపు, ఈనె, కాఁడ, గొట్టము

నాడింధమము. స. కొలిమితిత్తి

నాడింధముఁడు స. అగసాలెవాఁడు

నాడిక. దే. దేశము

నాడిక. స. గడియకాలము

నాడీవ్రణము. స. నాడికుఱుపు

నాడు. దే నాటు, దేశము, జనపదము

నాడె దే. నడుమునూలికండెయుంచినేసెడు సాలెవాని సాధనవిశేషము [ణెము

నాణకము. స. రూపాయ మొదలగు నా

నాణెకత్తె. త. నాణెముగలది

నాణెకాఁడు. త. నాణెముగలవాఁడు, నాణెమును కనిపెట్టఁగలిగినవాఁడు

నాణెము. త. ముద్రింపఁబడినరాగి, వెండి, బంగారములబిళ్ల, ఇచ్చి పుచ్చుకొనుట యందలి యోగ్యత, నాగరికత

నాతము. దే. బత్తెము

నాతి
నాతుక } దే. స్త్రీ

నాత్రము. స. స్తోత్రము, ఆశ్చర్యము

నాదము. స. ధ్వని, మ్రోఁత

నాదారక. దే. ఎడతెగకుండ

నాదారు. దే. మాను, తగ్గు, తక్కువవాఁడు

నాదించు. స. మ్రోఁగు

నాదు. త ధ్వని, మ్రోఁత [థమైనది

నాదేయము. స. కైవడిమున్నై, నదీసంబం

నాదేయి. స. కిత్తలిచెట్టు, తక్కిలిచెట్టు, దాసనవృక్షము, నేలనేరేడుచెట్టు

నాద్యము. స. నదీసంబంధమైనది, నదిలో

నాధము. స. ముకుత్రాడు [పుట్టినది

నాధవంతుఁడు. స. పరాధీనుఁడు

నాథవతి. స. నాథుఁడుగలది, పెనిమిటిగలది

నాథుఁడు. స. పెనిమిటి. ఱేఁడు, యజ

నాన. త. సిగ్గు [మానుఁడు

నానఁబెట్టు. దే. నానఁబోయు, నానవేయు

నానఁబ్రాలు దే. నానబియ్యము

నానగండ. త. సిగ్గుమాలినవాఁడు

నానఁబియ్యము. దే. నానఁబెట్టిన క్రొత్తచేరుడు బియ్యము, లాజము

నానాఁడు. దే. అప్పుడప్పుడు

నానాత్వము. స. అనేకత్వము

నానారూపము. స. పలువిధములు గలది

నాను. దే. ఒలాములలో బహుకాలముండు నానుత్రోవి, స్త్రీకంఠాభరణము

నానుత్రోవి. దే. కంఠాభరణవిశేషము

నానుచు
నాచ్చు } దే. నానఁజేయు

నానుశి. దే. కొంపదుంతి, పామెత

నానుడు. దే. తడిసినది

నానుడువాన. దే. విడువక కురిసెడు పొడి పొడి చినుకుల వర్షము

నానుపు దే. చెలువచేయు

నానుబోర. దే. మాంసముగల బొమ్మ

నాన్నెల. దే. జెంతికయను భక్ష్యవిశేషము

నాపకుఁడు. స. నాశకుఁడు

నాపసాని. త. నాగసాని

నాపితుఁడు. స. మంగలవాఁడు

నాభి. స. కస్తూరి, బొడ్డు, పసనాభి, బండికంటి నడిమి తూము

నాభిక. స. బొడ్డు

నాభిజన్ముడు. స. బ్రహ్మ, పొక్కిలిచూలి

నామకరణము. స. బిడ్డలకు పేరుపెట్టుట

నామకార్థము. స. పేరునకుమాత్రము
నామగుంట. దే. గళగర్తము
నామధారకుఁడు. స. గొప్పవానిపేరును మాత్రము పెట్టుకొన్నవాఁడు
నామధేయము. స. పేరు
నామమడఁచు దే. చేఁపు
నామము. దే. నొసటపెట్టుకొనెడు బొట్టు
నామము. స. నామధేయము [శము చేయు
నామముపెట్టు. దే. మోసము చేయు, నా
నామరులు. దే. పాచికలు [హీనుఁడు
నామవర్జితుఁడు స. పేరులేనివాఁడు, బుద్ధి
నామికము. స. పేరుసంబంధమైనది
నామితము. స. వంచఁబడినది
నాము. దే. జొన్న మొదలగువానికొయ్య గాలునచిగిరించిన మొలక
నామువాసన. దే. అసహ్యమగు వాసన
నాయఁకరము. దే. ఆధిపత్యము
నాయఁకవాడి } దే. సేవ్యపురుషులను పరా
నాయఁకవాళి } మరిక చేసెడు దివాణపు బంటు, ఊరిబంట్రౌతు
నాయఁకుఁడు. త. అధిపతి, పన్నిద్దఱు భటులకధిపతి
నాయఁడు. త. ప్రభువు, బలిజెలు మొద లగు వారిపట్టపుఁబేరు
నాయకము } స. పతకమునడిమిరత్న
నాయకరత్నము } ము
నాయకుఁడు. స. అధిపతి, శృంగారరసా లంబనపురుషుఁడు, శ్రేష్ఠుఁడు
నాయన. దే. తండ్రి, ప్రీతితో పిలుచుట యందుపయోగపడుపదము
నాయము. త. న్యాయయుక్తము
నాయము. స. ప్రాపణము, నీతి [భార్య
నాయిక. స. శృంగారరసాలంబన స్త్రీ,
నార. దే. చీల్చినతాటిమట్ట మొదలగునది, జనుము లోనగువాని పీఁచు, కూరమీఁది పీఁచు, తాడులోనగువానిపీఁచు
నారంగము. స. నారింజచెట్టు, అమడబిడ్డ
నారకము. స. నరకము, నరకసంబంధమగు
నారట్టము. స. బీటిక నేల [నది
నారణపక్కి. త. నారాయణపక్షి
నారదంతకము. దే. ద్వారపునిడుపుకమ్మి
నారదత్వము. స కలహకారితనము, కొండె గానితనము
నారదబ్బ. దే. ఒకవిధమగుదబ్బ
నారదము. స. నారింజచెట్టు, మేఘము
నారదుఁడు. స. ఒకానొకదేవముని
నారమడి. దే. ఒకవిధమగునారతో నేసిన మడివస్త్రము
నారము. స నరులసమూహము, అప్పుడు పుట్టినదూడ, ఆత్మసంబంధమైనది, ఉద కము, నరసంబంధమైనది, సొంటి
నారములు. స. నీళ్లు
నారలు. దే. చెట్టుమీఁదిపట్ట, వల్కలము
నారసము. త. నారాచము
నారాచము. స. అచ్చేము ఇనుపబాణము, గంటము, నిటిరేయేనుఁగు [సానము
నారాచి స. బంగారునఱకెడుపనిముట్టు,
నారాజి } దే ఖడ్గము
నారాజీ }
నారాయఁడు. స. నారాయణుఁడు, పర
నారాయణపక్షి. స. పక్షివిశేషము [మాత్మ

నారాయణము. స. తైత్తిరీయ మను వేద భాగమునందొకప్రశ్నము, రావిచెట్టు

నారాయణి. స. పార్వతి, లక్ష్మి, పిల్లపీచర మొక్క

నారాయణుఁడు. స. విష్ణువు, సూర్యుఁడు, చంద్రుఁడు, బ్రహ్మ, శివుఁడు, అగ్ని, పరమాత్మ

నారి. దే. వింటియల్లెత్రాడు

నారి. త. నారికుఱుపు

నారి. స. ఆఁడుది

నారింజ. త. నారంగము

నారికడము. త. నారికేళవృక్షము

నారికము. స. నీటిసంబంధమైనది

నారికాయ. దే. అల్లెత్రాటితాఁకుడువలన చేతియందుఁ గలిగినకిణము

నారికుఱుపు. దే. నెలపుండు, నాడీవ్రణము

నారికేళము. స. టెంకాయచెట్టు

నారీజీవుఁడు. స. తనభార్యను ఇతరులకద్దకుఁ బంపి యందువలన జీవించువాఁడు

నారుచేయు, నార్చు } దే. నాటఁజేయు, నాడఁజేయు

నారు. దే. నాట్నమునకుఁగాను మడిచేగా విత్తులుపోసి మొలపించిన మొలకలు

నాలి. దే. కుత్సితపుపని, కుత్సితము, మందము, వంచకము

నాలిక. దే. నాలుక

నాలికచేఱు. దే. తృణవిశేషము, పశువ్యాధివిశేషము

నాలికుఱుపు దే. నారికుఱుపు

నాలిబూతము, నాలిముచ్చు } దే. కుత్సితుఁడు, కుత్సితురాలు

నాలియొద్దు. దే. వంచకపువిద్దు

నాలుక దే. జిహ్వ

నాలుకలు. దే. నిప్పుజిహ్వకలు, జ్వాలలు

నాలుగు, నాల్గు, నాలువు } దే. మూఁడునొకటి

నాల్క. దే. నాలుక

నాల్గు[illegible]లవేల్పు దే. అగ్ని

నావ. స. ఓడ

నావనీతము. స. మెత్తనిది, శాంతమైనది

నావమికము. స. తొమ్మిదవది

నావి. దే. నవ్యాంగము

నావికుఁడు. స. ఓడనడపువాఁడు

నాశ్రమము. స. [illegible] స్తోత్రార్హమైనది. క్రొత్త [illegible] [ములేమి

నాశము. స. చేటు, కనఁబడమి, అనుభవ

నాశితము. స. నశింపఁజేయఁబడినది

నాశిల్లు, నాశిలు } స. నశించు, కృశించు

నాష్టికుఁడు. స. నష్టమును పొందినవాఁడు, పోయినవస్తువునకధికారి [కమ్మి

నాస. స. ముక్కు, ద్వారముమీఁది అడ్డ

నాసత్యులు. స. అశ్వినీదేవతలు

నాసాపరిస్రావము. స. ముక్కులోని చీమిడి కారుట

నాసామణి. స. ముక్కెర

నాసి. దే. కిల్లి

నాసిక. స. ముక్కు

నాసికామలము. స. చీమిడి

నాసిల్లు. దే. నశించు

నాసీరము. స. సేనాముఖము, దర్పము

నాసీరుఁడు. స. సేనాధిపతి

నాస్తికత. స. పరలోకము లేదనెడుబుద్ధి

నాస్తికుఁడు. స. పరలోకము లేదనెడువాఁడు

నాస్తిక్యము. స. నాస్తికత

నాళము. దే. లాడము

నాళము. స. తామర మొదలగువానికాఁడ, గ్రోవి, చిమ్మనఁగ్రోవి, అగసాలెవాని ఊఁదుఁగ్రోవి

నాళి. స. కూరయొక్కనార, నరముకాఁడ

నాళికేరము. స. నారికేళము

నాళీకము. స. తామర, బాణము, బాణపు ములికి

నాళీకాసనుఁడు. స. బ్రహ్మ

## ని

నింకెఱ. దే. శీఘ్రము, తత్ క్షణము

నింగి. దే. ఆకాశము

నింగిచూలి. దే. వాయువు

నింగిమిరి. దే. సువర్చలవృక్షము

నింగిపడు. దే. అస్తమించు

నింగిసిగ. దే. శివుఁడు, వ్యోమకేశుఁడు

నించు. దే. నినుచు, నిండఁజేయు,నిండించు

నింట. దే. జలపూరము

నిండఁబడు } దే. నిండు
నిండారు }

నిండు. దే. పూర్ణమగు, పూర్ణత, పూర్ణము

నిండుకొను. దే. నిండు, అయిపోవు

నిండుకొలుపు. దే. నిండఁజేయు

నింద. స. దూఱు, అపదూఱు

నిందించు. స. దూఱు

నిందితుఁడు. స. దూఱఁబడినవాఁడు

నింద్యుఁడు. స. దూఱఁదగినవాఁడు

నింపారె. దే. సమృద్ధము, సెమ్మసె

నింపారు. దే. నిండారు

నింపిరి దే. మఱికి, మలము

నింపు. దే. నించు

నింబతరువు. స. వారిజేపుచెట్టు

నింబము. స. వేఁపచెట్టు

నికటము. దే. నిర్బంధము

నికటము. స. సమీపము, సమీపమైనది

నికము. దే నిక్కము

నికరము. దే. త్రోపుడుపోఁగా మిగిలినది

నికరము. స సమూహము, నిధి, శ్రేష్ఠము

నికర్తనము. స. కోయుట

నికర్షణము. స. ఇంటివెనుకటిపెరడు, ఆట భూమి

నికష. స. రాక్షసులతల్లి

నికషణము. స. ఒరయుట

నికషము. స. ఒరగల్లు, సాన

నికషాత్మజుఁడు. స. నిర్పృతి

నికామనము. స. కోరుట

నికామము. స. యథేచ్ఛము

నికాయము. స. ఇల్లు, తెగ, ప్రోగు

నికాయ్యము } స. గృహము
నీకాయ్యము }

నికారణము. స. వధము, కొల

నికారము. స. వంచన, ధాన్యముప్రోగు చేయుట

నికాశము. స. నిశ్చయము, తుల్యము

నికుంచకము. స. సోల

నికుంజము. స. పొదరిల్లు

నికుంభము. స. దంతిచెట్టు

నికురుంబము. స సమూహము

నికృంతనము. స. ఖండనము

నికృతప్రజ్ఞుఁడు. స. దుష్టమనస్సుగలవాఁడు, వంచనయందు నేర్పుగలవాఁడు

నికృతము. స దూఱఁబడినది, వంచింపఁబడినది, త్రోపుఁడుచేయఁబడినది

నికృతి. స. బెదరుమాట, వంచన, ద్రోహుడు

నికృత్తము. స. నఱకఁబడినది

నికృష్టము. స. అధమము, నీచము

నికేతనము }
నీకేతనము } స. ఇల్లు

నికేతము. స. ఇల్లు, గుఱుతు

నికోచకము. స. ఊడుగుచెట్టు

నికోచనము. స. ముకుళించుకొనుట

నిక్కచ్చి. దే. నిర్బంధము, సంకటము

నిక్కము. దే. నిశ్చయము, యథార్థము, నిత్యము, సత్యమైనది, అన్వర్థము

నిక్కల. దే. కన్నది యనుభవమునకు తెచ్చెడుకల

నిక్కవుఁడు. త. నిష్కపటము

నిక్కవాడుచు. దే. నిక్కన నిలుచు

నిక్కాఁక. దే. మిక్కిలికాఁక

నిక్కు. దే. ఉన్నతమగు, గర్వించు, అతిశయించు, వర్ధిల్లు, గర్వము, ఉన్నతి. విలాసము

నిక్కుఁబోతు. దే. గర్వస్వభావముగల వాఁడు

నిక్కుడు. దే. ఉన్నతి

నిక్కువము. దే. నిక్కము

నిక్కువీనులజెక్క. దే. ఉచ్చైశ్శ్రవము

నిక్వణము }
నిక్వాణము } స. వీణ మొదలగు వాని మ్రోఁత

నిక్షిప్తము. స. పంపఁబడినది, గడపఁబడినది, ఉంచఁబడినది

నిక్షేపము. స. భూమిలో భద్రముగా పూడ్చి పెట్టినధనాదికము, నిధి, త్రోసివేయుట. తాకట్టు

నిక్షేపించు. స. పాఁతు, పూడ్చు

నిఖననము. స. త్రవ్వుట

నిఖాతము. స. త్రవ్వఁబడినది

నిఖిలము. స. సర్వము, ఎల్ల

నిగణము. స. హోమధూమము

నిగదము. స. స్పష్టముగా చెప్పుట

నిగదించు. స. స్పష్టముగా చెప్పు

నిగనిగ. దే. కాంతిసమృద్ధి, మెఱయుంటయం దగుననుకరణము

నిగమము. స. వేదము, అంగడివాడ, పట్టణము, మార్గము

నిగముఁడు. స. వణిజుఁడు, బేహారి

నిగరణము. స. మ్రింగుట, కంఠము

నిగరము. త. శ్లేష్మము

నిగరము. స. మ్రింగుట

నిగళము }
నిగడము } స. ఏనుఁగుకాలిసంకెల, సంకెల

నిగా. త. లక్ష్యము

నిగాదము. స. నిగదము

నిగారము. త. శ్లేష్మము

నిగారము. స. మ్రింగుట

నిగాళము. స. గుఱ్ఱపుమెడసమీపపుచోటు

నిగిడారు. దే. వ్యాపించు

నిగుడించు. దే. దీర్ఘముగాఁజేయు, వ్యాపింపఁజేయు, బాణమువేయు

నిగుడు. దే. వ్యాపించు, నిక్కు, చాఁగు, పఱఁగు, విజృంభించు, వేగిరపడు, కవియు, చక్కఁబడు

నిగుడుచు }
నిగుడ్చు } దే. నిగుడఁజేయు

నిగడుపెంచు. దే. నిక్కు

నిగుఱు. దే. నిప్పులమీఁది భస్మము
నిగూఢము. స. మఱుఁగుపుచ్చినది
నిగూహనము. స. మఱుఁగుపుచ్చుట
నిగృహీతము. స. లోఁబఱచుకొనఁబడినది
నిగ్గడి. దే. కవచము
నిగ్గు. దే. నిర్వహిల్లు, ఉత్కృష్టకాంతి, వర్ణలేశము, సారము, త్రోపుడుపోఁగా మిగిలినది
నిగ్రంథనము. స. చంపుట
నిగ్రహము. స. పట్టుకొనుట, దండన, త్రోపాటు, ఔషధపుమాట, మేర, లోఁబఱచుకొనుట, చెఱ [చేయు
నిగ్రహించే. స. త్రోపాడు, నిర్లక్ష్యము
నిగ్రాహము. స. శిక్ష
నిఘంటువు. స. పదార్థములను తెలియఁజేసెడు గ్రంథము
నిఘము. స. చేదురవువస్తువు
నిఘర్షము. స. రాపిడి
నిఘసము. స. భోజనము
నిఘాతిక. స. ఇనుముకు పెట్టి గొట్టెడియినుప ముద్ద, దాఁగలి
నిఘృష్టము. స. రాయఁబడినది. మాఱఁబడినది, లోఁబఱచుకొనఁబడినది
నిఘోషణము. స. ధ్వని
నిఘ్నము. స. అధీనమయినది
నిఘ్నుఁడు. స. అధీనుఁడు, లోఁకువైనవాఁడు
నిచయము స. సమూహము
నిచితము. స. పఱపఁబడినది, కప్పబడినది, నిండింపఁబడినది, కుప్పవేయఁబడినది
నిచులము స. ఎఱ్ఱ చేతి, కప్పుడు మొప్పటి, తినఁబడఁపగిన పక్షి
నిచోలిక. స. రవిక
నిచోళము. స. గవుసెన, కప్పుడుదుప్పటి
నిచ్చెన. త. పైకెక్కఁదగిన సాధనము
నిచ్చెనపంజు. దే. కరదీపికాభేదము
నిచ్చే. దే. సదా, ప్రత్యహము
నిచ్చయము. త. నిశ్చయము
నిచ్చలము. త. నిశ్చయము. నిశ్చలము, నిర్దోషము, నిరంతరము
నిచ్చలు. త. నిశ్చయము. ఎల్లప్పుడు
నిచ్ఛేదము. స. కోసివేయుట
నిజము. స స్వభావము, తనది, శాశ్వతమైనది
నిజమరి. దే సత్యశీలుఁడు [త్యము
నిజెము. త. సత్యవచనము, నిశ్చయము, స
నిజోగి. త. మంత్రి, నియోగి
నిటలము. స. నుదురు
నిటలాక్షుఁడు. స. శివుఁడు
నిటాలము. స. నిటలము
నిట్ట. దే. స్థానము, ప్రవాహము, స్తంభము, నిక్కు, నిక్కినది, సరియైనది, పార్శ్వము, పొడవైనది
నిట్టకనిలుచే. దే. నిట్టనిలుచే
నిట్టకనిలువు. దే. సరినిలువు
నిట్టగ్రుమ్ము. దే. నిట్టవాడుచే
నిట్టనిలుచే. దే. సరిగానిలుచే
నిట్టనిలుచుండు. దే సరిగా నిలుచుండు
నిట్టపంట. దే. నిష్కారణముగ
నిట్టరాడు. దే. దూలములేనియింటి నడిమిపొడుపు కంబము
నిట్టలము. దే. అధికము, నిశ్చయము
నిట్టవాడుచే దే. ఉప్పొంగు, రోమాంచితమగు
నిట్టు. దే. ఉపవాసము, దప్పి, క్షామము శుష్కము

నిద్రపుచ్చు. దే. నిద్రపోవునట్లుచేయు
నిద్రపోవు. దే. నిద్రచేయు
నిద్రమంపు. దే. నిద్రమత్తు
నిద్రాణుఁడు / నిద్రాళువు } స. నిదురపోతు
నిద్రించు. స. నిద్రపోవు
నిద్రితుఁడు. స. నిద్రపోయినవాఁడు
నిద్రిల్లు / నిద్రిలు } స. నిద్రించు
నిధనత. స. దారిద్ర్యము
నిధనము. స. కులము, చావు, చేటు
నిధానము. స. ఉంచుట, పాఁతఱ, నిధి
నిధి. స. పాఁతఱ, నిక్షేపము, స్థానము, సముద్రము
నిధీశుఁడు. స. కుబేరుఁడు
నిధువనము. స. కలయిక, వడఁకు, సంభోగము
నిధ్యాతము. స. ధ్యానింపఁబడినది, తలఁపఁ[బడినది
నిధ్యానము. స. దర్శనము, చూపు
నినదము / నినాదము } స. ధ్వని, మ్రోఁత
నినయనము. స. ఆచరణము, పోయుట
నినర్తిష. స. నాట్యముచేయవలెనను నిచ్ఛ
నినీష. స తీసికొనిపోవలెనను నిచ్ఛ
నినుచు. దే. నించు, నిండించుకొను
నినుపారు. దే. పూర్ణమగు
నినుపు. దే. నింపు, నిండించు
నిసృత్తము స. అప్పగింపఁబడినది (పద్యము)
నిస్త దే నడచినదారము
నిపరము. స పారము, చేవవు
నిపతించు. స. నిపాతముచేయు
నిపము. స. కుండ, కలశము

నిపారము. స. నిపరము
నిపాతకము. స. పాపము
నిపాతనము. స. దిగద్రొబ్బుట
నిపాతము. స. పడుట, అవ్యయము
నిపాతించు. స. పడఁద్రోయు [యఁబడినది
నిపాతితము. స. ద్రోఁచఁబడినది, పోఁగుచే
నిపానము. స పశువులు నీళ్లు త్రాగుటకై ఏర్పఱచిన తొట్టి
నిపుణుఁడు. స. నేర్పరి
నిప్పచ్చు. దే. నాశము
నిప్పచ్చరము. త దారిద్ర్యము, శూన్యము
నిప్పటి / నిప్పట్టు } దే. ఆకులుపొదిగి నిప్పుమీఁదఁ గాల్చెడిరొట్టె
నిప్పస్తు. దే. శుష్కోపవాసము
నిప్పు / నిప్పుక } దే. అగ్ని, నిప్పుకణము
నిప్పుఁదిండి. దే. ఉష్ట్రపక్షి, అగ్నిపక్షి
నిబంధన / నిబంధనము } స. ఏర్పాటు, బంధము, హేతువు, కూర్పఁబడ్డది
నిబంధము. స. మలమూత్రబంధము, బంధము, వర్షాశనము మొదలైనది
నిబంధించు. స. బంధించు, అడ్డగించు
నిబద్ది. త. నిజము, సత్యము
నిబద్దించు / నిబద్దిలించు } త. నిజపఱచు
నిబద్ధము. స. బంధింపఁబడినది, అడ్డగింపఁ[బడినది
నిబర్హణము. స వధము, చంపుట
నిబర్హితము. స. చంపఁబడినది
నిబిడము. స. సాంద్రము, దట్టము
నిబిడీకరించు. స. దట్టముచేయు
నిబిడీకృతము. స. దట్టముగాఁ జేయఁబడినది

నియామకము. స. నిశ్చయము, ఏర్పాటు
నియామకుఁడు. స. నియమించేవాఁడు, ఓడచేక్కాఁను త్రిప్పెడివాఁడు, తండేలు యజమానుఁడు
నియామము. స. నియమము, నిర్బంధము
నియుక్తి. స. ఆజ్ఞ, నియామకము
నియుక్తుఁడు. స. నియోగింపఁబడిన వాఁడు
నియుతము. స. లక్ష
నియుద్ధము. స. బాహుయుద్ధము
నియోక్త. స. నియోగించేవాఁడు
నియోక్తవ్యము. స. నియోగింపఁదగినది
నియోగము. స. ఆజ్ఞ, పనుపు
నియోగి. స. నియోగముకలవాఁడు, నియ్యోగి
నియోగించు. స. ఆజ్ఞాపించే, ఒకపనిలో [పెట్టు
నియోగ్యుఁడు. స. నియోగింపఁదగినవాఁడు
నియోజకుఁడు. స. ఆజ్ఞాపించేవాఁడు
నియోజనము. స. ఆజ్ఞాపనము, పనుపు
నియోజితము. స. ఆజ్ఞాపింపఁబడినది
నియోజ్యుఁడు. స. భృత్యుఁడు
నియోద్ధ స. బాహుయుద్ధముచేయువాఁడు
నియ్యోగి. త. మంత్రి, ఒకతెగబ్రాహ్మణుఁడు
నిరంకుశ. స. జిబిలికవృక్షము
నిరంకుశము. స. అడ్డములేనిది
నిరంజన. స. పున్నమ [నిది
నిరంజనము. స. కాటుకలేనిది, దోషములే
నిరంతరము. స. దట్టము, ఎడతెగనిది
నిరక్షరుఁడు స చేదువులేనివాఁడు [పుడు
నిరతము. స. మిక్కిలి ఆసక్తికొన్నది. ఎల్ల
నిరతి. స. మిక్కిలి ఆసక్తి [మైనది
నిరతిశయము. స. సాటిలేనిది, నిరుపమాన
నిరత్యయము. స. నాశములేనిది
నిరపరాధుఁడు. స. అపరాధములేనివాఁడు
నిరపాయము. స. అపాయములేనిది
నిరపేక్షము. స. అపేక్షలేనిది
నిరయము. స. దుర్గతి, నరకము
నిరర్గళము. స. అడ్డములేనిది
నిరర్థకము. స. ప్రయోజనములేనిది
నిరవగ్రహుఁడు. స. అడ్డపాటులేనివాఁడు, స్వతంత్రుఁడు
నిరవద్యము. స. ఆక్షేపణలేనిది
నిరవధికము. స. మేరలేనిది
నిరశనము. స. ఆహారము తినక యుండుట
నిరసనము. స. తిరస్కారము, ఆక్షేపము, ఉమియుట
నిరసించే. స. తిరస్కరించే, విడుచే
నిరస్తము. స. తిరస్కరింపఁబడినది, త్రోయఁబడినది, పోఁగొట్టఁబడినది
నిరహంకారము. స. అహంకారము లేమి
నిరాకరణము. స. తిరస్కారము
నిరాకరించే. స. తిరస్కరించే
నిరాకరిష్ణువు. స. తిరస్కరించేవాఁడు
నిరాకారము. స తిరస్కారము, ఆకాశము, ఆకారములేనిది, నింద
నిరాకారుఁడు. స. ఆకారములేనివాఁడు, పరమాత్ముఁడు, విష్ణువు, శివుఁడు
నిరాకృతము. స. న్యాయముచేఁ ద్రోయఁబడినది
నిరాకృతి. స. తిరస్కారము, రూపములేనివాఁడు, వేదముచేదువనివాఁడు
నిరాఘాటము. స. కొలఁదిలేనిది, మేరలేనిది
నిరాతంకము. స. భయములేనిది, వ్యాధిలేనిది

నిరాదరణ స. నిర్లక్ష్యము
నిరాదేశము. స. ఋణవిముక్తి [వాఁడు
నిరాధారుఁడు. స. జీవనాధారములేని
నిరాపనింద. గ్రా. అపదూఱు
నిరాబారి. త. ముని [లేనిది
నిరామయము. స. రోగములేమి, రోగము
నిరామిషము. స. మాంసరహితమైనది
నిరాయాసము. స. ఆయాసములేనిది
నిరాయుధము. స. ఆయుధములేనిది
నిరాలంబము. స. అవలంబములేనిది
నిరాశ. స. నిస్పృహ
నిరాశము. స. ఆశలేనిది [డు
నిరాశ్రయుఁడు. స. ఆశ్రయము లేనివాఁ
నిరాసకము. స. నిరసించునది
నిరాసనము. స. నిరసనము
నిరాస్పదము. స. ఆధారములేనిది
నిరాహారము. స. ఆహారములేనిది
నిరాటుఁడు. స. ప్రతిబంధకము లేనివాఁడు
నిరీక్షణము. స దర్శనము, చూపు, వెదకుట, మర్యాద, కోరిక [చూచే
నిరీక్షించు. స. దర్శించు, చూచు, ఎదురు
నిరీక్షితము. స. చూడఁబడినది, ఎదురు చూడఁబడినది
నిరీషము. స. ఏడికోలలేనినాఁగలి, గొడగ
నిరు. త. గతార్థకము
నిరుకడము. దే. ఒకానొకచెట్టు
నిరుకళము. త. నిరర్గళము [వెల
నిరుకు. దే. నిర్ణయము, నిర్ణయము చేసిన
నిరుక్తము. స. చెప్పఁబడినది, ఒకవేదాంగ
నిరుక్తి. స. అర్థనిర్వచనము [ము
నిరుక్తికము. స. వాక్యాన్వయమైనది
నిరుడిమానియావు. దే. ఒకతూరి యీనిన ఆవు, గృష్టి
నిరుడు దే. కడచినసంవత్సరము
నిరుత్తరుఁడు. స. ఉత్తరముచెప్పలేనివాఁడు
నిరుద్యోగము. స. ఉద్యోగములేమి
నిరుద్ధము. స నిరోధింపఁబడినది
నిరుపద్రవము. స. ఉపద్రవములేనిది
నిరుపమము. స ఉపమలేనిది
నిరుపమానము. స. పోల్పఁదగనిది
నిరుపహతి. స. నిర్బాధకమైనది
నిరుపాధి. స. బాధలేమి, హాయి
నిరుపాధికము. స. నిర్హేతుకము
నిరూఢము. స. ప్రసిద్ధికెక్కినది
నిరూఢి. స. ప్రసిద్ధి, నేర్పు [రాణ
నిరూపణము స. అరయిక, చూపు, తా
నిరూపించు. స. నిరూపణముచేయు
నిరూపితము. స. నిరూపింపఁబడినది
నిరూప్యము స. నిరూపింపఁదగినది
నిరూహము. స. ముగిసినవాక్యము, ఊహ లేనిది, నిశ్చయింపఁబడినది
నిరృతి. స. పెద్దమ్మ, అభాగ్యము, దిక్పాల విశేషము, ఉపద్రవములేనిది
నిరోధము. స. అడ్డు, చేటు
నిరోధించు. స. అడ్డగించు
నిరోష్ఠ్యము. స. ప, ఫ, బ, భ, మ అను నక్షరములు లేనిపద్యము
నిర్గంథనము. స. చంపుట
నిర్గంధము. స. గంధములేనిది
నిర్గతము. స. వెడలఁబడినది

నిర్గతి }
నిర్గమనము } స. వెడలఁబాటు, బయలు
నిర్గమము } దేఱుట

నిర్గమించు. స. వెడలఁబడు, బయలుదేఱు
నిర్గళనము. స. వెలికి జాఱుట
నిర్గళితము. స. వెలికి జాఱినది
నిర్గుండి. స. వావిలిచెట్టు [హితుఁడు
నిర్గుణుఁడు. స. భగవంతుఁడు, గుణర
నిర్గ్రంథనము. స. చంపుట
నిర్గ్రంథుఁడు స. దిసమొలవాఁడు, బీద
వాఁడు, మూర్ఖుఁడు [ఘటము లేనిది
నిర్ఘటము. స. జనసమ్మర్దముగల అంగడి,
నిర్ఘర్షణకము. స. తోముట, పండ్లుతోము
కొనుపొడి
నిర్ఘాతము. స. పిడుగు, గాలివాన
నిర్ఘృణుఁడు. స. కనికరము లేనివాఁడు
నిర్ఘోషము. స. ధ్వని, మ్రోఁత
నిర్జనము. స. జనము లేనిది
నిర్జర. స. తిప్పతీఁగ
నిర్జరుఁడు. స. దేవత, ముదిమిలేనివాఁడు
నిర్జలము. స. జలము లేనిది
నిర్జాతము. స. కనఁబడుచున్నది
నిర్జించు. స. జయించు
నిర్జితుఁడు. స. గెలువఁబడినవాఁడు
నిర్జీవుఁడు. స. జీవము లేనివాఁడు
నిర్ఝరము. స. సెలయేఱు
నిర్ఝరిణి. స. నది
నిర్ణయము. స. ఏర్పాటు, నిశ్చయము
నిర్ణయించు. స. ఏర్పాటుచేయు [డు
నిర్ణాయకుఁడు. స. నిర్ణయము చేయువాఁ
నిర్ణిక్తము. స. కడుగుట మొదలగు వానిచేత
కల్మషరహితమైనది
నిర్ణీతము. స. నిర్ణయింపఁబడినది
నిర్ణీతి. స. నిశ్చయము
నిర్ణేజకుఁడు. స. చాకలవాఁడు
నిర్ణేజనము. స. నీటితో కడుగుట
నిర్ణేత. స. నిర్ణయము చేయువాఁడు
నిర్ణేయము. స. నిర్ణయము చేయఁదగినది
నిర్దగ్ధము. స. చక్కఁగా కాలినది
నిర్దయత. స. దయ లేమి [త్ముఁడు
నిర్దయుఁడు. స. దయలేనివాఁడు, నిర్దయా
నిర్దళనము. స. చక్కఁగా భేదించుట
నిర్దళితము. స. చక్కఁగా భేదింపఁబడినది
నిర్దహించు స. చక్కఁగా కాలుచు
నిర్దారణము. స. చక్కఁగా చీల్చుట
నిర్దారితము. స. చక్కఁగా చీల్పఁబడినది
నిర్దిష్టము. స. నిర్దేశింపఁబడినది
నిర్దేశకుఁడు. స. ఆజ్ఞాపించువాఁడు, కనఁ
బఱచువాఁడు
నిర్దేశము. స. ఆజ్ఞ, చెప్పుట, సమీపము
నిర్దేశించు. స. ఆజ్ఞాపించు, పనుచు
నిర్దేశ్యము. స. నిర్దేశింపఁదగినది
నిర్దేష్ట. స. నిర్దేశించువాఁడు
నిర్దోషము. స. దోషము లేనిది
నిర్ధనుఁడు. స. ధనము లేనివాఁడు
నిర్ధరించు. స. నిర్ధారణచేయు
నిర్ధారణ }
నిర్ధారణము } స. నిశ్చయము
నిర్ధారణీయము. స. నిర్ధరింపఁదగినది
నిర్ధారితము. స నిర్ధరింపఁబడినది

నిర్ధార్యము. స. నిర్ధారణీయము

నిర్ధార్యుఁడు. స. దుఃఖాదులు కలిగినను మనోవికారమును చెందక పూనినపని విడువక చేయువాఁడు

నిర్ధూతము. స. విడువఁబడినది

నిర్నిద్రము. స. నిద్ర లేనిది, జాగరూకత కలది

నిర్నిమిత్తము. స. అకారణము

నిర్నీతి. స. నీతిలేమి

నిర్బంధము. స. బలాత్కారము, కదల మెదలఁగూడనికట్టు

నిర్బంధించు. స. నిర్బంధముచేయు

నిర్బద్ధము. స. కట్టఁబడినది, బలవంతము చేయఁబడినది

నిర్భయము. స. భయములేనిది

నిర్భరము. స. భరింప శక్యముకానిది, అధికము

నిర్భర్త్సనము. స. అదలుపు

నిర్భర్త్సించు. స అదలించు

నిర్భర్త్సితము. స. నిర్భర్త్సింపఁబడినది

నిర్భాగ్యుఁడు. స. భాగ్యము లేనివాఁడు, పనికిమాలినవాఁడు

నిర్భిన్నము. స. చేక్కఁగా భేదింపఁబడినది

నిర్భీతి. స. భయములేమి

నిర్భేదము. స. చీల్చుట, చీలిక, తీర్మానము

నిర్భేద్యము. స. పగులనిది, తొలిపొడువ శక్యముకానిది

నిర్మత్సరము. స. అసూయలేమి

నిర్మదము. స. మదము ఉడిగిన యేనుఁగు, మదములేనిది

నిర్మర్యాద. స. మర్యాదలేమి, అవమానము

లము. స. నిర్మాల్యము, అభ్రకము, మయిలలేనిది

నిర్మలుఁడు. స స్వచ్ఛమైనవాఁడు, యోగ్యుఁడు

నిర్మాణము. స. నిర్మితి, యోగ్యత, కలుగఁజేయుట

నిర్మాత, నిర్మాయి } స. నిర్మించువాఁడు

నిర్మార్జనము. స. తుడుచుట, కడుగుట

నిర్మాల్యము. స. స్వచ్ఛము, మరకలేనిది, మిగత, దేవపూజకువాడగా మిగిలిన లేక వాడిపోయిన పుష్పాదులు, ధరించి తీసివేసినది

నిర్మించు. స. నిర్మాణముచేయు, కలుగఁజేయు

నిర్మితము. స. నిర్మింపఁబడినది

నిర్మితి. స. నిర్మించుట, నిర్మాణము

నిర్మిమీష. స. నిర్మింపనిచ్ఛ

నిర్ముక్తము. స. కుబుసము విడిచినపాము, విడిచిపెట్టఁబడినది

నిర్ముక్తుఁడు స సంగమువిడిచినసన్న్యాసి, సంగమువిడిచినవాఁడు

నిర్మూలము. స. వేరులేనిది, నాశము

నిర్మూలించు. స. వేరులేనిదిగాఁజేయు, నాశముచేయు

నిర్మృష్టము. స. తుడువఁబడినది

నిర్మోగమోటము. గ్రా. నిర్దాక్షిణ్యము

నిర్మోకము. స. పాముకుబుసము, కుబుసము, విడుపు, ఆకాశము

నిర్యంత్రణము. స. అడ్డములేనిది

నిర్యంత్రితము స. అడ్డములేనిదిగాఁ జేయఁబడినది

నిర్యాణము. స. వెడలఁబాటు, చావు, ముక్తి, ఏనుఁగుకడకన్ను

నిర్యాతనము. స చంపుట, ఈవి, పగ తీర్చుట, అప్పు మొదలగువానిఁ దీర్చుట, దాఁచఁబెట్టిన సొమ్ము మరల నప్పగించుట

నిర్యాతము. స వెడలఁబడినది

నిర్యానము స. ప్రానిబంక

నిర్యూహము. స. సిగబంతి, నాగవాసము, వాకిలి, ప్రానిబంక

నిర్లజ్జము. స. లజ్జలేనిది

నిర్లీనము. స. దాఁగినది, పోయినది

నిర్లేఖనము. స. వ్రాసినదానిని గీచివేయుట

నిర్లేపుఁడు. స. నిరహంకారి, గర్వములేనివాఁడు

నిర్వంశుఁడు. స. సంతానములేనివాఁడు

నిర్వచనము. స. అర్థవివరణముచేసిచెప్పుట, మాటలేనిది

నిర్వచనీయము. స. నిర్వచింపఁదగినది, చెప్పఁగూడనిది

నిర్వచించు. స. నిర్వచనముచేసిచెప్పు

నిర్వపణము. స. దానము, ఈవి

నిర్వర్ణనము. స. చూపు, ఆలోకనము

నిర్వర్తించు. స. నిర్వర్తిల్లఁ జేయు

నిర్వర్తిల్లు. స. నెఱవేఱు

నిర్వహణము. స. నాట్యకథాంతము, నిష్ఠ, నెఱవేర్చుట, శ్మశానమునకు శవమును తీసికొనిపోవుట [డు

నిర్వహించు. స. నిర్వహిల్లఁజేయు, కాపా

నిర్వహిల్లు. స. జేరగు, నెఱవేఱు

నిర్వాణము. స. ముక్తి, నాశము, సుఖము, చల్లాఱినది, ఏనుఁగుసీళ్లలోమునుఁగుట

నిర్వాణము. దే. దిగంబరియైనది

నిర్వాణుఁడు స. పనివాఁడు, బరువుమోసెడివాఁడు, ముక్తినొందినవాఁడు

నిర్వాతము. స. చలింపనిగాలి, గాలి లేని చోటు

నిర్వాదము. స. అపవాదము, వాదములేమి, నిశ్చితవాదము

నిర్వాపణము. స. కొల, ఈవి

నిర్వాసనము. స. చంపుట, వెళ్లఁగొట్టుట

నిర్వాసితము స. వెళ్లఁగొట్టఁబడినది

నిర్వాస్యము. స. వెళ్లఁగొట్టఁదగినది

నిర్వాహకుఁడు స. నిర్వహించువాఁడు

నిర్వాహము. స. శక్తి, జరగుఁబాటు, నెఱవేర్చుట, పూర్తి

నిర్వికారుఁడు. స. వికారములేనివాఁడు

నిర్విఘ్నము. స. విఘ్నములేనిది

నిర్విచారము. స. నిశ్చింత

నిర్విణ్ణుఁడు. స. నిర్వేదము నొందినవాఁడు

నిర్వివాదము. స. వివాదములేనిది

నిర్విశేషము. స. విశేషములేనిది

నిర్విష. స. అతివస

నిర్విషము. స. విషము లేనిది

నిర్విష్టము. స. చొరఁబడినది, పొందఁబడినది, నిలిచినది

నిర్వీర్యము. స వీర్యములేనిది

నిర్వృతము. స. ఇల్లు, సుఖించినది, నశించినది

నిర్వృతి. స. సుఖము, ఊరట, నాశము, చావు

నిర్వృత్తము. స. నెఱవేఱినది

నిర్వృత్తి. స. సంతోషము, మోక్షము, నెఱవేఱుట, వృత్తిలేనిది

నిర్వేదము. స. జ్ఞానముచేఁగలిగిన హేయత బుద్ధి, నిరాశ చేసికొనుట

నిర్వేదించు. స. నిర్వేదపడు,నిరాశచేసికొను
నిర్వేశము. స. కూలి, జీతము, భోగము
నిర్హేతుకము. స. కారణములేనిది
నిర్వైరము. స. వైరములేనిది
నిర్వ్యథనము. స. రంధ్రము,బాధ, నొప్పి, [బాధలేమి
నిర్వ్యాజము. స. నెపములేనిది
నిర్వ్యూఢము. స. పూర్తిచేయఁబడినది, విడిచిపెట్టఁబడినది
నిర్వ్యూఢి. స. ముగింపు, ద్వారము, కషాయము, గుడ్డలు తగిలించుకొను చిలుకకొయ్య [పీనుగుఁను కాల్చుట
నిర్హరణము. స. నిశ్శేషముగా హరించుట,
నిర్హ్రాదము. స. ధ్వని
నిర్హారము. స. నాటినబాణము మొదలగు వానినూడఁబెఱుకుట, పైరులోని గాదము మొదలైనవానిని బెఱుకుట, తీసివేయుట, నాశము, విరేచనము, శవమును మోసికొనిపోవుట
నిర్హారి. స. దూరము వ్యాపించునట్టి పరిమ
నిర్హ్రాదితము. స. ఊడఁబెఱికినది [ళము
నిర్హ్రాతి. స. నిర్హారము
నిఱు. త. మిక్కిలి
నిఱునీలుగు. దే. మిక్కిలినీలుగు, గర్వించు
నిలఁబడు. త. నిలువఁబడు
నిలక. దే. నిలుపు
నిలయనము. స. కనుమూసిగంతలు, నివాసముండుట, ఇల్లు, బయటపోవుట
నిలయము. స. ఇల్లు
నిలింపప్రభావము. స. సంస్కృతము
నిలింపుఁడు. స. దేవత, బోయ

నిలీనము. స. మిక్కిలి అడఁగినది
నిలుకడ / నిల్కడ } దే. ఉనికి, స్థైర్యము, విరామము
నిలుగు. దే. నీలుగు, ఒళ్లువిఱుచుకొను
నిలుచు / నిల్చు } దే. నిలఁబడు, ఉండు, శేషించు
నిలుచుండు / నిల్చుండు / నిక్కొలుచును } దే. నిలఁబడియుండు
నిలుపు / నిల్పు } దే. నిలువఁజేయు, నిలువఁబెట్టు, ప్రతిష్ఠించు,అడ్డగించు, స్థిరపఱుచు, నిలుచుట, ఉండుట, నిష్ఠ, ప్రతిష్ఠ, స్థైర్యము, నిలుపునది, స్థిరమైనది
నిలుపుదల. దే. నిలిపివేయుట
నిలుపోపు. దే. సహించు
నిలువ / నిల్వ } దే. నిలిచినవస్తువు, శేషము
నిలువఁబడు / నిల్వఁబడు } దే. నిలుచు, అడ్డపడు ప్రతిష్ఠితమగు
నిలువరము / నిల్వరము } దే. స్థిరమైనది, ప్రస్తుతోపయోగమున నిలుచుటకు నిర్మించినకుటీరము, ఇలువరము
నిలువరి. దే. స్థిరుఁడు
నిలువరించు / నిల్వరించు } దే. చలింపకనిలుచు, ఆఁగు, ఆఁపు
నిలువు. దే. నిలుచుట, నిలుపు, చేయిమీఁది కెత్తుకొని నిలుచున్న పురుషుని చేయి పొడుపుకొలఁదిని,మీఁదిఅంతస్తు,ఆకృతి, చేనిలో కొంతకోసినతరువాత కోయఁగల భాగము
నిలువుఁగొలువు. దే. నిలుచుండి చేయుసేవ

నిలువుగాళ్లు. దే. తావకాళ్లకువెనుక మాను మొదలైనవాని కాధారముగా నాటిన స్తంభములు

నిలువుజీతము. దే. నిలుచుండి సేవచేయు నట్లు ఏర్పాటుచేసికొనియిచ్చెడుజీతము

నిలువులు. దే. ద్వారబంధపునిలువుపట్టెలు

నిలువోపు. దే. నిలుపోపు

నివపనము. స. పారవేయుట,చల్లుట, పితృదేవతలకిచ్చుట, బలి

నివరి. త. నివ్వరి

నివర్తకము. స. ముగింపు, ముక్తి

నివర్తనము. స. మరలఁబాటు

నివర్తించు. స. నివర్తిల్లఁజేయు, విడిచిపెట్టు

నివర్తిల్లు } స. మరలఁబడు
నివర్తిలు }

నివసతి. స. గృహము,కాఁపురముండుచోటు

నివసథము. స. గ్రామము

నివసనము. స. ఇల్లు

నివసించు. స. వాసముచేయు, ఉండు

నివహము. స. సమూహము

నివాకము. స. ధాన్యాదులవెలలనుచాటించి ప్రసిద్ధపఱచుట [చము

నివాతము. స. ప్రాపు, గాలిలేనిచోటు, కవ

నివాపకుఁడు. స. చల్లువాఁడు

నివాపము. స. పితృదేవతలకొఱకై తిలోదకములు విడుచుట మొదలుగాఁ గల కర్మము

నివారణము. స. అడ్డగింత, నిరోధము

నివారణీయము. స. అడ్డగింపఁదగినది

నివారించు. స. అడ్డగించు, నివారణచేయు

నివారితము. స. అడ్డగింపఁబడినది

నివాసము. స. ఇల్లు, నివసించుట

నివాసి. స. వాసముచేయువాఁడు

నివాళి. త. నివ్వాళి

నివాళించు. త. ఆరతెత్తు

నివాళిక. త. నివాళి

నివాళితము. స. చుట్టఁబడినది [చినవాఁడు

నివిష్టుఁడు. స. కూర్చున్నవాఁడు, ప్రవేశిం

నివీతము. స. మెడను దండవలె వ్రేలెడు జన్నిదము, కప్పుకొనఁబడిన వస్త్రము

నివీతి. స. నివీతముగలవాఁడు

నివుడు. దే. నిగుడు

నివుడుచు } దే. నిగుడుచు
నివుడ్చు }

నివురు. దే. నిమురు

నివుఱు. దే. నిగుఱు

నివృతము. స. నలుప్రక్కలచుట్టఁబడినది

నివృతి. స. నలుప్రక్కలచుట్టుట

నివృత్తము. స. మరలఁ బడినది

నివృత్తి. స. మరలఁబాటు, చాలించుట

నివేదనము. స. ఎఱుక, సమర్పణము.

నివేదించు. స. ఎఱిఁగించు, సమర్పించు

నివేదితము.స. ఎఱిఁగింపఁబడినది,సమర్పింపఁబడినది [పఁదగినది, నైవేద్యము

నివేద్యము. స. ఎఱిఁగింపఁదగినది, సమర్పిం

నివేశము. స. ఇల్లు, చోరవ, ఎత్తినదండు విడిసినపాళెము, పెండ్లి [చేయు

నివ్వటించు. త. నివ్వటిల్లఁజేయు, సిద్ధము

నివ్వటిల్లు } త. నెఱవేఱు, కలుగు, వ్యాపించు, నిండారు
నివ్వటిలు }

నివ్వరి. త. తనంతనేపండెడివరి

నివ్వాళి. త. ఆరతి, నీరాజనము
నివ్వాళిక. త. నివ్వాళి
నివ్వెర. దే. నివ్వెఱ
నివ్వెఱ. దే. పారవశ్యము, నిశ్చేష్టత, భ్రాంతి, మిక్కిలిభయము
నివ్వెఱగు. దే. పారవశ్యము, నిశ్చేష్టత, భ్రాంతి, ఆశ్చర్యము
నివ్వెఱపడు. దే. పరవశమగు, చేష్టలుడక్కు, భ్రాంతిపడు, మిక్కిలి భయపడు
నివ్వెఱపాటు. దే. పారవశ్యము, మిక్కిలి భయము, నిశ్చేష్టత, భ్రాంతి
నిశ. స. రేయి, పసుపు
నిశమనము, నిశామనము, నిశామము } స. చూచుట
నిశాంకుశ. స. జిబిలికవృక్షము
నిశాంతము. స. ఇల్లు. వేకువ, మిక్కిలి అడఁగినది
నిశాకరుఁడు. స. చంద్రుఁడు
నిశాఖ్య. స పసుపు, హరిద్ర
నిశాచరి. స. రాక్షసి, అంకుటాలు
నిశాచరుఁడు, నిశాటుఁడు } స. రాక్షసుఁడు, రేద్రిమ్మరి
నిశాతము. స. మిక్కిలి వాఁడిచేయఁబడినది
నిశాదర్శి. స. గుడ్లగూబ
నిశానము. స. పదనుపెట్టుట, సానపెట్టుట
నిశాపతి. స. చంద్రుఁడు
నిశాపుష్పము. స. కలువపువ్వు [పురుగు
నిశామణి. స. చంద్రుఁడు, మెరుగుడు
నిశామృగము. స. నక్క
నిశారణము. స. చంపుట

నిశారము, నీశారము } స. కప్పుకొను పచ్చడము
నిశావేది. స. కోడి
నిశితత్వము. స. చేఱుకు
నిశితము. స. మిక్కిలి వాఁడిచేయఁబడినది
నిశీథము. స. నడురేయి, రేయి
నిశీథిని. స. రాత్రి, రేయి
నిశుంభము. స. వంచుట, చంపుట
నిశ్చయము. స. నిర్ణయము, గట్టినమ్మకము
నిశ్చయించు. స. నిర్ణయించు
నిశ్చల. స. నేల, కదలనిది
నిశ్చలము. స. కదలనిది
నిశ్చాయకుఁడు. స. నిశ్చయించువాఁడు
నిశ్చింతుఁడు. స. చింతలేనివాఁడు
నిశ్చితము. స. నిశ్చయింపఁబడినది
నిశ్చితార్థము. స. వివాహనిష్కర్ష
నిశ్చేతనము. స. కదలనిది, ప్రాణములేనిది
నిశ్చేష్టాకరణము. స. మన్మథబాణములలో నొకటి
నిశ్చేష్టితుఁడు. స. చేష్టలు తక్కినవాఁడు
నిశ్చేష్టుఁడు స. చేష్టలుడిగినవాఁడు
నిశ్రేణి. స. నిచ్చెన, ఈఁతచెట్టు
నిశ్రేయసము. స. ముక్తి, మేలు
నిశ్రేయసుఁడు. స. శివుఁడు
నిశ్శ్వసనము. స. నిట్టూర్చుట
నిశ్వసించు. స. నిట్టూర్పువిడుచు
నిశ్శ్వాసము. స. నిట్టూర్పు
నిశ్శ్వాసించు. స. నిశ్వసించు
నిశ్శబ్దము. స. శబ్దములేనిది, రాత్రి
నిశ్శలాకము స. ఏకాంతమగుచోటు

నిశ్శేషము. స. సర్వము, అంతయు

నిశ్శోధ్యము. స. కడుగుట మొదలగువానిచే నిష్కల్మషమైనది, శోధితము [లేనిది

నిశ్శ్రీకము. స. అందములేనిది, భాగ్యము

నిశ్శ్రీకుఁడు. స. దరిద్రుఁడు [సంగము

నిషంగము. స. అమ్ములపొది, మిక్కిలి

నిషంగి. స. విలుకాఁడు

నిషణ్ణము. స. ఉండినది, కూర్చుండినది

నిషద్య. స. అంగడి, కూర్చుండుట

నిషద్వర. స. రేయి

నిషద్వరము. స అడుసు [దేశము, కఠినము

నిషధము. స. ఒకానొకకొండ, ఒకానొక

నిషాదము } స. ఒకస్వరము
నిషదము

నిషాది. స. మావటివాఁడు

నిషాదుఁడు. స. ఒకతెగ బోయవాఁడు, మాలవాఁడు

నిషిద్ధము. స నిషేధింపఁబడినది

నిషూదకుఁడు. స. నాశముచేయువాఁడు

నిషూదనము. స. చంపుట

నిషేకము. స. గర్భాధానము, చల్లుట, తడుపుట, ఇంద్రియస్ఖలనము

నిషేధము. స. త్రోపుడు

నిషేధించు. స. త్రోపుడుచేయు

నిషేవణము. స. చక్కఁగా సేవించుట, సోమపానము

నిషేవితము. స. చక్కఁగా సేవింపఁబడినది

నిషేవ్యము. స. చక్కఁగా సేవింపఁదగినది

నిష్కంటకము. స. ముండ్లుగాని శత్రువులు గాని లేనిది

నిష్కము. స. మాడ, టంకము, పతకము, పలము, బంగారు, వెండి

నిష్కర్ష. స. నిశ్చయము

నిష్కర్షించు. స. నిశ్చయించు

నిష్కళ. స. ముట్లుడిగిన ఆఁడుది, కళలేనిది, వీర్యములేనిది

నిష్కళంకము. స. కళంకములేనిది

నిష్కళుఁడు. స. గుణరహితుఁడు, దేవుఁడు

నిష్కాంచనము. స. దారిద్ర్యము

నిష్కాముఁడు. స. కోరికలు లేనివాఁడు

నిష్కారణము. స. కారణములేనిది, తీసివేయుట, చంపుట

నిష్కాసితము. స. ఊసుపఁబడినది, వెడలింపఁబడినది

నిష్కించనుఁడు. స. దరిద్రుఁడు

నిష్కుటము } స. తోఁట, ఇంటితోఁట, అంతిపురము, వరిమడి, తలుపు
నిష్కూటము

నిష్కుటి. స. పెద్దయేలకులు

నిష్కుహము } స. తొఱ్ఱ
నిష్కూహము

నిష్కృతము. స. ప్రాయశ్చిత్తము చేయఁబడినది, చేయఁబడినది

నిష్కృతి. స. ప్రాయశ్చిత్తము, చేయుమి

నిష్క్రమము. స. వెడలఁబాటు, శుశ్రూషాది, బుద్ధి, సంపత్తి, చెడుకులము

నిష్క్రయణము } స. డబ్బిచ్చివిడిపించుట, బహుమానము
నిష్క్రయము

నిష్క్రాంతము. స. బయలువెడలినది

నిష్క్రాంతి. స. బయలు వెడలుట

నిష్క్రియత. స. పనిచేయకయుండుట

నిష్ఠలుఁడు. స. పాపము ~~లేనివాఁడు~~. పాని చేయనివాఁడు

నిష్ఠ. స. ఉనికి, తుది, ముగియిక, నాట్యకథాంతము, వేఁడికోలు, ఎడతెగని శ్రద్ధ, నిలుకడ, నేర్పు
నిష్ఠానము. స. మజ్జిగపులుసు
నిష్ఠించు. స. స్థిరమగు, నిశ్చయించు
నిష్ఠితము. స. చక్కఁగా నుంచఁబడినది
నిష్ఠీవనము. స. ఉమియుట
నిష్ఠురము. స. కఠినము, పరుషవచనము
నిష్ఠూతము. స. త్రోయఁబడినది
నిష్ఠేవము. స. ఉమియుట
నిష్ఠ్యూతము. స. ఉమియఁబడినది, త్రోయఁబడినది
నిష్ఠ్యూతి. స. ఉమియుట
నిష్ణాతుఁడు. స. నేర్పరి
నిష్పందము. స. చలనములేనిది
నిష్పక్వము. స. చక్కఁగా కాఁగినది
నిష్పత్తి. స. సిద్ధి పరిసమాప్తి
నిష్పన్నము. స. సిద్ధించినది
నిష్పవనము, నిష్పావము } స. తూర్పారఁబెట్టుట, చెఱుగుట
నిష్పాదనము. స. సిద్ధి
నిష్పాదించు. స. సిద్ధింపఁజేయు
నిష్పాదితము. స. సిద్ధించినది
నిష్పాద్యము, స. సిద్ధింపఁ దగినది
నిష్పావము. స. అనుములు, తూర్పెత్తుట, పొల్లు
నిష్పిష్టము. స. చక్కఁగా నూఱఁబడినది
నిష్పేషణము. స. చక్కఁగానూఱుట
నిష్పేషితము. స. చక్కఁగానూఱఁబడినది, పొడిచేయఁబడినది
నిష్ప్రయోజనము. స. ప్రయోజనములేనిది
నిష్ప్రవాణి. స. క్రొత్తవస్త్రము
నిష్ఫలము. స. ఫలములేనిది
నిసర్గము. స. స్వభావము, కలిగించుట
నిసి. త. రాత్రి, అర్ధరాత్రము
నిసివెలుఁగు. దే. చంద్రుఁడు
నిసుఁగు, నిసువు } త. శిశువు
నిసృష్టము. స. దాఁచఁబెట్టినది, మధ్యస్థము
నిస్తంత్రము. స తంత్రములేనిది,సులభమైనది
నిస్తంద్రము. స. చొరవగలది,అలసటలేనిది
నిస్తరణము. స. దాఁటుట, వెడలఁబాటు, వెరవు, రక్షణము, ఆధారము
నిస్తరించు. స. చక్కఁగా దాఁటు, కడతేఱు
నిస్తర్హణము. స. చంపుట
నిస్తలము. స. కదలునది, వర్తులమైనది
నిస్తారకము. స నిస్తరింపఁజేయునది
నిస్తారకుఁడు. స. కడతేర్చువాఁడు
నిస్తారము. స. దాఁటుట
నిస్తులుఁడు. స. తనకు సమానుఁడు లేనివాఁడు
నిస్తుషితము. స. పొట్టుపోఁగొట్టినది
నిస్త్రాణ. స. బలహీనము
నిస్త్రింశము. స. కత్తి, కనికరములేనిది
నిస్నావము. స. అమ్మగామిగిలినవస్తువులు
నిస్పందము. స. మిక్కిలి చలనము, స్థిరమైనది, కంపము
నిస్పృహత. స. విరక్తి
నిస్పృహము. స. ఆశలేనిది
నిస్పృహుఁడు. స. ఆశలేనివాఁడు
నిస్యందము. స. కాఱుట
నిస్రావము. స. గంజి

నిస్వనము } స. ధ్వని
నిస్వానము

నిస్సంగుఁడు. స. తనకుటుంబమును విడిచి ఋషివలె నుండువాఁడు

నిస్సంతు. త. సంతానములేనిది

నిస్సందేహము. స. నిస్సంశయము

నిస్సత్తువ. త. శక్తిలేమి, అశక్తి

నిస్సరణము. స. ఇల్లులోనగువాని ముందటి భాగము, చావు, ముక్తి, వెడలఁబాటు

నిస్సాణము. త. } చర్మవాద్యవిశేషము
నిస్సాణము. స.
నిస్సానము. త.

నిస్సహము. స. దుస్సహము

నిస్సారము. స. సారములేనిది

నిస్సారితము. స. వెడలఁగొట్టఁబడినది

నిస్స్రవము. స. మిగత, శేషము

నిస్స్రావము. స. వ్యయము, గంజి

నిస్స్వుఁడు. స. బీదవాఁడు

నిహంత. స. చంపువాఁడు

నిహతము. స. గుణకారము, చంపఁబడినది, గుణింపఁబడినది

నిహతి. స. మరణము

నిహతుఁడు. స. కొట్టఁబడినవాఁడు, చంపఁబడినవాఁడు

నిహననము. స. చంపుట

నిహవము. స. పిలుచుట

నిహింసనము. స. చంపుట

నిహితము. స. ఉంచఁబడినది

నిహీనము. స. హీనము

నిహీనుఁడు. స. నీచుఁడు

నిహ్నవము. స. అపనమ్మిక, మఱుఁగుమాట, కపటము. తిరస్కారము, దాఁపఱికము, నమ్మిక

నిహ్నవించు. స. మఱుఁగుపుచ్చు

నిహ్రాదము. స. ధ్వని

నిహ్నుతి. స. మఱుఁగుపుచ్చుట

## నీ

నీ. దే. నీవు అనుదానికి ప్రాతిపదికము

నీఁగు. దే. నివర్తించు, పోఁగొట్టుకొను

నీఁడు. త. కమ్మవారి బిరుదుపేరు

నీకారము. స. తక్కువపఱచుట

నీకాశము. స. ప్రకాశము, తుల్యము

నీచ. స. ఉత్తమమగు ఆవు

నీచగ. స. నది

నీచగము. స. నీళ్లు

నీచభోజ్యము. స. నీరుల్లి

నీచము. స. చిన్నది, పొట్టిది, క్రిందిది, తక్కువది, అధమమైనది, గ్రహగతి యొక్క క్రిందిభాగము

నీచీకృతము. స. తగ్గింపఁబడినది

నీచుఁడు } స. అధముఁడు, వామనుఁడు
నీచు

నీచు. దే. కంపు, చేఁపలవాసన, మాంసము

నీటికానుపు. దే. అగ్ని

నీటికుప్ప. దే. సముద్రము

నీటిచూలి. దే. అగ్ని

నీటితాత. దే. వాయువు

నీటిదయ్యము. త. జలగ్రహము, ఒకజంతువు

నీటిపుట్టుగు. దే. తామర

నీటియిక్క. దే. కౌస్తుభము

నీటిరిక్క. త. పూర్వాషాఢానక్షత్రము
నీటిఱేఁడు. దే. వరుణుఁడు, సముద్రుఁడు
నీటిఱేనిరిక్క. దే. శతభిషనక్షత్రము
నీటివ్రాలు. దే. అనిత్యము, అసత్యము
నీటు. దే. శృంగారగర్వము, విలాసము, మురిపము, అందము
నీటుకత్తియ, నీటుకత్తె } దే. నీటుగలది
నీటుకాఁడు. దే. నీటుగలవాఁడు
నీటుపఱచు. దే. ముచ్చటగా నుండునట్లు చేయు, అలంకరించు
నీడ. దే. ఛాయ, ఎండలేమి, ప్రతిబింబము, రక్షకము
నీడజము. స. పక్షి
నీడము. స. చోటు, పక్షిగూఁడు
నీడోద్భవము. స. పక్షి
నీతకము, నీతము } త. నియమము
నీతము. స. ధనము. ధాన్యము, తేఁబడినది, పొందింపఁబడినది
నీతి. స. న్యాయము, పొందించుట, మర్యాద
నీపము. స. కడిమిచెట్టు
నీయంచే. దే. కంకికాఁడ
నీరంధ్రము. స. ఆకాశము, సందులేనిది
నీరజము. స. తామర, ముత్యము, నీటఁబుట్టి [నది
నీరదము. స. మబ్బు, తుంగ
నీరధి. స. సముద్రము
నీరము. స. జలము, రసము
నీరసము. స దానిమ్మచెట్టు, రసములేనిది, బలహీనము
నీరసుఁడు. స. పేదవాఁడు, బలహీనుఁడు
*నీరాకు. దే. పాఁచి
నీరాజనము. స. ఆరతి
నీరాట, నీరాటము } దే. స్నానము, జలక్రీడ, నీళ్ల యందు చరించు జంతువు
నీరాడు. దే. స్నానముచేయు, కలిలో పోయుటకుఁగాఁచిన వేన్నీళ్లు
నీరామని. దే. వర్షఋతువు
నీరారుచే, నీరార్చు } దే. నీరాడఁజేయు, స్నేహము చేయించు
నీరిజే. దే ఒకానొక అడవిచెట్టు
నీరిప్ప. దే. మధూలకవృక్షము
నీరు. దే. అల్పము
నీరు. త. ఉదకము, కన్నీరు, మూత్రము
నీరుకట్టియ. త. నీరుకట్టె
నీరుకట్టు. దే. మూత్రబంధరోగము, నీరు పెట్టు
నీరుకట్టె. త. నీరుపాము
నీరుకాకి. దే. జలకాకము
నీరుకాయ. దే. నీటిబుగ్గ
నీరుకాయవాఁడు. దే. నీటిమనుష్యుఁడు
నీరుకాఱు. దే. కమసాలెవాని పనిముట్టు
నీరుకావి, నీర్కావి } దే. కొంచెమెఱుపు
నీరుకాసులు. దే. తీర్థములలో స్నానముచేసి యిచ్చెడి డబ్బులు
నీరుకాళ్లు. దే. సంధ్యాకాలమునందు ఎఱ్ఱగ కనుపడు వర్షసూచకములగు సూర్యకిరణములు
నీరుకుక్క. త. జలశునకము
నీరుకుప్ప. దే. సముద్రము
నీరుకోఁతి. దే. శింశుమారము
నీరుగండి. దే. తూముకాలువ, పెనుబాము
నీరుచిచ్చు త. బడబాగ్ని

నీరుచేఱుకు. దే. నీరుదిగునపుడు మంట యెత్తెడు రోగవిశేషము
నీరుటెంకి. దే. జలాశయము
నీరుడి. దే. నీరు అధికముగా దిగు రోగవిశేషము, మూత్రము
నీరుతాలుపు } దే. మబ్బు
నీటితాల్పు
నీరుతిట్ట. దే. సముద్రము
నీరుతిత్తి. త. మూత్రకోశము
నీరుతుట్ర } దే. నీరుకట్టె
నీరుదొత్త
నీరుద్రిమ్మరి. దే. జలజంతువు
నీరుపంది. దే. జలసూకరము, ఆలస్యము
నీరుపదును. దే. కొంచెపుపదును
నీరుపాప. దే. అగ్ని, నీటిమనుష్యుఁడు
నీరుపాము. దే. నీరుకట్టె, మీనభేదము
నీరుపాయము. దే. యౌవనము
నీరుపిల్లి. త. జలమార్జాలము
నీరుపుట్టువ. దే. తామర, శంఖము, కౌస్తుభము
నీరుబుగ్గ. దే. బుద్బుదము
నీరుమజ్జిగ. త. మూఁడుపాళ్లు నీళ్లుగలసిన మజ్జిగము
నీరుమట్టము. దే. జలవ్యాప్తిగల భూభాగము
నీరుమానిసి. త. నీటిమనుష్యుఁడు
నీరుమురుపు. దే. జలప్రాయము
నీరుముట్టు. దే. జలస్పర్శముచేయు, మూత్రవిసర్జనముచేయు
నీరుమోపరి. దే. కుంభము మేఘము, నీరుమోచునది
నీరుల్లి. దే. ఎఱ్ఱగడ్డ, పలాండువు
నీరువట్టు. దే. దప్పికొను, దప్పి
నీరువత్తిగ.* త. భక్ష్యవిశేషము, పేణీలు
నీరువరి. దే. నీవారతృణము
నీరువామి. దే. సముద్రము
నీరెండ. దే. సాయంకాలపుఎండ, స్వల్పాతపము
నీరెత్తువంగ. దే. నీరువంగ
నీరేనుఁగు. దే. నీటిగజేము
నీర్చిచ్చు. త. నీరుచిచ్చు
నీర్వట్టు. దే. నీరువట్టు
నీర్వామి. దే. నీరువామి
నీఱు. త. భస్మము
నీలంగువు. స. ఈఁగ, నక్క, పురుగు
నీలఁడు. త. నీలాశ్వము
నీలకంఠము. స. ముల్లంగి, నెమిలి, బంగారుపిచ్చుక, కాటుకపిట్ట, పాము
నీలకంఠుఁడు. స. శివుఁడు
నీలకము. స. నల్లకోఁతి
నీలగంధి. స మాణిక్యవిశేషము
నీలపుష్పి. స. నల్లదింటెనచెట్టు
నీలము స. నల్లతాయి, నీలిచెట్టు, నలుపు, నల్లనిది, నీలమణి
నీలలోహితుఁడు. స. శివుఁడు
నీలాంబరుఁడు. స. బలరాముఁడు, నైరృతి
నీలాంబుజము } స. నల్లకలువ
నీలాబ్జము
నీలాలి. దే. రెండుముఖములుగల దీపారాత్రికపుపళ్లెము, ద్విముఖదీపిక
నీలి. దే. గారడముగలది, అబద్ధము, మాయయేడ్పు ఏడ్చెడుస్త్రీ
నీలి. త. నల్లనూలు, నల్లనిది, నైల్యము
నీలి. స. నల్లగోరంటచెట్టు, నీలిచెట్టు
నీలిమ } స. నలుపు
నీలిమము

నీలిమందు. దే. నీలియాకు వండి తయారు చేసిన వస్తువు
నీలిమబ్బు. దే. వేఁటసాధనవిశేషము, వాన లేనిమబ్బు
నీలివార్త. స. అబద్ధపువదంతి
నీలీరాగము. స. బయటికి విశేషముగా కనఁబడక లోపల నెప్పటికి తగ్గకుండెడు గాఢానురాగము
నీలుఁడు. స. ఒకానొకవానరుఁడు
నీలుగు } దే. ఒళ్లువిఱుచుకొను, చేచ్చు,
నీల్గు } గర్వము, గర్వము కలిగియుండు
నీలొట్టు. దే. భక్ష్యవిశేషము, ఫేణీలు
నీవరము. స. వర్తకము, ఇల్లు, వాసయోగ్య మగు తావు, నీళ్లు, బురద
నీవరి. త. నివ్వరి
నీవాకము. స. అర్థోత్కర్షహేతువైన జనాదరము, క్షామము
నీవారము. స. విత్తకపండెడునూసర్లు మొద లగు తృణధాన్యము
నీవి. స. సంచిమొదలు అనఁగా అసలు సొమ్ము, పోఁకముడి, పందెపుసొమ్ము, ఒడ్డాణము
నీవివసనము. స. ఇంటిచేట్టునుండుతోఁట
నీవు దే. నీశబ్దమునకు ప్రథమైకవచనము
నీవృత్తు. స. గ్రామము, దేశము
నీవ్రము. స. చూరు, బండికంటికడకమ్మి
నీహారము } స. మంచు
నిహారము }
నీళ. స. విష్ణుభార్యలలో నొకతె
నీళ్లగాఁడి. దే. పశువులు నీళ్లుద్రాగుటకు నూతివద్దకట్టినతొట్టి
నీళ్లతీయు. దే. సగముచేలువచేయు
నీళ్లఱేఁడు. దే. వరుణుఁడు
నీళ్లఱేనిరిక్క. దే. శతభిషనక్షత్రము
నీళ్లవరుఁగు. దే. ఉప్పు, లవణము
నీళ్లాడు. దే ప్రసవించు, స్నానముచేయు
నీళ్ల } దే. జలములు
నీళ్లులు }

## ను

ను. దే. సముచ్చయార్థమును తెలుపును, అవధారణార్థమును తెలుపును, సహితార్థమును దెలుపును, నాశబ్దమునకు ప్రథమైకవచనప్రత్యయము
నుంకు. దే. ఉపవాసము
నుంగు. దే. ముంజె
నుండి. దే. నుంచి
నుక్కట. దే. చలనము
నుగ్గాడు. దే. ఖండించు
నుగ్గు. దే. నలఁగు, చూర్ణము, ఖండము, ముక్క
నుగ్గునూచేగ. దే. ముక్కలుముక్కలుగ
నుగ్గులు. దే పిడుకలు
నుగ్గులువాఱు. దే. నుగ్గగు
నుచ్చిళ్లు. దే. నురుఁగు
నుచ్చు. దే. నుచ్చుపాఁతలుచుట్టు, గొమేఁకల వెంద్రుక లేక వెంటిక
నుచ్చుపాఁత. దే. గొఱ్ఱెలమేఁకల చేలకుఁ జుట్టెడుగుడ్డ
నుచ్చుమల్లి. దే. చిఱుతపులి
నుజ్జు. దే. క్షతినొందినది
నుడి. దే. మాట, చెడ్డపేరు
నుడికారము. దే మాటచమత్కారము

నుడుగు } దే. చెప్పు, మాట
నుడువు }

నుడుగుఱేఁడు. దే. బృహస్పతి, గీష్పతి

నుడువరి. దే. వాచాలుఁడు, మాటలమారి

నుతము. స. నుతింపఁబడినది

నుతి. స. స్తోత్రము

నుతించు. స. స్తోత్రముచేయు

నుతిక. దే. తెగ, మొత్తము

నుత్తము. స. త్రోయఁబడినది, పంపఁబడినది

నుదురు. దే. నొసలు

నును దే. నునుపు, కొంచెము

నునుపరి. దే. నునుపుగలది

నునుపు. దే. నున్నన, స్నిగ్ధత, స్నిగ్ధము

నున్న. దే. నున్నని ఉమ్మక, నునుపైనది

నున్నన. దే. నునుపు, నున్నఁదనము

నున్నము. దే. త్రోయఁబడినది, పంపఁబడినది

నుయి } దే. నూయి, బావి
నుయ్యి }

నురుఁగు } దే. ఫేనము
నురువు }

నురుఁగుదబ్బ. దే. కారిషము, కాలఖండము

నుఱిచియాడు. దే. నాశముచేయు

నుఱిపిడి. దే. ధాన్యమును కాళ్లతో త్రొక్కి నుఱుచుట

నుఱుచు. దే. ధాన్యము కాళ్లతో త్రొక్కి నలుపు

నుఱుపు. దే. నుఱుచు, చేంపు

నుఱుమాడు. దే. చూర్ణముచేయు, చేంపు

నుఱుము. దే చూర్ణముచేయు, చేంపు, చూర్ణము

నుఱుముచేయు. దే. చూర్ణము చేయు, చేంపు

నులక } దే. మంచమల్లెడు సన్నపుత్రాడు
నుల్క }

నులి. దే. వ్రేఁగులలో నొప్పి, చిక్కు, అల్పము, మెలి

నులించు. దే. నులియఁజేయు, నులుచు

నులిగొను. దే. చిక్కుపడు

నులితడ. దే. మహాబలవృక్షము

నులిపురుగులు. దే. కడుపులోనుండెడు సన్నని పురుగులు

నులియు. దే. ఏదైన నొకటి తాఁకుటచే స్థానము తప్పి యిట్టటుతొలఁగు, పొడియగు, నలఁగు, మ్రోఁగు

నులివాట్లు. దే. కొంచెము వాడుటలు

నులివాట్లువాడు. దే. కొంచెమువాడు

నులివు. దే. నులియుట

నులివెచ్చ } దే. కొంచెము కాఁక
నులివెచ్చన }

నులివెట్టు. దే. నులుచు

నులుచు. దే. నులియఁజేయు

నులుపు. దే. నులుచు

నులుము. దే. రెండువ్రేళ్లతో కండను గట్టిగాఁ బట్టి యటునిటు త్రిప్పు, పెల్లగించు, లాగు, మెలిపెట్టు

నులుసు. దే. న్యూనత, నిష్ఫలము

నువు } దే. సస్యవిశేషము
నువ్వు }

నువ్వులు. దే. ధాన్యవిశేషము, తిలలు, దుశిఖము

నువ్వొత్తు. దే. నువ్వుగింజె ఎత్తు, అల్పము

నువ్వొత్తుగొను. దే. కొద్దియగు, ఏమియు లేకుండనగు

నుస. దే. దురద
నుసము. దే. కసరు
నుసరు. దే. రాచు
నుసలు. దే. ఆలస్యముచేయు, పూను, ఒళ్లు విఱుచుకొను
నుసి. దే. పురుగులు తొలిచినకొయ్యపొడి, అల్పము
నుసిపురుగు. దే. మ్రానుతొలిచి నుసిరాల్చెడు పురుగు, ఘుణము
నుసుఁగు. దే. తిరస్కరించు
నుసుమ. దే. కన్నులయందు ముసరెడుచిన్న దోమ
నుసుము. దే. ఆకర్షించు
నుసులు. దే. మెదలు, లాఘవము, కొంచెము చలించు

## నూ

నూ. దే. నువ్వు (నూఁబిండి, నూఁబువ్వు)
నూఁక. దే. వృక్షవిశేషము
నూఁగారు. దే. ఉదరమందలి రోమావళి
నూఁగు. దే. కొన్ని యాకులమీఁదను కాయలమీఁదను ఏర్పడియుండు చిన చిన్నముండ్లు, పడ్డులోనగువాని రేణువు, లేఁతఁదనము, లేత
నూఁగుడు. దే. పడ్డులోనగువానిరేణువు
నూఁగుదోస. దే. కూఁతురుబుడమచెట్టు
నూక. దే. తండులకణము
నూకించు. దే. గెంటించు
నూకు. దే. త్రోచు, త్రోలు
నూకుడు. దే. త్రోపుడు
నూగు. దే నూవు

నూచే
నూచేము } దే. పొడి

నూతనము
నూత్నము } స. క్రొత్త

నూదోస. దే. నూఁగుదోస

నూనియ
నూనె } దే. తైలము, చేమురుగలగింజల నుండి తీయఁబడినది

నూనెముడి. దే. కీలుగంటు
నూనెయగిసె. దే. నల్లగిసెచెట్టు
నూపురము. స. అందె
నూయి. దే. చేఁదబావి, కూపము, నుయ్యి
నూర్చు. దే. నూఱుచు
నూర్పిడి. దే. నూటిపిడి
నూర్పు. దే. నూఱుపు
నూఱంచులకైదువు. దే. వజ్రాయుధము
నూఱిపిడి. దే. నుఱిపిడి
నూఱు. దే. ఆయుధము వాఁడిచేయు, సన్నెకంట మర్దించు, శతము
నూఱుచు. దే. నుఱుచు
నూఱుపు. దే. నుఱిపిడి
నూలిగరసు. దే. బట్టతల
నూలు. దే. ప్రత్తిపడికినపోఁగు, తంతువు

నూలుకొను
నూల్కొను } దే. ఒప్పుకొను, కుదురు కొను, చక్కఁబడు, పురికొను, పుట్టు, అంకురించు

నూలుకొలుపు
నూలుకొల్పు } దే. నూలుకొనఁజేయు

నూలుకోలు. దే నూలుకొనుట
నూవు. దే. తిలసస్యము, నువ్వు
నూవులు. దే తిలలు

## నృ

నృతి. స. నాట్యము
నృత్తము. స. నర్తనము
నృత్యము. స. నాట్యము, శరీరహస్తనేత్రాభినయములచేత పాడునట్టి పాటయొక్క భావమును తెలుపుచు ఆడెడు [ఆట
నృపతి. స. రాజు
నృపలక్ష్మము. స. రాజునకుఁబట్టెడు తెల్లగొడుగు
నృపాలుఁడు } స. రాజు
నృపుఁడు }
నృశంసుఁడు. స. క్రూరుఁడు
నృశంస్యము. స. దుర్మార్గము
నృసింహుఁడు } స. విష్ణువు, నరశ్రేష్ఠుఁడు
నృహరి }

## నె

నె. దే. నెఱ నెఱిశబ్దములకు వృత్తియందు అంత్యవర్ణము లోపింపఁగా మిగిలిన రూపము
నెంజిలి. దే. మనోవ్యథ
నెక్కర. దే. ఒకానొకచెట్టు
నెక్కొను. దే. పాదుకొను, అతిశయించు, వ్యాపించు
నెక్కొలుపు } దే. పాదుకొనఁజేయు, వ్యాపింపఁజేయు
నెక్కొల్పు }
నెక్కొలు. దే. నెక్కొనుట
నెగడి. దే. దుష్టమృగములు బెదరుటకుఁగాని, చలికాఁచుకొనుటకుఁగాని వేసెడు పెద్దపెద్దకట్టెలమంట
నెగడించు. దే. వ్యాపింపఁజేయు, వ్యాపించు
నెగడు. దే. బయలుమెఱయు, వర్ధిల్లు, జలగ్రహము
నెగపు. దే. ఎగపు
నెగయు. దే. ఎగయు
నెగయుదెంచు. దే. పైకిలేచు, నెగయు
నెగవు. దే. ఎగవు
నెగులు. దే. దుఃఖరూపమగుచింత, బాధ
నెగ్గడము. త. త్రొక్కిడి, సమ్మర్దము
నెగ్గించు. దే. నిర్వహించు
నెగ్గు. దే. నిర్వహిల్లు
నెగ్గురు. దే గుండె అదరుటయందగునను కరణము
నెచ్చు. దే. మిక్కిలిసన్నమైన నూకల సమూహము
నెచ్చెలి. దే. స్నేహితుఁడు, స్నేహితురాలు
నెటిక. దే. వ్రేళ్లుమొదలగువాని కీళ్లకదలిక చేప్పుడు
నెటుకురు. దే. నెటికవిఱుగుటయందగు నను కరణము
నెట్టన } దే. అనివార్యముగ, అత్యంతము
నెట్టనము }
నెట్టపంట. దే. నిష్కారణముగ
నెట్టిక. దే. నెటిక
నెట్టికసీల. త. సదాచారసంపన్నమగు స్వభావముగలవాఁడు లేక గలది, మృదుస్వభావుఁడు లేక స్వభావురాలు
నెట్టియము } దే. చుట్టకుదురు, గుండపాగ
నెట్టెము }
నెట్టు. దే. గెంటు, పూనిత్రోయు, పూనిక, నాశము, అడ్డు, ఉప్పుచేయుచోటు
నెట్టుకొను. దే పూనుకొను, నెలకొను, అతిశయించు, బలాత్కరించు
నెట్టులు } దే. బాలక్రీడావిశేషము
నెట్లు }
నెట్టె. దే. ఉద్ది

నెట్టెలుకట్టు. దే. ఉద్దులు ఏర్పఱచు
నెట్రము. దే. ఒడుదుడుకు
నెడిమె. దే. ద్వీపము
నెత్తకమ్మ. దే. పాచికలపందెము
నెత్తపలక. దే. నెత్తమాడెడుపలక
నెత్తమాడు. దే. జూదమాడు
నెత్తము. దే. పాచికలాట,పందెము, కొండ మీఁది విశాల సమప్రదేశము
నెత్తఱులు. దే. పెద్దయలలు
నెత్తావి. దే. పరిమళము
నెత్తి, నెత్తికాయ } దే. తల
నెత్తురు, నెత్రు } దే రక్తము
నెత్తురుప్రొద్దు. దే. సంధ్యాకాలము
నెత్తురుకందు, నెత్రుకందు } దే. జొత్తుపాప
నెత్తురుగడ్డ. దే. వ్రణభేదము
నెత్తురుద్రావుఁడు. దే. రాక్షసుఁడు
నెత్తురుపోడ. దే. ముట్టుఁబాము
నెత్తురుబంక. దే. మలముతో నెత్తురును బంకయును పడువ్యాధివిశేషము
నెత్తురువాఱు. దే. ఎఱ్ఱనగు, జొత్తిల్లు
నెనడు. దే. ఎముకలలోనిక్రొవ్వు, మజ్జ
నెనరు. దే. కృతజ్ఞత, ప్రేమము
నెన్నడుము. దే. సన్ననినడుము
నెన్నుదురు, నెన్నొసలు } దే. ఫాలము, నొసలు
నెపము. దే. వ్యాజము. కారణము, తప్పు, [నింద
నెప్పరము, నెప్పళము } దే. వేగము

నెప్పరి. దే. ఉపాయ మెఱిఁగినవాఁడు, ఉపాయ మెఱిఁగినది
నెప్పరించు. దే. మాదలించు, నిరూపించు
నెప్పు. దే. స్థావము, స్థైర్యము, ఉపాయము
నెప్పుకొను. దే. నెలవుకొను, పాదుకొను
నెమకు. దే. వెదకు
నెమకుడు. దే. నెమకుట, అన్వేషణము
నెమరు. దే. పశువులు కొంచెము నమలి తిన్నదానిని నోటికి తెచ్చికొని మరల చక్కఁగా నమలుట, రోమంథము
నెమరుచే, నెమర్చు } దే. నెమరువేయు
నెమలి. దే. నెమిలి, మయూరము [చెట్టు
నెమిలి. దే. మయూరము, నెమిలియడుగు
నెమిలికన్ను. దే. చంద్రకము
నెమిలిపురి. దే. పింఛము
నెమిలియడుగు. దే. పూతికరజవృక్షము
నెమిలియడుగులు. దే. కుచనఖక్షతములు
నెమిలివడ్లు. దే. శాలిధాన్యవిశేషము
నెమురు. దే. తైలలేపనము [నిశ్చింత
నెమ్మది. దే. ఓర్పు, సౌఖ్యము,ఆరోగ్యము,
నెమ్మనము. దే. హృదయము
నెమ్మి. దే ప్రేమము, నెమ్మది, సంతోషము, క్షేమము, నెమిలి
నెమ్మి. త. వంజులవృక్షము
నెమ్మిక. దే. నెమ్మి, ప్రేమము
నెమ్మిజొట్టు. దే. బర్హిచూడవృక్షము
నెమ్మిరవుతు, నెమ్మిఱేఁడు } దే. కుమారస్వామి
నెమ్మిలి. దే. నెమిలి

నెమ్మిలిపరుఁజో. దే కత్తిపిడి
నెమ్ము. దే. తడి
నెమ్ములు. దే రెండుబల్లలు అంటవేయుటకు లోపలఁ జొప్పించెడు మేకులు,బందులు
నెమ్ముకొను } దే. చెమ్మగిల్లు
నెమ్మూను
నెయి. త. నెయ్యి
నెయ్యపుటలుక. దే. ప్రణయకోపము
నెయ్యపుఱేఁడు. దే మన్మథుఁడు
నెయ్యమూడు. దే. స్నేహించు
నెయ్యమి. త. నెయ్యము
నెయ్యము. త. స్నేహము, ప్రేమ, ఇంపు
నెయ్యరి. దే. స్నేహితుఁడు, స్నేహితురాలు
నెయ్యి. త. నేయి, తైలము, ఘృతము
నెయ్యుఁడు. త. స్నేహితుఁడు
నెయ్యురాలు. దే. స్నేహితురాలు
నెయ్యులు. దే. స్నేహితులు
నెర. దే. వృత్తియందు నెరవు శబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము, నిండైన, గొప్ప, సొగసు
నెరకొను. దే. నిండుకొను
నెరదు. దే. గొగ్గి, విషమము
నెరతనము. దే. మర్యాద, పెత్తనము
నెరపు. దే. నించు, నెరవేర్చు, పఱపు, వ్యాపింపఁజేయు, వ్యాపనము, అధికము
నెరయ. దే. విశేషముగా, మిక్కిలి
నెరయిక. దే. నెరయుట
నెరయు. దే. నిండు, నెఱవేఱు,వ్యాపించు, ప్రకాశించు, వెంట్రుకలు తెల్లనగు
నెరవంజి. దే. ఒకానొకచెట్టు, నెరవెంద
నెరవడి. దే. నిండువేగము, యుక్తి [చెట్టు
నెరవు. దే. పూర్తి, వ్యాపనము, మార్గము, ఒకానొకచెట్టు, పూర్ణము, అధికము యుక్తము, విశాలము, వ్యాప్తము, వ్యాపకము [వంజిచెట్టు
నెరవెంద. దే. తీక్ష్ణగంధవృక్షము, నెర
నెరసు. దే. తప్పు, కళంకము, దోషము, నలుసు, గవుండ్లవాఁడు కత్తులునూఱెడు పొడి
నెరి. దే. వక్రత
నెరియు. దే. వెంట్రుకలు తెల్లనగు
నెరుము. దే. రాచు
నెఱ. దే. వృత్తియందు నెఱవుశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము
నెఱఁకు } దే. మర్మము, జీవస్థానము
నెఱను
నెఱక. దే. వెంట్రుక
నెఱకాఁడు. దే. పూర్ణుఁడు
నెఱపు. దే. నెఱయఁజేయు, నించు, నెఱవేర్చు, వ్యాపింపఁజేయు, పఱపు,వ్యాపనము, అధికము
నెఱయు. దే. నిండు, నెఱవేఱు,వ్యాపించు
నెఱవాది. దే. నేర్పరి
నెఱవిద్దె. దే. హస్తలాఘవముగలజాలవిద్య
నెఱవు. దే. పూర్తి, వ్యాపనము, అధికము, యుక్తము, విశాలము
నెఱవేఱు. దే. ముగియు, సిద్ధించు
నెఱసరి. దే. శూరుఁడు

నెఱా / నేఱా } దే. నెఱి, పూర్ణము

నెఱి. దే. అందము, ఆచారము, వస్త్రపుకుచ్చె, క్రమము, పక్షియీఁకలచిక్కు, న్యాయము, పరాక్రమము, పూర్తి, ఱెక్క, విధము, వక్రత, ప్రజ్ఞ, వక్రము, యోగ్యము, నిగ్గు, గొప్ప, అత్యంతము

నెఱిక. దే. వస్త్రపుకుచ్చె, పైఁట, పావడ

నెఱిపడు. దే. అగు, సిద్ధించు, బాగుపడు

నెఱియ / నెఱె } దే. చీలిక, నేలపగులు

నెఱులు. దే. వెండ్రుకలు, చుట్టవెండ్రుకలు

నెఱ్ఱియ / నెఱ్ఱె } దే. చీలిక, నేలపగులు

నెల. దే. మాసము, చంద్రుఁడు, పున్నమ, స్థానము, కర్పూరము, స్త్రీశిరోభూషావిశేషము

నెలఁత / నెలఁతుక } దే. ఆఁడుది

నెలకట్టు. దే. జాలికట్టడపునేల, కుట్టిమము

నెలకువ. దే. స్థానము

నెలకూన. దే. బాలచంద్రుఁడు, నఖక్షతము

నెలకొను. దే. నెలవుకొను

నెలకొలుపు. దే. ఉంచు

నెలగ. దే. ధనము, దానము, ధర్మము

నెలచూలి. దే. బుధుఁడు

నెలతాలుపు / నెలతాల్పు } దే. శివుఁడు

నెలతునియ. దే. చంద్రకళ

నెలత్రావడము. దే. చకోరపక్షి

నెలపట్టి. దే. బుధుఁడు

నెలపట్టు. దే. చంద్రగ్రహణము

నెలపాలు. దే. చంద్రకళ, నెలవీసము

నెలపులుఁగు / నెలపుల్గు } దే. చకోరపక్షి

నెలపొడుపు. దే. చంద్రోదయము

నెలబాలుఁడు. దే. బాలచంద్రుఁడు

నెలమేపరి. దే. రాహువు

నెలఱాయి / నెలఱా } దే. చంద్రకాంతపు శిల

నెలవంక. దే. బాలచంద్రుఁడు, నఖక్షతము

నెలవంకకోల. దే. అర్ధచంద్రబాణము

నెలవత్తి దే. పచ్చకప్పురపుపలుకు

నెలవరి. దే. మర్మము తెలిసినవాఁడు, పరిచయముగలవాఁడు

నెలవారము. దే. సోమవారము

నెలవీసము. దే. చంద్రకళ

నెలవు. దే. వాసస్థానము, స్థానము, పరిచయము

నెలవుకొను. దే. నిలుకడయగు, నిలుచుండు

నెలవెలుఁగు. దే. వెన్నెల

నెల్లి. దే. ఉసిరికచెట్టు, ఒకదినుసుకూరాకు

నెవడు. దే. నెగడు

నెవము. త. నెపము

నెవయు. దే. నెగయు

నెవిలి. దే. నెమిలి

నెవులు. దే. నెగులు

నెవ్వ. దే. దారిద్ర్యము, ఆపద, వఱపు

నెవ్వగ. దే. అధికవిచారము

నెవ్వడి. దే. అతిశీఘ్రము

నెళవరి. దే. మర్మము నెఱిఁగినవాఁడు, పరిచయముగలవాఁడు

నెళవు. దే. మర్మము, పరిచయము

నెళినెళి. దే. విఱుగుటయందగు ధ్వన్యనుకరణము, ఫెళుక్కున

## నే

నే. దే. నేను

నే. త. నేయి

నేఁజెల్ల. దే. సంతాపమును దెలుపును

నేఁడు. దే. ఈదినము

నేఁత. దే నేయుట, నేసినది

నేఁతకాఁడు. దే. నేఁతనేయువాఁడు, సాలెవాఁడు

నేఁతపలక. దే. నేయునప్పుడు పడుగుపేకలను ఉగ్గించునట్టిపలక

నేఁతపురుగు. దే. సాలెపురుగు

నేఁతరి. దే. నేఁతకాఁడు

నేఁతలు. దే. సన్నబారచాఁపులు

నేజకుఁడు. స. చాకలవాఁడు

నేజనము. స. కడుగుట, ఉతుకుట

నేజి / నేజము } దే. చిల్లకోల, ఆయుధవిశేషము, ఈఁటె

నేటించు. దే. దృఢపడు, నిశ్చయమగు

నేటు. దే. నిశ్చయము, దృఢము, శ్రేష్ఠము, సత్యము

నేటుకొను. దే. నేటించు

నేటుసేయు. దే. నిశ్చయపఱచు, తారతమ్యము విచారించు

నేత. స. ప్రభువు, ఏలిక

నేతవ్యము. స. తీసికొనిపోఁదగినది

నేతిబీఱ. దే. ఘృతకోశాతకి

నేత్రము. స. కన్ను, తరిత్రాడు, వేరు, ఏఱు, తీసికొనిపోవుట, పట్టువస్త్రము, నక్షత్రము

నేత్రయోని. స. ఇంద్రుఁడు

నేదిష్ఠము. స. మిక్కిలిసమీపము

నేను. దే. నాశబ్దమునకు ప్రథమైకవచనము

నేపథ్యము. స. వస్త్రాద్యలంకారము, నాట్యస్థానము, నాట్యరంగమందు తెర లోపలి ప్రదేశము

నేపాళము. త. వృక్షవిశేషము

నేపాళము. స. దేశవిశేషము, ఒకరాగము

నేపాళిక. స. నేపాళపుచెట్టు

నేబు. దే. రెండుడబ్బులు

నేబులు. దే. డబ్బులు

నేమకము. త. నేమము, నియమము

నేమము. త. నియమము

నేమము. స. కాలము, మేర

నేమి. స. బండికంటి కడకమ్మి, గిలక, తినాసవృక్షము

నేమించు. త. నియమించు

నేము. దే. మేము, ధాన్యము చేఁటలోఁబోసికొని యిటు నటుఁద్రిప్పు

నేయము స. తీసికొనిపోఁదగినది, ఊహింపఁదగినది

నేయము. త. స్నేహము, న్యాయము

నేయి. త. నెయ్యి

నేయు. దే. నేఁతనేయు, చాఁపలులోనగువానిని అల్లు

నేయుఁడు. దే. మిత్రుఁడు

నేరఁబోతు. దే. తెలియనివాఁడు

నేరమి. దే. అజ్ఞానము, దోషము

నేరము. దే. తప్పు, అపరాధము

నేరాజు. దే. సరిగతో నేసిన వస్త్రము

నేరిమి. దే. నేరుపు, సామర్థ్యము

నేరుచు / నేర్చు } దే. ఓపు, అభ్యసించు

నేరుపరి / నేర్పరి } దే. సమర్థుఁడు

నేరుపు / నేర్పు } దే. నేరువఁజేయుట, సామర్థ్యము

నేరుపుకాఁడు / నేర్పుకాఁడు } దే. నేర్పరి

నేరుపులాఁడు. దే. నేరుపుకాఁడు

నేరెడు / నేరేడు } దే. జంబూవృక్షము

నేజా. దే. నెజ

నేల. దే. భూమి, ప్రదేశము, దేశము

నేలఁగలుపు. దే. చంపు, నాశము చేయుట

నేలకడిమి. దే. భూకదంబవృక్షము

నేలకలిగొట్టు. దే. భూపాటలీవృక్షము

నేలకుఁగోలకుఁదెచ్చు. దే. క్రిందుమీఁదు చేయుట

నేలగుమ్మడి. దే. భూమికర్కారువృక్షము

నేలగుమ్ముడు దే. విదారివృక్షము

నేలగొలిమిడి. దే. గోలోమివృక్షము

నేలచూలి. దే. సీత, భూమిజ

నేలజెమ్మి. దే. పిన్నజెమ్మి

నేలతంగెడు. దే. చిన్నతంగెడు

నేలతాడు. దే. తాళమూలికచెట్టు

నేలతామర. దే. మెట్టదామర

నేలతాలుపు. దే. పర్వతము, రాజు

నేలతొలసి. దే. భూతులసిచెట్టు

నేలనమిలి. దే. పక్షివిశేషము

నేలనేరెడు. దే. భూమిజంబుకవృక్షము

నేలపట్టి. దే. అంగారకుఁడు,నరకాసురుఁడు, సీత

నేలపల్లటీ. దే. పారావతవిశేషము

నేలపొన్న. దే. కోలపొన్న

నేలమాలె. దే. భూమిలోపలియిల్లు

నేలములక. దే. వాఁకుడు, వార్తాకి

నేలయుసిరిక. దే. భూమ్యామలకివృక్షము

నేలరేను. దే. భూబదరివృక్షము

నేలఱేఁడు. దే. భూపతి, రాజు

నేలవేము. దే. భూనింబవృక్షము

నేలవేలుపు. దే. బ్రాహ్మణుఁడు

నేలసంపెఁగ. దే. భూమిచంపకము

నేలాఁపు. దే. శ్యేనవిశేషము

నేవ. దే. రోషము, నింద

నేవడము. దే. నేవళము

నేవము. త. మిష, నెపము, నెవము

నేవళము. దే. మణులు గ్రుచ్చిన హారము, గోము, సుకుమారము

నేస్తకత్తె. త. స్నేహితురాలు

నేస్తకాఁడు. త. స్నేహితుఁడు

నేస్తము. త. మైత్రి, చెలిమి, స్నేహము

నేస్తురాలు. దే. స్నేహితురాలు

నేహరము. దే. నేవళము

## నై

నైకటికము. స. సమీపమందున్నది

నైకట్యము. స. సమీపము

నైకభేదము. స. అనేకభేదములు కలది

నైకృతికము. స. క్రూరము, నీచము, దుర్మార్గము

నైగనిగ్యము. స. నిగనిగలాడుట

నైగమము. స. వేదాంతము, పట్టణము, వేదసంబంధమగునది, ఉపనిషత్తు, ఆధారము, తెలివితో ప్రవర్తించుట

నైగమికము. స. వేదమువలనఁ గలిగినది
నైగముఁడు. స. సాగరుఁడు, వణిజుఁడు
నైఘంటికము. స. నిఘంటుసంబంధమైనది
నైచికము. స. ఆవుయొక్క శిరఃప్రదేశము
నైచికి. స. చక్కనిరూపమును మంచిప్రాయమును గలిగి సమృద్ధిగ పాలిచ్చెడి యావు
నైచ్యము. స. నీచస్వభావము, నమ్రత్వము, భక్త్యాదులచేఁ గలుగు అధమభావము
నైజము. స. తనది, స్వాభావికము
నైత్యము. స. నిత్యత్వము
నైదాఘము. స. వేసఁగి [సినవాఁడు
నైదానికుఁడు. స. రోగనిదానములను దెలి
నైదానుఁడు. స. శబ్దరూపములను దెలిసినవాఁడు, ఆదికారణమును దెలిసినవాఁడు
నైదేశికుఁడు. స. భృత్యుఁడు
నైధనము. స. నాశనము, చావు
నైపథ్యము. స. వస్త్రాద్యలంకారము, నాట్యరంగము
నైపాళి. స. నేపాళదేశపుమణిసిల
నైపుణము, నైపుణి, నైపుణ్యము } స. నేర్పరితనము, నిపుణత్వము
నైభృత్యము. స. వినయము, రహస్యము
నైమిత్తికము. స. నిమిత్తమువలనఁ గలిగినది, ఒకకారణమువలనఁ గలిగిన ఫలితము, అప్పుడప్పుడు చేయవలసిన కర్మము
నైమిత్తికుఁడు. స. జ్యోతిష్కుఁడు
నైమిశము. స. ప్రసిద్ధమగునొకయరణ్యము
నైమిషేయుఁడు. స. నైమిశారణ్యవాసి
నైమేయము. స. సరకులమాఱుపు, నియమ
నైయగ్రోధము. స. మఱ్ఱిపండు [ము
నైయాయికుఁడు. స. న్యాయశాస్త్రము తెలిసినవాఁడు
నైరంతర్యము. స. నిరంతరభావము
నైరపేక్ష్యము. స. అలక్ష్యము
నైరర్థ్యము. స. నిరర్థకము
నైరాయికుఁడు. స. నరకమందుండువాఁడు
నైరాశ్యము. స. ఆశలేనితనము
నైరుక్తుఁడు, నైరుక్తికుఁడు } స. నిరుక్తమును అనఁగా శబ్దరూపములను దెలిసినవాఁడు
నైరుజ్యము. స. ఆరోగ్యము
నైరృతి. స. పెద్దమ్మ, నైరృతుఁడు
నైరృతుఁడు. స. చతుర్థదిక్పాలకుఁడు
నైర్ఘృణ్యము. స. దయలేనితనము
నైర్మల్యము. స. నిర్మలత్వము
నైర్లజ్జము. స. సిగ్గులేమి
నైల్యము. స. నల్లఁదనము, నీలత్వము
నైవేద్యము. స. నివేదింపఁదగినవస్తువు
నైశము. స. నిశాసంబంధము
నైశికము. స. రాత్రిసంబంధమగునది
నైష్కించన్యము. స. నిఱుపేదతనము
నైష్కికుఁడు. స. టంకసాలకధికారి
నైష్ఠికము. స. కడపటిది, నిశ్చయింపఁబడినది, పూర్తియైనది, విశేషనిష్ఠగలది
నైష్ఠికుఁడు. స. నిష్ఠకలవాఁడు
నైష్ఠుర్యము. స. నిష్ఠురత, నిష్ఠురత్వము
నైసర్గికము. స. స్వాభావికము
నైస్త్రింశికుఁడు. స. కత్తి యాయుధము గాఁగలవాఁడు [హత
నైస్పృహ్యము. స. ఇచ్ఛలేనితనము, నిస్పృ

## నొ

నొంచు. దే. నొవ్వఁజేయు

నొక్కము. దే. పెద్దసదాపచెట్టు

నొక్కు. దే. అదుము, ముదుత, అదుముట వలనఁ గలిగిన యానవాలు

నొక్కుడు. దే. నొక్కు

నొగ. దే. కాఁడికి ఆధారమై బండిమొదలగువాని మొదటనుండెడి నిడుపాటికఱ్ఱ

నొగులు. దే. నొచ్చు, నొప్పి, వికలమగు, వికలమగుట, దుఃఖము

నొగులుచు } దే.నొగులఁజేయు,నొప్పించు
నొగుల్చు }

నొచ్చిల్లు. దే. చొంగ

నొచ్చు. దే. నొప్పిఁజెందు, దారిద్ర్యాదులచే పీడనొందు

నొచ్చుకొను. దే. పశ్చాత్తాపపడు

నొచ్చుకోలు. దే. నొచ్చుకొనుట, పశ్చాత్తాపపడుట

నొడలదొంతి. దే. సంశయము

నొడి. దే. నుడి

నొడికాఁడు. దే. మాటలమారి

నొడికారము. దే. నుడికారము

నొడికారి. దే. మాటలచమత్కారము కలవాఁడు

నొడుగు. దే. నుడుగు

నొడుచు. దే. తప్పులుపట్టు

నొడుపు. దే. తప్పులుపట్టుట

నొడువు. దే. నుడువు

నొప్పి. దే. బాధ, ఒప్పమి, ఆపద

నొప్పించు. దే. బాధించు

నొప్పిగుంటి. దే. వ్యాధిగ్రస్తుఁడు

నొల్లు. దే. బిడ్డలు నోట వ్రేళ్లుంచుకొని చేప్పరించు, పోగుచేయు, భూమినిపదునుచేయు

నొవ్వి } దే. వేదన, వ్యాధి
నొవ్వు }

నొసలు. దే. నుదురు, ఫాలము

## నో

నోఁచు. దే. వ్రతమాచరించు

నోఁత. దే. నోఁచుట

నోటిపేద. దే. తెలివితక్కువవాఁడు

నోటిబీగము. దే. దేవతాప్రార్థనకై దౌడలయందు కుట్టుకొనెడు, లోహపుతీఁగ

నోదనము. స. త్రోయుట, పోఁగొట్టుట, కోయుట

నోము. దే. వ్రతముచేయు, వ్రతము, పోఁగొట్టు

నోముదారము. దే. తోరము

నోయు. దే. నొచ్చు

నోరాడు. దే. పలుకు

నోరు. దే. ముఖద్వారము, వక్త్రము

నోరుకొట్టు. దే. ఒకనిని అనుభవింపనీయకుండు, దోఁచుకొను

నోరుమూయు. దే. మాటలాడక యుండు

నోరుమెంగ. దే. మూఁగ

నోరూరు. దే. రుచిగలవస్తువులు తిను కోరికచే నోటనీళ్లూరు, అపేక్షించు

నోరెత్తు. దే. మాటాడ యత్నించు

నోవరి. దే. వ్యాధిగలవాఁడు

నోవి. దే. బాధ

నోవు. దే. నొవ్వు

## నౌ

నౌ } దే. నవ్వు
నవు }

**నౌక.** స. నావ, ఓడ

**నౌకాదండము.** స. ఓడనడుపుగడ

**నౌకు** / నవుకు } దే. మొఱ్ఱ, పల్లము

**నౌడు** / నవుడు } దే. ఔడు, పెదవి

నౌడుకొట్టు / నవుడుకొట్టు } దే. మిణకరించే

నౌరు / నవురు } దే. మృదువు

# న్య

న్యంకువు. స. ఇఱ్ఱి, ముని

న్యక్కారము / న్యక్కృతి } స. తిరస్కారము

న్యక్షము. స. అధమము, సమస్తము

న్యగ్రోధము. స. మఱ్ఱిచెట్టు, జెమ్మిచెట్టు

న్యగ్రోధి. స. ఎలుకజీడిచెట్టు

న్యర్బుదము. స. పదియర్బుదములసంఖ్య

న్యసనము. స. ఉంచుట, ఇచ్చుట

న్యస్తము. స. ఉంచఁబడినది

# న్యా

న్యాదము. స. భోజనము

న్యాయము. స. తగవు, స్వధర్మమువలన చలింపకుండుట, తర్కశాస్త్రము, పద్ధతి, అర్హత, మర్యాద, చట్టము, పుణ్యము, వ్యాజ్యెము, తీర్పు, మంచిప్రభుత్వము, పోలిక, సంబంధము, సూత్రము,దృష్టాంతము, తత్త్వశాస్త్రము, నీతి

న్యాయవృత్తము. స. సత్ప్రవర్తన

న్యాయ్యము. స. న్యాయముతోఁగూడినది

న్యాసము. స. ఉనుచుట, దాఁచేఁబెట్టుట, చెప్పక చూపక దాఁచేఁబెట్టినధనము, [వాదిక

న్యాసి. స. సన్యాసి

# న్యు

న్యుబ్జము. స. వంగినది, ఒక మ్రానిపండు

న్యుబ్జుఁడు. స. క్రిందుచూచువాఁడు, వ్యాధిచేవంకరైనవాఁడు

# న్యూ

న్యూనత. స. తక్కువ, కొఱంత,అగౌరవము

న్యూనము. స. తక్కువైనది, నిందింపఁదగినది

న్యూనీకృతము. స. తగ్గింపఁబడినది

# ప

ప. ఒకయక్షరము

పంకజము. స. తామర

పంకజిని. స. కమలము

పంకము. దే. పాలు

పంకము. స. బురద, పాపము

పంకరుహము. స. తామర

పంకి. త. బురద

పంకించు. స. పంచించు

పంకించు. దే. పట్టించు

పంకించు. త. చలించు

పంకిణి. దే. పరిమళద్రవ్యములుంచుపాత్రవిశేషము

పంకిలము. స. బురదగలదేశము

పంకెన. దే. తడి. పదను

పంకేజము / పంకేరుహము } స. కమలము

పంక్తి. స. వరుస, గుంపు, పది, కీర్తి, పక్వము, భోజనమునకై కూర్చుండియుండునేక కులస్థులగు మనుష్యులవరుస, గీఁత, సేన

పంగ. త. శాఖాద్వయమూలము, ఎడము గాచేఁచిన కాళ్ల మధ్యప్రదేశము

పంగటి. త. ఎడముగలది, పంగటికాళ్లు

పంగటించు. త. కాళ్లెడముగాఁ జేచి నిలుచు

పంగటికాళ్లవాఁడు. దే. దొడ్డికాళ్లవాఁడు

పంగనామము. దే. నడుమ ఎడముగలుగ పంగవలె నొసటఁబెట్టినతిరుమణి

పంగము. త. దేవబ్రాహ్మణుల వృత్తులమీఁద దొరతనమువారు తీసికొను చతుర్థాంశ మగుపన్ను

పంగిడి. దే. ఏనుఁగులను పట్టునపుడు అవి పడుటకై త్రవ్వఁబడినపల్లము, అవ పాతము, ఓదము

పంగు. దే. భయము

పంగువు. స. శని, ఈచఁబోయినకాలుగల్గు వాఁడు, కుంటివాఁడు

పంగెన. దే. పంగిడి, ఏనుఁగునుకట్టుపగ్గము

పంచకము. స. యుద్ధభూమి, ఐదు

పంచకోణము. స. అయిదుకోణములుగల యాకృతి

పంచగవ్యము. స. గోసంబంధివస్తువులగు ఆవుపేఁడ, పంచితము, పాలు, పెరుఁగు, నెయ్యి, ఈఅయిదును చేరినదాని [పేరు

పంచగుప్తము } స. తాఁబేలు
పంచగూఢము }

పంచజనుఁడు. స. మనుష్యుఁడు

పంచత్వము. స. చావు, పంచభావము

పంచదశకము. స. పదియేను

పంచదశి. స. అమావాస్య, పున్నమ, ఒకానొక గ్రంథము

పంచనఖము. స. పులి

పంచనఖి. స. ఉడుము

పంచపంచాత్మకము. స. ప్రపంచము, హారము, వెడల్పుముఖము గలపాత్రము

పంచబాణుఁడు. స. మన్మథుఁడు

పంచభద్రము. స. ఐదుచోట్ల మంచిసుళ్లు గలగుఱ్ఱము

పంచమంగళము స. శిరస్సు రొమ్ము మొదలగుచోట్ల మంచిసుళ్లుగల గజము

పంచమము. స. కోయిల, ఒకస్వరము, ఐదవది, ఇంపైనది [పది

పంచమి. స. పక్షమునందు ఐదవతిథి, ద్రౌ

పంచముఁడు. స. మాలవాఁడు, నేర్పరి

పంచము. స. విశాలము, వ్యాప్తము

పంచలక్షణము. స. పురాణము

పంచవక్త్రుఁడు. స. శివుఁడు

పంచపట్టె. గ్రా. ఐదుపట్టెలు

పంచవన్నియ } గ్రా. ఐదువర్ణములు
పంచవన్నె }

పంచశరుఁడు. స. మన్మథుఁడు

పంచశాఖము. స. చెయ్యి

పంచషములు. స. అయిదాఱువస్తువులు

పంచసారము. స. పంచదార

పంచాంగము. స. తిథివారనక్షత్రయోగ కరణములను తెలియఁజేసెడు సాంవత్సరికగ్రంథము, అయిదు అంగములు గలది, కూర్మము.

పంచాంగులము. స. ఆముదపుఁజెట్టు
పంచాణుఁడు, స. శిల్పి
పంచాననము. స. సింహము
పంచాననుఁడు. స. శివుఁడు
పంచామృతము. స. పాలు, పెరుఁగు, వెన్న, తేనె, జలమునుగలసిన దైవాభిషేక ద్రవ్యము
పంచాయతి. స. న్యాయము తీర్చుటకై మధ్యస్థముగా నేర్పడిన అయిదుగురి కూటమి
పంచారూఢిపత్త్రము. స. ఉత్తమర్ణుఁడును, అధమర్ణుఁడును, ఇద్దఱుసాక్షులును, సాధనమును లిఖించెడివాఁడును, ఈయయిదుగుఱు నెఱుఁగవ్రాసినపత్త్రము
పంచాలి. స. గీతవిశేషము
పంచాశత్తు. స. ఏఁబది [మెకము
పంచాస్యము. స. సింహము, తెఱనోటి
పంచాస్యుఁడు. స. శివుఁడు
పంచితము. దే. గోమూత్రము
పంచితిల్లు } దే. గోవుమూత్రమువిడుచు
పంచితిలు }
పంచివేఁత. దే. పంచుకొనుట, భాగములు వేసికొనుట, చేందా
పంచియ } దే. కట్టుకొను చిన్నవస్త్రము,
పంచె } అంగవస్త్రము
పంచేషువు. స. మన్మథుఁడు
పంచే. త. గృహాదిపార్శ్వప్రదేశము, పంచేపాకము, అధికము [ర్శ్వ] దేశము
పంచేకము. దే. గుఱ్ఱముయొక్క పశ్చా
పంచేకము. త. అయిదుతూములు
పంచేకరపాటులు. దే. అత్యధికదుఃఖములు
పంచేదార. త. శర్కర
పంచేపాక } దే. ఇంటిప్రక్కవంచికట్టిన
పంచేపాళి } కట్టడము
పంచేబంగాళము. త. ధూరము, అదృశ్యము
పంచోణము. త. శిల్పము
పంచోణంబువాఁడు }
పంచోణమువాఁడు } దే. శిల్పి
పంచోణపువాఁడు }
పంచోది. దే. పంచే, పంచేపాక
పంచోరము. త. వ్యాపనము, అతిశయము
పంచోరించే. త. వ్యాపించే, అతిశయించే
పంచు. దే. ఆజ్ఞాపించే, పుచ్చు, భాగించే
పంజరము. స. పంజేరము, గవుసెన, శరీరము, శరీరముయొక్క యెముకలగూఁడు
పంజి. దే. కప్పము
పంజియ. త. బారంగిచెట్టు [ద్ర్యము
పంజె. త. బారంగిచెట్టు, దరిద్రుఁడు, దారి
పంజే. త. అవిక
పింజేన. దే. శ్లేష్మమైనది
పంజేరము. త. పెంచెడు చిలుకలు మొదలైనవానిని పెట్టుగూఁడు
పంజేళము. దే. పంచాలి, గీతవిశేషము
పంజోయి. దే. ఒకదినుసు దివటీ
పంజే. దే. ఒకదినుసు దివటీ, విడవలిలో నగువానికట్ట [కమ్మలు
పంజేలకమ్మలు. దే. రత్నములు చెక్కిన
పంట. దే. సస్యములఫలింపు, పండుట, కృషి, ఫలము
పంటకాఁపు. దే. పంటచే జీవించువాఁడు, కృషీవలుఁడు, రెడ్లలో ఒక తెగవాఁడు

పంటరెడ్లు. దే. రెడ్లలో ఒక తెగవారు

పంటవలంతి. దే. భూమి

పంటసాల. దే. ఉగ్రాణము

పంటి. దే. పనఁటి, కుండ

పంటించు. దే. జోగుచేయు, తడఁబడు,అనుమానించు

పంటియ, పంటె. దే. సాలెవాఁడునూలుచుట్టెడు సాధనవిశేషము

పంట్ర, పంట్రకోల. దే. చిల్లులుగల అలుఁగులు మూఁడునాలుగుగలకఱ్ఱ

పంట్రించు. దే. పంట్రతోఁబొడుచు

పండ. స. యథార్థమునెఱిఁగెడు బుద్ధి

పండఁబాఱు. దే. పండు, పరిపక్వమగు

పండావారు. దే. ఓఢ్రదేశమందుండు ఒక తెగజనులు

పండితంమన్యుఁడు. స. పండితుఁడనని తన్నెన్నికొనెడివాఁడు

పండితపుత్త్రుఁడు. స. పండితుని కుమారుఁడు, శుంఠుఁడు

పండితుఁడు. స. చేదువరి, విద్వాంసుఁడు, పండినది

పండు. దే. ఫలించు, శయనించు, ఫలము

పండుఁడు. స. నపుంసకుఁడు

పండుకొను. దే. శయనించు

పండుగ, పండుగు. దే. ఉత్సవము, సంతోషము, సంక్రాంతి మొదలగునవి

పండుచేప. దే. మత్స్యవిశేషము

పండువ, పండువు. దే. పండుగ

పండువెన్నెల. దే. పూర్ణచంద్రిక

పండేరము. త. భిక్ష్యము

పండ్రెండు. దే. ద్వాదశసంఖ్య

పండ్లమాను. దే. చేలలో పైరులోని గాదము పోవునట్లు దున్నెడుసాధనము

పండ్లు. దే. ఫలములు, దంతములు

పంతకాఁడు. దే. పోటిచేయువాఁడు, ప్రతిజ్ఞకలవాఁడు, పౌరుషముకలవాఁడు

పంతగించు. త. పోటిచేయు, ప్రతిజ్ఞచేయు, విధించు

పంతము. త. పోటి, ప్రతిజ్ఞ, విధము,పౌరుషము

పంతు. దే. మేలిమి, మేలు

పంతులు. దే. కొందఱు బ్రాహ్మణులలో గొప్పయుద్యోగస్థులకు పూజ్యవాచకము, ఉపాధ్యాయుఁడు

పంద. త. పిఱికి

పంది. దే. సూకరము

పందికొక్కు. దే. మూషిక

పందిగడ్డ. దే. ఒకజాతిదుంప

పందిగోరు. దే. వేఁటకానిసాధనము

పందిపీఁట. దే. గాఁడీమొదలగు ఎక్కుడు బండ్లచివరను పందిమూఁతివలె మ్రాను మొదలగువానితోఁజేసి యమర్చినపరికరవిశేషము

పందిపోటు. దే. పందీఁటె

పందిముక్కు, పందిమూఁతి. దే. పందిపీఁట

పందిరి, పందిలి. దే. గుంజెలునాటి మీఁద కొయ్యలు కట్టి తాటాకులోనగు వానిని కప్పినది

పందీఁటె. దే. పందిని పొడుచునట్టి యీఁటె

పందుము. దే. పదితూములు

పందెకాఁడు. దే. పందెముపెట్టికొడి మొదలగువానిని జెగడమునకు విడుచువాఁడు

పందెము, పందియము. త. జూదమునందు ఓడెడువాఁడు గెలిచెడు వానికిచ్చునట్లు పంతమాడిపెట్టెడు ధనాదికము,

ప్రతిజ్ఞ, గవ్వలాటలోగవ్వలపొరలిక, దాయము
పందేరము. దే. ధనాదికమును పంచి పెట్టుట
పందొమ్మందుము. దే. పందొమ్మిదితూములు
పందొమ్మిది. దే. ఏకోనవింశతి
పంపకము. దే. పంచుట, పంపుట
పంపర. స. పంపరపనసచెట్టు
పంపరపనస. దే. పంపరయను ఫలవృక్షము
పంపించు దే. పంచు, పుచ్చు
పంపు. దే. ఆజ్ఞాపించు, పంపించు, ఆజ్ఞ, ఆజ్ఞాపింపఁబడినపని, పంపకము, పరిమళ్లవరుస, మారణకర్మము, వీసెలో నెనిమిదవభాగము
పంపువడు. దే. ఆజ్ఞాపింపఁబడు
పంపువెట్టు. దే. ఆజ్ఞాపించు
పంబ. త. చర్మవాద్యవిశేషము
పంబలవాండ్రు. దే. పంబవాయించెడివాం[డ్రు]
పంబు. దే. అతిశయించు, ఎద్దుమీఁద వేసెడు పెద్దసిద్దె
పంబుదాళ్లు. దే. దేనినేని ఈడ్చి కట్టెడు త్రాళ్లు
పంబోతు. దే. పోతరించినయెద్దు
పకపక, పకాపక. దే. నవ్వుటయందగు ననుకరణము
పక్క. దే. పడుక, శయ్య
పక్క. త. పార్శ్వము, పక్షము, పుట
పక్కణము. స. బోయపల్లె
పక్కణి. దే. బరణి
పక్కము. త. మాసార్ధము, తోడు
పక్కము. దే. సంగడీఁడు, పొందువాఁడు
పక్కశుఁడు. స. చండాలుఁడు
పక్కాలి. దే. ఎద్దుమీఁద నీళ్లుతెచ్చెడి తోలుసంచి
పక్కి. త. పక్షి
పక్కిడాల్వేలుపు. దే. విష్ణువు
పక్కియ. దే. పక్కెచెట్టు
పక్కియ. త. పార్శ్వము
పక్కియొడలివాఁడు. దే. కిన్నరుఁడు
పక్కిరాయఁడు. త. గరుత్మంతుఁడు
పక్కు. దే. ఎండినపట్టు, నవ్వుటలోనగువాని యందగు ధ్వన్యనుకరణము
పక్కున. దే. తటాలున
పక్కె. దే. పిచులవృక్షము, మత్స్యవిశేషము
పక్కెర. త. గుఱ్ఱము లోనగువాని అంగీ, కవచము
పక్కెరాలు దే. అంతఃపురపుకావలికత్తె
పక్త్రిమము. స. పండినది, వండఁబడినది
పక్వము. స. పరిపాకముఁబొందినది, చేటు మూఁడినది, వండినది, పండినది
పక్షకము. స. దిడ్డివాకిలి, పక్క
పక్షచరము. స. తనకమపునుబాసి యొంటిగాఁ జరించెడియేనుఁగు
పక్షచరుఁడు. స. చంద్రుఁడు
పక్షతి. స. పాడ్యమి, ఱెక్కమొదలు
పక్షపాతము. స. ఒకపక్కకొఱగుట
పక్షపాతి. స. పక్షపాతముకలవాఁడు
పక్షభాగము. స. ఏనుఁగుయొక్కపార్శ్వభాగము
పక్షము. స. నెలయందుపదిదేనుదినములు, ఱెక్క, ప్రక్క, ప్రక్కయిల్లు, పగ, సహాయుఁడు, తర్కవిషయసాధ్యము,

బాణమునకుకట్టు ఈఁక, పార్శ్వము, సేనయొక్క ఱెక్క, సగము, ఒక తెగ, వాదములోని యొకభాగము, స్థితి
పక్షాంతము. స. పున్నమ, అమావాస్య
పక్షి. స. చిలుక మొదలైనది
పక్షికీటకము. స. నీచపక్షి
పక్షిణి. స. రెండుపగళ్లతోఁ గూడినరాత్రి, రాత్రి, పున్నమ, ఆఁడుపక్షి
పక్షీకరించే. స. పక్షముంచే
పక్ష్మము. స. ఱెప్పవెండ్రుక, పక్షిత్రుప్పుడు
పక్ష్మలము. స. పక్ష్ములుగలది
పక్ష్మలించే. స. ఱెప్పవేయు
పగ. త. విరోధము, విరోధి
పగఁదెంచే. దే. చేంపు
పగఁబట్టు. దే. పగగొను
పగగొను. దే. విరోధపడు
పగచాటు. దే. దూషించే
పగటివేలుపు } దే. సూర్యుఁడు
పగటివేల్పు }
పగటు. త. ప్రకటించే, ప్రకాశము, లావణ్యము, గర్వము, విరోధము, మురిపెము
పగడ. దే. పాచికలమీఁది ఒంటిచుక్క, ఒకటి
పగడపుజిట్ట. దే. పక్షివిశేషము
పగడపురిక్క. త. ఆర్ద్రానక్షత్రము
పగడము. త. మణివిశేషము, ప్రవాళము
పగడసాల. దే. సొగటాల ఆట, సొగటాల పలక
పగతుఁడు. దే. శత్రువు
పగతురాలు. దే. శత్రురాలు
పగదారి. త. విరోధము వహించినవాఁడు
పగఱు. దే. శత్రువులు
పగలింటిదొర. దే. సూర్యుఁడు
పగలు. దే. దినము
పగలువత్తి. దే. మత్తాబు
పగవాఁడు. దే. శత్రువు
పగిడి. దే. కరబుజేపుచెట్టు
పగిది. దే. విధము, కప్పము
పగులఁగొట్టు. దే. పగుల్చు
పగులఁబాఱు. దే. పగులు
పగులు. దే. భిన్నమగు, చీలిక
పగులుచే } దే. పగులఁజేయు
పగుల్చు }
పగుళ్లువాఱు. దే. చీలు
పగ్గము. త. త్రాడు, గుఱ్ఱములు, ఎద్దు మొదలైనవాని కుపయోగించుత్రాడు
పగ్గించే. త. ప్రజ్ఞలుపలుకు
పగ్గె } త. సామర్థ్యమును దెలుపుమాట,
పగ్గియ } సామర్థ్యము, గర్వోక్తి, ప్రజ్ఞ
పచ. స పాకము, వంట
పచంపచ. స. మ్రానిపసుపు
పచకుఁడు. స. వంటవాఁడు
పచనము. స. పాకము, వండుట
పచేరము. త. విహారము
పచేళిమము. స. తనంతట పక్వమైనది
పచ్చి. దే. తడిగలది, ఉడకనిది, ఎండనిది, కాలనిది, తేఱనిది, ముదరనిది
పచ్చిక. దే. పచ్చికసవు
పచ్చిదేఱు. దే. పచ్చియగు
పచ్చిబియ్యపుమామిడి. దే. నారలేక కండగలమామిడి
పచ్చిబియ్యము. దే. నానఁబ్రాలు, ఉప్పుడు చేయని బియ్యము
పచ్చెకాఁడు. దే. చూచుచుండఁగ దొంగిలించువాఁడు

పచ్చెము } త. చూచుచుండఁగా దొం
పచ్చియము } గిలించుట

పచేరణ. త. నటన

పచేరించు. త. ప్రవర్తించు, ప్రసరింపఁజేయు, అంగడియందమ్ముటకు సరకుల నమర్చు, ప్రయోగించు, చేఁచు, నడపు, ప్రకటించు, బాణము ప్రయోగించు, చేయు, చెప్పు

పచేరింపు. త. ప్రసరణము

పచారము. త. అంగడి

పచారించు. త. నడపు, ప్రసరింపఁజేయు

పచారు. త. విహారము, ప్రచారము

పచ్చ. త. పసరువన్నె, పసుపువన్నె, మరకతమణి, పసుపువన్నెగలది, ముఖమందు పొడిపించుకొనుటచేత నేర్పడెడు పసరు వన్నె రేఖ

పచ్చఁబ్రాలు. దే. శోభనాక్షతలు

పచ్చకన్నులమెకము. దే. సింహము

పచ్చకన్నులవేల్పుసూడు. దే. ఒకానొక రాక్షసుఁడు

పచ్చకప్పురము. త. చల్లఁదనము, మంచి పరిమళమునుగల యొకవిధమగు కర్పూరము

పచ్చగన్నేరు. దే. పచ్చపూవుగల గన్నేరు చెట్టు, ధాన్యవిశేషము

పచ్చగోరంట. దే. కురంటకము

పచ్చడము. త. వస్త్రము, కట్టువస్త్రము, అంగవస్త్రము, దుప్పటి

పచ్చడి. దే. ఉప్పు, కారము వేసి కూరగాయ దినుసులుగాని పప్పుదినుసులుగాని కలియ నూరిన వ్యంజనవిశేషము, ఖండము, ఊరుఁబిండి

పచ్చతలపిచ్చుక. దే. పక్షివిశేషము

పచ్చన. త. పసరువన్నె, పసుపువన్నె

పచ్చపచేన. త. మిక్కిలిపచ్చన

పచ్చపిట్ట } దే. పక్షివిశేషము
పచ్చపులుఁగు }

పచ్చపెసలు. దే. ఖండీరము

పచ్చపొడుచుకొను. దే. దేహమందుపసరు వన్నెఅంటునట్లు పొడిపించుకొను

పచ్చముపాడు. దే మిక్కిలిశూన్యము

పచ్చయరఁటి. దే. మహారంభవృక్షము

పచ్చఱెక్కలపిట్ట. దే. చిలుక

పచ్చవలువదారి. దే. విష్ణువు

పచ్చవారువపుజోదు } దే. సూర్యుఁడు,
పచ్చవార్వపుజోదు } మన్మథుఁడు

పచ్చవిలుతుఁడు } దే. మన్మథుఁడు
పచ్చవిల్తుఁడు }

పచ్చాకు. దే. హారితపత్రి కాపత్త్రము. మంచి వాసనగల యొకదినుసు ఆకు

పజే. త. జనము

పజ్జ. త. వెనుక, సమీపము

పజ్జేరించు. త. ఉపసర్పించు

పటకారుఁడు. స. సాలెవాఁడు

పటకుటి. స. డేరా

పటచ్చరము. స. ప్రాంతగుడ్డ

పటచ్చరుఁడు. స. దొంగ

పటపట. దే. అనుకరణము

పటమంటపము. స. డేరా

పటము. త. పాఁపపడగ

పటము. స. వస్త్రము, చిత్తరువువ్రాయు వస్త్రాదికము, కాగితముమీఁద వ్రాయఁబడిన దేశాదికము

# ప్రా

ప్రా. త. వృత్తియందు ప్రాఁతశబ్దమునకు లుప్తశేషము, పురాతనమైనది, శ్రేష్ఠమైనది
ప్రాంగణము. స. ముంగిలి, ప్రదేశము
ప్రాంచత్. స. ప్రకాశించెడు
ప్రాంతము. స. తీరము, సమీపము
ప్రాంతరము. స. అడవి, దూరమైనయెడారి త్రోవ, పొలిమేర
ప్రాంశువు. స. పొడుగైనది, ఉన్నతము
ప్రాఁకు. దే. ఎక్కు, అొమ్మతో జేరగు, తీఁగెలల్లుకొనుటకు సమీపముననుంచు కొయ్య మొదలగునది, మాలిన్యము, పాఁచి, మోఁకాళ్లో చేతులు క్రిందనాని నడచుట
ప్రాఁకుడు. దే. ప్రాఁకుట, పాఁచి
ప్రాఁకుడెంచు. దే. ప్రాఁకు
ప్రాఁకులాఁడు. దే. ప్రాఁకి యెక్కు
ప్రాఁకొను. దే. పాఁచిపట్టు
ప్రాఁగబ్బము. త. వేదము
ప్రాఁచి. త. పాఁచి
ప్రాఁజెదువులు. దే. వేదములు
ప్రాఁత. త. భృత్యుఁడు, వస్త్రము, జీర్ణవస్త్రము, పురాతనము, పూర్వము, జీర్ణము
ప్రాఁతగిల్లు } త. ప్రాఁతవడు
ప్రాఁతగిలు }
ప్రాఁతవడు. త. ప్రాఁతదియగు
ప్రాఁబడు. త. ప్రాఁతగిల్లు, ఆలవడు
ప్రాఁబలుకులు } దే. వేదము
ప్రాఁబల్కులు }
ప్రాక. దే. పాక
ప్రాకటము } దే. ప్రసిద్ధము
ప్రకటము }
ప్రాకర్షికుఁడు. స. ఇతరునిభార్యవలనఁ బోషింపఁబడువాఁడు
ప్రాకషికుఁడు. స. ఇతరునిభార్యచే పోషింపఁబడువాఁడు [సూ] ఫ్రక్తి
ప్రాకామ్యము. స. ఒకయైశ్వర్యము, మన
ప్రాకారము. స. గుడి మొదలగువానిచుట్టు గోడ, ప్రహరి
ప్రాకాశ్యము. స. ప్రసిద్ధి, కీర్తి
ప్రాకృతము. స. ఒకానొకభాష, నీచమైనది
ప్రాకృతుఁడు. స. పామరుఁడు, నీచుఁడు
ప్రాకెన. త. పాకెన
ప్రాకెన్న. త. పాకెన్న
ప్రాక్తనము. స. పురాతనము
ప్రాఖర్యము. స. చేఱుకుఁదనము, ఉద్రేకము, పట్టుదల, దుర్మార్గము
ప్రాగల్భ్యము. స. ప్రగల్భము, ప్రౌఢిమ
ప్రాగారము. స. ఇల్లు, భవనము
ప్రాగ్భారము. స. అతిశయము, పర్వతము లోనగువాని శిఖరము
ప్రాగ్రము. స. చిట్టచివర, ఎట్టయెదుట
ప్రాగ్రసరుఁడు. స. ముందునడచువాఁడు, మొదటివాఁడు
ప్రాగ్రహరము } స. ముందు నడచునది, మొదటిది
ప్రాగ్రియము }
ప్రాగ్వంశము. స. యజ్ఞశాలాప్రాంతగృహము
ప్రాఘారము. స. జలాదిధార

ప్రాచి. స. తూర్పు, పచ్చోరుచెట్టు
ప్రాచితము. త. ప్రాయశ్చిత్తము
ప్రాచీన. స. చిఱుబొద్దిచెట్టు
ప్రాచీనబర్హి. స. ఇంద్రుఁడు
ప్రాచీనము } స. కంపకోట
ప్రాచీరము }
ప్రాచీనము. స. పూర్వదిశయందుఁ గలిగినది, పూర్వకాలమునందుఁ గలిగినది
ప్రాచీనావీతము. స. అపసవ్యముగా వేసికొన్న జందెము
ప్రాచుర్యము. స. ప్రచురత్వము, బాహుళ్యము
ప్రాచేతసుఁడు. స. వాల్మీకిమహాముని, వరుణుఁడు
ప్రాచ్యము. స. శరావతియనునది యెల్లగాఁగల ప్రాగ్దక్షిణముల మధ్యదేశము, తూర్పుదిక్కునందలిది
ప్రాజకుఁడు. స. రథమునడపువాఁడు, బండితోలువాఁడు
ప్రాజనము. స. మునికోల, తోత్రము
ప్రాజాపత్యము. స. అధికారము, ఇష్టివిశేషము, ఒకవిధమగువివాహము, బ్రహ్మసంబంధమగునది
ప్రాజిత. స. సారథి, తేరుపూన్పరి
ప్రాజొతు. దే. పాఁతకుళ్లాయి
ప్రాజ్ఞ. స. బుద్ధి, మంచిబుద్ధిగలయాఁడుది
ప్రాజ్ఞి. స. లౌకికవ్యవహారమునందు మిక్కిలి తెలివిగల యాఁడుది, పండితునిభార్య
ప్రాజ్ఞుఁడు. స. పండితుఁడు, సమర్థుఁడు
ప్రాజ్యము. స. అధికము
ప్రాడ్వివాకుఁడు. స. తగవరి, న్యాయాధికారి

ప్రాణగొడ్డము. త. ప్రాణహింసము, చిక్కు
ప్రాణనాథుఁడు. స. ప్రియుఁడు, యముఁడు
ప్రాణము. స. గాలి, హృదయమందలిగాలి, బలిమి, అచ్చు, ఆయుస్సు, ఊపిరి, జీవము, ఆత్మ, ప్రాణసమానవస్తువు
ప్రాణములు. స. ఉసుఱు
ప్రాణవాయువు. స. వాయువులోనిప్రాణరక్షక మగుభాగము
ప్రాణాంతము. స. చావు
ప్రాణాచారము. స. ప్రాయోపవేశము
ప్రాణాచారముపడు. దే. ప్రాయోపవేశము చేయు
ప్రాణాయామము. స. ముక్కుపుటముల యందు సంచరించెడివాయువును నిరోధించుట
ప్రాణి. స. మనుష్యాదిజంతువు, ప్రాణము గలది
ప్రాణిద్యూతము. స. కోడిపందెము మొదలగునది
ప్రాణేశుఁడు. స. భర్త
ప్రాతికూల్యము. స. ప్రతికూలత్వము
ప్రాతిపదికము. స. ధాతుభిన్నంబును, ప్రత్యయభిన్నంబును, ప్రత్యయాంతభిన్నంబును అగు అర్థవచ్ఛబ్దరూపము
ప్రాతిభావ్యము. స. ప్రతిభూత్వము
ప్రాతిభాసికము. స. నిజముగాలేక ఉన్నట్లు కనఁబడునది
ప్రాతివేశిని. స. దూతికావిశేషము
ప్రాతిహారకుఁడు. స. గారడివిద్యయందు నేర్పరియైనవాఁడు
ప్రాథమకల్పికుఁడు. స. క్రొత్తగా చేదువనారంభించిన శిష్యుఁడు

ప్రాథమికుఁడు. స. ప్రథముఁడు
ప్రాథమ్యము. స. ప్రథమత్వము
ప్రాదుర్భవించు. స. ఆవిర్భవించు, పుట్టు, అగుపడు
ప్రాదుర్భావము. స. పుట్టుక, అవతారము, ప్రత్యక్షము
ప్రాదుర్భూతము. స. పుట్టినది
ప్రాదేశనము. స. త్యాగము, దానము
ప్రాదేశము. స. చూపుడువ్రేలిని బొటన వ్రేలిని చాఁచిపట్టిన కొలఁత, జేత్రిలి
ప్రాధాన్యము. స. ప్రధానత్వము, ముఖ్యత
ప్రాథేయపడు. దే. వేఁడుకొను
ప్రాపకము. స. ఆధారము, సంపాదకము
ప్రాపకుఁడు. స. ప్రాపించువాఁడు,ఘటకుఁడు
ప్రాపణము. స. ప్రాపించుట
ప్రాపణికుఁడు. స. వర్తకుఁడు
ప్రాపణీయము. స. ప్రాపింపఁ దగినది,పొందఁ దగినది
ప్రాపించు. స. పొందు
ప్రాపు. త. ఆశ్రయము, రక్షణము
ప్రాప్తము. స. పొందఁబడినది,కూడుకొన్నది
ప్రాప్తరూపుఁడు. స. చేకూనివాఁడు, తెలిసినవాఁడు
ప్రాప్తవ్యవహారుఁడు. స. తనవ్యవహారకార్యములను తాను చేకూఁబెట్టుకొనఁదగిన వయస్సుగలవాఁడు
ప్రాప్తి. స. లాభము,పొందు, శుభోదయాష్ట, ఒకమైశ్వర్యము
ప్రాప్తించు. స. లభించు, కలుగు
ప్రాప్యము. స. పొందఁ దగినది
ప్రాబల్యము. స. ప్రబలత్వము
ప్రాభవము. స. ప్రభుత్వము
ప్రాభృతము. స. కానుక
ప్రామాణికుఁడు. స. సత్యము తప్పనివాఁడు, శాస్త్రము నెఱిఁగినవాఁడు
ప్రామాణ్యము. స. దృష్టాంతము, సాక్ష్యము
ప్రామాద్యము. స. పొరపాటు, మత్తు
ప్రామిడి. దే. క్రౌర్యము, క్రూరుఁడు, క్రూరము, క్రూరురాలు
ప్రామినుకులు } దే. వేదము
ప్రామిన్కులు }
ప్రాము. దే. జాచు, పూయు, మాయు, తుడుచు, పులుము, పీడించు, ఖండించు
ప్రాముడు. దే. పులుముడు, మార్జనము
ప్రాయము. స. వయస్సు, చావు, బాహుళ్యము, మరణార్థము సర్వకర్మపరిత్యాగ పూర్వకమైన ఉపవాసము
ప్రాయశ్చిత్తము. స. పాపపరిహారార్థము చేసెడు కర్మము
ప్రాయి. దే. పౌరుషము, భాగ్యము, సౌమంగల్యము
ప్రాయిఁడి. దే. పౌరుషహీనుఁడు, దీనుఁడు, భాగ్యహీనము, దీనము
ప్రాయికము. స. సామాన్యము
ప్రాయేఱు. దే. సముద్రము
ప్రాయోపవేశము. స. ఆహారాదులను వర్జించి మరణమునకై కూర్చుండియుండుట
ప్రారంభము. స. ప్రయత్నము, కడఁక
ప్రారంభించు. స. ప్రయత్నించు, కడఁగు
ప్రారబ్ధము. స. శరీరమునెత్తించెడు కర్మవిశేషము, ప్రారంభింపఁబడినది
ప్రారూఢి. స. నిశ్చయము, ప్రసిద్ధి
ప్రార్ణము. స. ముఖ్యమగుఋణము

ప్రార్థకుఁడు. స. అడుగువాఁడు, వేఁడువాఁడు

ప్రార్థన / ప్రార్థనము } స. అడుగుట, వేఁడుట

ప్రార్థనీయము. స. అడుగఁదగినది, వేఁడఁదగినది

ప్రార్థించు. స. అడుగు, వేఁడు

ప్రార్థితము. స. అడుగఁబడినది, వేఁడఁబడినది

ప్రాలంబము. స. మెడనుండి రొమ్మునకుఁ జేరుగా వేసికొన్న పూలదండ

ప్రాలంబిక. స. మెడనుండి బొమ్మునకుఁ జేరుగా వేసికొన్న బంగారుదండలో నగునది

ప్రాలు. దే. బియ్యము, అక్షతలు, తలఁబ్రాలు

ప్రాలుమాలిక. దే. సోమరితనము

ప్రాలుమాలు. దే. సోమరితనముపొందు

ప్రాలేయము. స. మంచు

ప్రాల్మాలిక. దే. ప్రాలుమాలిక

ప్రాల్మాలు. దే. ప్రాలుమాలు

ప్రావ. త. దోషము, అనుకూలము, యుక్తము

ప్రావ. దే. పద్ధతి

ప్రావరణము. స. ఉత్తరీయము. ముసుఁగు

ప్రావారము. స. ఉత్తరీయము, కంబళి

ప్రావాళికుఁడు. స. పగడము నమ్మువాఁడు

ప్రావీణ్యము. స. నేర్పు, గట్టితనము

ప్రావు. త. పరవు, వ్యాపించు

ప్రావృట్టు / ప్రావృష } స. వర్షర్తువు

ప్రావృతము. స. కప్పుకొనఁబడినదుప్పటి

ప్రావృత్తికుఁడు. స. వర్తమానముచెప్పువాఁడు

ప్రావృషాయణి. స. దూలగొండిచెట్టు

ప్రావృషిజము. స. కప్ప, తుపాను

ప్రావృషేణ్యము. స. కొండిసెచెట్టు, ప్రావృట్కాలమునఁ బుట్టినది

ప్రావేలుపు / ప్రావేల్పు } దే. అసురుఁడు

ప్రాశకుఁడు. స. తినువాఁడు

ప్రాశనము. స. భోజనము, తినిపించుట

ప్రాశనీయము. స. తినఁదగినది, ఆహారము

ప్రాశస్త్యము. స. ప్రశస్తత్వము

ప్రాశించు. స. భుజించు, పానముచేయు

ప్రాశితము. స. భుజింపఁబడినది, పానము చేయఁబడినది

ప్రాశ్నికుఁడు. స. సభ్యుఁడు, ప్రశ్నచేయు వాఁడు

ప్రాసంగము. స. కాఁడికి ముందటికాఁడి

ప్రాసంగ్యము. స. కాఁడిమోసెడు ఎద్దు

ప్రాసఁగు. దే. సస్యవిశేషము

ప్రాసము. స. పద్యపాదమున రెండవఅక్షరము, ఈఁటె

ప్రాసవము. స. ప్రసవ అనగా పుష్పసంబంధమైనది

ప్రాసాదము. స. దేవళము, నగరు

ప్రాసికుఁడు. స. ఈఁటెకాఁడు

ప్రాస్తావికము. స. కాలమునకుఁ దగినది, ప్రస్తావనకుఁ దగినది

ప్రాహ్ణము. స. ఉదయము మొదలు పదిగడియలవఱకుఁ గలకాలము, లేఁబగలు

## ప్రి

ప్రిదులు. త. విరియు, సడలు, వదలు, తగ్గు, ఊడు, జాఱు, తొలఁగు

ప్రియ. దే. పిర, కానిలో నాల్గవభాగము

ప్రియ. స. ప్రియురాలు

ప్రియంగువు. స. కొఱ్ఱలు, ప్రేంకణపుచెట్టు
ప్రియంపడు. దే. ఇష్టపడు, కోరు
ప్రియంవదుఁడు. స. ఇచ్చకమాడువాఁడు
ప్రియకము. స. కుంకుమము, చిత్రవర్ణము గలజింక, తుమ్మెద, ప్రేంకణపుచెట్టు, కడపచెట్టు
ప్రియత. స. స్నేహము
ప్రియదర్శిని. స. జెమ్మిచెట్టు
ప్రియపడు. దే. ఇష్టపడు
ప్రియము. స. స్నేహము, ఇష్టము, హెచ్చు [వెలగలవి
ప్రియవాది. స. ఇచ్చకమాడువాఁడు
ప్రియవాదిక. స. మంగళవాద్యము
ప్రియాల. స. ద్రాక్షచెట్టు
ప్రియాలము. స. మోరటిచెట్టు
ప్రియాళువు. స. మోరటిచెట్టు
ప్రియుఁడు. స. ప్రాణనాథుఁడు, ఇష్టుఁడు
ప్రియురాలు. స. ఇష్టమైనస్త్రీ, భార్య

## ప్రీ

ప్రీణనము. స. సంతోషపెట్టుట, తృప్తిఁ బొందించుట
ప్రీతి. స. సంతోషము, స్నేహము; ఒక గ్రహయోగము, మన్మథునిభార్య, సుఖము, ప్రేమ
ప్రీతిదత్తము. స. అత్తగారిచేఁ గాని మామగారిచేఁగాని ప్రేమచే నీయఁబడినస్త్రీ ధనము
ప్రీతుఁడు. స. ప్రీతిఁ బొందినవాఁడు

## ప్రు

ప్రుంగుడు. దే. తెల్లకుష్ఠము
ప్రుచ్చు. దే. పుప్పిపట్టు, పుచ్చు
ప్రుప్పి. దే. ప్రుచ్చుట, మణిదోషవిశేషము, [పుప్పి
ప్రువ్వు. త. పురువు
ప్రుష్టము. స. కాల్పఁబడినది

## ప్రె

ప్రెక్కణము. త. అభినయముతోడినృత్యము, మల్లరంగము, పెక్కణము
ప్రెగడ, ప్రెగ్గడ. దే. మంత్రి, ప్రధానపురుషుఁడు, యువరాజు
ప్రెబ్బొత్తి. దే. నిశ్చయముగా
ప్రెవడ. దే. ప్రెగడ

## ప్రే

ప్రేంకడము, ప్రేంకణము, ప్రేంకనము. త. ప్రియంగువృక్షము
ప్రేంఖ. స. డోల, పర్యటనము, నృత్యము, అశ్వగతి
ప్రేంఖనము. స. నృత్యవిశేషము, పర్యటనము, ప్రదేశము
ప్రేంఖితము. స. ఊఁచఁబడినది, కదలింపఁ [బడినది
ప్రేఁపుడు. దే. అధికుఁడు
ప్రేఁబ్రాలు. దే. ప్రేలగింజెలు
ప్రేక్ష. స. బుద్ధి, ఈక్షణము
ప్రేక్షణము. స. నేత్రము, ఈక్షణము
ప్రేక్షణికుఁడు. స. చూచువాఁడు, దర్శకుఁడు
ప్రేక్షణీయము. స. చూడఁదగినది, దర్శ [నీయము
ప్రేక్షితము. స. చూడఁబడినది, దర్శితము
ప్రేగు. దే. కడుపులోనిపేగు
ప్రేచే. త. పేరేచే

ప్రేతకర్మము. స. దినవారములు
ప్రేతపురము. స. యమపట్టణము
ప్రేతము. స. నరకమందుండు జంతువు, భూతవిశేషము, పీనుఁగు
ప్రేతవనము. స. వలికిమిట్ట, శ్మశానము
ప్రేపు. త. ఉషఃకాలము, వేకువ
ప్రేప్స. స. కోరిక
ప్రేమ, ప్రేమము } స. స్నేహము, హార్దము, దయ
ప్రేము. దే. బెత్తము, వేత్రము, పేము
ప్రేముడి. త. స్నేహము [బాధపడు
ప్రేముడించు. త. ప్రియపడు, శోకించు,
ప్రేయసి. స. ప్రియురాలు
ప్రేయసుఁడు. స. ప్రియుఁడు
ప్రేరకుఁడు. స. ప్రేరేపణ చేయువాఁడు
ప్రేరణము, ప్రేరణ } స. ప్రేరేపణ
ప్రేరణి. స. నృత్యవిశేషము, పేరణి
ప్రేరణీయము. స. ప్రేరేపణ చేయఁదగినది
ప్రేరించు. స. ప్రేరేపణచేయు, ప్రేరేచు
ప్రేరితము. స. ప్రేరేపఁబడినది
ప్రేరేచు. త. ప్రేరించు
ప్రేరేపణ. త. ప్రేరణము
ప్రేరేపించు, ప్రేరేపు } త. ప్రేరేపణచేయు, ప్రోత్సాహముచేయు
ప్రేలడము. దే. ప్రేలుట, వదరుట
ప్రేలరి. దే. వదరుఁబోతు, జల్పాకుఁడు
ప్రేలలు. దే. ప్రేలగింజెలు, పేలలు
ప్రేలిక. దే. పేలిక
ప్రేలు. దే. వదరు, వేఁగియుబుకు

ప్రేలుచు, ప్రేల్చు } దే. వేఁచు
ప్రేలుడు. దే. ప్రేలుట, వ్యర్థవాక్యసమూహము
ప్రేవు. దే. ప్రేగు
ప్రేషకుఁడు. స. పంపువాఁడు
ప్రేషణము. స. పంపుట
ప్రేషణీయుఁడు. స. పంపఁ దగినవాఁడు
ప్రేషితము. స. పంపఁబడినది
ప్రేషితుఁడు. స. పంపఁబడినవాఁడు
ప్రేష్ఠము. స. మిక్కిలిప్రియమైనది
ప్రేష్ఠుఁడు. స. మిక్కిలిప్రియమైనవాఁడు
ప్రేష్యము. స. సేవ [త్యుఁడు
ప్రేష్యుఁడు. స. పంపఁ దగినవాఁడు, భృ

## ప్రై

ప్రైషణికుఁడు. స. ఉత్తరువులను నెఱవేర్చుచుండువాఁడు
ప్రైషము. స. ప్రేషణము, మర్దనము, క్లేశము, ఉత్తరువు, పిచ్చి
ప్రైష్యుఁడు. స. సేవకుఁడు, బానిస

## ప్రొ

ప్రొద్దు. త. సూర్యుఁడు, కాలము, దినము, పూఁట, ఉషఃకాలము
ప్రొద్దుఁగల్లు. దే. సూర్యకాంతశిల
ప్రొద్దుఁగొడుకు, ప్రొద్దు } త. యముఁడు, శనైశ్చరుఁడు, కర్ణుఁడు, సుగ్రీవుఁడు [ము
ప్రొద్దుతిరుగుడు. దే. సూర్యానువర్తినీవృక్ష
ప్రొద్దురిక్క. త. ఉత్తరఫల్గునీనక్షత్రము
ప్రొద్దురిక్కనెల. దే. ఫాల్గునమాసము

ప్రొద్దులనెల. దే. ప్రసూతిమాసము, వైజననము

ప్రొద్దులు. త. ప్రసవదినములు

ప్రొయి, ప్రొయ్యి } దే. వంటకు అగ్నిని ప్రజ్వలింపఁజేసెడు యంత్రవిశేషము, అధిశ్రయణి

## ప్రో

ప్రోఁగు. దే. పోఁగు

ప్రోఁజే. దే. పోఁజే

ప్రోక. త. ప్రోఁగు, రాశి

ప్రోక్తము. స. చెప్పఁబడినది

ప్రోక్షణము. స. నీళ్లు చిలుకరించుట, యజ్ఞమునందు పశువధ

ప్రోక్షించు. స. నీళ్లు చిలుకరించు, యజ్ఞమునందు పశువును వధించు

ప్రోక్షితము. స. చిలుకరింపఁబడినది, యజ్ఞమునందు వధింపఁ బడినది

ప్రోగు. త. రాశి

ప్రోచికోలు. దే. బలహీనత్వమును పొందిన ఆవులోనగుదానిని కాపాడి యనుభవించుకొను, వ్యర్థము, పోచికోలు

ప్రోచిల్లు. త. పోచిల్లు

ప్రోచు. త. అన్నపానాదులిడి పోషించు, రక్షించు

ప్రోజ్ఝితము. స. త్యజింపఁ బడినది

ప్రోడ. త. నిపుణుఁడు, వివేకి, ప్రౌఢస్త్రీ

ప్రోడఁడు. త. ప్రోడ

ప్రోతము. స. వస్త్రము, కట్టఁబడినది

ప్రోత్థితము. స. బయలువెడలినది

ప్రోత్సారితము. స. నివృత్తిచేయఁబడినది

ప్రోత్సాహకుఁడు. స. ప్రేరేపకుఁడు

ప్రోత్సాహము. స. ఉద్రేకము

ప్రోథము. స. గుఱ్ఱపుముక్కు, గర్భపిండము, జీర్ణవస్త్రము, తెరువరి, ప్రసిద్ధికెక్కినది

ప్రోద్బలము. స. పురికొల్పుట

ప్రోది. త. పోషణము, వైభవము

ప్రోదిగొను. దే. పోషించు

ప్రోదిసేయు. త. పోషించు

ప్రోద్దామము. స. నిరంకుశమైనది

ప్రోద్ధతము. స. రేఁగినది, ఆగ్రహముగలది

ప్రోద్ధుతము. స. కదలింపఁబడినది

ప్రోద్భిన్నము. స. వికసించినది, కలిగినది

ప్రోపడు. త. పోషింపఁబడు

ప్రోపరి. దే. పోషకుఁడు, రక్షకుఁడు

ప్రోపు. త. పోషణము, సంరక్షణము

ప్రోయాలు. దే. ఇల్లాలు

ప్రోలు. త. పట్టణము

ప్రోలుగుడుపు, ప్రోల్గుడుపు } దే. ప్రేరేచు, పుల్లలుపెట్టు

ప్రోలుదిరుగు. దే. ఊరేఁగు

ప్రోవ. దే. మాయ

ప్రోవడి. దే. ప్రతిష్ఠ

ప్రోవు. త. ప్రోగు

ప్రోవుకొను. దే. రాశిపడు

ప్రోషము. స. కాల్చుట, కాలుట

ప్రోషితభర్తృక. స. ప్రియుఁడు దేశాంతరగతుఁడై యుండ ఖేదము నొంది యుండు నాయిక

ప్రోషితుఁడు. స. దేశాంతరగతుఁడు

ప్రోష్ఠపద, ప్రోష్ఠపదము } స. భాద్రపదమాసము

ప్రోష్ఠి. స. ఎగిరి ఎగిరి పడెడు మత్స్య విశేషము
ప్రోహము.స. ఏనుఁగుకాలు, నేర్పు, నేర్పరి
ప్రోహుఁడు. స. తార్కికుఁడు

## ప్రౌ

ప్రౌఢ. స. నాయికావిశేషము, పదునెని మిదియేండ్లకు పైఁబడిన వయస్సుగలిగి సంపూర్ణ యౌవనముగల స్త్రీ, గడిదేఱిన స్త్రీ, గంభీరమైనది
ప్రౌఢి. స. నేర్పు
ప్రౌఢిమ
ప్రౌఢిమము } స. నేర్పు
ప్రౌఢుఁడు. స. ప్రగల్భుఁడు, నిపుణుఁడు
ప్రౌష్ఠపద. స. పూర్వాభాద్ర నక్షత్రము
ప్రౌష్ఠపదము. స. భాద్రపదమాసము

## ప్ల

ప్లక్షము. స. జువ్విచెట్టు, రావిచెట్టు, ఒక ద్వీపము
ప్లవ. స. ఒకసంవత్సరము
ప్లవంగ. స. ఒకసంవత్సరము
ప్లవంగము
ప్లవంగమము } స. కోఁతి, కప్ప
ప్లవగము
ప్లవకము. స. కప్ప, కోఁతి
ప్లవకుఁడు. స. దుముకువాఁడు, దొమ్మర వాఁడు, మాలవాఁడు
ప్లవనము. స. ఈఁదుట. స్నానముచేయుట, ఎగురుట, దుముకుట, పరద, వంగినది
ప్లవము. స. ఈఁదుట, ప్రవాహము, తెప్ప, కప్ప, కోఁతి, నీరుకాకి, పాటపుఁబల్లు నేల, దాఁటు, జువ్విచెట్టు
ప్లవాక. స. తెప్ప
ప్లవుఁడు. స. మాలవాఁడు

## ప్లా

ప్లాక్షము. స. ప్లక్షఫలము, జువ్విపండు
ప్లావనము. స. తడుపుట, ప్రవాహము

## ప్లీ

ప్లీహము. స. హృదయమున ఎడమప్రక్క నుండెడుమాంసగోళము, రోగభేదము
ప్లీహశత్రువు. స. ములుమోదుగుచెట్టు

## ప్లు

ప్లుతము. స. వేగమున అంతమేరయు సమముగాఁబోయెడు అశ్వగతివిశేషము, నిబ్బరము, మూఁడుమాత్రలకాలముగల స్వరము, దాఁటు, తడిసినది
ప్లుతి. స. ప్రవాహము, గంతు
ప్లుష్టము. స. కాల్పఁబడినది, కాలినది

## ప్లో

ప్లోషము. స. కాల్చుట, కాలుట

## ఫ

ఫ. ఒకయక్షరము
ఫక్కి. స. రీతి, ప్రకారము
ఫక్కిక. స. ఒకగ్రంథము
ఫటాటోపము. స. పాము పడగను విప్పుట
ఫణ. స. పాముయొక్కపడగ
ఫణాధరము. స. పడగగలపాము

ఫణి. స. పాము

ఫణిజ్ఝకము } స. మరువము
ఫణిర్జకము }

ఫణితము. స. వాక్కు, చెప్పఁబడినది

ఫణితల్పగుఁడు. స. విష్ణువు

ఫణితి. స. వాక్కు, వాక్కుయొక్కరీతి, సరణి

ఫలకము. స పలక, కేడెము

ఫలపడు. దే. పనికివచ్చు

ఫలపూరము. స. మాదిఫలము

ఫలము. స. పండు, పంట, ప్రయోజనము, లాభము, జాజికాయ, బాణాగ్రము, డాలు, ఫలితము, బహుమానము, ఉపయోగము, సంతానము

ఫలరాజము. స. దొండపండు

ఫలవంతము. స. ఫలముగలది, పండ్లుగలది

ఫలసాధనము. స. యత్నకార్యానుకూలము

ఫలాధ్యక్షము. స. పాలచెట్టు

ఫలాహారము. స. ఫలహారము

ఫలి. స. పండ్లుగలవృక్షము, ప్రేంకణపుచెట్టు

ఫలించు. స. పండు, నెఱవేఱు

ఫలిత. స. ముట్టుఅయినస్త్రీ

ఫలితము. స. వృక్షము, ఫలించినది

ఫలితార్థము. స. తాత్పర్యము

ఫలినము. స. పండ్లుగలది, చెట్టు

ఫలిని. స. పండుగలచెట్టు, ప్రేంకణపుచెట్టు

ఫలేగ్రహి. స. ఫలించేగట్టివృక్షము

ఫలేరుహా. స. కలిగొట్టుచెట్టు

ఫలోన్ముఖము. స. ఫలముగలుగఁజేయునది, పనికివచ్చునది

ఫల్గునుఁడు. స. అర్జునుఁడు

ఫల్గువు. స. కుక్కమేడిచెట్టు, సారములేనిది

ఫల్యము. స. పువ్వు

## ఫా

ఫాంటము } స. ప్రయాసములేక చేసిన కషాయము మొదలైన యౌషధము
ఫాంటకము }

ఫాణితము. స. కండచక్కెర

ఫాలనేత్రుఁడు. స. శివుఁడు

ఫాలము. స. నుదురు, నొత్తి, నాఁగటికఱ్ఱు, నూలిచే నేయఁబడినవస్త్రము

ఫాలాక్షుఁడు. స. శివుఁడు

ఫాల్గునము. స. ఒకమాసము, ఏఱుమద్దిచెట్టు

ఫాల్గునికము. స. ఫాల్గునమాసము

ఫాల్గునుఁడు. స. అర్జునుఁడు

## ఫు

ఫుల్లము. స. వికసించినది

ఫుల్లరీకము. స. పాము

## ఫే

ఫేనము. స. సముద్రపునురుఁగు

ఫేనిక. స. భక్ష్యవిశేషము, పేణీ

ఫేనిలము. స. రేఁగుఁబండు. కుంకుడుచెట్టు, నురుఁగుగలది

ఫేరవము } స. నక్క
ఫేరువు }

ఫేల. స. ఎంగిలి, ఉచ్ఛిష్టము

## ఫ్సా

ఫ్సాతము. స. భక్షింపఁదగినది

ఫ్సానము. స. తినుట, ఆహారము

# బ

**బ.** ఒకయక్షరము

**బంక.** దే. చెట్లయందుఁగలిగెడు జిగటగల వస్తువు, నిర్యాసము, వ్యాధివిశేషము, లుబ్ధత్వము

**బంకమన్ను.** దే. జిగటగలఒకదినుసుమట్టి, రేగడిమన్ను

**బంకముచ్చు.** దే. పిసినారి, లోభి

**బంటు.** దే. సందువీధి, శూరునివలె నటించువాఁడు, కావలివాఁడు

**బంకెత.** దే. లుబ్ధురాలు

**బంగనబయలు.** త. బట్టబయలు

**బంగరము.** త. బంగారము

**బంగరు.** త. బంగారు

**బంగరుకొండ.** త. హేమాద్రి, మంచివాఁడు

**బంగరుపిచ్చుక.** దే. పక్షివిశేషము

**బంగరువు.** త. బంగరు

**బంగల.** దే. కుంపటి

**బంగారము.** త. స్వర్ణము, దుర్లభము

**బంగారు.** త. బంగారము

**బంగారుకుండ.** త. స్వర్ణఘటము, మనోజ్ఞత

**బంగారుకొండ.** త. హేమాద్రి, మంచివాఁడు

**బంగారుతీఁగలు.** త. శాలిధాన్యవిశేషము

**బంగారునీరు.** దే. బంగారుమలామాకు పనికివచ్చు కరిగినబంగారు

**బంగారుపూఁత.** దే. బంగారుమలామా

**బంగాళము.** త. వంగదేశము

**బంగాళము.** స. ఇక్షువిశేషము

**బంగాళి.** స. కొమ్మరఁటిచెట్టు, వంగదేశస్థుఁడు, వంగదేశపుభాష

**బంగి.** త. గంజాయి, మదమత్తము

**బంగిముచ్చు.** దే. బంగితాగువాఁడు

**బంటి.** దే. నీళ్ళకొలఁదిని దెలిపెడు ప్రత్యయము

**బంటు.** త. సేవకుఁడు, భక్తుఁడు, శిష్యుఁడు, శూరుఁడు, భటుఁడు

**బంటుమెకము.** త. అడవిపంది

**బంట్రౌతు.** దే. గుఱ్ఱపురౌతు, బంటు

**బండ.** దే. వెడల్పుతాయి, పొట్టిరోఁకలి, అఱిగినది

**బండ.** త. ఘోరకృత్యములచే బిచ్చమెత్తెడు . ఒకనీచజాతి, ఆకతాయి

**బండఁడు** / **బండగుఁడు** } త. ఆకతాయి, కనికరములేని మోటువాఁడు, బండ

**బండగు.** త. బోను

**బండము.** త. వస్తువు

**బండరు** / **బండరుఁడు** } త. కోశగృహాధ్యక్షుఁడు

**బండరువు.** త. బండారము

**బండవలము.** త. సంచిమొదలు, సామర్థ్యము, లోగుట్టు, ఆధారము, ధనము

**బండాటము** / **బండాట** } దే. ఆకతాయితనము

**బండారము.** త. బొక్కసము

**బండారి.** దే. బొక్కసమున కధికారి

**బండారు.** దే. తాలిమీఁదతాచి పూసికొనెడుపసుపు

**బండారు.** త. బండారము

**బండారుఁడు.** స. బట్టలను కాచేవాఁడు

**బండారుపిచ్చుక.** దే. పీతముండము

**బండాలము.** త. బండవలము

**బండి.** దే. శకటము, రథము

**బండికల్లు.** దే. రథచక్రము

బండిగిల్లు. దే. కడగండ్లుపడు

బండిగురిగింజె. దే. బండిగురివెందగింజె

బండిగురివెంద. దే. కాంభోజీలత

బండియుగ్గరము. దే. శకటవ్యూహము

బండిరిక్క. దే. రోహిణీనక్షత్రము

బండిరేఫ. దే. శకటరేఫము

బండిరేవు. దే. పెద్దరేవు

బండు. త. ఆకతాయితనము,ఆకతాయిమాట

బంతి. దే. చెండు, ఒకవిధమగుపువ్వు

బంతి. త. పంక్తి, పది

బంతికట్టు. దే. కుప్పనుఱుచునప్పుడు ఎడ్లవరుసకుఁ గట్టెడు పలుఁపు

బంతికుడుపు. దే. అనేకులుచేరిభుజించుట

బంతిచెట్టు. దే. ఒకదినుసుపూలచెట్టు

బంద. దే. ఒకచిన్నచెఱువు

బందడము. దే. దొంతికుండ

బందన. త. జిగట, బంక

బందనగోను. దే. జిగటగలదియగు

బందము. త. దూలముపైగుజ్జులకు బిగువు నిమిత్తము లంకెగా నమర్చినపట్టె, చెట్టెక్కువాఁడు కాలికి తగిలించుకొనెడుత్రాడు, పశులకు రెండుకాళ్లు చేర్చికట్టెడు త్రాడు

బందరు. దే. ఓడరేవు, ఒకపట్టణము

బందలము. దే. బందడము, నోరువెడల్పుకుండ

బందా. త. చెఱఁబడ్డవాఁడు

బందాము. త. బందము

బందారు. దే. ఒకానొకచెట్టు

బంది. త. నిర్బంధము

బంది. స. చెఱ, చెఱఁబడ్డది

బందికాఁడు. దే. బందిపోటుదొంగ

బందిగము. త. చెఱసాల, కారాగృహము

బందిపోటు. దే. నిర్బంధపఱిచికొట్టిదోఁచుట

బందీకృతము. స. చెఱపెట్టఁబడినది

బందు. దే. బోరువపక్షి, రాబందుపక్షి

బందు. త. ఆవరణము, గోపనము, నిరోధము, పెట్టెమొదలగువానిమూలల బిగించెడియినుము మొదలగువాని తగడు

బందుకట్టు. దే. జాతికట్టుబాటు

బందుగు, బందుగుఁడు, బందువు, బందువుఁడు } త. చుట్టము

బందె. త. పశువులచెఱ, పశువులదండుగ, నిర్బంధము

బందెకత్తె. త. చెఱలో వేయునది

బందెకాఁడు. దే. చెఱలో వేయువాఁడు

బందెగోను. దే. చెఱఁ బెట్టు

బందెడ. దే. తెల్లవావిలిచెట్టు

బందెలపోతు. దే. చెఱవేయుస్వభావము గలవాఁడు

బందెలమారి. దే. తంటాలుతెచ్చుకొనువాఁడు

బందెవేయు. దే. పశువులను బందెలదొడ్డిలోనుంచు

బంధకము. స. చెఱసాల, మాఱుపు, కుదువ

బంధకి. స. అంకుటాలు, ఆటకత్తె

బంధనము. స. కట్టు, కట్టుటకుఁ దగినసాధనము, కుదువ, చెఱ, చెఱసాల, తొడిమ

బంధనాలయము. స. చెఱసాల

బంధనికుఁడు. స. కారాగృహాధికారి

బంధము. స. కట్టు, చెఱ, కుదువ, కావ్యరచనావిశేషము, ముడి, చెఱసాలలో

నుంచేట,పట్టుకొనుట,ఏర్పాటుచేయుట, చేరిక, సంబంధము, ఒడంబడిక, కనబఱచేట, ఫలితము, సంభోగమునందలి వైఖరి, అంచు, నరము, శరీరము, తాకట్టు, నీటియడ్డగట్టు

**బంధస్తంభము.** స. కట్టుఁగంబము

**బంధించు.** స. బంధనముచేయు, కట్టు

**బంధుజీవకము** / **బంధుజీవము** } స. మంకెనచెట్టు

**బంధుత.** స. బంధుసమూహము

**బంధుర.** స. వేశ్య

**బంధురము** / **బంధూరము** } స. మకుటము, పక్షి, నూనెమడ్డి, ఆఁడుగుఱి, మంకెనచెట్టు, ఒప్పిదమైనది, వంగినది, హంస

**బంధులుఁడు.** స. అంకుటాలికొడుకు

**బంధువు.** స. చుట్టము, జ్ఞాతి, మిత్రుఁడు, మంకెనచెట్టు

**బంధూకము.** స. మంకెనచెట్టు

**బంధ్యము.** స. బంధింపఁదగినది

**బంపు.** దే. పండ్లపాఁచి, పాఁకుడు

**బంబ.** దే. స్థూలము

**బంబోతు.** దే. మిక్కిలి బలిసినవాఁడు

**బంభరము.** స. తుమ్మెద

**బంహిష్ఠము.** స. మిక్కిలితఱచైనది

**బకదారి.** దే. పారావతవిశేషము

**బకము.** స. కొంగ

**బకవైరి.** స. కృష్ణుఁడు, భీమసేనుఁడు

**బకాను.** దే. చిఱువేరుమొక్క

**బకుఁడు.** స. ఒకరాక్షసుఁడు, కుబేరుఁడు

**బకోటము.** స. కొంగ

**బక్క.** దే. బక్కటిల్లినవాఁడు, బక్కటిల్లినది

**బక్కటిల్లు.** దే. శుష్కించు

**బక్కనీళ్లు** / **బక్కమజ్జిగ** } దే. నీళ్లు అధికముగాఁ జేర్చిన మజ్జిగ

**బక్కలు.** దే. గనిత్రవ్వువారు

**బగబగ.** దే. మండుటయందగు ధ్వన్యనుకరణము

**బగళంబుసేయు.** దే. తొలఁగించు

**బగళము.** దే. తొలఁగుడు, అపసరణము

**బగి.** త. పార్శ్వము

**బగిస.** దే. వృక్షవిశేషము

**బగిసి.** త. బఱిసి

**బగిలు.** దే. సంతాపమునందగుధ్వన్యనుకరణము

**బగ్గముపాడు.** దే. మిక్కిలిపాడు

**బగ్గరి.** దే. బగ్గనిమాఁడిపడువాఁడు

**బగ్గి.** దే. బూడిద

**బగ్గు.** దే. మండుటయందగుధ్వన్యనుకరణము

**బగ్గుండి.** దే. రక్తవర్ణచూర్ణము, ఎఱ్ఱబుక్క

**బగ్గుమను.** దే. భగ్గునమండు

**బగ్గె.** దే. పొద

**బచ్చెన.** త. పూఁత, వర్ణము

**బచ్చలి.** దే. కలంబీలత

**బచ్చు.** త. వైశ్యుఁడు, బొక్కసమునకధికారి,వెండిబంగారముల నాణెముచూచువాఁడు

**బజీతు.** త. భంగమునొందినది

**బజ్జి.** దే. ఎనిచి పలుచేనగాఁజేసెడు వ్యంజనవిశేషము, పచ్చడి

**బజేగడగు** / **బజేగడుగు** } దే. నిలుకడలేని

**బజోఱము.** త. వ్యభిచారము

బజాఱి. త. వ్యభిచారిణి
బజాఱించు. త. వ్యభిచరించు
బజాఱు. త. అంగడివీథి
బజాఱుమాట, త. వీధులయందుఁజెప్పుకొను మాట, కోవాళము
బజ్జడి. దే. పాదవిన్యాసవిశేషము
బటమరులు. దే. ముక్కుచర్మము
బటాకబయలు. త. బటాబయలు
బటాబయలు. త. బట్టబయలు
బటాబూరము. త. పెద్దఱికము
బటారము. త. గొప్ప
బటువు.దే. గుండ్రన, గుండ్రనియుంగరము, బటువుబిళ్ల, గుండ్రనిది
బటువు. త. దృఢము
బటువుఁగైదువు. దే. చక్రాయుధము
బటువుబిల్ల. దే. బిల్లతలగడ
బట్ట. దే. పశువులదేహముమీఁది తెలుపు లోనగువానిచాఱ, వెండ్రుకలూడినది
బట్ట. త. వస్త్రము
బట్టకడిమి. దే. ధూళికదంబవృక్షము
బట్టగుత్తు. త. సిగ్గుమాలినవాఁడు, నిర్లజ్జుఁడు, ఇంద్రలుప్తకుఁడు
బట్టకలవాఁడు. దే. బట్టతలగలవాఁడు.
బట్టబయలు. త. మిక్కిలి బయలు
బట్టమేఁక. దే. పక్షివిశేషము
బట్టి. దే. వాగ్ధోరణి, ఆవము
బట్టికాఁడు. దే. చిలుక, గోరువంక
బట్టినగోల. దే. ఎడ్లమీఁదగోనెలెత్తివేసెడు కఱ్ఱ, ఎత్తనగోల
బట్టు. త. బట్టువాఁడు, వంది.

బట్టె. దే. కాలువ
బట్లె. దే. ఒకదినుసుమూఁకుడు
బడ. దే. పెద్ద, మిక్కిలి
బడగొండ. దే. కొండవలె పెద్దఆకారము గలిగి నీళ్లుగలిగినమేఘము
బడప. దే. ఆపద
బడబ. స. ఆఁడుగుఱ్ఱము, బ్రాహ్మణస్త్రీ, తార్చునట్టిమూఁడుది
బడబడ. దే. పాఱుటయందగు ధ్వన్యనుకరణము
బడబానలము. స. బడబాగ్ని
బడలించు. దే. బడలునట్లుచేయు
బడలిక. దే. అలయిక, శ్రమము
బడలు. దే. శ్రమపడు, శ్రమము
బడలుపడు, బడల్పడు. దే. బడలు, శ్రమపడు
బడవా. త. తార్చునది, తార్చువాఁడు, దుర్మార్గుఁడు
బడి. దే. ఒకానొకప్రత్యయము, పాఠశాల, దిట్టము, క్రమము, వెంబడి, స్వల్పము.
బడికోడి. దే. కోడిబడి, ఒకవిధమగుభక్ష్యము
బడికోలు. దే. పోలిక
బడిచేయు. దే. దిట్టముచేయు
బడిత. దే. ఇనుపకట్లగుదియ, దుడ్డుకఱ్ఱ
బడితపాఠము. గ్రా. చేదివినపాఠము.
బడిద్రిప్పు. దే. బడియు, దృష్టిఁ దీయు
బడిపనులు. దే. కొలువుడుపనులు
బడిపెద్ద. దే. ఉపాధ్యాయులకు సహాయత్వమును చేయఁగలముఖ్యవిద్యార్థి
బడిమి. దే. బడియుంట, చక్రాకారభ్రమణము, భూతబలి.

బడియ. దే. చిన్నదుడ్డుకఱ్ఱ [దీయు
బడియము. దే. దృష్టిదోషపరిహారార్థము దిగఁ
బడిలి. దే. రంధ్రము [పన్ను
బడివారడి. దే. ప్రతిమనుష్యునకు వేసెడు
బడిశము. స. చేపలను బట్టెడుగాలము
బడిసి. దే. రక్ష
బడిసివాటు. దే. దిగఁదీసివేయుట

బడుగు } దే. శవము, కృశము, అశక్తుఁడు
బడువు

బడువ. దే. బాడువ, పల్లపునేల
బడె. దే. బడియ
బడ్డు. దే. మగగుఱి
బణ్ణము. త. క్రొత్త యిత్తడిపాత్రముల సమూహము
బతము. త. వ్రతము
బతిసి. దే. ఒకదినుసుపట్టువస్త్రము
బతిమాలిక. దే. బతిమాలుట
బతిమాలు. దే. దైన్యముతో వేఁడుకొను
బతిమాలుచు. దే. బతిమాలఁజేయు

బత్తడిక
బత్తళి } దే. అమ్ములపొది
బత్తళిక

బత్తి. త. భక్తి
బత్తుఁడు. దే. కమసాలెవారిబట్టపుఁబేరు
బత్తుఁడు. త. భక్తుఁడు [వ్యము
బత్తెము. త. భోజనమునకై యిచ్చెడుద్ర
బదనిక. త. చెట్టుమీఁదమొలచునట్టి ఓషధి విశేషము. వృక్షరుహ
బదర. దే. పగులు
బదర. స. ప్రత్తిచెట్టు, పాఁచితీఁగ.
బదరము. స. రేఁగుపండు, ప్రత్తికాయ, ప్రత్తిచెట్టు, ప్రత్తిజేడ

బదరి. స. రేఁగుచెట్టు, గంగరేఁగుచెట్టు,
బదరికము. దే. పెట్టె [ప్రత్తిచెట్టు
బదులు. దే. మాఱు, అప్పు
బద్ద. త. కాయయొక్కఖండము, వెదురు లోనగువానిఖండము, చీలిక, కాయ ధాన్యములపప్పు, పలుచేనది, బ్రద్ద
బద్దకము. త. పాలుమాలిక
బద్దకించు. త. పాలుమాలు
బద్దకుఁడు. త. సోమరి
బద్దపరి. దే. పేములతో నల్లినకేడెము
బద్దించు. దే. కొలిచినది తిరుగకొలుచు
బద్దింపు. దే. అంచెనా

బద్దు } దే. అసత్యవచనము
బద్దుర

బద్దె. త. వస్త్రముమొదలు, అపరకర్మము చేయునపుడు జందెమువలె వేసికొనెడు వస్త్రఖండము
బద్ర. త. సొగటాలయాటలోపండ్రెండు
బద్రము. త. పదిలము
బధిరము. స. చెవుడు
బధిరితము. స. బధిరముగాఁ జేయఁబడినది
బధిరుఁడు. స. చెవిటివాఁడు [చూచువాఁడు
బద్ధనేత్రుఁడు. స. దేనినైన దృష్టిసారించి
బద్ధము. స. కట్టఁబడినది
బద్ధవైరము. స. మనస్సులో నాటియున్న విశేషమగుపగ
బద్ధుఁడు. స. కట్టఁబడినవాఁడు
బధ్యము. స. నీళ్లురాకుండకట్టినకట్ట
బధ్యుఁడు. స. చావఁదగినవాఁడు
బన్నపడు. త. భంగమునొందు
బన్నము. త. అవమానము, ఆపద

బన్నసరము }
బన్నసరి } త. హారవిశేషము

బభ్రువు. స. కపిలగోవు, విష్ణువు, శివుఁడు, అగ్ని, పచ్చనిది, బట్టతలవాఁడు, పింగళవర్ణము, ముంగిస

బమ, త. భ్రమ, భ్రాంతి

బమ్మ. త. బ్రహ్మ

బమ్మరించు }
బమ్మరిల్లు } త. భ్రమించు, తిరుగు

బమ్మసారి. త. బ్రహ్మచారి

బమ్మెర. త. భ్రాంతి

బమ్మెరపోక. దే. భ్రమపడుట

బమ్మెరపోవు. దే. భ్రమపడు

బయకాఁడు. దే. గాయకుఁడు.

బయకారము. దే. యౌవనమందు బయలుపడు శృంగారచేష్ట

బయకారి. దే. విలాసవతి

బయలు. త. బహిః ప్రదేశము, చెట్టుచేమ లేనిచోటు, ఆకాశము, శూన్యము, బహిరంగము, బయలు

బయలుదామర. త. మెట్టదామర

బయలుదేఱు. దే. బయలువెడలు

బయలుపడు }
బయల్పడు } త. ప్రకాశితమగు

బయలుమెఱయు. దే. బయలుపడు

బయలువెడలు. దే. బయలుదేఱు

బయలువోవు. దే. బయలుబడు

బయ్యంకలు. దే. వేవిళ్లు

బయ్యఁడు. దే. మందుఁడు

బరక. దే. కఱకైనది, క్షారము

బరకము. దే. దూదిబరువు

బరగడ. దే. ధాన్యపురాసిలోనగు వాని మీఁదవేసెడు మట్టిముద్ర

బరగడము. దే. వృక్షవిశేషము

బరడు. త. గఱుకైనపట్టలోనగునది

బరణి. త. కాటుక మొదలగునవి యుంచుకొనెడు పాత్రము, కరాటము

బరణిచుక్క. త. భరణీనక్షత్రము

బరతపిట్ట. దే. భరతపక్షి

బరపటాలు. దే. తృణధాన్యవిశేషము

బరమా. దే. కొయ్యలకు రంధ్రములువేయు సాధనము

బరవసము. దే. ధైర్యము, పూనిక

బరాబరి }
బరాబరిక } దే. హెచ్చరిక

బరి. దే. పార్శ్వము, దేహాదిపార్శ్వము, గిఱి, బరిగోల, దొంగ, శత్రువు, బడి

బరికట్టె. దే. అలుఁగులేనిఈఁటె, దోఁటికఱ్ఱ

బరికాఁడు. దే. మావటివాఁడు

బరికాయ. దే. కొంటెవాఁడు

బరికె. దే. గఱుకులుగల యెండినతాటిమట్ట చింపిఱి, చేవ్వ

బరిగమ్మి. దే. బరికట్టె

బరిగి. దే. ఏమియులేనిది, శూన్యము

బరిగిరౌతు. దే. పల్లముకట్టని గుఱ్ఱముపై నెక్కువాఁడు

బరిగోల. దే. ఏనుఁగు ప్రక్కలు పొడిచి బెదరించుటకై అలుఁగుగల వేణుదండము, బాణము

బరిచి }
బరిచీ } దే. ఈఁటె

బల్లెకోల. దే. పొనచెడియాయుధవిశేషము, బల్లెము

బల్లెము } త. అలుఁగుగలకఱ్ఱ, ఈఁటె
బల్లియము }

బవ. స. ఒకకరణము

బవంతము. దే. మోసము, కపటము

బవంతి. దే. నాలుగుప్రక్కల కలిపికట్టిన కట్టడముగల తొట్టికట్టు, చిత్రవర్ణము

బవనిక. త. బదనిక

బవరము. త. యుద్ధము

బవని. దే. జాతరయందలి బవనీలనృత్యము

బవనీఁడు. దే. జాతరయందు సుద్దులు చెప్పుచే బవనియాడువాఁడు, క్షుద్ర సంఘప్రశంసి

బవిర. దే. కర్ణాభరణవిశేషము

బవిరి. దే. గుండ్రము

బవిసి. త. భాగ్యము,గౌరవము, బైసి, సిగ్గు

బవ్రి. దే. బవిరి

బష్కయణి. స. తఱపియావు

బష్కయము. స. తఱపిదూడ

బస. త. వాసస్థానము, ఉనికిపట్టు, కొద్ది దినములుండుటకై కుదుర్చుకొన్న ఇల్లు

బసవఁడు }
బసవన } త. వృషభము
బసవన్న }

బసివి. త. స్వైరిణి

బసుమము. త. భస్మము

బస్తకము. స. రుమయనెడు గనిలో పుట్టిన యుప్పు

బస్తము. స. మేఁకపోతు

బహిత్రము. స. యానపాత్రవిశేషము

బహిరంగము. స. వెలుపటి అవయవము, బయలుపడినది

బహిర్ద్వారము. స. తలవాకిలి

బహిర్లాపి. స. ఉత్తరము వేఱుమాటలయందు అణఁగియుండునట్లు అడుగునట్టి విషమ సమస్య

బహిర్వాసము. స. ఉత్తరీయము

బహిర్బీజము. స. జీడిచెట్టు

బహివడు. దే. వెలివేయఁబడు

బహివెట్టు. దే. వెలివేయు

బహిష్కరించు. స. వెలివేయు

బహిష్కారము } స. వెలివేయుట
బహిష్కరణము }

బహిష్కృతుఁడు. స. బహిష్కరింపఁబడిన వాఁడు

బహుకరుఁడు. స. కళ్ళము నూడ్చువాఁడు

బహుధా. స. అనేకవిధములచేత

బహుధాన్య. స. ఒకసంవత్సరము

బహుపాదము. స. మఱ్ఱిచెట్టు

బహుప్రదుఁడు. స. మిక్కిలిదాత, దాన శౌండుఁడు

బహుమతి } స. సమ్మానము, పారి
బహుమానము } తోషికము

బహుమూత్రము. స. నీరుడివ్యాధి

బహురూపము. స. ఊసరవెల్లి

బహురూపుఁడు. స. విష్ణువు, శివుఁడు, మన్మథుఁడు, పెక్కురూపములు గలవాఁడు

బహువచనము. స. ఒకటికంటెనధికముగాఁ దెలుపునది

బహువారకము. స. విరిగిచెట్టు

బహువిధము. స. పెక్కుతెఱఁగులు గలది

బహువు. స. అధికము, పెక్కు

బహుశా. స. సాధారణముగా ఒకవేళ
బహుసుత. స. పిల్లపీచేరమొక్క, పెక్కం
డ్రు సంతానము గలఆఁడుది
బహుస్వనము. స. గుడ్లగూబ
బహుళ. స. ఆవు, ఏలకిచెట్టు, నీలిచెట్టు
బహుళము. స. ఆకాశము, కృష్ణపక్షము,
అధికము, తఱచు
బహుళీకృతము. స. తూర్పెత్తినది
బహూకరించు. స. గౌరవించు
బహూకృతి } స. గౌరవించుట
బహూకరణము
బహ్వన్నము. స. విశేషాహారముతో నిండి
యున్నది
బళకరము. దే. బలకరము
బళా. దే. మెచ్చును తెలుపునది
బళాయి. త. బలవంతుఁడు
బళారె } దే. బళా
బళారే
బళి } దే. బళా.
బళిర
బళిరా
బళిరయ్య } దే. బళా
బళిరె
బళీ
బళీరె
బళీరే

## బా

బాండువ. త. కుండ
బాంధకినేయుఁడు. స. ఱంకుటాలికొడుకు,
బంధులుఁడు
బాంధవము. స. చుట్టఱికము
బాంధవుఁడు. స. చుట్టము, జ్ఞాతి, మిత్రుఁడు
బాంధవ్యము. స. చుట్టఱికము, సంబంధము
బాఁకు. దే. కటారి
బాఁజా. దే. శ్యేనవిశేషము
బాఁతి. దే. బ్రాఁతి
బాఁదు. త. కొట్టు, ప్రహరించు
బాఁదుకొను. దే. కొట్టు, కొట్టుకొను
బాఁపఁడు. త. బ్రాహ్మణుఁడు
బాఁపత. దే. బ్రాహ్మణస్త్రీ
బాఁపన. త. బ్రహ్మకులము
బాఁపనక్క. త. బ్రాహ్మణస్త్రీ
బాఁపనచీమ. దే. వృక్షములయందుండు
గోరోజనపువర్ణముకల ఒకదినుసు పెద్ద
చీమ, బ్రాహ్మి
బాఁపనబూరి. దే. వృక్షవిశేషము
బాఁపనయ్య. త. బ్రాహ్మణుఁడు
బాఁపనవాఁడు. త. బ్రాహ్మణుఁడు [ణుఁడు
బాఁపనుఁడు. త. బాఁపనవాఁడు, బ్రాహ్మ
బాఁపఱికము. దే. బ్రాహ్మణత్వము
బాకి. దే. విస్తృతము [స్యము
బాకినోటిమెకము. దే. సింహము, పంచా
బాగములు } త. వక్కపొడి, ఒత్తినపోఁకలు
బాగలు
బాగాలు
బాగరి. దే. అందగాఁడు, అందగత్తె
బాగాలు. దే. ముచ్చటగుభార్య
బాగు. త. క్షేమము, అందము, విధము,
క్షేమముగలది, అందముగలది
బాగుచేయు. త. చేకూఱచు, వృద్ధికిఁ
దెచ్చు, రోగము కుదురుచు

బాగుదార. త. చిన్నకత్తి

బాగులాడి. దే. అందగత్తె

బాగులు. దే. అభినయములు, పనులు

బాగెము. త. సుకృతము

బాజాలు. త. బజాలు

బాజే. త. కాంతి [షణవిశేషము

బాజేబందు. త. సందిటఁగట్టుకొనెడు భూ

బాట. త. రాజమార్గము

బాటసారి. త. దారినడచువాఁడు

బాడబము. స. బడబానసమూహము, బడ

బాడబుఁడు. స. బ్రాహ్మణుఁడు [బానలము

బాడబ్యము } స. బాడబులసమూహము
బాడవ్యము

బాడాసువు. స. బాడిస

బాడిగ. త. ఇండ్లు మొదలగునవి వాడుక చేసికొనినందుకు ఇచ్చెడు ధనము, అద్దె

బాడిత. త. బాడిస

బాడిద } త. పారిభద్రకవృక్షము
బాడిదము

బాడిస. త. వడ్లవాఁడుకొయ్యచెక్కెడు పని

బాడు. దే. ముసుఁగు. [ముట్టు

బాడుగోలు. దే. మానహీనుఁడు

బాడుదల. దే. అవమానించుట

బాడువ. దే. పల్లపునేల

బాడె. దే. బురద

బాఢము. స. ప్రతిజ్ఞ, అధికము, గట్టి

బాణ. స. బాణమూలము, నల్లగోరంట చెట్టు.

బాణపుంఖి. స. వెంపలిచెట్టు

బాణము. స. అమ్ము, ఆవుపొదుఁగు

బాణలి. దే. పిండివంటలుచేయుట మొద లగుపనుల కుపయుక్తమగులోహపాత్ర విశేషము, ఖూరెలమూకుఁడు, మంగ లము

బాణవిద్య. స. బాణసంచులను కాల్చుట

బాణసంచు. గ్రా. తుపాకిమందుతో చేసి వేడుకకు కాల్చెడుపగులువత్తులు, తారా చువ్వలు మొదలగునవి

బాణా. దే. దండాయుధము

బాణాసనము. స. విల్లు

బాతళించు. దే. తత్తఱపడు

బాతు } దే. జలపక్షివిశేషము
బాతువు

బాద. త. బాధ

బ్దాదము. త. ఫలవృక్షవిశేషము

బాదరము. దే. జానకిత్రాడుంచెడు కర్ణాట కపుతుపాకిచెవి [చెట్టు, ప్రత్తిచెట్టు

బాదరము. స. నూలిచేనేయఁబడినది, రేఁగు

బాదరాయణుఁడు } స. వ్యాసముని, వెట్టి వాఁడు, నిష్ప్రయోజకుఁడైన పురుషుఁడు
బాదరాయణి

బాదరించు. దే. సమానమగు [తుపాకిచెవి

బాదరు. దే. జానకిత్రాడుంచెడు కర్ణాటకపు

బాదామము. స. బాదముకాయ

బాదాము. త. బాదముచెట్టు

బాధ. స. దుఃఖము, నిషేధము, విరుద్ధము

బాధకము. స. బాధించునది, ఆటంకము, ఆక్షేపణ

బాధపడు. దే. దుఃఖించు, బాధనొందు

బాధించు. స. బాధపెట్టు, అడ్డగించు, కొట్టివేయు, రద్దుచేయు, లోఁబఱచు

బాధితము. స. బాధింపఁబడినది

బాధిర్యము. స. బధిరత్వము, చెవుడు

బాధ్యత. స. బాధ్యత్వము, బాధ్యము

బాధ్యమానము. స. బాధింపఁబడుచున్నది

బాధ్యము. స. బాధింపఁదగినది,సంబంధము, స్వాతంత్ర్యము

బాధ్యుఁడు. స. చక్కఁబెట్టువాఁడు, స్వాతంత్ర్యముగలవాఁడు, పూఁటకాఁపు

బాన. త. కడవ, ఏతపుకడవ

బానగిల్లు } దే. బలాత్కృతమగు
బానగిలు }

బానసము. త. వంట, వంటయిల్లు

బానసీఁడు. దే. వంటవాఁడు

బానసీకుఁడు. దే. సేవకుఁడు

బానిస. దే. దాసి

బానిసము. దే. బానిసతనము, దాస్యము

బానిసీఁడు దే. సేవకుఁడు, దాసుఁడు

బాపు }
బాపురె } దే. బళి
బాపురే }

బాబా. త. గుఱ్ఱము

బాబారాతు. త. కుబేరుఁడు

బాబు. త. పూజ్యుఁడు, తండ్రి, పినతండ్రి

బాము. త. జన్మము, దుఃఖము

బాములపెట్టు. త. బాధపెట్టు

బార. దే. అడ్డముగా చాఁపఁబడినరెండు చేతులతోడిబొమ్మకొలఁత, వ్యామము

బార. త. పండ్రెండు

బారంగి. త. ఒకానొకదినుసుమందుచెట్టు

బారకము. త. బరువు

బారకాఁడి. దే. కోడెలను ఎడ్లతోడఁ జేర్చి మరపుటకు కట్టెడికాఁడి

బారకించు. త. భారమగు, శరీరముబరువుగా తోఁచు

బారపట్టె. దే. స్తంభములమీఁద అడ్డముగా అమర్చెడు నిడుపాటిపట్టె

బారపోయు. దే. చేయిచాఁగునంతకొలఁది నూలువడుకు

బారసాచు. దే. చేతులు చాచు, బారలు

బారసాల. త. నామకరణము

బారసి. త. ద్వాదశి

బారా. త. పండ్రెండు

బారాది. దే. అధికము, అనేకము

బారి. త. ఏనుఁగుకాలుకట్టెడు గొలుసు, నిర్బంధము, హింస, ఉపద్రవము, శత్రు సమ్ముఖము, గొప్ప

బారికె. గ్రా. వెట్టివాఁడు

బారిజము }
బారిదము } త. పారిభద్రకవృక్షము

బారిముద్ర. దే. దీనారభేదము

బారిసమరు. దే. హింసించు

బారిసము. దే. వేషము, వాలకము

బారీ. త. ఏనుఁగుకాలుఁగట్టెడు గొలుసు

బారు. త. సమూహము, వరుస

బారుచాపు. దే. పెక్కుమారలుఁగలచేతు

బారుదూలము. త. నిడుపాటిదూలము

బారువ. త. ఇరువదిమణుఁగులకొలఁది, పుట్టి

బాల. స. ఆఁడుది, నారికేళవృక్షము, పదునాఱేండ్లకులోఁబడినపిల్ల, మూర్ఖురాలు

బాలకుఁడు. స. పదునాఱేండ్లకు లోఁబడిన పిల్లవాఁడు

బాలతంత్రము. స. స్త్రీగర్భవిషయకమగు శాస్త్రము
బాలతనయము. స. చేండ్రచెట్టు
బాలతృణము. స. పచ్చిక
బాలత్వము. స. మూఢునితో చెలిమి
బాలభృత్యుఁడు. స. బాలత్వమునుండి భృత్యుఁడుగా నుండువాఁడు
బాలమూషిక. స. చిట్టెలుక
బాలవ. స. ఒకకరణము
బాలశాల. స. బారసాల
బాలసంగడము. దే. మల్లసాధనవిశేషము
బాలసారె. దే. నామకరణము, బారసాల
బాలాధ్యాపకుఁడు. స. బాలురకు చేదువు చెప్పువాఁడు
బాలిక. స. పదునాఱేండ్లకు లోఁబడినపిల్ల, కన్యక, ఆఁడుది
బాలిశము. స. తలగడ, జ్ఞానశూన్యమైనది
బాలిశుఁడు. స. మూర్ఖుఁడు, బాలుఁడు
బాలీసు. త. ఒఱగుదిండు
బాలుఁడు. స. చిన్నవాఁడు, మూర్ఖుఁడు
బాలెంత. దే. బాలెంతరాలు, ప్రసూత
బాలెంతబోళము. దే. బాలెంత కిచ్చెడు ఔషధవిశేషము, ఒకమందుదినుసు
బాలేయము. స. పిన్నముల్లంగిమొక్క, గాడిద, బాలునికి హితమైనది, మెత్తనిది
బాలేయశాకము. స. బారంగిచెట్టు
బాల్యము. స. చిన్నతనము
బావ. త. అక్కమగఁడు, మగని అన్న. తన కంటె పెద్దవాఁడైన మేనత్త మేనమామల కొడుకు
బావంజి. త. క్రాలుగచ్చచెట్టు
బావి. త. నూయి, దొరువు, చెఱువు, పల్లము
బావిలీ. దే. స్త్రీకర్ణభూషావిశేషము
బావుకొను. దే. అన్నములోనగునది చేతి నిండ ఎత్తి నోట నిడుకొను
బావురుఁబిల్లి / బావురుగాఁడు } దే. మార్జాలవిశేషము
బావురుమను. దే. జనశూన్య మగుటచే బావురుమని మాఱుమ్రోఁతకలదియగు
బాష్పము. స. కన్నీరు, ఆవిరి, ఇనుము, కొయ్యగూర
బాష్పిక. స. ఇంగువపత్రాసు
బాస. త. సంస్కృతాదిభాష, ప్రతిజ్ఞ ప్రమాణము, వ్రతము, సంకేతము, మాట
బాసట. దే. సహాయము
బాసనము. త. వంటపాత్రము
బాసము. త. జోలె
బాసవాలు. త. దేవతలు, మునులు, యోగి
బాసవాల్దొర. దే. ఇంద్రుఁడు, ఋషీశ్వరుఁడు
బాసాడు. దే. మాటాడు, భాషించు
బాసికదండ. దే. తలకుముందుప్రక్కనుంచఁబడిన పుష్పహారము
బాసికబొట్టు. దే. పద్మాసనము, కాళ్లుమడచి కూర్చుండురీతి, బాసికపట్టు
బాసికము. దే. వివాహకాలమునందు వధూవరులకు నొసటఁ గట్టెడుహారవిశేషము, లలామకము
బాహ. స. బాహువు
బాహాటము. త. బయలుపడినది, బహిరంగము
బాహిరపోవు. దే. బయలుపడు, మూర్ఛిల్లు

బాహిరము. త. బయలుపడినది, వెలియైనది
బాహిరుఁడు. స. బాహ్యుఁడు
బాహు. త. బాహువు
బాహుకము. స. సంగడి
బాహుగుణ్యము. స. బహుగుణములు గలది
బాహుజుఁడు. స. రాచవాఁడు, భుజము నందుపుట్టినవాఁడు
బాహుద. స. ఒకయేఱు
బాహుదము. స. బాహుపురి [రము
బాహుపురి. దే. సందికడియము, కేయూ
బాహుభాష్యము. స.విశేషముగా మాటాడు భావము
బాహుమూలము. స. చంక, కక్షము
బాహులము. స. బాహుత్రాణము, కార్తిక మాసము
బాహులేయుఁడు. స. కుమారస్వామి
బాహుళ్యము. స. బహుళభావము, విస్తారము
బాహువు. స. భుజము
బాహ్యము. స. వెలుపలిది, వెలియైనది
బాహ్లికము / బాహ్లీకము } స. ఇంగువ, కుంకుమపువ్వు, ఒకదేశము, ఆదేశము నందు పుట్టిన గుఱ్ఱము
బాళి. దే. కాంక్ష, విచారము, ప్రేమ, మూర్ఛ, ఆసక్తి, మోహము

## బి

బింకము. దే. బిగువు, గర్వము, గర్వోక్తి, నిక్కు [షము
బింగిలు. దే. బడిపంతుల విధించుశిక్షా విశే
బిందము. త. సమూహము
బిందియ / బిందె } దే. గొంతు సన్నముగానుండెడు లోహపాత్రవిశేషము
బిందీ. త. చేయుచుక్క
బిందుకితము. స. చుక్కలతోఁగప్పఁబడినది
బిందుతంత్రము. స. చదరంగము
బిందుఫలము. స. ముత్యము
బిందువాసరము. స. స్త్రీ గర్భిణియైనదినము
బిందువు. స. నీటిబొట్టు, చుక్క, సున్న, శుక్రము, దంతక్షతవిశేషము, భ్రూమధ్యము
బింబము. స. ప్రతిబింబము, దొండపండు, ప్రతిమ, సమానము, సూర్యచంద్రమండలము, ఊసరవెల్లి
బింబిక. స. దొండ
బింబితము. స. ప్రతిబింబించినది
బింబోష్ఠి. స. దొండపండువంటి పెదవిగల ఆఁడుది, ఆఁడుది
బికారి. త. భిక్షకాఁడు, అప్రయోజకుఁడు, వికృతవేషధారి, దరిద్రుఁడు
బికాసి. త. భిక్షకాఁడు
బికిరము. త. భిక్షము [గలవాఁడు
బికిరాలమారి. దే. భిక్షమెత్తు స్వభావము
బిక్క. దే. అక్షోటవృక్షము
బిక్కరించు. దే. నిక్కించు
బిగ. దే. బిగియ
బిగాది. దే. బిగియ
బిగాది. దే. ధూర్తుఁడు, భిక్షుకుఁడు, దరి
బిగి. దే. బిగువు, గట్టి [ద్రుఁడు
బిగించు. దే. గట్టిగాకట్టు
బిగితము. దే. దృఢము [వేయుబిగువుబద్ద
బిగిబద్ద. దే. రెండుగాఁడికమ్ములకునడుమ
బిగిమానము. దే. బిగువు, కాఠిన్యము
బిగియు. దే. బిగువగు, బిగువుచేయు

బిగుచు. దే. బిగియఁజేయు, బిగించు
బిగుతు. దే. వదులుకానిది
బిగువు. దే. బింకము, బిగిబద్ద, మోపు
బిగువుకొను. దే. బిగువగు
బిగ్గ. దే. బిగ
బిగ్గర. దే. గట్టిగా, దృఢముగా
బిగ్గలి. దే. గట్టిగా
బిచ్చగాఁడు. దే. భిక్షమెత్తువాఁడు, భిక్షుకుఁడు
బిచ్చము. త. భిక్షము, తిరిపము
బిజాగు. దే. బొంకుట
బిటారము. దే. విలాసవిశేషము
బిటారి. దే. బిటారముకలది
బిటికి. దే. పలువభార్య
బిటుకులాడి. దే. తులువభార్య
బిట్టబిట్టు. దే. మిక్కిలిబిగువు
బిట్టు. దే. శీఘ్రము, అధికము, దృఢముగా
బిట్టుబిట్టు. దే. తటాలున
బిడ. దే. బిడ్డ, స్త్రీవాచకము
బిడము. స. అట్టుప్పు
బిడారము. దే. వాసస్థానము, విడిది
బిడారు. దే. వాసస్థానము, చేనుపము
బిడాలకము. స. హరిదళము, పునుఁగుచట్ట
బిడాలము. స. పిల్లి, కనుగ్రుడ్డు
బిడాలి. స. ఆఁడుపిల్లి
బిడియము } దే. సిగ్గు
బిడెము }
బిడువు. దే. అవకాశము
బిడౌజుఁడు. స. ఇంద్రుఁడు
బిడ్డ. దే. శిశువు, కొడుకు, కూఁతురు
బిడ్డఁడు. దే. మగశిశువు, కొడుకు

బిడ్డకుట్టు. దే. ప్రసవవేదన, ఆమనస్యము
బిడ్డతల్లి. దే. బాలెంతరాలు, ప్రసూత
బిడ్డె. దే. బిడ్డ
బిత్తరపోవు. దే. చలించు
బిత్తరము. దే. శృంగారచేష్ట, ప్రకాశము, చంచలము, సరసము
బిత్తరములాడు. దే. ప్రకాశించు
బిత్తరి. దే. శృంగారచేష్టగల ఆఁడుది, స్త్రీ
బిత్తరించు. దే. సరసమాడు, ప్రకాశించు, చలించు, ఊఁగాడు
బిత్తల. దే. దిసమొల
బిత్తలి. దే. దిసమొలవాఁడు, దిసమొలది
బిత్తెడ. దే. చేమురులో వేఁగుపదార్థములను దీయుసాధనము, చట్రము
బిద్దము. త. భిన్నము, పగిలినది
బిద్దు. దే. చేచ్చు
బిద్దె. దే. దుర్గతి, నరకము
బిబ్బరించు. దే. పులికూయు, అఱచు
బిబ్బరింత. దే. పులికూఁత, అఱపు
బిబ్బలికాయ. దే. ఆఁడుదానికాలి మూఁడవవ్రేలియాభరణము
బిబ్బి. దే. తోరణము, తురుష్కుల యంతఃపురస్త్రీ
బిబ్బోకము } స. నాయికకు గర్వాతిశయముచేత ఇష్టవస్తువు
బివ్వోకము }
నందైనను కలిగెడు అనాదరము
బిబ్బోకవతి. స. విలాసవతి, బిబ్బోకిని
బిభక్షయిష. స. తినవలెననునిచ్ఛ
బిభీషక. స. భయము
బిమ్మిటి. దే. వివశత, సంకోచము, వివశము, మనోదుఃఖము

బిమ్మిటిగొను. దే. వివశత్వమునొందు, స్మార కముతప్పు
బిమ్మిటిపోవు. దే. వివశత్వము నొందు, మూర్ఛిల్లు
బియ్యము. దే. పొట్టూడదంచినధాన్యము, తండులము
బిరడ } దే. తంబుఱలోనగువాని తంతి
బిరడా } చేర్చెడు తఱిమెనకొయ్య, బుడ్డి, సీసా మొదలగువాని మూతికివే సెడు కొయ్యమూఁత
బిరబిర. దే. అతిత్వరితముగా
బిరికీలు. దే. మెడను ధరించెడు నగ
బిరుదము. స. సామర్థ్యచిహ్నము
బిరుదాయత్తు. త. బిరుదుగలవాఁడు
బిరుదు. త. సామర్థ్యచిహ్నము, ప్రతిజ్ఞ, సమర్థుఁడు, శూరుఁడు
బిరుదులాఁడు. దే. ప్రతిజ్ఞావంతుఁడు
బిరుసు. దే. కాఠిన్యము, కఠినము
బిరుసుగ్రోవి. దే. ఒకదినుసు బాణసంచు
బిరుసులు. దే. బిరుసుగ్రోవి
బిఱబిఱ. దే. అతిత్వరితముగా
బిఱాన } 
బిఱీన } దే. త్వరితముగా
బిఱీలున }
బిఱుబిఱ్ఱు. దే. జాలు లోనగునవి పడుట యందగు ధ్వన్యనుకరణము
బిఱుసు. దే. కాఠిన్యము, కఠినము [గ్రోవి
బిఱుసులు. దే. అగ్నిబాణములు, బిరుసు
బిఱ్ఱు. దే. బిగువు
బిఱ్ఱుబిగియు. దే. మిక్కిలి బిగిసికొను
బిఱ్ఱు దే. బిఱుసగు, దృఢత, ఉద్ధతి, ఏదైన బిగువుగా నిలుచుటకై త్రాడు గట్టి యీడ్చి యానించెడుకొయ్య
బిలకము. స. పళ్ళిక
బిలము. స. రంధ్రము, గుహ
బిలిబిలి. దే. ముద్దుముద్దు
బిలుకుమార్చు. దే. చంపు
బిలుకురఁబట్టు. దే. ఊపిరి తిరుగకుండ నొక్కిపట్టు
బిలుగు. దే. కపటముగల, మాయగల
బిలువము. త. బిల్వము, మారేడుచెట్టు
బిలేశయ. స. ఉడుము
బిలేశయము. స. పాము, ఎలుక
బిల్ల. దే. పలుచనిగుండ్రనివస్తువు, గుండ్రపు తలగడ, ఖండము, నెత్తురుగడ్డ, గుండ్ర నిది, సూర్యచంద్రుల బింబము
బిల్లకట్టు. దే. నెత్తురు గడ్డకట్టు
బిల్లకఱ్ఱలు. దే. తములపాకులనుడెలకుక్రిం దనుమీఁదను సంతనచేసి కట్టెడుకఱ్ఱలు
బిల్లగోళ్లు. దే. బాలక్రీడావిశేషము
బిల్లచెప్పులు. దే. తోలుబిల్లల కుచ్చు లమ ర్చినచెప్పులు
బిల్లవాలు. దే. చక్రాయుధము
బిల్లిక. దే. సూర్యచంద్రులబింబము, బిల్ల
బిల్వము. స. మారేడుచెట్టు
బిళ్ల. దే. బిల్ల, ఓడుబిళ్ళ, గడ్డ
బిళ్లు. దే. సోధ్రకవృక్షము
బిస. దే. యంత్రపుకీలు, యంత్రము, ఉపా యము, కిటుకు
బిసకంఠిక. స. పెద్దకొక్కెర
బిసప్రసూనము. స. పద్మము, తామర
బిసబిస. దే. వేగము
బిసభుక్తి. స. హంస
బిసము. స. తామరతూఁడు, తామరతీఁగ

బిసజము } స. పద్మము
బిసరుహము

బిసి. దే. తడకబిళ్లు

బిసిని. స. తామరతీఁగ, తామరకొలను, పద్మము

బిసిబిసి. దే. లగువుబిగువుగలది, ముదుముద్దు

బిసివోవు. దే. పట్టువదలు

బిస్త. దే. దుర్గతి, నరకము

బిస్తము. స. కర్ష మెత్తుబంగారు, మాడ

బిస్సు. దే. వేగమునందగు ధ్వన్యనుకరణము

## బీ

బీఁట. దే. బీఁటిక, పగులు

బీఁటగిల్లు } దే. పగులువాఱు
బీఁటగిలు

బీఁటలువాఱు } దే. బీఁటగిల్లు
బీఁటలువోవు

బీఁటిక. దే. బీఁట

బీగము. దే. తలుపు లోనగువానికి వేసెడు తాళము

బీజకృత్తు. స. వీర్యవృద్ధిచేయునది

బీజకోశము. స. తామరపువ్వు, తామరదిమ్మె

బీజపూరము. స. మాదిఫలవృక్షము

బీజము. స. విత్తనము, విత్తుట, ముష్కము, రేతస్సు, హేతువు, బలము, బీజాక్షరము, అంకురము, మూలగ, బీజగణితము, నిజము

బీజాకృతము. స. విత్తిదున్నినపొలము

బీజ్యుఁడు. స. మంచికులమునందుఁ బుట్టినవాఁడు

బీడు. దే. దున్ననిభూమి, ఉష్కరజము, నీచము

బీతు. త. భయము

బీతుకొను. దే. భయపడు

బీతుకొలుపు. దే. భయపఱచు

బీద. త. భయమునొందినది, దరిద్రుఁడు, దరిద్రురాలు

బీదగిల్లు. త. దారిద్ర్యము నొందు

బీదతనము. త. దారిద్ర్యము, బీదఱికము

బీభత్సము. స. ఒకరసము, అసహ్యాకరమైనది, వికృతమైనది, అసూయగలది, క్రూరమైనది, మోటైనది, అసహ్యాత

బీభత్సు. స. అసహ్యము, చీదర

బీభత్సుఁడు. స. అర్జునుఁడు, వికారముగలవాఁడు, క్రూరుఁడు

బీరము. త. పరాక్రమము

బీరాజే. దే. తుడిచి కుప్పచేయు

బీరిజేము. త. బీజము, ముష్కము

బీరువ. దే. అంతస్తు అంతస్తుగా అడ్డపలకలు అమర్చిన నిలువుపెట్టె

బీరెండ. దే. తీవ్రాతపము

బీఱ. దే. ఒకానొకచెట్టు, ఒకానొకతీఁగ, పెద్ద

బీఱు. దే. వ్యర్థము

బీఱువడు } దే. వ్యర్థమగు
బీఱువాఱు

బీఱువోవు. దే. వ్యర్థమగు, బలహీనమగు

## బు

బుంగ. దే. చిన్నమూతిగలకుండ, తాటాకులతోనల్లి పండుమొదలయినవికట్టునది

బుంగనామము. దే. నడుమ ఎడములేక తీర్చిన తిరుమణిబొట్టు

బుంగుడుపఱచు. దే. కూలునట్లుచేయు

బుంద్రము. దే. గుడ్లగూబ

బుక్క, బుక్కా. దే. వస్త్రములకు వాసనకట్టెడు గందవొడి, గంధచూర్ణము

బుక్కనము. స. కుక్కయొక్క మొఱుగు

బుక్కము. స. శ్రోతమునందు ప్రసిద్ధమైన మాంసము

బుక్కాము. దే. పుప్పొడి, బుక్క, బుక్కాయి

బుక్కావాఁడు. దే. గందవొడి మొదలగునవి యమ్మువాఁడు

బుగడలు. దే. ఆఁడువారు కొనచెవిని ధరించెడు భూషావిశేషము

బుగులు. దే. గుబులనకు మాఱురూపము, పరిమళము

బుగులుకొను. దే. గుబులుకొను, వ్యాపించు, విజృంభించు

బుగులుపుచ్చు. దే. బయలుపఱచు

బుగులుపోవు. దే. బయలుపడు

బుగ్గ. దే. చెక్కిలి, నీటిబుడ్డ, పర్వతాదులయందుండి సంతతధారగా పైకుబికి వచ్చెడు నీరు

బుగ్గి. దే. బూడిద

బుచ్చి. దే. చిన్న, అల్పము

బుచ్చిగాఁడు. దే. చిన్నవాఁడు

బుచ్చివాఱు. దే. చిన్నపోవు

బుజె. దే. కుండలీకరణము, సున్న

బుజె. త. భుజము

బుజపత్తిరి. త. భుజపత్త్రవృక్షము

బుజము. త. భుజము

బుజముపుట్టువు. దే. క్షత్త్రియుఁడు

బుజ్జగము. దే. ఉపలాలనము, ఓదార్పు

బుజ్జగించు. దే. లాలనముచేయు

బుజ్జగింత. దే. బుజ్జగించుట

బుజ్జవము. దే. ఓదార్పు

బుటుకు, బుటుక్కు. దే. మునుఁగుటయందగు ధ్వన్యనుకరణము

బుట్ట, బుట్టి, బుట్టిక. త. పుష్పాదులుంచెడు కరండము

బుడక. దే. స్నానము, మునుఁగుట

బుడకోడి. దే. నీరుకోడి

బుడగ. దే. బుగ్గ

బుడబుడ. దే. నీళ్లనుండి వెడలుట మొదలగు వానియందగు ధ్వన్యనుకరణము

బుడమ. దే. మృగోర్వారువృక్షము

బుడము. దే. మొదలు

బుడికిస్సు. దే. బాలక్రీడావిశేషము

బుడిగ. దే. ఎద్దుమీఁదియొకవైపుసిద్దె, పిడత

బుడిగి. దే. పొట్టి

బుడివి. దే. శరీరమందుఁబుట్టినబొప్పి, చెఱకు లోనగువానికనుపు, మ్రానియందలిముడి

బుడిబుడి. దే. తొట్రుపాటు, అల్పము

బుడిబుళ్లువోవు. దే. ఆశ్చర్యపడు

బుడివడు. దే. తొట్రుపడు

బుడుక. దే. మునుక, స్నానము

బుడుకు. దే. భక్ష్యవిశేషము

బుడుగు. దే. పొట్టి

బుడుత. దే. బిడ్డ, బాలుఁడు, పొట్టి

బుడుతఁడు. దే. బిడ్డఁడు, బాలుఁడు

బుడుబుడుక్క. దే. డుబుడక్క

బుడుబుడుక్కలవాఁడు. దే. డుబుడక్క వాఁడు

బుడుమలు. దే. వడ్లలోని భేదము

బుడుసుపోయిన. దే. సన్నమైన
బుడ్డ. దే. నీరుబుగ్గ, అండవృద్ధి
బుడ్డకాకర. దే. శక్రవల్లిక [గించే
బుడ్డగించే. దే. పందిముట్టెతో కోరాడు, కెల్ల
బుడ్డగింపు. దే. బుడ్డగించేట
బుడ్డపిడుదు. దే. పశువులకుపట్టెడు ఒక దినుసుపిడుఁజే
బుడ్డబుడుసర. దే. ఓషధివిశేషము
బుడ్డవాఁడు. దే. అండవృద్ధిగలవాఁడు
బుడ్డి. దే. చిన్నమూతిగల నిడుపాటికాచ పాత్రము, చిన్నమూతిగలపిడత
బుడ్డిగ. దే. బుడ్డి, కమండలువు
బుడ్పి. దే. బుడిపి
బుత్తి. త. భోగము, భుక్తి
బుద్ది. త. మతి, బుద్ధి
బుదుఁడు. త. బుధుఁడు
బుద్బుదము. స. నీరుబుగ్గ, గర్భమునందలి అవయవవిశేషము
బుధవారము. స. ఒకవారము
బుధితము. స. తెలియఁబడినది
బుధుఁడు. స. ఒకగ్రహము, విద్వాంసుఁడు, వేలుపు
బుద్ధము. స. తెలిసినది
బుద్ధి. స. మతి, తెలివి, సలహా
బుద్ధిచెప్పు. దే. సలహాచెప్పు, చీవాట్లుపెట్టు
బుద్ధిపూర్వకము. స. కావలెనని చేసినది
బుద్ధిమంతుఁడు. స. బుద్ధిగలవాఁడు
బుద్ధుఁడు. స. బుద్ధదేవుఁడు, విద్వాంసుఁడు, తెలియఁబడినవాఁడు
బుధ్నము. స. వేరు, ఊఁడ, అడుగుభాగము
బుధ్నుఁడు. స. శివుఁడు
బుభుక్ష. స. భుజింపనిచ్ఛ, ఆఁకలి
బుభుక్షితుఁడు. స. ఆఁకలిగొన్నవాఁడు, క్షుధితుఁడు

బుభుత్స. స. బోధగొననిచ్ఛ
బుభూర్ష. స. భరింపవలె ననునిచ్ఛ
బుయ్యా. దే. ఆఁడుగుఱ్ఱి
బుయ్యారము. దే. చెఱసాల, కారాగృహము
బురజే. దే. చిఱుగజ్జె
బురడా. దే. ఒకవిధమైనగుడ్డ
బురద. దే. అడుసు
బురదకమ్మి. దే. కడపక్రిందికమ్మి
బురదపాము. దే. నీరుపాము
బురుక. దే. బిడ్డ, పొట్టి, వామనుఁడు, గుఱ్ఱముతలమీఁదితురాయి
బురుకఁడు. దే. బిడ్డ, వేఁటకుక్క, పొట్టి
బురుజే. దే. కోటకొత్తడము
బురుడా. దే. అసత్యవచనము
బురుడుఁడు. స. మేదరవాఁడు
బురుమా. దే. బరమా
బురులు. దే. న్యూనత
బురుసా. దే. ఎఱ్ఱపట్టు, పట్టు
బుఱటకొమ్ము } దే. చిమ్మనఁగ్రోవి
బుఱ్ఱటకొమ్ము }
బుఱ్ఱ. దే. కొబ్బెరకాయ మొదలయినవాని గుల్ల, ఎండినసొరకాయ, వీణెలోనగువానికాయ, పాములవానినాగసరము, తలపుఱ్ఱె, పెద్ద
బుఱ్ఱకత్తి. దే. గొట్లకొమ్మలునరకెడు మోటకత్తి
బుఱ్ఱకాయ. దే. సొరకాయకమండలువు
బుఱ్ఱటకొమ్ము. దే. చిమ్మనగొట్టము
బుఱ్ఱతలము. దే. బుఱ్ఱయేఁతము, కారెము
బుఱ్ఱపిట్ట. దే. పారావతవిశేషము
బుఱ్ఱబాడిస. దే. వాల్లుచెక్కెడుబాడిత

బుఱ్ఱిముక్కు. దే. పెద్దరంధ్రములుగలము
బుఱ్ఱి. దే. తలపావు [క్కు
బుఱ్ఱు. దే. పక్షి ఎగురుటయందగు ధ్వన్యను
 కరణము
బులియు. దే. సుఖించు
బులుపు. దే. సుఖము, వేడుక, వాంఛ, ఉబ
 లాటము
బుల్ల } దే. బాలునిమగగుఱి, బుల్లకాయ
బుల్లి }
బువ్వ. దే. అన్నము
బువ్వకుడుపు. దే. అన్నప్రాశనము
బువ్వదిండి. దే. అన్నముతిని జీవించువాఁడు
బువ్వము. దే. వివాహమునందు బంధువు
 లందఱు ఒకటిగాఁ గూర్చుండి వేడుకగా
 భుజించుట
బువ్వముబంతి. దే. పారిబువ్వము
బుస. దే. సర్పధ్వని, నిట్టూర్పు
బుసకొట్టు. దే. పాముబుస్సను, నిట్టూర్చు,
 వినఁగుతొండముతో ఫూత్కారము
 చేయు, సింహము ఫూత్కారముచేయు
బుసబుస. దే. నీళ్లుపొంగుట మొదలగువాని
 యందగు ధ్వన్యనుకరణము
బుసబుసలాడు. దే. బుసపెట్టు
బుసము } స. పొల్లు, మీఁగడతీసిన
బుషము } పెరుఁగు, కసపు, పిడుక
బుసి. దే. నిగుఱు, పొల్లు
బుసి. స. పశ్చిమసముద్రమునడుమనుండెడు
 వరుణోద్యానవది
బుసిపోవు. దే. చెడు
బుసుకుజొన్న. దే. ఒకదినుసుజొన్న
బుస్సు. దే. పాము బుసకొట్టుటయందగు
 ధ్వన్యనుకరణము

## బూ

బూంది. దే. భక్ష్యవిశేషము
బూఁజు. దే. ఎండతగులకపోవుటచే తడి
 వస్తువుల మీఁదఁ గలుగు కొంచెము
 మాసినతెలుపు
బూఁజుపట్టు. దే. బూఁజుగలదియగు
బూఁదు. దే. బూఁజు
బూఁదుపారు. దే. బూజుపట్టు
బూక. దే. బూటకము, మాయ
బూగర. దే. తమిదలుమొదలగుధాన్యముల
 మీఁదిపొట్టు, ఇండ్లవాసములకుఁబట్టెడు
 బూసి
బూచి. త. భూతము
బూచిగాఁడు. దే. కుక్కకీయఁబడినపేరు
బూచివాఁడు. దే. బూచి, భూతము
బూచులఱేఁడు. దే. శివుఁడు
బూటకము. దే. మాయ, వంచన, అసత్యము
బూటకాలమారి. దే. వంచకుఁడు
బూటకీఁడు } దే. మాయావి, వంచకుఁడు
బూటకుఁడు }
బూడిద. దే. భస్మము
బూడిదగుమ్మడి. దే. కాయపైన బూడిదగల
 గుమ్మడి
బూడిదపండు. దే. విభూతియుండ
బూడిదపన్ను. దే. శ్మశానమునందుశవమును
 కాల్చుటకై యిచ్చెడుపన్ను
బూద్ద. దే. బూడిద
బూతపిల్లి. త. పూతిమార్జాలము, పునుఁగు
 పిల్లి
బూతము. త. పిశాచము, ప్రాణి
బూతాటము. దే. బూతులాడుట
బూతి. త. బూది, తిండి

బూతు. దే. కుచ్ఛితపుతిట్టు, కుచ్ఛితపుతిట్టు తిట్టువాఁడు, బట్టువాఁడు
బూద. దే. పాలకుండ
బూది. త. బూడిద
బూదిచేఱచు. దే. బూజేపట్టు
బూదె. త. చతుర్దశితిథి, శివరాత్రి
బూమి. త. భూమి
బూమియ, బూమె } త. మాఱువేషము, మాయ, వంచన
బూమెకత్తియ, బూమెకత్తె } త. బూమెలుంకలది
బూమెకాఁడు. దే. బూమెలుంకలవాఁడు
బూమెలాఁడి. దే. బూమెకత్తె
బూమెలాఁడు. దే. బూమెకాఁడు
బూర. త. వాద్యవిశేషము, స్థూలము
బూరఁడు. త. విజృంభించినవాఁడు
బూరకాలివాఁడు. దే. ఏనుఁగుకాలివాఁడు, కాలువాఁచినవాఁడు
బూరకాలు. దే. ఏనుఁగుకాలు అను వ్యాధివిశేషము
బూరగ. త. వాద్యవిశేషము
బూరగడ్డి. దే. తృణవిశేషము
బూరగొమ్ము. దే. వంకరగానుండు వాద్యవిశేషము, కొమ్ము
బూరట. త. ఉల్బణము, అతిశయము
బూరటించు. త. బూరటిల్లఁజేయు
బూరటిల్లు, బూరటిలు } త. నిండు, ఉబ్బు
బూరియ, బూరె } త. భక్ష్యవిశేషము
బూరుగు. దే. శాల్మలీవృక్షము
బూరుగుదీవి. దే. శాల్మలద్వీపము
బూరువు. దే. బూరుగు
బూల. దే. లేఁతత్రాటిమ్రానిలోని పేఁడు, నిస్సారము
బూలి. దే. నిస్సారమైనది
బూసము. దే. ధాన్యము
బూసి. దే. ఇండ్లవాసములకుపట్టెడు సాలెపట్టు, ముఱికి

## బృ

బృంద. స. తులసిచెట్టు
బృందము. స. సమూహము
బృందారకుఁడు. స. వేలుపు, మనోజ్ఞుఁడు, శ్రేష్ఠుఁడు
బృందావనము. స. తులసితోఁట, కృష్ణుఁడు నివసించినపట్టణము
బృందిష్ఠము. స. మిక్కిలి మనోహరమైనది
బృంహితము. స. ఏనుఁగుయొక్కగీఁక
బృంహితుఁడు. స. వృద్ధిపొందినవాఁడు
బృహతి. స. వాఁకుడుచెట్టు, ములకచెట్టు, ఒకఛందస్సు, ఉత్తరీయము, గొప్పయైనది
బృహతిక. స. ఉత్తరీయము
బృహత్కుక్షి. స. పెద్దకడుపువాఁడు
బృహత్తు. స. గొప్పది
బృహత్పీలువు. స. పెద్దవరగోఁగుచెట్టు
బృహదేల. స. పెద్దయేలకిచెట్టు
బృహద్బీజము. స. అండవృద్ధి, అంబాళపుచెట్టు
బృహద్భానువు. స. అగ్ని
బృహద్వ్యాధి. స. కుష్ఠరోగము
బృహన్నల. స. అర్జునునికి వేషాంతరమునందలి నామము
బృహన్నలము. స. పెద్దకిక్కసమొక్క
బృహన్మరీచము. స. మిరెపకాయ

బృహస్పతి. స. సురగురువు
బృహస్పతివారము. స. గురువారము

## బె

బెంగ. దే. విరహవ్యథ, కూఁత
బెంగగొను. దే. మనోవ్యాధిని పొందు
బెంగలిడు. దే. బొబ్బలుపెట్టు
బెండ. దే. ఎద్దునాలుకచెట్టు, గోజిహ్వవృక్షము
బెండగిల్లు. దే. పెల్లగిల్లు, ప్రయాణమగు
బెండు. దే. జీలుఁగుమొక్క, నిస్సారము, తేలికయైనది
బెండుమానిసి. దే. బలహీనుఁడైన మనుష్యుఁడు
బెండువడు. దే. బలహీనతనొందు
బెందడి. దే. బురద, రొంపి
బెక్కొట్టు. దే. వాపోవు
బెగడు. దే. భయపడు, భయము
బెగడువడు. దే. భయపడు
బెగ్గడిల్లు, బెగ్గడిలు. దే. భయపడు
బెగ్గడు. దే. బెగడు
బెగ్గలము. త. విహ్వలత, భయము, దిగ్భ్రమ
బెగ్గలించు. త. విహ్వలించు, భయపడు
బెగ్గలికము. త. భయము
బెగ్గిల్లు, బెగ్గిలు. త. విహ్వలించు, భయపడు, చింతించు, చలించు
బెగ్గురు. త. సారసపక్షి
బెజ్జము. దే. తూఁటు, రంధ్రము
బెట్ట. దే. వేండ్రము, తీక్ష్ణము
బెట్టించు. దే. నిర్బంధమునుండి మరలించు, విడిపించు
బెట్టిదము. దే. ఉద్ధతి, క్రౌర్యము, కఠినము
బెట్టిదములు. దే. నిష్ఠురవచనములు

బెట్టిదుఁడు. దే. ఉద్ధతుఁడు, క్రూరుఁడు, కఠినుఁడు
బెట్టిదురాలు. దే. బెట్టిదముగలది
బెట్టు. దే. గౌరవము, ఉద్ధతి, అతిశయము, ఉద్ధతుఁడు, అత్యంతము, గట్టిగా, దృఢముగా, దుర్లభము, దుస్సహము
బెడఁకు. దే. చలించు, తొలఁగు, చలనము
బెడఁగారు. దే. అందగించు
బెడఁగు. దే. అందగించు, అందము, విలాసము, అధికము, మనోహరము
బెడఁద. దే. బాధ, ఆపద
బెడక. దే. ఉత్తగోనె
బెడద. దే. భక్ష్యవిశేషము
బెడిదము. త. భయంకరత్వము, కఠినత్వము, అధికము, కఠినము
బెడిదములు. త. పరుషవచనములు
బెడిదుఁడు. త. భయంకరుఁడు, కఠినుఁడు
బెడిదురాలు. దే. బెడిదముగలది
బెడియు. దే. తప్పు, వికలమగు
బెడ్డ. దే. మంటిగడ్డ
బెణఁకు. దే. బెడఁకు తొలఁగు, చలించు, ఎముకకదలు
బెత్త. త. చతురంగుళమానము
బెత్తము. త. పేము, వేత్రము
బెత్తిక. దే. ఎండిలేచిన మట్టిపెళ్ల
బెత్తిలి. త. తర్జని మొదలైన నాలుగువ్రేళ్ల అడ్డకొలఁత
బెత్తు. దే. బెత్తిక, గౌరవము
బెత్తు. త. బెత్తము
బెత్తుబెత్తు. దే. పగుళ్లుపాయు, పెళ్లలులేచు
బెదరింపు. దే. బెదరించుట, జడిపించుట

బెదరు. దే. భయపడు, బెదరు

బెదరుపోతు. దే. భయశీలుఁడు, భయశీలురాలు

బెబ్బులి. దే. వ్యాఘ్రము, పెద్దపులి

బెరడు. దే. వృక్షాదులపైత్వక్కు, బరడు

బెరయు. దే. కలుగు, వ్యాపించు, చేరు, పొందు, తడుపు, ముంచు

బెరసు. త. క్రూరము, ముతక

బెరికి. దే. కొఱంత, న్యూనత

బెరుకు. దే. భేదము, ప్రయోజనము

బెలము. త. బొక్క, కలుఁగు

బెలయు. దే. వ్యాపించు

బెల్లము. దే. చెఱకురసము కాఁచఁగానైన ముద్ద, గుడము, మగగుఱి

బెల్లి. దే. ఇచ్ఛకము, లాలనము, వంచకము, వంచకుఁడు, వంచకురాలు

బెల్లించు. దే. వంచించు

బెల్లింపు. దే. బెల్లించుట, వంచనము

బెసుకు. దే. బెడియు

బెస్త. దే. చేఁపలనుబట్టు ఒకజాతివాఁడు, బోయి

బెహారము. త. వర్తక వ్యాపారము

బెహారి. దే. వర్తకుఁడు

బెళఁకు. దే. చలించు, ఒరయు, చలనము

బెళఁగు. దే. బెడఁగు, మిఱుమిట్లుగొను, కాంతి

బెళగువ్వ } దే. పక్షివిశేషము
బెళవ

బెళుకు. దే. తళతళమనిప్రకాశించు, తళతళమను ప్రకాశము

## బే

బే. త. అంబేయొక్కమాఱురూపము

బేఁటు. దే. ఎండిన అడుసులోనగువాని పెళ్ల, కొండలోనగు వానియందలి చీలిక, పేఁటు

బేగడ. దే. కాకిబంగారు, అభ్రకము, రాగవిశేషము

బేడ. దే. పరకరూపాయి

బేడలు. దే. కాయధాన్యముల పప్పు

బేడిగ. దే. పన్ను, అద్దె

బేడిజము. దే. మాయ, టక్కు

బేడిదము. త. బెడిదము

బేడిస. దే. మత్స్యవిశేషము

బేతాళము. స. పిశాచము, భూతావిష్టమృతశరీరము

బేతాళుఁడు. స. యమకింకరుఁడు

బేది. దే. పాసనము, విరేచనము

బేరకత్తె } త. బేరమాడునది
బేరకత్తియ

బేరకాఁడు. దే. బేరమాడువాఁడు

బేరజము. దే. కుత్సితపునడక, కుత్సితుఁడు, కుత్సితురాలు

బేరజములు. దే. పరుషవచనములు

బేరము. త. వర్తకవ్యాపారము, వెలకు వస్తువునిచ్చుకొలఁది నడుగుట, ధరను నిశ్చయము చేయుట

బేరము. స. ప్రతిమ

బేరి. త వాద్యవిశేషము, వైశ్యుఁడు

బేల. త. మూఢుఁడు, ముగ్ధస్త్రీ

బేలరి. దే. మోసకాఁడు

బేలు. దే. మోసము

బేలుపడు }
బేల్పడు } దే. మోసపోవు
బేలుపోవు }

బేలుపఱుచు / బేలుపుచ్చు / బేలువెట్టు } దే. మోసపుచ్చు

బేసము. త. పేసెము, పేశము

బేసరి. దే. ఒకదినుసు ముక్కఱ

బేసి. దే. సమముకానిది, విషమము

బేసికంటి. దే. శివుఁడు

బేసికైదువుజోదు. దే. మన్మథుఁడు

బేహారము / బేహారము } త. వర్తకవ్యాపారము, బేరము

బేహారి / బేహారి } త. వర్తక వ్యాపారముచేయు వాఁడు, వణిజుఁడు, వైశ్యుఁడు

## బై

బైకలు / బయికలు } దే. వేవిళ్లు

బైజె / బయిజె } దే. అజ్ఞానము, పిచ్చిపని

బైడాలము / బయిడాలము } దే. కోపము

బైడాలము. స. పిల్లిసంబంధమైనది

బైరవాసము / బయిరవాసము } త. ఉత్తరీయము

బైరాగి / బయిరాగి } త. విరక్తుఁడైన తీర్థవాసి

బైరి / బయిరి } దే. శ్యేనవిశేషము

బైలగు / బయిలగు } దే. బయలుపడు, బైటపడు

బైలు / బయిలు } త. బయలు

బైసణ / బయిసణ } దే. పీణ సారకాయయొక్క బంధనము

బైసి / బయిసి / బవిసి } త. భాగ్యము, గారవము, కీర్తి, సిగ్గు

బైసుక / బయిసుక } దే. ప్రతిజ్ఞ, నియమనము

## బొం

బొంకణము. త. బొక్కణము

బొంకప్ప. దే. మత్స్యవిశేషము

బొంకరి. దే. అసత్యవాది

బొంకి. దే. బోఁకి

బొంకించు. దే. మోసపుచ్చు, బొంకఁజేయు

బొంకు. దే. అసత్యమాడు, అసత్యము, అసత్యవచనము

బొంకులాఁడి. దే. అసత్యములాడునది

బొంకులాఁడు. దే. అసత్యములాడువాఁడు

బొంగరము. త. బాలురాడుకొనుబొమ్మరము

బొంగరాలు. దే. భక్ష్యవిశేషము

బొంగు. దే. ఎండినలావుబోలువెదురు

బొండ / బొండకొయ్య } దే. తప్పుచేసినవారి కాలు సేతులకు తగిల్చెడు దారుయంత్రవిశేషము, ద్రుపదము

బొండము / బొండలము / బొండాము } దే. టెంకాయమీఁదిబోసిక

బొండిగ. దే. తొడిమ, ఈనెమొదలు

బొండు. దే. గుండ్రమైనది

బొండుగ. దే. కంఠనాళము

బొండుమల్లె. దే. గుండుమల్లె

బొండువ. దే. బొండుగ

బొండెము. దే. కంచెకై యుపయోగించెడు ముండ్లతడక

బొండ్లము } దే. బొండము, బొండలము
బొండ్లాము }

బొంత. దే. పెద్ద

బొంత. త. దూదిలోనగువానిఁ జేర్చి దట్టముగాఁ కుట్టినగంత

బొంతకాకి. దే. మాలకాకి

బొంతజెముడు. దే. ఒకదినుసు జెముడు

బొంతరఁటి. దే. పెద్దకాయలుగల ఒక దినుసు అరఁటి

బొంతఱాయి. దే. శిలాభేదము

బొంతు. దే. జొన్నలులోనగువానిగింజెల యడుగుననుండు కుసురువంటిపొట్టు

బొంద. దే. రంధ్రము, తాడులోనగు చిన్న చెట్టు, చిన్నగొయ్యి, పిల్లగాఁడు

బొందకోల. దే. మల్లసాధనాయుధవిశేషము

బొందడము } దే. కవచము
బొందళము }

బొందడీఁడు. దే. బొందడము తొడిగిన వాఁడు

బొందపక్కె. దే. మత్స్యవిశేషము

బొందపువ్వు. దే. తాటిమోవుకు పట్టియుం డెడు నూఁగుపూవు

బొంది. దే. శరీరము

బొందియ. దే. పొన్ను

బొందిలీలు. దే. ఒకజాతివాండ్రు

బొందు. దే. దారము, చొక్కా ముడివేసెడుసన్ననాడా, పుష్పసర్పము, వెన్నుఁదీయుంటకు యోగ్యముగాని వరిలోనగు నది

బొందుపోవు. దే. వరిలోనగునది వెన్నుఁదీయ యోగ్యము గాకపోవు

బొంబె. దే. అరఁటి ఊఁచ

బొంపిరి. దే. అతిశయము, పూర్ణము

బొక్క. దే. నోరునిండిన పొడియగు తిను బండము

బొక్క. త. బిలము, రంధ్రము, శవమును పూడ్చెడుపల్లము

బొక్కణము. త. సంచి

బొక్కనియ } త. గుఱ్ఱమునకు ఉలవలు పెట్టెడు బొక్కెన, నీళ్లు
బొక్కెన } చేఁదెడియినుపపాత్రము

బొక్కబెరడు. దే. సర్పవిశేషము

బొక్కలాఁడు. దే. సర్పము, కన్నగాఁడు

బొక్కసము. దే. అర్థభారము, భాండాగారము, కోశము

బొక్కి. దే. పండ్లులేనిది, మాంసములేనిది

బొక్కిస } దే. వస్త్రములుపెట్టెడుపెట్టె,
బొక్కిసా } చిన్నమూట

బొక్కు. దే. ఎదేనినోటినిండవేసికొనితిను, నిండిననోరు, బొక్క

బొక్కులాడు. దే. బొక్కు

బొక్కెన. దే. నీరుపిప్పలిచెట్టు

బొక్కెన. త. గుఱ్ఱమునకు ఉలవలు పెట్టెడుతోలుసంచి, నీళ్లెత్తి పోసెడుతోలుసంచి, నీళ్లు చేఁదెడి యినుపపాత్రము

బొగడ. దే. బుగడ, చూచుకము, మంచెపుఁగోడుశిఖరము, గండపట్టెమీఁదిగుబ్బ

బొగ్గు. దే. మండిచల్లారినకట్టెతునుక, కాళిక, అంగారము

బొచ్చె. దే కుండలోనగువానిపెంకు, తల పుఱ్ఱె, మీనభేదము

బొచ్చు. దే. రోమము, రోమసమూహము, ఉన్ని

బొజ్జేఁగు. దే. విటుఁడు

బోజెంగుబోటి. దే. విటకత్తె
బొజ్జ. దే. కడుపు
బొజ్జవాఁడు. దే. పెద్దకడుపువాఁడు
బొటనవ్రేలు
బొటమనవ్రేలు
బొటవ్రేలు } దే. పెద్దవ్రేలు, అంగుష్ఠము
బొటిమ. దే. మొటిమ, చిన్నపొక్కు
బొట్ట. దే. వెదురుబద్దలు లోనగు వానిచే నల్లినగాదె
బొట్టడి. దే. దొర్లించెడు నల్లతాయి
బొట్టనగోలలు. దే. బాలక్రీడావిశేషము
బొట్టనవ్రేలు. దే. బొటనవ్రేలు
బొట్టము. దే. గోఁచి
బొట్టవ్రేలు. దే. బొటవ్రేలు
బొట్టియ. దే. బాణముయొక్క చివరనుండు ములికి
బొట్టియ. త. కొడుకు, కూఁతురు
బొట్టియఁడు. త. కొడుకు
బొట్టు. త. తిలకము, బిందువు, జలాదిబిందువు, మంగళసూత్రమునందుగ్రుచ్చెడు స్వర్ణాభరణవిశేషము
బొట్టుగు. త. తిలకవృక్షము
బొట్టుదారము. దే. బొట్టును గ్రుచ్చెడు మంగళసూత్రము
బొట్టువు. త. బొట్టుగు
బొట్టె. త. కొడుకు, కూఁతురు
బొట్టెఁడు. త. బాలుఁడు
బొట్టెకోల. దే. తామరమొగ్గవంటిములికిగల బాణవిశేషము
బొడబొడ. దే. కాఱుటయందగు ధ్వన్యనుకరణము
బొడిగ. త. బాలకుఁడు
బొడిప. దే. చెట్లయందలి బుడిపి
బొడిమ. దే. పావకోళ్ళబిరడ
బొడియ. దే. రెండు సిద్దెలకువేసెడు పెన
బొడ్డ. దే. అత్తిచెట్టు
బొడ్డనబావి. దే. నడుమ పిల్లనూయిగల కోనేఱు
బొడ్డసరము. దే. పైరులో మొలచు ఒక దినుసు చిన్నచెట్టు
బొడ్డు. దే. నాభి, నూతిచుట్టు ఎత్తుగాపెట్టినగోడ
బొడ్డుఁజెవిక. దే. చుట్టుకొల్లారమునడిమి చొవడి
బొడ్డుపుడక. దే. ఒకదినుసు మ్రానికొఱముట్టు
బొణిగ. దే. సరకుతోనున్న చేతిసిద్దె
బొణిగలు. దే. పొట్టవీడిబద్దలుకానికాయధాన్యము, భక్ష్యవిశేషము
బొత్త. దే. తామ్రాదిపాత్రములబొంద
బొత్తి. దే. మడత, పొర
బొత్తిగ. త. మొదలంట, ఆమూలము
బొద. దే. తృణవిశేషము
బొది. దే. ఓడలుచేసెడుచోటు, ఓడలు బాగుచేయుటకు ఏటివంచను త్రవ్వు పెద్దగొయ్యి
బొద్ది. దే. ఒకదినుసుకూరాకు
బొద్దీఁక. దే. బరిసెపురుగు
బొద్దు. దే. గోడలు మొదలగువానిఅంచులయం దేర్పఱచెడు తదవయవవిశేషము, మోఁపు
బొద్దుకీటు. దే. గోడమీఁద బొద్దేర్పఱచి పెట్టెడుకీటు
బొద్దులు. దే. హస్తాభరణవిశేషము
బొనము. దే. మెఱుఁగు
బొప్పఁడు. దే. మూఢుఁడు
బొప్పి. త. పోటుచేత దేహమునందు ఉబ్బుగా లేచెడుబుడిపి, కదుము

బొబ్బ. దే. పొక్కు, కేక, సింహనాదము, పెద్దఅఱుపు
బొబ్బమెకము. దే. సింహము
బొబ్బర. దే. చెట్టుమీఁదిబరడు, సస్యవిశేషము
బొబ్బరలు. దే. కాయధాన్యవిశేషము
బొబ్బరించు. దే. బొబ్బవేయు, బొబ్బలు
బొబ్బరింత. దే. బొబ్బరించుట
బొబ్బలి. త. ఒకానొకచెట్టు, బర్బురము
బొబ్బాటము. దే. బొబ్బరింత
బొమ. దే. కనుబొమ, ప్రతిమ, బొమ్మ
బొమముడి. దే. కోపముచేత కలిగెడు బొమలముడి, భ్రుకుటి
బొమముడిపాటు. దే. బొమముడిపడుట
బొమిక. దే. ఎముక
బొమికము. దే. బొమ్మికము
బొమిడిక } దే. కిరీటము
బొమిడికము } దే. కిరీటము
బొమిడీకము } దే. కిరీటము
బొమ్మ. దే. కనుబొమ్మ, భ్రూవు, ప్రతిమ, బిరుదచిహ్నము, అవమానచిహ్నము, అల్పము
బొమ్మ. త. బ్రహ్మ
బొమ్మంచు. దే. ఎఱుపు, ఎఱ్ఱనిది, వస్త్రాంచలవిశేషము
బొమ్మఁడు, త. బ్రాహ్మణుఁడు
బొమ్మచారి. త. బ్రహ్మచారి, వడుగు
బొమ్మచెక్కు. త. అభిజిన్నక్షత్రము
బొమ్మజెముడు. త. సింహుండము
బొమ్మడాయ. దే. మీనభేదము
బొమ్మపెండ్లిండ్లు. దే. బాలికాక్రీడావిశేషము
బొమ్మముడి. దే. బొమముడి
బొమ్మమేడి. దే. కాకిమేడి
బొమ్మరము. త. బాలురాడుకొనుబొంగరము
బొమ్మరములు. దే. బాలక్రీడావిశేషము
బొమ్మరపోవు. దే. భ్రమించు
బొమ్మరాకాసి. త. బ్రహ్మరాక్షసి
బొమ్మరిల్లు. దే. బాలికలు బొమ్మల నుంచి కొనెడి చిన్నయిల్లు
బొమ్మఱాయి. దే. శిలావిశేషము
బొమ్మలాట. దే. బొమ్మనాడించెడు నాటకము
బొమ్మికము } దే. కిరీటము
బొమ్మిడీకము } దే. కిరీటము
బొమ్మిడికము } దే. కిరీటము
బొమ్మె. దే. మూర్ఖ
బొరిగ. దే. గడ్డిపెల్లగించెడుసాధనము
బొరుగులు } దే. పేలగింజెలు
బొరువులు } దే. పేలగింజెలు
బొరుసు. దే. కణిఁతి, వేఁపుడుచేట్టి
బొఱియ. దే. బిలము, పర్వతబిలము, గొయ్యి, లోపలిసీరింకిపోయి యెండిన నారికడపుబొండము
బొఱియచూలి. దే. వాల్మీకి
బొజ్జ. దే. బొజ్జకడుపు
బొజ్జజిట్ట. దే. బొల్లివిశేషము
బొఱ్ఱె. దే. బొఱియ
బొల్లఁడు. దే. బొల్లిగుఱ్ఱము
బొల్లి. దే. తెల్లనిది, తెల్లనివాఁడు, తెల్లనిపొడ
బొల్లికోడి. దే. జలకుక్కుటము
బొల్లిగ్రద్ద. దే. గరుత్మంతుఁడు
బొల్లితనము. దే. అవమానము, శరీరమందలితెలుపు
బొల్లిపూస. దే. ఇంద్రవల్లివృక్షము
బొల్లిమొముపులుఁగు. దే. గరుత్మంతుఁడు, బొల్లిగద్ద

బొల్లమోరమెకము. దే. భల్లాకము
బొల్లు. దే. అసత్యమాడు, అసత్యము
బొల్లులమారి. దే. అనృతమాడువాఁడు
బొసిక. దే. టెంకాయ మొదలగువాని పైతోలు
బొసుక. దే. బలిసినది, బలిసినవాఁడు
బొసుకు. దే. సిగ్గు
బొళుకుబొళుకు. దే. క్రక్కుట యందగు ధ్వన్యను కరణము

## బో

బోఁకి. దే. కుత్సితపాత్రము, కుండ, జేల గడుగుదోనె
బోఁకె. దే. ఎముక
బోఁటి. దే. వంటి, వంటివాఁడు
బోమ్మె. దే. మూర్ఖ
బోక్కాణము. స. గుఱ్ఱమునకు ఉలవలు పెట్టెడు బొక్కెన, బొక్కెన
బోగమాట. దే. బోగముదాని నృత్యము
బోగము. త. సుఖము, వెల, లంజెవెల
బోగముది. దే. వెలయాలు
బోగి. దే. సంక్రాంతిపండుగకు తొలిదినము
బోగి. త. భోగముగలవాఁడు,భోగముగలది
బోగు. దే. పూనికి
బోగుబడి. దే. దూఁబఱఁదిండి
బోటి. దే. ఆఁడుది, చెలికత్తె
బోటికత్తియ } దే. చెలికత్తె
బోటికత్తె }
బోటితనము. దే. జాణతనము
బోటు. త. కొండ మొదలగు వానియందు ఉబ్బగ్గానుండుచోటు, ప్రౌఢుఁడు, ధూర్తుఁడు
బోటుఁదనము. త. ధూర్తత్వము,జాణతనము
బోడ. దే. సన్యాసి, మ్రోడు, బోడిది, బోడి వాఁడు
బోడఁడు. దే. బోడివాఁడు
బోడతరము } దే. ఒకానొకచెట్టు
బోడసరము }
బోడలు. దే. కొమ్ములురానిపశువులు
బోడి. దే. ముండితము, ముండితుఁడు, తల గొఱిగించుకొన్నవిధవ
బోడించు. దే. బోడిచేయు
బోడింపు. దే. బోడించుట
బోడిక. దే. సేవకుఁడు, బాలకుఁడు
బోడు. దే. బోడియైనది, బోడ
బోణి. గ్రా. సరకును తొలుత రొక్కము నకు విక్రయించుట
బోద. త. పతిలోనగువానిపిల్ల
బోదన. త. దుర్బోధనము
బోదియ. దే. అడుగునుండి కొమ్మలమొదళ్ల పర్యంతముగల వృక్షభాగము, ప్రకాం డము, స్తంభముమీఁదిఅవయవవిశేషము
బోదు. దే. చేమురుసిద్దెలు మోసెడి యెద్దు గంత, గోనె
బోదె. దే. ప్రకాండము, పాదు, స్తంభము మీఁది అవయవవిశేషము, కాలువలేర్ప ఱచినకట్ట, మళ్లకు కట్టు కాలువ
బోదెకొయ్య. దే. గడపక్రిందికమ్మి
బోధకరుఁడు. స. వేకువను రాజులను నిద్ర మేల్కొలిపెడివాఁడు, వైతాళికుఁడు
బోధకుఁడు. స. ఉపాధ్యాయుఁడు, బోధిం చువాఁడు
బోధచేయు. దే. భోధించు, ఆలోచనచెప్పు
బోధనము. స. బోధించుట
బోధనీయము. స. బోధింపఁదగినది

బోధనుఁడు. స. బోధించువాఁడు
బోధపడు. దే. తెలియు, ఆకళింతకు వచ్చు
బోధము. స. తెలివి, జ్ఞానము
బోధి. స. రావిచెట్టు, బోధిద్రుమము
బోధించు. స. తెలియఁజేయు, కఱపు
బోధితుఁడు. స. బోధింపఁబడినవాఁడు
బోధిద్రుమము. స. రావిచెట్టు
బోధ్యము. స. బోధనీయము
బోనకత్తియ, బోనకత్తె } త. అన్నము చేసి పెట్టునది, దాసి
బోనకాఁడు. దే. అన్నము చేసిపెట్టువాఁడు
బోనపుట్టిక, బోనపుటిక } దే. భోజనపాత్రము, అన్నము, భక్ష్యములు మొదలగునవి యుంచుకొను బుట్టలోనగునవి
బోనము. త. భోజనము, అన్నము
బోనముకత్తె. త. బోనకత్తె
బోను. దే. మృగములు లోనగువానినిపట్టెడు కపటయంత్రము, పెంపుడుమృగము లుండుటకై చేట్టుకమ్ములమర్చి చేసిన ఒకవిధమైన పెట్టెమొదలగునవి
బోమ. దే. తిమ్మిరి
బోము. దే. బలాత్కారము
బోయ, బోయఁడు, బోయవాఁడు } దే. కిరాతుఁడు, కైవర్తుఁడు
బోయత. దే. బోయది, కిరాతస్త్రీ
బోయి, బోయీ, బోయీఁడు } దే. పల్లకిమోచువాఁడు, బెస్త
బోయెత. దే. బోయత
బోర. దే. ఱొమ్ము
బోరగించు. దే. బోరగిల్లఁజేయు
బోరగిల్లు, బోరగిలు } దే. ఱొమ్ముభూమినాను, ఱొమ్ము భూమినానఁబరుండు
బోరన. దే. శీఘ్రముగా
బోరప్రాఁకుడు. దే. పాము, ఉరగము
బోరిగము. దే. చీఁపురు
బోరు. దే. పెద్ద, వానకురియుటయందగు ధ్వన్యనుకరణము
బోరుక. దే. స్నానము
బోరుకలఁగు. దే. మ్రోఁగు, ధ్వనించు
బోరుకాడించు. దే. బోరుకాడఁజేయు
బోరుకాడు. దే. బిడ్డలుస్నానముచేయు
బోరుకొను. దే. మ్రోఁగు
బోరుకొలుపు. దే. బోరుకొనఁజేయు
బోరుతలుపులు. దే. నగరులోనగువానివాకిటి పెద్దఱెక్కతలుపులు
బోరుప. దే. ఒకదినుసుపెద్దగద్ద
బోరెము. దే. దూదిలోనగువానిమూట
బోర్కాడించు. దే. బోరుకాడించు
బోర్కాడు. దే. బోరుకాడు
బోర్తలుపులు. దే. బోరుతలుపులు
బోలము. స. బాలెంతబోళము
బోలు. దే. లోపలఏమియునులేనిది
బోలె. దే. ఓటికుండ, కుండబొచ్చె
బోలెము. దే. వేగము
బోసి. దే. పండ్లులేనిది, బొక్కి
బోసిపడు. దే. బోసిపోవు
బోసివాఁడు. దే. దంతహీనుఁడు
బోసిపోవు. దే. బోసియగు
బోసేయు. త. భుజించు
బోళము. త. గంధరసము

## బౌ

బౌద్ధమతము. స. ఒకానొకమతము
బౌద్ధులు. స. బుద్ధునిమతము నవలంబించువారు

## బ్ర

బ్రక్క. దే. పేదవాఁడు, దీనుఁడు, బక్క
బ్రతికించు. దే. పోషించు, ప్రాణములు కాపాడు
బ్రతుకు. దే. జీవించు, జీవనము, స్థితి
బ్రతుకుఁదెరువు. దే. జీవనోపాయము
బ్రదిమి. దే. జీవనము
బ్రదుకు. దే. బ్రతుకు
బ్రద్ద. దే. తునుక, చీలిక
బ్రద్ద. త. పేము
బ్రద్దపరి. దే. పేములతో నల్లిన కేడెము
బ్రద్దర. దే. తునుక, చీలిక
బ్రద్దలవారు. దే. వేత్రధరులు, బంట్రౌతులు
బ్రధ్నము. స. వేరు, బుధ్నము
బ్రధ్నుఁడు. స. సూర్యుఁడు, శివుఁడు
బ్రమయు. త. భ్రమించు
బ్రమరిదిరుగు } దే. చుట్టివచ్చు
బ్రమరివాఱు }
బ్రమ్మి. త. సోమెదచెట్టు
బ్రమ్మెత. త. బ్రహ్మహత్య
బ్రల్లు. దే. కూలుటయందగు ధ్వన్యనుకరణము
బ్రహ్మ. స. నలువ, విష్ణువు, బ్రాహ్మణుఁడు, ఒక బుత్విజుఁడు
బ్రహ్మఘాతకుఁడు. స. బ్రాహ్మణుని చంపువాఁడు
బ్రహ్మచర్యము. స. ఆశ్రమవిశేషము
బ్రహ్మచారి. స. బ్రహ్మచర్య వ్రతమునందుండువాఁడు
బ్రహ్మచారిణి. స. బ్రహ్మచర్యము ననుష్ఠించు స్త్రీ
బ్రహ్మజారుఁడు. స. బ్రాహ్మణస్త్రీయొక్క అంకుమగఁడు
బ్రహ్మణ్యము. స. గంగరావిచెట్టు, బ్రాహ్మణహితము
బ్రహ్మణ్యుఁడు. స. వేదమును చక్కఁగాఁ జదివినవాఁడు
బ్రహ్మదర్భ. స. ఒకదినుసు ఓమము
బ్రహ్మదారువు. స. గంగరావిచెట్టు
బ్రహ్మనాథుఁడు. స. విష్ణువు
బ్రహ్మనిష్ఠుఁడు. స. బ్రహ్మనిష్ఠగలవాఁడు
బ్రహ్మపుత్రము. స. ఉత్తర హిందూస్థానమందలి యొకనది, విష భేదము
బ్రహ్మపుత్రుఁడు. స. నారదుఁడు, సనకసనందనాదు లగుయోగులు
బ్రహ్మబంధువు. స. అబద్ధపుసాక్ష్యము పలికినందున నిందింపఁబడినవాఁడు, కర్మహీనుఁడైన బ్రాహ్మణుఁడు, దూఱఁబడువాఁడు
బ్రహ్మబిందువు. స. వేదపాఠమునందలినోటితుంపర
బ్రహ్మభూతుఁడు. స. బ్రహ్మత్వమును పొందినవాఁడు
బ్రహ్మభూయము. స. బ్రహ్మత్వము
బ్రహ్మమీమాంస. స. వేదాంతవిచారము
బ్రహ్మము. స. పరమాత్మ, వేదము, తపము, ఒకగ్రహయోగము
బ్రహ్మమేఖలము. స. బ్రహ్మచారులకుముంజిగా ఉపయోగింపఁబడు తృణవిశేషము
బ్రహ్మయజ్ఞము. స. వేదపాఠము, పితృతర్పణమునకుముందుచేయు నొకకర్మ

బ్రహ్మరంధ్రము. స. నడునెత్తి, మాడపట్టు

బ్రహ్మరథము, స. మృతిపొందిన సన్యాసులను తీసికొని పోయెడు వాహనము

బ్రహ్మరాక్షసుఁడు. స. బ్రహ్మరాక్షసి

బ్రహ్మలిపి. స. తలపుఱ్ఱెమీఁది వ్రాఁత, చిక్కుగా నుండువ్రాఁత

బ్రహ్మవర్చసము. స. సదాచారాధ్యయన సమృద్ధి

బ్రహ్మవాది. స. వేదాంతి

బ్రహ్మవిద్య. స. వేదాంతజ్ఞానము

బ్రహ్మవేళ. స. అరుణోదయకాలము

బ్రహ్మసాయుజ్యము. స. బ్రహ్మత్వము

బ్రహ్మసువు. స. మన్మథుఁడు

బ్రహ్మసూత్రము. స. యజ్ఞోపవీతము

బ్రహ్మసూత్రములు. స. ఒకవేదాంత గ్రంథము

బ్రహ్మస్తేయము. స. అక్రమముగా బ్రహ్మవిద్యను సంపాదించుట

బ్రహ్మహత్య. స. బ్రాహ్మణునిచంపుట, అందువలన కలిగినపాపము

బ్రహ్మాంజలి. స. వేదాధ్యయన కాలమందలి మ్రొక్కు

బ్రహ్మాండము. స. భూగోళఖగోళాదికము, గొప్పది

బ్రహ్మాణి. స. సరస్వతీదేవి, నలికండ్లపాము

బ్రహ్మానందము. స. మహాసంతోషము, దేవానందము

బ్రహ్మారణ్యము. స. వేదపారభూమి, మహారణ్యము

బ్రహ్మావర్తము. స. ఢిల్లీపట్టణమునకు వాయవ్యభాగమున నుండెడు దేశవిశేషము

బ్రహ్మాసనము. స. ధ్యానోపాయభూతమైన యాసనవిశేషము

# బ్రా

బ్రాఁతి. దే. ప్రేమ, అధికము, దుర్లభము, ప్రియము

బ్రామిక. త. భ్రమ

బ్రాహ్మణకుఁడు. స. అయోగ్యుఁడగు బ్రాహ్మణుఁడు, బ్రాహ్మణమాత్రుఁడు

బ్రాహ్మణబ్రువుఁడు. స. జాతిమాత్రోపజీవియైనబ్రాహ్మణుఁడు, కపటవిప్రుఁడు

బ్రాహ్మణము. స. బ్రాహ్మణసమూహము, వేదభాగము

బ్రాహ్మణయష్టిక. స. చిఱుతేఁకుచెట్టు, బారంగిచెట్టు

బ్రాహ్మణాయనుఁడు. స. విద్వాంసుఁడును సత్కర్మపరుఁడు నైన వంశకర్త వలనఁ బుట్టిన విప్రుఁడు

బ్రాహ్మణి. స. బ్రాహ్మణునిభార్య, నలికండ్లపాము, చిఱుతేఁకుచెట్టు

బ్రాహ్మణుఁడు. స. పాఱుఁడు

బ్రాహ్మణ్యము. స. బ్రాహ్మణసమూహము, బ్రాహ్మణభావము, బ్రాహ్మణకర్మము

బ్రాహ్మణ్యుఁడు. స. శని

బ్రాహ్మము. స. పెద్దవ్రేలి మొదట నుండెడు బ్రహ్మతీర్థము, విద్యయును నాచారమునుఁ గలవరుని దానే పిలిచి వధూసహితముగ వస్త్రాదులచే నలంకరించి పూజించి కన్య నిచ్చి చేయు వివాహము, బ్రహ్మసంబంధమైనది

బ్రాహ్మి. స. ఒకమాతృక, సరస్వతి, బాఁపనచీమ, పొన్నగంటికూర, బారంగి, సోమెదకూర

## బ్రు

బ్రుంగు. దే. ప్రూఁడు, మునుఁగు, మఱుఁగు, చేచ్చు

బ్రుంగుడు. దే. మఱిఁగినది, మునిఁగినది, చేచ్చుట

బ్రుంగుడువడు. దే. మఱుఁగుపడు

బ్రుంగుడుపఱుచు. దే. మఱుఁగుపఱుచు

బ్రుంగుడువాటు. దే. బ్రుంగుడువడుట

బ్రుంగువడు. దే. మగ్నమగు

బ్రుంచు. దే. బ్రుంగఁజేయు, ముంచు

బ్రుయ్యు. దే. నశించు

బ్రుషి, బ్రుసి. స. వ్రతులయాసనము

## భ

భ. ఒక అక్షరము

భంగ. స. జనపవిత్తులు

భంగత. స. అపజయము

భంగపడు. దే. అవమానపడు, ఓడిపోవు

భంగపాటు. దే. భంగపడుట, ఓటమి

భంగపెట్టు. దే. భంగపఱుచు

భంగము. స. చెఱుపు, అల, అవమానము, రోగము, ఓటమి, ఆటంకము, పగులుట, విఱుగుట, త్రుంచుట, వేఱు, భాగము, పడుట, నాశము, తప్పిపోవుట, నిరాకరించుట, పగులు, నిలుపుదల, పారిపోవుట, వంగుట, మోసము, కాలువ, జనుము

భంగి. స. విధము, భంగము, గంజాయి

భంగించు. స. భంగపఱుచు

భంగురము. స. నశించునది, వంకరైనది, నిలుకడలేనిది

భంగ్యము. స. జనుముపండుభూమి

భంజకము. స. విఱుచునది, చెడఁగొట్టునది

భంజనము. స. విఱుపు, చెడఁగొట్టుట

భంజళి, భంజళిక. స. పామువలె వంకరగాఁబోయెడి అశ్వగతివిశేషము

భంజించు. స. విఱుచు

భంజిక. స. చిఱుతేఁకుచెట్టు

భంటాకి. స. ములకచెట్టు

భండనము. స. యుద్ధము, దుశ్చేష్ట, కవచము

భండారము. స. బొక్కసము

భండించు. స. బండాటలాడు

భండీరము. స. దిరిసెనపుచెట్టు, చిట్టికూర

భండీరి. స. మంజిష్ఠి చెట్టు

భండుఁడు. స. దుశ్చేష్టుఁడు, ఆకతాయి

భంబు. స. నక్షత్రము, ఆకాశము, కిరణము

భంభరాలిక. స. దోమ

భక్తకంసము. స. కంచము

భక్తకారుఁడు. స. వంటవాఁడు

భక్తదాసుఁడు. స. అన్నమునకు కుదిరి పని చేయువాఁడు

భక్తము. స. అన్నము, భాగింపఁబడినది

భక్తవత్సలుఁడు. స. భక్తులయందు ప్రేమ గలవాఁడు, దేవుఁడు

భక్తి. స. భయముతోఁగూడిన స్నేహము, భాగము, సేవ

భక్తుఁడు. స. భక్తిగలవాఁడు

భక్తోపసాధకుఁడు. స. వంటవాఁడు

భక్షకుఁడు. స. తిండిపోతు

భక్షణము. స. భక్షించుట, తిండి

భక్షణీయము. స. భక్ష్యము, తినఁదగినది

భక్షించు. స. భక్షణముచేయు, తిను

భక్షితము. స. భక్షింపఁబడినది

భక్ష్యకారుఁడు, భక్ష్యంకారుఁడు. స. పిండివంటలు చేయువాఁడు

భక్ష్యము. స. తినుబండము, తినఁదగినది
భగందరము. స. మర్మస్థానమునందలివ్రణము
భగణము. స. నక్షత్రసమూహము, వృత్తముయొక్క చుట్టుకొలత
భగము. స. శ్రీ, వీర్యము, ఇచ్ఛ, జ్ఞానము, వైరాగ్యము, కీర్తి, మాహాత్మ్యము, ఐశ్వర్యము, యత్నము, ధర్మము, మోక్షము, యోని, సౌఖ్యము, సౌందర్యము, ప్రేమ, సరసము, నీతి, నిస్పృహ, బలము, అణిమాదిసిద్ధి, ఉత్తరఫల్గునీ నక్షత్రము
భగవంతుఁడు, భగవానుఁడు } స. విష్ణువు, శివుఁడు, దేవుఁడు, బుద్ధదేవుఁడు, పూజ్యుఁడు
భగవతి. స. సరస్వతి, పార్వతి, గంగ. పూజ్యురాలు
భగవద్గీత. స. ఒకవేదాంతగ్రంథము
భగిని. స. తోఁడఁబుట్టినది, అదృష్టవంతురాలు
భగినిక. స. కడపటిచెల్లెలు
భగినీయుఁడు. స. తోఁడఁబుట్టినదానికొడుకు
భగుఁడు. స. ద్వాదశాదిత్యులలో నొకఁడు
భగ్గరి. స. భగ్గుమని మండిపడునది
భగ్నము. స. భంగము నొందినది
భజనము. స. సేవించుట, భాగించుట
భజమానము. స. సేవించునది, భాగించునది న్యాయముతోఁ గూడినది
భజించు. స. సేవించు, భాగించు
భజిష్యము. స. సేవింపఁ దగినది, భాగింపఁ దగినది
[illegible]టము. స. దినముయొక్క పదునేనవ భాగము
భటిత్రము. స. ఇనుపసలాకకుగ్రుచ్చికాల్చినది, కఱకుట్లులోనగునవి
భటుఁడు. స. కాలిబంటు, పనివాఁడు
భట్టారకుఁడు. స. సూర్యుఁడు, మునినాట్యపరిభాషయందు రాజు
భట్టారిక. స. గౌరవమైనస్త్రీ, కులదేవత
భట్టిని. స. బ్రాహ్మణుని పెండ్లాము, నాట్యపరిభాషయందు రాజు పెండ్లాము
భట్టు, భట్రాజు } బట్టువాఁడు
భట్టుఁడు. స. బట్టువాఁడు
భణనీయము. స. చెప్పఁదగినది
భద్ర. స. తిథివిశేషము. కృష్ణుని అష్టమహిషులలో నొకతె, గంగానది
భద్రంకరుఁడు. స. ఐశ్వర్యము నిచ్చువాఁడు
భద్రకాళి. స. పార్వతి
భద్రకుంభము. స. రాజద్వారమునందుంచిన జలపూర్ణమైన స్వర్ణకలశము
భద్రదారువు. స. దేవదారువృక్షము
భద్రపర్ణి. స. గుమ్ముడుమొక్క
భద్రబల. స. గోంతెమగోరుచెట్టు
భద్రము. స. శుభము, బంగారు, ఒకకరణము, నాగముస్తె, గజజాతివిశేషము, ఎద్దు, కాటుకపిట్ట, శుభకరము, శ్రేష్ఠము
భద్రయవము. స. కొడిసెకాయ
భద్రశ్రీ. స. చందనము, గంధము
భద్రసురము. స. చేతికటారి
భద్రాకరణము. స. క్షౌరము
భద్రాసనము. స. రాజుకూర్చుండుపీఠము
భద్రుఁడు. స. వీరభద్రుఁడు, పురుషజాతి విశేషము

భము. స. నక్షత్రము, ఆకాశము
భయంకరము. స. భయమును పుట్టించునది
భయము. స. వెఱపు, వెఱపుపుట్టించేనది
భయానకము. స. నవరసములలో నొకటి, పులి, రాహువు
భయావహము. స. భయమును గలుగఁ జేయునది
భయోత్పాతము. స. భయమునుకలిగించునది
భరటుఁడు. స. కూలివాఁడు, కుమ్మరవాఁడు
భరణము. స. భరించుట, కూలి, జీతము, అనాథస్త్రీలకు జీవనార్థమై ఇయ్యఁబడు సొమ్ము
భరణి. స. ఒకనక్షత్రము, భూమి
భరణ్యము. స. కూలి, జీతము
భరతంపుటొజ్జ. దే. నాట్యశాస్త్రోపాధ్యాయుఁడు
భరతశాస్త్రము. స. నాట్యశాస్త్రము
భరతుఁడు. స. ఒకానొకరాజు, శ్రీరాముల వారితమ్ముఁడు, మేళముకట్టి జీవించెడి వాఁడు
భరద్వాజము. స. ఏట్రింతపక్షి
భరద్వాజుఁడు. స. ఒకముని, ద్రోణాచార్యుఁడు
భరపడు. స. భారమువహించు
భరము. స. అతిశయము, బరువు, బారువ
భరించు స. మోచు, ప్రోచు, సహించు, పెట్టుకొను
భరితము. స. నిండింపఁబడినది,భరింపఁబడినది
భర్గుఁడు. స. శివుఁడు, ముక్కంటి
భర్జనము. స. వేఁచుట, భృష్టి [పడు
భర్జించు. స. భర్జనముచేయు, వేఁచు, సరి
భర్త. స. మగఁడు, మోచువాఁడు, ప్రోచువాఁడు, ప్రభువు
భర్తృదారకుఁడు. స. నాట్యపరిభాషయందు యువరాజు
భర్తృదారిక. స. నాట్యపరిభాషయందు రాజకూఁతురు
భర్తృమతి. స. భర్త బ్రతికియున్నస్త్రీ
భర్త్సకుఁడు. స. బెదరించువాఁడు
భర్త్సనము. స. బెదరింపుమాట, బెదరించుట
భర్మము. స. బంగారు, జీతము, కూలి
భల్లము. స. బల్లెము, ఎలుఁగుబంటి, బాణము
భల్లాతకి. స. జీడిచెట్టు
భల్లుంగము. స. గట్టివెదురుమొక్క
భల్లుకము } స. ఎలుఁగుబంటి, కోఁతి
భల్లూకము }
భవంతి. స. పుణ్యాత్మురాలు, పుణ్యస్వభావముగల భార్య
భవదీయము. స. నీది
భవనము. స. అగుట, ఇల్లు, స్థానము
భవనీయము } స. కానున్నది
భవితవ్యము }
భవభంగము. స. జన్మరాహిత్యము
భవము. స. పుట్టుక, సంసారము, సత్త, ప్రపంచము
భవాదృశుఁడు. స. నీవంటివాఁడు
భవాని. స. పార్వతి
భవికము. స. శుభము, మేలు
భవిత. స. కాఁగల స్వభావముగలవాఁడు
భవితవ్యము. స. భాగ్యము, శుభము, కాఁదగినది
భవిష్ణువు. స. కాఁగలస్వభావముగలవాఁడు
భవిష్యత్తు. స. కాఁగలది
భవిష్యము. స. భాగ్యము, శుభము, కాఁగలది
భవుఁడు. స. శివుఁడు, వ్రాత్యుఁడు
భవుకము. స. శుభము
భవ్య. స. పార్వతి, గజపిప్పలి

భవ్యము. స. శుభము, ఎముక, శుభమైనది, యోగ్యమైనది, కాఁగలది
భషకము. స. కుక్క
భషణము } భషితము } స. కుక్కయొక్క మొఱుఁగు
భసలము. స. తుమ్మెద
భసితము. స. బూడిద, బూడిదవర్ణము
భస్త్ర } భస్త్రి } స. కొలిమితిత్తి, తోలుసంచి
భస్త్రిక. స. చిన్నసంచి
భస్త్రికము. స. ఏటిలోవేసికొని యీఁదెడు తోలుసంచి
భస్త్రికుఁడు. స. కొలిమితిత్తి ఊఁదువాఁడు
భస్మకారుఁడు. స. చాకలవాఁడు
భస్మగంధిని. స. రేణుకయనుగంధద్రవ్యము
భస్మగర్భ. స. ఇరుగుడుచెట్టు
భస్మము. స ఏదైనను కాలితెల్లగానైన పొడి, బూది, విభూతి
భస్మీకరించు. స. భస్మముచేయు
భళా, భళి, భళిర, భళీ } స. బళా, ప్రశంసనార్థకము

## భా

భా. స. సూర్యునివెలుఁగు, కిరణము
భాంగీనము. స. జనుముపండెడుపొలము
భాండము. స. తొడవు, గుఱ్ఱపుఁదొడవు, కుండ మొదలగుమట్టిపాత్రము, వస్తువు, మొదలిసొమ్ము
భాండాగారము. స. ధనముండుచోటు, బొక్కసము, ఉగ్రాణపుకొట్టు
భాండాగారికుఁడు. స. కోశగృహాధ్యక్షుఁడు
భాండారము. స. సామగ్రులుంచుకొట్టు
భాండి. స. మంజిష్ఠిచెట్టు, మంగలివాని అడపము
భాండికుఁడు. స. మంగలి
భాండీరము. స. ఒకదినుసు మఱ్ఱిచెట్టు
భాక్తికుఁడు. స. ఒకని ననుసరించియుండు వాఁడు
భాగధేయము. స. భాగ్యము, కప్పము, బలి, భాగము
భాగము. స. పాలు, భాగ్యము, ప్రక్క, భాగలబ్ధమైనభూమి
భాగరి. స. పాలివాఁడు, భాగమును తీసికొనువాఁడు
భాగవతము. స. కృష్ణుని చరిత్రముగల గొప్పగ్రంథము, ఒక నాటకము
భాగవతుఁడు. స. దైవభక్తుఁడు
భాగహారము. స. భాగించుట, పంచిపెట్టుట
భాగించు. స. భాగముచేయు, పంచు
భాగితము. స. భాగములుగఁ జేయఁబడినది
భాగినేయి. స. మేనకోడలు
భాగినేయుఁడు. స. తోడఁబుట్టినదానికొడుకు, మేనల్లుఁడు
భాగీరథి. స. గంగ, మిన్నేఱు
భాగ్యము. స. అదృష్టము, సుకృతము, భాగింపఁదగినది, ధనము, సౌఖ్యము
భాగ్యవంతుఁడు. స. అదృష్టవంతుఁడు, ధనవంతుఁడు
భాజనత. స. పాత్రత
భాజనము. స. పాత్రము, యోగ్యము, విస్తరి, స్థానము
భాజ్యము. స. భాగింపఁదగినది, భాగము
భాటకము. స. బాడిగ, అవక్రయము, అద్దె, విభాజ్యము
భాణము. స. నాటకభేదము

భాతము. స. ప్రకాశమైనది, ఉదయము
భాతి. స. కాంతి, విధము, వలె
భాద్రపద. స. ఉత్తరభద్రపదానక్షత్రము
భాద్రపదము. స. భాద్రపదమాసము
భాద్రమాతురుఁడు. స. మంచితల్లికొడుకు
భానము. స. కనఁబడుట, ప్రకాశించుట
భానుఁడు. స. సూర్యుఁడు
భానుమంతుఁడు. స. సూర్యుఁడు, కిరణము గలవాఁడు
భానువు. స. సూర్యకిరణము, సూర్యుఁడు
భామ. స. స్త్రీ
భామము. స. కోపము, సూర్యకిరణము
భామిని. స. క్రీడాసమయమునందుకోపము చూపెడు ఆఁడుది, స్త్రీ
భాముఁడు. స. సూర్యుఁడు
భారకము. స. ముమ్మరము, బరువు
భారకర్త. స. భారమును వహించువాఁడు
భారకుఁడు. స. బరువు మోసెడి కూలివాఁడు
భారతము. స. వ్యాసప్రోక్తమైన ఐదవ వేదము, ఆంధ్రభారతము, హిమవత్పర్వతమునకును దక్షిణసముద్రమునకును నడుమనున్న దేశము అనఁగా హిందూదేశము
భారతి. స. సరస్వతి, ఒకకావ్యవృత్తి, వాక్కు
భారతుఁడు. స. నట్టువుఁడు
భారద్వాజము. స. ఏట్రింతపక్షి
భారద్వాజి. స. అడవిప్రత్తిచెట్టు
భారము. స. బరువు, బారువ
భారయష్టి. స. కావడిబద్ద
భారవాహుఁడు. స. బరువుమోసెడువాఁడు
భారీ. గ్రా. గొప్ప, పొడుగు
భారూపము. స. ఆత్మ, పరబ్రహ్మము
భారోపజీవి. స. బరువుమోసిజీవించువాఁడు
భార్గవి. స. లక్ష్మి, పార్వతి, గఱికగడ్డి
భార్గవుఁడు. స. శుక్రుఁడు, పరశురాముఁడు
భార్గి. స. బారంగిచెట్టు
భార్య. స. అగ్నిసాక్షిగ పెండ్లాడిన పెండ్లాము, పత్ని
భార్యాజితుఁడు, భార్యాటికుఁడు } స. పెండ్లాముమాట జవదాఁటనివాఁడు
భార్యాటుఁడు. స. తనభార్యయొక్క జారత్వమువలన జీవించువాఁడు
భాలము. స. ఫాలము, వెలుతురు
భాలూకము. స. భల్లుకము
భావ. స. ఒకసంవత్సరము
భావగర్భము. స. రహస్యార్థము
భావజుఁడు. స. మన్మథుఁడు, తలఁపుచూలి
భావన, భావనము } స. కలుగఁజేయుట, కారణము, వృద్ధిచేయుట, తలంపు, భక్తి, ధ్యానము, ఏర్పాటుచేయుట, జ్ఞాపకము, ఋజువు, వాసనకట్టుట, పండ్లరసము మొదలగువానియందు మందు దినుసులను నానవేయుట
భావము. స. సత్తు, అభిప్రాయము, మనోవికారము, ఆత్మ, పుట్టుక, ధాత్వర్థరూపక్రియ, స్వభావము, రత్యాది, అర్థకారణము, వస్తువు, ఉనికి, అగుట, కలుగుట, స్థితి, పద్ధతి, భక్తి, నిష్కపటము, తలంపు, ప్రేమ, సారము, నిశ్చయము, హృదయము, ధ్యానము, మోహాభినయము, ప్రపంచము, జ్ఞానేంద్రియము, జాతకములోని 12 గృహములు

భావి. స. కాఁగలది, భవిష్యత్తు
భావించు. స. ఎంచు, తలఁచు
భావితము. స. పొందఁబడినది, కర్పూరాదుల చేత వాసనకట్టఁబడినది, తలఁపఁబడినది
భావిత్వము. స. అగత్యము
భావిని. స. భావముగల ఆఁడుది, స్త్రీ
భావుకము. స. శుభము, మంగళము
భావుకుఁడు. స. తోఁడఁబుట్టినదాని మగఁడు, బావమఱఁది
భావ్యము. స. అవశ్యము కాఁదగినది
భావ్యుఁడు. స. తలఁపఁబడువాఁడు
భాష. స. తెలుఁగు మొదలగునది, మాట, ప్రతిజ్ఞ, ప్రమాణము
భాషణము. స. మాటాడుట
భాషాంతరము. స. ఒకభాషలోనిసంగతి మఱియొకభాషలో వ్రాయుటయు పలుకుటయు
భాషించు. స. మాటాడు
భాషికము. స. భాషసంబంధమగునది
భాషితము. స. మాట, మాటాడినది, భాష
భాష్యము. స. సూత్రవ్యాఖ్యానగ్రంథము, మాటాడఁదగినది
భాసంతము. స. గంపపులుఁగు, చేక్కునిది
భాసమానము స. ప్రకాశించుచున్నది
భాసము. స. కాంతి, కోడి, గ్రద్ద
భాసిల్లు. స. ప్రకాశించు
భాసురము. స. పటికపుఱాయి, ప్రకాశించునది
భాస్కరుఁడు. స. సూర్యుఁడు, అగ్ని
భాస్వంతము. స. ప్రకాశము
భాస్వంతుఁడు. స. సూర్యుఁడు, ప్రకాశించువాఁడు
భాస్వరత. స. ప్రకాశము
భాస్వరము. స. గాలిలో నుండిపోవునట్టి యొకానొక మందుదినుసు, ప్రకాశమానమయినది
భాస్వరుఁడు. స. సూర్యుఁడు, ప్రకాశించువాఁడు

## భి

భిండిపాలము, భిండివాలము, భిందిపాలము } స. ఇనుప యలుఁగుగల యొక్కయాయుధము
భిక్ష, భిక్షము } స. బిచ్చెము, బిచ్చె మెత్తిన వస్తువు, కూలి, సేవ
భిక్షణము. స. యాచించుట, భిక్ష మెత్తుట
భిక్షాటనము. స. బిచ్చెముకొఱకుఁదిరుగుట
భిక్షాశి, భిక్షోపజీవి } స. బిచ్చమెత్తితినువాఁడు, యాచకుఁడు
భిక్షించు. స. భిక్ష మెత్తు
భిక్షితము. స. యాచింపఁబడినది
భిక్షుకుఁడు. స. భిక్ష మెత్తుకొని జీవించెడు సన్న్యాసి, భిక్షగాఁడు
భిక్షువు. స. బ్రహ్మచారి, సన్న్యాసి, బిచ్చెగాఁడు
భిత్తము. స. ఖండము, తునుక
భిత్తి. స. ఛేదనము, గోడ
భిత్తిక. స. పిడుగు, గోడ
భిద. స. భేదము, భేదనము, భేదోపాయము
భిదువు, భిదురము } స. వజ్రాయుధము, జాతివాలు
భిదేలిమము. స. తునుకలై పోఁదగినది
భిన్నము. స. పగిలినది, చీలినది, వేఱుపడినది, గణిత భేదము
భిన్నవృత్తుఁడు. స. దుష్టప్రవర్తకుఁడు
భిన్ని. స. గాయము
భిన్నోదరులు. స. వేఱుతల్లికిఁబుట్టినసోదరులు

భిల్లుఁడు. స. బోయవాఁడు, చెంచువాఁడు
భిషక్కు. స. చికిత్సకుఁడు, వైద్యుఁడు
భిషక్పాశుఁడు. స. వైద్యము చక్కఁగాఁ దెలియనివాఁడు
భిషజుఁడు. స. వైద్యుఁడు
భిస్స. స. అన్నము, వంటకము
భిస్సట. స. మాఁడన్నము

## భీ

భీ. స. భయము
భీకరము. స. భయంకరము
భీతము. స. వెఱపు, వెఱచినది
భీతి. స. వెఱపు, వడఁకు
భీతిల్లు. స. భయపడు, వెఱచు
భీతుఁడు. స. భయపడినవాఁడు
భీమము. స. భయానకరసము, భయంకరము
భీమసేనుఁడు. స. భీముఁడు
భీముఁడు. స. ధర్మరాజుతమ్ముఁడు,ఒకరాజు, భయంకరుఁడు, శివుఁడు
భీరుకుఁడు, భీరుఁడు } స. భయపడెడువాఁడు.
భీరువు. స. భయపడుస్త్రీ, ఆఁడుది, పిల్లపీఁచరమొక్క, వెఱపరి
భీలుకుఁడు. స. భీరుకుఁడు
భీషణము, భీష్మము } స. భయంకరము, భయానకరసము
భీష్మసువు. స. గంగానది
భీష్మించు. స. పట్టుపట్టుకొని యుండు, కోపగించుకొని యుండు
భీష్ముఁడు. స. శాంతనవుఁడు, భయంకరుఁడు

## భు

భుక్కనము. స. కుక్కమొఱుగుట
భుక్తము. స. భుజింపఁబడినది, అనుభవింపఁబడినది
భుక్తి. స. భోజనము, అనుభవము,ఆహారము తినుట, ఒక గ్రహముయొక్క దినచారము, మేర
భుగులుకొను. దే. వ్యాపించు
భుగులుపుచ్చు. దే. రవ్వపెట్టు
భుగ్నము. స. వంగినది,విఱిగినది,వంకరైనది
భుజ. స. హంసపాదమనుగుఱుతు
భుజంగభుక్కు. స. నెమిలి
భుజంగమము, భుజంగము } స. పాము
భుజంగాక్షి. స. సర్పాక్షిచెట్టు
భుజంగిక. స. ఆఁడుపాము, విటురాలు
భుజంగుఁడు. స. విటుఁడు
భుజకీర్తి. స. బాహుపురి
భుజగము, భుజగమము } స. పాము
భుజగాశనుఁడు. స. గరుత్మంతుఁడు
భుజపత్రము. స. బుజెపత్తిరిచెట్టు
భుజము, భుజ } స. చేయి, బాహువు
భుజశిరము, భుజశిరస్సు } స. మూఁపు, అంసము
భుజాంతరము. స. ఱొమ్ము
భుజించు. స. తిను, అనుభవించు
భుజిష్య. స. పరిచారిక, వేశ్య
భుజిష్యము. స. చేతకట్టుకొనెడు తోరము
భుజిష్యుఁడు. స. పరిచారకుఁడు, స్వతంత్రుఁడు
భువనము. స. జగము, ఉదకము, ఆకాశము

భువనేశ్వరము. స. గృహవిశేషము, చుట్టు బవంతి, విగ్రహాముసుంచేపెట్టె
భువనేశ్వరి. స. పార్వతి
భువి. స. భూమి, స్థానము

## భూ

భూకంపము. స. భూమికదలుట
భూకదంబము. స. నేలకడిమిచెట్టు
భూకము. స. బొక్క, కాలము
భూగృహము. స. నేలమాలియ
భూచక్రము. స. భూమి, వృక్షవిశేషము
భూచ్ఛాయ. స. భూమియొక్క నీడ, చీకటి
భూజము. స. వృక్షము, పుడమిపుట్టు
భూజాని. స. విష్ణువు, రాజు
భూతకాలము. స. కడచినకాలము
భూతకేశము. స. మరులుజెడచెట్టు, జటామాంసి
భూతదయ. స. సకలజీవులయందలి కరుణ
భూతదర్పణము. స. చిన్నవస్తువును పెద్దదిగాc గాన్పింపcజేయునద్దము
భూతధాత్రి. స. భూమి
భూతము. స. పృథివ్యాది, పిశాచాది, ప్రాణి, దేవయోనివిశేషము, కృష్ణచతుర్దశి, తగినది, నిక్కువమైనది, కడచినది, పొందcబడినది
భూతయజ్ఞము. స. భూతబలి
భూతలము. స. భూమి
భూతవేశి. స. తెల్లవావిలిచెట్టు
భూతవైద్యుcడు. స. దయ్యములను పాఱcదోలువాcడు
భూతసంప్లవము. స. యుగాంతప్రళయము
భూతాత్మము. స. దేహము
భూతాత్ముcడు. స. బ్రహ్మ
భూతావాసము. స. తాండ్రచెట్టు
భూతి. స. ఐశ్వర్యము, సంపద, భస్మము, సత్త, పుట్టుక
భూతికము. స. ఓమము, కర్పూరము, కామంచికసవు, చీcపురుకసవు, నేలవేముచెట్టు
భూతికాలము. స. అదృష్టకాలము
భూతిలకము. స. ఒకదినుసుపట్టు
భూతుcడు. స. కొడుకు
భూతులసి. స. నేలతొళసిచెట్టు
భూతేశుcడు. స. శివుcడు, బూచులఱేcడు
భూదారము. స. పంది
భూదేవి. స. భూమి
భూదేవుcడు. స. బ్రాహ్మణుcడు, నేలవేలుపు
భూధరము. స. పర్వతము, నేలతాలుపు
భూనింబము. స. నేలవేముచెట్టు
భూపతి. స. రాజు
భూపది. స. మల్లెచెట్టు
భూపాటలి. స. నేలకలిగొట్టుచెట్టు
భూపాలము. స. రాగవిశేషము
భూపుcడు. స. రాజు
భూపురము. స. జాలవిద్యయం దుపయోగించు నొకయంత్రము, ముగ్గు
భూపూగము. స. తోcటపోcకచెట్టు
భూబదరి. స. నేలరేcగుచెట్టు
భూభుజుcడు. స. రాజు
భూభృత్తు. స. కొండ, రాజు
భూమి. స. నేల, చోటు, ప్రపంచము, దేశము, స్థానము, భూవశలి, వైఖరి, అంశము, పరిమితి

భూమిక. స. మాఱువేషము, రచన, ప్రదేశము, నాట్యసిద్ధవేషము

భూమికర్కారువు. స. నేలగుమ్మడిచెట్టు

భూమిచంపకము. స. నేలసంపెఁగచెట్టు

భూమిజ. స. సీత

భూమిజంబుక. స. కాకినేరేడుచెట్టు

భూమిజుఁడు. స. అంగారకుఁడు, నరకాసురుఁడు

భూమిలాభము. స. మరణము

భూమిలేపనము. స. ఆవుపేఁడ

భూమివర్ధనము. స. శవము

భూమిస్పృశుఁడు. స. కోమటి, మనుష్యుఁడు

భూమ్యామలకి. స. నేలయుసిరికచెట్టు

భూయస్సు }
భూయిష్ఠము } స. అధికము, మిక్కుటము

భూరి. స. బంగారు, అధికము, ఒకలెక్క

భూరిఫేన. స. సంబరేనుచెట్టు

భూరిమాయము }
భూరిమాయువు } స. నక్క

భూరిరంధ్రము. స. అట్టు

భూరుండి. స. గురుగుచెట్టు

భూరుహము. స. వృక్షము, పుడమిపుట్టు

భూర్జము. స. బుజేపత్తిరిచెట్టు

భూవరుఁడు. స. రాజు

భూషణ }
భూషణము } స. అలంకరణము, తొడవు, స్తుతి

భూషించు. స. స్తుతించు

భూషితుఁడు. స. అలంకరింపఁబడినవాఁడు, స్తోత్రము చేయఁబడినవాఁడు

భూష్ణువు. స. కాఁగలస్వభావముగలవాఁడు

భూసురుఁడు. స. బ్రాహ్మణుఁడు, నేలవేలుపు

భూస్తృణము. స. చిప్పకసవుమొక్క

భూస్వాస్థ్యము. స. భూమి మొదలగు నాస్తి

## భృ

భృంగము. స. లవంగపుఁజెట్టు, తుమ్మెద, గుంటగలగర

భృంగరాజము. స. గుంటగలిజేరు, గండుతుమ్మెద

భృంగారము. స. గుంటగలిజేరు, బంగారుగిండి

భృంగారి. స. చిమ్మటపురుగు

భృంగి. స. అతివస, భృంగీశ్వరుఁడు, భృంగిరిటుఁడు

భృంగిక. స. భ్రమరము

భృంగుఁడు. స. విటుఁడు

భృగువు. స. కొండచేఱియ, ఒకముని, శుక్రుఁడు, శివుఁడు

భృతకుఁడు. స. కూలివాఁడు

భృతము. స. భరింపఁబడినది, నింపఁబడినది

భృతాధ్యాపకుఁడు. స. జీతముతీసికొని చదువుచెప్పువాఁడు

భృతాధ్యాపితుఁడు. స. జీతమిచ్చి చదువుకొనువాఁడు

భృతి. స. మోచుట, కూలి, వెల

భృతిభుక్కు }
భృతిభుజుఁడు } స. కూలివాఁడు

భృతిరూపము. స. కూలికి బదులుగానిచ్చు బహుమానము

భృత్య. స. కూలి

భృత్యుఁడు. స. పనివాఁడు, బంటు

భృశము. స. అధికము

భృష్టము. స. వేఁచఁబడినది

భృష్టాన్నము. స. వండి వేఁచఁబడినయన్నము

భృష్టి. స. వేఁపుడు, పాడడవి

## భే

భేకము. స. కప్ప, మేఘము

భేకి. స. ఆఁడుకప్ప, వర్షాభ్వి

భేదకుఁడు. స. భేదించువాఁడు
భేదనము. స. భేదించుట, పుల్లబచ్చెలి మొక్క
భేదము. స. భేదనము, వేఱిమి, విశేషము, ఒకఉపాయము, వైమనస్యము
భేది. స. విరేచనము, భేదించేనది
భేదించే. స. భేదిల్లఁజేయు
భేదితము. స. భేదింపఁబడినది
భేద్యము. స. భేదింపఁదగినది
భేదిల్లు. స. వేఱగు, చీలు
భేరి. స. వాద్యవిశేషము, దుందుభి
భేరుండకము. స. నక్క
భేరుండము. స. పక్షివిశేషము,భయంకరము
భేరుఁడు } స. మూర్ఖుఁడు, పిఱికి, చలించేవాఁడు
భేలుఁడు }
భేషజము. స. ఔషధము, మందు
భేషజాంగము. స. మందుతీసికొన్న తర్వాత పుచ్చుకొనువస్తువు
భేషజ్యము } స. రోగమును కుదుర్చు గుణముగల వస్తువు
భైషజ్యము }

## భై

భైక్షము. స. భిక్షాసమూహము
భైరవము. స. భయంకరమైనది, చీఁకటి
భైరవి. స. పార్వతి, రాగవిశేషము
భైరవుఁడు. స. శివుఁడు, భయంకరుఁడు
భైషజ్యము. స. ఔషధము, మందు

## భో

భోక్త. స. భుజించేవాఁడు, అనుభవించేవాఁడు
భోక్తవ్యము. స. భుజింపఁదగినది
భోక్తృత్వము. స. అనుభవము కలిగియుండుట, అనుభవించేట
భోగగృహము. స. పడకిల్లు
భోగదేహము. స. మరణానంతరము సుఖదుఃఖములననుభవించే సూక్ష్మదేహము
భోగపిశాచిక. స. ఆఁకలి
భోగభూమి. స. యోని
భోగమంటపము. స. కల్యాణమంటపము
భోగము. స. సుఖము, భోజనము, పాము యొక్క శరీరము, ధనము, వేశ్యాదుల కిచ్చేడువెల, పంట, అనుభవము, పాము పడగ, పూజ
భోగవతి. స. పాతాళము, పాతాళమునందలియేఱు, భోగముగలది, శేషసర్ప పట్టణము
భోగస్త్రీ. స. ఉంచుకొన్నస్త్రీ, వేశ్య
భోగాశిపత్రి. స. గరుత్మంతుఁడు
భోగి. స. పాము, రాజు, మంగలి, అనుభవశాలియగు పురుషుఁడు, సుకవాసి, పండుగ తొలినాఁడు
భోగించే. స. సుఖించే, అనుభవించే, పొందు
భోగిని. స. ఆఁడుఁబాము, భోగముది, పట్టాభిషిక్తురాలుకానిరాజుభార్య
భోగ్యత. స. రుచి
భోగ్యము. స. ధనము, ధాన్యము, భోగింపఁదగినది
భోజనము. స. ఆహారము, కుడుపు, తినుట
భోజనాధికారము. స. భోజనపదార్థముల మీఁదియధికారము
భోజనీయము. స. తినఁదగినది, అనుభవింపఁదగినది
భోజయితవ్యము. స. భుజింపఁజేయఁదగినది

భోజ్యము. స. భుజింపఁదగినది, ఆహారము
భోరు. స. గొప్పధ్వని
భోరుకొను. దే. మిక్కిలి ధ్వనిచేయు
భోషాణము. దే. పెద్దపెట్టె

## భౌ

భౌతికము. స. ముత్తెము, భూతసంబంధమైనది
భౌమరత్నము. స. పగడము
భౌమికము. స. భూమిమీఁద జీవించు జంతువు, భూమిసంబంధమైనది
భౌముఁడు. స. అంగారకుఁడు, నరకాసురుఁడు, భూమియందుఁబుట్టినవాఁడు
భౌరికుఁడు. స. బంగారునాణెపుబండారమున కధికారి

## భ్ర

భ్రంశము. స. చలించుట, జాఱుట, పడుట
భ్రకుంసుఁడు. స. స్త్రీవేషము వేసికొనియాడెడు పురుషుఁడు
భ్రకుటి. స. భ్రుకుటి
భ్రక్షము. స. తనతప్పును మఱుఁగుపుచ్చుట
భ్రమణము. స. తిరుగుడు, తుమ్మెద
భ్రమపడు. దే. పొరపాటుపడు
భ్రమప్రమాదము. స. పొరపాటు, తప్పు
భ్రమము. స. భ్రాంతి, తిరుగుడు, బండికంటితిరుగుడు, నీళ్లు వెలికిఁబోవుట కేర్పఱచినతూము లోనగునది
భ్రమయు. స. భ్రమను పొందు
భ్రమరకము. స. తుమ్మెద, బొంగరము, ముంగురులు
భ్రమరము. స. తుమ్మెద, ముంగురులు, అభినయహస్తవిశేషము
భ్రమరి. స. ఆఁడుతుమ్మెద, మూర్ఛ
భ్రమరించు. స. భ్రమణముచేయు, తిరుగు
భ్రమి. స. భ్రమణము, తిరుగుడు
భ్రమించు. స. భ్రమరించు, తిరుగు
భ్రష్టము. స. జాఱినది
భ్రష్టుఁడు, భ్రష్టు } స. వెలివేయఁబడ్డవాఁడు, చెడిపోయినవాఁడు

## భ్రా

భ్రాంతము. స. భ్రాంతినొందినది
భ్రాంతి. స. ఉన్నది లేనట్టును లేనిది ఉన్నట్టును తలఁచుట, మిథ్యామతి, భ్రమణము, ఒక అర్థాలంకారము
భ్రాజితము. స. ప్రకాశము నొందినది
భ్రాజిల్లు. స. ప్రకాశించు
భ్రాజిష్ణువు. స. భూషణాదులచేత ప్రకాశించువాఁడు
భ్రాత. స. తోడఁబుట్టినవాఁడు
భ్రాతృవ్యుఁడు. స. తోడఁబుట్టినవాని కొడుకు, పగవాఁడు
భ్రాత్రీయుఁడు. స. తోడఁబుట్టినవాని కొడుకు
భ్రామణము. స. త్రిప్పుట
భ్రామరము. స. తెల్లనితేనె, ఒకదినుసు జాయి, భ్రమరసంబంధమైనది
భ్రామిక. స. కోరిక, ఆశ
భ్రాష్ట్రము. స. పంచదారవేయని గోదుమపూరీ
భ్రాత్రము. స. మంగలము, వేఁపుడుచట్టి

## భ్రు

భ్రుకుంశుఁడు, భ్రుకుంసుఁడు } స. స్త్రీవేషము వేసికొని ఆడెడు పురుషుఁడు

భ్రుకుటి } స. బొమముడి, కనుబొమ్మలు
భృకుటి } విఱుచుట

## భ్రూ

భ్రూకుంశుఁడు } స. భ్రుకుంసుఁడు
భ్రూకుంసుఁడు }

భ్రూకుటి. స. భ్రుకుటి

భ్రూణ. స. చోలాలు

భ్రూణము. స. గర్భము, బిడ్డ

భ్రూణహత్య. స. గర్భమును పోఁగొట్టుట

భ్రూణహుఁడు. స. బ్రూణహత్య చేయువాఁడు

భ్రూభంగము. స. బొమముడి

భ్రూవు. స. కనుబొమ

## భ్రే

భ్రేషము. స. తనకుచితమైనధర్మమునుండి చలించుట, జాఱుట

## మ

మ. ఒక అక్షరము

మంకు. దే. మొండి, మూర్ఖుఁడు

మంకెన. దే. బంధూకవృక్షము, ఎద్దుమీఁద నీళ్లబిందెలు తెచ్చుకొనుటకు బిందెల క్రింద కుదురుగా నుంచఁబడు బెత్తపు బుట్టలజేత

మంఖుణము. స. పిక్కలకుఁ దొడిగికొను కవచము

మంగ. దే. పిండీతకవృక్షము

మంగల. దే. క్షౌరకుఁడు

మంగలకత్తి. దే. మంగలవానికత్తి, క్షురము

మంగలకత్తిరూపు. దే. కృత్తికానక్షత్రము

మంగలపక్కి. దే. మత్స్యవిశేషము

మంగలపిట్ట. దే. భారద్వాజపక్షి

మంగలము. దే. వేఁపుడుచట్టి

మంగలవాఁడు } దే. క్షౌరకుఁడు
మంగలి }

మంగలిగోష్ఠు. దే. సన్నాయి, నాగసరము

మంగలిపని. దే. క్షౌరము

మంగళ. స. పార్వతి, తెల్లగఱిక

మంగళదేవత. స. లక్ష్మి

మంగళము. స. శుభము, క్షేమము

మంగళవారము. స. ఒకవారము

మంగళసూత్రము. స. బొట్టుదారము, తాళిబొట్టు

మంగళహారతి } త. మంగళకరమైన ఆరతి,
మంగళారతి } నీరాజనము

మంగళాచరణము. స. గ్రంథారంభమందు కవిచేయుప్రార్థన

మంగళాశాసనము. స. వైష్ణవపరిభాషయందు ఆశీర్వాదము

మంగళుఁడు. స. అంగారకుఁడు

మంగళ్య. స. గోరోజనము, జెమ్మిచెట్టు, తెల్లవస, సదాపచెట్టు

మంగళ్యము. స. మల్లెపువ్వులవాసనగల యగరు, మీఁగడ పెరుఁగు, మారేడుచెట్టు, రావిచెట్టు, చిఱుసెనగలు, శుభకరము

మంగి. దే. మంగలవాఁడు

మంగు } దే. ముఖమునందలి నల్లనిపొడ,
మంగుడు } మాఁగు

మంచము. స. మంచేము, మంచె

మంచి. దే. మేలు, యోగ్యము, ప్రియవాక్యము

మంచిగందము. దే. శ్రీచందనము

మంచిది. దే. అంగీకార వాక్యము, ప్రశస్తమైనది

మంచినీళ్లు. దే. పానయోగ్యమగుజలము

మంచినూనె. దే. తలంటుకొనుట మొదలగు పనులకు పనికివచ్చు నువ్వులనూనె

మంచిపాము. దే. నాగుఁబాము, త్రాఁచు

మంచిబెల్లము. దే. చెఱకు రసముతో చేసిన బెల్లము

మంచిముత్తెము. దే. అకృత్రిమమైనమౌక్తికము

మంచియ } మంచె } త. జొన్న చేను మొదలగుచోట్లకూర్చుండుటకై యెత్తుగా వేసెడు చేప్పరమువంటి పందిరి

మంచేపుఁగోడు. దే. ఖట్వాంగము

మంచేపుఁదోడుగర. దే. మంచేమునకంటు కొనినవాఁడు

మంచేము. త. మంచము, పర్యంకము

మంచు. దే. మనుచు, హిమము

మంచుఁగొండ. దే. హిమవత్పర్వతము

మంచుతఱి. దే. హేమంతఋతువు

మంచుత్రాగుడుపులుఁగు. దే. చకోరపక్షి

మంజరి. స. చిగిరించినలేఁతకొమ్మ, పూచిన లేఁతకొమ్మ, బొట్టుగుచెట్టు, పెద్దముత్తెము, పూగుత్తి

మంజిక. స. వేశ్య

మంజిటి. త. మంజిష్ఠవృక్షము

మంజిడి. త. చిత్రవర్ణవస్త్రము, నీలవస్త్రము

మంజిమ } మంజిమము } స. మనోహరము, అందము

మంజిష్ఠ. స. ఒకానొకచెట్టు, మిక్కిలి ప్రకాశించెడి యెఱుపు

మంజిష్ఠారాగము. స. బయటికినివిశేషముగా కనఁబడుచు లోపలను ఎప్పటికి వీడ కుండెడు గాఢానురాగము

మంజీరము. స. అందె

మంజులము. స. పాఁచి, పొదరిల్లు, ఒక దినుసుకూకురుగుండెంగపక్షి, ఒప్పిదమైనది, మనోహరము

మంజువు. స. మనోజ్ఞము

మంజూష. స. పెట్టె, మందసము

మంజేస. త. పెట్టె

మంజోడి } మంజోళి } దే. వజ్రములతూనిక

మంట. దే. జ్వాల, కోపము, చేఱుక్కుమనెడు నొప్పి

మంటకము. స. భక్ష్యవిశేషము, మండెఁగ

మంటచేమురు. దే. ఎఱ్ఱగాఁ గాలినగరిఁటెలో పోయఁగా మండెడు చేమురు

మంటపము } మండపము } స. చవిక, చావడి

మంటమారి. దే. జ్వాలనశీలుఁడు, కోపశీలుఁడు

మంటినూనె. దే. మట్టితైలము

మండ. దే. శాఖ, ఉపశాఖ, వేఁపుడుకుచ్చు, చీలమండ

మండ. స. ఉసిరికచెట్టు

మండకంచేము. దే. అంచుకట్టినకంచేము

మండకము. స. మండిగలు అను పిండివంట

మండగంజి. దే. మెతుకులేనిగంజి

మండనము. స. భూషణము, అలంకరించుట

మండపి. స. చిన్నమంటపము

మండపిక. స. చిన్నమండపము

మండము. దే. చేఁపలఁబొడుచు చిల్లకోల

మండము. స. మీఁగడ, గంజి, నూనెలోనగు వానితేట, ఆముదపుఁజెట్టు, భూషణము

మండలము. స. పరివేషము, దేశము, కుష్ఠము, విలుకాఁడు రెండుకాళ్లతో మండలాకారముగా నిలుచేట, సమూహము, వలయాకారముగాఁదీర్చిన యొకవ్యూహము, కుక్క, సూర్యచంద్రాదుల బింబము, పన్నిద్దఱురాజులు, నలువది దినములు

మండలవర్షము. స. దేశమంతటను కురియు వర్షము

మండలాగ్రము. స. ఖడ్గము, కత్తి

మండలి. స. సమూహము, పాము, మండలేశ్వరుఁడు, కుక్క, పిల్లి, సూర్యుఁడు

మండలిక. స. గుంపు

మండలికము. స. గుండ్రముగాఁ జేయఁబడినది

మండలీకుఁడు. స. సామంతరాజు

మండలేశ్వరుఁడు. స. అధీశ్వర సార్వభౌములకంటె ఇతరుఁడైనరాజు, లక్షగ్రామముల నేలెడు రాజు

మండవాయి. దే. గుల్మవాయువు

మండహారకుఁడు. స. కల్లమ్మువాఁడు, గవుండ్లవాఁడు, సారాయికాఁచువాఁడు

మండాటము. స. దైన్యముతో యాచించేట

మండాడు. దే. దైన్యముతో యాచించు, బతిమాలుకొను

మండాము. దే. మండము

మండి. దే. ఒకకాలు నేల మోఁకరించేట

మండిగండ్రలు. దే. ధాన్యవిశేషము

మండిగము. దే. గడపగొయ్య, గడప

మండితము. స. అలంకృతము

మండితుఁడు. స. అలంకరింపఁబడినవాఁడు

మండిలూటి. దే. బయట పొటమరింపక లోపల నణఁగియుండు వ్రణము

మండీ. దే. మండి

మండు. దే. జ్వలించు, మండిపడు, చేయుక్రమని నొచ్చు, ఈర్ష్యాదులచేత తపించు

మండునెల. దే. వసంతఋతువు

మండువా. త. ఒకతట్టుగోడలేని గుమ్మాల పాక, చదరముగ స్తంభముల మీఁద దించినట్టిది

మండూకపర్ణము. స. దుండిగపుచెట్టు

మండూకపర్ణి. స. పొన్నగంటి మొక్క, బెండచెట్టు

మండూకము } స. కప్ప, దుండిగపుచెట్టు
మండుకము }

మండూకి. స. ఆఁడుకప్ప, చిఱుకప్ప

మండూరము. స. ఇనుపచిట్టెము, ఇనుపచిట్టెముతో చేసిన సిందూరము

మండె } దే. జొన్నకంకులు, పొగాకు లోనగునవి మగ్గుటకై పోగు వేసి మీఁదకప్పి పెట్టఁబడిన కుప్ప, రాశి
మాండియ }

మండెఁగ. త. చెక్కెరవేయనిగోదుమపూరీ

మండెము. త. మండలాధిపతుల భూమండలము, దుర్గమస్థలము అనఁగామన్నెము, మాఁడెము, ఒక ఎద్దుమీఁది బరువులో సగము

మండ్ర. దే. ఒకానొకముండ్లచెట్టు

మండ్రగబ్బ. దే. నల్లని పెద్ద తేలు, షడ్బిందువు

మండ్రాటము. దే. సంతాపము

మండ్రాడు. దే. సంతాపించు

మంత. స. ఆలోచించువాఁడు

మంతనము. స. ఆలోచన, రహస్యము, ఏకాంతము

మంతరము. త. ప్రసవోపాయము, జాలవిద్య, మంత్రము
మంతరసాని. త. మంత్రసాని
మంతవ్యుఁడు. స. ఆలోచింపఁదగినవాఁడు
మంతిరి. త. మంత్రి
మంతిరించు. త. మంత్రముచేయు, మంత్రము పఠించు
మంతు. దే. ప్రసిద్ధి
మంతు. త. మంత్రి, చేదరంగమున మంత్రిగానుంచుకొన్న కాయ, మంత్రము
మంతువు. స. తెలివి, అపరాధము, మనుష్యుఁడు, రాజు
మంత్రకాఁడు. దే. ఇంద్రజాలవిద్య నెఱిఁగినవాఁడు
మంత్రజిహ్వుఁడు. స. అగ్నిహోత్రుఁడు
మంత్రణ } స. రహస్యాలోచన
మంత్రణము }
మంత్రము. త. ప్రసవోపాయము,జాలవిద్య
మంత్రము. స. గాయత్రిలోనగునది, రహస్యము, అథర్వవేదము
మంత్రవాది. స. మాంత్రికుఁడు
మంత్రసాని. త. సుఖముగా ప్రసవింపనుపాయము చేసెడు చికిత్సకురాలు,సావిక
మంత్రాంగము. స. మంత్రి, తంత్రము
మంత్రి. స. బుద్ధిసహాయుఁడు, సహాయుఁడు
మంత్రించు. స. మంతిరించు
మంథజము. స. వెన్న
మంథదండము. స. కవ్వము
మంథనము. స. త్రచ్చుట, కవ్వము
మంథని. స. పెరుఁగుతరిచెడు కుండ, తరిగడవ
మంథము. స. కవ్వము, కంటినొప్పి, అంబలి, వధము

మంథర. స. కైకేయియొక్కదాసి, తాంత్రికురాలు
మంథరజ్జువు. స. తరిత్రాడు
మంథరము. స. కవ్వము, చొరవలేనిది, మెల్లగాఁ బోవునది, వంకరైనది, విరివియైనది
మంథరుఁడు. స. మెల్లగా నడచెడువాఁడు
మంథశైలము. స. మంథరపర్వతము
మంథాద్రి. స. కవ్వపుఁగొండ
మంథానము. స. కవ్వము
మంథుఁడు. స. సూర్యుఁడు
మంద. దే. ఊరికివెలుపల పశువులుండు చోటు, పశుసమూహము, గొల్లపల్లె
మందకట్టు. దే. గొల్లపల్లెలవారు నిర్ణయించుకొన్నయేర్పాటు
మందగామి. స. మెల్లగా నడచువాఁడు
మందగించు. త. మందమగు
మందగొను. దే. మందగాఁగూడు
మందట. దే. సమీపము, అడఁకువ
మందటిల్లు } దే. అడఁగు
మందటిలు }
మందడి. త. గుజ్జుపుశాల, మందుర
మందడీఁడు. దే. గుజ్జుపువాఁడు, మందురకుఁడు
మందనము. స. స్తోత్రము
మందపిచ్చుక. దే. ఖంజరీటము
మందపుణ్యము } స. దురదృష్టము
మందభాగ్యము }
మందప్రోయాలు. దే. గొల్లది, వ్రేత
మందమతి. స. తెలివిలేనివాఁడు
మందము. దే. దట్టము, స్థూలము
మందము. స. గజజాతివిశేషము, చొరవలేనిది, మెల్లనిది

మందరము. స. కవ్వపుఁగొండ, మందార మనుకల్పవృక్షము, అలసము, బహుళము
మందల. దే. మేర, మనుదల, జీవము, సమీపము, విధము
మందలించే. దే. చెప్పు, ఆజ్ఞాపించే, మనవి చేయుం, హెచ్చరించే, తలఁచే
మందలింపు. దే. వ్యవహారము
మందవిషము. స. కొంచెము విషముగలది
మందవిసర్పము. స. మెల్లగా ప్రాఁకునది
మందస
మందసము } జ. పెట్టె
మందహాసము. స. చిఱునవ్వు
మందాకము. స. ప్రవాహము
మందాకిని. స. గంగ, ఆకాశగంగ, అఱువదేండ్లఆఁడుది
మందాకు. దే. ఓషధి
మందాక్రాంతము. స. మెల్లఁగా సమీపించేనది, ఒకదినుసు పద్యము
మందాక్షము. స. సిగ్గు
మందాగ్ని. స. అగ్నిమాంద్యము
మందార. దే. మేఘావరణము
మందారము. స. ఒకకల్పవృక్షము, జిల్లేడు చెట్టు, బాడిదచెట్టు
మంది. దే. జనసమూహము, పరిజనము, కాలుబలము
మందితము. స. తగ్గింపఁబడినది, మందమగు నట్లు చేయఁబడినది
మందిమ. స. నెమ్మది, మొద్దుతనము
మందిరము. స. ఇల్లు, పట్టణము, సముద్రము
మందీభవించే. స. మందమగు
మందు. దే. ఔషధము, వశ్యౌషధము, ప్రతిక్రియ, ఉపాయము, దర్లభము, తుపాకిమందు, విషయము, మందాకు
మందుఁడు. స. శని, చొరవలేనివాఁడు అల్పుఁడు, ఇచ్చవచ్చినట్టు తిరుగ వాఁడు, నిర్భాగ్యుఁడు, మూర్ఖుఁడు వ్యాధిగ్రస్తుఁడు, అసమర్థుఁడు
మందుకట్టడ. దే. బాణసంచుచేసెడుశాల
మందుమల. దే. మందుచెట్లుండు పర్వతము. ద్రోణము
మందుర. స. లాయము, పడక
మందురకుఁడు. స. గుఱ్ఱపువాఁడు
మందులమారి. దే. మర్లుమందుపెట్టువాఁడు, మర్లుమందు పెట్టునది, వశ్యక్రియావేది
మందులవాండ్రు. దే. వనమూలికలను దెచ్చి అమ్ముకొని జీవించువాండ్రు
మందెమేలము. దే. పరిహాసము, ఉపేక్ష, చేనవు, స్నేహము
మందోష్ణము. స. కొంచెమువేఁడి, నులివెచ్చన
మంద్రము. స. గంభీరమైన స్వరము
మంధాత. స. యోచనగలవాఁడు
మంపిల్లు
మంపిలు } దే. మత్తిల్లు
మంపు. దే. మత్తు, మైకము
మంపుగొను. దే. మత్తిల్లు
మంపుగొలుపు. దే. మత్తిల్లఁజేయు
మంబరము. దే. దహనము
మంబరముసేయు. దే. దహించే
మకమకలాడు. దే. నిస్తేజస్కముగానుండు
మకరందము. స. పూఁదేనె
మకరకంఠి. స. నడుమ మొసలిముఖ మేర్పఱచిన కంఠభూషావిశేషము
మకరకుండలము. స. మొసలిముఖ మేర్పడఁ జేసినపురుషుని కర్ణభూషావిశేషము
మకరతము. స. మరకతము

మకరతోరణము. స. మొసలిరూప మేర్పడఁ జేసిన తోరణము
మకరధ్వజుఁడు. స. మన్మథుఁడు
మకరము. స. మొసలి, పెద్దచేఁప, ఒకనిధి, ఒకరాశి, అభినయహస్తవిశేషము
మకరాంకుడు. స. మన్మథుఁడు
మకరాలయము. స. సముద్రము
మకరి. స. మకరము
మకరిక. స. మకరికాపత్రము
మకరికాపత్రము. స. స్త్రీలకు చెక్కిలిలోనగు తావులయందు లత్తుకతో వ్రాసెడు మకరరూప మగురేఖ
మకరివల. దే. మృగములను బట్టెడు ఒక దినుసు వల
మకిల. త. మురికి, నలుపు, మాలిన్యము
మకుటము. స. కిరీటము, బొమిడికము
మకురము. స. అద్దము, పొగడచెట్టు, మల్లెపువ్వు, కుమ్మరిసారెఁ ద్రిప్పెడు కఱ్ఱ
మకురు } దే మూర్ఖత్వము
మకురుతనము } దే మూర్ఖత్వము
మకుష్టకము } స. అడవిపెసలు
మపుష్టకము } స. అడవిపెసలు
మకూలకము. స. దంతిచెట్టు
మక్క. త. బిడ్డలు గన్నస్త్రీకి పొత్తికడుపునఁబుట్టెడి అపాయకరమైన నెత్తురుగడ్డ, కాలఖండము అనఁగా కడుపులో కుడిప్రక్కనుండు నల్లని మాంసవిశేషము.
మక్కనగాయ. దే. మక్క
మక్కల్లము. స. మక్క
మక్కళించు. దే. తిరుగుకొను, తిరుగఁబెట్టు, సరిపడు, సరిపోలు, తిరుగుకొనఁజేయు, సరిపఱచు, ఇముడ్చు, సరిపోల్చు, ఉబ్బించు
మక్కా. త. యవనదేశమునందలి ముఖ్యపట్టణము
మక్కి. దే. నిస్సారము
మక్కించు. దే. చంపు
మకు్క. దే. కాంతిహీనమగు, నవయు, చెచ్చు, గీఱు, మాలిన్యము
మకు్కవ. దే. ప్రేమము, కూరిమి
మక్కుక్కు. దే. మకిలయగు
మక్కెలు. దే. ఎముకలు
మక్షిక. స. ఈఁగ
మఖము. స. యజ్ఞము
మగ. దే. పుంస్త్వము, పురుషజాతి
మగఁటిమి. దే. మగతనము, పౌరుషము, శౌర్యము
మగఁడు. దే. పురుషుఁడు, భర్త, రాజు, శూరుఁడు
మగచెయ్వులు. దే. గ్రామ్యధర్మము
మగతనము. దే. పౌరుషము, శూరత్వము, పుంస్త్వము
మగధము. స. ఒకానొక దేశము
మగధుఁడు } స. వంశావళి చదివెడు వాఁడు
మాగధుఁడు } స. వంశావళి చదివెడు వాఁడు
మగనాలు. దే. మగఁడుగల ఆఁడుది, పతిపత్ని
మగపాడి. దే. శౌర్యము, ఉపరతి
మగపోఁడుములు. దే. గ్రామ్యధర్మము
మగమానికపువాలు. దే. వజ్రాయుధము
మగమానికము. దే. రవ, వజ్రము
మగఱాలవాలు. దే. వజ్రాయుధము
మగఱాయి. దే. మగమానికము

మగలాగు. దే. మగపాళి, ఉపరతి
మగలింగము. దే. ఒకవిధమగు మొక్క
మగవాఁడు. దే. పురుషుఁడు, శూరుఁడు
మగిడి. దే. పాములవాఁడు ఊఁదెడువాద్య విశేషము
మగుడఁబడు, మగుడు. దే. మరలు
మగుడి. దే. మరల, తిరిగి
మగుడుచు, మగుడ్చు. దే. మగుడఁజేయు
మగులు. దే. మదురు, గోడమీఁదికప్పు
మగులుగోడ. దే. మగులుపెట్టినగోడ
మగువ. దే. స్త్రీ, ఇంతి
మగ్గపుగుంత. దే. సాలెవాఁడు నేయుటకుఁ గూర్చున్నపుడు కాలుచాఁచుకొనెడు పల్లము
మగ్గము.దే.సాలెవాఁడు నేసెడు యంత్రము
మగ్గరి. దే. సాలెవాఁడు
మగ్గు. దే. ఉక్కచే చెమ్మగిల్లిచెడు, మెత్తన యగు
మగ్గుడు. దే. మగ్గుట
మగ్గుడుపాఱు. దే. మగ్గు
మగ్నము. స. మునిఁగినది
మఘ. స. మొక్కజొన్నలు, ఒకానొక నక్షత్రము
మఘము. స. యజ్ఞము, ఒకానొకదీవి
మఘవంతుఁడు.స. ఇంద్రుఁడు, మఖవంతుఁడు
మఘవుఁడు. స. ఇంద్రుఁడు, మఖవుఁడు
మఘోని. స. ఇంద్రునిభార్య, శచీదేవి
మచర్చిక. స. ప్రశస్తవాచకము, మతల్లిక, శ్రేష్ఠము
మచిలీనము, మచిలీపన్ను. దే. చేఁపలమ్మకముమీఁద వేయుపన్ను
మచిలీమాఁవు. దే. ఒకవిధమగు చేఁప

మచ్చిక. దే. మోహము, ఆసక్తి
మచ్చికపడు. దే. మరులుకొను, మరగు
మచ్చిగ. దే. మచ్చిక
మచ్చెకంటి. దే. చేఁపలవంటి కన్నులుగల ఆఁడుది, ఆఁడుది
మచ్చెము. త. చేఁప
మచ్చ. దే. పుట్టినప్పుడే దేహమునందుఁ గలిగినచుక్క, లాంఛనము, గాయము మొదలైనవి మానినపిమ్మట దేహమునందేర్పడెడు గుఱుతు
మచ్చమాయు. దే. నశించు, చెచ్చు
మచ్చము. దే. గుఱుతు
మచ్చరము. త. చేలము, ద్వేషము
మచ్చరి. త. చేలపాది, ద్వేషి
మచ్చరించు. త. చేలపట్టు, ద్వేషించు
మచ్చరికము. త. చేలము, ద్వేషము, పోటి
మచ్చరికించు. త. చేలపట్టు, ద్వేషించు
మచ్చరీఁడు. త. మచ్చరముకలవాఁడు
మచ్చు. దే. మీఁదకట్టడములేనిమిద్దెటిల్లు, చొక్కపొడి, మృగాదులువలలోఁదగులుకొనుటకై వలకు సమీపముననుంచఁబడు నాహారము, పన్నె సరిగానున్నదని చూచుకొనుటకై యగసాలెవాఁడిచ్చెడు వెండి బంగారములయొక్క మాదిరి, విధము
మచ్చుకత్తి. దే.కొమ్మ నఱకెడు మోటకత్తి
మచ్చుచెల్లు. దే. మచ్చుపొడిచెల్లు, మోహింపఁజేయు, స్మారకము లేకుండఁజేయు
మచ్చులు. దే. పన్నెయొరసి పరీక్షించుటకై యగసాలె లోనగువా రుంచుకొని యుండెడు వెండిబంగారములకమ్ములు
మచ్ఛము. స. మత్స్యము, చేఁప

మజ్జ. స. చెట్టుచేత, ఎముకలయందలిసారము
మజ్జనమాడు. దే. స్నానముచేయు
మజ్జనము. స. స్నానము, మునుక
మజ్జసముద్భవము. స. రేతస్సు
మజ్జిగ. త. చల్ల, తక్రము
మజే. దే. ప్రశంసను దెలుపునది
మజో, మజ్జే } దే. మజే
మజ్జేరె, మజ్జేరే, మజ్జా, మజ్జారే } దే. ప్రశంసను తెలుపును
మటమట. దే. మలమల
మటమటలాడు. దే. మండు, జ్వలించు
మటము. త. పరదేసులు సన్యాసులు వసియించుగృహము, మఠము
మటికి, మట్టికి } దే. గోరుచిక్కుడుచెట్టు
మటుమాయ, మటుమాయము } దే. మిక్కిలి మాయము, కనఁబడకపోవుట
మటుమాయలాఁడు, మటుమాయకాఁడు } దే. మిక్కిలిమాయలుకలవాఁడు
మట్ట. దే. తాటిచెట్టు మొదలగువానికొమ్మ, ఆవు మొదలగువానితోఁక
మట్టగించు. త. తగ్గించు
మట్టగిడుసు. దే. మత్స్యవిశేషము
మట్టపలక. త. మట్టముచూచెడుపలక
మట్టమధ్యాహ్నము. దే. పట్టపగలు
మట్టము. దే. కొలఁది, తక్కువ,పొట్టి,సమము
మట్టసము. త. కుఱుచైనది, పరిమితము
మట్టసి. త. పొట్టివాఁడు
మట్టాడు. దే. నడచు, సంచరించు, వ్యాపించు
మట్టి. త. మన్ను, మృత్తిక
మట్టితైలము. దే. మట్టివలనఁదీసెడు ధృతి
మట్టియ. దే. మగవాని కాలిరెండవవ్రేలి మించు
మట్టియ. త. మట్టి
మట్టియలు. దే. ఆఁడుదానికాలి రెండవవ్రేలిమెట్టెలు
మట్టు. దే. తొక్కు,తొక్కుడు, కుదురు, ప్రదేశము
మట్టు. త. మితి,మితము,పర్యంతము,తక్కువ
మట్టుకాఁకర.దే. ఒకదినుసుకాఁకర, కరోటము
మట్టుకొను. దే. కుదురుకొను
మట్టుచేయు. త. తగ్గించు, మట్టుపఱచు
మట్టుపడు. దే. కుదురుపడు, తగ్గు
మట్టుపడు. త. అడఁగు
మట్టుపఱచు. దే. కుదురుపడఁజేయు
మట్టుపెట్టు. దే. అడఁచు, చంపు
మట్టుబచ్చెలి. దే. దుంపబచ్చెలి, ఉపోదకము
మట్టుబీఱ. దే. ఒకదినుసుబీఱ
మట్టుమిగులు, మట్టుమీఱు } దే. అతిక్రమించు
మట్టె.దే.మగవానికాలి రెండవవ్రేలిమించు, బట్టచాఱలుగల యావు
మట్టెలు. దే. ఆఁడుదాని కాలిరెండవవ్రేలిమెట్టెలు
మట్ర. దే. దున్నునపుడు కొండ్ర తిరుగక నడుమనిలిచెడు కొంచెము తావు
మఠము. స. సన్యాసులు లోనగువారు ఉండెడుచోటు
మఠ్యము. స. తాళభేదము

మడ. దే. ప్రవాహమార్గము
మడఁక. దే. మడుపు, అరక
మడఁగు. దే. వంగు, మరలు
మడఁచు. దే. మడఁగఁజేయు
మడఁతి / మడఁతుక } దే. ఆఁడుది, పడఁతి
మడకట్టు. దే. లావుకట్టె, మడచెట్టుకట్టె
మడచెట్టు. దే. వృక్షవిశేషము
మడత. దే. వస్త్రపుమడుపు, ధౌతవస్త్రము కడుపుమీఁది మడుపు, మడుపు
మడతలు. దే. భక్ష్యవిశేషము
మడత్రొక్కు. దే. తాటాకులు దొంతిగా అణఁగఁ ద్రొక్కు
మడమ. దే. గుదికాలు, పార్ష్ణి, తుపాకీ గొడ్డలి మొదలగువాని వెనుక వైపు
మడవ. దే. మళ్లకుపాములకు నీళ్లుపాఱెడు కాలువ ముఖము
మడవచేప. దే. మత్స్యవిశేషము
మడవు. దే. విముఖమగు, నిష్ఫలమగు
మడి. దే. మడుఁగువస్త్రము, పరిపొలము, పరిశుద్ధము, చౌకపుపాదు, గుణార్థమందు వచ్చుప్రత్యయము
మడికాసు. దే. వెండి
మడిచేయి. దే. వైష్ణవస్త్రీలు ముందుండి యెత్తి వెనుకకుచెక్కుకొను కోకచేయి
మడిపెసలు. దే. మడియందు పైరగు నల్ల పెసలు
మడిమంచే / మడిమంచేము } దే. బలహీనము
మడియఁడు. దే. మూఢుఁడు
మడియు. దే. చచ్చు, తునుఁగు
మడివెలుఁ. దే. చాకలవాఁడు, రజకుఁడు
మడిసంచి. దే. మడుఁగు వస్త్రములుంచు కొనెడు సంచి
మడిసంది. దే. చేంక, కక్షము
మడుఁగు దే. అడఁగు, వంగు, గుణము, కొలను, పరిశుద్ధి, పరిశుద్ధవస్త్రము, ఎనిమిదవినెలకొలఁది, అడఁకువ, ఉపశాంతి, పరిశుద్ధము
మడుఁగులు. దే. ఆకుమడుపులు
మడుఁచు. దే. మడుఁగఁజేయు
మడుపు. దే. మడత, మడుఁగువస్త్రము
మడుపులు. దే. ఆకుచుట్టలు
మడువ. దే. పుట్ట
మడువు. దే. మడుఁగు
మడ్గు. దే. మడుఁగు
మడ్డి. దే. నూనెలోనగువానియందు అడుగున నిలిచెడుమలికి, మూఢుఁడు
మడ్డు. దే. ఇనుపగుండు, ఎఱ్ఱగా కాఁగిన లోహము, అత్యుష్ణము
మడ్డుకత్తి. దే. మచ్చుకత్తి
మడ్డువు. స. గుమ్మెట, తుడుము
మణఁగు. దే. మడఁగు
మణి. స. పచ్చెజాయిలోనగునది, ముత్యములోనగునది, ముంత, మనికట్టు, గొఱ్ఱెమెడచన్ను, తేలుకొండె, మగవాని కామచివర
మణికము. స. కాఁగు, పెద్దబాన
మణికారుఁడు. స. రత్నములను సానపట్టువాఁడు
మణిగ. దే. మళిగ, దుకాణము

మణిగము. దే. అధికారము

మణిగాసనము. దే. సన్న సున్నపు పూఁత

మణితము, మణికూజితము } స. రతికాలమునందలి గళరవము, కోకిలధ్వని

మణిప్రవాళము. స. రెండుభాషలు కలిసిన కవిత్వము

మణిబంధము. స. చేతిమనికట్టు

మణిభిత్తు. స. వజ్రము

మణిరంజనము. స. వర్ణపుజేకు

మణిరాజము. స. వజ్రము

మణివకాఁడు. దే. అధికారి

మణివము. దే. అధికారము

మణిసిల. త. కొండమీఁది యొక్క దినుసు ఎఱ్ఱమన్ను

మణిహము. దే. వాణిజ్యము

మణుఁగు, మణువు } దే. ఎనిమిదివీసెల కొలఁది, మడుఁగు

మణుఁగుఁబువ్వులు, మణుఁగుబూలు } దే. భక్ష్యవిశేషము

మణుఁచు. దే. మఱుఁగఁజేయు

మతంగజము. స. ఏనుఁగు

మతంగస్త్రీ. స. మాలది

మతంగుఁడు. స. ఒకఋషి, మాదిగవాఁడు

మతకము. దే. మాయ

మతకరి. దే. మాయావి, మాయలమారి

మతము. దే. అభిప్రాయము, సమ్మతి, శాస్త్రము, సమ్మతము, తెలియఁబడినది, పూజింపఁబడినది, స్మార్తాదిమతము, జాతి

మతల్లిక. స. ప్రశస్తవాచకము

మతాబు, మత్తాబు } దే చంద్రజ్యోతి, పగలువత్తి

మతి. స. బుద్ధి, ఇచ్ఛ, తలఁపు, ఉద్దేశము, అభిప్రాయము

మతిభ్రమ. స. కలవరము, పొరపాటు

మతిమంతుఁడు. స. బుద్ధిమంతుఁడు

మత్కుణము. స. నల్లి, కొమ్ములేని ఏనుఁగు

మత్కుణుఁడు. స. గడ్డము మీసము లేని మగవాఁడు

మత్తకాశిని, మత్తకాసిని } స. మదముచేత ప్రకాశించునట్టి ఆఁడుది. స్త్రీ

మత్తణము. స. నలఁగఁగొట్టిన తాంబూలము

మత్తము. స. మదముపట్టినది, మదముపట్టిన యేనుఁగు

మత్తల్లిక. స. మతల్లిక

మత్తవారణము.స. ఒఱగుదిండు, మదించిన యేనుఁగు

మత్తా. త. మత్తు

మత్తి. త. కామము

మత్తికాఁడు. దే. కాముకుఁడు

మత్తిల్లు. త మత్తుకొను, మదించు

మత్తు త. మంపు, మదము

మత్తుఁడు. స. మదించినవాఁడు

మత్సరము. స. ఈర్ష్య, క్రోధము, ఈర్ష్య [కలది

మత్సరుఁడు. స. మత్సరముగలవాఁడు

మత్స్యండి, మత్స్యంది } స. కండచక్కెర

మత్స్యధాని. స. మీలబుట్ట, కువేణి

మత్స్యపిత్త. స. కటుకరోహిణి

మత్స్యబంధనము. స. గాలము

మత్స్యము. స. చేప, ఒకానొకదేశము

మత్స్యవేధని. స. గాలము

మత్స్యాక్షి. స. పొన్నగంటికూర, సోమెదకూర

మథనము. స. త్రచ్చుట, మంథనము

మథించు.స.మథనముచేయు,త్రచ్చు,చిలుకు

మథితము స. నీళ్లుకలియనిమజ్జిగ, త్రచ్చఁబడినది

మథుర. స. ఉత్తరహిందూస్థాన మండలి యొకపట్టణము
మదకలము. స. మదపుటేనుఁగు, మత్తుచేత వ్యక్తముకాని మాటలుకలది
మదట. త. మత్తుఁడు, మత్తురాలు
మదనచేతులు. దే. దంతెలు, దూలముల మీఁది అంగదారువులు
మదనపత్త్రిక. స. విరహవేదనాదులను తెలియఁజేయుచు వ్రాసుకొన్న జాబు
మదనము. స. ఆమని. ఉమ్మెత్తచెట్టు, మంగ చెట్టు, మైనము. కాముకత్వము
మదని. స. జేవాదిపిల్లి
మదనుఁడు. స. మన్మథుఁడు
మదమడఁచు. దే. చెంపు
మదము. స. క్రొవ్వు, ఏనుఁగుక్రొవ్వు, రేతస్సు, కస్తూరి, గర్వము, సంతోషము, మత్తు
మదయంతి. స. అడవిమల్లె
మదస్థానము. స. కల్లుత్రాగెడుయిల్లు
మదహస్తి. త. మదపుటేనుఁగు
మదావళము. స. ఏనుఁగు
మది. త. బుద్ధి, మనస్సు
మదించు. త. తలఁచు, మదింపువేయు
మదించు. స. క్రొవ్వు, గర్వించు, మత్తిల్లు
మదింపు. త. ఇంతయని వెల మొదలగు వాని నూహించుట
మదిమది. త. నెమ్మది, నిశ్చింత
మదిర. స. కల్లు
మదిరాక్షి. స. మదముకప్పిన కన్నులుగల ఆఁడుది, ఆఁడుది
మదీయము. స. నాది

మదుగు } దే. అనుకు అనగా ముద్దగాక
మదుము } పలుచనైనది
మదుపు. దే. ఆకుపచ్చ
మదురు. దే. కమియు. గోడమీఁదికప్పు
మదురుగోడ. దే. మదురుపెట్టినగోడ
మదురువు. త. మద్యము, మత్తు
మదువు. దే. మదుగు
మదోత్కటము. స. మదపుటేనుఁగు, కపోతము
మద్గురము. స. బొమ్మడాయచేప
మద్గువు. స. నీరుకాకి, మత్స్యవిశేషము
మద్దటిల్లు. దే. ఎండమొదలైనవి శమించు
మద్ది. దే. అర్జునవృక్షము
మద్దికాయలు. దే. బాలకులచెవితమ్మెలనుం చెడు భూషణవిశేషము
మద్దెల.త.చర్మవాద్యవిశేషము, మృదంగము
మద్దెలరూపుచిక్క. త. ధనిష్ఠానక్షత్రము
మద్యము. స. కల్లు, సుర, కాదంబరి
మధుక. స. తిప్పతీఁగ
మధుకము. స. అతిమధురము, ఇప్పచెట్టు, నెమలి
మధుకరము. స. భిక్షాన్నము, తుమ్మెద, జీవకవృక్షము
మధుకుఁడు. స. వంశావళిఁజదువువాఁడు
మధుక్రమము. స. మద్యపానక్రమము
మధుత్రయము. స. చెక్కెర, తేనె, నేయి, అను మూఁడు తియ్యని వస్తువులు
మధుద్రుమము. స. ఇప్పచెట్టు
మధుపము. స. తుమ్మెద, తేనెతిండి, మద్యపానము చేయునది
మధుపర్కము. స. పెరుఁగుతోకలిసినతేనె, పెండ్లిలోవధూవరుల కిచ్చెడువస్త్రములు

మధుపర్ణి. స. గుమ్ముడుచెట్టు, తిప్పతీఁగ, నీలిచెట్టు
మధుప్రమేహము. స. బహుమూత్రజాడ్యము
మధుమక్షిక. స. తేనెటీఁగ
మధుమేహము. స. మూత్రరోగవిశేషము, అతిమూత్రము
మధుయష్టిక. స. అతిమధురము
మధుర. స. దక్షిణహిందూస్థానమందలి ఒక పట్టణము, సదాపమొక్క
మధురత్రిఫలములు. స. ద్రాక్షకాశ్మర్య ఖర్జూరఫలములు [ఇంపైనది
మధురము. స. తియ్యన, విషము, తియ్యనిది,
మధురస. స. చేఁగచెట్టు, ద్రాక్షచెట్టు, పిన్నపాలచెట్టు [ర్యము
మధురసము. స. మకరందము, తేనె, మాధు
మధురిక. స. అడవిసదాపమొక్క
మధురిపుఁడు } స. విష్ణువు
మధురిపువు
మధురిమ } స. తియ్యన
మధురిమము
మధులిహము. స. తుమ్మెద
మధువారము. స. మద్యపానక్రమము, తఱచుగ త్రాగుట
మధువు. స. పాలకూర, నీరు, పాలు, కల్లు, తేనె, పూఁదేనె, చైత్రమాసము, వసంతఋతువు, ఇప్పచెట్టు, గోరంటమొక్క
మధువ్రతము. స. తుమ్మెద
మధుశిగ్రువు. స. ఎఱ్ఱపువ్వులమునగచెట్టు
మధుశ్రవ. స. తెల్లగురిజెచెట్టు
మధుశ్రేణి. స. చేఁగచెట్టు
మధుష్ఠీలము } స. ఇప్పచెట్టు
మధుష్ఠీవము

మధుసఖుఁడు. స. మన్మథుఁడు
మధుసూదనము. స. తుమ్మెద
మధుసూదనుఁడు. స. విష్ణువు
మధుస్రవ. స. పాలకూర
మధుకము } స. ఇప్పచెట్టు
మధూకము
మధూచ్ఛిష్టము. స. మయినము
మధూలకము. స. నీరిప్పచెట్టు
మధూలిక. స. పుష్పాడి, చేఁగచెట్టు, మకరందధార
మధూళి. స. కల్లు, పూఁదేనె
మధ్య. స. ఒకఛందస్సు, నాయికావిశేషము
మధ్యందినము. స. మధ్యాహ్నము, ఒక సవనము
మధ్యదేశము. స. భారతవర్షమునడిమిదేశము
మధ్యమ. స. దుద్దు, వాగ్భేదము, నడిమివ్రేలు, క్రొత్తగసమర్తాడినపడుచు
మధ్యమము. స. నడుమ, ఒక స్వరము, నడిమిది
మధ్యమిక. స. వయస్సువచ్చిన పడుచు
మధ్యము. స. అవకాశము, నడుము, నడితరముది, నడిమిది
మధ్యముఁడు. స. నడిమివాఁడు, అధముఁడు
మధ్యరాత్రము. స. నడురేయి
మధ్యలోకము. స. భూలోకము
మధ్యవర్తి } స. నడుమనుండి పక్షపాతములేక ఇరుతెగలవారికి సరిగా న్యాయము చెప్పువాఁడు
మధ్యస్థుఁడు
మధ్యాహ్నము. స. పట్టపగలు
మధ్వకము. స. తేనె యీఁగ
మధ్వాసవము. స. ఇప్పపువ్వుకల్లు
మన. దే. మనము అనుదానికి ప్రాతిపదికము
మనఃప్రభవుఁడు. స. మన్మథుఁడు

మననము. స. చింతన, గమనము, ధ్యానము
మనము. దే. నీవును నేనును
మనము. స. మనసు, బుద్ధి
మనవి. దే. విజ్ఞాపనము, విన్నపము
మనశ్శిల. స. మణిసిల, ఎఱ్ఱపాషాణము
మనసరి. దే. బుద్ధిమంతుఁడు
మనసిజుఁడు. స. మన్మథుఁడు
మనసు / మనస్సు } స. మానసము, ఇష్టము, తలఁపు
మనస్కరించు. స. మనసుంచు
మనస్కారము. స. మనఃప్రయత్నము, మనఃపూర్తి
మనస్తాపము. స. చింత, కోపము
మనస్వి. స. మంచిమనసు కలవాఁడు, జాగరూకుఁడు
మనస్సాక్షి. స. అంతరాత్మ
మనికట్టు. దే. మణిబంధము
మనికి. దే. జీవించుట, వసించుట, జీవనము, వాసస్థానము, స్థానము
మనికితపడు. దే. దుఃఖపడు
మనికితపాటు. దే. మనికితపడుట
మనికితము. దే. దుఃఖము
మనికిపట్టు. దే. వాసగృహము
మనికిఱేఁడు. దే. గృహస్థుఁడు
మనితము. స. తెలియఁబడినది
మనిసి. త. మనుష్యుఁడు
మనీష. స. బుద్ధి, ప్రజ్ఞ
మనీషి. స. విద్వాంసుఁడు, బుద్ధిమంతుఁడు
మనీషిక. స. బుద్ధి
మను. దే. జీవించు, వర్తించు
మను. త. మట్టి, నేల
మనుఁగు. దే. చేచ్చు
మనుఁబోతు. దే. మగఋశ్యమృగము
మనుకువ. దే. వాసస్థానము
మనుగడ. దే. జీవనము, జీవనోపాయము
మనుగుడుపు. దే. అల్లెము
మనుచు / మన్చు / మంచు } దే. మనఁజేయు, పోషించు, బ్రతికించు
మనుజాశనుఁడు. స. రాక్షసుఁడు
మనుజుఁడు. స. మనుష్యుఁడు, మానిసి
మనుజేంద్రుఁడు. స. రాజు
మనుదిండి. దే. ఒకదినుసుపాము
మనుపరి. దే. రక్షకుఁడు
మనుపాల. దే. పాలకూర, కోడిసెచెట్టు
మనుపీనుఁగు. దే. జీవచ్ఛవము
మనుపు. దే. మనుచు, రక్షణము
మనుమఁడు. దే. పౌత్రుఁడు
మనుమరాలు. దే. పౌత్రి
మనుయుగము. స. మనువుయొక్క కాలము అనఁగా 31,10,40,000సంవత్సరములు
మనువు. దే. జీవనము, వర్తనము, మగని వరించుట, మగఁడు, వివాహము, సంబంధము
మనువు. స. వైవస్వతాదిమనువులు, మంత్రము
మనువృత్తి. స. జీవనాధారము, అనాథలకు జీవనార్థమైయిచ్చుపైకము
మనుష్యధర్ముఁడు. స. కుబేరుఁడు
మనుష్యయజ్ఞము. స. అతిథిపూజ
మనుష్యుఁడు. స. మనుజుఁడు, మానిసి
మనుసంహిత. స. మనుస్మృతి
మనోగుప్త. స. మణిసిల

మనోజవసుఁడు } స. తండ్రి నిబోలినకొడుకు
మనోజవుఁడు

మనోజుఁడు. స. మన్మథుఁడు

మనోజ్ఞము. స. సుందరము

మనోదండము. స. మనస్సు సంపూర్ణముగ లోఁబడుట

మనోభవుఁడు. స. మన్మథుఁడు

మనోమలికితము. దే. తప్పుగా గ్రహించుట, ద్వేషము, చింత

మనోరథము. స. ఇచ్ఛ, కోరిక

మనోరమము. స. మనోజ్ఞము

మనోహతుఁడు. స. మనసుచెడినవాఁడు

మనోహరము. స. బంగారు, భక్ష్యవిశేషము, మనోజ్ఞము, ఇంపైనది

మనోహ్వ. స. మణిసిల

మన్కి. దే. మనికి

మన్దిండి. దే. మనుదిండి

మన్న. దే. అడ్డగింపు, నిరోధనము

మన్నఁడు. దే. ప్రభువు

మన్నన. త. సమ్మానము, గౌరవము

మన్ని. దే. జీవము

మన్ని. త. పెడతలయందుండునరము

మన్నించు. త. సమ్మానించు, గౌరవించు, క్షమించు

మన్నింపు. త. మన్నించుట, అపరాధ క్షమము

మన్నిక. త. మన్నన, సమ్మానము

మన్నిగొను. దే. చేంపు

మన్నియ
మన్నియఁడు } త. ప్రభువు, మన్నెఁపు దొర
మన్నీఁడు
మన్నెఁడు

మన్నియము. త. మాన్యము, పన్నులేనిభూమి

మన్ను. దే. ఋశ్యమృగము, యంద్ధసాధన విశేషము

మన్ను. త. మట్టి, నేల

మన్నుఱేఁడు. దే. రాజు

మన్నెకాఁడు. దే. ప్రభువు

మన్నెము. త. సమ్మానించి ఇచ్చినకొంతభూభాగము, మాన్యము, పన్నులేనిభూమి, కొండభూమి

మన్నెముల్లు. దే. మేఁకలకాలిగిట్టలలోని ముల్లుతీసెడు పెద్దసూది

మన్నెఱికము. దే. ప్రభుత్వము

మన్మఁడు దే. మనుమఁడు

మన్మథ. స. ఒకసంవత్సరము

మన్మథము. స. కామచింతచెట్టు, వెలఁగ చెట్టు

మన్మథుఁడు. స. మరుఁడు, మారుఁడు

మన్మనము. స. ఆలుమగలు సురతకాలము నందు దేశభాషతోఁ జెవిలో మెల్లఁగా చెప్పుకొనుట

మన్య. స. పెడతలయందుండునరము

మన్యువు. స. క్రోధము, శోకము, దైన్యము, యజ్ఞము.

మన్వంతరము. స. డెబ్బదియొక్క దివ్యయుగములు, మనుకాలమధ్యచరిత్రము, కాలము, ప్రభుత్వము

మపుష్టకము. స. అడవిపెసలు

మప్పితము. దే. మితము

మప్పు. దే. మఱపు, అభ్యాసము

మబ్బు. దే. మేఘము, చీఁకటి, అజ్ఞానము

మబ్బుకొను. దే. మంపుకొను

మబ్బుత్రోవ. దే. ఆకాశము, మేఘద్వారము

మబ్బుపెట్టు. దే. దాఁచు, మోసముచేయు

మబ్బుమేపరి. దే. వాయువు, ప్రభంజనుఁడు
మబ్బురవుతు. దే. ఇంద్రుఁడు
మమకారము } స. మమత్వము, అభిమానము, అహంభావము, మోహము
మమత
మమ్మాయి. దే. లేహ విశేషము
మమ్మారె. దే. ఆశ్చర్యపుమాట
మమ్మి. దే. సముద్రముమీఁద ఓడలకువిఘాతముగా వీచెడు సుడిగాలివిశేషము
మయత. స. తాదాత్మ్యము, మయత్వము
మయము. స. ఒంటె, కంచెరగాడిద
మయష్టకము } స. అడవిపెసలు
మయష్ట్రకము
మయుఁడు. స. అసురశిల్పి
మయువు. స. కిన్నరుఁడు, మృగవిశేషము
మయూఖము. స. కిరణము, కాంతి, జ్వాల
మయూరకము. స. మయిలుతుత్తము, ఉత్తరేను మొక్క
మయూరతుత్థము. స. మయిలుతుత్తము
మయూరము. స. నెమిలి, నెమిలిజేట్టు, ఓమము, ఉత్తరేను మొక్క
మయూరవిదళ. స. నల్లతెగడచెట్టు
మర. దే. కీలు, తిరుగుడుచీల
మరందము. స. పూఁదేనె, మకరందము
మరకట్టు. దే. గారడీవిద్యయందలి స్తంభనము
మరకతము. స. పచ్చరాయి, గారుత్మతము
మరకాఁడు. దే. నావికుఁడు
మరగాలు. దే. కృత్రిమపాదము
మరగించు. దే. మోహింపఁజేయు
మరగు. దే. పరిచితమగు, ఆశపడు, ఆశించు
మరగొమ్ము. దే. గుఱ్ఱముమీఁది పల్లమునకు ముందు వెనుకల నానికకై యెత్తుగా నేర్పరచియుండు భాగము
మరచెట్టు. దే. తిరుగడ
మరణము. స. చావు
మరణించు. స. మరణము చేయు, చచ్చు
మరతకము. స. మరకతము
మరపు. దే. మరగఁజేయు
మరల. దే. పునరర్థకము, తిరిగి, అప్పటి
మరలఁబడు. దే. మరలు
మరలఁబాటు. దే. మరలఁబడుట
మరలు. దే. తిరుగు, నివర్తిలు, వెనుకకుఁ దిరుగు
మరలుచు } దే. మరలఁజేయు
మరల్చు
మరవ. దే. తూము
మరసాన. దే. ఱాళ్లపనివాని సాధనవిశేషము
మరాటము. దే. ఒకచెట్టు
మరాటి. త. ఒకానొకదేశస్థుఁడు
మరాటిమొగ్గ. త. ఒకానొకమందుదినుసు
మరాటీలు. త. మహారాష్ట్రులు
మరాళము. స. హంస
మరి. దే. తడవ, మఱియు, ఇంకను, తిరుగ
మరించు. స. మరణించు
మరిగొమ్మి. దే. చెఱువులో నీరెక్కువై నప్పుడు పోవిడుచుకాలువ, కలుఁజు
మరిచము. స. మిరియము
మరిడీ. గ్రా. విశాఖజిల్లాయందలి గ్రామదేవత
మరియాద. త. క్రమము, మేర, మర్యాద
మరీచము. స. మరిచము
మరీచి. స. కిరణము, ఒకఋషి

మరీచిక. స. ఎండమావులు, మృగతృష్ణ
మరు. దే. వృత్తియందు మారుశబ్దమున కాదేశరూపము
మరుఁడు. త. మన్మథుఁడు
మరుతేజి. దే. చిలుక
మరుత్తు. స. పిక్కచెట్టు, గాలి, వేలుపు
మరుత్పటము. స. ఓడచాప
మరుత్వంతుఁడు. స. ఇంద్రుఁడు
మరుత్సఖుఁడు. స. అగ్నిహోత్రుఁడు
మరునయ్య. దే. విష్ణువు
మరునిల్లు. దే. మదనగృహము
మరున్మాల. స. పిక్కచెట్టు
మరుపని. దే. సురతము
మరుమామ. దే. చంద్రుఁడు
మరులు. దే. మోహము, పిశాచము
మరులుఁదీఁగ. దే. మరులుజడ
మరులుకొను. దే. మోహించు
మరులుకొలుపు. దే. మోహింపఁజేయు
మరులుజెడ, మరులుమాతంగి } దే. మట్టినతోడనే మోహింపఁజేసెడియోషధి, భూతకేశము, గోలోమీవృక్షము
మరులుతీఁగ. దే. మరులుమాతంగితీఁగ
మరులుఱేఁడు. దే. పిశాచవల్లభుఁడు
మరువకము. స. మరువము, మంగచెట్టు
మరువము. స. వాసనగల ఒకానొక చిన్నచెట్టు
మరువు. స. నిర్జలప్రదేశము, పర్వతము, ఎడారి
మర్కటము. స. కోఁతి, సాలెపురుగు
మర్కటి. స. దూలగొండిచెట్టు
మర్త్యము. స. భూలోకము
మర్త్యుఁడు. స. మనుష్యుఁడు

మర్దనము. స. పిసుకుట. నూఱుట
మర్దలము. స. మద్దెల
మర్దించు. స. మర్దనముచేయు, నూఱు
మర్దితము. స. నూఱఁబడినది
మర్నాఁడు. దే. మఱునాఁడు
మర్మము. స. జీవస్థానము, కిటుకు
మర్మరము. స. వస్త్రములయొక్కయు,ఆకులయొక్కయు ధ్వని, పెళపెళ
మర్మరీకుఁడు. స. బీదవాఁడు, దుర్మార్గుఁడు
మర్మస్పృక్కు. స. మర్మమును దాఁకునది
మర్యాద. స. పొలిమేర, తీరము, కట్టుపాటు, సన్మానము
మర్లుఁబాము. దే. మనుదిండి
మర్షము. స. ఓరుపు, క్షమ
మర్షితము. స. సహింపఁబడినది
మఱఁదలు. దే. తమ్మునిభార్య, భార్యచెల్లెలు, తనకంటె చిన్నదగు మేనత్త మేనమామలకూఁతురు
మఱఁది. దే. చెల్లెలిమగఁడు, భార్యతోఁబుట్టువు, మేనమామకొడుకు, మగనితమ్ముఁడు
మఱక. దే. కఱ, మేఁకపడ్డ
మఱకువ. దే. అజ్ఞానము
మఱచు. దే. మఱపుఁజెందు
మఱపు. దే. విస్మృతి, అజ్ఞానము, పారవశ్యము, ప్రమాదము
మఱలు. దే. మళ్లు
మఱి. దే. వెండియు, ఇంకను, అనంతరము
మఱిగ. దే. తాలితోఁజేయఁబడిన కోలపాత్రము, తాలిచిప్ప
మఱిమఱి. దే. మఱియు మఱియు, అత్యంతము
మఱియొకటి. దే. అన్యము

మఱు. దే. వృత్తియందుమఱుగు, మఱుస, మాఱు, శబ్దములకాదేశరూపము (మఱుపడు, మఱునాఁడు, మఱుమాట మొ.)
మఱుఁగు. దే. చాటగు, సంతాపించు,చాటు, కాఁగు
మఱుఁగుదొడ్డి. దే. మఱుఁగుపెరడు
మఱుఁగుపడు. దే. మఱుఁగు
మఱుఁగుపెరడు. దే. మలవిసర్జనస్థానము
మఱుకువ. దే. సంతాపము
మఱుగుజ్జు. దే. గూనివాఁడు, గూనిది
మఱునాఁడు. దే. మఱుసటిదినము
మఱుపడు. దే. మఱుఁగగు
మఱుపెట్టు. దే. మఱుఁగఁజేయు
మఱుమాట. దే. ప్రతివచనము
మఱుమ్రోఁత. దే. ప్రతిధ్వని
మఱువ. దే. కుండ, మూఁగ
మఱువకందు. దే. అగస్త్యుఁడు, కుంభసంభవుఁడు
మఱువవాఁడు. దే. మూఁగవాఁడు
మఱువు. దే. కవచము, చాటు
మఱుస. దే. ఆవలిది
మఱుసంజె. దే. సాయంసంధ్య
మఱ్ఱి. దే. వటవృక్షము
మల. త. కొండ, తిప్ప, పర్వతము
మలఁక. దే. చిక్కు,చుట్టు, మెలిక, వంకర
మలఁకతూము. దే. పదికుంచెముల ప్రమాణము
మలఁకపుట్టి. దే. ఇన్నూఱు కుంచెముల పుట్టి
మలఁకమెఱుపు. దే. ధనురాకారమగు మెఱుపు
మలఁగ. దే. ఎద్దుపైగంతతోడి సరకుగోనె
మలఁగు. దే. తిరుగు, మరలు, వంకరగు
మలఁచు. దే. మలఁగఁజేయు, తొలుచు
మలఁపు. దే. మలఁగఁజేయు, వర్తనము
మలఁపుగొను. దే. వర్తించు
మలక. దే. తురక, మూఁకుడు
మలకడము. దే. పాదరక్ష
మలగొంగ. దే. ఇంద్రుఁడు
మలగొను. దే. మెలిగొను
మలచేము. దే. అధికము, గొప్ప
మలనము. స. నూఱుట, డేరా
మలప. దే. దూడచచ్చిపాలిచ్చెడు ఆవులోనగునది
మలపు. దే. త్రిప్పు, మరలించు, ఆధిక్యము
మలపువు. స. కుక్కమేడిచెట్టు
మలమనికి } దే. కోఁతి
మలమన్కి }
మలమల. దే. మాఁడుటయందగు ధ్వన్యనుకరణము
మలమలకము. స. గోఁచి
మలమాసము. స. అధికమాసము
మలము. స. విష్ఠ, మలినము, దోషము
మలయ. స. తెల్లతెగడచెట్టు
మలయజము. స. చందనవృక్షము,చందనము
మలయము. స. ఒకకొండ, ఒకదేశము, ఆరామము
మలయమ్మ. త. పార్వతి
మలయిక. దే. విహారము
మలయు. దే. తిరుగు, పెనఁగు, వ్యాపించు, ఉద్యమించు, ఉద్రేకించు, తపించు
మలయువు. స. కుక్కమేడిచెట్టు
మలాక. దే. శ్రీఖండము, చందనము
మలారము. దే. మట్టిగాజులగుది, వీథిలోనగునది ఊడ్చుపొడుగాటి చీఁపురు
మలికితము. దే. సందేహము, వ్యాకులము
మలిగండ్లు. దే. మలిచి తీయఁదగిన జాలు, నూకానుచ్చు

మలినము. స. మాసినది, నల్లనిది, దూషితమైనది
మలిని. స. ముట్టుది, ఋతుమతి
మలినితము. స. మురికిచేయఁబడినది
మలినిమ. స. నలుపు, దుర్మార్గము
మలిమ్లుచము. స. దోమ, మలమాసము
మలిమ్లుచేఁడు. స. దొంగ, అగ్ని
మలిష్ఠ. స. ముట్టుగుచున్నస్త్రీ
మలీమసము. స. ఇనుము, మాసినది, నల్లనిది. దుష్టము
మలు. దే. మఱు, రెండవది
మలుఁగు. దే. మత్స్యవిశేషము
మలుకారు. దే. శీతకాలము, ముక్కారు పంటలలో రెండవకారు
మలుసు } దే. దారములోనగువానిని ఎదురెదురుగా తగిలించి మరల
మలుక్క } వెడమర్లత్రిప్పినది, చుట్టినచుట్ట
మలుకువ. దే. మురికి, మాలిన్యము
మలుగు. దే. ఆఱు, నశించు, తుంటి, కటి యొక్కకీల్లు
మలఁచు } దే. బియ్యములోనగునవి జాల్లు
మల్చు } పోవచెరుగు, తఱిమెసఁబెట్టు, జాతిని తొలంచు
మలుచుట్టు. దే. చీల, తిరుగాణి
మలుచూలు. దే. రెండవచూలు
మలుపక్కము. దే. కృష్ణపక్షము
మలుపు. దే. ఆర్చు, నశింపఁజేయు, మరలించు, తిరుగుడు
మలుసంజె. దే. సాయంసంధ్య
మలుక్కఁడు. దే. తురకవాఁడు, మ్లేచ్ఛుఁడు
మల్ల. త. మంటికంచము, సానిక
మల్లకము. స. దీపపుప్రమిద
మల్లకుఁడు. దే. కరిసుఁడు, గడుసరి
మల్లగుల్లము. దే. వాదులాట
మల్లచఱచు. దే. భుజాస్ఫాలనముఁ జేయు
మల్లచఱపు. దే. భుజాస్ఫాలనము
మల్లట. దే. మల్లాట, కష్టము, అగచాట్లు
మల్లడి. దే. పరితాపము, పెనఁకువ
మల్లడించు. దే. పెనఁగొను, అతిశయించు
మల్లడిగొను. దే. పెనఁగొను, పరితపించు
మల్లము. స. మల్ల, నూనెచిప్ప, ప్రమిద, బలమైనది, గొప్పది, శ్రేష్ఠము, చెంబు, గిన్నె
మల్లరము. దే. మదించినది, గర్వము
మల్లశాల. స. సాముచేయుచోటు
మల్లసాల. త. భోజనశాల, మల్లెసాల
మల్లాట. దే. మల్లాడుట
మల్లాడు. దే. పెనఁగాడు
మల్లామడి. దే. పీడితము, పీడితుఁడు
మల్లారము. దే. మలారము
మల్లిక. స. మల్లెతీఁగ, మృత్పాత్రవిశేషము
మల్లికము. స. మాసినముక్కు కాళ్లుగల తెల్లహంస
మల్లికాక్షము. స. మాసిన ముక్కుకాళ్లుగల తెల్లహంస, తెల్లని కన్నులుగలగుఱ్ఱము
మల్లియ. త. మల్లెతీఁగ
మల్లు. త. కోఁతి, జెట్టిపెనఁకువ
మల్లుఁడు. స. జెట్టి, శ్రేష్ఠుఁడు
మల్లుకట్టు. దే. అడ్డగించు
మల్లుపెనఁగు. దే. జెట్టిపెనఁకువగా పెనఁగు
మల్లె. త. మల్లికాలత, మల్ల, చేమ్మ
మల్లెజేగుఱు. దే. రాపులుఁగు
మల్లెమొగ్గలు. దే. మల్లెచెట్టు మొగ్గలు, కంఠభూషణవిశేషము

మల్లెలగుడి. దే. కుక్కకీయఁబడిన పేరు
మల్లెలు. దే. స్ఫోటకపు బొబ్బలయందు కలుగుపురుగులు, సస్యమును చెడఁగొట్టు పురుగులు
మవ్వము. దే. కోమలము, కోమలత, సుందరము
మశకము. స. దోమ, దేహము విరియు రోగము
మశము. స. దోమ, కోపము
మశహారి. స. దోమ తెర, చతుష్కి
మశునము. స. కుక్క
మశూచికము. స. స్ఫోటకము
మషి. స. కాగితముప్రాసెడిమసి, సిరా
మషిమణి. స. మసిబుడ్డి
మష్టు. దే. కల్మషము
మస. దే. విలాసము, భ్రమ, మచ్చ
మసఁగు. దే. విజృంభించు, రేఁగు
మసక. త. ఇంచుకనలుపు,మునిచీకఁటి
మసకన. త. ఇంచుకనలుపు, మునిచీఁకటి
మసకము. దే. సంభోగేచ్ఛ, సంభోగము
మసకొను. దే. సంభోగేచ్ఛకొను, భ్రమపడు
మసకొల్పు. దే. సంభోగేచ్ఛ గలుగఁజేయు
మసటు } దే. మఱికి, మాలిన్యము
మసడు }
మసనము. స. కొలుచేట, తూఁచేట
మసనము. త. శ్మశానము
మసర. దే. ధూసరవర్ణము
మసరు. దే. ఆవేశము, క్రొవ్వు
మసలిక. దే. మాంద్యము, మందము
మసలు. దే. తడయు, విచారించు, వెనుకకు తిరుగు, నీళ్లుమలమలకాఁగు
మసలుకొను. దే. మసలు
మసారము. స. ఇంద్రనీలము
మసి. స. కాగితమువ్రాసెడు కాటుక, సిరా, పెద్దసదాపచెట్టు
మసి. త. బొగ్గులు మొదలగువానిచూర్ణము, నలుపు, మయిల
మసికట్టు. దే. బంగారు లోనగు వానిచిలుము
మసికోఁతి. దే. నల్లకోఁతి
మసిబుడ్డి. దే. మసివ్రాసెడుబుడ్డి, సిరాబుడ్డి
మసీదు. దే. తురకలగుడి
మసుర } స. వేశ్య, చిఱుసెనగలు
మసూర }
మసూరము. స. బిళ్లతలగడ
మసూరవిదళ. స. నల్లతెగడచెట్టు
మసూరి } స. ఒకదినుసుగజ్జి, మశూచికము
మసూరిక }
మసృణ. స. నల్లగిసెచెట్టు
మసృణము. స. చిక్కనిది; నున్ననిది
మసెల. దే. ఆటుక
మస్కరము. స. వెదురు
మస్కరము. దే. వెదురు, వేణువు
మస్కరి. స. సన్యాసి, భిక్షుకుఁడు
మస్టు. దే. మసటు, మష్టు
మస్తకము } స. తల
మస్తము }
మస్తకశూలము. స. తలనొప్పి
మస్తరించు. దే. లోపఱచు,చేతులప్పళించు
మస్తరు. దే. లోఁకువ, అధీనత
మస్తిష్కము. స. మెదడు
మస్తీ. త. మదించినయేనుఁగు
మస్తు. దే. సమృద్ధి
మస్తు. త. మదము

మస్తువు. స. పెరుఁగుమీఁదిమీఁగడ

మహతి. స. నూఱుతంతులుఁగల నారదుని వీణ, గొప్పది

మహత్తు. స. దొరతనము, బుద్ధితత్త్వము, తెలుఁగువ్యాకరణమున పురుషవాచక శబ్దమునకు సంజ్ఞ, గొప్పది, ప్రభావము

మహత్త్వము. స.గొప్పతనము, ప్రభావము

మహనాడు. దే. అశేషకులస్థులయొక్క కూటము

మహనీయుఁడు. స. గొప్పవాఁడు

మహము<br>మహస్సు } స. తేజము, ఉత్సవము

మహర్షి. స. గొప్పఋషి

మహాంగము. స. ఒంటె

మహాకందము. స. వెల్లుల్లి, దురదకంద

మహాకాయుఁడు. స. స్థూలదేహముగల వాఁడు

మహాకాలుఁడు. స. శివుఁడు,ఒకశివభటుఁడు

మహాకాళి. స. పార్వతిదేవి

మహాకులుఁడు. స. గొప్పకులమునఁబుట్టిన వాఁడు, కులీనుఁడు

మహాగ్రీవము. స. ఒంటె, మహాగ్రీవి

మహాఘోషము. స. అంగడి, సంత

మహాజనము. స. ముఖ్యులగుజనులు

మహాజాలి. స. పచ్చనిపూవులుఁగల ఆవడ చెట్టు

మహాదశ. స. ఒకగ్రహముయొక్కయధి కార కాలము

మహాదేవి. స రాణి, దొరసాని

మహాదేవుఁడు. స. శివుఁడు

మహాధనము. స. చిల్లమడ్డి, బంగారు, కృషి, గొప్పవెలగలవస్త్రము, గొప్పవెలగల వస్తువు, గొప్పవెలగలది

మహానంద. స. సారాయి

మహానందము. స. మోక్షము,గొప్పయానందము

మహానటుఁడు. స. శివుఁడు

మహానది. స. కటకమువద్దనుండునొకనది

మహానవమి. స. విజయదశమికి తొలిదినము

మహానసము. స. పాకస్థానము, వంటయిల్లు

మహానిద్ర. స. చావు

మహానీచుఁడు. స. చాకలవాఁడు

మహానీలము. స. ఇంద్రనీలమణి, గుంటగలిజేరు

మహానుభావుఁడు. స. గొప్పవాఁడు

మహాపతి. స. గొప్పభాగ్యవంతుఁడు

మహాపథము.స. ప్రాణాంతము,రాజమార్గము

మహాపద్మము. స. ఒకనిధి, సంఖ్యావిశేషము

మహాపుంసుఁడు. స. గొప్పవాఁడు

మహాపురుషుఁడు. స. దేవాంశగల గొప్ప వాఁడు

మహాప్రళయము. స. బ్రహ్మప్రళయము, లోకనాశనము

మహాప్రసాదము. స. గొప్పబహుమానము

మహాప్రస్థానము. స. మరణము

మహాబల. స. సులితడచెట్టు

మహాబలము. స. సీసము

మహాబలుఁడు స. వాయువు, మిక్కిలిబల ముగలవాఁడు

మహాబిలము. స. ఆకాశము

మహాభాగుఁడు. స. నిర్మలమనస్కుఁడు

మహాభారతము. స. ప్రసిద్ధమగు నొకగ్రంథము

మహాభాష్యము. స. పాణినిసూత్రములకు వ్యాఖ్యానము

మహామనుష్యుఁడు. స. గొప్పవాఁడు
మహామహోపాధ్యాయుఁడు. స. గొప్ప బోధకుఁడు
మహామాంసము. స. రుచిగలమాంసము, మనుష్యమాంసము
మహామాత్రుఁడు. స. కార్యసహాయుఁడు, సంపన్నుఁడు, మావటీఁడు
మహామారి. స. దుర్గ, విషూచిజాడ్యము, బొబ్బలజాడ్యము
మహామృగము. స. ఏనుఁగు, ఎక్కుడు మెకము
మహామోహము. స. మనస్సులోని గొప్ప కలవరము
మహాయాత్ర. స. కాశి మొదలగు పుణ్యతీర్థముల ప్రయాణము
మహాయుగము. స. కృత, త్రేతా, ద్వాపర కలియుగములనెడి నాలుగుయుగములు కూడిన 43,20,000 ఏండ్లకాలము
మహారజతము. స. బంగారు
మహారజనము. స. బంగారు, కుసుంబాపువ్వు
మహారణ్యము. స. గొప్పయడవి
మహారథుఁడు. స. పదునొకండు వేలమంది విలుకాండ్రతో పోరెడుయోధుఁడు, తన్నును సారథిని గుఱ్ఱములనుకాపాడుకొనుచుపోరెడుయోధుఁడు, గొప్పరథముగలవాఁడు
మహారసము. స. చెఱకుగడ, పాదరసము, పుల్లగంజి
మహారాజికుఁడు. స. గణదేవతావిశేషము
మహారాజు. స. గజాంతలక్ష్మి గలరాజు, కుబేరుఁడు, ధనికుఁడు, చక్రవర్తి
మహారాత్రము. స. అర్థరాత్రము
మహారాష్ట్రము. స. ఒకానొకదేశము,ఆదేశమందువాడఁబడుభాష

మహారౌరవము. స. నరకభేదము
మహాలయము. స. భాద్రపదబహుళమందుఁ జేయఁబడు పితృశ్రాద్ధము
మహాశంఖము. స. సంఖ్యావిశేషము, మనుష్యుని యెముక, నొసలు
మహాశయుఁడు. స సముద్రుఁడు, గొప్ప యభిప్రాయముగలవాఁడు
మహాశూద్రి. స. గొల్లది, గొల్లవాని పెండ్లాము
మహాశూద్రుఁడు. స గొల్లవాఁడు
మహాశ్వేత. స. నల్ల నేలగుమ్ముడుచెట్టు
మహాసర్గము. స. మహాప్రళయమునకుఁ బిమ్మటఁ గలుగు సృష్టి
మహాసహ. స. కారుమినుపచెట్టు, గొజ్జఁగచెట్టు
మహాసుఖము. స. సంభోగము
మహాసేనుఁడు. స. కుమారస్వామి, గొప్ప సేనగలవాఁడు
మహాహ్నము. స. మధ్యాహ్నమునకుఁ దర్వాతి కాలము
మహి. స. భూమి, ఆవు
మహింథమము. స. పందికొక్కు, ముంగి
మహిక. స. మంచు, హిమము
మహితము. స. శివునిశూలము, గొప్పది
మహిమ, మహిమము } స. గొప్పతనము, ఒకయైశ్వర్యము, మాహాత్మ్యము
మహిషము. స. ఎనుఁబోతు, దున్న
మహిషవాహనుఁడు. స. యముఁడు, పోతురాతు
మహిషి. స. పట్టపుదేవి, ఎనుము, గేదె
మహిష్ఠము. స. విశేషమైనది
మహిళ. స. స్త్రీ. ప్రేంకణపుచెట్టు
మహీక్షితుఁడు. స. రాజు

మహీధరము } స. కొండ
మహీధ్రము }

మహీరుహము. స. వృక్షము

మహీలత. స. వానపాము, ఎఱ్ఱ, గడూపదము

మహీసుత. స. సీత

మహీసుతుఁడు. స. అంగారకుఁడు, నరకాసురుఁడు

మహేంద్రము. స. ఒకకొండ

మహేంద్రుఁడు. స. ఇంద్రుఁడు

మహేంద్రి. స. బొంతరఁటిచెట్టు

మహేచ్ఛుఁడు. స. గొప్పయభిప్రాయము గలవాఁడు

మహేరణ. స. అందుగుచెట్టు, సల్లకీవృక్షము

మహేశ్వరుఁడు. స. శివుఁడు, గొప్పప్రభువు

మహోక్షము. స. ఆఁబోతు

మహోత్పలము. స. తామర, పద్మము

మహోత్సాహుఁడు. స. అద్భుతకార్యారంభముకలవాఁడు

మహోదధి. స. సముద్రము

మహోదయము. స. కన్యాకుబ్జము, ఆధిపత్యము, అభివృద్ధి, మోక్షము, ఒకానొకపర్వము

మహోదరము. స. వ్యాధివిశేషము

మహోద్యముఁడు. స. గొప్పకార్యములకు యత్నముచేసెడివాఁడు

మహోపాధ్యాయుఁడు. స. గొప్పబోధకుఁడు

మహౌషధము. స. అతివస, వెల్లుల్లి, సొంటి

మళయాళము. త. మలయపర్వతము చుట్టు పట్టుదేశము

మళిగ. త. చింతపండు మిరెపకాయ మొదలగు ననేకవిధములగుసరకుల నుంచుకొని అమ్మకము చేసెడియిల్లు

మళ్లు. దే. మరలు

## మా

మా. దే. బళి

మా. త. మిక్కిలి

మా. స. లక్ష్మి

మాంగలికము. స. మంగళమగునది

మాంగల్యము. స. మంగళత్వము, తాలిబొట్టు

మాంజిష్ఠము. స. ఎఱుపుమించిన పసుపువన్నె, కొంచెము పచ్చగానుండు ఎఱ్ఱచీర

మాండలికుఁడు. స. ఒకజిల్లాఅధికారి

మాంత్రికుఁడు. స. మంత్రవిద్య తెలిసినవాఁడు, గారడీవాఁడు

మాందాళి. దే. కృత్రిమమరకతము, పచ్చపట్టుచీర

మాంద్యము. స. ఆలస్యము, జాడ్యము

మాంధాత. స. పూర్వకాలమందేలిన ఒక గొప్పచక్రవర్తి

మాంసము. స. నంజోఁడు, పలలము

మాంసలత. స ముడుత

మాంసలము. స. బలిసినది

మాంసలుఁడు. స. బలిసినవాఁడు, బలిమిగలవాఁడు

మాంసి. స. జటామాంసి

మాంసికుఁడు. స. మృగపక్ష్యాదులమాంసము విక్రయించి జీవించువాఁడు, కొటికుఁడు

మాంసోపజీవి. స. మాంసము నమ్మువాఁడు

మాఁకు. దే. మ్రాను, వృక్షము

మాఁగాయ. దే. ఉప్పువేసి మాఁగఁబెట్టిచేసిన మామిడికాయ ఊరుగాయ

మాఁగు. దే. కమియఁబండు, మాలిన్యము, ముఖమునందలి నల్లనిపొడ

మాఁగుడు. దే. నలఁపు, మాలిన్యము

మాఁగుడువాఱు | మాఁగుపడు | మాఁగువాఱు } దే. మాయు, మలినమగు
మాఁటినంగ. దే. కాముకి
మాఁటు. దే. తగులముగొను, తగులము, మాఁతు
మాఁటుమణఁగు | మాఁటుమణుఁగు | మాఁటుమడఁగు | మాఁటుమడుఁగు } దే. జేంజోటముడిగి నిశ్శబ్దమగు, రాత్రియందు జనులు నిదురించుచు పలుకక నిశ్శబ్దముగ నుండు
మాఁటుపడు. దే. తగులువడు
మాఁడు. దే. దగ్ధమగు, అడుగంటిమాఁడిన అన్నములోనగునది, ఇంటియొక్క భాగపుకప్పు
మాఁడుచు. దే. మాఁడఁజేయు, మాఁడించు
మాఁడెము. త. మండలాధిపతుల భూమండలము
మాఁతు. దే. చేదరంగపు ఆటయందు బంటుతోఁగాక తక్కినవానితో రాజును గట్టుట
మాకందము. స. మామిడిచెట్టు
మాకరి. త. మాలకరి
మాకొను. దే. కఱచు
మాక్షికము. స. తైలవర్ణముగలతేనె
మాగధి. స. అడవిమొల్లచెట్టు, పిప్పలిచెట్టు, ప్రాకృతభాషలలో నొకటి
మాగధుఁడు | మగధుఁడు } స. వంశవీర్యాదులనుపొగడి యుపజీవించువాఁడు
మాగాణి. దే. వరిపంటపెట్టెడు నేల. వరిపొలము
మాగాని. దే. దేశము, విలాతి
మాగిలి. దే. మాగాణి
మాఘము. స. ఒకమాసము
మాఘ్యము. స. మొల్లచెట్టు, మొల్లపువ్వు
మాచి. దే. ఒకచెట్టు, మాచికాయ
మాచి. స. కాఁచిచెట్టు
మాచిపత్రి. దే. స్థౌణేయము
మాచెనపక్కి. దే. మత్స్యవిశేషము
మాచేకమ్మ. దే. మగఱొమ్ములు మీసములు గలిగినయాఁడుది, పోటు, ఱొమ్ములు లేక పురుషసంయోగమునకు అనర్హురాలుగానుండు స్త్రీ
మాట. దే. వచనము, ప్రతిజ్ఞావచనము, పదము, నింద, వృత్తాంతము
మాటకాఁడు. దే. సభయందు భయములేక మాట్లాడువాఁడు, వక్త, వాచాలకుఁడు
మాటకారి. దే యుక్తిగా మాటాడువాఁడు, వాగ్మి
మాటతప్పు. దే. వాగ్దత్తమునెఱవేర్చకపోవు
మాటలమారి. దే. మిక్కిలి మాటలాడువాఁడు, వావదూకుఁడు
మాటలల్లువాఁడు. దే. కవీశ్వరుఁడు
మాటాడు. దే. వచించు, సంభాషించు
మాటికి | మాటిమాటికి } దే. ముహుర్ముహుర్ధకము, అడుగడుగుకు
మాటీఁడు. దే. మావటీఁడు
మాటు. దే. మఱుఁగుపఱచు, మఱుఁగు, తడవ, వేటకాని దాఁగుడుపల్లము, అతుకు
మాటుపెట్టు. దే. మాటొగ్గు
మాటువడు. దే. మఱుఁగుపడు
మాఠరుఁడు. స. సూర్యుని ప్రక్కనుండు వారలలో నొకఁడు, వ్యాసుఁడు
మాడ. దే. పరాలోసగము, అరవరా, సువర్ణము

మాడపట్టు. దే. బ్రహ్మరంధ్రము, సోడు
మాడి. దే. అడవియులవ, వనకులత్థము, మేడ
మాడికి } దే. విధము
మాడ్కి
మాడు. దే మెలయు, వర్తించు
మాడుగు } త. హార్మ్యము, మిద్దెటిల్లు
మాడువు
మాడ్పు. దే. ఒకానొకచెట్టు
మాణవకము. స. ఇరువదిపేటల మణిహారము
మాణవకుఁడు. స. బాలకుఁడు
మాణవిక. దే. బాలిక
మాణవ్యము. స. మాణవకులసమూహము
మాణిక్యము. స. కెంపు
మాణిబంధము } స. సైంధవలవణము
మాణిమంధము
మాత. స. తల్లి, లక్ష్మి, పార్వతి, భూమి, ఆవు, బ్రాహ్మ్యాది, ధాన్యాదులుకొలిచెడు వాఁడు
మాతంగము. స. ఏనుఁగు
మాతంగి. స. పార్వతి, వసిష్ఠునిభార్య
మాతంగుఁడు } స. మాదిగవాఁడు
మతంగుఁడు
మాతగొరక. దే. మత్స్యవిశేషము
మాతరపితలు. స. తలిదండ్రులు
మాతరిశ్వుఁడు. స. వాయువు
మాతలి. స. ఇంద్రునిసారథి
మాతాపితలు. స. తలిదండ్రులు
మాతాబి. దే. జేలతారు
మాతామహి. స. తల్లితల్లి
మాతామహుఁడు. స. తల్లితండ్రి
మాతామహులు. స. తల్లివంశమువారు
మాతుల. స. మేనమామ భార్య
మాతులపుత్రకము. స. ఉమ్మెత్తకాయ
మాతులపుత్రకుఁడు. స. మేనమామకొడుకు
మాతులము. స. ఉమ్మెత్తచెట్టు, ముఱ్ఱుంబాము
మాతులాని. స. జేనము, మేనమామభార్య
మాతులాహి. స. ఉమ్మెత్తలోని ముఱ్ఱుంబాము
మాతులి. స. మేనమామభార్య, జేనము
మాతులుంగము. స. మాదీఫలపుచెట్టు
మాతులుఁడు. స. మేనమామ
మాతులేయుఁడు. స. మేనమామకొడుకు
మాతృక. స. తల్లి, దాది, పార్వతి, వర్ణమాల, అసలుగ్రంథము
మాతృముఖుఁడు. స. తెలివితక్కువవాఁడు
మాతృష్వసేయి. స. తల్లితోఁడఁబుట్టినదాని కూఁతురు
మాతృష్వసేయుఁడు. స. తల్లితోఁడఁబుట్టిన దానికొడుకు
మాతృష్వస్త్రీయ. స. తల్లితోఁడఁబుట్టినదాని కూఁతురు
మాతృష్వస్త్రీయుఁడు. స. తల్లితోఁడఁబుట్టిన దానికొడుకు
మాత్ర. దే. చిన్నమందు ఉంట, ఔషధ గుళిక, ఒకవిధమగు సంచి
మాత్ర. స. అక్షరావయవము, కొంచెము, కొలఁది, త్రుటి, భూషణము, సర్వము, ధనము, పరివారము
మాత్రన. స. మాత్రమున, మాత్రాన
మాత్రము. స. పరిమాణము, నిశ్చయము
మాత్రము. దే. ఇతరవ్యవచ్ఛేదకము
మాత్సర్యము. స. మచ్చరము, చేలము, పగ
మాత్స్యకుఁడు. స. చేఁపలను బట్టువాఁడు

మాదము. స. మదము, మత్తు, గర్వము, సంతోషము
మాదవళము. దే. మాదావళము
మాదళము. దే. కపిలవర్ణము, కపిలవర్ణము గలచీర
మాదావళము. దే. కపిలవర్ణము,కపిలవర్ణము గలచీర
మాదావళి. దే. మాదావళము
మాదిగ. త. చెప్పులుఁకుట్టువాఁడు, మాదిగ వాఁడు
మాదిగకత్తి. త. భింది పోలము
మాదిఫలము / మాదీఫలము } దే. మాతులుంగము
మాదిరి. దే. సామ్యము, విధము
మాదృశుఁడు. స. నావంటివాఁడు
మాదెన. దే. స్థూలపుష్పవృక్షము
మాద్రి. దే. మాదిరి
మాద్రి. స. పాండురాజు భార్య
మాధవకము. స. ఇప్పపూవుకల్లు
మాధవము. స. వైశాఖమాసము, వసంత ఋతువు
మాధవి. స. పూవుల గురివెందచెట్టు, మాదిఫలము, కల్లు, తేనె, చక్కెర, లక్ష్మి, కుంటెనకత్తె, కల్లుబెల్లము
మాధవుఁడు. స. విష్ణువు, లచ్చిమగఁడు
మాధుకరము. స. మధుకర వృత్తి అనఁగా తుమ్మెదలు పువ్వులయందు పూఁదేనెను గ్రహించునట్లు భిక్షుకులు గృహస్థుల యిండ్లకుఁబోయి భిక్ష గ్రహించి జీవించుట, బిచ్చెముగాపెట్టఁబడిన అన్నము
మాధురి. స. మాధుర్యము, కల్లు
మాధుర్యము. స. తీపు, కావ్యగుణములలో నొకటి, పక్షులులోనగునవి పచ్చుటకు బోయవేసెడు ఈల
మాధ్యస్థ్యము. స. మధ్యస్థుఁడు జేయుం తీర్పు
మాధ్వి. స. పుష్పరసముచేత చేయఁబడిన మద్యము, మకరందము
మాధ్వీకము. స. ఇప్పపూవుకల్లు
మాన. త. నాలుగుసోలలకొలఁది, కుడపము
మానన. స. మన్నన
మాననీయము. స. మన్నింపఁదగినది, పూజ్యమైనది
మానభంగము. స. అవమానము
మానము. స. కొలఁది, మానిక, తులామానములోనగునది, చిత్తౌన్నత్యము, గర్వము, స్త్రీలకు పురుషులయెడఁగలుగు కోపవిశేషము, అభిమానము, మర్యాద, స్త్రీపురుషుల గుహ్యప్రదేశము
మానవతి. స. మానముఁగల ఆఁడుది
మానవదేవుఁడు. స. మనుష్యులలో దేవుని వంటివాఁడు
మానవము. స. మనువుచే వ్రాయఁబడినది, మనుష్యసంబంధమైనది
మానవుఁడు. స. మనుష్యుఁడు, మానిసి
మానవేశ్వరుఁడు. స. రాజు
మానసము. స. మనస్సు, ఒకసరస్సు, మనస్సంబంధమైనది
మానసించు. స. తలఁచు
మానసికము. స. మనస్సంబంధమగునది
మానసూత్రము. స. కొలత్రాడు
మానసౌకము / మానసౌకసము } స. హంస
మానస్థానము. స. మర్మస్థలము
మానస్థుఁడు. స. మర్యాదగలమనుష్యుఁడు
మాని. స. మానముగలవాఁడు
మానిక. స. మాన, కుడపము, నాలుగుసోలలు
మానికదారి. త. బోగముది

మానికము. త. కెంపు, రత్నము
మానితము. స. మన్నింపఁబడినది
మానిని. స. మానముగల ఆఁడుది, స్త్రీ
మానిసి. త. మనుష్యుఁడు, మనుష్యస్త్రీ, భటుఁడు
మానిసిదిండి. దే. రాక్షసుఁడు
మానిసిరాతు. త. కుబేరుఁడు
మానిసిఱేఁడు. దే. రాజు
మానిసిసింగము. త. నృసింహుఁడు
మాను. దే. విడుచు, మ్రాను, మనోజ్ఞత, మనోజ్ఞము, వ్రణము మొదలగునవినయ మగు, ఒప్పు
మానుచే } మాన్చు } దే. మానఁజేయు, మానించు
మానుపు. దే. మానుచే
మానుషము. స. యశము, మర్యాద
మానుషస్థుఁడు. స. మర్యాదపరుఁడు
మానుషాశి. స. మనుష్యులను తినువాఁడు, రాక్షసుఁడు
మానుషి. స. మనుష్యస్త్రీ, మానిసి
మానుషిక్షీరము. స. చనుఁబాలు
మానుషుఁడు. స. మనుష్యుఁడు, మానిసి
మానుష్యకము } మానుష్యము } స. మనుష్యుల సమూహము, నరత్వము, కరుణ
మానెరు } మానేరు } దే. ఎక్కుడుండీఁగ, జ్యోతిష్మతి
మానోజ్ఞము. స. మనోజ్ఞత, అందము
మానోన్నతి. స. అధికగౌరవము
మాన్యము. స. పన్నుకట్టక అనుభవించునట్లు సన్మానించి యియ్యఁబడినభూమి, మన్నింపఁదగినది

మాన్యుఁడు. స. పూజ్యుఁడు
మాపు. దే. మాయఁజేయు, పోఁగొట్టు వస్త్రాదులను మలినముచేయు, సాయంకాలము, రాత్రి, మైల
మాపుడు. దే. మైల
మామ. త. మాతులుఁడు, శ్వశురుఁడు
మామకము } మామకీనము } స. నాది
మామకుఁడు. స. మేనమామ, నావాఁడు
మామమామ. త. విష్ణువు
మామా. దే. మాఱుమాను, వద్దువద్దు
మామిడి. త. మావి, ఆమ్రవృక్షము
మామిడిగుత్తులు. దే. ధాన్యవిశేషము
మాముకోడి. దే. సీమకోడి
మామెన. దే. సుగంధిపాలవేళ్లపంటివేరు
మాయ. స. అవిద్య, ఇంద్రజాలాదివిద్య, ఒకపట్టణము, బుద్ధి, కపటము
మాయకాఁడు } మాయదారి } దే. మాయావి
మాయపోతు. దే. మాయలమారి
మాయము. దే. మాయ, అదృశ్యము
మాయలమారి. దే. మాయలాఁడు, మాయలాఁడి
మాయలాఁడి. దే. మాయాశీలురాలు
మాయలాఁడు. దే. మాయాశీలుఁడు
మాయాకారుఁడు. స. మాయకాఁడు
మాయాదేవీసుతుఁడు } మాయాసుతుఁడు } స. శాక్యబుద్ధదేవుఁడు
మాయావి. స. మాయచేయువాఁడు
మాయి. దే. మఱుఁగు, నలుపు
మాయి. స. మాయగలవాఁడు
మాయించు. దే. అడఁచు, జయించు, పోఁగొట్టు

మాయికుఁడు. స. మాయావి, గారడీవాఁడు
మాయు. దే. మలినమగు, నశించు
మాయుకము. స. గజవిశేషము
మాయుఁడు. స. విష్ణువు, అసురుఁడు
మాయురె. దే. బళిరె
మాయువు. స. పైత్యము
మాయూరకుఁడు. స. నెమళ్లను పట్టుకొను వాఁడు
మాయూరము. స. మయూరముల సమూహము, నెమిలిసంబంధమైనది
మాయ్యము. స. తులామానము లోనగునది
మారకము. దే. ఎదురు, ఎదిరించుట
మారకము. స. చంపునది
మారకుఁడు. స. మరణింపఁజేయువాఁడు
మారజిత్తు. స. బుద్ధదేవుఁడు
మారణము. స. చంపుట, ఒకవిద్య
మారాటము. దే. కలహము, మోసము
మారాము. త. మర్మము, కీలు, గోజులాట
మారించు. స. నాశముచేయు
మారి. దే. ఒకప్రత్యయము
మారి. స. మారణము, మసూరికారోగము, జనక్షయరోగము, పార్వతి, ఒకగ్రామదేవత, బొబ్బలజాడ్యము
మారిక. స. బొబ్బలజాడ్యము
మారితము. స. చంపఁబడినది
మారిమసఁగు. దే. సంహరించు, మారీదేవత యాక్రమించు
మారిమసలు. దే. చంపు
మారిష. స. దక్షునితల్లి
మారిషము. స. తోఁటకూర
మారిషుఁడు. స. నాట్యోక్తియందుఆర్యుఁడు
మారీచము. స. వంచన, మోసము, మిరియములతోఁ జేయఁబడినది
మారు. దే. ప్రతి, మజ్జిగ
మారుఁడు. స. మన్మథుఁడు
మారుతము. స. గాలి
మారుతి. స. పార్వతీనక్షత్రము, భీమసేనుఁడు, హనుమంతుఁడు
మారెడు, మారేడు } త. బిల్వము, మారేడుచెట్టు
మార్కుము. దే. మాఱుకము
మార్కొను. దే. ఎదిరించు
మార్గణకుఁడు. స. యాచించువాఁడు
మార్గణము. స. వెదకుట, యాచించుట, బాణము
మార్గణుఁడు. స. యాచించువాఁడు,యాచకుఁడు
మార్గము. స. త్రోవ, మృగశీర్షనక్షత్రము, మార్గశీర్షమాసము, అన్వేషణము
మార్గశిరము, మార్గశీర్షము } స. మార్గశీర్షమాసము
మార్గాగతుఁడు. స. బాటసారి
మార్గికుఁడు. స. బాటసారి
మార్గితము. స. వెదకఁబడినది
మార్గ్యము. స. వెదకఁదగినది, తుడువఁదగినది
మార్చు. దే. వఢించు, మాఱుఁజేయు, నాశముఁజేయు, మాఱుపఱచు, చంపుట
మార్జన. స. మురజధ్వని
మార్జనము. స. తుడుపు, తోముడు, లొద్దుగుచెట్టు, ప్రోక్షించుట
మార్జని. స. చీపురుకట్ట, సమ్మార్జని
మార్జనీయము. స. తుడువఁదగినది

మార్జారము } స. పిల్లి
మార్జాలము

మార్జించు. స. ప్రోక్షించు, తుడుచు

మార్జిక. స. కొన్నిసంబారువులు చేర్చి పక్వముచేసిన పెరుగు

మార్తాండుఁడు } స. సూర్యుఁడు
మార్తండుఁడు

మార్తుఁరు. దే. శత్రువు, మాఱుతుఁడు

మార్దంగికుఁడు. స. మృదంగము వాయించువాఁడు

మార్దవము. స. మృదుత్వము, మెత్తన

మార్ద్వీకము. స. ద్రాక్షకల్లు, ద్రాక్షసంబంధమైనది

మార్పడు. దే. మాఱుపడు

మార్పు. దే. మాఱుపు

మార్పెట్టు. దే. మాఱుపెట్టు

మార్మలయు } దే. ఎదిరించు
మార్మసలు

మార్మాట. దే. మాఱుమాట

మార్మెడ. దే. మెలిపడిపోయినకంఠము

మార్ష్టి } స. మార్జనము
మార్ష్ణి

మాఱకము. దే. మాఱుపు

మాఱట. దే. ప్రతిరూపము, ప్రతి

మాఱాకు. దే. ప్రాఁకుడుఁగొయ్య, ఉపఘ్నము

మాఱాట. దే. మాఱాడుట

మాఱాటము. దే. కలహము

మాఱాడు. దే. మాఱుపలుకు

మాఱు. దే. నశించు, మాఱుపడు, వేఱురూపమగు, ఎదురు, తడవ, రెండవతూరి పెట్టఁదగిన భోజ్యపదార్థము, ప్రతి, అన్యము, పెడ

మాఱుఁదల్లి. దే. సవతితల్లి

మాఱుకొను. దే. ఎదిరించు

మాఱుచు. దే. మాఱఁజేయు

మాఱుతుఁడు. దే. మాఱుచువాఁడు, శత్రువు

మాఱుదల. దే. మాఱుట

మాఱునీళ్లు. దే. ముట్టునీళ్లకు మఱుసటినాఁటి స్నానము

మాఱుపడు. దే. ఖేదపడు

మాఱుపాటు. దే.మాఱుపడుట,వ్యత్యాసము

మాఱుపు. దే. ఒకటిచ్చి మఱియొకటిపుచ్చుకొనుట, వినిమయము

మాఱుపెట్టు. దే. ఎదిరించు

మాఱుబేరము. దే. చిల్లరవర్తకము

మాఱుమగఁడు. దే. ఉపపతి

మాఱుమనువు దే. ఆఁడుదాని ద్వితీయపరణము

మాఱుమనువుది. దే. దిధిషువు

మాఱుమాట. దే. ప్రతివచనము

మాఱుమూల. దే. ఎదురుమూల, గొంది

మాఱుమొగము. దే. పెడమొగము

మాఱుమ్రోఁత. దే. ప్రతిధ్వని

మాఱురూపు. దే. రూపాంతరము, మాఱిపోయినరూపు

మాఱువర్తకుఁడు. దే. చిల్లరవర్తకుఁడు

మాఱొడ్డు. దే. ప్రతిఘటించు, ప్రతిఘటనము

మాల. స. చండాలజాతివిశేషము, పూదండ, వరుస, గుంపు, పిక్కచెట్టు, దిబ్బ, వంచన

మాల } త. మాలవాఁడు, చండాలుఁడు
మాలఁడు

మాలకము. స. వేపచెట్టు, దిబ్బ
మాలకరి. త.మాలాకారుఁడు, వనపాలకుఁడు
మాలకాకి. త. ద్రోణకాకము
మాలతి. స. జాజిచెట్టు, ఒకానొకస్త్రీ
మాలాకారుఁడు. స. పూలదండలు కట్టి యమ్మెడువాఁడు
మాలాతృణకము. స. చిప్పకసవు
మాలి. స. మాలాకారుఁడు,మాలగలవాఁడు, తోఁటవాఁడు
మాలిక. స. పూమాల, మెడనుబెట్టుకొనెడు తీఁగె, విరజాజిచెట్టు, సమూహము, పఙ్క్తిరూపమైనది, కూఁతురు
మాలికుఁడు. స. మాలాకారుఁడు
మాలిన్యము. స. మలినత్వము
మాలిమి. దే. వాత్సల్యము, మచ్చిక, ఓడ నడపుశాస్త్రము, ఓడనడపు శాస్త్రము నెఱిఁగినవాఁడు, ఓడనడపువాఁడు
మాలిమికాఁడు. దే. మాలిమిశాస్త్రము నెఱిఁగినవాఁడు, ఓడ నడపించువాఁడు
మాలు. దే. చెడు, నశించు, బద్ధకించు, త్యజించు, బోయీలభుజములమీఁది తడి బట్టపొత్తులు
మాలుగు ) దే. సోమరితనము, పోమరితన
మాల్గు ) ముఁబొందు, అతృప్తుఁడగు, బెత్తలభుజముమీఁది తడిమడతపొత్తులు
మాలుగుఁబోతు. దే సోమరి
మాలుచు ) దే. మాలఁజేయు
మాల్చు )
మాలుధానము. స. ఉమ్మెత్తలోని ముట్టుఁ బాము
మాలూరము. స. మారేడుచెట్టు, వెలఁగ చెట్టు
మాలె ) త. పుష్పమాలిక, హార్మ్యము,
మాలియ ) పంక్తి, ఇల్లువరుస
మాలెత. దే. మాలది
మాల్యము. స. పుష్పమాలిక, పుష్పము
మాల్యవంతము. స. ఒకానొకకొండ
మావఁతుఁడు. త. మావటివాఁడు
మావటము. దే. తములపాకులకట్ట, లెక్క పట్టీ
మావటి } త. మావటివాఁడు
మావటీఁడు }
మావలి. దే. సుగంధిమూలవృక్షము
మావి. దే. మనుష్యాదిగర్భస్థ పిండమునకు రక్షకముగా మీఁద క్రమ్ముకొనియుండు పొర, జరాయువు, మామిడిచెట్టు
మావిడి. దే. మామిడిచెట్టు
మావు. దే. అశ్వము, అశ్వసంగమము, చేపలఁబట్టు సాధనము
మావుమోమువాఁడు. దే. కింపురుషుఁడు, తురంగవదనుఁడు
మావెలఁగ. దే. ఉలిమిరిచెట్టు
మాషపర్ణి. స. కారుమినుము
మాషము. స. మినుములు, ఐదు గురిగింజల యెత్తు, మూర్ఖము
మాషీణము ) స. మాషములు పండు
మాష్యము ) పొలము
మాసటి ) దే. కూరుఁడు, మల్లుఁడు,
మావటీఁడు ) శ్రేష్ఠుఁడు
మాసము. త. రెండున్నరచిన్నమెత్తు
మాసము. స. నెల, మాషపరిమాణము
మాసరము. స. వార్పుగంజి, గంజిమీఁది మీఁగడ, వ్యాప్తము, దీర్ఘము
మాసరముగ. దే. మిశ్రముగ, కలిసి

మాసి. త. మైల, మానిసి
మాసిక. దే. వస్త్రాదుల అతుకు, చిక్కు
మాసికము. స. అబ్దికమువఱకు నెల నెలకు చేసెడుశ్రాద్ధము, మాససంబంధమైనది
మాస్టీఁడు. దే. శూరుఁడు, శస్త్రవిద్యావద్భుఁడు
మాహా. స. ఆవు
మాహాత్మ్యము. స. మహాత్మత్వము, గొప్పతనము
మాహిషము. స. బఱ్ఱెసంబంధమైనది
మాహిషికుఁడు. స. బఱ్ఱెలను కాచేవాఁడు, జారిణియొక్క ప్రియుఁడు, తనభార్యయొక్క వ్యభిచారమువలన జీవించేవాఁడు
మాహిష్యుఁడు. స. అంతఃపురము కావలికి తగినవాఁడు
మాహేంద్రము. స. దినముయొక్క పదుమూఁడవభాగము
మాహేయి. స. ఆవు
మాహేశ్వరి. స. ఒకమాతృక
మాహేశ్వరుఁడు. స. శివపూజచేయువాఁడు
మాళిగ. త. మాడుగు, హర్మ్యము, ఇల్లు

## మి

మింగడ. దే. మీఁగడ
మింగనగొండి. దే. తిండిపోతు, మ్రింగనగొండి
మించిలి. దే. జిబిలిక, నిశాంకుశవృక్షము
మించు. దే. అతిశయించు, అతిక్రమించు, మెఱపు, ప్రకాశము, ఆధిక్యము, పురుషపాదతర్జన్యాభరణము, కాలిచుట్టు
మించుఁగాలు. దే. దక్షిణపాదము
మించుఁబోఁడి } మించుఁబోణి } దే. మెఱపువలె మనోజ్ఞురాలగుస్త్రీ, ఆఁడుది
మించుదల. దే. అతిక్రమణము, ఆధిక్యము
మింటిచూలి. దే. వాయువు
మింటితెరువరి. దే. సూర్యుఁడు, అమరుఁడు
మింరుఁడు. స. మిండగాఁడు, విటుఁడు
మిండ. త. వృత్తియందు మిండఁడు అను పదముయొక్క లుప్తశేషము
మిండ. దే. రక్తపుచ్ఛిక
మిండఁడు. త. విటుఁడు, పురుషుఁడు, అధికుఁడు
మిండగాఁడు } మిండగీఁడు } దే. మిండఁడు
మిండత. దే. జారిణి
మిండతనము. దే. ఱంకుతనము
మిండతపసి. దే. విటతపస్వి
మిండతుమ్మెద. దే. మగతుమ్మెద
మిండప్రాయము. దే. యౌవనము
మిండమేఘము. దే. పెద్దమబ్బు
మిండరి. దే. విటసంబంధమైనది
మిండఱికము. దే. జారత్వము
మిండలకోరి. దే. మిండత, జారిణి
మిండవడ్డి. దే. అధికమగువడ్డి
మిక్కటము. దే. మిక్కిలి, అధికము
మిక్కిలి. దే. అధికము, శ్రేష్ఠము
మిక్కిలికంటివేల్పు. దే. శివుఁడు
మిక్కిలికన్ను } మిక్కిలికను } దే. శివుని ఫాలనేత్రము
మిక్కిలివాఁడు. దే. అధికుఁడు
మిక్కిలు. దే. మీఱు, అతిశయించు
మిక్కుటము. దే. మిక్కటము
మిగత. దే. మిగులు, శేషము
మిగుల. దే. మిక్కిలి, అత్యంతము

మిగులు. దే. శేషించు, అతిశయించు, మట్టు మీఱు, శేషము, లాభము

మిగులుచు } దే. మిగులఁ జేయు, మిగులఁ
మిగుల్చు } బెట్టు

మిటమిట. దే. కాయుట మండుట లోనగు వానియందగు ననుకరణము

మిటమిటన. దే. మిటమిటయనుట

మిటమిటలాడు. దే. ఎగిరి ఎగిరిపడు

మిటారము. దే. నిక్కు, అతిశయము, విలాసము

మిటారి. దే. విలాసవతి, ఆఁడుది, మదము గలది, నిక్కుగలది, ఉన్నతిగలది

మిటారించు. దే. నిక్కు, అతిశయించు, దుముకు

మిట్ట. దే. ఉన్నతభూమి, ఉన్నతము, తీక్ష్ణము

మిట్టపండ్లు. దే. ముందఱికి వచ్చినపండ్లు

మిట్టమిఱ్ఱు. దే. అత్యున్నతభూమి, అత్యున్నతము

మిట్టాడు. దే. సంచరించు

మిట్టించు. దే. ఎగురు, మిట్టు

మిట్టిపడు. దే. ఎగిరిపడు

మిట్టిపాటు. దే. మిట్టిపడుట, గర్వము

మిట్టు. దే. ఎగురు, మిట్టించు

మిడమిడమిడుకు. దే. కోపపడు

మిడి. దే. మిడిసిపాటు, గర్వము, మిడిసిపాటుగలది, తీక్ష్ణము, ఉన్నతము

మిడికించు. దే. మిణకరించు

మిడిగ్రుడ్లవాఁడు. దే. ఉన్నేత్రుఁడు

మిడిగ్రుడ్లు. దే. ముందఱి కుఱికిన కనుగ్రుడ్లు

మిడినాగు. దే. ఎగిరి యెగిరిపడు సర్పవిశేషము

మిడిపండ్లవాఁడు. దే. మిట్టపండ్లవాఁడు, దంతురుఁడు

మిడిపండ్లు. దే. మిట్టపండ్లు

మిడిమేలము. దే. మిడిసిపాటు

మిడియ. దే. వేదవాక్యము

మిడియు. దే. ఎగురు, మిట్టు, వెలికుఱుకు

మిడివిల్లు. దే. ఉండవిల్లు

మిడివోవు. దే. తక్కు, తొలఁగు

మిడిసిపడు. దే. మిట్టిపడు, త్రుళ్లిపడు

మిడిసిపాటు. దే. మిట్టిపాటు

మిడుఁగు. దే. మిడుఁగురు

మిడుఁగురు. దే. అగ్నికణము, విస్ఫులింగము, మిణుగుఱుఁబురుగు

మిడుకరించు. దే. మిణకరించు

మిడుకు. దే. బ్రతుకు, తుళ్లు, కదలు, సంచరించు, ఎండు, పరితపించు, జీవము

మిడుగు. దే. కరినశిల

మిడుచు. దే. ద్రవద్రవ్యమును బొట్టు బొట్టుగా విడుచు, నెటికవిఱుచు

మిడుత. దే. శలభము

మిడుమిడుకను. దే. మిడుకు, పరితపించు

మిణకరము. దే. ఏమియుం దోఁచక భ్రమించుట

మిణకరించు.దే. ఏమియుందోఁచక భ్రమించు

మిణుఁగు. దే. మిడుఁగు

మిణుఁగురు. దే. అగ్నికణము, ఇంద్రగోపము

మితంగమము. స. ఏనుఁగు

మితంపచుఁడు. స. లోభి

మితభాషి. స. మితముగ మాటాడువాఁడు

మితము. స. కొలఁదియిడఁబడినది, తెలియఁబడినది

మితశాయి. స. కొంచెముగా నిద్రపోవువాఁడు

మితి. స. కొలఁది, గడువు, హద్దు

మిత్త. త. స్నేహితుఁడు
మిత్తి. త. మృత్యుదేవత, చావు
మిత్తిక. త. మన్ను, మృత్తిక
మిత్తిగొంగ. దే. శివుఁడు, మృత్యుంజయుఁడు
మిత్తిచూలు. దే. కేతుగ్రహము
మిత్తివేఁటకాఁడు. దే. శివుఁడు
మిత్రము } స. స్నేహితుఁడు, సూర్యుఁడు
మిత్రుఁడు }
మిథము. స. పరస్పరము
మిథునకర్మము. స. సంభోగము
మిథునము. స. ఆలుమగలజేత, ద్వయము, ఒకరాశి
మిథ్య. స. అసత్యము, మాయ
మిథ్యాదృష్టి. స. నాస్తికత్వము
మిథ్యామతి. స. పొరబాటు, అజ్ఞానము, భ్రాంతి
మిద్దియ. దే. మిద్దె
మిద్దె. దే. మాడువుమీఁద చేదునుగా పలకలుకప్పి గచ్చుపూసినకప్పు, తామర పువ్వు లోనగువానిలోపలి దిమ్మె, ఉంగరము మీఁదదిమ్మవలె నేర్పఱిచెడి తదవయవవిశేషము
మినమిన. దే. తళతళయను కాంతి
మినమినలాడు. దే. మినమినయని మెఱయు
మిను. దే. మిన్ను, ఆకాశము
మినుకు } దే. మినుకుమినుక్కుమను,
మినుక్కు } మినుకు మినుక్కుమను
మినుమినుకు } కాంతి, కిరణము, తాలిబొట్టు, చిన్నబంగారునాణెము
మినుకుఁజేడియ. దే. సరస్వతి
మినుకుమినుకుమను } దే. మినుకుమినుక్కు
మినుకుమినుక్కుమను } మని మెఱయు
మినుకులఖరణి } దే. సూర్యుఁడు, త్రయీ
మినుకులయిక్క } తనువు
మినుకులు } దే. వేదము, వాక్కు,
మిన్కులు } శాస్త్రములు
మినుక్కురను. దే. మినుక్కుమని మెఱయు
మినుచూలు. దే. వాయువు. నభస్వంతుఁడు
మినుపపోఁక. దే. భక్ష్యవిశేషము
మినుమినుకను. దే. మినుకుమినుకుమను
మినుము. దే. సస్యవిశేషము
మినుములు. దే. ధాన్యవిశేషము, మాషము
మినుసిగవేల్పు. దే. శివుఁడు, వ్యోమకేశుఁడు
మిన్న. దే. రత్నము, శ్రేష్ఠము, భూషణము, ద్యుతి
మిన్నక. దే. ఊరక
మిన్ను. దే. ఆకాశము
మిన్నుకొలఁకు. దే. ఆకాశగంగ
మిన్నుమన్ను. దే. ఆకాశమును భూమియుం, రోదసి
మిన్నువాఁక. దే. ఆకాశగంగ, స్వర్ణది
మిన్నువాఁకతాలుపు. దే. శివుఁడు, గంగాధరుఁడు
మిన్నేఱు. దే. ఆకాశగంగ, స్వర్ణది
మిన్వాఁక. దే. మిన్నువాఁక
మిమ్మటము. దే. మిక్కటము
మిర. స. మేర, మర్యాద
మిరియము } త. ఒకదినుసు సంబారువు,
మిరెము } మరీచము
మిరెపకాండ్ర. దే. ఒకానొకముండ్లచెట్టు
మిరెపకాయ. దే. బృహన్మరీచము
మిర్మిట్లు. దే. మిఱుమిట్లు
మిఱు. దే. మిఱుమిట్లుగలది

మిఱుమిట్లు } దే. కన్నులు మిక్కిలి
మిఱుమిట్టులు } మిట్టుటలు, చూడ శక్యముగాని కాంతిని చూచుటచే కండ్లకుఁ గ్రమ్మినచీఁకటులు

మిఱుమిట్లుగొను. దే. కన్నులు మిక్కిలి చెదరు

మిఱు. దే. ఉన్నతభూమి, ఉన్నతము

మిఱుచూపు. దే. ఊర్ధ్వదృష్టి

మిలమిల. దే. మినమిన, కాంతిధాళధళ్యము, మెదలుటయందగు ధ్వన్యనుకరణము

మిలమిలన. దే. మినమినలాడుట

మిలమిలలాడు. దే. మినమినలాడు

మిలు. దే. మీలు, చేఁపలు

మివులు. దే. మిగులు

మిశ్రకుఁడు. స. ఔషధములను కలుపువాఁడు

మిశ్రణము. స. మిశ్రీకరించుట, కలుపు

మిశ్రము } స. కలిసినది
మిశ్రితము }

మిశ్రీకరించు. స. మిశ్రముచేయు, కలుపు

మిశ్రుఁడు. స. గొప్పవాఁడు

మిశ్రేయ } స. అడవిసదాపచెట్టు
మిశ్రేయము }

మిష. స. కపటము, నెపము, మోసము

మిషి. స. జటామాంసి

మిష్టము. స. రుచిగలది, మనోహరమైనది, మధురమైనది

మిష్టాన్నము. స. మధురమగునన్నము

మిస. దే. కాంతివిశేషము

మిసమిస. దే. మెఱయుటయందగు ధ్వన్యనుకరణము, కాంతిధాళధళ్యము

మిసమిసమను } దే. మిసమిసయను
మిసమిసను }

మిసి. దే. మత్స్యవిశేషము

మిసి. స. జటామాంసి, ఓమము, సదాపచెట్టు

మిసిమి. దే. నూతనకాంతి, నవనీతము, మార్దవము

మిసిమింతలు. దే. కాంతితగ్గుట

మిసిమింతుఁడు. దే. అలసినవాఁడు, శ్రాంతుఁడు

మిసిమింతురాలు. దే. అలసినది, శ్రాంతురాలు

మిసుకు. దే. కదలు

మిహి. దే. శ్రేష్ఠము, మార్దవము, క్రొత్తది

మిహిక. స. మంచు

మిహికాకరుఁడు. స. చంద్రుఁడు

మిహిరుఁడు. స. సూర్యుఁడు

మిళిందము. స. తుమ్మెద

మిళితము. స. కలసినది, మిశ్రము

మిళ్లి. దే. మిక్కిలిచిన్నగరిఁటె, ఖజపము

## మీ

మీ. దే. వృత్తియందు మీఁదుశబ్దమునకు లుప్తశేషము

మీఁగండ్లమెకము. దే. శరభమృగము

మీఁగడ. దే. కాఁగిన పాలమీఁది తెట్టె, పెరుఁగుమీఁది తెట్టె, మస్తువు

మీఁగడపెరుఁగు దే. మీఁగడతోడి పెరుఁగు, శ్రీఘనము

మీఁగాలు. దే. పాదోపరిభాగము

మీఁజెయి. దే. శిరోపరిభాగము

మీఁదిసాకిరి. దే. ఉత్తరసాక్షి

మీఁదు. దే. పరము, ఉపరిభాగము, భవిష్యత్కాలము, దేవతకని నియమించిన ముడుపు

మీఁదుకట్టు. దే. ఏదేని ముడుపును దేవతకై ఎత్తియుంచు

మీఁదుమిక్కిలి. దే. కడుమిక్కిలి, పైగా

మీట. దే. ఏతపుమ్రానిక్రింది అరభాగము, కాఁ రెమునకు పైనుండు దూలము

మీటు. దే. ఎగఁజిమ్ము, పొడుచు, తేలు కుట్టు, ఉద్రేకము, ఆధిక్యము, వీణె మీటు, అధికము, పెంపు

మీఢము. స. విడువఁబడినమూత్రాదులు

మీనకేతనుఁడు. స. మన్మథుఁడు

మీనము. స. మత్స్యము, ఒకరాశి

| | |
|---|---|
| మీనవల్లంకి<br>మీనవల్లిక | త. నీటిమీఁదికులికి మత్స్యములనుబట్టెడు పక్షివిశేషము |

మీనాంకుఁడు. స. మన్మథుఁడు

మీను. త. చేఁప

మీనురూపురిక్క. త. రేవతీనక్షత్రము

మీమాంస. స. కర్మకాండను జ్ఞానకాండను ప్రతిపాదించుశాస్త్రము

మీమాంసకుఁడు. స. మీమాంసాశాస్త్రము తెలిసినవాఁడు

మీఱు. దే. అతిశయించు, కడచు, అతిక్రమించు

మీలనము. స. కనుమూయుట

మీలముచ్చు. దే. మీనవల్లంకి

మీలితము. స. మూయఁబడినది

మీవడ. దే. మీఁగడ

మీసకట్టు. దే. మీసముయొక్కయేర్పాటు

మీసము. దే. మగవాని పైపెదవిమీఁది వెండ్రుకలవరుస, శ్మశ్రువు

మీసర. త. మృగశిరానక్షత్రము

మీసరము. దే. శ్రేష్ఠము

# ము

ము. దే. ఒకప్రత్యయము, వృత్తియందు మూఁడుశబ్దమునకు ఆదేశముగావచ్చెడు రూపము, ముందుశబ్దమునకు వృత్తి యందలి లుప్తశేషము

ముంగ. దే. ఎన్నులమోపు

ముంగ. త. మూఁగ

ముంగట. దే. మొదట, ఎదుట

ముంగడ. దే. ముందుచోటు, ఎదురు, ముందు

ముంగతనము. దే. మూర్ఖత్వము

| | |
|---|---|
| ముంగమురము<br>ముంగమురాము<br>ముంగమురారి<br>ముంగయిమురారి<br>ముంగైమురారి | దే. ముంజేత ధరించెడు కటకవిశేషము |

ముంగఱ. దే. ముక్కఱ

ముంగల. దే. ముంగడ, ఎదురు, ముందు, ముందుచోటు

ముంగలి. దే. ముందునడచువాఁడు, ముందు నడుచునది, మీఁదటి

ముంగలు. దే. ముందునడచు

ముంగాము. దే. పొట్లముగా మడిచిన తాటాకుమట్టు, బెల్లముమొదలగువానిని నించినబరువులో సగము

ముంగాముచీర. దే. ఆఁడువారుకట్టుకొనెడు ఒకదినుసు నారకోక

| | |
|---|---|
| ముంగామురము<br>ముంగామురారి<br>ముంగామురుగు<br>ముంగామురువు | దే. కాంచన కటక భేదము |

ముంగారి. దే. ఋతుప్రారంభమునకు సంబంధించినది

ముంగాలు. దే. పాదాగ్రము, ప్రపదము
ముంగి } దే. నకులము
ముంగిస
ముంగిలి. దే. అంకణము, రెండుదూలముల మధ్యప్రదేశము, మధ్యప్రదేశము,ఇండ్ల ముందరియంగణము
ముంగిసమ్రాను. దే. ముంగిస రూపుగల మునస చివర
ముంగురులు. దే. నొసటిపైయెగిరియాడెడు ఉంగరపువెండ్రుకలు, భ్రమరకము
ముంగేలు. దే. ముంజేయి, ప్రకోష్ఠము
ముంగొంగు. దే. చెఱఁగుకొన, ముందరి చెఱఁగు
ముంగొన. దే. ముందటికొన
ముంగోపము. దే. ఓర్పులేకతటాలునవచ్చు కోపము
ముంగోపి. దే. ఓర్పులేక తటాలున కోపము చేసికొనువాఁడు
ముంగోలు. దే. మొదటిది, ప్రాథమికము
ముంచు. దే. మునుచు, జలాదులయందు మగ్నమగునట్లుచేయు
ముంచుకొను. దే. ఆక్రమించుకొను
ముంజకేశుఁడు. స. విష్ణువు
ముంజబంధనము. స. ఉపనయనము
ముంజము. స. ముంజిగడ్డి
ముంజి. త. బ్రహ్మచారిగట్టుకొనెడు ముంజ దర్భమొలత్రాడు
ముంజికాఁడు. దే. బ్రహ్మచారి
ముంజికోక. దే. నారచీర
ముంజె. దే. లేతతాటికాయలోని గిజురు
ముంజెయి } దే. మనికట్టుపఱుఁగల మోఁ
ముంజే } చేతిక్రిందిచేయి, ప్రకోష్ఠము
ముంజేరమ. దే. నాసాపుటము
ముంజోరు. దే. చూరుముందటి భాగము, వాచూరు

ముండ. దే. విధవ, ఉంచుకొన్న స్త్రీ
ముండ. స. బోడతరపుచెట్టు
ముండకుఁడు. స. మంగలవాఁడు
ముండనము. స. క్షౌరము, రక్షణము
ముండఫలము. స. కొబ్బరిచెట్టు
ముండము. స. తల
ముండమోపి. దే. ముండమోసినది, విధవ
ముండమోయు. దే. వైధవ్యము నొందు, వ్యర్థమగు
ముంశరి } దే. వేశ్యాసంగమశీలుఁడు,
ముండలమారి } వైశికుఁడు
ముండలు. దే. వేశ్యలు
ముండి. స. మంగలవాఁడు, బోడతరవృక్షము, బోడితలవాఁడు, సన్యాసి
ముండితుఁడు. స. తలబోడియైనవాఁడు, తల గొఱుగఁబడినవాఁడు
ముండుఁడు. స. రాహువు, బోడితలవాఁడు, తెగినచేతులు కాళ్లు లోనగునవి కల వాఁడు, సన్యాసి
ముండ్లకంచె. దే. ముండ్లకంప, ముండ్లకంప వెలుఁగు
ముండ్లపంది } దే. ఏఁదుపంది, శల్యము
ములుపంది
ముంత. దే. వాడుకొనెడు చెంబు, పాలు మొదలగునవిపోయు మృత్పాత్రము, మానిక, మూఁడున్నరసేరు
ముంతపొగ. దే. మూతికి కట్టుటకు కాల్చి ముంతలో వేసిన మిరెపకాయల పొగ
ముంతమామిడి. దే. ఒకానొకచెట్టు, అగ్రబీజము, జీడిమామిడి

ముందర / ముందఱ } దే. మునుపు, మొదలు, ఎదురు

ముందఱిమ్రాను. దే. అరిణ నిలుపుటకై అడ్డముగాఁ గట్టఁబడిన మ్రాను

ముందల. దే. శిరోగ్రభాగము

ముందు. దే. ఎదురు, పూర్వకాలము

ముందుపడు. దే. ముందగు, మునుకొను

ముంపు. దే. ముంచుట, గుంపు

ముంపుగొను. దే. గుంపుగూడు

ముకు. త. ముక్కు

ముకుందము. స. ఎఱ్ఱదామర, ఒకనిధి, పాదరసము

ముకుందుఁడు. స. విష్ణువు

ముకుఁగ్రోళ్లు / ముక్కుఁగ్రోళ్లు } దే. నాసారంధ్రములు

ముకుఁజెఱమ / ముక్కుఁజెఱమ } దే. నాసాపుటము

ముకుఁద్రాడు / ముక్కుఁద్రాడు } దే. ఎద్దముక్కున గ్రుచ్చెడు దారము, నాథము

ముకుటము. దే. ముక్కుటము

ముకుటము. స. కిరీటము

ముకుదూలము / ముక్కుదూలము } త. ముక్కునడిమి యెముక

ముకుదొమ్మ. దే. మత్స్యవిశేషము

ముకుబంతి. త. పశువులకు ముక్కునందుఁ గలుగు నొకానొకరోగము

ముకురము. స. అద్దము, పొగడచెట్టు

ముకుష్టకము. స. మకుష్టకము

ముకుళము. స. అరవిరిమొగ్గ, అభినయహస్తవిశేషము

ముకుళించు. స. ముకుళీభవించు, మొగుడు, మోడ్చు

ముకుళితము. స. ముకుళించినది

ముకుళీభవించు. స. ముకుళించు

ముకూలకము. స. దంతిచెట్టు

ముక్క. దే. తునుక, ఖండము

ముక్కంటి. దే. శివుఁడు, త్రిలోచనుఁడు

ముక్కంటిచెలి. దే. కుబేరుఁడు

ముక్కంటిచుక్క. దే. ఉత్తరాభాద్రనక్షత్రము

ముక్కంటితలపువ్వు. దే. చంద్రుఁడు

ముక్కంటిపండు. దే. కొబ్బెరకాయ

ముక్కఁడి. దే. దుక్కిచాలించి ఆహారమునకు పోవునపుడు అరకలనన్నిటిని ఒక్కచోట ప్రోగుచేసి ఒక్కటిగాఁ జేర్చి నిలిపినట్టిఆఅరకలకాండ్లమొత్తము, అనేకులకు ఒక పెట్టున తగిలెడువ్యాధి

ముక్కద్దము. త. సులోచనము

ముక్కన్ను. దే. మూఁడవకన్ను

ముక్కపురుగు. దే. తవుటిపురుగు

ముక్కరమాను. దే. పుల్లిరుసుతిరుగుచేట్టము

ముక్కరము. దే నాసారంధ్రము

ముక్కఱ / ముక్కర } దే. నాసికాభరణవిశేషము

ముక్కలిపీఁట. దే. ముక్కాలిపీఁట

ముక్కాఁక. దే. మూఁడుకాఁకలసమాహారము

ముక్కాని. దే. మూఁడుకానులు

ముక్కారు. దే. మూఁడుకారులు

ముక్కాలిపీఁట. దే. మూఁడుకాళ్లమర్చిన ఎత్తుబల్ల

ముక్కాలు. దే. మూఁడుకాళ్లు, మూఁడుపాతికలు

ముక్కిఁడి. దే. ముక్కుపోయినవాఁడు, విగ్రుఁడు

ముక్కిడి. దే. ఒకచెట్టు

ముక్కు. దే. చెడు

ముక్కు. త. ఏదైన కష్టమైన పనిని జేయుం నపుడు శ్వాసమును బిగఁబట్టు, పక్షి ముక్కు, స్తనాగ్రము, నాసిక, తుద

ముక్కుకంబము. దే. ముక్కుదూలము

ముక్కుఁగమ్మి. త. ముక్కుపోఁగు, నత్తు

ముక్కుకొయ్య. దే. బాధకరుఁడు

ముక్కుటము. దే. నారమడి, క్షౌమము

ముక్కుదాడిమ. త. ఒకచెట్టు

ముక్కుదూలము. దే. ముక్కునడిమి ఎముక

ముక్కుపూరెడు. దే. ఒకదినుసు పూరేడుపిట్ట

ముక్కుపోఁగు. దే. ముక్కుఁగమ్మి

ముక్కుముంగర. దే. ఒకానొక యడవిచెట్టు

ముక్కులు. దే. మిక్కిలి చిన్నసూకలు, భక్ష్యవిశేషము

ముక్కుస. దే. మూఁడుకుంచెములు

ముక్కూరు. దే. అజ్ఞానమును పొందు

ముక్కోటిక. దే. త్రిపురములు

ముక్కొను. దే. ముందుకొను

ముక్కొమ్ము మెకము. దే. మనుబోతు

ముక్కోణము. దే. మూఁడుకోణములుఁగల దిగ నేర్పఱచినకొయ్యచెట్టము, త్రికోణము

ముక్కోల. దే. త్రిదండము

ముక్త. స. ముత్తెము, రంకుటాలు, ముక్తి నొందినది, విడువఁబడినది

ముక్తము. స. విడువఁబడినది

ముక్తాఫలము. స. ముత్యము

ముక్తావళి. స. ముక్తాహారము

ముక్తాస్ఫోటము. స. ముత్తెపుఁజిప్ప

ముక్తి. స. మోక్షము, విడుపు

ముక్తిక్షేత్రము. స. కాశి

ముఖంపచుఁడు. స. యాచకుఁడు

ముఖఖురము. స. పల్లు

ముఖగంధకము. స. ఉల్లిగడ్డ

ముఖద్వారము. స. నది సముద్రములో కలియుచోటు, నోరు

ముఖనిరీక్షకుఁడు. స. సోమరి

ముఖపటము. స. ముసుఁగు

ముఖప్రీతి. స. ఇచ్చకము, మోమాటము, ఉపచారము

ముఖమంటపము. స. దేవళములో గోపురము దగ్గఱనుండు మంటపము

ముఖమార్జనము. స. మొగముకడుగుకొనుట

ముఖము. స. మొగము, నోరు, మాట, ప్రధానము, మొదలు, ఉపాయము, ఒకనాటకసంధి, ఇల్లులోనగువాని ముందటిభాగము, ఆధారము, ఆరంభము, ముట్టె, తల, చివర, చనుమొన, పక్షి ముక్కు, వైపు, ద్వారము, పీఠిక, పైభాగము

ముఖరము. స. మ్రోఁగునది, అసంబద్ధవచనములాడునది

ముఖరుఁడు. స. వదరుఁబోతు, ముఖ్యుఁడు

ముఖవచనము. స. నోటిమాట

ముఖవస్త్రము. స. ప్రేతవస్త్రము

ముఖవాసన. స. కర్పూరాదివాసన

ముఖవీణ. స. మొగవీణె

ముఖశాల. స. తలవాకిటిచావడి, మొగసాల

ముఖాంతరముగ. దే. ద్వారమున

ముఖాముఖి. స. ఎట్టయెదుట

ముఖ్యము. స. ప్రధానము, శ్రేష్ఠము

ముఖ్యుఁడు. స. సమానులలో శ్రేష్ఠుఁడు

ముగము. త. ముఖము

ముగించే } దే. పూర్ణ[illegible] సం[illegible]
ముగియించే } చేది

ముగింపు } దే. సమాప్తి
ముగియింపు }

ముగితి. త. మోక్షము, ముక్తి

ముగియిక. దే. ముగింపు

ముగియు. దే. సమాప్తమగు, చెచ్చు

ముగుద. త. ముగ్ధ, ఆడుది

ముగుదుడు. త. ముగ్ధుడు

ముగురు దే. ముగ్గురు

ముగ్గ. దే. ఒకానొకచెట్టు

ముగ్గవేయు. దే. మాగవేయు

ముగ్గు. దే. ముగ్గు, కాయపండు, రంగవల్లి

ముగ్గొయ్య. దే. అగ్రదండము, అసాధ్యము

ముగ్ధ. స. నాయికావిశేషము, ఉదయించు చున్న యౌవనముగలది, చేకనిది, తెలివిలేనిది, క్రొత్తది

ముచుండ. స. ఎఱ్ఱమల్లెచెట్టు

ముచ్చి. దే. ముచ్చివాడు, చిత్రకారుడు, పుస్తకములు కట్టువాడు

ముచ్చిక. దే. తొడిమక్రిందిబిల్ల, వృంత మూలము

ముచ్చికొను. దే. ముసురుకొను

ముచ్చిచ్చు. దే. త్రేతాగ్ని

ముచ్చిరి. దే. దుఃఖము నొందినవాడు

ముచ్చిరితనము. దే. మనోదుఃఖము

ముచ్చిరు. దే. శోకించు, దుఃఖించు

ముచ్చిలి } దే. పెడతలయందలిగుంత,
ముచ్చిలిగుంట } అపటువు

ముచ్చిలించు. దే. దొంగిలించు

ముచ్చి[illegible] మధ్యస్థ లకు మీరు తీర్పుచేసిన ప్రకారము ఒప్పుకొనియెదమని వ్రాసియిచ్చెడు ఒడంబడిక, సేద్యముచేయుకాపులు నేల కలవారికి వ్రాసియిచ్చెడు ఒడంబడిక

ముచ్చిలిపాటు. దే. కునికిపాటు

ముచ్చిలు. దే. ముచ్చిలించు, దొంగిలించు

ముచ్చివుక. దే. మద్దుగులము

ముచ్చె. త. పైజారు

ముచ్చెబంగారు. త. కాకిబంగారు

ముచ్చెవాడు. దే. చర్మకారుడు, మాదిగ వాడు

ముచ్చే. దే. ముడ్డిపూస, త్రికము, మూడు

ముచ్చేంగి. దే. మీనభేదము

ముచ్చేట. దే. సల్లాపము, వృత్తాంతము, కోరిక, ప్రేమము, రమ్యము, వేడుక

ముచ్చేటకాడు. దే. కోరికకలవాడు

ముచ్చేటపడు. దే. కోరు, ఆశపడు

ముచ్చేటలాడు. దే. సంభాషించు

ముచ్చేటించు. దే. ముచ్చేటలాడు

ముచ్చేట్లు. దే. మూడుచోట్లు

ముచ్చేముడుగు. దే. మిక్కిలిముడుగు

ముచ్చేవలము. దే. మూడుచేవలములు

ముచ్చు. దే. మ్రుచ్చు, దొంగ

ముచ్చేచ్చుకొను. దే. ముసురుకొను

ముచ్చేప్రొద్దు. దే. అర్థరాత్రి

ముచ్చేబొడుపు. దే. అల్పపుదొంగ

ముజ్జగము. దే. మూడుజగములు

ముటము. దే. ముద్దపిడుక, ఏఱుపిడుక

ముట్టెబడు. దే. దయ్యు

ముట్టడము } దే. నిర్బంధము, ముట్టడించుట
ముట్టడి }

ముట్టడించు. దే. కోట మొదలగువానిని చుట్టుకొని నిర్బంధించు

ముట్టణము. దే. ముట్టడము

ముట్టించు. దే. అంటించు, ముట్టఁజేయు, కాల్చు, రగుల్చు

ముట్టికాళ్లవాఁడు. దే. ముట్టుమోఁకాళ్లు గలవాఁడు

ముట్టియ. దే. ముట్టె

ముట్టు. తే. తాఁకు, శత్రువునిదాఁకు, మర్మముదాఁకు, ముట్టడించు, కడముట్టు, తాఁకుడు, ఆఁడుదానిరజస్సు, రజస్వల, కొఱముట్టు

ముట్టుకొను. దే. ముట్టడించు, ఆక్రమించు, తాఁకు

ముట్టుకోలుపు. దే. ముట్టుకొనఁజేయు

ముట్టుకోలు. దే. ముట్టడి

ముట్టుకోలుగొను
ముట్టుకోల్గొను
ముట్టుకోలుపట్టు } దే. ముట్టడించు
ముట్టుకోల్పట్టు
ముట్టుకోలుపఱుచు

ముట్టుత. దే ముట్టుది

ముట్టునీళ్లు. దే. బహిష్ఠయయిన యాఁడుది నాల్గవనాఁడు చేయుస్నానము

ముట్టుపడు. దే. సంకటమగు, సంకటపడు

ముట్టుపాటు. దే. సంకటము

ముట్టుసందు. దే. అవతలపోవుటకుదారిలేని సందు

ముట్టె. దే. పందిముక్కు, పండులోని మామిడిటెంక

ముట్టెచేఁప. దే. మత్స్యవిశేషము

ముట్టెమెకము. దే. పంది

ముట్టెమోపు. దే. కార్యనిర్వాహకసమయము

ముట్లచేఁక. దే. ముట్టువాండ్రు ండెడియిల్లు

ముడి. దే. దారములోనగువానిముడి, గ్రంథి, వెండ్రుకలముడి, చెట్టులోనగువాని బుడిపి, ముడుసుముడి, ఎద్దుమూఁపురము, కలహము, ముడివలె వ్రాసెడి కొన్ని హల్లులరూపాంతరము, సంధి, ముడ్డి యొక్క రూపాంతరము, ఖండము కానిది, వికసింపనిది, పొట్టుతో నుండునది

ముడికాఁడు. దే. సంధానముచేయువాఁడు, సంధాయకుఁడు, ధూర్తుఁడు

ముడికాళ్లవాఁడు. దే. ముట్టికాళ్లవాఁడు

ముడికొక్కు. దే. ఒకానొకపురుగు

ముడికోలుపు. దే. ముడిగొనఁజేయు

ముడిగిబ్బ. దే. ఆఁబోతు

ముడిగొను. దే. ముడుఁచు, బంధించు

ముడిచె. దే. సాంక్రామికరోగము

ముడిబట్ట. దే. అంచుకమ్ములులేనివస్త్రము

ముడిబొమ. దే. ముడివడ్డబొమ

ముడియ. దే. మాట, పందెము

ముడియవిడుపు } దే. ముడివిడుచుదొంగ
ముడియవిడ్పు }

ముడివడు. దే. ముడిగలదియగు, సంధించు, పెనఁగొను, అతిశయించు, కలుగు

ముడివాటు. దే. ముడివడుట

ముడివెట్టు. దే. ముడివేయు

ముడుఁగఁబాఱు. దే. ముడుఁగు

ముడుఁగు. త. ముకుళించు, తగ్గు, చేష్టలుడుగు, సంకోచించు

ముడుఁగుదామర. దే. పొత్తిదామర, నమస్కారి
ముడుఁచేు. త. ముడుఁగఁజేయు, ముడివెట్టు
ముడుకు దే. మోఁకాలు
ముడుచేు. దే. ముడివేయు, అలంకరించేు
ముడుత. దే. వస్త్రపునెఱి, కడుపుమీఁదివళి
ముడుపరి. దే. ముడుపుపట్టినవాఁడు
ముడుపు. దే. దేవతార్పణమే నియమముగ నుండిన ధనము మొదలగు వస్తువుల యొక్కమూట, ధనము,ధనము ముడిచిన మూట, ముల్లె
ముడుము. దే. మోఁకాలు, జానువు
ముడుసు. దే. ముడ్డిపూస, ఎముక
ముడేకము. దే. ఏగాని
ముడ్డి. దే. గుదము, మూఁడి, అడుగుభాగము
ముడ్డిపూస. దే. వెన్నెముక క్రిందిచివర పూస, త్రికము
ముణకరాములు. గ్రా. ఎటూతోఁచనిస్థితి
ముణుఁగు.దే.నీళ్లలోమగ్నమగు,హ్రస్వమగు
ముణుఁగుఁదామర. దే. ముడుఁగుఁదామర
ముతంగి. స. తెల్లగిసెచెట్టు
ముతరాచే } దే. ఒకశూద్రజాతి
ముత్తరాచే }
ముతుక. దే. దళసరి, ముదుగు
ముత్త. దే. వృద్ధ, వృద్ధుఁడు
ముత్తరగలు. దే. కడుపుమీఁది త్రివళులు
ముత్తవ } దే. ముత్తవతల్లి, అవ్వకవ్వ,
ముత్తవ్వ } వృద్ధస్త్రీ, వృద్ధపితామహి
ముత్తవపులగము. దే. చిట్టాముదపుఁజెట్టు
ముత్తాత. దే. తాతయొక్కతాత, వృద్ధపితామహుఁడు
ముత్తి. త. మోక్షము
ముత్తిగ. దే. తొమ్మిది
ముత్తియము. త. ముత్తెము
ముత్తుము. దే. మూఁడుతూములు
ముత్తెపుఁజిప్ప. దే. శుక్తి, భక్ష్యవిశేషము
ముత్తెపుఁబంట. దే. చెఱకు
ముత్తెపురిక్కనెల. దే. చైత్రమాసము
ముత్తెపుసవతు. త. చిత్రానక్షత్రము
ముత్తెము. త. మౌక్తికము, మశూచికపు పొక్కు
ముత్తెసరి. త. ముక్తాహారము, సస్యవిశేషము
ముత్తెసరులు. త. ధాన్యవిశేషము
ముత్తైద } దే. వృద్ధసువాసిని, సుమంగలి
ముత్తైదువ }
ముత్తో. దే. ముత్తయిదువ
ముత్యము. త. ముత్తియము, మశూచికపు పొక్కు
ముత్యాలమ్మ. త. ఒకగ్రామదేవత
ముత్రోవద్రిమ్మరి. దే. ఆకాశగంగ
ముదము. స. సంతోషము
ముదముద. దే. కొంతుకు, సంకోచము
ముదల. దే. ఆజ్ఞ, లక్ష్యము, గనిమ చేరిక నేల
ముదలకించేు. దే. మార్కొను
ముదలవెట్టు. దే. ఆజ్ఞాపించు
ముదలించేు. దే. అడుగు, మార్కొను
ముది. దే. వార్ధకము, వృద్ధ, వృద్ధుఁడు, ముసలి, ముదిరినది
ముదిగారము. దే. మౌర్ఖ్యము
ముదిత. దే. ఆఁడుది
ముదిత. స. సంతోషము నొందినది
ముదిమి. దే. వార్ధకము

ముదియ. త. ముద్దియ
ముదియు. దే. ముదిమిపొందు
ముదిరము. స. మేఘము
ముదిరుఁడు. స. విటుఁడు
ముదివాఁడు. దే. వృద్ధపురుషుఁడు
ముదుక. దే. ముదుగు, వృద్ధ, వృద్ధుఁడు
ముదుకఁడు. దే. వృద్ధుఁడు
ముదుగు. దే. లావు, నాణ్యము కానిది
ముదుటుంగరము, ముద్దుటుంగరము } దే. అక్షరములచెక్కిన ఉంగరము
ముదురు. దే. పరిణమించు, వర్ధిల్లు, లేఁత కానిది, వృద్ధము
ముదుసరి, ముదుసలి } దే. వృద్ధ, వృద్ధుఁడు
ముద్గపర్ణి. స. పిల్ల పెసరచెట్టు
ముద్గము. స పెసలు
ముద్గరము, ముద్గలము } స. ఇనుపగుదియ, సమ్మెట, గద
ముద్ద. దే. కబళము, పిండము, ఉండ
ముద్ద. త. ముగ్ధ, ముగుద
ముద్దకమ్మర. దే. తాయికరగి యినుము చేసెడి కమ్మరజాతి
ముద్దకవ్వము. దే. కట్టెబిళ్ల తగిలించిన కవ్వము
ముద్దకూఁడు. దే. అన్నపిండము, మద్దెలకు వేయు బూడిదకలిసినఅన్నము
ముద్దకొలిమి. దే. తాయి యినుముగా కరఁగెడుకొలిమి
ముద్దయ్య. త. కుమారస్వామి
ముద్దరాలు. దే. ముగ్ధస్త్రీ
ముద్దవాయువు. దే. కాళ్లు చేతులుముద్దలుగా కట్టుకొనిపోవు వాతరోగము

ముద్దాడు. దే. చుంబనాది పూర్వకముగా లాలనము చేయు, ఆదరించు
ముద్ది. దే. ఆపద
ముద్దిడు. దే. చుంబనము చేయు
ముద్దియ. త. ఆఁడుది
ముద్దిఁటె. దే. ఏనుఁగునుపొడిచెడు బరిగోల
ముద్దు. త. ముద్ర, చుంబనము, ఆదరము, మనోజ్ఞత, మనోహరము, కోరిక
ముద్దుఁడు. త. ఏమియుఁ దెలియనివాఁడు
ముద్దుగుమ్మ, ముద్దులగుమ్మ } దే. మనోజ్ఞురాలగు నాఁడుది, ఆఁడుది
ముద్దుపెట్టుకొను. దే. చుంబనము చేయు
ముద్దురాలు. దే. మనోజ్ఞురాలగునాఁడుది
ముద్దులాఁడి. దే. మనోజ్ఞురాలగునాఁడుది, మనోజ్ఞురాలు
ముద్దులాఁడు. దే. మనోజ్ఞుఁడు
ముద్దె. దే. తామరపూవులోనిదుద్దు
ముద్ర. స. సంజ్ఞాక్షరములు చెక్కిన ఉంగరములోనగునది, ఉంగరము మొదలగువానియందుఁ గల సంజ్ఞాక్షరములు, చిహ్నము
ముద్రణము. స. ముద్రించుట
ముద్రపలక. దే. ముద్ర వేసెడు పలక
ముద్రాక్షరశాల. స. గ్రంథములు ముద్రించెడియిల్లు
ముద్రాధారణము. స. చక్రాంకనము చేసికొనుట
ముద్రించు. స. ముద్రాంకితము చేయు, అచ్చువేయు
ముద్రిక. స. ముద్దుటుంగరము, అంగుళిముద్ర
ముద్రితము. స. ముద్రింపఁబడినది, ముకుళితమైనది

మునగ. దే. శిగ్రువృక్షము
మునస. దే. ఏతపు మ్రానిమీఁది యర భాగము
ముని. స. ఋషి, బుద్ధదేవుఁడు, అగిసియ వృక్షము
ముని. దే. ఆరంభము, వృత్తియందు ముసు శబ్దమునకు బదులుగా వచ్చురూపము, కొన
మునికోల } దే. ఎడ్లనుబొడుచుకఱ్ఱ, కశ
ములుకోల }
మునిచీఁకటి. దే. ప్రొద్దుగ్రుంకినతోడనే పర్వేడు పలుచేని చీఁకటి
మునిమనుమఁడు. దే. ప్రపౌత్రుఁడు
మునిమనుమరాలు. దే. ప్రపౌత్రి
మునిమాపు. దే. ప్రదోషకాలము
మునిముంగల. దే. మొట్టమొదట, ఎట్ట యెదుట
మునిముచ్చు. దే. దొంగ,పశ్యతోహరుఁడు, పశ్యతోహరురాలు
మునిముట్ట. దే. మిక్కిలి
మునియేఁడు. దే. నిరుటికితొలిసంవత్సరము
మునీంద్రుఁడు. స. బుద్ధదేవుఁడు, ఋషి శ్రేష్ఠుఁడు
మును. దే. మున్ను, మొదలు, తుది
మునుఁగు. దే. మునుకవేయు, అడఁగు, నశించు, మఱుఁగుపడు
మునుక. దే. మునుఁగుట, మునుకవేయుట
మునుకు. దే. సంతాపించు, పలుకు, మాఱు పలుకు, మిఁడకరించు
మునుకువ. దే. పూనిక
మునుకొను. దే. ముందుకొను, ముందుపడు
మునుకోలు. దే. ముకుకొనుట
మునుగట్టు. దే. తూరుపుకొండ
మునుచు. దే. మునుకొను, మునుఁగఁజేయు
మునుపడు. దే. మునుకొను
మునుపు. దే. ముందు, పూర్వము
మునుము. దే. పైరుకోఁత కేర్పఱుచుకొన్న మితి, వరుస, ఎదురు, ఎదుటిచోటు, సేనాముఖము, తఱుచేఁదనము, తఱుచు
మునుముకొను. దే. వరుసపెట్టు
మున్కొను. దే. మునుకొను
మున్గు. దే. మునుఁగు
మున్నడి } దే. ముందుగా
మున్నాడి }
మున్నరక. దే. ధైర్యము, ముందుగాదున్ను టకు సిద్ధమైన అరక
మున్నీటిచూలి. దే. లక్ష్మి. క్షీరసాగరకన్యక
మున్నీరు. దే. సముద్రము
మున్ను. దే. ముందు, పూర్వము, మొదలు
మున్నూఱు. దే. మూఁడునూఱులు
మున్నెటికము. దే. జాణతనము, రాక్షసి తనము
మున్నెరిక. దే. పూర్వరాగమువలనఁగలిగిన విరహతాపము
మున్నేఁడు. దే. పోయినసంవత్సరమునకు ముందుసంవత్సరము
మున్పు. దే. మునుపు
మున్ము. దే. మునుము
ముప్పందు. దే. ముప్పదిమంది
ముప్పటిలు. దే. చెల్లారు
ముప్పది. దే. మూఁడుపదులు
ముప్పదిరెంటిగుంపు. దే. రేవతీనక్షత్రము
ముప్పాతిక. దే. మూఁడుపాతికలు

# ర

ర. ఒకయక్షరము

రంకువు. స. తెల్లనిచెంద్రుకలును మెత్తని తోలును గల యిఱ్ఱి

రంగఁడు. త. శ్రీరంగనాథుఁడు

రంగము. దే. సోఁడె

రంగము. స. తగరము, యుద్ధభూమి, నాట్యస్థానము, రంగు, శ్రీరంగము, గుంపుగలచోటు, నాట్యము, ఆనందము

రంగరి. దే. రంగువేయువాఁడు

రంగరించు, రంగలించు. దే. ద్రవములేని వస్తువుతో ద్రవవస్తువును చేర్చి చూపుడు వ్రేలికొనతో మర్దించు

రంగవల్లి. స. రచించినముగ్గు

రంగాజీవుఁడు. స. చిత్తరువువ్రాయువాఁడు, నట్టువుఁడు

రంగాయించు. దే. రంగువేయు

రంగు. త. వర్ణము, కాంతి

రంగోపజీవి. స. నాటకమాడిజీవించువాఁడు

రంజకము. స. ఇంగిలీకము, రంజించునది

రంజకుఁడు. స. రంజించువాఁడు, రంగువేయువాఁడు

రంజన. స. ప్రాభవము, ఉత్సాహము, ఉల్లాసము

రంజనము. స. ఇంగిలీకము, ఎఱ్ఱగందము, రంజించునది

రంజని. స. నీలిచెట్టు

రంజించు. స. రంజిల్లఁజేయు

రంజితము. స. చక్కఁగా రంగువేయఁబడినది, ముచ్చటైనది

రంజిల్లు, రంజిలు. స. ఎఱ్ఱనగు, అనురాగముపొందు

రంజేకము. దే. కాల్చుటకు తుపాకి చెవియందు పెట్టెడుమందు

రంజేణ, రంజేణి. దే. గాదెవంటికాఁగు

రండ. స. విధవ, ఎలుకజీడిమొక్క, అంకుటాలు

రండుఁడు. స. పురుషసంతానములేనివాఁడు

రంక. స. క్రీడించువాఁడు

రంతు. త. రతి, క్రీడ

రంతుకాఁడు. దే. క్రీడాపరుఁడు

రంధి. దే. చేటు, గాడు, పోరు

రంధ్రము. స. బెజ్జము, సందు, దూఱు

రంధ్రాన్వేషి. స. ఇతరుల దోషములను వెతుకువాఁడు

రంపె, రంపియ. దే. మాదిగవాఁడు తోలుకోసెడు సాధనవిశేషము, తాటాకులు మట్టగించికోసెడు సాధనవిశేషము

రంపెలాఁడి. దే. రాక్షసకృత్యముగల స్త్రీ

రంభ. స. ఒకానొకఅప్సరస్త్రీ, అరఁటిచెట్టు

రంభము. స. బ్రహ్మచారి ధరించెడు వెదురుకోల

రంహణము. స. వేగముగాఁ బోవుట

రంహతి. స. రథవేగము

రంహస్సు. స. పడిగలది, వేగము

రకము. దే. దినుసు, శ్రేష్ఠము, సుందరము

రక్కసి. త. రాక్షసి, రాక్షసుఁడు

రక్కసీఁడు. దే. రాక్షసుఁడు

రక్కసుఁడు. త. రాక్షసుఁడు, నైరృతి

రక్కసులగొంగ. దే. విష్ణువు

రక్కెస. త. రాక్షసస్త్రీ, అయుక్తము

రక్కొను. దే. వర్ధిల్లు, తేఱుకొను, కలుగు

రక్తకము. స. పెద్దగోరంట మొక్క, తోంపు చీర, మంకెనచెట్టు
రక్తకుండు. స. అనురాగముగలవాండు
రక్తచందనము. స. ఎఱ్ఱగంధము
రక్తతుండము. స. చిలుక
రక్తదృక్కు. స. పావురము
రక్తనాసిక. స. గుడ్లగూబ
రక్తప. స. జేలగ, ఢాకిని
రక్తపాయి. స. నల్లి
రక్తపాయిని. స. జేలగ
రక్తపుండు. స. నైరృతుండు
రక్తపుచ్ఛిక. స. నలికండ్లపాము
రక్తఫల. స. దొండచెట్టు
రక్తబీజము. స. దానిమ్మచెట్టు
రక్తము. స. నెత్తురు, కుంకుమ, కుంకుమ పువ్వు, రాగి, ఎఱుపు, ఎఱ్ఱనిది, అను రాగముగలది, రంగువేయంబడినది
రక్తసంధ్యకము. స. చెంగలువ
రక్తసరోరుహము. స. ఎఱ్ఱదామర, కుంకుమ పువ్వు
రక్తాంగము. స. కుంకుము, పగడము, కంపిల్ల వృక్షము, నల్లి
రక్తాంగుండు. స. అంగారకుండు
రక్తాక్షి. స. ఒకసంవత్సరము
రక్తాశ్మము. స. కావిఱాయి
రక్తి. స. రాగము, అనురాగము, శ్రావ్యత, గానమాధుర్యము
రక్తిమ } స. రక్తవర్ణము
రక్తిమము }
రక్తుండు. స. అనురక్తుండు, వలపు గొన్న వాండు
రక్తైరండము. స. పేరాముదపుచెట్టు
రక్తోత్పలము. స. ఎఱ్ఱదామర, కెందమ్మి
రక్ష. స. రక్షణము, రక్షణమునకై బిడ్డలు మొదలైనవారికి కట్టెడుమాలిక మొద లయినది, రక్షణమునకై నొసటంబెట్టు కొనుహోమభస్మము, లక్క, వాంత, జాగ్రత్త, తోరము
రక్షకుండు. స. రక్షించువాండు
రక్షణము. స. రక్షించుట, కాపు
రక్షరేకు. దే. మంత్రాక్షరములువ్రాసినరేకు
రక్షము. స. కాపాడుట
రక్షస్సు. స. రాక్షసుండు
రక్షాధికృతుండు. స. అధికారి, పోలీసు అధికారి, దండనాధికారి
రక్షాధిపతి. స. పోలీసు అధికారి
రక్షాపేక్షకుండు. స. ద్వారపాలకుండు
రక్షి. స. రక్షించువాండు
రక్షించు. స. రక్షణముచేయు, కాపాడు
రక్షితము. స. రక్షింపంబడినది
రక్షితవ్యము. స. రక్షింపం దగినది
రక్షివర్గము. స. అంగరక్షకసమూహము
రక్షము. స. రక్షించుట
రక్ష్యము. స. రక్షింపం దగినది
రగడ. స. పద్యభేదము, శ్రావ్యత, పోరు
రగులు. దే. మండు, మంటయెత్తు
రగులుచు. దే. రగులంజేయు
రచన. స. మాల్యాదినిర్మాణము, నిర్మాణము, గద్యపద్యాదిరచన, చేయుట
రచించు } స. నిర్మించు, పన్ను
రచియించు }
రచితము. స. రచియింపంబడినది

రచ్చ. త. రాజమార్గము, మండపము, సభ, గోష్ఠి, కలకలము, కలహము
రచ్చకుఁదీయు. దే. జగడమునకు పిలుచు, రచ్చకీడ్చు
రచ్చకొట్టము. త. రచ్చమంటపము
రచ్చగాను. దే. గుంపుగూడు
రచ్చపట్టు. దే. రచ్చకొట్టము, కొలువుకూటము
రచ్చబండ. దే. రచ్చచేయుకాలమందు పదిమంది కూర్చుండెడు బండ
రచ్చబల్ల. దే. రచ్చచేయుకాలమందు పదిమందికూర్చుండెడు బల్ల
రచ్చమ్రాను. దే. రచ్చచేయుచోట నీడకై పెట్టినమ్రాను
రజక } స. చాకలది
రజిక }
రజకుఁడు. స. చాకలవాఁడు
రజతము. స. వెండి, హారము, ఏనుఁగుకొమ్ము, తెల్లనిది
రజతాద్రి. స. వెండికొండ, కైలాసము
రజని. స. రాత్రి, పసుపు, నీలిచెట్టు
రజనీకరుఁడు. స. చంద్రుఁడు
రజనీచరుఁడు. స. రాక్షసుఁడు
రజనీముఖము. స. ప్రదోషము, మునిమాపు
రజనీవల్లభుఁడు. స. చంద్రుఁడు
రజశ్చక్రము. స. సుడిగాలి
రజస్వల. స. ముట్టుది
రజస్వలము. స. దున్నపోతు, దుమ్ముతో కప్పఁబడినది
రజస్సు } స. ఒకగుణము, దుమ్ము, ముట్టు నెత్తురు, పుప్పొడి
రజము }
రజహారుఁడు. స. చాకలవాఁడు
రజోబంధము. స. ముట్టురాకుండనిలుపుట
రజ్జువు. స. త్రాడు, ఆఁడుదానిజెడ
రజీన. దే. గడన, సంపాదనము
రజాయి. దే. చలికి కప్పుకొనెడు దుప్పటి
రజ్జన. దే. ఆత్మస్తుతి, వికత్థనము
రజ్జు. దే. ప్రేలు, వ్యర్థభాషణము
రజ్జులాఁడి. దే. వ్యర్థభాషణురాలు, ఆత్మస్తుతిపరురాలు
రజ్జులాఁడు. దే. వ్యర్థభాషణుఁడు, ఆత్మస్తుతిపరుఁడు
రటనము. స. ధ్వని, మోఁత
రటితము. స. నిష్ఫమంటమోఁత, రెపరెప
రట్టడి. దే. నింద్యము, అపకీర్తి
రట్టు. దే. దూఱు, నింద
రట్టు. త. ఉపద్రవము
రడి } దే. రెడ్డి
రడ్డి }
రడ్డు. త. రాజ్యము
రణగృహము. స. కోటవాఁకిటిమీఁదియిల్లు
రణనము. స. ధ్వని, మోఁత
రణము. స. యుద్ధము, మోఁత
రణరంగము. స. యుద్ధభూమి
రణశిక్ష. స. యుద్ధశాస్త్రము
రణితము. స. మ్రోఁత, మ్రోసినది
రణుఁడు. స. కొడుకు
రతనపుగని. త. సముద్రము, రత్నాకరము
రతనపువిల్లు. దే. ఇంద్రధనుస్సు
రతనము. త. మణి
రతము. స. సురతము, ఆఁడుగుఱి, ఆసక్తము
రతి. దే. పచ్చలతూనికయందొకయెత్తు మణుఁగునందు ఇరువదియైదవభాగము, సురతము, అనురాగము, మన్మథునిభార్య, ఆఁడుగుఱి
రతికరుఁడు. స. సంతోషము గలుగఁజేయువాఁడు

రతికర్మ. స. సంభోగము

రతికుహరము<br>రత్యంగము } స. యోని

రతికూజితము. స. మణితము

రతిగురుఁడు. స. మగఁడు

రతితస్కరుఁడు స. స్త్రీలను బలాత్కారముగా చెడఁగొట్టువాఁడు

రతిపతి. స. మన్మథుఁడు

రతిహిండకుఁడు. స. స్త్రీలను బలాత్కారము చేయువాఁడు

రత్నకంబళము. స. తివాసీ

రత్నగర్భ. స. భూమి

రత్నగర్భుఁడు. స. సముద్రుఁడు, కుబేరుఁడు

రత్నము. స. మణి, స్వజాతియందు శ్రేష్ఠమైనది

రత్నసానువు. స. మేరుపర్వతము, బంగరు కొండ

రత్నాకరము<br>రత్నాకరుఁడు } స. సముద్రము, సముద్రుఁడు

రత్ని. స. పిడికెలితిమూర

రథకడ్య. స. రథములసమూహము

రథకారుఁడు. స. తేరు చేయువాఁడు, వడ్లవాఁడు

రథగుప్తి. స. రథముమీఁదికప్పు, చక్రరంధ్రములఁ జొప్పించెడు నెమ్ములు

రథద్రువు. స. తినాసవృక్షము

రథము. స. తేరు, శరీరము, తినిశవృక్షము, వేతసవృక్షము

రథాంగము. స. రథచక్రము, చక్రవాకము, విష్ణుచక్రము

రథాంగాహ్వయము. స. చక్రవాకము

రథి. స. రథమునెక్కువాఁడు, రథమునెక్కి యుద్ధము చేయువాఁడు

రథికుఁడు<br>రథిరుఁడు } స. రథమునెక్కి యుద్ధముచేయువాఁడు

రథిని. స. సేన

రథోత్సవము. స. దేవుఁడు తేరుమీఁద నెక్కు సంబరము

రథ్య. స. రథసమూహము, రాజమార్గము, మార్గము

రథ్యము. స. రథము నీడ్చెడుగుఱ్ఱము లోనగునది

రథ్యావాదము. స. బజారువర్తమానము

రదచ్ఛదము<br>రదనచ్ఛదము } స. పెదవి, పలుకప్పు

రదనము<br>రదము } స. పల్లు, దశనము

రద్ది<br>రద్దు } దే. అల్లరి, గొప్పధ్వని

రపణము. దే. గొప్ప

రపము. దే. చెల్లుబడి, సంబరము, సంతోషము

రపాలు. దే. ఆగడము

రప్పించు. దే. రాఁజేయు

రబ్బు. దే. కాంతి

రభసము. స. వేగము, సంతోషము

రమ. స. లక్ష్మి, భాగ్యము, భార్య

రమణ. త. ఒప్పిదము, ప్రీతి, విధము

రమణ. స. మనోజ్ఞ

రమణి. స. క్రీడించునట్టిఆఁడుది, స్త్రీ, భార్య

రమణించు. త. ఒప్పిదమగు

రమణీయము. స. ఒప్పిదమైనది

రమణుఁడు. స. మగఁడు, మన్మథుఁడు, మనోజ్ఞుఁడు

రమము. స. రక్తాశోకవృక్షము

రమరమి<br>రమారమి } దే. ఇంచుమించు

రమించు } స. క్రీడించు, సంభోగించు
రమియించు }

రముఁడు. స. మగఁడు, ప్రియుఁడు

రమ్యా. స. రాత్రి

రమ్యకము. స. భారతాదివర్షములలో నొకటి

రమ్యము. స. పొట్లవేరు, సంపెఁగచెట్టు, ఒప్పిదమైనది

రయస. స. త్వర, వేగము

రయము. స. వేగము, ప్రవాహము

రల్లకము. స. కంబళి

రవ. త. అణువు, ఖండము, వజ్రము, రవగాలు, సన్నము, చిన్నగుండు, గోదుమరవ

రవంత. త. స్వల్పము

రవగాలు. దే. అశ్వగతివిశేషము

రవడి. దే. అప్పు, ఋణము

రవణ. త. రమణ

రవణ. స. అందము, పిడిగంట

రవణము. త. భూషణము

రవణము. స. మ్రోఁగునది

రవణించు. త. రమణించు, అందముగానుండు

రవపాళము. దే. మిక్కిలిసన్నపాటి వస్త్రము

రవమంచము. స. సకినలమంచము

రవము. స. ధ్వని, కంఠధ్వని

రవరవ. దే. మొరయుటయందగు ధ్వన్యనుకరణము, కాంతివిశేషము, స్పర్ధ

రవళి } త. ధ్వని
రవలి }

రవళించు. త. ధ్వనించు

రవాయి. దే. కృత్రిమపద్మరాగమణి

రవాలు. దే. రవగాలు

రవాళి. త. రవళి

రవాళించు. త. రవళించు

రవి. స. సూర్యుఁడు, జీవుఁడు

రవిక. దే. ఱవిక

రవులు. దే. రగులు

రశన. స. పదియాఱుపేటలుఁగల ఆఁడుదాని మొలనూలు

రశ్మి. స. వెలుఁగు, పగ్గము, కిరణము

రస. స. భూమి, రసాతలము, నాలుక, అందుగుచెట్టు

రసకర్పూరము. స. కర్పూరరసము

రసగర్భము. స. ఇంగిలీకము, రసాంజనము

రసగుండు. దే. రసముపూసిన గోళాకారవస్తువు

రసజ్ఞ. స. నాలుక

రసజ్ఞత. స. తెలివి, నేర్పు, రసగ్రహణము

రసజ్ఞుఁడు. స. పండితుఁడు, రసికుఁడు

రసదాడి. త. ఒకదినుసుచెఱకు, ఒకదినుసు అరఁటి

రసదాళిక. స. చెఱకుదినుసు

రసన. స. నాలుక, రశన

రసపాచకుఁడు. స. వంటవాఁడు

రసమాతృక. స. నాలుక

రసము. స. పాదరసము, జలము, శృంగారాది, కషాయాది, రుచి, పసరు, అనురాగము, వీర్యము, దేహధాతువిశేషము, ద్రవము, విషము, బోళము, చారు, సారము, పాలు, నాలుక, కోరిక, ప్రేమ, సంతోషము, అందము, బంగారు, రసకర్పూరము, చెఱకురసము, నేయి, అమృతము

రసవతి. స. వంటయిల్లు

రసవాదము } స. పాదరసమునుకట్టి బంగారు చేసెడు విద్య
రససిద్ధి }

రసాంజనము. స. అంజనవిశేషము

రసాతలము. స. పాతాళలోకము
రసాభాసము. స. విరసము, చెడగొట్టుట
రసాయనము. స. ఔషధవిశేషము, మజ్జిగ, విషము
రసాయనుఁడు. స. గరుత్మంతుఁడు
రసాల. స. కొన్నిసంబారువులుచేర్చి పక్వము చేసినమజ్జిగ, చెక్కెర, నాలుక, గఱిక, తెల్లనేలగుమ్ముడుచెట్టు
రసాలము. స. చిల్లమజ్జి, బోళము, చెఱకు, మామిడిచెట్టు
రసావల్లి. దే. భక్ష్యవిశేషము
రసి, రసిక. దే. పుంటిచీము
రసిక. స. చెఱకుపాలు, రసికురాలు, సిగరి, అనఁగా కొన్ని సంబారువులు చేర్చి పక్వముచేసిన మజ్జిగ
రసికత. స. రసజ్ఞత
రసికుఁడు. స. రసము నెఱిఁగినవాఁడు
రసితము. స. మేఘగర్జనము, ధ్వని, మొలాముచేయఁబడినది, ధ్వనించినది, రుచి చూడఁబడినది, సారాయి
రసేంద్రము. స. పాదరసము
రసోత్తమము. స. పాలు
రసోద్భవము. స. ముత్యము
రసోనకము. స. వెల్లుల్లి
రస్తు. దే. వస్తుసంభారము
రస్మి. దే. ఆయము, రాబడి
రహాటము. స. రాట్నము
రహాటు. త. రట్టు, రాటు, ఉపద్రవము
రహాణము. స. విడిచిపెట్టుట
రహాస్య. స. ఒక రేఁఱు
రహస్యము. స. ఏకాంతము, దాఁచఁదగినది
రహస్సు. స. ఏకాంతము, సురతము
రహి. దే. ఆనందము, ఆసక్తి, తెలివి, బాగు, రక్తి, విధము, రంజనము
రహించు, రహియించు. దే. ఒప్పు, వర్ధిల్లు
రహితము. స. విడువఁబడినది

## రా

రా. దే. ర అనుదానియొక్క రూపాంతరము, నీచమిత్రోద్దేశములయందు ఉద్దేశ్యవాచకమునకు ఏకత్వంబున అంతాగమంబగు. ఉ—కానీరా, ఏలరా
రా. త. రాచశబ్దమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలినరూపము
రాంకలము. స. ముల్లు
రాంకవము. స. మృగరోమములవలననేయఁబడినది
రాంభము. స. సన్యాసి చేతఁబట్టెడు వెదురు కోల
రాఁజు. దే. నిప్పు అంటుకొను
రాఁబట్టు. దే. ఇచ్చినదానిని మరలఁదీయు, సేకరించు, ఏదైనసంగతిని వెడలఁదీయు
రాక. దే. ఆగమనము
రాక. స. సంపూర్ణకళలుగల చంద్రునితోఁగూడిన పున్నమ, తీఁట, సమర్తాడినది
రాకడ. దే. రాక, ఆగమనము
రాకాసి. త. రాక్షసి, రాక్షసుఁడు, రక్కసి
రాకించు. దే. మోఁదు
రాకిడి. దే. జెడబిల్ల
రాకుమారుఁడు. స. రాజకుమారుఁడు
రాకొట్టు. దే. రారాపోరాయని యేకవచనాంతముగా నుచ్చరించు, తిరస్కరించు

రాక్షస. స. ఒకసంవత్సరము

రాక్షసము. స. బలాత్కారముగా కన్య నపహరించుకొనివచ్చి చేసికొనెడు వివాహము

రాక్షసి. స. రక్కసి, బలురక్కసచెట్టు

రాక్షసుఁడు. స. రక్కసుఁడు, నైరృతుఁడు

రాగంట్లమారి. దే. పోకిరి, గండాగొండి

రాగద్రవ్యము. స. రంగువేయువస్తువు

రాగము. స. నాటలోనగునది, అనురాగము, రంగు, మాత్సర్యము, క్లేశములోనగునది, ఎఱుపు, సంతోషము, అందము, కోపము, అసూయ, రజోగుణము

రాఘవుఁడు. త. రఘువంశజాతుఁ డగు రాముఁడు

రాగసూత్రము. స. త్రాసుత్రాడు

రాగి. దే. తవిఁదపైరు

రాగి. త. తామ్రము

రాగి. స. అనురాగముగలది, ఎఱుపుగలది

రాగించు. స. రాగిల్లు

రాగిల్లు. స. రంజిల్లు

రాగులు. దే. తవిఁదలు

రాచిలుక. దే. రామచిలుక, చిలుక, రాజకీరము

రాచ. త. రాజసంబంధి

రాచకార్యము. దే. సమాచారము, దొరతనపువారి కార్యము, వ్యవహారము

రాచకుఱుపు } దే. ప్రాణాంతకముగా వీపున
రాచపుండు } లేచెడు మహావ్రణము

రాచకొమరుఁడు. దే. రాజకుమారుఁడు

రాచపుట్టువు. దే. క్షత్రియుఁడు

రాచమామిడి. దే. గుజ్జుమామిడి, రాజామ్రవృక్షము

రాచయుసిరిక. దే. ఆమలకవృక్షవిశేషము

రాచఱికము. దే. రాజభావము, దొరతనము

రాచవాఁడు. దే. క్షత్రియుఁడు

రాచవీడు. దే. రాజధాని

రాచు. దే. ఒరసికొను, ఒరయు, చెఱచు, రుద్దు, అలుకు

రాచూలి. దే. రాచకొమారుఁడు, రాజపుత్త్రి

రాజకము. స. రాజులసమూహము

రాజకర్కటి. స. పెద్దదోసమొక్క

రాజకార్యము. స.దివాణపుపని, వ్యవహారము

రాజకుఁడు. స. చిన్నరాజు

రాజకోశాతకి. స. పెద్దబీఱమొక్క

రాజదంతము. స. ముందఱిపల్లు

రాజధర్మము. స. రాజుచేయవలసిన పని, రాజనీతులు

రాజధాని. స. రాజు వసించునట్టి ప్రధాన నగరము

రాజనీలము. స. పచ్చ

రాజన్యకము. స. రాజన్యుల సమూహము

రాజన్యుఁడు. స. పట్టభద్రుఁడైనరాజు, క్షత్రియుఁడు

రాజన్వంతము. స. మంచిరాజుగలదేశము

రాజబల. స. గొంతెమగోరుచెట్టు

రాజబీజి. స. రాచకులమునందుఁ బుట్టిన వాఁడు

రాజభూయము. స. రాజత్వము

రాజమార్గము. స. బండ్లు మొదలగునవి పోఁదగిన పెద్దత్రోవ

రాజమాషము. స. అలసందెలు

రాజయక్ష్మము. స. క్షయరోగము

రాజయోగము. స. సులభమగుధ్యానపద్ధతి, జన్మకాలమందు మనుజునికి గ్రహయోగమువలనఁ గలుగు మంచిస్థితి

రాజరాజు. స. చక్రవర్తి, కుబేరుఁడు, దుర్యోధనుఁడు, చంద్రుఁడు
రాజర్షి. స. క్షత్రియుఁడగు ముని
రాజవంతము. స. రాజుగలదేశము
రాజవీథి. స. పెద్దవీథి
రాజవృక్షము. స. ఱేలచెట్టు
రాజవ్రణము. స. రాచపుండు
రాజసభ. స. న్యాయసభ
రాజసము. స. రజోగుణమువలనఁ గలిగినది, గర్వము
రాజసూయము. స. ఒకరాజు తక్కినరాజులను జయించి చేసెడి యజ్ఞము
రాజహంస. స. ఎఱ్ఱనిముక్కు కాళ్లు గల హంస, రాజశ్రేష్ఠుఁడు
రాజాంకుఁడు. స. శివుఁడు
రాజాంగము. స. ప్రభుత్వము
రాజాదనము. స. పాలచెట్టు, మోదుగు చెట్టు
రాజాధికారి. స. దొరతనమువారియుద్యోగి
రాజాన్నము. స. రాజులు భుజింపఁదగిన యన్నము, రాజనము
రాజామ్రము. స. రాచమామిడిచెట్టు
రాజార్కము. స. వెల్లజిల్లేడుచెట్టు
రాజార్హము. స. అగరు, రాజునకుఁ దగినది
రాజి. స. పంక్తి, రేఖ, సమూహము
రాజిక. స. నల్లావాలు, వరిమడి, వరుస
రాజితము. స. ప్రకాశితము
రాజిలము. స. ఇరుదలపాము
రాజిల్లు. స. ప్రకాశించు
రాజీవము. స. తామర, మత్స్యవిశేషము, మృగవిశేషము, రాజును అనుసరించి జీవించునది

రాజ్ఞి. స. రాజుభార్య, సూర్యునిభార్య, ప్రభ్వి
రాజ్యము. స. దొరతనము, దొరతనమునకు లోఁబడిన దేశము
రాజనము. త. సస్యవిశేషము
రాజనములు. త. ధాన్యవిశేషము
రాజు. స. ప్రభువు, పుడమిఱేఁడు, రాచవాఁడు, యక్షుఁడు, ఇంద్రుఁడు, చంద్రుఁడు
రాజోపచారము. స. రాజునకు జరగు శుశ్రూష, లేక సేవ
రాటనము. త. రాట్నము, రాటనము
రాటము. త. జనసమ్మర్దము, రాట్నము
రాటు. త. ఉపద్రవము, జనసమ్మర్దము
రాటుపడు. దే. ఉపద్రవపడు
రాట్టు. స. రాజు
రాట్నపాకు, దే. రాట్నమున కమర్చెడు పలక
రాట్నము. త. నూలువడికెడుయంత్రము లోనగునది
రాట్పడు. త. రాటుపడు
రాడు. దే. గుంజె, స్తంభము
రాణ } త. ఒప్పిదము, ప్రీతి, విధము
రమణ }
రాణి. త. రాజుభార్య, భార్య
రాణించు. త. ఒప్పు
రాణివాసము. త. అంతఃపురము, అంతఃపుర స్త్రీ, భార్య
రాణువ. దే. సేన, పరివారము
రాతి. స. మిత్రుఁడు, అనుగ్రహము, ఈవి, బహుమానము
రాతిగొరక. దే. మత్స్యవిశేషము
రాతియుప్పు. దే. గనులలోనుండి త్రవ్వఁబడినయుప్పు, కొండయుప్పు
రాతిరి. త. రాత్రి, రేయి

రాత్రి. స. నిశ, యామిని, రజని

రాత్రించరుఁడు } స. రాక్షసుఁడు, నిరృతి
రాత్రిచరుఁడు

రాధ. స. ఒకగొల్లది, కర్ణుని పెంపుడుతల్లి, విశాఖానక్షత్రము, మెఱపు, విష్ణుక్రాంతమొక్క, ఉసిరికచెట్టు

రాధము. స. వైశాఖమాసము

రాధేయుఁడు. స. కర్ణుఁడు

రాద్ధాంతము. స. సిద్ధాంతము

రాపడు. దే. స్తంభించు, ఱాయియగు, దృఢపడు

రాపాడు. దే. రాయు

రాపిడి. దే. ఒరయిక

రాపు. దే. ఒరయిక, రాయిడి

రాపుడు. దే. రాచుట

రాపుడురాయి. దే. గోడలులోనగునవి నును పగుటకై రాచెడుఱాయి

రాపులుఁగు. దే. పక్షివిశేషము, కంకము

రాపువ్వు. దే. అశ్మపుష్పము

రాపొడి. దే. రాపిడివలనఁగలుగుచూర్ణము, ఆకుఱాతితో రాచినపొడి

రాబందు. దే. రాపులుఁగు

రాబడి. దే. వచ్చుబడి, ఆయము

రాభస్యము. స. సంతోషము, బలాత్కారము

రామ. దే. మీనభేదము

రామ. స. రమించునట్టి ఆఁడుది, స్త్రీ

రామకము. స. సంతోషపఱచునది, మనోహరమైనది

రామచంద్రుఁడు } స. మహిమగల శ్రీరాములు
రామభద్రుఁడు

రామరము. స. ఇంగువ

రామణీయకము. స. అందము

రామతమ్మ. దే. చిలుక

రామతాడు. దే. పెద్దతాటిచెట్టు

రామపూగము. స. నిడుపుతొడిమగలపోఁక

రామబాణము. స. తాటాకుపుస్తకములను తొలిచెడు క్రిమివిశేషము

రామము. స. కుష్ఠము, వాస్తుకవృక్షము, పెద్దదుష్పి, అందమైనది, తెల్లనిది, నల్లనిది

రామసాగరములు. దే. శాలిధాన్యవిశేషములు

రామాయణము. స. దశరథ పుత్రుఁడగు శ్రీరాముని చరిత్రమును దెలుపు నొక గొప్పగ్రంథము

రాముఁడు. స. రఘురాముఁడు, బలరాముఁడు, పరశురాముఁడు

రామునిదాడి. దే. అసంఖ్యము, రామందాడి

రాయంచ. త. రాజహంస

రాయఁడు. త. రాజు

రాయబారము. త. దౌత్యము, సంధికర్మ

రాయబారి. దే. రాయబారము చేయువాఁడు, దూత

రాయసకాఁడు. దే. జాబులువ్రాయునుద్యోగి

రాయసము. దే. వ్రాఁతపని

రాయఁసము. త. రాజసము, గర్వము, రజోగుణము

రాయి. దే. శిల

రాయిడి. దే. ఒరయిక, ఉపద్రవము

రాయిడించు. దే. అల్లరిచేయు

రాయిడికత్తె. దే. ఉపద్రవము చేయునది

రాయిడికాఁడు. దే. ఉపద్రవము చేయువాఁడు

రాయిడిగిడిగిడి. దే. వాద్యవిశేషము, డిండి
మము
రాయు. దే. గొంతుకమ్ము, ఒరయు, ఎదిరించు, కలహించు
రారాజు } త. చక్రవర్తి, కుబేరుఁడు,
రారాజు } దుర్యోధనుఁడు
రారాపిడి } దే. మిక్కిలి యొరయిక
రారాపు }
రారేక. దే. రావిరేక
రాలఁగొట్టు. దే. రాలుచు
రాలు. దే. గళితమగు, పడు
రాలుగాయ. దే. తుంట
రాలుచు } దే. రాలఁజేయు, రాలఁగొట్టు
రాల్చు }
రాలుపడు } దే. కంపించు
రాల్పడు }
రాలుపాటు. దే. రాలుపడుట, కంపము
రాలుపు. దే. రాలుట
రావడి. దే. ఉపద్రవము
రావడు. దే. రాయియగు, జడుఁడగు
రావణము. స. ఏడ్పుట, పెద్దఅఱపు
రావణహస్తము. స. వీణాభేదము
రావణుఁడు.స.లంకేశ్వరుఁడు, హింసకుఁడు, తెలిసినమూఢుఁడు
రావము. స. ధ్వని
రావి } దే. అశ్వత్థవృక్షము
రాగి }
రావించు. దే. రప్పించు
రావిరేక. దే. బిడ్డలకు కొండెయందుఁ గట్టెడు రావియాకువంటి పతకము
రావు. త. రాజు, రాయఁడు
రావుత్తు } త. గుఱ్ఱమునెక్కువాఁడు, సాది
రావుతు }

రాప్రేక. త. రావిరేక
రాశి. స. ప్రోగు, మేషాది
రాశిత్రయము. స. త్రయరాశికము
రాష్ట్రము. స. దేశము, ఉపద్రవము
రాష్ట్రిక. స. వాఁకుడుచెట్టు
రాష్ట్రియుఁడు. స. నాట్యపరిభాషయందు రాజు పెండ్లాము తోఁడబుట్టినవాఁడు
రాసభము. స. గాడిద
రాసభి. స. ఆఁడు గాడిద
రాసము. స. గోపకులక్రీడావిశేషము, రసము, పరిహాసము, సల్లాపము, కలకలధ్వని
రాసి. త. మేషాదిరాశి
రాస్న. స. సన్నరాష్టము, దుంపరాష్టము
రాహిత్యము. స. రహితభావము, లేమి
రాహు. త. రాహువు
రాహుతు. త. గుఱ్ఱపురౌతు
రాహుత్తుఁడు. స. గుఱ్ఱపురౌతు, సాది
రాహువు. స. గ్రహవిశేషము, తలగాము
రాళము. స. సజ్జరసము

# రి

రింఖ. స. అశ్వఖురము, అశ్వగతివిశేషము, నృత్యము, దురదగొండి
రింఖణము } స. జాఱుట, స్ఖలనము
రింగణము }
రింగు. దే. ఱెక్కలగాలిచేప్పడు
రింగులు. దే. వస్త్రపుఁగుచ్చె
రించోళి. స. సమూహము
రింజె. దే. మల్లబంధవిశేషము
రింబ. దే. రిమ్మ

రికము. దే. ఱికము
రిక్క. త. నక్షత్రము
రిక్కవెట్టు. దే. ఒళ్లువిఱుచుకొను
రిక్కించు. దే. నిక్కించు
రిఖ్ఖ. దే. తోఁకత్రిప్పుటయందగుధ్వన్యనుకరణము
రిక్త. స. తిథివిశేషము
రిక్తము. స. అడవి, వట్టి
రిక్తుఁడు. స. దరిద్రుఁడు
రిక్థము. స. ధనము, విడిముడి, ఆస్తి
రిక్థహారి. స. దాయాది, పిండప్రదాత
రిక్ష. స. సూర్యకిరణములలోఁ గనపడు నలుసు
రిక్షము. స. ఋక్షము
రిత్త. త. వట్టి, కల్ల, ఊరక
రిత్తకత్తె. త. తేరకత్తె, పరాయిది
రిత్తకాఁడు. దే. తేరకాఁడు
రిత్తరించు. దే. చేక్కఁగా నిక్కించే
రిత్తవోవు. దే. వ్యర్థమగు
రిత్తిక. త. తమ్మునిభార్య
రిపువు. స. శత్రువు
రిప్పు. దే. వెలితి
రిమ్మ. దే. ఉన్మాదము
రిరంస. స. రమింపనిచ్ఛ
రిరంసువు. స. రమింప నిచ్ఛగలవాఁడు
రిరక్ష. స. రక్షింపనిచ్ఛ
రిరక్షువు. స. రక్షింప నిచ్ఛగలవాఁడు
రిల్లు. దే. చిమట, ఒకవిధమగుపురుగు
రివ్వట, రివ్వ } దే. ఉపశాఖ, రెమ్మ
రిష్టము. స. క్షేమము, అశుభము, అభావము, ఖడ్గము, కుంకుడుచెట్టు
రిష్టి. స. అశుభము, ఖడ్గము

## రీ

రీఢ. స. తిరస్కారము, అమర్యాద
రీణము. స. కాఱినది
రీతి. స. తెఱఁగు, మేర, ఇత్తడి, వైదర్భ్యాది, ఇనుపచిట్టెము, కాఱుట, జాఱుట, ప్రవాహము
రీతిపుష్పము. స. కుసుమాంజనము

## రు

రు. దే. ఒకప్రత్యయము
రుంకము. దే. రంధ్రము
రుం. దే. చర్మవాద్యవిశేషము
రుండము. స. తెగినతల
రుంద్రము. స. విరివియైనది
రుక్కు. స. సూర్యకిరణము, కాంతి, ఇచ్ఛ, రోగము
రుక్మకారకుఁడు. స. అగసాలెవాఁడు
రుక్మము. స. బంగారు, లోహము
రుగ్నము, రుగ్ణము } స. విఱిగినది, రోగముఁ జెందినది
రుగ్ణత. స. రోగము
రుగ్మత. స. రోగము
రుచకము. స. సౌవర్చలవణము, సర్జికాక్షారము, అశ్వాభరణ విశేషము, మాల్యము, మంగళద్రవ్యము, దంతము, లవంగపుఁబట్ట, రాజగృహవిశేషము, ఆముదఁపుచెట్టు, మాదీఫలపుఁజెట్టు, కంఠాభరణవిశేషము
రుచి. స. చేవి, ఇచ్ఛ, సూర్యకిరణము, కాంతి, రంగు
రుచించు. స. ఇష్టమగు

రుచితము. స. ప్రకాశించునది, తియ్యనిది, జీర్ణమైనది

రుచిరము } స. ఒప్పిదమైనది, రుచిగలది
రుచ్యము }

రుచిష్యము. స. మనోహరమగునది

రుచ్యుఁడు. స. మగఁడు, ప్రియుఁడు

రుజ. స. రోగము, చెఱుపు, బాధ

రుటము. త. రూఢము, దృఢము

రుట్టు. స. కోపము

రుశము } స. ధ్వని
రుతి }

రుత్త. దే. నాశము

రుత్తు. దే. కొట్టు

రుదనము. స. ఏడ్పు, ఏడ్చుట

రుదితము. స. రోదనము, ఏడ్పు

రుదురక్క }
రుదురాక } త. రుద్రాక్షము
రుదురాచ్చ }

రుద్దు. దే. తోము

రుద్దుడు. దే. తోమకము, మార్జనము

రుద్రజట. స. రుద్రజడమొక్క

రుద్రభూమి. స. శ్మశానము, ఒలఁకులమిట్ట

రుద్రము. స. భయంకరమైనది, గొప్పది

రుద్రాక్షము. స. రుద్రాక్షపుపూస, ఒకానొక చెట్టు

రుద్రాక్షి. స. సంపెమల్లియ

రుద్రాణి. స. పార్వతి

రుద్రుఁడు. స. శివుఁడు

రుధిరము. స. నెత్తురు, చెండిరము

రుధిరామయము. స. మూలవ్యాధి

రుధిరుఁడు. స. అంగారకుఁడు

రుధిరోద్గారి. స. ఒకసంవత్సరము

రుద్ధము. స. అడ్డగింపఁబడినది, చుట్టఁబడినది

రుబ్బు. దే. ఱోటిలోఁబోసి పొత్రముతో మెదుపు

రుబ్బుగుండు } దే. రుబ్బెడు గుండ్రా
రుబ్బుపొత్రము } యి

రుబ్బుఱోలు. దే. రుబ్బెడు ఱాతిఱోలు

రుమ. స. ఉప్పళము, ఉప్పుగని, సుగ్రీవుని భార్య

రుమాలు } దే. తలగుడ్డ, చేతపట్టుకొను
రుమాలువు } గుడ్డ

రురుదిష. స. ఏడువవలెనను నిచ్ఛ

రురువు. స.నల్లచారలదుప్పి,ఒకరాక్షసుఁడు

రువాణము. దే. కాంతి

రువారము. దే. విలాసవిశేషము, అందము

రువ్వ. దే. దమ్మిడి

రువ్వము. త. తడవ, ఆవృత్తి

రువ్విచ్చు. దే. చిన్నవాండ్రు పసనను పల్లె వేయుటకై ఉపాధ్యాయుల ముందర నొకపర్యాయము చెప్పు

రువ్వు. దే. విసరివైచు

రువ్వు. త. పల్లె, తడవ

రుశతి. స. అశుభమైనవాక్కు

రుష. స. కోపము

రుష్టి. స. కోపము

రుసి. త. ఋషి

రుహ. స. గఱిక, మహామంజిష్ఠవృక్షము

రుహాకము. స. రంధ్రము, పగులు

## రూ

రూక. త. ధనము, చిన్నమొత్తు వెండిబంగారముల నాణెము

రూక్షము. స. కఱకైనది, ప్రేమలేనిది
రూక్షితము. స. కఱకుగాఁ జేయఁబడినది, మురికి చేయఁబడినది
రూక్షుఁడు. స. ప్రేమలేనివాఁడు
రూడి. త. రూఢి
రూఢము. స. మొలకయెత్తినది, ప్రసిద్ధి కెక్కినది, నిశ్చయింపఁబడినది
రూఢి. స. మొలకయెత్తుట, ప్రసిద్ధి, నిశ్చయము, వాడుక
రూణించు. దే. ముల్లులు ఒకవిధముగా బంధించు
రూణింపు. దే. మల్లబంధవిశేషము
రూపకము. స. ఒకయర్థాలంకారము, నాటకము, రూపము, తాళభేదము
రూపకారుఁడు. స. చిత్తరువులను చెక్కువాఁడు
రూపగంధ. స. మూరుకొండమొక్క
రూపగు. దే. వర్ధిల్లు
రూపడఁగు. దే. చేచ్చు, నశించు
రూపడఁచు. దే. చంపు
రూపము. స. ఆకారము, సౌందర్యము, శుక్లపీతాదివర్ణము, చక్షురింద్రియగోచరము, సహజస్థితి, విధము, గుఱుతు, ప్రతిబింబము, పోలిక, పదము
రూపరి } రూపసి } దే. సౌందర్యవంతుఁడు, సౌందర్యవతి
రూపఱు. దే. అంగహీనమగు, నశించు, చేచ్చు
రూపలావణ్యము. స. అందము
రూపవంతుఁడు. స. అందగాఁడు
రూపాజీవ. స. వేశ్య
రూపాభిగ్రాహితము. స. పని చేయుచుండఁగాఁ బట్టుకొనఁబడినది
రూపాయి. త. పదియాఱు అణాలు వెలగల వెండినాణెము

రూపించు. స. నిరూపించు, రూఢిచేయు
రూపు. త. ఆకృతి, చక్కఁదనము, విధము
రూపుమాపు. దే. రూపుమాయఁజేయు
రూపుమాయు. దే. నశించు, చేచ్చు
రూపురూపున. త. సమ్ముఖమున
రూపుసెడు. దే. నశించు
రూప్యము. స. బంగారు వెండి లోనగువాని నాణెము, రూపాయి, వెండి, సుందరము
రూప్యాధ్యక్షుఁడు. స. టంకసాలకధికారి
రూషితము. స. ధూళి మొదలగువానిచేఁ గప్పఁబడినది

# రె

రె } రే } దే. ప్రశంసార్థకశబ్దముల కనుప్రయుక్తమగును. ఉ. బళిరే, బాపురె
రెంచె. దే. జూదమునందు రెండు
రెంట. దే. రెండగుట, ద్వైధము, జీములు
రెంటత్రాగుడులిండి. దే. సింహము
రెంటత్రాగుడుమెకము. దే. ఏనుఁగు
రెంటము. దే. మడుపు, చర్మము
రెంటెమి. దే. జెంటనేఁతవస్త్రము
రెండు. దే. ద్విసంఖ్యా భేదము, ద్వయము
రెంబ. దే. రెమ్మ
రెక్క. దే. ఱెక్క
రెక్కొను. దే. వర్ధిల్లు, తేరుకొను
రెక్కోలు. దే. రెక్కొనుట
రెచ్చెల. దే. జెగడాలమారి
రెచ్చు. దే. విజృంభించు
రెట్ట. దే. భుజము, పక్షిమలము
రెట్టి. దే. ద్విగుణము
రెట్టించు. దే. రెట్టిచేయు, ద్విగుణించు

రెట్టింపు. దే. ఇనుమడి

రెట్టు. దే. ముతుకబట్ట

రెడి / రెడ్డి } దే. కాఁపువారిపట్టపుఁబేరు

రెడ్డిగము. దే. ముడుఁచుకొన్న యొకకాలి తొడమీఁద మోఁకాలుమీఁదుగామడుచుకొన్న మఱియొకకాలి పాదము మోపి ఆకాలిని వీఁపును అంగవస్త్రముతో నీడ్చికట్టుకొని కూర్చుండుట, బాసికపట్టు

రెడ్డిపాలవంకలు. దే. ధాన్యవిశేషము

రెడ్డివారినానఁబ్రాలు. దే. పటుపర్ణివృక్షము

రెపరెప. దే. నిప్పుమంటమ్రోఁత, గాలివీచుటయందగు ధ్వన్యనుకరణము

రెపరెపమను. దే. ఆఁకలెత్తు

రెప్ప. దే. ఱెప్ప

రెప్పము. దే. పూర్ణము

రెబ్బ / రెమ్మ } దే. ఉపశాఖ, చిన్నకొమ్మ

రెమ్ము.దే.ఒడిసిలిగుచు, ఒడియు, ఆకర్షించు, పెఱుకు

రెయి. త. రేయి

రెల్ల. దే. మెతుకు

## రే

రే. త. రేయి

రేఁగు. దే. ఎగయుఁ, ఉద్రేకించు, బదరీవృక్షము

రేఁగుడు. దే. లింగపొట్లచెట్టు

రేఁచు. దే. రేఁగఁజేయు

రేఁటెము. దే. రెంటెము

రేఁపు. దే. రేఁచు

రేక. దే. తాటాకుమట్టతో కట్టినదొప్ప

రేక. త. గీఱ, జాఱు, పఙ్క్తి

రేకంటు. దే. సూర్యుఁడు

రేకచీరణము. దే. రేఖలు తీర్చెడు చిన్నయులి

రేకు. దే. ఱేకు

రేక్రుఁడు. స. నీచుఁడు

రేకుమడఁచు. దే. ఱేకుమడఁచు

రేకెత్తు. దే. వర్ధిల్లు

రేఖ. స. వృక్షాదులపంక్తి, చేతియందలి గీఱ, గీఱ, నిలుచున్న శరీరసౌష్ఠవము, సౌందర్యము, వలె

రేఖాగణితము. స. క్షేత్రగణితము

రేగడ / రేగడి } దే. బంకమన్ను

రేగడిదూల. దే. కచ్చురవృక్షము

రేచకము. స. ఊపిరి విడుచుట, ఏనుఁగుచెవి వంటి పాదకంచుకము

రేచకి. స. కరకచెట్టు

రేచనము. స. విరేచనము

రేచని. స. తెల్లతెగడచెట్టు, దంతిచెట్టు

రేచితము. స. అశ్వగతివిశేషము

రేచీఁకటి. దే. రాత్రికన్ను తెలియమి,నిశాంధ్యము

రేణము. దే. దూడపేఁడ

రేణుక. స. గంధద్రవ్యవిశేషము, జమదగ్ని పెండ్లాము

రేణువు. స. దుమ్ము, రేణుక

రేతస్సు / రేతము } స. ఇంద్రియము, పాదరసము

రేతిరి. త. రాత్రి

రేదొర. దే. చంద్రుఁడు

రేద్రిమ్మరి / రేద్రిమ్మరీఁడు } దే. రాక్షసుఁడు

రేను. దే. రేఁగు, బదరీవృక్షము

రేపకడ / రేపాడి } దే. ప్రాతఃకాలము

రేపు. దే. ప్రాతఃకాలము, పూర్వాహ్ణము, వెనుకటిదినము

రేపుఁడు. స. అధముఁడు

రేఫము. స. రవర్ణము, అధమము, రోషము, ప్రేమ

రేయి. దే. రాత్రి

రేయు. దే. విజృంభించు, ఖండించు

రేయెండ. దే. వెన్నెల

రేరాయఁడు / రేఱేఁడు } దే. చంద్రుఁడు

రేవ. స. ఒకయేఱు, నీలిచెట్టు

రేవఁడు. దే. రేవువాఁడు, చాకలవాఁడు, కృపణుఁడు, కుత్సితుఁడు

రేవంతుఁడు. స. అశ్వశిక్షకుఁడు

రేవగలు. దే. అహోరాత్రము

రేవడ. దే. రేగడ

రేవడి. దే. లేగడి

రేవతి. స. ఒకనక్షత్రము, బలరామునిభార్య

రేవతీరమణుఁడు. స. బలరాముఁడు

రేవు. దే. నద్యాదులయందు మనుష్యులు దిగుటకనువుగా నేర్పరిచినదారి, సముద్రమునందు సరకులు ఎగుమతి దిగుమతి చేయుచోటు, కరవాకపట్టణము, రేఁగుచెట్టు

రేవుబోయ. దే. ఓడనడుపువాఁడు

రేవువాఁడు. దే. చాకలవాఁడు

రేవెలుఁగు / రేవెల్గు } దే. చంద్రుఁడు

రేవెల్గుజోడు. దే. సూర్యుఁడు

రేసు. దే. చేలుకన, చేలుకనివి

రేసుగుడ్డ. దే. చేలిగుడ్డ

## రై

రై. స. ధనము, విడిముడి

రైతు / రయితు } దే. పంటకాఁపు

రైవేశ్మ. స. కోశగృహము

## రొ

రో. దే. సంబోధనయందు స్త్రీవాచకంబులకను ప్రయుక్తంబగునది

రొంజేడు / రొండుడు } దే. ప్రలాపము

రొండి. దే నడుముయొక్క పార్శ్వభాగము

రొండు. దే. శ్వాసరోగము, రోఁజె

రొంప. దే. పీనసరోగము, పడిసెము

రొంపి. దే. బురద

రొంపెముక్కు. దే. నీళ్లు గట్టి అడుసుగా దున్నుట

రొక్కపుదొర. దే. కుబేరుఁడు

రొక్కము. త. చేతివెల, ధనము, సమూహము

రొక్కారొక్కములు. త. బహువిధములు గలవి, ఉచ్చావచము

రొక్కించు. త. రొక్కపఱచు, ఏదేనికొనునపుడు రొక్కమిచ్చు, పైకమునిచ్చివేయు

రొట్ట. దే. చిన్నకొమ్మ, మండ

రొట్టియ / రొట్టె } దే. భక్ష్యవిశేషము

రొడ్డు. దే. రొండు
రొడ్డువు. దే. రొండుడు
రొద. త. కలకలధ్వని, ధ్వని
రొదాళము. త. ధ్వని
రొదాళించు. త. ధ్వనించు
రొప్పు. దే. కూయు, కోపించు, తఱుము, అఱుచు, పులికూయు
రొమ్ము. త. ఱొమ్ము
రొయి } దే. కట్టెలిప్పమీఁది నిగుఱు,
రొయ్యి } అపవాదము
రొయ్య. దే. మత్స్యవిశేషము
రొల్లు. దే. ప్రలాపించు
రొల్లుడు. దే. ప్రలాపము, రొండుడు
రొష్టు. దే. తొందర

## రో

రో. త. రోయి, రో అనుదానియొక్క రూపాంతరము
రో. స. ధనము, విలువ
రోఁకటిబండ. దే. ఒకపురుగు, పొన్ను లేని చిన్నరోఁకలి
రోఁకలి. త. దంచెడుసాధనము, ముసలము
రోఁజు. దే. నిట్టూర్పు, నిశ్శ్వాసము
రోఁజుడు. దే. రొంజుడు, ప్రలాపము
రోఁత. దే. ఏవము, జుగుప్స, అపవాదము
రోఁతగించు. దే. రోఁతపడు
రోఁతలు. దే. తిట్లు
రోక. దే. మూల, కోణము
రోకము. స. ఓడబెజ్జము, కదలిక, వెలుఁగు, రొక్కపుమ్మకము
రోఖ. దే. వికాసము
రోగఘ్నము. స. మందు
రోగము. స. వ్యాధి, తెవులు
రోగరాజము. స. క్షయరోగము
రోగశాంతకుఁడు. స. వైద్యుఁడు
రోగశ్రేష్ఠము. స. జ్వరము
రోగహారి. స. హోమచెట్టు, బూడిదగుమ్మడి చెట్టు, వైద్యుఁడు
రోగాంతకుఁడు. స. వైద్యుఁడు
రోగాయతనము. స. శరీరము
రోగి. స. వ్యాధిష్ఠుఁడు, తెవులుగొంటు
రోగితము. స. రోగము గలది
రోగ్యము. స. ఆరోగ్యముగానిది
రోచకము. స. ఆఁకలిపుట్టించునది, దీపనము, కాంతి, గోరోజనము
రోచన. స. గోరోజనము, ఉత్తమస్త్రీ, ఎఱ్ఱగలువ
రోచనము. స. కొండగోగుచెట్టు, ప్రకాశించునది
రోచని. స. తెల్లతెగడ, కంపిల్లవృక్షము
రోచమానము. స. గుఱ్ఱపుమెడసుడి, ప్రకాశమానము
రోచిష్ణువు. స. ప్రకాశించువాఁడు
రోచిస్సు. స. సూర్యకిరణము, వెలుఁగు
రోటు. దే. కాలుచేతులవంకర
రోటువోవు. దే. ఈచేఁబోవు
రోదనము. స. ఏడ్పు, కన్నీరు
రోదని స. తీఁటకసిందమొక్క
రోదసి } స. భూమి, ఆకాశము, భూమ్యాకాశమధ్యము
రోదస్సు }
రోదించు. స. రోదనముచేయు, ఏడ్చు
రోధవతి. స. నది
రోధస్సు. స. తీరము, గట్టు
రోధించు. స. అడ్డగించు

రోపకుఁడు. స. మొక్కలను నాటువాఁడు
రోపణము. స. మోపుట, పైరుచేయుట, లేవనెత్తుట, నాటుట, కుదుర్చుట
రోపము. స. బాణము, రోపణము
రోమంథము. స. పశువుల చర్వితచర్వణము, నెమరు
రోమకూపము. స. రోమరంధ్రము
రోమము. స. ముఖము శిరము తక్కఁ దక్కినదేహమునందుఁ గల వెండ్రుక
రోమరాజి } స. నూగారు
రోమలత }
రోమవిక్రియ. స. రోమాంచము
రోమశము. స. పంది, గొఱ్ఱె, వెండ్రుకలు గలది
రోమశి. స. ములుఁదోసచెట్టు
రోమశుఁడు. స. శరీరమునందు ఎలుఁగునకు వలె నిండువెండ్రుకలు గలవాఁడు
రోమహర్షణము. స. రోమాంచము, తాండ్రచెట్టు
రోమహర్షణుఁడు. స. ఒకసూతుఁడు
రోమాంచము. స. గగుర్పాటు
రోమావళి. స. నూఁగారు
రోయి. త. వేశ్యకిచ్చెడు శుల్కము, పంటెము, కుదువ, ఎరవు, చేబదులు
రోయిడు. దే. తాకట్టుపెట్టు
రోయు.దే. రోఁతపడు, నిందించు, విడుచు
రోలంబము. స. తుమ్మెద
రోవెల. దే. ఏర్పాటుచేసికొన్న వెల,లంజకు ఇచ్చెదనని ఒప్పుకొన్న రూక
రోవెలఁది. దే. వేశ్య
రోషగాఁడు. దే. కోపి
రోషము. స. కోపము
రోషించు. స. రోషపడు
రోషితుఁడు. స. ఆగ్రహపడినవాఁడు
రోసము. త. రోషము
రోసించు. త. రోషపడు
రోసుబడి. గ్రా. రోఁతగొట్టు
రోహణము. స. ఎక్కుట, ఒకకొండ
రోహము. స. ఎక్కుట, మొలక, మొగ్గ
రోహి. స. మఱ్ఱిచెట్టు, రావిచెట్టు
రోహిణము. స. బాడిదవృక్షము
రోహిణి. స. ఒకనక్షత్రము, అంగిటిముల్లు, ఆవు, తొమ్మిదేండ్లకన్యక, బలరాముని తల్లి, కటుకరోహిణి
రోహితకము. స. ములుమోదుగుచెట్టు, కెంపు
రోహితము. స. నెత్తురు, కుంకుమపువ్వు, కొరడు, ఎఱుపు, ములుమోదుగుచెట్టు, కేసరిమృగము, ఎఱ్ఱనిది, ఎఱ్ఱమీను
రోహితాశ్వుఁడు. స. అగ్ని, హరిశ్చంద్రుని కొడుకు, ఎఱ్ఱని గుఱ్ఱములు గలవాఁడు
రోహిషము. స. కొండగొఱ్ఱె

## రౌ

రౌక్మము. స. బంగారుతోఁ జేయఁబడినది
రౌక్ష్యము. స. కాఠిన్యము
రౌచనికము. స. పడ్డపాఁచి, కొంచెము పచ్చేరంగుగలది
రౌతు } త. గుఱ్ఱమునెక్కువాఁడు, సాది
రవుతు }
రౌద్రము. స. నవరసములలో నొకటి, ఎండ, దినముయొక్క మొదటిభాగము, భయంకరము, తీక్ష్ణము

రౌద్రి. స. ఒకసంవత్సరము

రౌద్రుఁడు. స. రుద్రుని పూజించేవాఁడు

రౌప్యము. స. రూప్యము, వెండితోఁ జేయఁబడినది

రౌమకము. స. సంభరిదేశమున రుమయనెడు గనియందుఁ బుట్టిన యుప్పు

రౌరవము. స. నరకవిశేషము, భయంకరము

రౌలు / రవులు } దే. రగులు

రౌలుకోలు / రవులుకోలు } దే. రవులుకొనుట

రౌలుచు / రవులుచు } దే. రగులుచు

రౌహిణము. స. రోహిణి సంబంధమైనది, చందనవృక్షము, అత్తిచెట్టు

రౌహిణేయము. స. దినముయొక్క తొమ్మిదవభాగము, ఆవునకుఁ బుట్టినది

రౌహిణేయుఁడు. స. బలరాముఁడు, బుధుఁడు

రౌహిషము. స. కామంచిగడ్డి, కొండగొఱ్ఱె

## ఱ

ఱ. ఒకయక్షరము

ఱంకాట. దే. జారత్వముచేయుట

ఱంకాడు. దే. జారత్వముచేయు

ఱంకు. త. జారత్వము

ఱంకుఁబోతు. దే. జారుఁడు, జారిణి

ఱంకుటాలు. దే. జారిణి

ఱంకుతెవులు. దే. మేహరోగము

ఱంకుమగఁడు. దే. జారుఁడు

ఱంకులరాట్నము. త. ఉత్సవకాలమునందు వేడుకకు బాలకులు ఎక్కి త్రిప్పించెడు చుట్టుతొట్లు లేర్పఱచిన వలయాకారపు యంత్రవిశేషము

ఱంకులాఁడి. దే. జారిణి

ఱంకువోవు. దే. జారత్వముచేయు

ఱంకె. దే. వృషభధ్వని, కేక

ఱంకెత. దే. జారిణి

ఱంతిల్లు / ఱంతిలు } దే. కలకలధ్వనిచేయు

ఱంతు. దే. కలకలధ్వని

ఱంపకాఁడు. దే. ఱంపముతో పలకలు మొదలగువానిని కోయువాఁడు

ఱంపము. దే. పలకలు మొదలగునవికోసెడు సాధనము, క్రకచము

ఱంపిల్లు / ఱంపిలు } దే. వ్యాపించు, వర్ధిల్లు, అతిశయించు

ఱంపు. దే. రచ్చ, కలకలము

ఱంపె / ఱంపియ } దే. మాదిగవాఁడు తోలుకోసెడుసాధనము, తాటాకులు మట్టగించి కోసెడు సాధనవిశేషము

ఱక్క. దే. గిఱు, గీఱ

ఱట్టు. దే. దూఱు, నింద, అపకీర్తి

ఱప్ప. దే. చిన్నఱాయి

ఱవఱవ. దే. కోపవికారము

ఱవిక. దే. కంచెల, రవిక

ఱవ్వ. దే. అపకీర్తి, నింద

ఱవ్వాడు. దే. నిందించు

## ఱా

ఱా. దే. ఱాయి

ఱాఁగ. త. జారిణి, ఉద్ధతుఁడు, ధూర్తుఁడు

ఱాఁగతుంగ. దే. భద్రముస్తకము

ఱాచు. దే. రాపుడుచేయు, రుద్దు

ఱాతిగుండె. దే. కఠినహృదయము

ఱాతినార. దే. ఓషధీవిశేషము

ఱాతిపాఁచి. దే. ఔషధవిశేషము

ఱాతియులి. దే. కాసెయులి

ఱాతివాలు. దే. వజ్రాయుధము

ఱాపు. దే. ఱాయిడి

ఱాపువ్వు<br>ఱాతిపూవు } దే. అశ్మపుష్పము

ఱాయి. దే. శిల, రాయి

## ఱి

ఱింగు. దే. ఱెక్కలగాలి చప్పుడు

ఱికము. దే. భావమునందు వచ్చెడు ఒక ప్రత్యయము

ఱిక్క. దే. పశువులఁ దోలునప్పటిధ్వని

ఱిక్కించు. దే. నిక్కించు

ఱిచ్చ. దే. నిశ్చేష్టత

ఱిచ్చవడు. దే. చేష్టలు దక్కు

ఱిచ్చవాటు. దే. ఱిచ్చవడుట

ఱిప్పు. దే. ఱివ్వు

ఱిమ్ము. దే. చిమ్మనఁగ్రోవితో జలాదికమును చిమ్ము

ఱివ్వు. దే. ఎగయుటయందగు ధ్వన్యనుకరణము

ఱివ్వున. దే. శీఘ్రముగా

## ఱు

ఱు దే. ఒకానొకబహువచనప్రత్యయము

ఱుప్పు. దే. ఱువ్వు

ఱువ్వు<br>ఱూవు } దే. విసరివైచు, ఱెక్కలగాలి చప్పుడు, కూలుటయందగు ధ్వన్యనుకరణము

ఱువ్వఁబులుఁగు. దే. పక్షివిశేషము

## ఱె

ఱెక్క. దే. పక్షము

ఱెక్కచాపు. దే దోవతీఉత్తరీయములగల చాపు

ఱెక్కపాయలు. దే. ధాన్యవిశేషము

ఱెప్ప. దే. కనుఱెప్ప

ఱెప్పపాటు. దే. నిమిషము

ఱెల్లు. దే. తృణవిశేషము

ఱెల్లుదీవి దే. కుశద్వీపము

## ఱే

ఱేఁచు. దే. శునకవిశేషము

ఱేఁడు. దే. దొర, మగఁడు

ఱేకు. దే. పుష్పదళము, తగడు, ఈఁక, అంచు కమ్ములులేనివస్త్రము, దుప్పటిలో సగము

ఱేకుమడఁచు. దే. అణఁగఁద్రొక్కు

ఱేపు. దే. ప్రాతఃకాలము, వెనుకటిదినము

ఱేఁగు. దే. అతిశయించు, విజృంభించు

ఱేల. దే. ఆరగ్వధవృక్షము

## ఱై

ఱైక<br>అయిక } దే. అవిక, రవిక

## ఱొ

ఱొచ్చు. దే. తిరస్కారము, బురద, అపవాదము, సందడి

ఱొడ్డ. దే. ఎడమ

ఱొడ్డు. దే. అధికము

ఱొమ్ము. త. వక్షము

## ఱో

ఱోలు. దే. బాధచే నఱచే, విలపించే, దంచేట, రుబ్బుట, లోనగువానికి ఉప యోగించెడు సాధనము

ఱోలుమ్రాను. దే. ఉత్తరాసి తిరిగెడు ఉతక

## ల

ల. ఒక యక్షరము

ల. దే. ద్వితీయాది బహువచనములయందు వచ్చెడు ప్రత్యయము

లంక. దే. దీవి, తలవాకిటి ప్రక్కగది

లంక. స. రావణునిపట్టణము, ఒకానొక రాక్షసి, అంకుటాలు, ఒకదినుసు సెనగలు

లంకణము. త. జ్వరాదులచేతనుండెడియుప వాసము

లంకించే. త. తగులు, పెనవేయు, అవ మానించే

లంకించుకొను. దే. ఉపాయముచే స్వాధీన పఱచుకొను

లంకియ, లంకె } త. సంగము, తగులుపాటు, పెన

లంకెపలుపు. దే. లంకెవేసెడుపలుపు

లంకెపాటు. త. తగులుపాటు, తగులము

లంకెపీట. త. పెనవేసెడి మ్రానిపలక

లంకెపెట్టు. దే. తగులుపఱుచే, పెనవేయు

లంకెమానిసి. త. దాసుడు

లంకోయిక, లంకాసిక } స. పిక్కచెట్టు

లంగ. త. లంఘనము

లంగగొను. దే. లంఘించే, దాటు

లంగము. స. సంగము

లంగరు. త. ఓడలు నిలుచేటకై అడుగున బిగవేసెడు నాగేలువంటి యినుప సాధనము

లంగుడు. స. విటుడు

లంఘ. స. దాటు, లంగ

లంఘనము. స. దాటు, దూకుడు, గుఱ్ఱపు దూకుడు, లంకణము, నేరము, అవ మానము

లంఘించే. స. దూకు, దాటు

లంచము. స. లంచేము, ఉత్కోచము

లంచెగొండి. దే. లంచేము తీయువాడు

లంచేము. త. తనపనిచక్కబెట్టుకొనుటకై యొకనికి రహస్యముగా నిచ్చుధనము

లంజ, లంజిక } త. వేశ్య, జారస్త్రీ

లంజియ, లంజె } త. వేశ్య

లంజెకాడు. దే విటకాడు

లంజెత. దే. లంజియ, వేశ్య

లంజెబేడిస. దే. మీనభేదము

లంజెఱికము. దే. వేశ్యాసంభోగము

లంజెసవరము. త. గొంతెమగోరుచెట్టు

లండి, లండీ } దే. కుత్సితురాలు, కుత్సితుడు

లండు, లండుబోతు } దే. కుజనుడు

లంద. దే. పొట్టవాడు, తుందిలుడు

లంపట, లంపటము } దే. శ్రమము, ఆపద ఆయా సము

లంపటపడు. దే. శ్రమపడు

లంపటుడు. స. అత్యాసక్తిగలవాడు

లంపతా. దే. దాసీపుత్రుడు

లంపాకము. స. ఒకదేశము, ఆసగలది

లంపు. దే. దొంగ మేఁత

లంపులమారి. దే. దొంగ మేఁత మేయునది

లంబకర్ణము. స. చెవులపిల్లి

లంబనము. స. వ్రేలుడు, మెడను వ్రేలాడు హారము లోనగునది

లంబమానము. స. మెడను వ్రేలాడుహారము మొదలగునది, వ్రేలాడునది

లంబము. స. వ్రేలుడు, దీర్ఘము, విశాలము

లంబాడీలు. దే. ఆరణ్యకజాతిభేదము

లంబి. దే. కుటుంబము

లంబిక. స. కొండనాలుక

లంబితము. స. వ్రేలుడు

లంబీ. దే. లంబి

లంబు. త. స్థౌల్యము, గొప్పతనము

లంబుషము. స. ఏడుపేటల ముత్యాలహారము

లంబోదరుఁడు. స. విఘ్నేశ్వరుఁడు

లంభనము. స. తిట్టుట, దూషించుట, పొందుట, సంపాదించుట

లంభించు. స. తిట్టు, దూషించు

లకుచము. స. గజనిమ్మచెట్టు

లకుముకి. దే. పక్షివిశేషము

లకోరి }
లకోరీ } దే. క్రూరబాణము, పారావత విశేషము

లక్క. త. ఒకానొకచెట్టుబంక, జంతువు

లక్కచెవులు. దే. ఒకదినుసుచీడ

లక్కనము. త. వ్యాకరణాది శాస్త్రము, లక్షణము, గుఱుతు

లక్కపెట్టె. త. చిత్రపేటిక

లక్కబియ్యము. దే. లక్కపొడి

లక్కాకు. దే. ఆఁడువారుచుట్టికమ్మచెవినుంచుకొనెడు లక్కపూసినతాటాకు

లక్కిమి. త. లక్ష్మి

లక్కుమనుఁడు. త. లక్ష్మణుఁడు

లక్ష. స. నూఱువేలు

లక్షకము. స. లక్ష్యార్థమును తెలిపెడుశబ్దము

లక్షణ. స. ఒకశబ్దవృత్తి, ఆఁడుబెగ్గురుపక్షి

లక్షణము. స. గుఱి, గుఱుతు, చూపు, వ్యాకరణాదిశాస్త్రము, పేరు, బెగ్గురుపక్షి, అందము, గుణము, నిర్వచనము, అస్పృష్టచిహ్నము, స్వభావము, శ్రేష్ఠము, ఫలితము, కారణము

లక్షము. స. గుఱి, నెపము, నూఱువేలు, గుఱుతు, మోసము

లక్షసుప్తుఁడు }
లక్ష్యసుప్తుఁడు } స. నిద్రపోవుచున్నట్లు నటించువాఁడు

లక్షించు. స. గుఱిచేయు, చూచు

లక్ష్మకము. స. చిన్నమచ్చ

లక్ష్మణ. స. ఆఁడుబెగ్గురు

లక్ష్మణము. స. గుఱుతు, పేరు

లక్ష్మణుఁడు స. రామునితమ్ముఁడు, శ్రీమంతుఁడు

లక్ష్మము. స. గుఱుతు, ముఖ్యము

లక్ష్మి. స. రమ, సంపద, వస్త్రభూషణాదులవలనఁ గలిగినశోభ, మెట్టదామర, గొల్లజిడ్డుచెట్టు, ప్రేంకణవృక్షము

లక్ష్మీపతి. స. విష్ణువు, లచ్చిమగఁడు, ప్రభువు

లక్ష్మీవంతుఁడు. స. సంపద గలవాఁడు, ఒప్పిదము గలవాఁడు

లక్ష్మీసఖుఁడు. స. అదృష్టవంతుఁడు

లక్ష్యము. స. గుఱి, లక్షణచేఁ దెలియఁదగినయర్థము, చూడఁదగినది, కోరఁబడినవస్తువు

లక్ష్యముచేయు. దే. గుఱిపెట్టు, గౌరవము చేయు

లక్ష్యాలక్ష్యము. స. అరుదుగాఁ గనపడునది

లగడ. దే. చిమిడినయన్నము, చిమిడిక

లగనము. త. లగ్నము

లగించు. దే. సరిపడు, ఇముడు

లగుడము. స. దండము, బడిత

లగుడు. దే. శ్యేనవిశేషము

లగువు. త. చులుకన, లాఘవము, గంతు, చేలుక

లగ్గ. త. ముట్టడించి కోటపైకిఁ బ్రాఁకుట

లగ్గదింపు. దే. కోటమీఁదనుండి శత్రువుల పైదొర్లించెడు ఱాతిబండ లోనగునది

లగ్గపట్టు. దే. ముట్టడి వేసి కోట నెక్కు

లగ్గము. త. లగనము

లగ్గలెక్కు. దే. కోటపైకిఁ బ్రాఁకు

లగ్గు. దే. శుభము, మేలు, ఉత్తరక్రియ

లగ్నకుఁడు. స. పూఁటకాఁపు, ప్రతిభువు

లగ్నము. స. రాశ్యుదయము, మదపు టేనుఁగు, తగులుకొన్నది,నిగ్గుఁబొందినది

లఘిమ
లఘిమము } స. లఘుత్వము, ఒకవిభూతి, చేలకన

లఘిష్ఠము. స. మిక్కిలి చేలకనైనది, మిక్కిలి తక్కువైనది

లఘుకము. స. తోఁట, పోఁకచెట్టు

లఘుకోష్ఠము. స. పట్టికడుపుగలది

లఘుత. స. లాఘవము

లఘులయము. స. నీటివట్టివేరు

లఘువు. స. పిక్కచెట్టు, నల్లఅగరు,శీఘ్రము, వడిగలది, చేలకనిది, చేవలేనిది, ఒప్పిదమైనది, లఘ్వక్షరము

లఘుహస్తుఁడు. స. పనిలో నేర్పరి, నేర్పరియగు విలుకాఁడు

లఘ్వి. స. బండి, చేలుకనైనది, కుఱుచ యైనది

లచ్చి. త. లక్ష్మీదేవి, సంపద

లచ్చిమగఁడు. దే. విష్ణువు, లక్ష్మీపతి

లచ్చివారము. గ్రా. గురువారము

లచ్చెనము. త. గుఱుతు, వ్యాకరణాది శాస్త్రము

లచ్చెనుఁడు. త. లక్ష్మణుఁడు

లజ్జ. స. సిగ్గు

లజ్జాళువు. స. లజ్జాశీలుఁడు, సిగ్గరి

లజ్జించు. స. సిగ్గుపడు

లజ్జితము. స. సిగ్గుపడినది

లజ్జితుఁడు. స. సిగ్గుపడినవాఁడు

లటకుఁడు
లట్వుఁడు } స. మోసకాఁడు, దుర్మార్గుఁడు

లటక్కు. దే. మ్రింగుటలోనగు వానియందగు ధ్వన్యనుకరణము

లటపటము. దే. జగడము

లటము. స. తప్పిదము

లటహము. స. వాద్యవిశేషము

లటుఁడు. స. మూర్ఖుఁడు, దొంగ

లట్టము. స. కప్పెర, భిక్షాపాత్రము

లట్టు. దే. పడియ, గాఁడి

లట్టువ. త. చిటితాళము, దుడ్డుకఱ్ఱ

లట్వ. స. వాద్యవిశేషము

లట్వము. స. లడ్డు, చెలిపిండిముద్ద

లడి. దే. నిడుపుగా చుట్టిన సరిగ లోనగు వానిచుట్ట, ముత్యములు మొదలైనవాని పేట లేక సరము

లడ్డిగ } త. ప్రయాణముపోవునపుడు
లడ్డిగము } నెయ్యినూనె మొదలగు నవి పోసికొనిపోయెడు చిన్నమూతిగల పాత్రవిశేషము

లడ్డు. త. చక్కెరపాఁగుతోఁ జేసెడు భక్ష్య విశేషము

లడ్డుకము. స. లడ్డు, లట్వము

లడ్డావము } త. లడ్డు
లడ్వము }

లత. స. తీఁగ, ఎక్కుడుఁదీఁగ, గఱిక, పూలగురివెంద, ముత్యాలహారపు పేట, కొమ్మ, పిక్కచెట్టు, ప్రేంకణవృక్షము, చీమ, సాలెపురుగు, కస్తూరి

లతకూన. దే. లేఁతతీఁగవంటిఆఁడుది, బాలిక

లతాంతము. స. పుష్పము

లతాప్రతానని. స. ఒకటితోనొకటి పెనఁగొన్నతీఁగ లోనగునది

లతార్కము. స. పచ్చనిరుల్లి

లతిక. స. తీఁగ, నూఱుపేటలహారము

లత్త. దే. దెబ్బ, ఆపద

లత్తిక. దే. బలుఁపును చేప్పుడును గల ఒక దినుసు గచ్చకాయ

లత్తిచేఁప. దే. మత్స్యవిశేషము

లత్తుక. త. లాక్షారసము, అలక్తకము

లత్తుకబొత్తులు. దే. ధాన్యవిశేషము

లద్ది. దే. గుఱ్ఱము లోనగువాని మలము

లద్దిపిప్పి. దే. ఒకదినుసు చీడపురుగు

లద్దిపురుగు. దే. మగ్గినకొయ్యలోనగువాని యందు కలిగెడు తెల్లనిపురుగు

లద్దె } దే. నేయువాఁడు వస్త్రపు చివ
లద్దియ } రను విడిచెడి కచ్చు

లపక. దే. ధనము

లపటాయించు. దే. మ్రింగు. కొల్లగొను

లపనము. స. ముఖము, నోరు మాట

లపితము. స. మాట, మాటాడఁ బడినది

లప్ప. దే. రాసి, ముద్ద

లప్పము. త. మ్రానిపెట్టెలోనగువాని సందు గొందులకు మెత్తెడు ఒకదినుసు సున్నపు ముద్ద

లబ్ధము. స. గుణింపఁగా దేలినలెక్క, పొందఁబడినది

లబ్ధవర్ణుఁడు. స. విద్వాంసుఁడు, చేదువరి

లబ్ధవ్యము. స. పొందఁ దగినది

లబ్ధావకాశుఁడు. స. తీఱికగలవాఁడు

లబ్ధి. స. లాభము, ప్రాప్తి, కలిమి

లభసము. స. భాగ్యము

లభించు స. ప్రాప్తించు, కలుగు

లభ్యము. స. లభింపఁ దగినది, యుక్తము

లమకుఁడు. స. ప్రియుఁడు, విటుఁడు

లయ. స. తౌర్యత్రికసామ్యము, తాళము యొక్క కాలము

లయ. దే. మోసము

లయకాఁడు. దే. పాటకుఁడు

లయకారి. దే. మోసకాఁడు

లయనము. స. చేరుట, అంటుకొనుట, విశ్రాంతి

లయము. స. నీటివట్టివేరు, నాశము, ఆలింగనము, కరఁగుట, అదృశ్యమగుట, దాఁగుట, కలసిపోవుట, అంటుకొనుట, చేరిక, విశ్రాంతి స్థానము

లయించు, స. నశించు, సక్తమగు

లయ్య. త. వేశ్య, లంజ

లలంతిక. స. మెడను వ్రేలాడుహారము మొదలగునది

**లలన.** స. విలసనశీలయైన స్త్రీ, ఆఁడుది, నాలుక

**లలనము.** స. విలాసము, ఆట, సంతోషము

**లలాటము.** స. నొసలు, నుదురు

**లలాటిక.** స. పొసటబొట్టు

**లలామకము.** స. బాసికము

**లలామము.** స. గుఱుతు, టెక్కెము, తోడవు, నొసట నుంచుకొనెడు బొట్టు, గుఱ్ఱము నొసటిచుక్క, తోఁక, కొమ్ము, ప్రభావము, గుఱ్ఱము, ప్రాధాన్యము, సుందరము

**లలాముఁడు.** స. శ్రేష్ఠుఁడు

**లలి.** దే. క్రమము, ప్రేమ, వికాసము, ఉత్సాహము, అత్యంతము, సొగసు

**లలితము.** స. స్త్రీలశృంగారచేష్టావిశేషము, ఈప్సితము, మనోజ్ఞము

**లవంగము.** స. కరాపువు

**లవణము,** స. ఉప్పు, ఉప్పన, ఉప్పుసముద్రము, ఉప్పువిది, లావణ్యముగలది

**లవణాకరము.** స. ఉప్పుసముద్రము. ఉప్పళము

**లవణి.** దే. బిగువు

**లవణిమ.** స. లావణ్యము, అందము

**లవణోదము.** స. ఉప్పుసముద్రము

**లవనము.** స. పైరు లోనగువాని కోఁత, కోయుట

**లవము.** స. లేశము, చేటు, కోఁత, భిన్నాంకమునందు హారమునకు పైనుండునది, తునుక, నష్టము

**లవలవ.** దే. భేదిల్లినది

**లవలి.** స. ఒకానొకతీఁగ

**లవాకము.** స. కొడవలి

**లవించు.** స. కోయు

**లవిటి.** దే. ఱెక్కమొదలు, పక్షతి

**లవిత్రము.** స. కొడవలి

**లశునము.** స. వెల్లుల్లి, కెంపునందలిదోషవిశేషము

**లషితము.** స. కోరఁబడినది

**లసిక.** స. ఉమ్మి

**లసితము.** స. ఆడఁబడినది

**లసీక.** స. చీము, రసము

**లసుకు.** దే. నాశముచేయు

**లస్తకము.** స. ధనుర్మధ్యము, పిడికట్టు

**లహరి.** స. పెద్దఅల, ప్రవాహము, కడలు

## లా

**లాంగలము.** స. నాఁగలి, తాడిచెట్టు, మగగుఱి

**లాంగలి.** స. తరిగొఱ్ఱచెట్టు, కొబ్బరిచెట్టు, నీరుపిప్పలిచెట్టు, బలరాముఁడు

**లాంగూలము.** స. తోఁక, మగగుఱి

**లాంగూలి.** స. కోఁతి

**లాంఛనము.** స. గుఱుతు, పేరు

**లాంపట్యము.** స. లంపటభావము

**లాఁక.** దే. పక్షియీఁక

**లాఁకకట్టు.** దే. వెనుచికట్టిన పెడచేతులకట్టు

**లాఁగ.** దే. బొఱియ, బిలము

**లాఁగడాఁగుడు.** దే. సర్పము

**లాఁగరి.** దే. చెవి

**లాఁగించు.** త. లంఘించు

**లాఁగు.** త. లంఘనము, చల్లడము

**లాఁచు.** దే. కవియు, పొంచు

**లాఁత.** దే. లాయుట, గర్వము

లాఁత సేయు. దే. లాయు

లాఁతి. దే. వెఱ, అన్యము

లాఁతు. దే. అధికము

లాఁపర. దే. జలద్వారముఖమున తృణాదికము చొరకుండ నమర్చి యుండెడు గండ్లతాయి

లాఁపు. దే. లాఁచుట

లాకకట్టు. దే. లాకలతోడ చేట్టియుంచిన పనిముగియని పడుగు

లాకలు. దే. పడుగునం దక్కడక్కడ చొప్పించెడు వెదురుబద్దలు

లాకుడికుఁడు } స. తలారివాఁడు, దుడ్డుకఱ్ఱ గలవాఁడు
లాగుడికుఁడు }

లాక్ష } స. లక్క, జతువు
రాక్ష }

లాక్షణికుఁడు. స. లక్షణజ్ఞుఁడు

లాక్షాప్రసాదనము. స. ఎఱ్ఱలొద్దుగుచెట్టు

లాగను. త. లాఘవము

లాగి. దే. లఘువు, సులభము

లాగించు. దే. కొనిపోవు

లాగు. దే. ఆకర్షించు, ఆకర్షణము, విధము, సమ్మతి, పెనఁగు, ఈడ్చు

లాగుకొను. దే. అపహరించుకొను

లాగులాడు. దే. పెనఁగులాడు

లాగులాట. దే. పెనఁగులాడుట

లాఘవము. స. లఘుత్వము, ఆరోగ్యము, అవమానము

లాచి } దే. గఱ్ఱము మీఁదగాని గాడిద మీఁదగాని వేసెడుగోనె, చిన్న బండిమీఁద తెచ్చేభారము
లాచీ }

లాచు. దే. కాంక్షించు, లాగిపట్టు, ప్రార్థించు

లాజము. స. పట్టివేరు. నానబియ్యము

లాజలు. స. పేలాలు. బొరుగులు

లాటి. దే. పక్షివిశేషము

లాటీ. త. దుడ్డుకఱ్ఱ

లాటుఁడు. స. పండితుఁడు

లాడము. దే. గుఱ్ఱపుగొరిజెలకు కొట్టెడియినుపతగటిబిల్ల

లాడి. దే. పెద్దపుండు, బలి

లాడె } దే. బరువుమోసెడి యెద్దుపీఁపున బరువెక్కించుట
లాడియ }

లాతము. దే. సన్యాసులు చేతఁ బట్టెడు దండము

లాతాము. దే. లాతము

లాపము. స. మాటాడుట

లాభము. స. క్రయవిక్రయముల వలన వచ్చినపెచ్చు, వడ్డి, ప్రాప్తి

లామజ్జకము. స. సీటివట్టివేరు

లాయము. త. అశ్వశాల

లాయు. దే. ఉద్రేకించు

లాల. స. చొంగ

లాలకుఁడు. స. విదూషకుఁడు

లాలనము. స. లాలించుట, బుజ్జగము

లాలము. దే. ఉల్లారు, క్రిందిజాలరు

లాలస. స. అధికేచ్ఛ, ఔత్సుక్యము, యాచన, విషయాసక్తురాలు

లాలసరి. దే. గుఱ్ఱపుపల్లముమీఁది యుల్లారు క్రిందవ్రేలెడు జల్లులదండ

లాలసుఁడు. స. ఆసక్తుఁడు

లాలాటము. స. లలాట సంబంధమగునది

లాలాటికము. స. చేరుచుక్క

లాలాటికుఁడు. స. ప్రభువుయొక్క అభిప్రాయమును తెలిసికొనువాఁడు, కార్యమునందు నేర్పుచాలనివాఁడు

లాలి. దే. ఉయ్యేల, డోలికనూఁచునప్పుడు పాడునది

లాలి. స. స్త్రీలను లాలించేవాఁడు
లాలించే. స. లాలనము చేయు, బుజ్జగించే
లాలిత్యము. స. లలితభావము, అందము
లాలిని. స. విలసన శీలయగుస్త్రీ
లాలు. దే. ఎఱుపు
లావకుఁడు. స. కోయువాఁడు
లావణము. దే. కొలువునకు క్రొత్తగావచ్చిన కొలువుకుకానిని పట్టియందు వ్రాసికొనుట, కొలువునందుఁ జేర్చుకొనుట
లావణి. దే. పశువులు మేసెడి బీటినేలకై ముందుగా నిచ్చెడుధనము, పుల్లరి
లావణికము. స. ఉప్పులో నూఱవేయఁబడినది
లావణికుఁడు స. ఉప్పువర్తకుఁడు
లావణ్యము. స. ముఖకాంతివిశేషము, ఉప్పన
లావనము. స. లవనము
లావము. స. కోయుట, తుంచుట, పుష్పములనుపోగుచేయుట, నాశముచేయుట
లావరి. దే. బలవంతుఁడు, స్థూలాంగుఁడు, స్థూలాంగి, బలవంతురాలు
లావిక. స. అమ్మునది
లావు. దే. బలము, సామర్థ్యము, ఆధిక్యము, హెక్కుమొదలు, స్థూలము, అశక్యము, అధికము
లావుక. స. ఒకానొకపక్షి
లావుకము. స. లావుకపిట్ట
లాసకము. స. నెమిలి
లాసకుఁడు. స. లాస్యముచేయువాఁడు, ఆటకాఁడు
లాసము. స. ఆట, లాస్యము, నృత్యము
లాసిక. స. లాస్యముచేయునది, ఆటకత్తె
లాస్ఫోటని. స. ఆస్ఫోటని
లాస్యము. స. నృత్యము, తౌర్యత్రికము
లాహిరి / లాహిరీ } దే. మైకము
లాహిరిమోదము. దే. గంజాయిపొగపట్టెడు పాత్రవిశేషము
లాళము. దే. లాడము

## లి

లింగఁడు. త. జెంగమయ్య
లింగకట్టుమాత్ర. దే. లింగాకారముగా చేసిన రసవస్తువుల గుళిక
లింగకాయ. దే. లింగధారులు లింగము నుంచి కట్టుకొనెడు వెండిబంగారములతో చేసిన సజ్జకాయ
లింగదొండ. దే. లింగాకారపు ఒకదినుసు దొండమొక్క
లింగధారి. స. లింగవంతుడు, లింగమును కట్టుకొని యుండువాఁడు, వానివంశస్థుఁడు
లింగనము. స. కౌగిలించుకొనుట
లింగపొట్ల. దే. లింగాకారపు విత్తులుగల ఒకదినుసుపొట్ల
లింగబలిజెలు. దే. లింగధారులైన బలిజెవారు
లింగబీజ. స. లింగపొట్లతీఁగ
లింగము. స. పానవట్టముమీఁది శివమూర్తి గుఱుతు, మగగుఱి, అనుమానము, పంచవింశతి తత్త్వములయందు ఆదియగు ప్రకృతి
లింగరాజే. దే. కూఁకటిమూఁగ
లింగవృత్తి / లింగి } స. తాఁటదమ్మఁడు, పట్టివేషమునఁ బ్రదికెడువాఁడు
లింగని. స. దూతికావిశేషము

లింపాకుఁడు. స. మూర్ఖుఁడు
లికుచము. స. గజనిమ్మచెట్టు, లకుచము
లిక్కి. దే. గడ్డి లోనగువానిని కోసెడిచిన్న కొడవలి, చిన్నపాత్ర, మొదలైనవి
లిక్కుజిట్ట. దే. పక్షివిశేషము, దర్జీపక్షి
లిక్ష. స. చెమటచేత తలవెండ్రుకలయందు పట్టెడి ఈరు
లిఖించే
లిఖియించే } స. వ్రాయు
లిఖితము. స. వ్రాఁత, వ్రాయి, వ్రాయఁబడినది
లిఖితవ్యము. స. వ్రాయఁదగినది, లేఖ్యము
లిఖితుఁడు. స. పత్త్రము వ్రాసికొనువానిచే రప్పింపఁబడి పత్త్రమునందు సంతకము చేసిన సాక్షి, వ్రాఁతసాకిరి, ఒకముని
లిగువు. దే. లేడి
లిద్ది. దే. దంచి మిక్కిలి లోఁతుపడినప్రాఁతి లోటికిఁ గొట్టెడుగూటము, పడిసెము చేత ఊపిరిరాక ముక్కుడఁచేకొనుట
లిపి. స. రేఖారూపమైన యక్షర విన్యాసము, వ్రాయి
లిపికరుఁడు
లిపికారుఁడు
లిపీకరుఁడు } స. వ్రాయసకాఁడు, లేకరి, సున్నము పూయువాఁడు
లిపిజ్ఞుఁడు. స. వ్రాయఁగలవాఁడు
లిప్తకము. స. విషముపూసినబాణము, పూయఁబడినది
లిప్తము. స. పూయఁబడినది, భుజింపఁ బడినది
లిప్తి. స. పూయునట్టిమందు
లిప్స. స. ఇచ్ఛ, కోరిక, నిమిషము
లిబ్బి. దే. ధనము, రాశి, నిధి
లిబ్బిపడఁతి. దే. లక్ష్మి
లిబ్బిరాయఁడు. దే. కుబేరుఁడు, ధనాధిపతి
లిబ్బులదొర. దే. కుబేరుఁడు
లిభి. స. లిపి
లిమ్మ. దే. మాంసాదులమీఁద ముసురుకొను ఈఁగలను దోలెడు రెమ్మ
లియ్యము. త. లయించినది, మిత్త్రభావము
లిలీక్ష. స. చీరపేను, ఆస్వాదనేచ్ఛ
లివ. దే. లాఘవము
లివలివ. దే. దంతములు కదలుటయందగు ధ్వన్యనుకరణము

## లీ

లీక్ష. స. ఈరు
లీఢము. స. తినఁ బడినది
లీనము. స. లయించినది, కరఁగినది
లీయము. స. సఖ్యము, లీయత
లీల. స. క్రీడ, శృంగారచేష్ట, క్రియ, సౌలభ్యము
లీల. దే. విధము
లీలాచుంచుఁడు. స. లీలయందు ప్రసిద్ధుఁడు
లీలామనుష్యుఁడు. స. మానుషరూపముతోఁ గనఁబడు దేవుఁడు
లీలారతి. స. ఆట, వినోదము
లీలావతి. స. విలాసవతి

## లు

లు. దే. ప్రథమాబహువచనప్రత్యయము
లుంగ. దే. బట్టలమోపు
లుంగము. స. పుల్లమాదీఫలవృక్షము
లుంగి. దే. స్త్రీల యుత్తరీయము, అనఁగా గాగర, కుల్లాయకుప్పసములు చేర్చి కుట్టిన పావడ -

లుంచనము. స. వెండ్రుకలు పీఁకివేయుట

లుంచితము. స. తీసివేయఁబడినది, పైపెచ్చు తీయఁబడినది

లుంటాకుఁడు.స.దొంగ, దోఁచేకొనువాఁడు

లుంఠనము. స. దొంగిలించేట, దోఁపిడి

లుంఠాకుఁడు, లుంఠకుఁడు } స. దొంగ

లుంఠితము. స. హరింపఁ బడినది

లుఁకలుక. దే. పరుగెత్తుటయందును పురుగులు తొలుచేటయందును నగుధ్వన్యనుకరణము

లుఁకలుకలాడు. దే. తడఁ బడు

లుక్క. స. లోపము, కోఁత

లుంగచెడు. దే. బాగుతప్పు

లుఠనము. స. భూమిమీఁదిపొర్లిక, భూమిమీఁది గుఱ్ఱపుపొర్లిక, ముందు వెనుకలకు జరుగుట

లుఠితము. స. భూమిమీఁద పొర్లాడిన గుఱ్ఱము

లుప్తము. స. దొంగలించిన సొత్తు, దొంగసొమ్ము, లోపించినది, కోయఁబడినది

లుఁబ్ధకుఁడు. స. బోయివాఁడు, పిసినివాఁడు

లుబ్ధు, లుబ్ధుఁడు } స.బోయవాఁడు, ఆసగలవాఁడు, పిసినివాఁడు, లోభి

లులాపము. స. దున్నపోతు

లులాయము. స. కారెనుపోతు

లులి. దే. తక్కువ

లులితము. స. చలించినది

లులివడు. దే. హీనమగు

లుల్లిగాఁడు. దే. కీడ్పడినవాఁడు, అధముఁడు

## లూ

లూటాయించు. దే. లూటీచేయు

లూటి, లూటీ } దే. ఉపద్రవము, దౌడయందలి వ్రణము, వ్రణరంధ్రము, కొల్లపెట్టుట

లూడుపులు. దే చెప్పులు, పాదరక్షలు

లూత. స.సాలెపురుగు, చీమ, రోగవిశేషము

లూతిక. స. సాలెపురుగు

లూనము. స. కోయఁబడినది

లూమము. స. తోఁక, లాంగూలము

లూలామూలము. దే. మోసము, వంచన

## లె

లెంక. దే. భటుఁడు, సేవకుఁడు

లెంట. దే. ఒకదినుసు తెల్లతాయి

లెంప. దే. చెంప, ప్రక్క

లెంపకాయ. దే. చెంపకాయ

లెంబి. దే. లంబి, కుటుంబము

లెక్క. త. లక్ష్యము, సంఖ్య, గణన, గణితము

లెక్కగొను. దే. లక్ష్యముచేయు

లెక్కపెట్టు, లెక్కసేయు, లెక్కించు } దే.లక్ష్యముచేయు, ఎన్నికచేయు, ఎంచు

లెప్ప, లెప్పము } దే. గుఱి, లక్ష్యము

లెప్పము. త. లేప్యము, అనఁగా సున్నపుగచ్చు మొదలగునది

లెస్స. దే. క్షేమము, క్షేమయుక్తము, యోగ్యము. శ్రేష్ఠము, అంగీకారవాక్యము, సొగసు

లెస్సవాఁడు. దే. యోగ్యుఁడు

## లే

లే. దే. వృత్తియందు లేఁతశబ్దమూనకు లుప్తశేషము, నిశ్చయార్థకము

లేఁక. దే. లెంక, భటుఁడు
లేఁగ. దే. క్రొత్తగాఁ గలిగినదూడ, దూడ
లేఁగటియావు దే. లేఁతదూడ గలయావు
లేఁగసవు. దే. బాలతృణము
లేఁజందురుఁడు. దే. బాలచంద్రుఁడు
లేఁత. దే. తరుణము,చేలుకన, సుకుమారము
లేఁబగలు. దే. ప్రాహ్ణము
లేఁబోక. దే. మందగమనము
లేఁబ్రొద్దు. దే. అపరాహ్ణము
లేక. త. జాబు, ఎడము లేక మిక్కిలి చేరి కయగు వృక్షాదులవరుస, సమూహము
లేకరి. దే. లేఖకుఁడు
లేకి. దే. రాలినధాన్యపుగింజలు, అప్రయోజకుఁడు
లేకిబ్రతుకు. దే. లేకిగింజలేఱికొని బ్రతికెడు బ్రతుకు, ఉంఛవృత్తి
లేకివాఁడు. దే. లేకిగింజెలేఱికొని బ్రతికెడు వాఁడు, అప్రయోజకుఁడు
లేఖ. స. ఎడములేక మిక్కిలి చేరికయగు వృక్షాదులపంక్తి, లిపి, జాబు, ఇచ్చిపుచ్చుకోలుపత్రము
లేఖకుఁడు } స. వ్రాఁతకాఁడు, లేకరి
లేఖ్యకుఁడు }
లేఖనము. స. వ్రాఁత, వాంతి
లేఖని } స. వ్రాసెడుకలము
లేఖిని }
లేఖనికుఁడు. స. జాబులు కొనిపోవువాఁడు, తనగుఱుతిడి యొకరిచే వ్రాయించువాఁడు
లేఖనీయము. స. వ్రాయఁ దగినది
లేఖర్షభుఁడు. స. వేల్పుఱేఁడు
లేఖహారకుఁడు. స. జాబులు కొనిపోయియిచ్చువాఁడు
లేఖితము. స. లిఖితము
లేఖుఁడు. స. వేలుపు
లేఖ్యము. స. వ్యవహారవిషయమైనవ్రాఁత, వ్రాయఁదగినది
లేచు. దే. ఉత్థితమగు, మేలుకొను, పొటమరించు
లేట. దే. కొమ్మ
లేటమొగము. దే. అయిష్టము, రోఁత
లేటమొగమువడు. దే. విముఖమగు
లేటి } దే. జింక
లేడి }
లేడికంటి. దే. లేడికన్నులవంటి కన్నులు గలఆఁడుది, స్త్రీ, మృగాక్షి
లేను. దే. ఎలుఁగుబంటి, కాదు
లేనుబంతి. దే. బొంకు, అసత్యము
లేపకుఁడు. స. సున్నము లోనగువానిని పూయువాఁడు
లేపనము. స. అలుకుట, పూఁత, భోజనము
లేపము. స. పూఁత, భోజనము, సున్నము లోనగునవి, అలుకుట, తైలము,పుండుకు వేయుమందు, గచ్చు, మరక, పాపము
లేపించు. దే. చేయుము, పట్టించు,వెళ్లఁగొట్టు
లేపు. దే. లేవఁజేయు, పఱపు, జోలు
లేప్యము. స. పూఁత, పూయఁ దగినది
లేబరము. దే. శూన్యము
లేమ. త. ఆఁడుది, లేఁత
లేమి. దే. కలుగమి, ఉండమి, దారిద్ర్యము
లేలిహానము } స. పాము, మాటిమాటికి లేహనము చేయునది
లేలీహానము }
లేవ. దే. గుఱ్ఱమునకు తలయందుంచెడు తురాయి
లేవడి. దే. లేమి, దారిద్ర్యము, దరిద్రము, నీచము, అల్పము

వంచించు. స. వంచనచేయు, మోసపుచ్చు
వంచితుఁడు. స. వంచింపఁ బడినవాఁడు
వంచె / వంచియ } దే. కసవులోనగునవి కోయు వారు వాని నుంచుకొనుటకై వెనుకపిఱుఁదులమీఁద జాఱ గట్టుకొనెడి యొడి
వంచే / వంచేము } దే. ప్రదేశము, ఒకటి, ముఖ్యము
వంచేన. త. వంచన
వంచోడించు. దే. బెదరు
వంచు. త. వంగఁజేయు, వంగఁదీయు
వంజులము. స. అశోకవృక్షము, తివాస వృక్షము, ప్రబ్బచెట్టు
వంజెఱఁగు. దే. స్త్రీపార్శ్వచేలాంచలము
వంజే. దే. గొడుగులోపలి శలాకలకు ఆస రాగా నేర్పఱచినకమ్ములు
వంజే. త. గొడ్రాలు, గొడ్డుటావు
వంజేరము / వంజు } దే. మత్స్యవిశేషము
వంట. దే. పాకము, వండుట
వంటకట్టియలు / వంటకట్టెలు } దే. వంటకై పొయ్యి మంటవేసెడుకట్టెలు
వంటకత్తె / వంటకత్తియ } దే. వంటచేయునది, పాచకురాలు
వంటకము. దే. అన్నము
వంటకము. స. భాగము
వంటకుఁడు. స. పంచిపెట్టువాఁడు
వంటచెఱకు. దే. వంటకట్టెలు, గుడపాక యోగ్యమైన యిక్షువు
వంటచేమురు. దే. పిండివంటలు తేల్చి మిగిలిననూనె
వంటపుట్టి. దే. వంటచేసిపెట్టి జీవించునది
వంటపూటివాఁడు. దే. వంటచేసిపెట్టి జీవించువాఁడు, పూఁటకాఁడు
వంటయిల్లు / వంటకొట్టము } దే. వంటచేసెడి చోటు
వంటయుప్పు. దే. వండినయుప్పు
వంటరాయి. దే. మన్ను వండి చేసిన మణివిశేషము, పచ్చ
వంటరి. దే. వంటవాఁడు, వంటకత్తె
వంటలక్క. దే. వంటకత్తె, వంట చేసెడు స్త్రీ
వంటలవాఁడు / వంటవాఁడు } దే. వంటచేయు వాఁడు, పాచకుఁడు
వంటలు. దే ఏఱుపిడుకలు
వంటసరకు. దే. ఇంధనసమూహము, కట్టెలు
వంటసాల. దే. వంటయిల్లు
వంటి. దే. బోఁటి
వంటు. దే. అనుకూల్యము
వంటెము / వంటియము } దే. ఒకని క్రిందిరాజ్యము నందు కొంతభాగము, తాలూకా
వంత్రము. దే. మందులసంచి
వంరుఁడు. స. బ్రహ్మచారి, సేవకుఁడు, పొట్టివాఁడు
వండ. దే. ఆపద, చెఱువు లోనగువాని యడుగుననుండెడి యెండినబురద
వండ. స. అంకుటాలు, మొండి
వండలి. దే. ఎండి గట్టిపడిన బురద
వండు. దే. వంటచేయు, ఎండి గట్టిపడిన బురద
వండుఁడు. స. సున్నతీచేయఁబడినవాఁడు
వంత. దే. సంతాపము, ఏడ్పు, బాధ, ఏఱు
వంతు. దే. భాగము, వరుస, స్వామ్యము, పోటి

వంతెన. దే. ఏఱులోనగువానికి నీళ్లుపోవు టకు కన్నులు విడిచి మీఁద నడచిపోవు నట్లు కట్టినకట్ట, అట్టెడ, వారధి
వంద. దే. తృణవిశేషము, నూఱు
వంద. స. బదనిక
వందకము. స. చిఱుతేఁకుచెట్టు
వందనమాల. స. ద్వారమందుఁ గట్టినతోర ణము
వందనము. స. నమస్కారము, స్తుతి
వందనీయుఁడు. స. వందనమున కర్హుఁడు
వందఱ. దే. ఖండము, తునుక, బీసు
వందఱలాడు. దే. ఖండించు
వందారువు. స. గోత్రనామములు చెప్పి పాదములు సోఁక మ్రొక్కు వాఁడు, అభివాదకుఁడు
వంది. స. స్తుతిచేసి జీవించువాఁడు, బట్టు వాఁడు
వందించు. స. స్తుతించు
వందితుఁడు. స. నమస్కరింపఁబడినవాఁడు, స్తుతింపఁ బడినవాఁడు
వందిలి. దే. ఆపద, చిక్కు
వందు. దే. దుఃఖపడు, సంతాపించు
వందురు. దే. దుఃఖపడు, దుఃఖము
వందె }
వందియ } దే. తృణవిశేషము
వందొందు. దే. మత్స్యవిశేషము
వంద్యము. స. పూజ్యము, కొనియాడఁదగినది
వంద్యుఁడు. స. నమస్కరింపఁ దగినవాఁడు, స్తుతింపఁ దగినవాఁడు
వంద్ర. దే. వందఱ
వంధ్య. స. గొడ్రాలు, గొడ్డుటావు, ఫలిం పనిది
వంధ్యము. స. ఫలింపనిది,నిరుపయోగమైనది

వంపు. త. వంగుట, వంకర, వంగినది, వంక రైనది
వంశకరుఁడు. స. సంతానమువలన వంశ మును నిలుపువాఁడు
వంశకము. స. అగరువు, అగలు, పెద్దచెఱకు గడ
వంశనర్తి. స. దొమ్మరవాఁడు
వంశము. స. తండ్రితాతలు మొదలగువారి పరంపర, కులము, వెదురు, పిల్లంగ్రోవి, వెన్నెముక, సమూహము
వంశరోచన. స. త్వక్షీరిచెట్టు
వంశవృక్షము. స. వంశక్రమమును తెలియఁ జేయుపథకము
వంశానుచరితము. స. రాజవంశచరిత్రము
వంశావళి. స. వంశక్రమము
వంశి. స. పిల్లంగ్రోవి
వంశికము. స. అగరు, దాశార్హము
వంశీయము. స. వంశసంబంధమగునది
వకవకలు }
వకావకలు } దే. చెదరుటలు, బ్రద్దలు
వకుళము. స. పొగడచెట్టు
వక్క. త. ఉడుకఁబెట్టినపోకచెక్క
వక్కణ. త. వ్యాఖ్యానము, జోఁకునందు మొదటవ్రాయు పద్ధతి
వక్కణించు. త. వచించు
వక్కరము. త. వంకర, వంకరైనది
వక్కరాలు. త. కుటిలస్త్రీ
వక్కరించు }
వక్కళించు } త. తిరుగఁబడు
వక్కలాకులు }
వక్కాకు } దే. తాంబూలము
వక్కాణ. త. వక్కణ

వక్కాణము. త. సమాచారము
వక్కాణించు. త. వ్యాఖ్యానము చేయు, వాక్రుచ్చు
వక్కి. దే. బక్క
వక్కికట్టె / వక్కికట్టియ } దే. బక్కటిల్లినవాఁడు, కృశుఁడు
వక్కిపక్షి. దే. బక్కవాఁడు
వక్కు. దే. బక్కటిల్లు, కృశించు
వక్కు. త. వక్కుకొంగ, బకము
వక్కుపులుఁగు. దే. వక్కుకొంగ, బకము
వక్త. స. మాటలాడువాఁడు, పండితుఁడు
వక్తవ్యము. స. మాట, మాటాడఁ దగినది, నిందింపఁ దగినది
వక్త్రము. స. నోరు, ముఖము
వక్రదృష్టి. స. అసూయగలవాఁడు
వక్రపుచ్ఛిక. స. కుక్క
వక్రము. స. ఏటివంకర, వంకరైనది, క్రూరమైనది
వక్రాంగి. స. కటుకరోహిణి, వంకరైన దేహముగలది
వక్రించు. స. మరలు, మరలఁబడు
వక్రిమ / వక్రిమము } స. వంకర, వంగినది
వక్రుఁడు. స. అంగారకుఁడు, శనైశ్చరుఁడు
వక్షము / వక్షస్సు } స. ఱొమ్ము
వక్షోజము / వక్షోరుహము } స. స్తనము
వక్ష్యమాణము. స. చెప్పఁ బోవునది
వగ. దే. సంతాపము, దుఃఖము, శోకము, ఆలోచన, విధము, గతి, విలాసము, విచారము
వగకత్తె. దే. విలాసవతి.
వగకాఁడు. దే. విలాసవంతుఁడు
వగచు. దే. శోకించు, పశ్చాత్తాపపడు, ఏడ్చు, దుఃఖించు, విచారించు, ఆలోచించు, తలఁచు
వగదెంచు. దే. పరిష్కరించు
వగదెగు. దే. పరిష్కారమగు
వగపు. దే. శోకము
వగరము / వగరు } దే. శ్వాసరోగము, ఉబ్బసము
వగరుచు / వగర్చు } దే. నిట్టూర్చు
వగరుపు / వగర్పు } దే. శ్వాసరోగము
వగలాఁడి. దే. శృంగారచేష్టలుగల స్త్రీ, వగకత్తె
వగలాఁడు. దే. శృంగారచేష్టలుగల పురుషుఁడు, వగకాఁడు
వగవగ. దే. చింతతో
వగ్గు. దే. వక్కు, బక్క
వగ్రహము. స. కఱవు, అవగ్రహము
వచ. స. వస, గోరువంక
వచనము / వచస్సు } స. మాట, చెప్పుట, చెప్పఁబడినది, వేదవాక్కు, సూత్రము, ఆజ్ఞ, సొంటి, వ్యాకరణమున సంఖ్యను తెలియఁ జేయునది
వచనస్థితుఁడు / వచనేస్థితుఁడు } స. చెప్పినట్టు చేసెడివాఁడు
వచనీయము. స. చెప్పఁ దగినది, నిందింపఁ దగినది
వచము. స. చిలుక
వచరుఁడు. స. దుర్మార్గుఁడు, శఠుఁడు
వచించు. స. మాటాడు, భాషించు

వచోహరుఁడు. స. రాయబారి, సమాచారములను తీసికొనిపోవువాఁడు
వచ్చె. దే. చెట్టుకుఁబట్టి బొత్తిగా నాశము చేసెడి యొకదినుసుచీడ
వచ్చె. త. ఇచ్ఛ
వచ్చు. దే. దూరమునుండి సమీపమునకు నడచు, కూడు, చేకుడెంచు, సంభవించు
వచ్చుబడి. దే. ధనాగమము, ఆయతి
వచ్చురాములు. దే. రాకయురామియు
వజీరుఁడు } దే. జోదు, శూరుఁడు
వజీరు }
వజ్జిరము. త. వజ్రము, రవ
వజ్జీరుఁడు. దే. వజీరుఁడు
వజ్రకీటము. స. సాలగ్రామము లోపలనుండి తొలిచెడి పురుగు
వజ్రగార. గ్రా. వజ్రములు నూఱిచేసినగార
వజ్రతుండుఁడు. స. గరుత్మంతుఁడు
వజ్రదండము. స. వ్రణములో పుట్టుపురుగు
వజ్రదేహి. స. గట్టి శరీరముగలవాఁడు
వజ్రద్రుమము. స. ఆకుజెముడుచెట్టు
వజ్రనిర్ఘోషము } స. పిడుగు చప్పుడు, ఊఱుము
వజ్రనిష్పేషము }
వజ్రపుష్పము. స. నువ్వుపువ్వు
వజ్రము. స. రవ, కులిశము, ఒక గ్రహయోగము, పిడుగు
వజ్రవల్లి. స. నల్లేరు
వజ్రశుంరుఁడు. స. శుద్ధమూఢుఁడు
వజ్రహాసము. స. శివునికత్తి
వజ్రాంగి. స. వజ్రమయకవచము
వజ్రి. స. ఇంద్రుఁడు, ఆకుజెముడు
వజ్రిక. స. ములుజెముడు
వజ్రీఁడు. దే. వజీరుఁడు
వజీ. త. వసమొక్క
వజ్జె. దే. ఉపాయము
వజ్జిరము } దే. ఒక విధమైనబంక, మత్స్యవిశేషము
వజ్రము }
వటకము. స. వడియము, మాత్ర
వటగ. దే. నేర్పరి
వటము. స. త్రాడు, దండ, మఱ్ఱిచెట్టు, గవ్వ
వటారము } దే. నగరు, బస
వటారు }
వటారి. దే. సమర్థము, సమర్థుఁడు
వటి. స. త్రాడు, వటము
వటించు. దే. పస్తుపడు. ఉపవసించు
వటిక. స. మాత్ర
వటివేరు. దే. వట్టివేరు
వటుకుఁడు } స. బ్రహ్మచారి, బాలకుఁడు
వటువు }
వట్ట. దే. చెఱకుగానుగకు వేసెడి అడ్డమ్రాను
వట్టము. గ్రా. నాణెముల చెలామణిచేయుట యందు నిచ్చెడుత్రోపుడు, దానియందు తీసెడిలాభము, తఱుగు, నష్టము
వట్టలు. దే. వృషణము, వట్టకాయలు
వట్టి. దే. ఏమియులేనిది, రిక్తము, ప్రయోజనములేనిది, కేవలము
వట్టికాలు. దే. మోఁకాలికింద ముందరి భాగపుకాలు
వట్టిమాట. దే. లేనిమాట, అపవాదము
వట్టియావు. దే. వట్టిపోయినయావు, పాఁడిలేనియావు
వట్టివరి. దే. సస్యవిశేషము

వట్టివాఁడు. దే. వ్యర్థుఁడు
వట్టివేరు. దే. సువాసనగలయొకవేరు,ఉశీరము
వట్టు. దే. ఇంకు, కృశించు,వరుగు, ఎండిన పక్క, దూలము లోనగువానికి బలముకై వేసెడుకట్టు, నిర్జలమగు
వట్నము. దే. ధాన్యాదులు నించిన గోనె
వట్ర. త. గుండ్రము, వర్తులము
వట్రన. త. గుండ్రన, వర్తులత్వము
వట్రపడు. త. తగ్గు
వట్రపెట్టు. దే. తక్కువపఱచు, తగ్గించు, లక్ష్యముచేయు
వట్రము. దే. వక్కకుతిత్తి
వట్రము. త. హ్రస్వము
వట్రించు. త. తిరుగు, పరాఙ్ముఖమగు
వట్రిల్లు, వట్రిలు. త. ప్రవర్తిల్లు, తిరుగు, కలఁగు
వట్రువ. త. గుండ్రము
వట్రువసుడి. దే. ఋకారముయొక్క రూపాంతరనామము
వరర, వరారి. దే. సమర్థుఁడు, రవర
వరరుఁడు. స. బుద్ధిహీనుఁడు
వడ. దే. గారె, మిరెపకాయలు లోనగు సంబారువులుచేర్చి చేసినగారె, తాపము, శ్రమము, సెగ, వేఁడిమి
వడఁకాఁడు. దే. వడకు
వడఁకు. దే. కంపించు, కంపము, ఉత్తరపు దిక్కు
వడఁకుగొండ. దే. హిమవత్పర్వతము
వడఁకుత్రోవ. దే. ఉత్తరాయణము
వడఁబోయు. దే. వడిఁగట్టు
వడగల్లు. దే. వానకురియునప్పుడు పడు ఱాయి, కరక
వడగాలి, వడగాడ్పు. దే. వేసవికాలమందలి నిప్పుగాలి, చారవాయువు
వడగొను. దే. తాపముఁ బొందు
వడదెస. దే. ఉత్తరపుదిక్కు
వడదోలు. దే. వేఁటకాఁడు శరీరమునకుఁ గప్పుకొనెడు నిడుపుతోలు, గవుండ్లవాఁడు మొలకు కట్టుకొనెడు నిడుపుతోలు
వడప. దే. జేవట
వడపప్పు. దే. నానఁబెట్టి సంబారువుచేర్చిన పెసరపప్పు
వడపిందెలు. దే. తాపమును బోఁగొట్టునట్టి ఊరవేసిన మామిడిపిందెలు
వడపు. దే. గుహ
వడము. దే. మోకు, దండ
వడముడి. దే. భీముఁడు
వడలు. దే. పుష్పాదులువాడు, గారెలు
వడవడ. దే. వడకుటయందగు ధ్వన్యనుకరణము
వడసారము. దే. బొత్తిగా, పూర్తిగా
వడారము. దే. బొత్తిగా
వడి. దే. వేగము, శౌర్యము, కాలము, దారము పిరి, పురిబిగువు
వడి. త. పద్యయతి, వళి
వడిఁగట్టు. దే. పాత్రమునోటికి గుడ్డకట్టి నీళ్లు మొదలగువానిని వడియఁ బోయు
వడిఁబెట్టు. దే. వడిఁగట్టు, శోధించు, మెలిపెట్టు
వడికాఁడు. దే. వేగవంతుఁడు, శౌర్యవంతుఁడు
వడిగలతనము. దే. వడిగలవాని తనము, శౌర్యము
వడిగొను. దే. మెలిపడు, వేగము గలుగు
వడిగొల్పు. దే. వడిగొనఁ జేయు

వడిపెట్టు. దే. మెలిపెట్టు, నులుము
వడియఁగట్టు. దే. వడిఁగట్టు
వడియఁబోఁత. దే. వడియఁ బోయుట
వడియఁబోయు. దే. బియ్యము మొదలగు వానిని గడిగి నీళ్లువడియనుంచు
వడియము. త. వ్యంజనవిశేషము, వటకము
వడియు. దే. కాఱు, ఇంకు, కృశించు
వడివడు. దే. శ్రమపడు, బాధపడు
వడివాఁడు. దే. శూరుఁడు
వడివేయు. దే. వడిపెట్టు, మెలివేయు
వడిసుడి. దే. ఆవర్తము, సుడిగుండము
వడుకు. దే. కదురు లోనగువానిని త్రిప్పి దూదిని నూలుగా నీడ్చు
వడుకుడు. దే. వడుకుట
వడుగఁడు. త. బ్రహ్మచారి
వడుగు. దే. విధము
వడుగు. త. బ్రహ్మచారి, ఉపనయనము
వడుచు. దే. కార్చు, నూనె లోనగువానిని దించు
వడుపు. దే. వడియుట
వడువు. దే. విధము
వడుపు. త. బ్రహ్మచారి, ఉపనయనము
వడుసు. దే. మోటుతనముగా నుతుకుట చేత వస్త్రమునందు పడుగుపేకలు సందిచ్చి వంకరగా తొలఁగుట
వడుసుడి. దే. రాజులు పుచ్చుకొను దండువు
వడుసుపోవు. దే. వస్త్రము వడుసుకలది యగు
వడె } దే. చిలుకకొయ్య, నాగదంతకము
వడియ }
వడ్డన. దే. వడ్డించుట

వడ్డి. త. అప్పిచ్చినవానికి అప్పుపుచ్చుకొన్న వానివలన నెలకు నూటికింతయని పెచ్చుగావచ్చుధనము, వృద్ధి
వడ్డించు. దే. అన్నాదులనుతినువానియెదుట విస్తరిలో నుంచు
వడ్డికివడ్డి. దే. వడ్డికికలిగినవడ్డి. చక్రవృద్ధి
వడ్డిబ్రతుకు. దే. వడ్డికిచ్చి బ్రతికెడుబ్రతుకు, వృద్ధిజీవిక
వడ్డిమేపరి. దే. వడ్డిచే జీవించువాఁడు
వడ్డెన. దే. వడ్డించుట
వడ్రంగము } త. వడ్రంగిపని
వడ్రము }
వడ్రంగి. త. వడ్లవాఁడు, వర్ధకి
వడ్రంగిపిట్ట, దే. పక్షివిశేషము
వడ్ల. త. వడ్రంగిపని
వడ్లంగి. త. వడ్రంగి
వడ్లంగిపిట్ట. త. వడ్రంగిపిట్ట
వడ్లకంకణము. త. కొంగలలో భేదము
వడ్లచిలుక. త. ఒకానొకపురుగు
వడ్లన. దే. వడ్లవి
వడ్లు. త. శాలిధాన్యము, వరిగింజెలు
వణఁకు. దే. వడఁకు
వణిక్కు. స. వర్తకము,వర్తకుఁడు,ఒక కరణము
వణిగనము. స. వర్తకులు. వైశ్యులు
వణిజుఁడు. స. వర్తకుఁడు
వణిజ్య } స. వాణిజ్యము. వ్యాపారము
వణిజ్యము }
వణితము. దే. ఒకని క్రిందిరాజ్యము, తాలూకా
వతంసము. స. సిగబంతి, పూఁగమ్మ, అవతంసము

వత్త. దే. వరుగు
వత్తి. త. దీపపువత్తి, దశ
వత్సకము. స. కొడిసెచెట్టు
వత్సతరము. స. మోయుటకును దున్నుటకును పనుపడఁదగిన వయసుగలకోడె
వత్సదంతము. స. బాణము
వత్సనాభము. స. విష భేదము
వత్సనాభి. స. వసనాభి
వత్సము. స. ఱొమ్ము, ఏడాఁది, ఏడాఁది లోనిదూడ
వత్సరము. స. సంవత్సరము
వత్సలత. స. స్నేహము
వత్సలము. స. తృణాగ్ని, దయగలది
వత్సలుఁడు. స. వాత్సల్యము గలవాఁడు
వత్సాదని. స. తిప్పతీఁగ
వత్సుఁడు. స. బాలుఁడు
వదంతి. స. లోకప్రవాదము, మాట
వదనము. స. నోరు, మొగము
వదనిక. త. బదనిక
వదర. త. వదరుఁబోతు
వదరు. దే. అదరు, చేఁగిసారమొక్క, సారకాయ
వదరు. త. ఉపయోగము లేనిమాటలు ఊరకమాటాడు, ప్రేలు
వదరుఁబోతు దే. ఊరక వదరువాఁడు, ప్రేలరి
వదలించు. దే. విడిపించు
వదలు. దే. ఊడు, వీడు, విడుచు, విడుపు
వదాన్యత. స. దాతృత్వము
వదాన్యుఁడు. స. మిక్కిలి యిచ్చువాఁడు, మనోహరముగా మాటలాడువాఁడు
వదావదుఁడు. స. మాటలాడువాఁడు, వక్త
వదావళి. దే. వదరుఁబోతుతనము
వది. దే. ఏనుఁగుమొదలగువానిని పట్టుటకై త్రవ్వఁబడిన పల్లము
వదినియ, వదినె } త. అన్నభార్య, భార్యయొక్క అక్క, తనకంటె పెద్దదియగు మేనత్త, మేనమామల కూఁతురు
వదుఁడు. స. మాటలాడువాఁడు, వక్త
వదులు. దే. బిగువుతప్పు, సడలు, బిగువు కానిది
వదె, వదియ } త. తృణభారవిశేషము
వద్ద. దే. ఒద్ద
వద్యము. స. చెప్పఁ దగినది
వధ, వధము } స. చంపుట
వధకుఁడు. స. చంపువాఁడు, ఉరితీయువాఁడు
వధించు. స. చంపు
వధువు. స. ఆఁడుది, పెండ్లాము, పెండ్లికూఁతురు, కోడలు, పిక్కచెట్టు
వధూజనము. స. స్త్రీలు
వధూటి. స. ఆఁడుది, కన్యక, కోడలు
వధూనిక. స. వదినె
వధూ[illegible]వు. స. పెండ్లికై స్త్రీలను గోరువాఁడు
వధూవరులు. స. క్రొత్తగా పెండ్లాడినదంపతులు
వధ్యుఁడు. స. చంపఁ దగినవాఁడు
వధ్రి. స. టంగువాఱు
వనచరము, వనేచరము } స. వానరము, అడవితిరుగుడు
వనజము. స. తామర
వనజాక్షి. స. స్త్రీ
వనట. దే. శోకము

వనతిక్తక. స. అగలుసొంటి, చిఱుబొద్దిచెట్టు
వనదము. స. మేఘము
వనదీపము. స. సంపెఁగపువ్వు
వనధి. స. సముద్రము
వనపు. దే. వనరుట, దుఃఖరూపచింత
వనప్రియము. స. కోయిల, దాలిచెట్టు
వనభోజనము. స. వేడుకకొఱకు మిత్రబాంధవులతోఁ గూడి యొకతోఁటకుఁ బోయి అక్కడ భోజనము చేయుట
వనమాల. స. ఆకులు పువ్వులుచేర్చి కట్టిన తోమాల
వనమాలి. స. వనమాలగలవాఁడు, విష్ణువు
వనము. స. అడవి, తోఁపు, జలము, సెలయూట, పరదేశమునందలి యునికి, ఇల్లు, సమూహము, మొక్కలగుంపు, కలప
వనరు. దే. శోకించు, దీనాలాపములాఁడు, విలపించు
వనశృంగాటము. స. పల్లేరుమొక్క
వనస్పతి. స. పూవకకాచెడుచెట్టు, చెట్టు
వనాటము. స. వనమునందు చరించునట్టి జంతువు
వనాయుజము. స. వనాయుదేశమునందుఁ బుట్టినగుఱ్ఱము
వని. స. అడవి, వనము, వానప్రస్థుఁడు
వనిక. స. అడవి, తోఁపు
వనిత. స. ఆఁడుది, మిక్కిలి యనురాగము గలయాఁడుది, నల్లదింటెనచెట్టు, యాచింపఁ బడినది, సేవింపఁబడినది
వనీకుఁడు }
వనీపకుఁడు } స. యాచకుఁడు
వనౌకసము. స. వానరము, అడవినట్టు

వన్నియ }
వన్నె } త. తెలుఁగులోనగువర్ణము, వర్ణన, బంగారముయొక్క మేలిమి వర్ణపుపూఁత, అందము, అలంకారము, కాంతి, వర్ణపుచీర, ప్రసిద్ధి, విధము, అంకెవన్నె
వన్నెకత్తె. త. సౌందర్యవతి, విలాసవతి
వన్నెకాఁడు. దే. సౌందర్యవంతుఁడు, విలాసవంతుఁడు
వన్నెచీర. త. చిత్రవర్ణపువస్త్రము
వన్నెచెట్టు. దే. వర్ణపుష్పవృక్షము
వన్నెపులుఁగు. దే. జీవంజీవము
వన్నెపూలు. త. ధాన్యవిశేషము
వన్నెలాఁడి. దే. విలాసవతి
వన్నెలాఁడు. దే. విలాసవంతుఁడు
వన్నెవెదురు. త. ఒకదినుసుకూరాకుచెట్టు, వృత్తపత్రము
వన్య. స. వనసమూహము
వన్యము. స. అడవియందుఁ బుట్టినది
వప. స. కడుపులో బొడ్డుక్రిందనుండెడి యుల్లిపొరవంటి క్రొవ్వు, బెజ్జము
వపనము. స. గొఱుగుట, విత్తుట
వపువు. స. శరీరము, చక్కనిరూపము
వప్త. స. తండ్రి, విత్తెడువాఁడు
వప్రక్రీడ. స. ఏనుఁగు మొదలగునవి దంతములు మొదలగు వానితో భూమిని కోరాడెడియాట
వప్రము. స. సీసము, కోట, కోటకొఱఁడు, వరిమడి, తీరము, కొండనెత్తము
వమథువు. స. ఏనుఁగుతొండపు తుంపురు, వమనము

వమనము. స. వాంతి, పీడనము
వమి. స. వమనము, అగ్ని
వమ్ము. త. నాశము, వ్యర్థము, నష్టము
వమ్మువోవు. దే. వ్యర్థమగు, నష్టమగు
వమ్రి } స. వమ్రిక, చెదలు, చెట్టు
వమ్రము } మీఁదనుండు నల్లచీమ
వయనము. స. నేయుట, నేఁత
వయసు } స. ప్రాయము, యౌవనము,
వయస్సు } ఈడు
వయసువాఁడు. దే. తరుణుఁడు
వయస్థ. స. ఉసిరికచెట్టు, కరకచెట్టు, చిట్టేలకిచెట్టు, బూరుగుచెట్టు, తిప్పతీఁగ, ప్రాయపుది
వయస్థుఁడు. స. పిన్నవయసువాఁడు
వయస్య. స. చెలికత్తె
వయస్యుఁడు. స. చెలికాఁడు
వయాళి } త. విహారము, స్వారి
వయ్యాళి }
వయు. స. సాలెది
వయుఁడు. స. సాలెవాఁడు
వయ్యంది. దే. కుంపటి, అంగారధానిక
వయ్యము. దే. వ్యర్థము
వర. దే. సస్యవిశేషము
వరండము. స ముఖమునందలిబొబ్బ, లోపలితిన్నె, గడ్డివామి, సమూహము, వరండా, వసారా
వరఁకు. దే. చిక్కు
వరఁగలించు. దే. ప్రకాశించు
వరఁత. దే వ్రంత
వరకట్టు. దే బంగారమును ఒరసిచూచుట, సేద్యమునకై భూమిని చక్కఁజేయుట
వరకము. స. వరగ, కోరిక, తుడుపుగుడ్డ
వరకు. దే. బంగారు మొదలగువానిజేకు
వరకుఁడు. స. పెండ్లికై పిల్లనడుగువాఁడు
వరగ. త. పెద్దారుగపైరు
వరట. దే. పేడయెండిన చెక్క
వరట. స. ఆఁడుహంస, కడుఁదురీఁగ
వరటము స. హంసము
వరటు. దే. శుష్కించు
వరణ. స. కాశికి నుత్తరపు టెల్లయయిన ఒకయేఱు
వరణము. స. వరించుట, వేష్టనము, ప్రహరి, వంతెన, ఉలిమిరిచెట్టు
వరణీయము. స. వరింపఁ దగినది
వరత్ర. స. టంగువాఱు, ఏనుఁగు నడిమితోలుమోకు
వరదుఁడు. స. వరము నిచ్చువాఁడు, సమర్థకుఁడు
వరను. దే. చిక్కు, వరఁకు
వరము. స. కుంకుమపూవు, దేవతాదులవలన పొందఁబడుకోరిక, వరించుట, ఒకనిధి, శ్రేష్ఠము, ఇంచుకంత ప్రియమైనది, కోరిక, అందమైనది, ఉత్తమము, బహుమానము, పిచ్చిక
వరవ. దే. నీళ్లువచ్చుట కేర్పఱిచినకాలువ
వరవత్సల. స. అత్త
వరవర్ణము. స. బంగారు
వరవర్ణిని. స. భర్తయందనురాగముగల ఉత్తమస్త్రీ, పసుపు, గోరోజనము, లక్క, ప్రేంకణపుచెట్టు
వరవు. త. సేవకుఁడు, దాసి
వరవుడము. త. దాస్యము
వరవుడు. త. దాసి, దాసుఁడు

వరహా } త. వరాహముద్రగల ఒకబంగా
వరా } రునాణెము
వరహుఁడు. స. మంచిగుఱ్ఱపురౌతు
వరాంగకము. స. లవంగపుపట్ట, శ్రేష్ఠమైన అంగములు గలది
వరాంగము. స. తల, ఆడుమగలగుఱి, లవంగపుపట్ట, శ్రేష్ఠమైన అంగము, ఏనుఁగు
వరాకము. స. అధమము
వరాకుఁడు. స. నికృష్టుఁడు, దురదృష్ట వంతుఁడు, శివుఁడు
వరాటకము } స. గవ్వ, తామరపూస,
వరాటిక } మోకు
వరాటకుఁడు. స. అనామధేయుఁడు
వరారోహ. స. ఉత్తమస్త్రీ, గొప్పపిఱుఁదులుగల ఆఁడుది
వరారోహుఁడు. స. మావటివాఁడు
వరాశి } స. ముదుగుకోక, శ్రేష్ఠమైన
వరాసి } కత్తి
వరాహకూర్చము. స. నగలుతుడుచుటకై యుపయోగింపఁబడు నడవిపంది వెండ్రుకలకట్ట, వరాకట్టె
వరాహము. స. పంది, వరహా, ముస్తె, కొండ
వరాహుఁడు. స. విష్ణువు
వరి. త. సస్యవిశేషము
వరి. స. ఝిల్లిపీఁచరమొక్క
వరించు } స. వరణముచేయు, కోరు
వరియించు }
వరిపొట్ట. దే. కలమగర్భము
వరిమ. స. శ్రేష్ఠత్వము
వరివసితుఁడు. స. ఉపాసింపఁబడినవాఁడు, ఆచార్యుఁడు
వరివస్య. స. సేవ, ఉపాసనము, కాచియుండుట, సన్మానము
వరివస్యితుఁడు. స. ఉపాసింపఁబడినవాఁడు
వరిష్ఠము. స. మిరియము, రాగి, తీతువు, మిక్కిలి యురువైనది, మిక్కిలి పరమైనది
వరిష్ఠుఁడు } స. శ్రేష్ఠుఁడు, మిక్కిలి శ్రే
వరీయుఁడు } ష్ఠుఁడు, మిక్కిలి ప్రాయపువాఁడు
వరీయస్సు. స. ఒకగ్రహయోగము
వరీయుఁడు } స. తన తరగతిలోఁ జేరిన
వర్గ్యుఁడు } వాఁడు, తానుచదువుతరగతిలో చేదువువాఁడు
వరుఁడు. స. పెండ్లికొడుకు, మగఁడు, రాజు, శ్రేష్ఠుఁడు, పెండ్లికై కన్యను కోరువాఁడు, అల్లుఁడు, వ్యభిచారి
వరుగు. దే. ఎండవేసినకాయలు మొదలగునవి, గృధ్రవిశేషము
వరుగుఁజేఁప. దే. ఉప్పుఁజేఁప, శుష్కమత్స్యము
వరుజు. దే. మళ్లకుకట్టినకట్ట, గనిమ
వరుణము. స. ఉలిమిరిచెట్టు, జలము, దినముయొక్క పదునాల్గవభాగము
వరుణాలయము. స. సముద్రము
వరుణాత్మజ. స. వారుణి, కల్లు
వరుణుఁడు. స. నీటిజేడు, ద్వాదశాదిత్యులలో నొకఁడు
వరుస. దే. పంక్తి, పరంపర, వంతు, క్రమము, బంధుత్వక్రమము, సామ్యము, విధము, పర్యాయము
వరుసమొగ్గరము. దే. దండవ్యూహము
వరూథము. స. కవచము, గృహము, రక్షణము
వరూథిని. స. సేన, దండు
వరేణ్యుఁడు. స. ముఖ్యుఁడు

వర్గము. స. అధ్యాయము, సజాతీయసమూహము, తెగ, గుంపు, బలము, ఒక సంఖ్యను అంతచేత గుణింపగా వచ్చే లబ్ధము
వర్గించు. స. వర్గుచేయు
వర్గ } స. పేరు వరుసగా వ్రాసిన లెక్క,
వర్గువు } ఒక సంఖ్యను అంతచే గుణింపగా వచ్చేలబ్ధము
వర్చస్కము. స. విష్ఠ, మలము
వర్చస్వి. స. తేజస్సుగలవాఁడు, బలముగలవాఁడు
వర్చస్సు. స. తేజము, రూపము, విష్ఠ, చంద్రునికొడుకు
వర్జనము. స. విడుపు, ఈవి, హింస, వధము
వర్జనీయము. స. వర్జింపఁ దగినది
వర్జము. స. విడుచుట
వర్జించు. స. వర్జనముచేయు, విడుచు
వర్జితము. స. వర్జింపఁ బడినది
వర్జ్యము. స. విడువఁదగిన దోషయుక్తకాలము, విడువఁదగినది
వర్ణకము. స. చందనము, చందనములోనగువానిపూఁత, తెలుపులోనగువన్నె
వర్ణకుఁడు. స. బట్టువాఁడు
వర్ణనము. స. స్తోత్రము
వర్ణపుష్పము. స. పన్నెచెట్టు
వర్ణమాల. స. అక్షరసమామ్నాయము
వర్ణము. స. అక్షరము, బంగారు, రూపము, చందనములోనగువానిపూఁత, భేదము, రంగు, జాతి, స్తుతి, యశము, గుణము, ఏనుఁగుమీఁదపఱచెడుకంబళము, బ్రాహ్మణాదికులము, కీర్తి, మూఁత
వర్ణరూపిణి. స. సరస్వతి
వర్ణవతి. స. పసుపు

వర్ణసంకరము } స. వివాహాదులవలన అన్యకులములతో కలయిక
వర్ణసంయోగము }
వర్ణసంయోగము. స. ఏకజాతిలోనివారి వివాహము
వర్ణాటుఁడు. స. గాయకుఁడు, చిత్తరువు వ్రాయువాఁడు, ఆఁడుదానివలన బ్రతుకువాఁడు
వర్ణావళి. స. బంగారు మొదలగువానిమచ్చుముక్క
వర్ణాశ్రమములు. స. బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రజాతులు, వారివృత్తులు
వర్ణి. స. బ్రహ్మచారి, చిత్తరువు వ్రాయువాఁడు, వ్రాతకాఁడు, ఋషి
వర్ణించు. స. స్తుతించు, పొగడు [వన్నె
వర్ణిక. స. తెలుపులో నగువన్నె, బంగారు
వర్ణితము. స. స్తుతింపఁ బడినది
వర్ణిని. స. స్త్రీ
వర్ణిలింగి. స. తొంటదమ్ముఁడు
వ_ర్తకము. స. వణిగ్వ్యాపారము, వెలిచెపిట్ట, గుజ్జుపుగొరెకు [వాఁడు
వ_ర్తకుఁడు. స. వణిగ్వ్యాపారము చేయు
వ_ర్తనము. స. నడవడి, జీవనము, ఉనికి, స్థితి, వృత్తి
వ_ర్తని. స. త్రోవ, కాలిజోడ, కదురుబిళ్ల, కనుఱెప్ప
వ_ర్తనుఁడు. స. పొట్టివాఁడు, వ_ర్తించువాఁడు
వ_ర్తమానము. స. జరుగుచున్నకాలము, సమాచారము
వ_ర్తరూకము. స. కాకిగూఁడు, పడియ
వ_ర్తి. స. దీపపువ_త్తి, దీపము, అ_త్తరుబిల్ల, కంటికాటుక, వరుస, వ_ర్తించువాఁడు, వ_ర్తిక్షేపము
వ_ర్తించు } స. ఉండు
వ_ర్తిల్లు }

వర్తిక. స. మీనవల్లంకి
వర్తిభూపము. స ఊదువత్తి
వర్తిష్ణువు. స. వర్తించువాఁడు
వర్తులము. స. గుండ్రనిది
వర్తులాభరణము. స. బవిర
వర్త్మము. స. త్రోవ, కనురెప్ప
వర్ధంత్యుత్సవము. స. పుట్టినదినముపండుగ
వర్ధకి. స. వడ్లంగి, రథకారుఁడు
వర్ధనము. స. పెరుగుట, నఱకుఁడు, పెరుఁగునది
వర్ధమానకము. స. మూఁకుడు
వర్ధమానము. స. ఆముదపుఁజెట్టు, మూఁకుడు, వృద్ధిపొందింపఁబడినది
వర్ధమానుఁడు. స. విష్ణువు, వృద్ధిపొందువాఁడు
వర్ధించు. స. వర్ధిల్లఁజేయు, పెంచు
వర్ధితము. స. పెంచఁబడినది, నిండినది, నఱకఁబడినది
వర్ధిల్లు. స. వృద్ధిఁబొందు
వర్ధిష్ణువు. స. వృద్ధిఁబొందువాఁడు
వర్ధ్రి. స. టంగువాఱు
వర్మము, వర్మువు } స. కవచము, బొందలము
వర్మితుఁడు. స. కవచము తొడిగినవాఁడు, బొందలీఁడు
వర్యా. స. తనంతట మగని వరించునట్టిఆఁడుది, ముఖ్యురాలు
వర్యుఁడు. స. శ్రేష్ఠుఁడు
వర్వరుఁడు. స. నత్తివాఁడు, మూఢుఁడు
వర్ష. స. వానకాలము
వర్షత్రము. స. గొడుగు
వర్షధరుఁడు, వర్షవరుఁడు } స. అంతఃపురపు కావలివాఁడు
వర్షము. స. పేడితనము, వాన, సంవత్సరము, జంబూద్వీపము, భారతాది, మేఘము
వర్షాభువు. స. కప్ప, ఎఱ్ఱ, పట్టుపురుగు, గలిజేరు, వర్షాకాలమునందుఁ బుట్టునది
వర్షాభ్వి. స. ఆఁడుకప్ప
వర్షాశనము. స. విద్వాంసులు లోనగువారికి సంవత్సరమున కొకసారి యిచ్చెడు ద్రవ్యము
వర్షించు. స. వానకురియు
వర్షీయసి. స. ఏండ్లు చెల్లినది, ముసలిది
వర్షీయుఁడు. స. మిక్కిలి యేండ్లు చెల్లినవాఁడు
వర్షోపలము. స వడగల్లు, కరకము
వర్ష్మము. స. శరీరము, మిక్కిలి చక్కని రూపము
వఱ. దే. మేర
వఱకము. దే. నీటిచేఁ జేయఁబడినయొడ్డు, కఠినముగ పనిచేయించుచు చెఱలో నుంచుట
వఱకు. దే. దనుఁక, దాఁక
వఱగొడ్డము. దే. వంకరమాట [నక్క
వఱడు. దే. పెద్దజాతినక్క, ముదినక్క,
వఱద. దే. వెల్లువ, ప్రవాహము
వఱదగుడి. దే. సూర్యాదిపరివేషము
వఱదవాఱు. దే. ప్రవహించు
వఱపు. దే. వానలేమి, అవగ్రహము
వఱల. దే. వృద్ధతపస్వి
వఱలు. దే. ప్రకాశించు, ప్రవర్తిల్లు, వ్యాపించు
వఱువట్లు. దే. మిక్కిలివట్టులు
వఱువట్లుగొను. దే. మిక్కిలి యెండు
వఱువాత. త. ప్రాతఃకాలమున
వఱ్ఱు. దే. ప్రవాహము
వఱ్ఱె, వఱ్ఱియ } దే. బీఁటిక
వఱ్ఱొడ్డు. దే. ప్రవహించు

వల. దే. మత్స్యములను పట్టెడు జాలము, మృగములు పక్షులు మొదలగువాని బట్టెడు వాగుర, వృత్తియందు వలను శబ్దమునకు లుప్తశేషము

వల. త. కామము

వలఁకు. దే. దిక్కు, వలను

వలఁకువు. దే. వలఁకు, దిక్కు

వలఁతి. దే. ఆఁడుది, నేర్పరి, అధీనము, అనుకూలము

వలకట్టు. దే. అనుకూలపఱచు

వలకడ. దే. దక్షిణపుదిక్కు, కుడిపట్టు

వలకాఁక. దే. మన్మథతాపము

వలకాఁడు. దే. కాముకుఁడు

వలకారి. దే. వలపించువాఁడు, వలపించునది

వలకారితనము. దే. శృంగారభావము

వలగొను. దే. ప్రదక్షిణించు, చుట్టుకొను

వలగ్నము. స. నడుము

వలచేయి. దే. కుడిచేయి

వలచు. దే. వాసనగొట్టు

వలచు. త. కోరు, కామించు

వలచుట్టు. దే. వలగొను, వలగొనుట

వలజ. స. చక్కనిచూపుగల ఆఁడుది, భూమి

వలజము. స. పరిమడి, పైరు, ధాన్యరాశి, పురద్వారము, యుద్ధము

వలతి. దే. స్థానము

వలదు. దే. ఆధిక్యము, అధికము, వద్దు

వలదొర } దే. మన్మథుఁడు, రతిపతి
వలరాయఁడు

వలన. దే. పంచమీవిభక్తిప్రత్యయము

వలనము. స. కంటిపాపతిరుగుడు, తిరుగుడు, ఇట్టి

వలను. దే. దిక్కు, పార్శ్వము, ఉపాయము, నేర్పు, ప్రదక్షిణము, శకునము, విధము, ఒప్పిదము, శుచిత్వము, అనుకూల్యము, కుడిదక్షిణము, యుక్తము

వలపల. దే. దక్షిణభాగము

వలపలగిలుక. దే. రేఫముయొక్కరూపాంతరనామము

వలపలించు. దే. వలగొను, వలచుట్టు

వలపించు. దే. మోహింపఁజేయు

వలపు. దే. వాసన

వలపు. త. కోరిక, కామము

వలపుకత్తె } దే. కామముగలది, కాముకి
వలపుకత్తియ

వలపుకాఁడు. దే. కామనుగలవాఁడు, కాముకుఁడు

వలపుకీలు. త. పోఁకముడి, నీవి

వలపుమోపరి. దే. వాయువు, గంధవహుఁడు

వలపురాయఁడు. త. మన్మథుఁడు

వలపురుగు. దే. తేలు

వలభి. స. కొణిగ, చంద్రశాల

వలమానము. స. తిరుగుచున్నది, చలించుచున్నది

వలము. దే. విస్తారము, స్థౌల్యము, స్థూలము

వలమురి. దే. దక్షిణావర్తశంఖము

వలమురితాలుపు. దే. విష్ణువు, శంఖపాణి

వలయము. స. కడియము, కుండలాకారము, కంఠమాల

వలయితము. స. చుట్టఁబడినది

వలయు. దే. ఇష్టమగు, ఆవశ్యకమగు, యుక్తమగు, విహితమగు, కోరు, ప్రేమించు

వలయు. త. వలయితమగు

వలరాచేపని. దే గ్రామ్యధర్మము

వలరాజు / వలరాయఁడు / వలఱేఁడు } త. మన్మథుఁడు

వలరాజుసూడు. దే. శివుఁడు

వలవంత. దే. మన్మథవ్యథ, దుఃఖము

వలవని / వల్వని } దే. అక్కఱలేని, కొలమాలిన, అమితమైన

వలవల. దే. ఏడ్చుటయందగు ధ్వన్యనుకరణము

వలవలన. దే. వదిలినది, వదులైనది

వలస. త. రాజోపద్రవాదులచే దేశము విడిచి పరదేశమునకుఁ బోవుట

వలసతీయు / వలసపోవు } దే. రాజోపద్రవాదులచేత దేశమువిడిచి పరదేశమునకుఁ బోవు

వలాహకము. స. మేఘము, కృష్ణునిరథ్యములలో నొకటి, పర్వతము

వలాహకుఁడు. స. రాక్షసుఁడు

వలి. దే. శైత్యము, కంపము, శీతము, గొప్ప

వలి. స. కడుపుమీఁదిముడుత, ముడుత

వలికి. దే. సారసపక్షి

వలిగొను. దే. చలిగొను, వణఁకు

వలిచేలు. దే. పెండేలు

వలితము. స. చుట్టఁబడినది, చలనమునొందినది

వలితిప్ప. దే. హిమాలయపర్వతము

వలిదము. దే. వస్త్రవిశేషము

వలినుఁడు. స. వలులు గలవాఁడు

వలపని. దే. శైత్యోపచారము

వలిపము. దే. మఱుఁగువస్త్రము, సన్నని తెల్లవస్త్రము, పరిశుద్ధమైనది, తెల్లనైనది

వలిపిరి. దే. చలి, వడఁకు

వలిపిరిగొట్టు. దే. వడఁకువాఁడు

వలిభము. స. ఆఁడుదానికోక కుచ్చెళ్లు

వలిభుఁడు. స. వలులుగలవాఁడు

వలిమల. దే. మంచుగొండ, శీతనగము

వలిమిడి. దే. పశురోగవిశేషము

వలిమొలక. దే. భీముఁడు, ఆంజనేయుఁడు

వలియు. దే. సన్నగిలు, డయ్యు

వలివెలుఁగు / వలివెల్గు } దే. చంద్రుఁడు, హిమాంశువు

వలీకము. స. ఇంటిచూరు, నీవ్రము

వలీముఖము. స. వానరము, తఱులమోరమెకము

వలుఁద. దే. స్థూలము, వలము

వలుకు. దే. తగవు, పలుకు

వలువ / వలువము / వల్వ } దే. సన్నవస్త్రము, వస్త్రము

వలువు. దే. వలువ

వలె. దే. వలయును, ఉపమావాచకము

వలెవాటు. దే. వల్లెవాటు

వల్కము. స. చెట్టుపట్ట, నార, లవంగపుఁబట్ట, తునియ

వల్గ. స. కళ్లెమునకుఁ దగిలించెడు పగ్గము, నాగ, వాగె

వల్గనము / వల్గితము } స. అశ్వధారావిశేషము

వల్గించు. స. గుఱ్ఱము పరుగెత్తు

వల్గువు. స. మేఁకపోతు, కనుఱెప్పమీఁది వెండ్రుక, చెక్కనివి

వల్చు. దే. వలచు, వాసనగొట్టు

వల్ద. దే. వలుఁద

వల్పము. దే. వలిపము

వల్పు. దే. వలపు

వల్మీకపాదుఁడు. స. పుట్టకాలివాఁడు

వల్మీకము / వల్మికము } స. పుట్ట

వల్మీకశింబి. స. పుట్టశమ్మచెట్టు

వల్ల. దే. వలన, అనుకూలము

వల్లకాడు. దే. శ్మశానము

వల్లకి. స. వీణ

వల్లడి. దే. అకారణమైనయాపద, కొల్ల

వల్లడికాఁడు. దే. అకారణముగ ఆపద చేయువాఁడు, కొల్లపెట్టువాఁడు

వల్లభ. స. ప్రియురాలు

వల్లభము. స. మేలిజాతిగుఱ్ఱము, ప్రియము

వల్లభుఁడు. స. ప్రియుఁడు, అధిపతి, మగండు

వల్లము. దే. వరపాలజోలె, సంచి

వల్లరసి. దే. ఒకానొకచెట్టు

వల్లరి. స. చిగిరించినలేఁతకొమ్మ, పూగుత్తి తీఁగ

వల్లవి. స. గొల్లది

వల్లవుఁడు. స. గొల్లవాఁడు, వంటవాఁడు, భీముఁడు

వల్లి. స. తీఁగ

వల్లించు. దే. వల్లెవేయు, కంఠపాఠము చేయు

వల్లిక. స. తీఁగ

వల్లిగము. దే. బొక్కెనమీఁది యినుపవలయము

వల్లియ. దే. వల్లెత్రాడు

వల్లిసూరణము. స. పుల్లబచ్చలి

వల్లుపము. దే. వరపాలజోలె

వల్లూరము. స. కఱవాడు, పందినంజుఁడు, ఎండినమాంసము

వల్లె. దే. పశుబంధనరజ్జువు, వరుణునిపాశము, కంఠపాఠముచేయుట, అంగీకారార్థకము, సమ్మతి

వల్లెతాలుపు / వల్లెతాల్పు } దే. వరుణుఁడు

వల్లెత్రాడు. దే. ఎద్దునుబట్టుకొనుటకు కొమ్ములకుఁ దగిలించు త్రాడు

వల్లెవాటు. దే. వల్లెయొక్క వాటువంటి వాటు, వల్లెవాటుగా మెలిపెట్టి వైచుకొన్న యుత్తరీయము

వల్లెవేయు. దే. వల్లించు

వల్వ / వల్వము } దే. వలువ

వశ. స. ఆఁడేనుఁగు, గొడ్డుటావు, ఆవు. కూఁతురు, పెండ్లాము, ఆఁడుది, లోఁకువైనది

వశంవదుఁడు. స. లోఁకువయగునట్లు మాటలాడువాఁడు, విధేయుఁడు

వశక్రియ. స. వశముచేసికొనెడు మంత్రతంత్రాదికర్మము

వశగ. స. లోఁబడియుండుభార్య

వశము. స. లోఁకువ, ఇచ్ఛ, ప్రభుత్వము, లోఁకువైనది

వశవర్తి. స. విధేయుఁడు

వశి. స. లోఁకువైనవాఁడు, ఇంద్రియనిగ్రహముగలవాఁడు

వశికము. స. శూన్యము

వశిత్వము. స. స్వతంత్రవృత్తి, ఇంద్రియనిగ్రహత్వము

వశిరము / వసిరము } స. ఇందుప్పు, ఉత్తరేణుమొక్క, గజపిప్పలి

వశీకరణము. స. మందుమాఁకులచేత లోఁకువగాఁ జేయుట, స్వాధీనము చేసికొనుట

వశీకరించు. స. మందుమాఁకులచేత లోఁకువగాఁ జేయు

వశ్యము. స. మందుమాఁకుల చేత లోఁకు వైనది, అనుకూలము, లోఁబఱచుకొనఁ బడినది
వశ్యుఁడు. స. అనుకూలుఁడైనవాఁడు, విధేయుఁడు
వశ్యురాలు. స. విధేయురాలు
వశ్యౌషధము. స. పెట్టుమందు
వషట్కృతము. స. అగ్నియందు వేల్వఁబడినది
వస. త. ఒకమందుదినుసు
వస. స. కడుపులో బొడ్డుక్రింద నుండెడి యుల్లిపొరవంటి క్రొవ్వు, వప
వసంతగంధము. స. తుంగ
వసంతఘోషి. స. కోవెల
వసంతద్రుమము. స. మామిడిచెట్టు
వసంతము. దే. పసుపుసున్నమును కలిపిన ఎఱ్ఱనీళ్లు
వసంతము. స. ఒకఋతువు, ఒకానొక రాగము
వసతి. దే. సౌఖ్యము, సౌఖ్యకరము
వసతి. స. ఇల్లు, ఉనికి, రేయి, బుద్ధాలయము, వృత్తి, భరణము
వసథము. స. నివసించుచోటు, పక్షిగూఁడు
వసనము. స. ఉనికి, వస్త్రము
వసనాభి. త. విషవిశేషము, వత్సనాభి
వసపడు } దే. శక్యమగు
వసపోవు }
వసమరు. దే. నిర్వేదించు, వాడిపోవు, అలయు
వసము. త. స్వాధీనత, అధీనము, శక్యము
వసల } దే. కొయ్యకు అదుకు వేసెడు
వసలా } కొయ్య
వసాయము. స. కొవ్వుతో నిండినది
వసార } దే. పంచపాది
వసారా }
వసి. దే. మిక్కిలి
వసి. త. కొనచెక్కిన కొయ్య, మీఁదు మొనగా నాటిన మేకు, ముల్లు
వసి. స. ఉనికి
వసించు. స. వాసముచేయు, ఉండు
వసిగొను. దే. పూను, ఉత్సహించు
వసితాఁకు. దే. గొప్పదెబ్బ
వసిమాలు. దే. మిక్కిలి చెడిపోవు
వసిలిపోవు. దే. తొలఁగు
వసివాఁడు. దే. మిక్కిలివాడు
వసివాఱు. దే. మిక్కిలిపాఱు
వసివాళ్లు. దే. మిక్కిలి వాడుటలు
వసుంధర. స. భూమి
వసుకము. స. చేవుటుప్పు, జిల్లేడుచెట్టు
వసుగర్భ. స. భూమి, పైఁడిచూలాలు
వసుదేవుఁడు. స. కృష్ణునితండ్రి
వసుధ } స. భూమి
వసుమతి }
వసులపాంతఱ. దే. ఒకదినుసుపందెపుపుంజే
వసులు. దే. తొలఁగు, అపసరిల్లు
వసువు. స. బంగారు, రత్నము, ధనము, పలుపు, కిరణము, అగ్ని, ఒకరాజు, గణదేవతావిశేషము, మధురము
వస్తము. స. ఇల్లు
వస్తి. స. బద్దె, పొత్తికడుపు
వస్తువు. స. పదార్థము, బండము, దినుసు, పరమాత్మ
వస్త్యము. స. ఇల్లు
వస్త్రపూతము. స. నడపోయఁ బడినది
వస్త్రభేదకుఁడు. స. చోకాలు మొదలైనవి కుట్టువాఁడు

వస్త్రము. స. వలువ, బట్ట
వస్నము. స. వస్త్రము, ధనము, కూలి, వెల
వస్నస. స. సన్నపునరము
వస్నికుఁడు. స. కూలివాఁడు
వహనము. స. వహించుట, ఓడ
వహము. స. ఎద్దుమూఁపురము, వాహనము
వహి. దే. లెక్కపుస్తకము, పుస్తకము, విధము
వహి. స. వహించువాఁడు
వహించు. స. తాల్చు
వహిత్రము. స. తెప్ప, పడవ
వహేలనము. స. తిరస్కారము, తెగడిక
వహ్ని. స. అగ్ని, చిత్రమూలము, జీర్ణశక్తి, జీడిమొక్క
వహ్నిశిఖము. స. కుంకుమపువ్వు
వహ్నిసంజ్ఞికము. స. చిత్రమూలము
వహ్యము. స. పల్లకీ
వళక్షము. స. తెలుపు, తెల్లనిది
వళవు. దే ఉపాయము, మర్మము, జోడ, తంత్రము
వళాగ్రము. దే. క్రముకభేదము
వళావళి. దే. కుతూహలము, విజృంభణము, అడావడి
వళావళికాఁడు. దే. వ్యర్థభాషణుఁడు
వళావళికాయ. దే. కుతూహలముతోనుండు వాఁడు
వళాసము. దే. సంచి
వళి. స. కడుపుమీఁది ముడుత, ముడుత, యత్యక్షరము
వళిరుఁడు } స. మెల్లకంటివాఁడు
వళీరుఁడు }
వఱపు. దే. తగవు, మిథ్యాభియోగము, గణము
వఱలు. దే. సరుకులు

# వా

వా. త. నోరు, ఖడ్గధార, కత్తిమొదలగు వాని వాదర
వాంచు. త. వంచు
వాంఛ. స. కోరిక
వాంఛించు. స. కోరు
వాంఛితము. స. కోరఁబడినది
వాంతము. స. వాంతిచేయఁబడినది, వెడలఁగ్రక్కఁబడినది
వాంతాదము. స. కుక్క
వాంతి. స. వమనము, వెడలఁగ్రక్కుట
వాంతికృత్తు. స. వాంతిగలుగఁజేయుమందు
వాంశికుఁడు. స. పిల్లంగ్రోవియూఁదువాఁడు
వాఁక. దే. వైపు
వాఁక. త. ఏఱు, వంకర
వాఁకతాలుపు. దే. శివుఁడు
వాఁకుడు. త. క్రంటకారికవృక్షము
వాఁగరత } త. సముద్రతీరప్రదేశము
వాఁగర్త }
వాఁగడుపు. దే. వాఁపుగలకడుపు
వాఁగు. త. వదరు, మ్రోఁగు, సెలయేఱు, సైన్యము
వాఁగుడు. త. వదరుట, ధ్వని
వాఁగులు. త. అలలు
వాఁచు. త పేఁకరు, ఊఁదు, జాడ్యాదులచే శరీరములావగు, ఉబ్బు
వాఁడి. దే. పదను, శౌర్యము, పదనైనది, తీక్ష్ణము, క్రూరము
వాఁడిమగఁడు. దే. శూరుఁడు
వాఁడిమి. దే. తేజము, ప్రతాపము, పదను, శౌర్యము
వాఁడు. దే. అపురుషుఁడు

వాఁత. త. తెవులుఁగొంటులయిన పశ్వాదులకు వేసెడు చూఁడు
వాఁపి. త. వాఁపురోగముగలవాఁడు
వాఁపిరి. దే. వీఁకరుట, వీఁకట
వాఁపిరిగొట్టు. దే. వాఁపిరివాఁడు, వీఁకరువాఁడు
వాఁపు. త. ఊఁదు, శోఫ, వీఁకట
వాకట్టు. దే. వాగ్బంధనక్రియ, వాగ్బంధనముచేయునది, నోరు తెఱవకుండ చేయుంట
వాకము. దే. వాటము, ప్రక్క, అనుకూలము
వాకాటు. దే. వాగ్వాదము
వాకిలి. దే. గృహద్వారము, తలుపు
వాకు. స. పలుకు, వచనము, పలుకుఁజెలి
వాకొను. దే. మాటాడు, అఱచే
వాకొలుపు. దే. వాకొనఁజేయు
వాక్కు. స. వాకు, మాట
వాక్కేళి. స. సరససల్లాపము
వాక్పతి. స. బ్రహ్మ, బృహస్పతి, కవీశ్వరుఁడు, మిక్కిలి చతురముగ మాటలాడువాఁడు
వాక్యము. స. కర్తృకర్మక్రియాసంబంధముగల పదసముదాయము, మాట
వాక్రుచ్చు. దే. పేరుచెప్పు, చెప్పు
వాగ. స. కళ్లెమునకు తగిలించెడు పగ్గము
వాగరుఁడు.స.ముని, పండితుఁడు, శూరుఁడు
వాగలి. దే. ముచ్చివాఁడు, చిత్తరువు వ్రాసెడు తూలిక
వాగఱా. దే. చెఱువుకు నీళ్లువచ్చుకాలువ
వగళము / వాగళ్లము } త. కళ్లమునకు ముందు భాగము

వాగాయిత్తము. త. వాగ్వివాదము
వాగీశుఁడు. స. బ్రహ్మ, బృహస్పతి, కవీశ్వరుఁడు, మిక్కిలి చతురముగ మాటాడువాఁడు
వాగుజి. స. కారుగచ్చచెట్టు
వాగుర. స. మృగములను పక్షులను పట్టెడి వల, ఉరి
వాగురికుఁడు. స. వలలు పన్ని మృగములను పక్షులను పట్టెడు వేటకాఁడు
వాగె / వాగియ } త. కళ్లెమునకు తగిలించెడు పగ్గము
వాగ్గులికుఁడు. స. అడపకాఁడు
వాగ్దత్తము. స. వాగ్దానము, ఆడిననుడి
వాగ్మి. స. చిలుక, బృహస్పతి, యుక్తియుక్తముగా మాటలాడువాఁడు
వాఙ్ముఖము. స. వాక్యారంభము, ఉపన్యాసము
వాఙ్మూలము. స. వాగ్రూపముగా సాక్షులు మొదలగువారు చెప్పునది
వాచ. స. వాక్కు
వాచంయముఁడు. స. మౌని
వాచకము. స. వాచ్యార్థమును తెలిపెడు శబ్దము, చదువుట, చదివెడుధాటి
వాచకుఁడు. స. మాటలాడువాఁడు, చదువువాఁడు
వాచనికము. స. మాటలతోఁ జెప్పఁబడినది
వాచస్పతి. స. బృహస్పతి
వాచాటుఁడు / వాచాలుఁడు } స. వదరుఁబోతు
వాచాడంబరుఁడు. స. అనగత్యమగు విశేషపుమాటలను మాటాడువాఁడు
వాచాదరిద్రుఁడు. స. కొద్దిగా మాటాడువాఁడు

వాచించు. స. చెప్పు, చేదువు
వాచికము. స. సమాచారము
వాచ్యము. స. చెప్పఁదగినది, నిందింపఁ దగినది, అభిధచేఁ దెలియఁదగిన యర్థము
వాచేరము. దే. పరిదేవనము
వాచేఱచు. దే. మొఱపెట్టు, రోదనము చేయు
వాచోరపము. దే. వాచోరుట, పరిదేవనము
వాచోరు. దే. పరిదేవనము చేయు
వాచోరు. దే. ఇంటిముంజూరు
వాజపేయము. స యాగవిశేషము
వాజము. స. నెయ్యి,నీళ్లు, హవిస్సు, వేగము, ఱెక్క, బాణము ఱెక్క
వాజి. స. గుఱ్ఱము, పక్షి, బాణము
వాజిగంధి. స. పెన్నేరు
వాజిదంతకము. స. అడ్డసరపుచెట్టు
వాజినము. స. బలము, శౌర్యము
వాజీకరణము. స. పుంస్త్వమును గలుగఁజేయుట, పుంస్త్వమును గలుగఁజేయు మందు
వాజె. దే. రోఁత, రోఁతగలది
వాజేము. దే. పక్షివిశేషము
వాటపడు. దే. అనుకూలమగు
వాటము. దే. జాఱుపుగా నుండునది, అనుకూలమైనది, పొందికయైనది, ఓర
వాటము. స. కూరలోనగువాని తోఁట, త్రోవ, చెట్టువెలుగు వేసిన చోటు, వెలుగు, ఇండ్లవరుస
వాటి. స. కూరలోనగువాని తోఁట, ప్రదేశము
వాటిక. స. తోఁట, ఇండ్లవరుస, స్థలము
వాటు. దే వ్రైచేట, దెబ్బ
వాటుఁగాలు. దే. నడచునపుడు ప్రక్కవాటుగాపోయెడు కాలు
వాటురాయి. దే. దొంగలువ్రైచుటకు అనువుగా ఏఱితీసికొనిపోయెడు ఱాయి
వాటులాడు. దే. కొట్లాడు
వాట్యాలకము. స. చిట్టాముదపుచెట్టు, ముత్తవపులగపుచెట్టు
వాట్లీఁడు. దే. కొట్లాడువాఁడు
వాడ. దే. తావి
వాడ. త. వీధి, ఇండ్లవరుస
వాడఁబాఱు. దే. వాడు
వాడకట్టు. దే. వాడ, వాటిక, వీధి
వాడగన్నేరు. దే. పచ్చగన్నేరుచెట్టు
వాడగాలి. దే. మలయమారుతము
వాడపడిసె. త. వేశ్య, కులట
వాడిక. దే. చెప్పక చూపక యుంచిన భూమిలోనినిధి, ఉపనిధి
వాడు. దే. మ్లానమగు, వాడుట, పనిపఱచుకొను
వాడుక. దే. ఉపయోగము, అభ్యాసము, వ్యవహారము
వాడుకపడు. దే. పనుపడు, అలవడు
వాడుకొను. దే. జనులు ప్రవాదముగా చెప్పుకొను, ఉపయోగపఱుచుకొను
వాడుచు. దే. వాడఁజేయు, వాడించు
వాడుదల. దే. వాడుక, అభ్యాసము, వాడిపోవుట
వాడుదెంచు } దే. వాడుపాఱు
వాడుపడు
వాడుముట్లు. దే. గృహోపకరణములు
వాడెదవ. దే. చెఱకుచివర
వాడ్చు. దే. వాడఁజేయు
వాణి. స. పలుకు, పలుకుఁజెలి, నేఁత

వాణిజుఁడు. స. వర్తకుఁడు
వాణిజ్యము. స. వణిగ్వ్యాపారము
వాణిని. స. ఆటకత్తె, కుంటెనకత్తె, మదించినయాఁడుది, కుట్రగల యాఁడుది, త్రాగుబోతు స్త్రీ, కాముకురాలు, వేశ్య
వాతకము. స. సోమిదపుచెట్టు
వాతకి. స. సోమిదపుచెట్టు, వాతరోగము గలవాఁడు
వాతకుంభము. స. ఏనుఁగు నొసటిబుడిపి, పిన్ననుదురు
వాతగామి. స. పక్షి
వాతఘ్నీ. స. పులుగుడుచెట్టు
వాతపోథము. స. మోదుగుచెట్టు
వాతప్రమి. స. వాతమృగము
వాతము. స. వాత పిత్త శ్లేష్మములలో నొకటి, వాతరోగము, వాయువు
వాతమృగము. స. గాలికెదురు నడచెడి యిఱ్ఱివంటిమృగము
వాతరట్టు. దే. వదరుఁబోతు
వాతవాఁడి. దే. అప్రియంవదుఁడు
వాతాయనము. స. కిటికీ
వాతాయువు. స. జింక, వాతమృగము
వాతారి. స. వాలుఁడుచెట్టు
వాతాశి. స. పాము
వాతికాసు. త. లంచేము
వాతిబియ్యము. దే. దహనము చేయునపుడు బంధువులు పీనుఁగునోట వేసెడు బియ్యము
వాతులము } స. గాలి, సుడిగాలి, వెఱ్ఱెత్తినది
వాతూలము }
వాతులాలయము. స. వెఱ్ఱివాండ్ర నుంచే గృహము.
వాతెఱ. దే. పెదవి
వాత్య. స. సుడిగాలి
వాత్సకము. స. దూడలసమూహము
వాత్సల్యము. స. వత్సలభావము, పుత్త్రాదులయందుఁ గల స్నేహము
వాదడుచు. దే. వాదాడు, వాదించు
వాదనము. స. వీణాదిచతుర్విధవాద్యధ్వని
వాదము. స. వాగ్వివాదము, రసవాదము, తగవు
వాదర. త. ఖడ్గాదులపదను, తీక్ష్ణధార
వాదాడు. దే. వాదించు
వాది. స. తగవునకుఁబోయినవాఁడు, వాదించువాఁడు
వాదించు. స. వాదాడు, తగవాడు
వాదిత్రము. స. వాద్యచతుష్టయము, వాద్యధ్వని
వాదు. త. వాదము, వీణాదివాదనము, కలహము
వాదులాఁడు. దే. వాదాడువాఁడు
వాపోడు. దే. మాటకుసహాయము, రోగముగల పశువులకు మందుపోయుటకై నోటఁ జొప్పించు వెదురుగొట్టము
వాద్దెము. త. వాద్యము
వాద్యము. స. మృదంగాదివాద్యము
వాన. దే. వర్షము, వర్షాకాలము
వానకాళ్లు. దే. వర్షధారలు
వానకోయిల. దే. చాతకపక్షి, సర్పవిశేషము
వానజాలిపులుఁగు. దే. హంస
వానతఱి. దే. వర్షాకాలము
వాననెచ్చెలి. దే. వానకోయిల
వానపాము } దే. ఎఱ్ఱ, మహీలత
వానపేగు }
వానప్రస్థము. స. ఒక ఆశ్రమము, ఇప్పచెట్టు

వానప్రస్థుఁడు } స. వనమందుండెడి యా
వానప్రస్థ } శ్రమముగలవాఁడు
వానము. స. కట్టుపని, చాఁప, వాసన, సారంగము, ఎండినకాయ, అడవిది
వానరము. స. కోఁతి
వానర్గాయి. దే. పడగల్లు
వానస్పత్యము. స. పూచికాచెడుచెట్టు
వానాయుజము. స. వనాయుదేశమునందుఁ బుట్టినగుఱ్ఱము
వాని దే. వాఁడి
వానించు. దే. కుండలు చేయించు, ఇటికలు కోయించు
వానీఁడు. దే. వానెకులమువాఁడు, కుబేరుఁడు
వానీరము. స. ప్రబ్బచెట్టు, ఒకదినుసుపేముచెట్టు
వాను. దే. కుండలుచేయు
వానె. త. వైశ్యకులవిశేషము
వానెత. త. వానెకులమునాఁడుది, హీనకులము కోమటిది
వానేయము. స. కైపడిముస్తె
వాపము. స. గొఱుగుట, విత్తుట, నేయుట
వాపి. స. నడబావి, దీర్ఘిక, కోనేరు
వాపితము. స. గొఱుగఁబడినది, విత్తఁబడినది
వాపు. త. వాయింపు
వాపుచ్చు. దే. నోఱుతెఱచు, చెప్పు
వాపోక. దే. అఱచుట, ఏడ్చుట
వాపోవు. దే. అఱచు, ఏడ్చు
వాప్యము. స. చెంగల్వకోష్టు
వామ. స. ఉత్తమస్త్రీ, సుందరమైనస్త్రీ
వామకము. స. విరుద్ధమైనది
వామకరము. స. ఎడమచేయి
వామదేవుఁడు. స. శివుఁడు
వామనగాయ. దే. లేఁతచింతకాయ, ఊరుఁగాయకు పనికివచ్చు ఒకదినుసుకాయ
వామనగుంటలు. దే. బాలికాక్రీడావిశేషము
వామనగొమ్ము. దే. వామనగాయ ముక్క
వామనపాతుకాఁడు. దే. పక్షివిశేషము
వామనము. స. దక్షిణపుదిక్కునందలి ఏనుఁగు, పొట్టిది
వామనములు. దే. వామనగాయలు
వామనావతారము. స. విష్ణువు యొక్క అయిదవ యవతారము
వామనిక } స. పొట్టియాఁడుది
వామని }
వామనీకృతము. స. పొట్టిగాఁ జేయఁబడినది
వామనుఁడు. స. విష్ణువు, పొట్టివాఁడు
వామము. స. ధనము, ఆవుపొదుఁగు, సవ్యము, సుందరము, వక్రము, హ్రస్వము, ప్రతికూలము, ఎడమది
వామలూరము } స. పుట్ట
వామలూరువు }
వామలోచన. స. చక్కని కన్నులుగల ఆఁడుది, స్త్రీ
వామాన్యకరము. స. కుడిచేయి
వామి. దే. ప్రోగు, రాశి
వామి. స. ఆఁడుగుఱ్ఱము, ఆఁడుగాడిద, ఆఁడునక్క
వాము. దే. చేతులతో కుప్పచేసి యెత్తు, జేవురు
వాయ. త. కొండ సందిచ్చిననేల, దంచుటకై ఱోటిలో నొకతూరిపోసెడు ధాన్యాదులు
వాయకుఁడు. స. నేఁతగాఁడు
వాయదండము. స. సాలెవాఁడు నేత సరి తట్టెడు పలక

వాయనము. స. వ్రతాదులయందు ఉపాయనముగా నిచ్చెడు పిండివంట
వాయనీయము. స. వాయుసంబంధమగునది
వాయము. దే. వ్యర్థము
వాయము. స. నేయుట, కుట్టుట
వాయవ్యము. స. వాయుసంబంధమైనది, పశ్చిమోత్తరదిక్కుల నడిమిమూల
వాయసము. స. కాకి, అగరుమ్రాను
వాయసారాతి. స. గుడ్లగూబ
వాయసి. స. కాఁచిచెట్టు
వాయసోలి. స. కాఱుకొల్లిచెట్టు
వాయి. త. నోరు, ముఖము, ఖడ్గధార, వాయువు
వాయించు. త. వాదనముచేయు
వాయింట. దే. ఒకవిధమగుకూరాకు, బర్బర యనుమొక్క
వాయింపు. త. వాయించుట, వీణాదివాదనము
వాయిదము. త. వాద్యము
వాయిదార. త. వంకలుగలకత్తి
వాయివిళంగము. త. విడంగము, క్రిమిఘ్నము
వాయుపథము. స. ఆకాశము
వాయుపుత్త్రుఁడు. స. హనుమంతుఁడు, భీముఁడు
వాయువు. స. గాలి, వాతరోగము
వాయువేగి. స. వాయువువలె వేగముగాఁ బోవు కుక్క
వాయుసఖుఁడు. స. అగ్ని
వాయోడు. దే. మాటపీఱికియగు
వార. దే. ఎనిమిదిపుంజెములనూలు, లెక్కల యందలి ఎచ్చుతక్కువలు
వారఁబట్టు. దే. ఆపోశించు, చేతిలోఁ నీళ్లు పోయఁగా త్రాగు, ఇంకించు
వారక. దే. ఎడతెగక, ఎల్లప్పుడు, బెదరక
వారకము. దే. లేనికాలమునందు వృద్ధ్యాదులు లేక యుపయోగార్థ మొకరికిచ్చి కలిగినకాలమందు మరలఁబుచ్చుకొనెడు ధనాదికము
వారకము. స. గుఱ్ఱపునడ, వారించునది
వారకాంత. స. వేశ్య, లంజ
వారడ. దే. తాటాకువారిన చివ్వ
వారడి. దే. నష్టి, లోపము, భేదము
వారడు. త. పోలించు
వారణ. స. చెలియలికట్ట
వారణబుస, వారణవృష. స. అరఁటిచెట్టు
వారణము. స. వారించుట, ఏనుఁగు, ఆటంకపఱచుట, ఆటంకము, రక్షించుట, కవచము
వారణాసి. స. కాశి
వారధి. దే. వంతెన
వారము. దే. వారువము
వారము. స. మద్యపాత్రము, సూర్యాదివాసరము, తడవ, సమూహము, వాకిలి, క్షణము, ఏడుదినములకాలము, ఆచ్ఛాదనము, మంచ, కాలము, వంతు, అనేకసారులు, తరుణము, నదియొక్క ఆవలిదరి, జలసంఘము
వారముఖ్య. స. సౌభాగ్యతనుబట్టి జనులచేత సత్కరింపఁబడిన వేశ్య
వారయాత్రికుఁడు. స. పెండ్లిచుట్టము
వారవాణము. స. కవచము
వారస్త్రీ. స. వేశ్య
వారాన్నిధి. స. సముద్రము
వారాశి, వారిరాశి. స. సముద్రము, నీటితిప్ప

వారాహి. స. ఒకమాతృక, అడవి యేనుఁడు పంది, పాఁచితీఁగ, నేలతాడిచెట్టు
వారి. స. నీళ్లు, కురువేరు, సరస్వతి, కుండ, ఏనుఁగును బట్టెడి గొయ్యి
వారించు. స. అడ్డగించు, నివారించు
వారిజము. స. తామర, ఉప్పు, శంఖము
వారిజేమము. త. పారిభద్రవృక్షము
వారిణ. దే. చిన్నచేఁపలను బట్టెడు సాధన విశేషము
వారితస్కరుఁడు. స. మేఘుఁడు, సూర్యుఁడు
వారిదము. త. పారిభద్రవృక్షము
వారిదము. స. మేఘము, ముస్త
వారిధి, వారినిధి. స. సముద్రము
వారిపర్ణి. స. నాఁచు
వారిరథము. స. పడవ, తెప్ప
వారివాహము. స. మబ్బు
వారు. దే రెండుచేతులతో తాటాకు ఓర చిప్ప
వారు. త. ఉడుగు, వడియు, గంజివారు
వారుకొను. దే. పిడికిళ్లాదిగా ఎత్తికొను, పొందు, చెందు
వారుచు, వార్చు. దే. ఆచమించు, ప్రతీక్షించు
వారుచు, వార్చు. త. వారఁ జేయు
వారుణి. స. పడమటిదిక్కు, సారాయి, శతభిషఙ్నక్షత్రము, ఒకదినుసు గఱిక
వారుపు. దే. వార్పు
వారువపుజన్నము. దే. అశ్వమేధయాగము
వారువము. దే. గుఱ్ఱము
వార్ణికుఁడు. స. వ్రాఁతగాఁడు

వార్త. స. వృత్తాంతము, వర్తనము, జీవనోపాయము, అర్థానర్థవివేచనవిద్య, వార్తాకము, సంభాషణము
వార్తకాఁడు. దే. మాటకారి
వార్తకెక్కు. దే. ప్రసిద్ధిని పొందు
వార్తము. స. పొల్లు, ఆరోగ్యము, జీవనోపాయముగలది, రోగము తీఱినది
వార్తలాడు. దే. సంభాషించు
వార్తాకము. స. వంగమొక్క
వార్తాకి. స. ములకమొక్క
వార్తాపత్రిక. స. వృత్తాంతములను ప్రకటనచేయు కాగితము
వార్తావహుఁడు. స. కావడి మోసెడువాఁడు, వృత్తాంతమును తెలిసికొనిపోయి చెప్పువాఁడు
వార్తికము. స. అర్థములను స్పష్టపఱచెడు గ్రంథము, పక్షివిశేషము, వ్యాఖ్యాన గ్రంథము
వార్తికుఁడు. స. ధ్రాత
వార్ధకము. స. వృద్ధత్వము, వృద్ధిసమూహము
వార్ధక్యము. స. ముసలితనము
వార్ధి. స. వారిధి
వార్ధుషికుఁడు. స. వడ్డికిచ్చి జీవనముచేయువాఁడు
వార్పు. దే. ఆచమనము
వార్పు. త. గంజివార్చుట
వార్మణము. స. కవచముల సమూహము
వార్యుపజీవి. స. నీళ్లుమోసి జీవించువాఁడు
వార్వపుటగ్గి. దే. బడబాగ్ని
వార్వము. దే. వారువము
వార్షికము. స. వానకాలమునఁ బుట్టినది, సంవత్సరకాల పరిమితి గలది, సంవత్సరమున కొకతూరి పండితుల కీయఁబడు ధనాదికము, కలుక్రాంతవృక్షము

వాఱంటువిల్లు. దే. తాళ్లపనివారి వాఱు కట్టిన పెద్ద వింటికోల

వాఱు. దే. సన్నగాఁ గోసినతోలు

వాఱెన. దే. నొగతో కాఁడిని చేర్చికట్టెడు వాఱు లోనగునది, ఏఁడికోలతో కాఁడిని జేర్చికట్టెడు వాఱులోనగునది

వాఱెనపీఁట. దే. ఏఁడికోలను కాఁడికిని నడుమ చేరికగా నుండెడు కొయ్య

వాలకము. దే. మోసము, వేషము

వాలకము. స. ఉంగరము, సూడిగము

వాలధి. స. ఏనుఁగు గుఱ్ఱము లోనగువాని తోఁక

వాలపాశ్య. స. జెడబిళ్ల

వాలము. త. బెబ్బులి

వాలము. స. తోఁక, తలవెండ్రుక, కత్తి

వాలయించు, వాలాయించు } దే. నిర్బంధించు

వాలఱుగుడు. దే. వాలిఁడికోఁతి

వాలహస్తము. స. వెండ్రుకలుగల తోఁక, వెండ్రుకల సమూహము

వాలాయము. దే. నిర్బంధము,అనివార్యము, నిరంతరము, అవశ్యము

వాలారు. దే. వాఁడియైనది

వాలార్చు. దే. కత్తిని ఝళిపించు

వాలిఁడి. దే. తోఁకలేనికోఁతి, తోఁకలేనిది

వాలిక. దే. దీర్ఘము, వాఁడియైనది

వాలిక. స. అంగిటిగుంట

వాలు. దే. అతిశయించు, క్రిందికి దిగు, ఒఱుగు, వంగు, వ్రాలు, అతిక్రమించు

వాలు. త. కత్తి, దైర్ఘ్యము, వాఁడిమి, దీర్ఘము, వాఁడి, క్రూరము

వాలుఁగంటి. దే. దీర్ఘములైనకన్నులుగల యాఁడుది, స్త్రీ, విశాలాక్షి

వాలుక. స. ఇసుక

వాలుకము. స. నూఁగుదోస, ఇసుకతోఁ జేయఁబడినది

వాలుకొంగ. దే. వక్కుకొంగ

వాలుగ. దే. మత్స్యవిశేషము

వాలుగకంటి. దే. వాలుగవంటి కన్నులుగల యాఁడుది, స్త్రీ

వాలుగటెంకి. దే. మత్స్యవిశేషము

వాలుగడాలు. దే. మన్మథుఁడు

వాలుగడుపు, వాల్గడుపు } దే. బొజ్జ

వాలుగపాము. దే. మత్స్యవిశేషము

వాలుచు, వాల్చు } దే. వాలఁజేయు, వంచు

వాలుచేకక్క. దే. శుక్రుఁడు

వాలుఁడు. దే. వాతారివృక్షము, వ్రేలాడుచున్నది

వాలుపు, వాల్పు } దే. వాల్చుట

వాలుప్రొద్దు. దే. లేఁబ్రొద్దు,అపరాహ్ణము

వాలుమగఁడు. దే. శూరుఁడు

వాలుమెకము. త. అడవిపంది

వాలువ. దే. వాలుగ

వాలూరు. దే. అలస్యమగు

వాలెము. దే. వాలాయము

వాల్కము. స. చెట్టుపట్టతోఁ జేయఁబడినది

వాల్కలము. స. నారచీర

వాల్గంటి. దే. వాలుఁగంటి

వాల్మీకి. స. సంస్కృత రామాయణమును రచించిన మహర్షి

వాల్లభ్యము. స. ఆధిపత్యము, దొరతనము, జనరంజకత్వము, దయ, ప్రీతి, చొరవ, విశ్వాసము, బలము, భక్త్యతిశయము

వావదూకుఁడు. స. యుక్తియుక్తముగమాట లాడువాఁడు, వాగ్మి, వక్త

వావాదు. త. ఉపన్యాసము, వాఙ్ముఖము

వావి. దే. బంధుత్వము, బంధువరుస

వావింట. దే. వాయింటమొక్క

వావిక. దే. కుత్తుక మొదటఁగల గుంట

వావిరి. దే. క్రమము, అనుగతి, అధికము, ఉత్కర్షము, ఉత్కృష్టము

వావిలి. దే. శేఫాలివృక్షము

వావురము. దే. గుఱ్ఱము

వావృత్తము. స. వరింపఁ బడినది

వాశకము. స. అడ్డసరపుచెట్టు

వాశి. స. బాడిస

వాశిత. స. ఆఁడేనుఁగు, స్త్రీ

వాశితము. స. మృగపక్షిధ్వని, వాసనకట్టఁ బడినది

వాస. దే. ఇంటికి మీఁద పఱపెడువాసము

వాసంతము. స ఒంటె, కోయిల, తెమ్మెర, ఉంచఁబడినది, వసంతసంబంధమైనది

వాసంతి. స. అడివిమొల్లచెట్టు, పువ్వుల గురివెందచెట్టు

వాసంతిక. స. వసంతోత్సవము

వాసకము. స. ఇల్లు, అడ్డసరపుచెట్టు

వాసకసజ్జిక. స. నాయికావిశేషము, ఇల్లు

వాసగృహము. స. పడికిల్లు, భోగగృహము, ఇల్లు

వాసన. స. గంధము, ప్రత్యాశ, అనుభవింపఁబడినదాని స్మరణ

వాసనకోడుపు. దే. పెద్దయూఁదువత్తి

వాసనము. స. వాసనకట్టుట, వస్త్రము, వసనసంబంధమైనది

వాసపర్యయము. స. నివాసమును మార్చుట

వాసపోఁయు. దే. వాసాలుపఱచు, పెందె కట్టు

వాసము. దే. ఇంటికి మీఁదపఱచెడుపట్టె

వాసము / వాసస్సు } స. వస్త్రము, ఇల్లు, అడ్డసరపుచెట్టు, నివాసము

వాసయోగము. స. గంధపొడి, చూర్ణము

వాసరము. స. దినము, ప్రొద్దు

వాసరా. దే. చెల్లుగా ఇచ్చినది

వాసవుఁడు. స. ఇంద్రుఁడు

వాసి. దే. తారతమ్యము, భేదము, ఆధిక్యము, లాభము, ప్రసిద్ధి, పరిమితి, ఉత్కృష్టము, స్వస్థము, బాగు

వాసి. స. బాడిస, వాశి, కాఁపురముండు వాఁడు

వాసించు. స. వసించు, వాసనకట్టు

వాసికెక్కు. దే. ప్రసిద్ధికెక్కు

వాసిగ. దే. చక్కఁగా

వాసిచేయు. దే. కుదుర్చు, స్వస్థముచేయు

వాసిత. స. ఆఁడేనుఁగు, స్త్రీ

వాసితనము. దే. యుక్తము, అర్హత

వాసితము. స. మృగపక్షులధ్వని, వాసనకట్టినది, వాసెనకట్టినది, పరిమళించెడివస్తువు

వాసుకి. స. ఒకసర్పరాజు

వాసుదేవుఁడు. స. వసుదేవుని కొడుకు, కృష్ణుఁడు

వాసువు. స. నాట్యపరిభాషయందు బాలిక

వాసె / వాసియ / వాసెగ్రోలు } దే. పిల్లంగ్రోవి

వాసె. త. ఆవిరి పోకుండ ఎసటికుండ మూఁతిమూసికట్టినగుడ్డ, గుడ్డమూఁత, నొప్పిపోవుటకై తలకు చుట్టిన గుడ్డ
వాసెనకట్టు. దే. వాసెనగుడ్డకట్టువంటికట్టు
వాసెనకుడుము. దే ఇడ్డెనయనుపిండివంట
వాస్తవము. స. యథార్థము
వాస్తవికము. స. యథార్థమైనది
వాస్తవ్యము. స. వసింపఁ దగినది
వాస్తవ్యుఁడు. స. గృహస్థుఁడు
వాస్తువు. స. ఇండ్లుమొదలైనవి యేర్పఱుపఁదగినభూమి, ఇల్లు, వాస్తుశాస్త్రము
వాస్తోష్పతి. స. ఇంద్రుఁడు
వాస్త్రము. స. వస్త్రముచేతఁ గప్పఁబడినది, వస్త్రసంబంధమైనది, వస్త్రముతోఁ జేయఁబడినది
వాహకుఁడు. స. మోయువాఁడు, పీనుఁగును మోయువాఁడు
వాహద్విషము. స. ఎనుపోతు
వాహనము. స. ఎక్కఁదగినగుఱ్ఱము లోనగునది, పల్లకి
వాహము. స. గుఱ్ఱము, ఎద్దు, వాయువు
వాహసము. స. పెనుఁబాము, తూముకాలువ
వాహితము. స. వహింపఁబడినది
వాహిత్థము. స. ఏనుఁగు కుంభస్థలమునకు క్రిందిచోటు
వాహిని. త. వాగ్ధోరణి
వాహిని. స. నది, సేన
వాహినీపతి. స. సేనానాయకుఁడు, సముద్రుఁడు
వాహ్యము. స. వాహనము, వహింపఁదగినది
వాహ్యాళి. స. స్వారి, విహారము
వాళి. దే. పశువులు పోవుదారి, వాడుక

# వి

వింగడము. త. విస్తీర్ణము, సుందరము, విపరీతము, వింత, వేఱు
వింగడించు. త. వేఱుపఱచు, విభజించు
వింజామర } దే. తెల్లనిచామరము
వింజామరము }
వింజిలి. దే. మత్స్యవిశేషము
వింజె. దే. విస్మయము
వింజెము. త. వింధ్యపర్వతము
వింట. దే. వినుట
వింటాలము. దే. మల్లబంధవిశేషము
వింటికోల. దే. ఱాళ్లపనివానియొక్క ధనురాకారమైన సాధనవిశేషము
వింటిపట్టు దే. అమ్ముపేటునేల, ధన్వంతరము
వింటిరాసి. దే. ధనూరాసి
వింటివాఁడు. దే. విలుకాఁడు
వింత. దే. ఆశ్చర్యము, అపూర్వకము, అన్యము
వింతరాలు. దే. అన్యురాలు
వింతవాఁడు. దే. అన్యుఁడు
విందు. దే. చుట్టములు లోనగువారికి పెట్టెడుభోజనము, ఆతిథ్యము, అతిథి, చుట్టము
విందుపురుగు. దే. ఒకదినుసుసాలెపురుగు
విందువు. స. తెలియువాఁడు
వింధ్య. స. ఒకానొకతీఁగె
వింధ్యము. స. పర్వతవిశేషము
వింధ్యుఁడు. స. బోయవాఁడు
వింశతి. స. ఇరువది
వింశము. స. ఇరువదవది
వికంకతము. స. పుల్లవెలఁగచెట్టు

వికచము. స. కేతుగ్రహము, వికసించినది, వెండ్రుకలులేనిది

వికచీకృతము. స. వికసింపఁజేయఁబడినది

వికటకవి. స. వికటముగా మాటలాడు వాఁడు, హాస్యకరుఁడు

వికటము. స. మిక్కిలివంకరైనది, విరివియైనది, విరుద్ధరూపము, అనారోగ్యము, అక్రమము

వికటించు. స. వంకరయగు, ఎదురుతిరుగు, గిట్టకపోవు

వికత్థనము. స. స్తోత్రము, బడాయికొట్టుట

వికరము. స. రోగము

వికర్తనుఁడు. స. సూర్యుఁడు

వికర్మికుఁడు. స. అంగడిపారుపత్తెకాఁడు

వికలము. స. విచ్ఛేదము నొందినది, అంగహీనము, కలవరము

వికలాంగుఁడు. స. కురూపి, అంగహీనుఁడు

వికలుఁడు. స. కలవరము పొందినవాఁడు

వికల్పము. స. భ్రాంతి, మాఱుదల, అవాంతరకల్పము, సందేహము, అనిశ్చయము, అనుమానము, యుక్తి, విధము, పొరపాటు

వికవిక / వికావిక } దే. నవ్వుటయందగు ధ్వన్యనుకరణము

వికసనము. స. వికాసము, తెలివి

వికసించు. స. వికాసము పొందు, విరియు

వికసితము. స. వికసించినది

వికసుఁడు. స. చంద్రుఁడు

వికస్వరము. స. వికసించునది

వికారము.స. మనస్సుయొక్కగాని రూపము యొక్కగాని మాఱుపాటు, రోగము

వికారి. స. ఒకసంవత్సరము, వికారముగలది

వికారించు. దే. వికారముపెట్టు, గిట్టకపోవు

వికాలము. స. సాయంకాలము

వికాలిక. స. నిండినప్పుడు మునిఁగి కాలము తెలియఁజేయు రంధ్రములుగల యొక రాగిపాత్రము

వికావికలు. దే. చెల్లాచెదరు

వికాసము. స. వికసనము, తెలివి

వికాసి. స. వికాసముకలది

వికాసితము. స. వికసించినది

వికిరము. స. గజకుంభస్థలమధ్యము, పక్షి, ఖండము, నూయి, తద్దినమునందు భోక్తలు భుజించినపిమ్మట విస్తరకు ముందఱవేసెడు అన్నము

వికీరణము. స. వెదచల్లుట, జిల్లేడుచెట్టు

వికీర్ణము. స. వెదచల్లఁబడినది, చెదరినది

వికుర్వాణుఁడు. స. సంతోషము నొందిన మనస్సుకలవాఁడు

వికృతము. స. వికారమునొందినది, రోగము గలది, రోఁతయైనది

వికృతి. స. వికారము, ఒకసంవత్సరము, వికారము నొందినది

విక్కము. స. ఇరువదియేండ్ల వయస్సుగల ఏనుఁగు

విక్కవిరియు. దే. మిక్కిలి విరియు

విక్కు. దే గర్వించు, విజృంభించు, నిక్కు

విక్రమ. స. ఒకసంవత్సరము

విక్రమము.స.అధికబలము, శౌర్యము, ఆక్రమణము, సాహసము, పాదవిక్షేపము

విక్రమించు. స. శౌర్యము చూపు

విక్రముఁడు. స. విష్ణువు, విక్రమార్కరాజు

విక్రయము. స. అమ్మకము
విక్రయి } స. అమ్మెడువాఁడు
విక్రయికుఁడు
విక్రయించు. స. విక్రయముచేయు, అమ్ము
విక్రాంతి. స. విక్రమము, అశ్వగతి
విక్రాంతుఁడు. స. విక్రమించినవాఁడు
విక్రాయకుఁడు స. అమ్మువాఁడు
విక్రియ. స. వికారము, మార్పు, ఉద్రేకము, కోపము
విక్రీడము. స. ఆటచోటు, ఆట, ఆడుకొను వస్తువు
విక్రీడితము. స. మిక్కిలి ఆడఁబడినది
విక్రీతము. స. విక్రయింపఁ బడినది
విక్రేత. స. విక్రయించువాఁడు
విక్రేయము. స. విక్రయింపఁ దగినది
విక్లబము. స. భయపడినది, పిఱికియైనది, కలవరమునొందినది, దుఃఖమునొందినది
విక్లబుఁడు. స. భయశోకాతులచేత చేతులు కాళ్లు విలవిలపోవువాఁడు
విక్షతము. స. గాయము
విక్షావము. స. దగ్గు, తుమ్ము
విక్షిప్తము. స. ఎగురవేయఁబడినది, విసరివేయఁ బడినది
విక్షేపము. స. ఎగురవేయుట, విసరివేయుట, కదలిక
విక్షేపించు. స. ఎగురవేయు, విసరివేయు
విక్షోభము. స. వ్యాకులత
విఖ్యాతము. స. విఖ్యాతిఁ జెందినది
విఖ్యాతి. స. మిక్కిలి ప్రసిద్ధి
విఖ్యుఁడు } స. ముక్కు పోయినవాఁడు, ముక్కిఁడి
విఖ్రుఁడు
విగడియ. త. గడియలో అఱువదవభాగము
విగతము. స. బొత్తిగా పోయినది, వెలుఁగు లేనిది, పతితుఁడగు, అదృశ్యమైనది
విగతార్తవ. స. ముట్టుడిగినస్త్రీ
విగణనము. స. లెక్కించుట, చెల్లించుట, ఇచ్చుట
విగదము. స. ఆరోగ్యమైనది
విగమము. స. నాశము, విభజనము
విగళనము. స. మిక్కిలి జాఱుట
విగళితము. స. మిక్కిలి జాఱినది
విగాఢము. స. మునిఁగినది, లోఁతైనది, అతిశయమైనది
విగాహము } స. మునుఁగుట
విగాహనము
విగాహించు. స. మునుఁగు, త్రుంకు
విగాహితము. స. మునిఁగినది
విగుణము. స. విభిన్నగుణముగలది
విగుర్వించు. దే. చక్కఁగా నిలుచు
విగ్రహము. స. శరీరము, విభాగము, విస్తారము, యుద్ధము, షడ్గుణములలో నొకటి, బొమ్మ
విగ్రహించు. స. కలహించు
విగ్రుఁడు. స. ముక్కుపోయినవాఁడు
విఘటిక. స. ఎగడియ
విఘసము. స. దేవతాతిథులభుక్తశేషము
విఘాతము. స. అడ్డంకి, పెద్దదెబ్బ, చెఱుపు
విఘాతించు. స. చెఱుచు, చంపు
విఘూర్ణనము. స. గిరగిరతిరుగుట
విఘృష్టి. స. చేలిమిడి
విఘ్నపడు. దే. అడ్డిపడు
విఘ్నము. స. అడ్డి, అంతరాయము
విఘ్నరాజు. స. విఘ్నేశ్వరుఁడు

విఘ్నేశ్వరుఁడు. స. వినాయకుఁడు
విచక్షణ. స. చక్కఁగా నాలోచించుట
విచక్షణము. స. దూరదృష్టిగలది, వివేకము గలది, నేర్పుగలది
విచక్షణుఁడు. స. చదువరి, నేర్పరి
విచయనము. స. వెదుకుట
విచరితము. స. సంచారము
విచర్చిక. స. గజ్జి
విచారకుఁడు. స. నిజమును కనుగొనువాఁడు, పరీక్షకుఁడు, న్యాయాధికారి
విచారణ / విచారణము } స. ప్రమాణములచేత విషయమునుపరిశీలించుట, చర్చ
విచారణీయము. స. విచారణ చేయఁదగినది
విచారపడు. దే. సంతాపించు
విచారము. స. ఆలోచనము, సంతాపము, విచారణము, నిశ్చయము, సందేహము, తెలివి
విచారించు. స. ఆలోచించు, సంతాపించు
విచారితము. స. విచారింపఁ బడినది
విచార్యము. స. విచారింపఁ దగినది
విచికిత్స. స. సంశయము, పొరపాటు
విచికిలము. స. మల్లెమొక్క, దవనము
విచిత్రము. స. ఆశ్చర్యము, ఆశ్చర్యకరము, చిత్రవర్ణము, చిత్రవర్ణము కలది
విచేతనము. స. ప్రాణములేనిది, తెలివి తప్పినది
విచేష్ట / విచేష్టితము } స. ప్రయత్నము
విచేష్టించు. స. మిక్కిలి చేష్టించు
విచ్చేయు. దే. వచ్చు, పోవు, కూర్చుండు
విచ్చె. దే. నూలుకండె, నూలిచేట్ట
విచ్చలవిడి. దే. స్వాతంత్ర్యము, యథేచ్ఛము
విచ్చవిచ్చలు. దే. యథాయథలు
విచ్చాయ. త. రత్నదోషవిశేషము
విచ్చు. దే. విరియు, విరియఁజేయు, చీలు, విప్పు
విచ్చుకత్తి. దే. ఒఱదూసినకత్తి
విచ్చుటాకు. దే. చెవ్వాకు
విచ్చుమొగ్గ. దే. విరియుమొగ్గ, చెల్లాచెదరైనది, చెల్లాచెదరు చేయునది
విచ్ఛాయము. స. రత్నదోషవిశేషము, చాయపోయినది
విచ్ఛిత్తి. స. ఎడఁబాటు, నాశము, పూఁత, నఱకుడు, స్త్రీలయొక్క శృంగారచేష్టా విశేషము
విచ్ఛిన్నము. స. ఎడఁబడినది, పూయఁబడినది, నఱకఁ బడినది, వంకరైనది
విచ్ఛురితము. స. కప్పఁ బడినది, పూయఁ బడినది
విచ్ఛేదము. స. ఎడఁబాటు, నఱకుడు
విజననము. స. పుట్టుక, కనుట
విజనము. స. జనులులేనిది, ఏకాంతము
విజయ. స. జయతిథి, పార్వతి, పార్వతి యొక్క చెలికత్తె, ఒక సంవత్సరము, దినముయొక్క ఆఱవభాగము
విజయంచేయు. దే. వచ్చు, పోవు
విజయచ్ఛందము. స. ఏనూఱు పేటలు గల హారము
విజయదశమి. స. ఆయుధములు లోనగు వానిని పూజించెడు ఆశ్వయుజమాసము శుక్లపక్షమునందలి పదవతిథి
విజయము. స. మిక్కిలి గెలుపు, దినము యొక్క ఆఱవభాగము
విజయముచేయు. దే. వచ్చు, పోవు
విజయస్తంభము. స. జయించి వేసిన స్తంభము

విజయి. స. విజయముగలవాఁడు, జయించినవాఁడు
విజయుఁడు. స. అర్జునుఁడు, విష్ణునిద్వారపాలకులలో నొకఁడు
విజాతి. స. విభిన్నజాతి, విశేషజాతి
విజాతీయము. స. విజాతిసంబంధమైనది
విజిగీష. స. మిక్కిలి జయింప నిచ్ఛ
విజిగీషువు. స. మిక్కిలి జయింపనిచ్ఛగలవాఁడు
విజితుఁడు. స. జయింపఁబడినవాఁడు
విజిలము. స. మీఁగడగట్టినది, పిచ్ఛిలము
విజృంభణము. స. మిక్కిలిజృంభణము, ఆవులించు, వికసించుట, కనఁబఱచుట, వేడుక
విజృంభించు. స. చెలరేఁగు, వికసించు
విజృంభితము. స. వికసించినది,ఆవులించినది
విజ్ఞప్తము, విజ్ఞాపితము } స. విన్నవింపఁ బడినది
విజ్ఞప్తి. స. విజ్ఞాపనము, విన్నపము
విజ్ఞాతము. స. తెలిసికొనఁబడినది, ప్రసిద్ధమైనది
విజ్ఞాతుఁడు. స. ప్రసిద్ధుఁడు
విజ్ఞానము. స. శాస్త్రాదులయందలి జ్ఞానము, విశేషజ్ఞానము, కార్యము
విజ్ఞానుఁడు. స. విశేషజ్ఞానముకలవాఁడు
విజ్ఞాపనము. స. విన్నపము
విజ్ఞాపించు. స. విజ్ఞాపనముచేయు, విన్నవించు
విజ్ఞుఁడు. స. నేర్పరి
విజ్జు. దే. వ్యాపించు
విజ్జువిజ్జు. దే. నలిసలి
విజ్జోడు. దే. జోడుగానిది, సరికానిది
విజ్జోడుపడు. దే. భేదపడు
విటంకము. స. కొణిగయందలిగువ్వగూఁడు, నీచము
విటంకితము. స. గుఱుతువేయఁబడినది
విటకత్తె. దే. విటి
విటకాఁడు. దే. విటుఁడు
విటకటము, విటతాటము, విటతాటనము } దే. తాఱుమాఱు
విటపము. స. చిగిరించినకొమ్మ,కొమ్మచిగుఱు
విటపి. స. చెట్టు, మఱ్ఱిచెట్టు
విటపుఁడు. స. విటరాయఁడు
విటపురుషుఁడు. స. జారపురుషుఁడు
విటరాయఁడు. త. విటశ్రేష్ఠుఁడు
విటలవణము. స. మందునకు పనికివచ్చు నొకయుప్పు
విటి. స. విటకత్తె
విటుఁడు. స. విటకాఁడు, పల్లవుఁడు
విటుకులాఁడి. దే. విటురాలు
విట్ఖదిరము. స. తుమ్మచెట్టు
విట్చరము. స. ఊరఁబంది
విట్సారిక. స. పీతిగోరువంక
విట్టు. స. విష్ఠ, మలము
విడంగము. స. వాయువిళంగము, వంటయుప్పు, నేర్పరి
విడంబన, విడంబనము } స. అనుకరించుట, మోసపుచ్చుట
విడంబించు. స. అనుకరించు, మోసపుచ్చు
విడంబితుఁడు. స. పీడితుఁడు
విడఁద్రొక్కు, విడనాడు } దే. విడుచు
విడవలి. దే. ఇండ్లకు కప్పెడుతృణవిశేషము
విడాకు. దే. ఒంటిగానుండుటకు, భార్యాపరిత్యాగపత్త్రిక
విడారకము. స. పిల్లి

విడి. దే. అరుణకాంతి, ప్రతాపము, క్రోధము, పరాక్రమము, ప్రత్తికాయలోని జేడ, అరుణము, ప్రత్యేకమైనది, విడువఁదగినది, పనినుండి విడిచినది, ఒంటరి

విడిగోలు. దే. మాఱుపు, పనిలేనిది

విడిచివాటుగుదియ. దే. భిండివాలమను నాయుధము

విడిదల. దే. విడియుచోటు, విడిచినచోటు

విడిది. దే. విడియుంట, విడిసినచోటు, దిగుబస

విడిదిచేయు. దే. బసదిగు

విడిపట్టు. దే. విడిదిచోటు

విడిపించుకొను. దే. విదిలించుకొను, తప్పించుకొను

విడిపోవు. దే. వీడు

విడిమట్టు. దే. వాసస్థానము, కాఁపురము, విడిది

విడిముడి. దే. ధనము

విడిమేను. దే. దిసమొల

విడియము } త. తాంబూలము
విడెము }

విడియు. దే. ప్రయాణమైపోవువారు దారిలో నొకచోటదిగు, వీడు, జాఱు

విడిరైయెదువ. దే. లంజె

విడివడు. దే. వీడు, జాఱు, తెగనుండివేఱుపడు, నిర్బంధమునుండి తొలఁగు

విడివాటుబడియ. దే. విడిచివాటుగుదియ

విడివేఁట. దే. డేగవేఁట

విడివోవు. దే. వదలు, విడివడు

విడీనము. స. పక్షిగతభేదము

విడు. దే. వీఁడు, విడుచు

విడుగడ } దే. విడుపు, విడుదల, విమోచనము
విడుగర }

విడుగు. దే. వికసించు

విడుచు. దే. విడఁజేయు. విమోచనము చేయు

విడుత. దే. తడవ

విడుదల. దే. విడుగడ

విడుపరి. దే. పరిత్యాగశీలుఁడు, త్యాగశీలుఁడు

విడుపు. దే. విమోచనము, విసర్జనము, దానము

విడుమర. దే. విడుదల, నివృత్తి

విడువడు. దే. విడివడు

విదూరము. స. వైదూర్యమణి పుట్టెడు దేశము

విడ్చు. దే. విడుచు

విడ్డూరము. త. మౌర్ఖ్యము, మూర్ఖము

విడ్పు. దే. విడుపు

విడ్యము. త. విడియము

విడ్వరము. స. ఉపద్రవము

విత. త. వ్యర్థము

వితండ. స. స్వపక్షపాతముగ వాదించెడు వాదము, పనికిమాలినవాదము

వితండము. స. తలుపునకు వేసెడు తాళము, ఏనుఁగు

వితంతువు. స. విధవ

వితంత్రి. స. తీఁగలుచెడిన వీణ

వితంసము. స. మృగములను పక్షులను బట్టెడు ఉరిత్రాడు

విततము. స. విరివిచేయఁబడినది

వితతి. స. విరివి, సమూహము

వితథము. స. అసత్యమైనమాట

వితమరి. దే. కార్యదక్షుఁడు

వితము. త. విధము

వితరణము. స. విడుపు, ఈవి

వితరణి. స. దాత

వితర్కము. స. ఊహ, సంశయము

వితర్కించు. స. ఊహించు, సంశయించు

వితర్ది
వితర్దిక } స. అరుగు

వితలము. స. ద్వితీయాధోలోకము

వితస్త. స. పాంచాలదేశమందలి యొకనది

వితస్తి. స. జేన

వితా. త. వ్యర్థము

వితాకు. దే. నిశ్చేష్టత, పారవశ్యము, పరాకు, నిశ్చేష్టితుఁడు, నిశ్చేష్టితురాలు, పరవశుఁడు

వితాకుఁడు. దే. నిశ్చేష్టితుఁడు

వితాకుపడు. దే. నిశ్చేష్టితుఁడగు

వితానము. స. మేలుకట్టు, విరివి, సమూహము, అవసరము, మందము, శూన్యము, యజ్ఞము

వితావిత. త. మిక్కిలి వ్యర్థము

వితీర్ణము. స. దాఁటఁబడినది, ఈయఁబడినది

వితీర్ణి. స. వితరణము, ఈవి

వితున్నకము. స. కొతిమిరి, మయిలుతుత్తము, నేలయుసిరికచెట్టు

వితున్నము. స. నీరుచెంచలిమొక్క

విత్త. స. మిక్కిలి చిన్నగోనె, సంచి

విత్తజాని. స. పెండ్లాడినవాఁడు

విత్తనము. దే. విత్తు, బీజము

విత్తము. స. ధనము, తెలియఁబడినది, పొందఁబడినది, ప్రసిద్ధి నొందినది

విత్తి. స. తెలివి, జ్ఞానము, తలఁపు, లాభము

విత్తు. దే. విత్తనములుచల్లు, విత్తనము

విదగ్ధుఁడు. స. నేర్పరి, చోరవకాఁడు

విదరము. స. చీల్చుట, బొమ్మజెముడు

విదర్భ. స. ఒకపట్టణము

విదర్భము. స. ఒకదేశము

విదళనము. స. మిక్కిలి ఖండించుట, మిక్కిలి భేదించుట

విదళము. స. కందులు మొదలగువాని పప్పు, పగిలినది

విదళించు. స. మిక్కిలి ఖండించు, మిక్కిలి భేదించు

విదళితము. స. మిక్కిలి ఖండింపఁబడినది, మిక్కిలి భేదింపఁబడినది

విదారకము. స. చెలమ, పిల్లనూయి, చీల్చునది

విదారణము. స. చీల్చుట, చంపుట, యుద్ధము

విదారి. స. తెల్లనేలగుమ్మడిచెట్టు

విదారించు. స. చీల్చు

విదారిగంధ. స. ముయ్యాకుపొన్నచెట్టు

విదారితము. స. బ్రద్దలు చేయఁబడినది

విదాహము. స. మిక్కిలి దప్పిక, కాలుట

విదిక్కు. స. రెండుదిక్కులనడుము, మూల

విదితము. స. తెలియఁబడినది, అంగీకరింపఁబడినది

విదితుఁడు. స. తెలియఁబడినవాఁడు, ప్రసిద్ధుఁడు

విదియ. త. పక్షమందు రెండవతిథి

విదిలింపులు. దే. చీవాట్లు

విదీర్ణము. స. చీల్పఁబడినది

విదుఁడు. స. పండితుఁడు, తెలిసినవాఁడు

విదురము. స. తెలివిగలది

విదురు. దే. విదులు

విదురుఁడు. స. ధృతరాష్ట్రుని తమ్ముఁడు, తెలిసినవాఁడు

విదురుచు
విదుర్చు } దే. విదురఁజేయు, విదిలించు

విదురుపు
విదుర్పు } దే. విదురుచుట

విదులము } స. ప్రబ్బచెట్టు
విధులము }
విదులు. దే. రాలు
విదులుచేు } దే. విదులఁజేయు
విదుల్చు }
విదులుపు } దే. విదులుచేట
విదుల్పు }
విదువు. స. ఏనుఁగుకుంభస్థలమధ్యము
విదుషి. స. విద్వాంసురాలు
విదూరము. స. వైడూర్యమణిపుట్టెడు దేశ విశేషము
విదూషకుఁడు. స. శృంగారనాయక సచివులలోనొకఁడు, పరులనుదూఱువాఁడు, హాస్యగాఁడు
విదూషణము. స. చెడఁగొట్టుట, నింద
విదూషితము. స. ముఱికిగలది, వికారమైనది
విదేశము. స. అన్య దేశము
విదేశి } స. అన్య దేశస్థుఁడు
విదేశీయుఁడు }
విదేహము. స. దేశవిశేషము, దేహములేనిది
విద్దె. త. విద్య, చదువు, విద్దియ
విద్దెము } త. బాలక్రీడావిశేషము, శిశువులులేచి నిలువ నేర్చుట
విద్దియము }
విద్య. స. చదువు, జ్ఞానము
విద్యమానము. స. ఉనికి, వర్తమానము
విద్యాకరుఁడు. స. పండితుఁడు
విద్యాకోశగృహము. స. పుస్తకములుంచు గృహము
విద్యాధరుఁడు. స. దేవయోనివిశేషము
విద్యామందిరము. స. పాఠశాల
విద్యార్థి. స. చేదువు కోరువాఁడు, చేదువు వాఁడు [వరి
విద్యావంతుఁడు. స. విద్యగలవాఁడు, చేదు
విద్యుత్తు. స. మెఱపు, సంధ్య, మెఱుఁగు లేనిది
విద్యోతము. స. ప్రకాశము
విద్యోతించు. స. ప్రకాశించు
విద్రధి. స. కడుపులోనిబల్ల
విద్రవము. స. యుద్ధమువలనఁ బాఱిపోవుట, నింద, కాఱుట, బుద్ధి
విద్రాణము. స. మేలుకొలుపఁ బడినది
విద్రావణము. స. పాఱిపోవునట్లుచేయుట, నీరుగా కరఁగించుట
విద్రావము. స. యుద్ధమువలనఁ బాఱుట
విద్రావితుఁడు. స. యుద్ధమువలనఁ బాఱిపోయినవాఁడు
విద్రుచు. దే. విదురుచు
విద్రుతము. స. కరఁగఁబడినది
విద్రుమము. స. పగడము, పగడపుఁజెట్టు, చిగురు
విద్రుమలత. స. గువ్వగుత్తికచెట్టు
విద్వాంసుఁడు. స. చేదువరి, ఎఱుకగలవాఁడు
విద్విషుఁడు. స. శత్రువు
విద్వేషణము } స. విరోధము
విద్వేషము }
విద్వేషణి. స. కోపముగలయాఁడుది
విద్వేషణుఁడు. స. విరోధి
విద్వేషి. స. విరోధి
విద్వేషించు. స. విరోధించు
విద్వేష్ట. స. విరోధి
విధ. స. సమృద్ధి, విధము [కబళము
విధము. స. ప్రకారము, విధి, జీతము, గజ
విధవ. స. పెనిమిటిలేనిది
విధవనము. స. కదుపుట, కంపము
విధాత } స. బ్రహ్మ, మన్మథుఁడు
విధాతృఁడు }
విధానకము. స. బాధ

విధానము. స. చేయుట, ఆజ్ఞ, పూజ, గజకబళము, ఉపాయము, ధనము, సృష్టి, విధము, లాభము, భాగ్యము, బాధ

విధాయకము. స. చేయవలసినది, ఏర్పాటు చేయునది

విధాయకుఁడు / విధాయి } స. విధించు వాఁడు, కావలసినవాఁడు

విధి. స. బ్రహ్మ, చేయుట, కాలము, భాగ్యము, ఏర్పాటు, పని, విధము, ఆధారము, ఆజ్ఞ, నిబంధనము. మతవిషయకమగు కర్మ, ప్రవర్తన, స్థితి, ఏర్పాటు, సృష్టికర్త, దురదృష్టము [బలిమి

విధికరుఁడు. స. భృత్యుఁడు

విధిత్స. స. చేయనిచ్ఛ [బడినది

విధిదృష్టము. స. శాస్త్రమందు నిర్ణయింపఁ

విధియోగము.స. దురదృష్టముయొక్క బలిమి

విధివియోగము స. భాగ్యముయొక్క యెడబాటు, అదృష్టహీనత

విధించు. స. ఏర్పాటుచేయు, ఆజ్ఞాపించు

విధుంతుదుఁడు స. రాహువు [బడినది

విధుతము. స. కదలింపఁబడినది, విడువఁ

విధుర. స. చక్కెరకలిపిన పెరుఁగు

విధురము. స. ఎడఁబాటు, వైకల్యము, ఎడఁబాటునొందినది

విధురుఁడు. స. భార్యచచ్చినవాఁడు

విధువనము. స. కదలించుట

విధువు. స. చంద్రుఁడు, విష్ణువు

విధూతము.స.కదలింపఁబడినది,విడువఁబడినది

విధూతి / విధూననము } స. కదలించుట

విధేయజ్ఞుఁడు. స. తనవిధాయకకృత్యమును ఎఱుఁగువాఁడు

విధేయుఁడు. స. వినయముగలవాఁడు

విద్ధకర్ణి. స. చిఱుబొద్దిచెట్టు

విద్ధకర్ణుఁడు. స కుట్టఁబడినచెవులు గలవాఁడు

విద్ధము. స. తొలువఁబడినది, త్రోయఁబడినది, బాధింపఁబడినది

విధ్యుక్తము. స. యథావిధియైనది

విధ్వంసము.స.మిక్కిలి ధ్వంసము, నాశనము

వినత. స. గరుత్మంతునితల్లి, వంపుపెట్టె, వంకరైనది, వంగినది, గురుశిక్షితమైనది

వినతి. స. వినయము, నమస్కారము

వినతుఁడు. స. నమ్రుఁడు, వంగినవాఁడు

విననివాఁడు. దే. చెవిటివాఁడు, బధిరుఁడు

వినమితము. స. మిక్కిలి వంగినది

వినమ్రము స తగరము, మిక్కిలి వంగినది

వినయము. స. వినమ్రత, గురుశిక్ష

వినాడి / వినాడిక } స. విగడియ

వినాభావము. స. వేఱు

వినాయకుఁడు. స. విఘ్నేశ్వరుఁడు, బుద్ధదేవుఁడు, గరుత్మంతుఁడు, గురువు

వినాశము స. మిక్కిలినాశము

వినిందించు. స. మిక్కిలి నిందించు

వినికి. దే. వినుట, ఆకర్ణనము, ప్రసిద్ధి

వినికిడి. దే. వినికి

వినిద్రాణము. స. హెచ్చరికతో నున్నది

వినిపించు. దే. వినునట్లుచేయు, చదివి తెలియఁ జేయు, వినవచ్చు

వినిమయము. స. వస్తువులమాఱుపు, కుదువ

వినియుక్తము. స. వినియోగింపఁ బడినది
వినియోగము. స. ఉపయోగము, ఏర్పాటు
వినియోగించు. స. ఉపయోగపఱచు
వినిర్గతము. స. బయలువెడలినది
వినిర్ముక్తము. స. విడువఁ బడినది
వినివర్తనము. స. ఇంటికి మరలుట
వినివారణము. స. నివారణము, అడ్డంకి
వినివేదితము. స. నైవేద్యము చేయఁబడినది
వినిశ్వాసము స. ఉట్టూరుపు
వినిష్క్రాంతము. స. బయలు వెడలినది
వినిష్ఠ్యూతము. స. వినిర్గతమైనది, ఉమ్మి వేయఁ బడినది
వినీతము. స. చక్కఁగా మోసెడి గుఱ్ఱము
వినీతుఁడు. స. వర్తకుఁడు, జితేంద్రియుఁడు, వినయముగలవాఁడు, గురువుచేతశిక్షింప బడినవాఁడు, గురువుచేత శిక్షింపఁబడని [వాఁడు
వినీలము. స. నల్లనిది
విను. దే. ఆకర్ణించు, ఆకాశము
వినుకలి. దే. వినికి, ఆకర్ణనము
వినుకలికంటి. దే. పాము, చక్షుశ్శ్రవము
వినుకెంపు. దే. సూర్యుఁడు, ద్యుమణి
వినుచు. దే. వినవచ్చు, వినఁజేయు, వినిపించు, వినఁబడు
వినుచూలి } దే. వాయువు
విన్నుచూలి
వినుద్రిమ్మరి. దే. ఖచరుఁడు, ఆకాశమున [తిరుగువాఁడు
వినుప్రోలు. దే. స్వర్గము
వినుమ్రాను. దే, కల్పవృక్షము
వినువలను } దే. స్వర్గము
విన్వలను
వినువాఁక. దే. గంగ, స్వర్ణది
వినుసిగదేవర. దే. శివుఁడు
వినూతనము } స. క్రొత్తది
వినూత్నము
వినోదము. స. క్రీడాదులచేత ప్రొద్దుపుచ్చుట, వేడుక, క్రీడ [క్రీడించు
వినోదించు. స. క్రీడాదులచేత ప్రొద్దుపుచ్చు,
వినోది. స. ఉల్లాసము గలవాఁడు
విన్కలి. దే. వినుకలి
విన్కి. దే. వినికి
విన్న. త. వివర్ణమైనది, భిన్నమైనది
విన్నఁదనము. త. ఖిన్నత
విన్నఁబడు. త. వివర్ణమగు, చిన్నపోవు
విన్నఁబాటు. త. విన్నఁబడుట, వైవర్ణ్యము
విన్నఁబోవు. దే. వివర్ణమగు
విన్నన. త. వైవర్ణ్యము, ఖిన్నత, న్యూనత
విన్ననువు. త. నేర్పు, విధము
విన్నపత్త్రిక. దే. విజ్ఞాపనపత్త్రిక
విన్నపము. త. మనవి, విజ్ఞాపనము
విన్నపము. స. పొందఁ బడినది, తెలియఁ బడినది, విచారింపఁబడినది
విన్నము. స. ఎఱుఁగఁ బడినది, పొందఁబడినది, ఉంచఁబడినది
విన్నవించు. త. మనవిచేయు, విజ్ఞాపించు
విన్నాణము. త. నేర్పు, మల్లబంధము, ఒప్పిదము, ఒప్పిదమైనది
విన్నాణి. త సన్న్యాసి, నేర్పరి
విన్ను. దే. ఆకాశము
విన్యసించు. స. ఉంచు
విన్యస్తము. స. ఉంచఁ బడినది, న్యస్తము

విన్యాసము. స. ఉంచుట, న్యాసము, రచన

విపంచి
విపంచిక } స. వీణ, క్రీడ

విపక్వము. స. పరిపక్వముకానిది, చక్కఁగా పక్వమైనది, ఉడికినది

విపక్షుఁడు. స. శత్రువు, పక్షములేనివాఁడు

విపణము. స. అమ్మకము

విపణి. స. అంగడి, అంగడివీథి, అంగడియందుండు అమ్ముడుసరకు, వర్తకుఁడు

విపతి. స. విధవ

విపత్తి. స. విపత్తు, యాతన

విపత్తు. స. ఆపద, ఇడుమ

విపథము. స. చెడుత్రోవ

విపన్నము. స. పాము, విపత్తు నొందినది

విపరీత. స. విరుద్ధముగుభార్య, వ్యతిరేక స్వభావము గలస్త్రీ

విపరీతము. స. వ్యత్యస్తము

విపర్యయము. స. వ్యత్యాసము

విపర్యస్తము. స. విపర్యాసము నొందినది

విపర్యాసము. స విపర్యయము

విపశ్చితుఁడు. స. పండితుఁడు

విపాకము. స. పాకము, దుష్పాకము, పరిపాకము, పాకముచెడినది, పరిణామము, భాగ్యము

విపాటనము. స బద్దలుచేయుట

విపాదిక. స. పాదస్ఫోటము, కుష్ఠవిశేషము

విపాశ. స. నదీవిశేషము, విడిచిపోయిన పాశములు గలది

విపినము. స. అడవి

విపుంసి. స. మగవానివంటి యాఁడుది

విపుల. స. నేల, విరివియైనది

విప్పు. దే. విడుచేుట, విరియుంట, వైశాల్యము, బాహుళ్యము. విడఁదీయు, కథను విప్పు

విప్రకారము. స. తిరస్కారము, అపకారము

విప్రకృతి. స. హాని, అవమానము

విప్రకృతుఁడు. స. తిరస్కరింపఁబడినవాఁడు, అపకారము చేయఁబడినవాఁడు

విప్రకృష్టము. స. దూరము

విప్రతికారము. స. మాఱుసేత, ఎదిరింపు

విప్రతిపత్తి. స. కలఁత, విరోధము

విప్రతీపము. స. మిక్కిలి ప్రతికూలము

విప్రతీసారము. స. పశ్చాత్తాపము, కోపము, అకృత్యము

విప్రయాణము. స. యుద్ధమునఁ బాఱిపోవుట, పలాయనము

విప్రయోగము
విప్రలంభము } స. స్త్రీపురుషుల యెడఁబాటు

విప్రలంభము. స. మిక్కిలి వంచనము

విప్రలబ్ధ. స. వంచింపఁ బడినది, సంకేతస్థలమునందు ప్రియుని గానక మోసపోయి వ్యాకులతఁ బొందునట్టి నాయిక

విప్రలాపము. స. పరస్పర విరుద్ధమైనమాట, అపార్థమైనమాట

విప్రవినోదులు. స హస్తలాఘవము చేసి బ్రాహ్మణులను యాచించునొక తెగవారు

విప్రశ్నిక. స. సోది చెప్పునది

విప్రావమన్యకుఁడు. స. బ్రాహ్మణులను తిరస్కారబుద్ధితోఁ జూచువాఁడు

విప్రియము. స. అసహ్యమైనది

విప్రుఁడు. స. బ్రాహ్మణుఁడు

విప్రుషము. స. నీటిబొట్టు

విప్లవము. స. కొల్ల మొదలగుదేశోపద్రవము
విఫలము. స. నిష్ఫలము, నిరర్థకము
విబంధము. స. మలమూత్రబంధనరోగము
విబుధుఁడు. స. పండితుఁడు, వేలుపు, చంద్రుఁడు
విబూది. త. బూది, భస్మము
విభ. స. తేజస్సు
విభక్తము. స. విభాగింపఁబడినది
విభక్తి. స. విభాగము, ప్రథమాది
విభక్తుఁడు. స. వేఱుపడ్డవాఁడు
విభజనము. స. విభజించుట, విభాగము
విభజించు. స. విభాగించు, పంచు
విభవ. స. ఒకసంవత్సరము
విభవము. స. సంపద, ధనము గొప్పతనము,
విభాకరుఁడు. స. సూర్యుఁడు, అగ్ని
విభాగపత్రిక. స. పంచుకొని వ్రాసికొన్న కాగితము
విభాగము. స. పాలు, పంపకము
విభాగించు. స. భాగించు, పంచు
విభాజకము. స. విభజించునది, భాగహారమునందు భాగించు సంఖ్య
విభాజితము.స. విభజింపఁబడినది, భాగహారమునందు భాగింపఁగా నేర్పడినసంఖ్య
విభాజ్యము. స. విభజింపఁదగినది, భాగహారమునందు భాగింపఁబడు సంఖ్య
విభాతము స. వేకువ
విభావన. స. ఒకయర్థాలంకారము
విభావము. స. రసోత్పాదనకారణము, కామోద్దీపనము, పరిచయము
విభావరి. స. రేయి, పసుపు, కుంటెనకత్తె
విభావసుఁడు. స. సూర్యుఁడు, అగ్ని
విభాష. స. సూత్రమునకు వైకల్పికవృత్తి
విభీతకము. స. తాండ్రచెట్టు
విభీషణము. స. కిక్కసకసవు, మిక్కిలి భయంకరమైనది
విభీషణుఁడు. స. రావణునితమ్ముఁడు
విభుఁడు స. ప్రభువు, సర్వవ్యాపకుఁడు, బ్రహ్మ, శివుఁడు, పెనిమిటి
విభూతి. స.తిర్యక్పుండ్రధారులు ధరించెడు భస్మము, ఒక యైశ్వర్యము
విభూషణము. స. ఆభరణము
విభేదము. స. విచ్ఛేదము, పృథక్త్వము, వైపరీత్యము, శత్రుత్వము
విభ్రమ. స. ముసలితనము
విభ్రమము. స. భ్రాంతి, విలాసము, శృంగారము
విభ్రాంతి. స. భ్రమము, ఆతురము
విభ్రాజితము. స. ప్రకాశితము
విభ్రాట్టు. స. భూషణాదులచేత ప్రకాశించువాఁడు
విమతుఁడు. స. శత్రువు, విరుద్ధమైన మతము గలవాఁడు
విమనుఁడు. స. అంతర్మనుఁడు
విమయము. స. మార్పు
విమర్దనము. స. చందనములోనగువాని పూయుట, కస్తూరి లోనగువాని నూఱుట
విమర్శనము. స. పరామర్శనము
విమర్శము. స. ఒకనాటకసంధి
విమర్శించు. స. పరామర్శనముచేయు
విమర్షము. స. తలంపు, ఆలోచన, సహింపలేమి
విమలము. స. నిర్మలమైనది
విమలిమ. స. స్వచ్ఛత
విమస్తకితుఁడు. స. తలకొట్టఁబడినవాఁడు

విమాంసము. స. కుక్క మొదలగువాని అశుచిమాంసము
విమాత. స. సవతితల్లి
విమాతృజుఁడు. స. సవతి తల్లికొడుకు
విమానన. స. అగౌరవము
విమానము. స. అంతరిక్షమునందు దేవతలు ఎక్కి సంచరించెడు రథము, చక్రవర్తి యొక్క సౌధము, వాహనము. గుఱ్ఱము, పడవ, దేవళమునందలి గర్భగుడిమీఁది గోపురము, అవమానము
విమార్గగ. స. వ్యభిచారిణి
విమార్గము. స. అమార్గము
విముక్తము. స. మిక్కిలి విడువఁ బడినది
విముక్తి. స. మోక్షము, మిక్కిలి విడుపు
విముఖుఁడు. స. పరాఙ్ముఖుఁడు
విమోచనము. స. మిక్కిలి విడుపు
విమోచితము. స. విడిపింపఁబడినది
విమోహము. స. మిక్కిలి మోహము
విమోహించు. స. మిక్కిలి మోహించు
విమోహితుఁడు. స. మిక్కిలి మోహించిన వాఁడు
వియచ్చరుఁడు. స. ఖచరుఁడు
వియత్తు. స. ఆకాశము
వియద్గంగ. స. ఆకాశగంగ
వియమము } స. హింసాదుల వలన నుడుగుట, బాధ
వియామము }
వియాతము. స. సిగ్గులేనిది, విడిచి పెట్టఁ బడినది
వియాతుఁడు. స. దిట్టతనము గలవాఁడు
వియుక్తము. స. వియోగముగలది
వియుక్తుఁడు. స. వియోగి, వేఱు చేయఁ బడినవాఁడు
వియోగము. స. ఎడఁబాటు, విరహము
వియోగిని. స. మగనినెడఁ బాసియున్న స్త్రీ
వియ్యంకుఁడు. దే. వియ్యమందినవాఁడు
వియ్యంకురాలు. దే. వియ్యమందినది
వియ్యపురాలు } దే. వియ్యంకురాలు
వియ్యపుసాని }
వియ్యమందు. దే. సంబంధము చేయు
వియ్యము. దే. వైవాహిక సంబంధము, వియ్యంకుఁడు
విరక్తి. స. రాగములేమి, విరాగము
విరక్తుఁడు. స. విరక్తిగలవాఁడు, అనురాగము లేనివాఁడు
విరచించు. స. విశేషముగా రచించు
విరచితము. స. విశేషముగా రచింపఁ బడినది
విరజ. స. వైకుంఠమునందుండునొకానొకనది
విరజస్క. స. ముట్టుడిగిన స్త్రీ
విరజస్తమసుఁడు. స. రజస్తమోగుణములు లేనివాఁడు, సాత్త్వికుఁడు
విరజాజి } దే. నవమాలికావృక్షము
విరజాది }
విరటుఁడు. త. విరాటరాజు
విరతము. స. మిక్కిలి విరతిఁబొందినది
విరతి. స. విశ్రాంతి, విరామము
విరతుఁడు. స. చాలించుకొన్నవాఁడు
విరమించు. స. విశ్రాంతిఁ బొందు, ఉడుగు
విరవాజి } దే. నవమాలికావృక్షము
విరవాది }
విరవాయు. దే. ప్రీలు, పాయలగు
విరవాఱు. దే. చెదరిపాఱిపోవు
విరవిర. దే. విరియుటయందగుధ్వన్యనుకరణము
విరవిర త. విలవిల

విరవిరవాఱు } దే. విలవిలవోవు
విరవిరవోవు }

విరసము. స. రసములేనిది, విరుద్ధరసము గలది, స్నేహవైషమ్యము, కలహము

విరసించు స. విరసత్వము నొందు, ద్వేషించు

విరహము. స. ఎడఁబాటు, వియోగము

విరహి స విరహము గలవాఁడు

విరహిణి. స. విరహముగలది

విరహితము. స విడువఁబడినది, లేనిది

విరహోత్కంఠిత. స. విరహముచేత వేదనఁ బడెడినాయిక

విరళి. స. నల్లయుప్పిచెట్టు

విరళము. దే. ఒకవిధమైనపన్ను

విరళము. స పెరుఁగు, ఎడమైనది, పదులైనది, సున్నితమైనది, అరుదైనది, చిన్నది

విరళి. త. విశాలము

విరాగుఁడు. స. విషయేచ్ఛారహితుఁడు

విరాజమానము. స. మిక్కిలి ప్రకాశించుచున్నది

విరాజితము. స మిక్కిలి ప్రకాశితము

విరాట్టు స. ఆదిదేవుఁడు, పరబ్రహ్మ, గరుత్మంతుఁడు

విరామము. స. విశ్రాంతి, ఉడుకువ

విరాలము. స. వలపుఁ బుట్టించేనది

విరావము స. మ్రోఁత, ధ్వని

విరాళము. స. ఒకవిధమైనపన్ను, చేందా

విరాళము. త. తలఁపు

విరాళి. త. వలపు, భక్తి

విరి. దే పుష్పము, వికసించినది, పీడినది, తొలఁగినది

విరించనుఁడు. స. బ్రహ్మ

విరించము. స. దినముయొక్క పదవభాగము

విరించి. స. బ్రహ్మ, విష్ణువు, శివుఁడు

విరించుఁడు. స. బ్రహ్మ

విరిఁబోఁడి. దే. పుష్పమువలె మనోజ్ఞురాలైనఆఁడుది, స్త్రీ

విరిగి. దే. శ్లేష్మాతకవృక్షము

విరిదట్టు. దే. ఎడఁబాటునొందినది

విరిపోటు. దే. భేదము

విరిపోటుసేయు. దే. భేదించు

విరియఁ బడు. దే. విరియు, పీఁడు

విరియఁబాఱు. దే. వికసించు, పీడు, వ్యాపించు, పగులు

విరియఁబోయు. దే.తలవెండ్రుకలనువ్రేలాడ విడుచు

విరియు. దే.వికసించు, పగులు, పీఁడు,చెదరు, తొలఁగు, ఉప్పొంగు, వ్యాపించు

విరివాయు. దే. పాయపడు, చీలు

విరివి } దే. విస్మృతి, విస్మృతము
విరివిడి }

విరివిలుకాఁడు. దే మన్మథుఁడు, పుష్పధన్వుఁడు

విరుద్ధము. స. విరోధము గలది

విరూపము. స. విరుద్ధ రూపముగలది, వంకరైనది, చేసి

విరూపాక్షుఁడు. స. శివుఁడు, చేసికంటి

విరేకము. స. భేదిమందు

విరేచకము. స. భేదిని కలుఁగఁ జేయునది

విరేచనము. స. పాసనము, గొలుగుచెట్టు

విరోకము స. బిలము, రంధ్రము

విరోచనుఁడు. స సూర్యుఁడు, చంద్రుఁడు, అగ్ని, ప్రహ్లాదునికొడుకు

విరోధనము. స. విరోధించుట, పగగొనుట

విరోధము. స. పగ, మాఱు, అడ్డంకి, ఎడఁబాటు
విరోధి. స. పగవాఁడు, సంవత్సరము
విరోధించే. స. ద్వేషించే, పగగొను
విరోధికృత్తు. స. ఒక సంవత్సరము
విఱపనకొయ్య. దే. మొండివాఁడు
విఱిగి. దే. పగుళ్లువాసిన నేల
విఱిచికట్టు. దే. చేతులను వెనుకకు మరలించి కట్టు
విఱిచికట్లు. దే. చేతులను వెనుకకు మరలించి కట్టుట
విఱివి దే. విస్మృతి, విస్మృతము
విఱుగఁబడు. దే. గర్వించే, ఓడు
విఱుగఁబాటు. దే. గర్వించేట, ఓడుట
విఱుగడ. దే. విరామము, ఉడుకువ
విఱుగు, విర్గు } దే. తునియు, ఓడు, పాకము చెడు
విఱుగుఁడు. దే. విఱిగినవస్తువు, విఱుపైనది
విఱుచే. దే. విఱుగఁ జేయు
విఱుపు. దే. విఱుచేట, విఱుగుడు, ఆక్షేపణము, అడ్డము
విఱ్ఱవీఁగు. దే. మిక్కిలి నిక్కు
విలంఘించే. స. లంఘించే
విలంబము, విలంబనము } స. జాగు, ప్రేలుట
విలంబితము. స. నృత్తగీతవాద్యములయందు చౌకపుకాలము, జాగుగలది, ప్రేలునది
విలంభము. స. త్యాగము
విలక్షణత స. భేదము
విలక్షణము. స. కారణము లేని యునికి, వేఱైనది, విశేషమైన లక్షణము గలది, యోగ్యము, సుందరము, మంచి లక్షణములు లేని, అసామాన్యమైనది, చెడు లక్షణములు గలది, చూచేట, పనికి మాలిన స్థితి, భేదము
విలక్షుణుఁడు. స. అభిన్నుఁడు, ఉత్కృష్టుఁడు
విలక్షము. స. ఆశ్చర్యముగలది. సిగ్గుపడినది
విలక్షుఁడు. స. వెఱఁగుపడ్డవాఁడు, సిగ్గుపడ్డవాఁడు
విలగ్నము. స. నడుము, చేక్కగా తగిలినది
విలపనము. స. విలాపము
విలపించే. స. దుఃఖించే
విలయము. స. ప్రళయము
విలవిల. దే. తన్నుకొనుటయందగు ధ్వన్యనుకరణము
విలవిల. త. విహ్వలత
విలవిలపోవు. దే. విహ్వలతఁ జెందు
విలవిలలాడించే. దే. గిజగిజలాడించే
విలసనము. స. క్రీడ, ప్రకాశము
విలసితము. స. క్రీడితము, ప్రకాశితము
విలసిల్లు. స. ప్రకాశించు, ఒప్పు
విలాతి. దే. దేశము
విలాపము. స. దుఃఖముతోడిమాట
విలాపించే స. విలపించే
విలాసము. దే. జాబుమీఁద వ్రాసెడు చిరునామా
విలాసము. స. క్రీడ, స్త్రీల శృంగారచేష్టావిశేషము
విలాసి. స. మన్మథుఁడు, చంద్రుఁడు, విలాసవంతుఁడు
విలాసిని. స. విలాసవతియైన ఆఁడుది, స్త్రీ, వేశ్య
విలీనము. స. కరఁగినది
విలు. దే. విల్లు
విలుకాఁడు, విల్కాఁడు } దే. విల్లుపూనినవాఁడు

విలుచు } దే. వెల యిచ్చి కొను, అమ్ము
విల్చు }
విలుదాలుపు } దే. విల్లుదాల్చినవాఁడు, ధనుర్ధరుఁడు
విలుదాల్పు }
విలుప్తము. స. మఱచిపోయినది, లోపము చేయఁబడినది
విలువ } దే. వెల
విల్వ }
విలువాఁడు. దే. విలుకాఁడు
విలువకాఁడు } దే. వెల యిచ్చి కొను వాఁడు
విల్వకాఁడు }
విలులితము. స. చలించునది
విలేపనము. స. చందనాదులపూఁత, చందనము
విలేపి. స. కాఁపుడుగంజి, వెలవ
విలోకనము. స. చూచుట, కనిపెట్టుట, దృష్టి
విలోకించు. స. చూచు, ఆలోకించు
విలోచనము. స. కన్ను
విలోమజాతుఁడు స. తండ్రికంటె హెచ్చు కులముగల తల్లికిఁ బుట్టినవాఁడు
విలోమము స. కుక్క. పాము, అవరోహణ క్రమముగలది, క్రమమునకుఁదలక్రిందు
విలోముఁడు. స. వరుణుఁడు
విలోలము. స. దొర్లునది, కదలునది
విల్లు. దే. ధనువు
వివక్ష. స. చెప్పనిచ్ఛ, కోరిక, అర్థము, ఉద్దేశము, పని
వివక్ష. దే. భేదము
వివక్షించు. దే. వ్యత్యాసమును కనుఁగొను
వివక్షించు. స. చెప్పనిచ్ఛించు
వివక్షితము. స. చెప్పనిచ్ఛించినది, ఉద్దేశింపఁబడినది, ఉద్దేశము, అర్థము

వివక్షువు. స. చెప్పనిచ్ఛించువాఁడు
వివత్స. స. దూడలేనియావు
వివధము. స. కావడి, త్రోవ, బరువు
వివరణము. స. వ్యాఖ్యానము
వివరము. త. వివరణము
వివరము. స. రంధ్రము, దూషణము
వివరించు. త. వక్కాణించు, విచారించు, విస్తరించి చెప్పు, ఆలస్యముచేయు
వివర్ణుఁడు. స. వెల్లఁబాఱినవాఁడు, అధముఁడు, మూర్ఖుఁడు
వివర్తనము. స. చుట్టివచ్చుట, తిరిగివచ్చుట, నృత్యము, సమూహము, మార్పు, మాఱినస్థితి, నిజముకాని రూపము, తిరుగుట, దొర్లుట
వివర్ధనము. స. విశేషవర్ధనము, అభివృద్ధి
వివశత. స. పరవశత్వము
వివశుఁడు. స. మరణకాలము సమీపించుట చేత కలఁత నొందిన బుద్ధిగలవాఁడు, స్వవశముగాని బుద్ధిగలవాఁడు
వివస్వంతుఁడు. స. సూర్యుఁడు, వేలుపు
వివాకుఁడు. స. న్యాయాధికారి
వివాదము. స. తగవు, వాక్కలహము
వివాహమగు. స. పెండ్లాడు
వివాహము స. పెండ్లి
వివిక్త. స. భర్తయెల్లని స్త్రీ
వివిక్తము. స. ఏకాంతము, విభిన్నము, పవిత్రము, వివేకముగలది
వివిధము. స. అనేకవిధములుగలది
వివీతము. స. పశువులు మేయుచుకంచె
వివృతము. స. తెఱవఁబడినది, వికసించినది

వివేకము. స. దేహాత్మాదివిభేదజ్ఞానము, విభేదము, విచారము, తెలివి
వివేకి. స. విచారణచేయువాఁడు, వివేకము గలవాఁడు
వివేకించు. స. విచారించు
వివేచన
వివేచనము } స. వివేకించుట
వివేచనీయము. స. వివేకింపఁ దగినది
వివేచించు. స. వివేచనచేయు, వివేకించు
వివ్వచ్చేము. త. బీభత్సరసము
వివ్వచ్చుఁడు. త. అర్జునుఁడు
విశంకటము. స. విరివిగలది, గొప్పది
విశంకితము. స. భీతిల్లినది
విశకలితము. స. వికలీకృతము, తాఱుమాఱైనది
విశదము. స. తెల్లనిది, స్పష్టమైనది
విశదీకరించు. స. స్పష్టముచేయు
విశయము. స. వాసస్థానము, సందేహము
విశరఘాతము. స. చంపుట, వధము
విశల్య. స. తిప్పతీఁగ, తెల్లతెగడచెట్టు, దంతిచెట్టు, శల్యములేనిది
విశల్యకరణి. స. చచ్చినవానిని బ్రదికించునట్టి ఓషధివిశేషము, సంజీవి
విశల్యము. స. ఎముకలేనిది, ముల్లులేనిది, బాధలేనిది
విశల్యుఁడు. స నిర్గతశూలుఁడు, బాధలేకుండ చేయఁబడినవాఁడు
విశసనము. స. చంపుట, కత్తి
విశసించు. స. చంపు
విశాఖ. స. ఒకనక్షత్రము, కాఁకరమొక్క
విశాఖము. స. విలుకాఁడు రెండుకాళ్ల నడుమ జేనెఁడెడముగలుగ నిలుచుట, నూలు వడికెడుకదురు, శాఖలులేనిది
విశాఖుఁడు. స. కుమారస్వామి
విశాయము. స. కావలివారు పర్యాయక్రమమున పరుండుట, పర్యాయము
విశారదుఁడు. స. విద్వాంసుఁడు, నేర్పరి
విశాల. స. పెద్దపాఁపరచెట్టు, ఉజ్జయిని
విశాలత. స. వెడల్పు
విశాలత్వక్కు. స. ఏడాకులరఁటిచెట్టు
విశాలము. స. విరివియైనది
విశాలాక్షి. స. పార్వతి, విశాలములైన కన్నులుగలస్త్రీ
విశిఖ. స. రాజమార్గము, పాఱ
విశిఖము. స బాణము, శిఖలేనిది
విశిరస్కుఁడు. స తలనఱకఁబడినవాఁడు
విశిష్టత. స శ్రేష్ఠత
విశిష్టము. స. కూడుకొన్నది, మిక్కిలి శిష్టమైనది
విశీర్ణము. స. వదలినది, శుష్కించినది, శిథిలమైనది
విశీలము. స. దుర్మార్గము
విశుఁడు. స. కోమటి, మనుష్యుఁడు
విశుద్ధము. స. నిర్మలమైనది
విశృంఖలము. స. అడ్డులేనిది
విశేషకము స. నొసటిబొట్టు, విశేషింపఁజేయునది
విశేషణము. స. గుణవాచకశబ్దము
విశేషము. స. అతిశయము, భేదము, అవయవము, వింతరూపము, నొసటిబొట్టు, వృత్తాంతము
విశేషించి. స. విశేషముగ, మిక్కిలి
విశేషించు. స. అతిశయించు
విశేష్యము స వస్తువాచకశబ్దము, నామవాచకము
విశోకము. స. దుఃఖములేనిది, అశోకవృక్షము

విశ్రమము. స పద్యవిరామము, ఊటఱ
విశ్రమించు. స. ఊఱడిల్లు, అలయికతీర్చు కొను
విశ్రాంతము. స. ఊఱడిల్లినది
విశ్రాంతి. స. పద్యవిరామము, ఊఱట
విశ్రాణనము. స. ఈవి, త్యాగము
విశ్రామము. స. విశ్రమము
విశ్రావము. స. మిక్కిలిప్రసిద్ధి, ప్రఖ్యాతి
విశ్రుతము. స. మిక్కిలిప్రసిద్ధి కెక్కినది, ప్రవహించినది
విశ్రుతి. స. ప్రసిద్ధి ప్రవాహము
విశ్రుతుఁడు. స. ప్రసిద్ధి కెక్కినవాఁడు, తెలియఁ బడినవాఁడు
విశ్లథము. స. వీడిపోయినది
విశ్లేషము. స ఎడఁబాటు ఒడఁగూడమి
విశ్వ. స. భూమి, అతివస
విశ్వంభర. స. భూమి
విశ్వంభరుఁడు. స. విష్ణువు, ఇంద్రుఁడు
విశ్వకద్రువు స. వేఁటకుక్క, ధ్వని, దుర్జనుఁడు
విశ్వకర్మ } స. దేవశిల్పి, సూర్యుఁడు
విశ్వకర్ముఁడు } స. దేవశిల్పి, సూర్యుఁడు
విశ్వకేతువు. స. అనిరుద్ధుఁడు
విశ్వగంధ. స భూమి
విశ్వగంధము. స. నీరుల్లి
విశ్వజనీనము. స. సర్వజనులకు హితమైనది
విశ్వతోముఖము. స. బ్రహ్మము, అంతట వ్యాపించినది
విశ్వనాథుఁడు.స. కాశీక్షేత్రమునందు నివసించియుండుశివుఁడు
విశ్వభేషజము. స. సొంటి
విశ్వము. స. సొంటి, లోకము, సమస్తము
విశ్వరూపుఁడు. స. విష్ణువు, అన్నిరూపములగా నుండువాఁడు
విశ్వసనీయము. స. విశ్వసింపఁ దగినది
విశ్వసించు. స. నమ్ము
విశ్వసితము. స విశ్వసింపఁబడినది
విశ్వసృజుఁడు. స. బ్రహ్మ
విశ్వస్త. స. విధవ, విశ్వసింపఁ బడినది
విశ్వస్తము. స. నమ్మఁ దగినది
విశ్వాత్మ. స. బ్రహ్మ
విశ్వామిత్రము. స. కల్పితము, మోసము
విశ్వామిత్రుఁడు. స. ఒకఋషి
విశ్వావసు. స. ఒకసంవత్సరము
విశ్వాసము. స. నమ్మకము, ప్రేమ
విశ్వాసి. స. విశ్వాసము గలవాఁడు
విశ్వుఁడు. స. గణదేవతావిశేషము
విష. స. అతివస
విషక్రిమి. స. విషమునందు పెరిఁగినపురుగు
విషణ్ణుఁడు. స. విషాదము పొందినవాఁడు, శోకముగలవాఁడు
విషధరము స పాము, మబ్బు
విషధరుఁడు. స. శివుఁడు, విషము ధరించినవాఁడు
విషధి. స. సముద్రము
విషపుచ్ఛము స. తేలు, తులువ
విషమచ్ఛదము. స. ఏడాకులరఁటిచెట్టు
విషమము. స. సమముకానిది, బేసి, విరుద్ధము, గఱుకైనది, అక్రమమైనది, కఠినమైనది, గ్రహించుటకు కష్టమైనది, చోరశక్యముకానిది, బాధాకరమైనది అపాయకరమైనది, చెడ్డది, అనుకూలము కానిది
విషమశరుఁడు. స. మన్మథుఁడు

విషమించు. స. విరోధించు, దోషించు

విషము. స. జలము, గరళము

విషముష్టి. స. ముష్టిచెట్టు

విషయము. స. గ్రంథాదులయొక్క తెలియఁబడినయంశము, లౌకికార్థము, ఇంద్రియార్థము, గోచరము, దేశము, ఒక ముఖ్యగ్రామముతో చేరిన ఉపగ్రామముల సమూహము, నిమిత్తము, సంగతి, వస్తువు, శబ్దాది ఇంద్రియసుఖము, అంశము, స్థానము, రాజ్యము, శరణము, రేతస్సు

విషయి స. ఇంద్రియము, రాజు, మన్మథుఁడు, విషయాసక్తుఁడు, ఆరోపింపఁ బడునది

విషయీకరించు. స ఉద్దేశించు

విషరుహము. స కమలము

విషవృక్షము. స. ముష్టిచెట్టు

విషవైద్యుఁడు. స. గారడీఁడు, పాముల వాఁడు, పాముకాటునకు వైద్యము చేయువాఁడు

విషాణము. స. కొమ్ము

విషాణి. స. జుట్టుపుచెట్టు, ఎద్దు, ఏనుఁగు

విషాదము. స. ఖేదము, దుఃఖము

విషాదించు. స. ఖేదపడు

విషారము. స. పాము

విషు. స. ఒక సంవత్సరము

విషువత్తు } స. రేయింబగలు సమమైన కాలము
విషువము }

విషూచిక } స. వమనవిరేచనవ్యాధి
విషూచి }

విష్కంభము. స ఒక గ్రహయోగము, గడెమ్రాను, అడ్డంకి, నాటకాంగ విశేషము, విరివి, యోగుల బంధవిశేషము

విష్కంభితము. స. అడ్డగింపఁ బడినది

విష్కిరము. స. పక్షి, కవుఁజు, కోడి, నెమిలి

విష్టపము. స. లోకము, భువనము

విష్టరము. స. ఆసనము, పీఁట

విష్టరశ్రవుఁడు. స. విష్ణువు

విష్టి స. పని, కూలిలేనిపని, వెట్టి, కూలి, పనిచేయువాఁడు

విష్ఠ. స. మలము, పురీషము

విష్ఠించు. స. విష్ఠచేయు, విరుగు

విష్ణుక్రాంత. స. ఒకానొకమందుచెట్టు

విష్ణుపదము. స. ఆకాశము, పాలసముద్రము, ఆవులమంద

విష్ణుపది. స. గంగ, ద్వారక

విష్ణురథము. స. గరుత్మంతుఁడు

విష్ణువు. స. వెన్నుఁడు

విష్యుఁడు. స. విషముచేతఁ జంపఁ దగినవాఁడు

విష్వక్సేన. స ప్రేంకణపుచెట్టు

విష్వక్సేనప్రియ. స. లక్ష్మి, పాఁచితీఁగ

విష్వక్సేనుఁడు. స. విష్ణువు, విష్ణుసేనాధిపతి

విసంయోగము. స. వేఱుపాటు

విసంవాదము. స. ముందు ఒప్పుకొని వెనుక లేదని వాదించుట

విసదారి త. పాము, విషధరము

విసనకఱ్ఱ. దే. విసరుకొనువీవన, తాలవృంతము

విసపాల. దే. ఒకానొకమందుచెట్టు

విసపాలవిత్తు. దే. నాశకుఁడు

విసపుమేతరి. దే. శివుఁడు

విసబొద్ది. దే. ఒకానొకమందుచెట్టు

విసము. త. విషము, జలము

విసరణము. స. ప్రసరణము, వ్యాపించుట

విసరము. స. ప్రసరణము, సమూహము
విసరియాడు. దే. విసరు
విసరు. త. బయలుపడు, వీచు, ఆడించు, వేయు, ఆడించుట, వీచుట, వీయుట
విసరుమెన. దే. మల్లవిద్యావిశేషము
విసర్గము. స. త్యాగము, విసర్జనము, మల విసర్జనము, విసర్జనీయము, దక్షిణాయనము
విసర్జనము. స. ఈవి, విడుపు, పుచ్చుట
విసర్జనీయము. స రెండుసున్నలు, విడువఁదగినవి
విసర్జించు. స. విసర్జనముచేయు, విడుచు
విసర్పణము. స. వ్యాపకము, ప్రాఁకుట
విసర్పనము. స. ప్రసరణము, వ్యాపించుట
విసవిస. దే. త్రిప్పుట, విసరుట మొదలగువానియందగు ధ్వన్యనుకరణము
విసవిస. త. ప్రసరించునది
విసారము. స. కొయ్య, చేఁప, వ్యాపనము
విసారి. స. ప్రసరించునది
విసిపలక. దే. పరుండెడు పెద్దపలక
విసిమాలు. దే. మిక్కిలి విసుగు
విసుగు } దే. నిర్వేదించు, నిర్వేదము,
విసువు } ఏదైననొకపనిని అధికముగాఁ జేయుటచేతఁ గలుగు నసహ్యము
విసుమానము. త. ఆశ్చర్యము
విసువాసము. త. నమ్మకము
విసువాసి. త. నమ్మకము గలవాఁడు
విసూరిక. స వాంతిభేది
విస్మృతము. స. విస్తృతము
విస్మృత్వరము } స. వ్యాపించునది, జాఱునది, ప్రాఁకునది
విస్మృమరము }
విస్మృత్వరుఁడు } స. ప్రసరించునట్టి స్వభావముగలవాఁడు
విస్మృమరుఁడు }
విస్పృష్టము. స విసరివేయఁబడినది, విడువఁబడినది
విస్తర } త. భోజనముచేసెడి యాకు, విస్తరాకు [పీఠము
విస్తరి }
విస్తరము. స. శబ్దవిస్తృతి, విరివి, స్నేహము,
విస్తరించు స. విస్తరిల్లఁ జేయు
విస్తరిల్లు. స. విరివియగు
విస్తారము స. విరివి, బోదెలేనిచెట్టు, అనేకము
విస్తీర్ణము. స. విరివియైనది
విస్తు. దే. దేహమునందుఁ గలిగెడు దుర్గంధము, ఆశ్చర్యము
విస్తృతము స. విరివియైనది
విస్ఫారము } స. వింటిమ్రోఁత, మిక్కిలి యధికమైనది
విష్ఫారము }
విస్ఫారితము. స. ప్రకాశమొందినది, కదలింపఁబడినది [ప్రకాశము
విస్ఫురణము. స. కంపనము,మనోవికాసము,
విస్ఫురించు.స.ప్రకాశించు,విస్తరింపఁజేయు
విస్ఫురితము. స. కంపితమైనది, విస్తరింపఁబడినది, ప్రకాశించునది
విస్ఫులింగము. స. అగ్నికణము
విస్ఫూర్జితము.స.మిక్కిలి ప్రకాశమొందినది
విస్ఫూర్తి. స. కంపనము, ప్రకాశము
విస్ఫోటము. స. పొక్కు, బొబ్బ
విస్మయము. స. ఆశ్చర్యము, గర్వము, ఆశ్చర్యకరమైనది
విస్మరణము. స. స్మరణము తప్పుట, మఱపు
విస్మరించు. స. మఱచిపోవు
విస్మితి. స. విస్మయము, ఆశ్చర్యము

విస్మితుఁడు. స. ఆశ్చర్యము నొందినవాఁడు
విస్మృతము. స. విస్మృతినొందినది
విస్మృతి. స. విస్మరణము, మఱపు
విస్రంభము. స. నమ్మకము, వధము, స్నేహము, ఆట్లాట జగడము
విస్రంసము. స. పడుట, జాఱుట
విస్రబ్ధము. స. నమ్మఁబడినది, అణఁగినది, శాంతినొందినది, అత్యంతము
విస్రము. స. అపక్వమైన గంధముగలది, పచ్చివాసన
విస్రస. స. ముసలితనము
విస్వరుఁడు. స. భేదపడిన కంఠస్వరము కలవాఁడు
విస్సంతు. దే.మల్లయుద్ధకాయమాన భేదము, అల్లిమత్తు
విహంగమ. స కావడిబద్ద
విహంగమము. స. పక్షి
విహంగము. స. పక్షి, బాణము, ఎగురునది
విహంగిక. స కావడిబద్ద
విహగము. స. పక్షి
విహరణము. స. విహారము
విహరించు. స. విహారము చేయు
విహర్త. స. విహరించేవాఁడు
విహర్షము. స. గొప్ప సంతోషము
విహసితము. స. మృదుధ్వనిగలనవ్వు
విహస్తము. స. వ్యాకులమైనది
విహస్తుఁడు. స. నెమ్మదిలేని మనస్సుగలవాఁడు, చదువుకొన్నవాఁడు
విహాపితము. స. దానము, ఈవి
విహాయసము. స. ఆకాశము, పక్షి
విహాయితము. స. ఈవి, దానము
విహారదాసి. స. ఆఁడుసన్యాసి, ఆఁడుసన్యాసుల మఠములోని సేవకురాలు
విహారము. స. వేడుకగాఁ దిరుగుట, త్రిప్పుట, తోఁట, బౌద్ధాలయము
విహారి. స. విహరించువాఁడు
విహారిక. స. మఠము
విహితము. స. విధింపఁబడినది, ఇష్టమైనది, స్నేహము
విహితుఁడు. స. స్నేహితుఁడు,అనుకూలుఁడు
విహీనము. స. లేనిది
విహృతము. స. మాటాడఁదగినకాలమందు సిగ్గుచే మాటాడకుండునట్టి స్త్రీలయొక్క శృంగారచేష్టావిశేషము, విహారము
విహృతి. స. విహారము
విహ్వలించే. స భయాదులచేత అవయవముల స్వాధీనత తప్పినవాఁడగు
విహ్వలుఁడు. స. భయాదులచేత అవయవముల స్వాధీనత తప్పినవాఁడు
విళంగిలు. దే. తిట్లు
విళంబి. స. ఒకసంవత్సరము, విలంబము చేయువాఁడు

## వీ

వీఁక. దే. ఉత్సాహము, పరాక్రమము, విజృంభణము, గర్వము, ఉన్నతి, యుద్ధమువలనఁ బాఱుట, దైన్యము, సామ్యము, విధము
వీఁగియాఁడు. దే. చలించే
వీఁగు. దే. ఉత్సహించే, నిక్కు, యుద్ధము వలనఁ బాఱు, చలించే, స్థూలమగు, తొలఁగు, నివృత్తియగు
వీఁడు. దే. ఈపురుషుఁడు
వీఁపు. దే. చరమాంగము, పృష్ఠము, వెనుక మేను
వీకాశము. స. ప్రకాశము, ఏకాంతస్థలము

వీకు. దే. ఉన్నతి, పరాక్రమము
వీక్ష. స. చూపు, దృష్టి
వీక్షణము. స. చూచుట, చూపు
వీక్షించే. స. చూచు
వీక్షితము. స. చూడఁబడినది
వీక్ష్యము. స. ఆశ్చర్యము, చూడఁదగినది
వీక్ష్యుఁడు. స. నాట్యము చేయువాఁడు, వేషగాఁడు
వీచి. స. అల, అవకాశము, కొంచెము, సుఖము.
వీచిమాలి. స. సముద్రము
వీచే. దే. విసరు, గాలివిసరు
వీచోపులు దే. వింజామరలు
వీజనము. స. విసనకఱ్ఱ, తాళవృంతము
వీటతటము / వీటతాటనము / వీటతాటము } దే తాఱుమాఱు, ఛిన్నాభిన్నము
వీటి. దే. కొల్ల.
వీటి. స. తాంబూలము, ముడి, రవికముడి
వీటిఁబుచ్చు. దే. వీటిఁబోవఁ జేయు
వీటిఁబోవు. దే. దూషితమగు, నష్టమగు. వ్యర్థమగు
వీటిక. స. తాంబూలము
వీటిది. దే. దొమ్మరిది
వీడియము త. తాంబూలము
వీడు. దే. వదలు, విశదమగు, వర్థిల్లు, వీడఁ జేయు, పట్టణము, కట్నము, దండు, శిబిరము, పథికజనసమూహము, దొమ్మరవాండ్ర సమూహము
వీడుకొను / వీడ్కొను } దే. పోయివచ్చెదనని చెప్పుకొని వదలు, వదలు
వీడుకొలుపు / వీడ్కొలుపు } దే. పోయివచ్చెదనని చెప్పుకొనఁగా మంచిది పోయి రమ్మని పుచ్చు
వీడుకోలు / వీడ్కోలు } దే. పోవ ననుజ్ఞ, విడుపు, మరణము
వీడుచే. దే. విడుచే, వీడఁజేయు
వీడుజోడాడు. దే. మాఱుపాటునొందు, సరిపోలు
వీడుజోడు. దే విజ్జోడు
వీడుపట్టు. దే. దండువిడియుచోటు, విడిది, వాసస్థానము
వీడుపడు / వీడ్పడు } దే. మాఱుపడు, భేదపడు, తడఁబడు
వీడుపాటు / వీడ్పాటు } దే. మాఱుపాటు, వ్యత్యాసము, ఏర్పాటు
వీడువడు / వీడ్వడు } దే. మాఱుపడు, భేదపడు, తడఁబడు
వీడెము. త. తాంబూలము
వీడ్యము. త. విడ్యము, తాంబూలము
వీణ. స. తంత్రీవాద్యవిశేషము, మెఱపు
వీణము / వీణాము } దే. సన్నవస్త్రము
వీణావాదుఁడు. స. వీణవాయించువాఁడు
వీణియ. దే. కస్తూరిమృగముయొక్క కస్తూరి యుండెడి బొడ్డుకాయ
వీణియ / వీణె } త. వీణావాద్యము
వీతంసము. స. మృగములను బట్టెడు వల
వీతము. స. అంకుశముపోటు, సత్తువలేని గుఱ్ఱము, పోయినది
వీతరాగము. స. వైరాగ్యము
వీతి స. చూలుపడుట, జిగి, తిండి, పరుగు, పోక, గుఱ్ఱము
వీతిహోత్రుఁడు. స. అగ్ని, సూర్యుఁడు
వీతెంచే. దే. వీచే, విసరు
వీది. త. వీథి

వీథి. స. ఇండ్లవరుస, వరుస, ఇండ్లువరుసలు రెంటికి నడిమిత్రోవ, నాటకవిశేషము
వీధ్రము. స. నిర్మలము
వీనాహము. స. బావియొక్క కప్పు
వీనియ. త. వీణియ
వీను. దే. చెవి, ప్రసిద్ధి
వీనుమిగులు. దే. ప్రసిద్ధికెక్కు
వీనులకంటి. దే సర్పము. చక్షుశ్శ్రవము
వీనె. త. వీనియ
వీప్స. స. ఒకటివెనుక నొకటి వ్యాపింపనిచ్ఛ
వీయము. దే. వియ్యము
వీర. త. బీరము
వీర.స. మగఁడును కొడుకులునుగల ఆఁడుది
వీరకత్తియ } త. వియ్యంకురాలు
వీరకత్తె
వీరకాఁడు. దే. వియ్యంకుఁడు
వీరజయంతిక. స. యుద్ధమునందలి వీరుల నృత్తము
వీరణము. దే. చర్మవాద్య విశేషము
వీరణము. స. అవురుగడ్డి
వీరతరము. స. అవురుగడ్డి బాణము
వీరతరువు. స. ఏఱుమద్దిచెట్టు
వీరతాయెతు. దే. వీరులు బిరుదుగా కట్టుకొనెడు తాయెత్తు
వీరపత్ని. స. వీరునిఁ బెండ్లాడిన పెండ్లాము
వీరపాణము. స. యుద్ధము కడపటఁ గాని మొదటఁగాని వీరులు చేసెడు గోష్ఠీపానము
వీరభద్రపళ్లెరము. దే. మిక్కిలి పెద్దపళ్లెరము, శైవులాచరించే నొకవ్రతము
వీరమద్దియలు } త. పగవారి వీరుల పేళ్లు
వీరమద్దెలు } నడుమఁ జెక్కి శూరులు బిరుదుగా కాలి పెద్దవ్రేలిన ధరించెడు ముద్రికలు, స్త్రీలు కాలి పెద్దవ్రేలిని ధరించెడు ముద్రికా విశేషము
వీరమధ్యములు. స. శత్రువీరుల పేళ్లునడుమఁ జెక్కి శూరులు బిరుదుగా కాలి పెద్ద వ్రేలిని ధరించెడు ముద్రికలు
వీరము. స. కుంకుమపువ్వు, రసవిశేషము
వీరముద్దియలు } త. వీరమద్దియలు
వీరముద్దెలు
వీరముద్రికలు. స. వీరమధ్యములు
వీరముష్టి. స. కోమట్లను యాచించుకొని జీవించెడు ఒక తెగ భిక్షుకుఁడు
వీరవృక్షము. స. ఏఱుమద్దిచెట్టు, జీడిచెట్టు
వీరవైష్ణవుఁడు. స. వైష్ణవమతమునందు మిక్కిలి పట్టుగల విష్ణుభక్తుఁడు
వీరశైవుఁడు స. శైవమతమునందు మిక్కిలి పట్టుగల శివభక్తుఁడు
వీరసువు. స. వీరునిఁ గన్నతల్లి
వీరాణము. దే. వీరణము
వీరాయితము. స. పురుషాయితము
వీరావేశము. స. వెఱ్ఱిశౌర్యము [మి
వీరాశంసనము. స. భయంకరమైనయుద్ధభూమి
వీరాసనము. స. దేనిమీఁదను ఆనక కూర్చుండుట, రాత్రిపూట కత్తి చేతఁబట్టుకొని హెచ్చరికతోఁ గావలియుండుట
వీరుఁడు. స శూరుఁడు, శ్రేష్ఠుఁడు
వీరుధము. స. ఒకటితో నొకటి పెనఁగొన్న ద్రాక్షతీఁగ లోనగువానిపొద, చిగురుఁగొమ్మ

వీర్యము. స పరాక్రమము, రేతస్సు, తేజము, ప్రభావము

వీఱిఁడి. దే. వెఱ్ఱివాఁడు, వెఱ్ఱిది

వీలు. దే. ఉపయోగించే, అనుకూలము, ఆనుకూల్యము, పగులు, చీలు, విచ్చు

వీలుపడు. దే. సరిపడు, అనుకూలపడు

వీవధము. స. కావడి, త్రోవ, బరువు

వీవన. దే. విసనకఱ్ఱ

వీవలి. దే. గాలి

వీవాహము. స వివాహము

వీసబడి దే గ్రామములందు భాగప్రకారము గలిగిన భూస్వాతంత్ర్యము, అమరకము

వీసము. దే రూకలో పదునాఱవభాగము, ఒకట పదునాఱవ భాగము

వీసము }
వీసరము } దే. కొఱఁత, వెలితి, వ్యర్థము

వీసరపడు }
వీసరపోవు } దే. వెలితిపడు

వీసె }
వీసియ } త. నలువది పలములు

వీహారము. స. బౌద్ధమఠము

## వూ

వూర్ణము. స. కోరఁబడినది

## వృ.

వృంతము. స. తొడిమ, చూచుకము

వృంతాకము. స. నీరువంగ మొక్క

వృకధూపము. స. అనేక పరిమళవస్తువులు కూర్చి చేసిన ధూపము

వృకధూమకము. స. పాపటచెట్టు

వృకము. స. తోఁడేలు

వృకోదరుఁడు. స. భీమసేనుఁడు, తోఁడేటి కడుపువాఁడు

వృక్క }
వృక్కము } స. హృదయము

వృక్ణము స. విఱిగినది, కోయఁబడినది

వృక్షకము. స. చిన్నచెట్టు

వృక్షధూపము. స. దేవదారుబంకతోఁ జేసిన ధూపద్రవ్యము

వృక్షము. స. చెట్టు

వృక్షరుహా. స. బదనిక

వృక్షవాటిక. స. ధనికులయొక్క గృహముల యందలి ఉపవనము, చెట్లవరుస

వృక్షాదనము. స. ఉలి, రాగిచెట్టు, గొడ్డలి

వృక్షాదని. స. బదనిక

వృక్షామ్లము. స. చింతపండు

వృజినము. స. పాపము, క్లేశము, వక్రము

వృతము. స. ఆవరింపఁ బడినది

వృతి. స. వరించుట, చుట్టువేసిన వెలుగు, చుట్టుట

వృతుఁడు. స. వరింపఁబడినవాఁడు

వృత్తపత్రము. స. వన్నె వెదురు మొక్క

వృత్తపర్ణి. స తెల్లజీనము

వృత్తము. స. పద్యభేదము, నడత, జీవనము, తాఁబేలు, వరింపఁ బడినది, చుట్టఁబడినది, వట్రువయైనది, కడచినది, చచ్చినది, గట్టియైనది, ఏకసరళ రేఖచే నావృతమగు నాకృతి

వృత్తాంతము. స సమాచారము, కథ, అంతయు, ఏకాంతము, ప్రక్రియ, ప్రస్తావము

వృత్తి. స. నడవడిక, జీవనోపాయము, వివరణగ్రంథము, అభిధాది, కైశిక్యాది

వృత్తికారుఁడు. స. సూత్రములకు వ్యాఖ్యానము వ్రాసినవాఁడు
వృత్తిధారుఁడు. స. భూవసతిగలవాఁడు
వృత్రము. స. చీఁకటి, కొండ
వృత్రహుఁడు. స. ఇంద్రుఁడు
వృత్రుఁడు. స. శత్రువు, ఒక అసురుఁడు
వృథ } స. వ్యర్థముగా
వృథా }
వృద్ధ. స. ఎనుబది యేండ్లకు పైఁబడిన ముసలిది
వృద్ధకాకము. స. మాలకాకి
వృద్ధకుఁడు. స. ముసలివాఁడు
వృద్ధత్వము. స. ముసలితనము
వృద్ధదారకము. స. బొద్దిచెట్టు
వృద్ధము. స. ఊపువ్వు, వృద్ధిబొందినది
వృద్ధశ్రవుఁడు. స. ఇంద్రుఁడు
వృద్ధాచారము. స. పెద్దలనాటనుండి వచ్చునాచారము
వృద్ధి. స. అభివృద్ధి, సమృద్ధి, అభ్యుదయము, వడ్డి, గుణకారము, కంతి, ఒకగ్రహయోగము
వృద్ధిజీవిక. స. వడ్డికిచ్చి జీవించెడుజీవనము
వృద్ధుఁడు } స. ఎనుబదియేండ్లకుపైఁబడిన ముసలివాఁడు, తెలిసినవాఁడు
వృద్ధు }
వృద్ధ్యాజీవుఁడు. స. వడ్డికిచ్చి జీవనము చేయువాఁడు, వార్ధుషికుఁడు
వృశ్చికము. స. తేలు, తేలుకొండిచెట్టు, ఒకరాశి, కందిరీఁగ, గొంగళిపురుగు, తెల్లగలిజేరు మొక్క
వృష. స. ఎలుకజీడిచెట్టు, దురదగొండి మొక్క
వృషగంధిక. స. గాడిదగడపరచెట్టు
వృషణము. స. ముష్కము
వృషదంశము. స. పిల్లి
వృషధ్వజుఁడు } స. శివుఁడు
వృషపర్వుఁడు }
వృషభము. స. ఎద్దు, ఒకరాశి, తిరుమల
వృషభి. స. విధవ, స్వైరిణి
వృషము. స ఎద్దు, ధర్మము, ఎలుక, అడ్డసరపుచెట్టు
వృషలకుఁడు. స. నీచశూద్రుఁడు
వృషలి. స. శూద్రజాతి స్త్రీ, కన్యక గొడ్రాలు, చచ్చుబిడ్డలుగలది, పెండ్లి కాకమునుపు రజస్వలయైన కన్యక
వృషలుఁడు. స. శూద్రుఁడు, చంద్రగుప్తుఁడు, పాపాత్ముఁడు
వృషస్యంతి. స. కాముకి
వృషాకపాయి. స. లక్ష్మి, పార్వతి, శచి స్వాహా, తిప్పతీఁగ
వృషాకపి. స. విష్ణువు, శివుఁడు, అగ్ని
వృషుఁడు. స. ఇంద్రుఁడు, కర్ణుఁడు, వీర్యవృద్ధిగలవాఁడు
వృష్టము. స. వర్షించేచేయున్నది, వర్షించినది
వృష్టి. స. వర్షము, వాన
వృష్ణి. స. పొట్టేలు, ఒకయాదవుఁడు, కృష్ణుఁడు, ఇంద్రుఁడు, అగ్ని, పాషండుఁడు
వృష్యము. స. వీర్యవృద్ధిని చేయునది

## వె

వెంగడము. దే. విపరీతము, విరుద్ధము
వెంగలి } త. వెఱ్ఱివాఁడు, వెఱ్ఱిది, మూఢుఁడు, అవివేకి
వెంగళి }
వెంగలివిత్తు. దే. మూఢాగ్రేసరుఁడు

వెంచే. దే మడుఁగు, హ్రదము, సరస్సు
వెంట. దే కార్యము, విషయము, మార్గము, విధము, వేట వెంబడి
వెంటము. దే. వేడుక, కుతూహలము
వెంటి. దే. ఎండువరిగడ్డితో చేసినత్రాడు, కసవుపిరి
వెంటిగొను. దే. పిరిగొను
వెంట్రువ. దే. ఒకదినుసుముంగిస
వెండి. దే. రజతము, మటి, పిష్టట
వెండికొండ. దే రజతాద్రి
వెండిగుండు. దే. వెండికొండ
వెంద్రుక. దే. కేశము, రోమము
వెంపర. దే. పీడనము, హింస, ఛేదనము
వెంపరలాడు. దే. పీడించు, ఛేదించు, హింసించు
వెంపలి. దే. ఒకానొకచెట్టు
వెంబడి. దే. వెంట
వెంబడించు దే. వెదకొను
వెంబర. దే. దుష్టుఁడు, దుష్టురాలు, అవివేకి
వెంబరవిత్తు. దే. దుష్టాగ్రేసరుఁడు, మూఢాగ్రేసరుఁడు
వెకలి. త. మూఢుఁడు, అసక్తుఁడు, వెఱ్ఱిది
వెక్క. దే. వేఁడిమి
వెక్కలి. త. వెకలి
వెక్కసపడు. దే. దుస్సహత్వము నొందు
వెక్కసపాటు. దే. వెక్కసపడుట
వెక్కసము. దే. దుస్సహత్వము, దుస్సహము, దుర్లభము, అధికము, చీదర, అసహ్యము
వెక్కసములు దే. దుస్సహవచనములు
వెక్కసి. దే. దుస్సహుఁడు, దుస్సహురాలు
వెక్కసించు. దే. దుస్సహమగు
వెక్కిరించు. త. వికారచేష్టలుచేయు, అపహాస్యముచేయు
వెక్కిరింత. త. వెక్కిరించుట
వెక్కిరింతలాడు దే. వికారచేష్టలు చేయు
వెక్కిలి. త. దప్పి మొదలైనవానిచేతఁ గలిగెడి వ్యాధివిశేషము, హిక్క, ఎక్కిలి
వెక్కు. త. వెక్కిలివిడుచు, ఏడ్చునపుడు వెక్కిలిధ్వనివలె ధ్వనించు, వెక్కిలి
వెక్కుఁడు. త. వికారముపట్టినవాఁడు,వికారమైన
వెగచు. దే. వెక్కు
వెగటించు దే. అసహ్యమగు
వెగటు. త. వైరస్యము, విరసము, చీదఱ, అసహ్యము
వెగడు. దే. తల్లడము, తడఁబాటు
వెగడుపడు. దే. తల్లడపడు
వెగ్గలము. దే. మిక్కుటము
వెగ్గళీఁడు. దే. అధికుఁడు
వెచ్చించు. త. వెచ్చముచేయు
వెచ్చ. దే. వేఁడిమి, కాఁక, వేఁడి
వెచ్చకాఁడు. దే. విటుఁడు, మిక్కిలివెచ్చము చేయువాఁడు
వెచ్చన. దే. వేఁడిమి, వేఁడి
వెచ్చపడు. త. వెచ్చమగు
వెచ్చపఱచు. త. వెచ్చపడఁజేయు
వెచ్చపెట్టు. దే వెచ్చించు
వెచ్చపోవు. దే. వెచ్చపడు
వెచ్చము. త. వ్యయము,ఇంటికి వాడుకొనుటకు కావలసిన చిల్లరసరకుల యప్పు
వెచ్చలు. దే. గ్రీష్మదివసములు
వెచ్చు. దే. కాఁగు, వేఁడిమి

వెజ్జే. త. వైద్యుఁడు
వెజ్జెరాలు. త. వైద్యురాలు
వెట్ట. దే వెట్టకారు, వేఁడిమి, వేఁడి
వెట్టకారు. దే. గ్రీష్మర్తువు, వేసవి
వెట్టచెవులతపసి. దే. ఉగ్రశ్రవుఁడు
వెట్టము. దే. శత్రువు
వెట్టి. త. కూలిలేక చేసెడుపని
వెట్టిగొను. దే. వెట్టిచేయించు
వెట్టివాఁడు. దే. గ్రామమునందు దినబత్తెము లేక వెట్టిపనిచేయువాఁడు
వెట్టీఁడు. దే. వెట్టిచేయువాఁడు
వెడ దే. అల్పము, తుచ్ఛము, వికృతము, వ్యర్థము, ఇంచుక [వాఁడు, అవివేకి
వెడఁగు దే. అవివేకము, వికారము, వెఱ్ఱి
వెడఁగుపడు. దే. అవివేకమునొందు, జడత్వమునొందు, వికారమునొందు
వెడఁగుపాటు. దే. వెడఁగుపడుట
వెడఁగురుపడు. దే. జడత్వమునొందు
వెడఁద. దే. విశాలము
వెడఁదమోముమెకము. దే. సింహము
వెడలఁబడు. దే. వెడలు
వెడలఁబాటు. దే వెడలఁబడుట
వెడలఁబాఱు, వెడలు } దే. బయలువెళ్లు
వెడలుచు, వెడల్చు } దే. వెడలఁజేయు
వెడలుపు, వెడల్పు } దే. వైశాల్యము, నిడివిగాక రెండవ ప్రక్కకొలత
వెడవింటి, వెడవిలుకాఁడు, వెడవిలుతుఁడు } దే. మన్మథుఁడు

వెడవెడ. దే. అత్యల్పము, సూక్ష్మముగ, మందముగ, మృదువుగ
వెడ్డరి. దే. కపటి, వంచకుఁడు
వెడ్డు. దే. కపటము, వంచన
వెడ్డువెట్టు. దే. వంచించు
వెణఁద. దే. విశాలము, వెడఁద
వెణుతురు. త. వెలుతురుచెట్టు,కరీరవృక్షము
వెత. త. దుఃఖము
వెతకు. దే. అన్వేషించు
వెతారము. దే. దుఃఖము
వెత్తెసము. త. వ్యత్యాసము
వెద దే. విత్తుట, పశుఋతువు, పక్షిగర్భాధానము, కొప్పు, ఫలించుకాలము
వెదకు. దే. వెతకు
వెదకుడు దే. వెదకుట
వెదగొట్టు. దే. విత్తులువెదవేసెడుగొట్టు
వెదచల్లు. దే. పాఱఁజల్లు, వ్యాపింపఁజేయు
వెదచిందు. దే. వ్యాపించు
వెదపెట్టు. దే. విత్తు
వెదావు. దే ఆఁబోతుచే వెనుకొనఁబడుఆవు
వెదురు. త. వేణువు
వెదురుకంపజిట్ట. దే. పక్షివిశేషము
వెదురుపాలు. త. త్వక్షీరము
వెదురుపిచ్చుక. దే. పక్షివిశేషము
వెదురుప్పు. దే. వెదురుపాలు
వెదురుమిడుత. దే. క్రిమివిశేషము
వెదురువిల్లు. దే. వెదురుబద్దలతోఁ జేసినవిల్లు
వెనకయ్య. త విఘ్నేశ్వరుఁడు,వినాయకుఁడు
వెనకు. దే. వెదకు
వెనకుడు. దే. వెదకుడు

వెను. దే. వెన్ను
వెనుఁబడు. దే. విషాదించు, ఖేదపడు
వెనుఁబాటు. దే. విషాదము, ఖేదము
వెనుక. దే. పశ్చాద్భాగము, ముందు, పడమర, పశ్చాద్భాగమున నున్నది, ముందటిది, వెంబడి, పిమ్మట, అశ్రద్ధ
వెనుకచిక్కు. దే. వెనుకపడు [కము
వెనుకచూపులమెకము. దే. ఎలుఁగు, భల్లూ
వెనుకటిపని. దే. అపరకర్మము
వెనుకటివాఁడు. దే. అనుజుఁడు, వెనుకనున్నవాఁడు
వెనుకదీయు. దే. వెనుకకు మరలు, సంకోచించు
వెనుకద్రొక్కు. దే. వెనుదీయు
వెనుకపడు. దే. వెనుకచిక్కు, ధనము వెచ్చెముకాక కూడఁబడు
వెనుకపాటు. దే. వెనుకపడుట
వెనుకమేను. దే. వీఁపు, చరమాంగము
వెనుకమ్రాను. దే. ఏతపుబానకు నీళ్లెత్తువాఁడు కూర్చుండుటకై నిలువుగాళ్లమీఁద అడ్డముగా నుంచినకొయ్య
వెనుకలు. దే. వెనుక [కూడఁబెట్టు
వెనుకవేయు. దే. ధనము వెచ్చెముచేయక
వెనుకొను, వెనుచేఱుచు, వెనుతవులు } దే. వెంబడించు
వెనుదన్ను. దే. వెన్నుదన్ను, వెనుకనిలుచు, వెంబడించు
వెనుదీయు. దే. వెనుకకు మరలు
వెనువెంట. దే. మిక్కిలి వెంబడి
వెన్క. దే. వెనుక
వెన్కొను. దే. వెనుకొను
వెన్తవులు. దే. వెనుతవులు
వెన్న. త. పెరుఁగు చిలికియె త్తినది, నవనీతము
వెన్నంటు దే. వెంబడించు
వెన్నడాయి. దే. పక్షివిశేషము
వెన్నడి. దే. వెంబడి
వెన్నడించు, వెన్నడికొను } దే. వెంబడించు
వెన్నదొంగ. దే కృష్ణుఁడు, నవనీతచోరుఁడు
వెన్నపడిదము. దే. ఒకదినుసుపిండివంట
వెన్నపాలకాయ. దే. భక్ష్యవిశేషము
వెన్నపూస. దే. వెన్నముద్ద
వెన్నప్పము. త. మధురభక్ష్యవిశేషము
వెన్నమడుఁగు. దే. వస్త్రవిశేషము
వెన్నముద్ద. దే. నవనీతఘుటిక, చంద్రుఁడు
వెన్నముద్దకోడి. దే. పక్షివిశేషము
వెన్నముద్దలు. దే. శాలిధాన్యవిశేషము, బాణపంచు విశేషము
వెన్నమెఱుఁగు. దే. భక్ష్యవిశేషము
వెన్నయుండ దే. మధురభక్ష్యవిశేషము
వెన్నవెదురు. త. ఒకదినుసు మొక్క
వెన్నాడు. దే. వెన్నడించు
వెన్నాస. దే. సహాయము
వెన్నిచ్చు దే. వెనుదీయు
వెన్ను. దే. వీఁపు, వరిమొదలగువానిఎన్ను, ఇంటినడికొప్పు
వెన్నుఁడు. త. విష్ణువు
వెన్నుకట్టె. దే. పృష్ఠబంధము
వెన్నుగాఁడి. దే. ఇంటినడికొప్పు కొయ్య
వెన్నుగుదియ. దే నడుమువిఱుగఁగొట్టుకఱ్ఱ
వెన్నుదగులు. దే. వెంటఁబడు, తఱుము
వెన్నుదన్ను. దే. వెనుకనిలుచు, వెంబడించు

వెన్నుపట్టె. దే. ఇంటివెన్నుగాఁడి, వీఁపు నడిమి ఎముక
వెన్నుపాము. దే. కుండలి, వెన్నెముకయం దుండు పురుగు
వెన్నుపూస. దే. వీఁపునడిమి ఎముక
వెన్నుబ్రద్ద } దే. వెన్నుగాఁడి
వెన్నుమ్రాను }
వెన్నెముక. దే. వీఁపునడిమి ఎముక, కశేరుక
వెన్నెల. దే. చంద్రునియొక్క తెల్లనికాంతి, చంద్రిక
వెన్నెలకారు. దే. శరదృతువు
వెన్నెలకుప్పలు. దే. బాలక్రీడావిశేషము
వెన్నెలకోలు. దే. నమస్కారము
వెన్నెలగుత్తి. దే. చంద్రుఁడు
వెన్నెలపులుఁగు. దే. చకోరపక్షి
వెన్నెలరాయఁడు } దే. చంద్రుఁడు, కళానిధి
వెన్నెలఱేఁడు }
వెన్బడు. దే. వెనుఁబడు
వెన్బాటు. దే. వెనుఁబాటు
వెప్పు. దే. వేఁడిమి
వెమ్ము. దే. తప్తమగు, తాపము నొందు
వెయ్యి. దే. వేయి
వెరఁగు. దే. ఆశ్చర్యము, నిశ్చేష్టత
వెరజోఁడు } దే. జేవురుకొను
వెరఁజు }
వెరవరి. దే. ఉపాయశాలి
వెరవిఁడి. దే. ఉపాయహీనుఁడు
వెరవు. దే ఉపాయము, జీవనోపాయము, విధము, యుక్తము, అధీనము
వెరవేఁకి. దే. విరహతాపము, భీతి, భయజ్వరము
వెరసి దే. లెక్క మొత్తము, కటకటిది
వెరసు. దే. అంకెలులోనగువాని . పఙ్క్తి
వెరువు. దే. వెరవు
వెఱ. దే. భయము, ఆశ్చర్యము
వెఱఁగు. దే. ఆశ్చర్యము, నిశ్చేష్టత
వెఱఁగుపడు. దే. ఆశ్చర్యము నొందు,నిశ్చేష్టతఁ బొందు
వెఱఁగుపాటు. దే. వెఱగుపడుట
వెఱఁగొందు. దే. ఆశ్చర్యపడు
వెఱక. దే. వెంద్రుక
వెఱచేఱు } దే. భయపడు
వెఱచే }
వెఱపరి. దే. భయముగలవాఁడు, భయము గలది
వెఱపిఁడి. దే. భయములేనివాఁడు, భయము లేనిది
వెఱపు దే. భయము
వెఱబొమ్మ. దే. దృష్టి ప్రతిమ
వెఱవెఱపాటు. దే. నిశ్చేష్టత
వెట్టి దే. పిచ్చి, అవివేకము, పిచ్చివాఁడు, వివేకములేనివాఁడు, వివేకములేనిది
వెట్టిచెఱకు. దే. చెఱకువంటి తృణవిశేషము
వెట్టినీళ్లు. దే. మద్యము
వెట్టిబాగులు. దే. వివేకములేనివాఁడు, వివేకము లేనిది
వెట్టిబీఱ. దే. చేఁతిబీఱ
వెట్టివాఁడు. దే. వెట్టిపట్టినవాఁడు, వివేకము లేనివాఁడు
వెల. దే. కొనువస్తువులులోనగు వానికిచ్చెడు విలువ, మూల్యము, పందెము
వెలఁగ. దే. కపిత్థము
వెలఁది. దే ఆఁడుది, ధావళ్యము, నిర్మలము, ప్రసన్నము
వెలఁదుక. దే. వెలఁది
వెలఁచు. త. శుద్ధిచేయు, తోము

వెలనాఁడు } దే. దేశవిశేషము, ఒకతెగ
వెల్నాఁడు } బ్రాహ్మణులు
వెలమ. దే. శూద్రజాతివిశేషము
వెలములు. దే. వెలమజాతివారు
వెలయాలు. దే. వేశ్య
వెలయు.త. ప్రకాశించు, ప్రసన్నత నొందు, ప్రసిద్ధికెక్కు, బయలుపడు
వెలరారు. దే. తెల్లనగు
వెలరు. త. తెల్లన
వెలరువాఱు. దే. తెల్లనగు, వెలవెలఁబోవు
వెలలు. దే. వెడలు
వెలలుచు. దే. వెడలుచు
వెలవ. త. కాఁపురుసుగంజి
వెలవెలఁబాఱు } దే. వివర్ణమగు
వెలవెలఁబోవు }
వెలవెలన. త. వెలవెలపాటు
వెలవెలనగు } దే. వెలవెలఁబోవు
వెలవెలనవోవు }
వెలవెలపాటు. త. వైవర్ణ్యము
వెలవెల్లనగు. దే. వెలవెలఁబోవు
వెలారించు. దే. వెలారుచు
వెలారుచు } దే. వెడలించు, బయలు
వెలార్చు } పఱచు
వెలి. దే. బయలు, బహిష్కారము, దేహముయొక్క బహిఃప్రదేశము, బయలుపాటు, బాహ్యము
వెలి. త. తెలుపు, తెల్లనిది
వెలికత్తెరనేల.దే.కంకరమన్ను కలసిన భూమి
వెలికి. దే. ఒకానొకచెట్టు
వెలికిలఁ బడు. దే. వీఁపుక్రిందగునట్లుపడు
వెలికిలు. దే. వీఁపుక్రిందగువీఁపు, క్రిందుగా పరుండు
వెలిగడ. దే. మెట్టనేల
వెలిగారము. త. బంగారమునకు కాంతి గలుగఁజేసెడి యొక దినుసు తెల్లని యుప్పు, టంకణము
వెలిగిడ్డి. త. కామధేనువు
వెలిగుల్ల. త. శంఖము
వెలిగొండ. దే. దూరమునందున్న పర్వతము
వెలిగారు. దే. ఇంద్రుని తెల్లయేనుఁగు, ఐరావతము
వెలిగ్రుక్క. దే. రతికూజితము
వెలిచంద్ర. దే. తెల్లచేంద్రచెట్టు
వెలిచేవి. దే. జారత్వము
వెలిచె } దే. పక్షివిశేషము, వర్తకము,
వెలిచియు } వెలిచియ అనుపక్షి
వెలితి. దే. తక్కువ, తక్కువైనది, తఱచుఁదనము లేమి
వెలితిప్ప. త. వెండికొండ, కైలాసము
వెలితిమానిసి. దే. అల్పుఁడు, అల్పురాలు
వెలితుమ్మ. దే. తెల్లతుమ్మచెట్టు
వెలిదుక్కి. దే.నీళ్లుకట్టక వానతడిచేదున్నుట
వెలిపము. దే. వలిపము
వెలిపుచ్చు. దే. బయలుపఱుచు
వెలిపెట్టు. దే. వెలివేయు
వెలిబిత్తరి. దే. మల్లబంధవిశేషము
వెలిమావు. దే. ఇంద్రుని తెల్లగుఱ్ఱము, ఉచ్చైశ్శ్రవము
వెలిమిడి. దే. భస్మము, బూడిద
వెలిమొట్ట. దే. మత్స్యవిశేషము
వెలిమ్రాను. దే. కల్పవృక్షము

వెలియు. దే. వానకురిసి నిలుచు, వస్త్రాదుల కాంతి తఱిగిపోవు
వెలియునికి. దే. పరదేశమునందలియునికి, ప్రవాసము
వెలివాఁడు. దే. చండాలుఁడు
వెలివాడ. దే. చండాలవాటిక
వెలివాడవాఁడు. దే. చండాలుఁడు
వెలివాఱు. దే. వేఁటాడెడుచోట బయట చుట్టుపాఱించెడు ప్రోఁగు
వెలివిరియు దే. వెల్లివిరియు
వెలివిసరు. దే. బయలుపడు
వెలివేయు. దే. బహిష్కరించు
వెలిసె. దే. ఇంటిచూరు
వెలు. దే. వృత్తియందు వెలికి వచ్చెడు, ఆదేశము [ఉదా. వెలుపల, వెలువడు మొ.]
వెలుఁగించు.దే.రగిలించు,ప్రకాశింపఁజేయు
వెలుఁగు. దే. ప్రకాశించు, జ్వలించు, ప్రకాశము, ఎండ, కిరణము, పరంజ్యోతి, దేవుఁడు
వెలుఁగుఱేఁడు. దే. సూర్యుఁడు, త్విషాంపతి
వెలుఁగొందు. దే. ప్రకాశించు
వెలుక. దే. తెల్లన
వెలుకఁబాఱు. దే. వెల్లఁబాఱు
వెలుగు } దే. లోపల పశువులు లోనగునవి చొరక యుండునట్లు తోఁట మొదలగువానిని చుట్టు ముండ్ల చెట్టుపెట్టి ఎదిరించిన ఆవరణము, కంచె
వెల్లు
వెలుచు. దే. సర్పము [తోఁడు
వెలుచు. దే. తోలు, వెడలించు, నూలు
వెలుఁతురు } దే. ప్రకాశము, ఎండ
వెల్తురు
వెలుతురు. త. వెణుతురు చెట్టు
వెలుపల. దే. బహిఃప్రదేశము, వెలియైనది
వెలుఁపలించు } దే. వెలిపఱుచు
వెల్పలించు
వెలుపించు. దే. వెలుపు చేయు
వెలుపు. దే. వెడలుపు, నీరుబయలుదేరు
వెలుపుడు. దే. నూలు వెలుచుట
వెలువడము దే. సస్యవిశేషము
వెలుఁవడములు. దే. ధాన్యవిశేషము
వెలువడు. దే. బయలుపడు, బయలుదేఱు
వెలువరించు } దే. వెలువడఁ జేయు
వెల్వరించు
వెలువఱుచు
వెల్కఁబాఱు. దే. వెలుకఁబాఱు
వెల్చు. దే. వెలుచు
వెల్చె. దే. వెలిచె
వెల్తి. దే. వెలితి
వెల్పల. దే. వెలుపల
వెల్ల. త. తెల్లనిది, ధవళము
వెల్లఁకి. దే. గడ్డ, వేరు
వెల్లఁబాటు. త. వెల్లనగుట
వెల్లఁబాఱు. దే. వెల్లనగు, వైవర్ణ్యము బొందు
వెల్లచేఱుపు. దే. సున్నపుపూఁత
వెల్లడి. త. బయలు, ప్రసిద్ధి
వెల్లన. త. తెల్లన
వెల్లనగు. దే. వెల్లఁబాఱు
వెల్ల వేయు. దే. గోడలకు సున్నము వేయు
వెల్లాటకత్తె } దే. జారిణి, వేశ్య
వెల్లాటకత్తియ
వెల్లాటకము. దే. ప్రసిద్ధి, ప్రకటన

వెల్లి } దే. ప్రవాహము, పరంపర
వెల్లిక }

వెల్లి. త. తెలుపు

వెల్లిగొను. దే. ప్రవహించు, పరంపరగా వెడలు

వెల్లివిరి. దే. ప్రకటితము

వెల్లివిరియు. దే. ప్రవహించు, ఉబుకు, వ్యాపించు, ప్రకటితమగు, చెదరు

వెల్లివాడుచు దే. ప్రవహించు

వెల్లుల్లి. దే. తెల్లగడ్డ, లశునము

వెల్లువ. దే. ప్రవాహము, సేన, ఇటికగోడల ఇంటిచూరు

వెల్లువగట్టు. దే. ప్రవహించు, మడుఁగుకట్టు

వెల్లెలుక. దే. తెల్లయెలుక

వెల్వడము. దే. వెలువడము

వెల్వడు. దే. వెలువడు

వెల్వెలఁబాఱు. దే. వెలవెలఁబాఱు

వెల్వెలుకఁబాఱు. దే. మిక్కిలివెలుకఁబాఱు

వెవ్వెల్ల } త. మిక్కిలి వైవర్ణ్యము
వెల్వెల్ల }

వెస. త. వేగము, శీఘ్రముగ

వెసనము. త. వ్యసనము

వెసల. దే. వంటకుండ, అటిక

వెళ్లఁగొట్టు. దే. లేవఁగొట్టు, పంపివేయు

వెళ్లు. దే. వెడలు, పోవు

## వే

వే దే. వేయి, అనేకము

వే. త. వేగముగ

వేంకటాచలము. స. తిరుపతికొండ

వేంచేపు. దే. ఆగమనము, గమనము

వేంచేయు. దే. వచ్చు, పోవు, కూర్చుండు, నివసించు

వేండ్రపడు. దే. మండిపడు

వేండ్రము. దే. తాపము

వేఁకటి. దే. గర్భము, వ్రేఁకటి

వేఁకరము. దే. ఉపద్రవము

వేఁకరి. దే. కిరాతభేదము

వేఁకి. దే. జ్వరము

వేఁగి. త. పులి

వేఁగినాడు. దే. వేఁగీదేశము

వేఁగిస. దే. సర్జకవృక్షము

వేఁగీ. దే దేశవిశేషము

వేఁగు. దే. తపించు, వ్రేఁగు

వేఁచు. దే. వేఁగఁజేయు, వేఁగించు

వేఁట. దే. మృగయ, మేఁకపోతు, పొట్టేలు

వేఁటకాఁడు. దే. బోయ, మృగయుఁడు, సంహారకుఁడు [గల శునకము

వేఁటకుక్క. దే. వేఁటాడుటయందు నేర్పు

వేఁటగిరి. దే. వేఁటాడి జీవించెడి బోయ

వేఁటపల్లె } దే. బోయపల్లె
వేఁటపల్లియ }

వేఁటపిట్ట. దే. దీమపుపిట్ట

వేఁటరి. దే. వేఁటకాఁడు

వేఁటాడు } దే. అడవియందు మృగముల
వేఁటలాడు } నుపక్షులను వధించు, వధించు

వేఁటలాట. దే. వేఁటాడుట

వేఁడి. దే. వేఁడిమి, తాపము, చుఱుకు, తేజము, ఉష్ణము, ఎక్కుడ నున్నాఁడు

వేఁడికంటి. దే. శివుఁడు, ఉగ్రాక్షుఁడు

వేఁడిమి. దే. వెచ్చన, తాపము

వేఁడివెలుఁగు. దే. సూర్యుఁడు, ఉష్ణరశ్మి
వేఁడివేలుపు } దే. సూర్యుఁడు, అగ్ని
వేఁడివేల్పు
వేఁడు. దే. ప్రార్థించు, కోరు, యాచించు, ఎవఁడు
వేఁడుకొను } దే. ప్రార్థించు
వేఁడికొను
వేఁడుకోలు } దే. వేఁడుకొనుట
వేఁడికోలు
వేఁత. దే. ప్రేఁత
వేఁదుఱు. దే. ఉన్మాదము, ఉన్మత్తుఁడు, మూఢుఁడు, వెఱ్ఱి, వెఱ్ఱని
వేఁపి దే. కుక్క
వేఁపు. దే. వేఁచుట, వేఁపుడు, ప్రేఁపు
వేఁపుడు. దే. వేఁచుట, భర్జనము, వేచెడు చేట్టి, వేఁచినది
వేఁబోక. దే. వేగుఁబోక, వేకువ
వేకువ. దే. వేగజాము, ప్రభాతము
వేగ. త. వడి, త్వర, త్వరితము
వేగంటి. దే. ఇంద్రుఁడు, సహస్రాక్షుఁడు
వేగపడు. దే. త్వరపడు
వేగపాటు. దే. త్వరపడుట
వేగము. స. జవము, ప్రవాహము, త్వర, మలమూత్రాదిప్రవృత్తి, త్వరితము
వేగరి. దే. సమాచారము తెలుపువాఁడు, చారుఁడు
వేగి. స. గఱ్ఱము, వడిగలది
వేగించు. దే జాగారముచేయు
వేగిరకత్తె } త. త్వరగలది
వేగిరకత్తియ
వేగిరకాఁడు. దే. త్వరగలవాఁడు
వేగిరపడు త. త్వరపడు
వేగిరపాటు. త. వేగిరపడుట
వేగిరపెట్టు. దే. త్వరపఱుచు
వేగిరము. త. వేగము, త్వర, త్వరితము
వేగిరించు. త. త్వరపడు
వేగు. దే. ఉదయమగు, శుభోదయమగు, రాజ్యసమాచారము, చారుఁడు నిద్ర మేల్కొనియుండు
వేగుఁజుక్క. దే. శుక్రుఁడు
వేగుఁబోక. దే వేకువ
వేగుచూచు. దే. రహస్యముగా మర్మమును కనుఁగొను
వేగుజాము. దే. తెల్లవాఱుజాము
వేగురు. దే. వేయివంది
వేగురుఁజుక్క. దే. శుక్రుఁడు
వేగువాఁడు. దే. వేగులవాఁడు, చారుఁడు
వేచు. దే ఎదురుచూచు
వేచుంగులపాగ. దే. శేషుఁడు, సహస్ర ఫణుఁడు
వేటు. దే. ప్రేటు
వేట్లాడు. దే. కోట్లాడు
వేడబము. త. మాయ, వంచన, వేషము
వేడము త. మండలాగ్రము
వేడించు. త. చుట్టివచ్చు. పరివేష్టించు
వేడుక. దే. కుతూహలము,అభిలాష,సంతోషము, వినోదము, వినోదకార్యము
వేడుకకత్తె } దే. వేశ్య, జారిణి, వేడుకలయందాసక్తి గలది
వేడుకకత్తియ
వేడుకకాఁడు } దే. జారుఁడు, విటుఁడు, కుతూహలపరుఁడు, అపేక్షకుఁడు, క్రీడాసక్తుఁడు, వినోదకరుఁడు
వేడ్కకాఁడు
వేడుకజోదము. దే. కరిఖలము
వేడుకపడు } దే. కుతూహలపడు, అపేక్షించు
వేడ్కపడు

వేడుక సేయు } దే. అపేక్షపడు, అపేక్షించు
వేడ్క సేయు }

వేడెవెట్టు. దే. పరివేష్టింపఁజేయు

వేడెము. త. మండలగతి, వలయము

వేడ్క. దే. వేడుక

వేణి. స. అనేక ప్రవాహములయొక్క కూడిక, సర్పాకారముగ అల్లినజెడ, కాలువ

వేణిక. స. సర్పాకారముగ అల్లినజెడ

వేణుకము } స. మునికోల
వేణుగము }

వేణుధ్మఁడు. స. పిల్లంగ్రోవి యూదువాఁడు

వేణులావకుఁడు. స. మేదరవాఁడు

వేణువు. స. వెదురు, పిల్లంగ్రోవి

వేతనము. స. జీతము, కూలి, జీవనాధారము, నెలనెలకు విద్యార్థులకు చేయఁబడు ధనసాహాయ్యము

వేతని. స. వేతనము పొందువాఁడు

వేతసము. స. ఒకానొకతీఁగ, ప్రబ్బ

వేతస్వంతము. స. మిక్కుటమైన ప్రబ్బ చెట్లుగల దేశము

వేత్త. స. తెలిసినవాఁడు

వేత్రకటము. స. బెత్తములతో అల్లినచాఁప

వేత్రధరుఁడు. స. బెత్తమును చేతఁబట్టిన వాఁడు, కట్టిక

వేత్రము స. బెత్తము, పేముచెట్టు

వేత్రవతి. స. నదీవిశేషము, ద్వారపాలకురాలు

వేత్రాసనము. స. బెత్తపుపీఁట

వేత్రి. స. ద్వారపాలకుఁడు

వేదండము. స. ఏనుఁగు

వేదన. స. నొప్పి, తెలివి

వేదము. స. తొలుచదువులు, ఆదిశ్రుతులు, జ్ఞానము

వేదముఖ్య. స. పునుఁగుఁబిల్లి

వేదముఖ్యకము. స. కచోరము

వేదాంగములు స. వేదమునకు అంగభూతములగు కొన్ని గ్రంథములు

వేదాంతము. స. ఉపనిషత్తు, బ్రహ్మవిచారము

వేదాంతి. స. వేదాంతము తెలిసినవాఁడు, బ్రహ్మచారి

వేది. స యజ్ఞము మొదలగువానికై చేదరముగా నేర్పఱచినతిన్నె, తిన్నె, ముద్దుటుంగరము, విద్వాంసుఁడు, బ్రహ్మ, తెలిసినవాఁడు

వేదిక. స. తిన్నె

వేదు. దే. వికటగంధము, గంధము, వెగటు

వేదులు. దే. వెగటుమాటలు

వేద్యము. స. తెలియఁ దగినది

వేధ. స. బ్రహ్మ, విష్ణువు, విద్వాంసుఁడు

వేధము. స. తొలిపుచ్చుట, బొక్కపొడుచుట

వేధించు. స. తొలిపుచ్చు, బాధించు

వేధితము. స. తొలిపుచ్చఁబడినది, బాధింపఁబడినది

వేధ్యము. స. గుఱి, తొలిపుచ్చఁ దగినది

వేనలి. త. జెడ, కొప్పు, వెండ్రుక

వేనవేలు. దే. పెక్కువేలు

వేపథువు. స. కంపము, స్వరకంపము

వేపనము. స. వణఁకుట, కంపనము

వేపితము. స. కంపితము

వేమఁడు. దే. వేముఁడు, దేవుఁడు

వేమము. స. నేతపలక

వేమరు, వేమఱు, వేమారు, వేమాఱు } దే. అనేకసారులు, మాటిమాటికి

వేము. దే. వేఁపచెట్టు, నింబము

వేయంచులవాలుదే. విష్ణుచక్రము, శతారము

వేయి, వేయు } దే. సహస్రము

వేయించు. దే. వేఁగఁజేయు, వేయునట్లుచేయు

వేయిచేతులరెకిమీఁడు. దే. కార్తవీర్యార్జునుఁడు, సహస్రబాహువు

వేయిచేతులజేఁడు. దే. సూర్యుఁడు, సహస్రకరుఁడు

వేయు. దే. వైచు, దిగవిడుచు, ఉంచు ప్రయోగించు, ధరించు

వేరమి, వేరము } త. విరోధము

వేరు. దే. చెట్టుయొక్క మూలము, అన్యము

వేరుదన్ను. దే. వేరుపాతు [చెట్టు

వేరుపనస. దే. వేరునందుపండ్లుపండెడుపనస

వేరువిత్తు. దే. నాశకము, నాశకుఁడు

వేఱడము. దే. భేదము

వేఱీఁడి. దే. అవివేకి, పిచ్చివాఁడు, పిచ్చిది

వేఱీఁడించు. దే. అవివేకమొందఁజేయు

వేఱిమి. దే. భేదము, వేఱడము

వేఱు. దే. భేదము, అన్యము

వేఱుపడు, వేర్పడు } దే. భేదపడు

వేఱుపాటు, వేర్పాటు } దే. భేదము, విరోధము

వేఱుపుచ్చు. దే. వేఱుపడఁజేయు

వేఱుపోవు. దే. వేఱుపడు

వేఱుబందము. దే. వేఱుపాటు, భేదము

వేల. స చెలియలికట్ట, పొలిమేర, ఉప్పెన, రాజభోజనము, అనాయాసమరణము, వ్యాధి, బుధునిభార్య

వేలము. స. తోఁట

వేలము. త. వేడము, శిబిరము

వేలము, వేలాము } దే. పాటేలమీఁదనే వస్తువుయొక్క విలువగాని యెచ్చించుచు మిక్కిలి యెక్కువ వెలయిచ్చువానికి నియ్యఁబడునట్టి వస్తువుల బహిరంగవిక్రయము, ఘోషణపూర్వక ద్రవ్యవిక్రయము, ప్రకటనము

వేలాకూలము. స. సముద్ర తీరము

వేలాకోలము. దే. ఉన్మాదము

వేలార్చు. దే. పోఁగొట్టు

వేలిమి దే. హోమము

వేలిమికట్టియ, వేలిమికట్టె } దే. సమిధ

వేలిమిబొట్టు. దే. రక్షణమునకై నొసటఁబెట్టుకొను హోమభస్మము, రక్ష

వేలు. దే. వ్రేలు, వ్రేలాడు, ఈఁదులాడు

వేలుచు, వేల్చు } దే. హోమాగ్నియందు నేయి మొదలగువానిని సమర్పించు

వేలుపు, వేల్పు } దే. దేవత, దేవస్త్రీ, జ్యోస్యము

వేలుపుఁజెట్టు. దే. కల్పవృక్షము

వేలుపుఁబెరువు. దే. ఆకాశము

వేలుపుఁబెద్ద. దే. బ్రహ్మ, సురజ్యేష్ఠుఁడు

వేలుపుగమికాఁడు. దే. కుమారస్వామి, బ్రహ్మ

వేలుపుగాణ. దే. గంధర్వుఁడు

వేలుపుగిడ్డి. దే. కామధేనువు
వేలుపుజెడదారి. దే. నారదుఁడు
వేలుపుటేఱు } దే. గంగ
వేల్పుటేఱు }
వేలుపుటొజ్జ. దే. బృహస్పతి
వేలుపుదాయ. దే. అసురుఁడు
వేలుపుబానిస. దే. వేశ్య
వేలుపుబాస. దే. సంస్కృతము
వేలుపుబోనము. దే. అమృతము
వేలుపుమల. దే. మేరుపర్వతము
వేలుపుమానికము. దే. చింతామణి
వేలుపుఱేఁడు. దే. ఇంద్రుఁడు
వేలుపుసాని. దే. సోఁడె చెప్పునది
వేల్పుడు. దే. పూజ
వేల్లంతర. స. వెలుతురుచెట్టు
వేల్లజము. స. మిరియము
వేల్లనము. స. వేష్టనము,చలనము,పొర్లడము
వేల్లము. స. వాయువిడంగము
వేల్లితము. స. అశ్వగతివిశేషము, కదలింపఁబడినది, వంకరైనది
వేవిలి. దే. పొలము, దుస్సనిపొలము, వేవిళ్లు అనుదాని ఏకవచనము
వేవిళ్లు. దే. భక్షణవస్తువాంఛాతిశయరూపగర్భలక్షణవిశేషము, గర్భిణిస్త్రీయొక్క వాంత్యాదివికారములు
వేవు. దే. వేగు, తెల్లవఱు
వేవురు. దే. వేగురు, వేయిమంది
వేవెలుఁగు. దే. సూర్యుఁడు, సహస్రాంశువు
వేశంతము. స. నీళ్లుగలచిన్నపల్లము, పడియ
వేశనము. స. ప్రవేశించుట
వేశము. స. వేశ్యలవాడ, ఇల్లు, వేషము
వేశవారము } స. వంటసంబారము
వేసవారము }
వేశ్మము. స. ఇల్లు
వేశ్య. స. భోగముది
వేశ్యము. స. వేశ్యలవాడ
వేషగాఁడు. దే. వేషధారి, వేషమువేయువాఁడు, మోసగాఁడు
వేషము. స. వస్త్రభూషణాద్యలంకారము, కైసేఁత,స్త్రీలు మొదలైనవారివలె వేసెడు వేషము
వేషాలమారి. దే. మోసగాఁడు
వేషి. స వేషధారి [భాగము
వేష్టనము స.చుట్టుకొనుట,పాగ,చెవివెలుపలి
వేష్టము. స. చుట్టవెలుఁగు, చెట్టుబంక
వేష్టించు. స. చుట్టుకొను, వేడించు, బలయు
వేష్టితము. స. కొట్టమాట, హల్లీసకము,చుట్టుకొనఁబడినది
వేష్టువ. దే. దోవతి [కొనఁబడినది
వేసఁగి. త. వేసవి [ములు వేయువాఁడు
వేసగాఁడు. దే. స్త్రీలుమొదలైనవారివేష
వేసట. దే. అలపు, అలసట
వేసడము. దే. శ్యేనవిశేషము
వేసడము. త. కంచరగాడిద
వేసము. త. వేషము
వేసరము. దే. శ్రమము
వేసరము. స. కంచరగాడిద
వేసరి. దే. బాధకుఁడు
వేసరించు. దే. శ్రమపఱుచు
వేరుస } దే. శ్రమపడు, నొచ్చు, విసుగు, విచారముఁబొందు
వేసారు }

వేసవి. త. వేసఁగి, గ్రీష్మర్తువు, ఎండకాలము
వేస్ప్రము. దే. వేసడము
వేహత్తు. స. ఈచేకపోయినఆవు
వేళంకోళము. దే. పరిహాసము, ఎగతాళి
వేళ. స. సమయము, కాలము
వేళము. త. త్వరితముగ
వేళాకోళము. దే. చిక్కు, చిక్కైననది

## వై

వైకటికుఁడు. స. రత్నములు సానబెట్టెడి వాఁడు, నగలమ్మువాఁడు
వైకక్షకము } వైకక్ష్యకము } స. జేందెమువలెవేసికొనెడు పూవులదండ
వైకల్పికము. స. వికల్పముచేతఁ గలిగినది
వైకల్యము. స. వికలత్వము, వికలిత
వైకాటికుఁడు. స. నగలమ్మువాఁడు
వైకుంఠము స. విష్ణువుండెడు స్థానము
వైకుంఠుఁడు. స విష్ణువు, ఇంద్రుఁడు
వైకృతము. స. వికారము నొందినది
వైక్లబము } వైక్లబ్యము } స. కలవరము, దుఃఖము
వైక్రాంతము. స. వజ్రమువంటిరాయి
వైఖరి. స. వాక్యరూపమైన వాక్కు
వైఖానసుఁడు.స వానప్రస్థులలో నొకతెగ వాఁడు, విష్ణుదేవళములో నర్చకుఁడు
వైగుణ్యము. స. విగుణత్వము
వైగ్రాహికము. స. శరీరసంబంధమగునది
వైఘ స. ఒకానొక నది
వైచక్షణ్యము. స. విచక్షణత, నేర్పు
వైచిత్యము. స. దుఃఖము
వైచిత్రి. స. వైచిత్ర్యము
వైచిత్ర్యము. స. విచిత్రత
వైచే } వయిచే } దే. విసిరివేయు, పడవేయు
వైజననము. స. ప్రసవమగునెల
వైజయంతము. స. ఇంద్రునినగరు, ఇంద్రుని టెక్కెము
వైజయంతి. స. టెక్కెము, విష్ణుమాలిక
వైజయంతికుఁడు. స. టెక్కెము పట్టు వాఁడు
వైజయంతుఁడు స. కుమారస్వామి
వైజాత్యము. స. విజాతిత్వము
వైజ్ఞానికుఁడు. స. నేర్పరి
వైజోతి } వయిజోతి } త. ఒకతెగ కోమటిజాతి
వైజోతితొండ } వయిజోతితొండ } దే. ఊసరవెల్లి
వైడము. దే. వైళము
వైడూర్యము. స. విదూరదేశమునందుఁ బుట్టిన రత్నము
వైణవము. స. వెదురుబియ్యము
వైణవికుఁడు } వైణకుఁడు } స. పిల్లంగ్రోవి యూఁదు వాఁడు
వైణికుఁడు. స. వీణవాయించువాఁడు
వైతండికుఁడు స. వితండమాడువాఁడు
వైతంసికుఁడు. స. మృగపక్ష్యాదులను చంపి విక్రయించి జీవించువాఁడు
వైతత్యము. స. విశేషవిరివి
వైతథ్యము. స. అబద్ధము
వైతనికుఁడు. స. కూలికి పనిచేయువాఁడు
వైతరణి. స. నరకమునందుండెడియేఱు

వైతాళికుఁడు. స. మేలుకొలుపువాఁడు

వైదగ్ధి / వైదగ్ధ్యము } స. నేర్పు, విదగ్ధత

వైదర్భి. స. రీతివిశేషము, దమయంతి, రుక్మిణి

వైదికము. స. వేదమునందుఁ జెప్పఁబడినది

వైదికుఁడు. స. వేదము తెలిసిన బ్రాహ్మణుఁడు, బ్రాహ్మణులలో నొక తెగవాఁడు, లౌకికుఁడు కానివాఁడు

వైదుషి. స. పాండిత్యము

వైదుష్యము. స. విద్వాంసునితనము, పాండిత్యము తెలివి

వైదేశికుఁడు. స. అన్యదేశస్థుఁడు

వైదేహకుఁడు / వైదేహికుఁడు } స. బట్టువాఁడు, వర్తకుఁడు

వైదేహి. స. సీతాదేవి, వర్తకురాలు, గోరోజనము, పిప్పలి

వైద్యమాత స. అడ్డసరపుచెట్టు

వైద్యము. స రోగచికిత్సాశాస్త్రము, చికిత్స

వైద్యుఁడు స. చికిత్సకుఁడు

వైద్రుమము. స. పగడముతోఁ జేయఁబడినది

వైధనిక. స. రత్నమును దొలిపుచ్చెడిసూది, పిడిసాన

వైధర్మ్యము. స. భేదము

వైధవ్యము. స. విధవాత్వము, ముండమోపితనము

వైధవేయుఁడు. స. విధవయొక్కకొడుకు

వైధాత్రుఁడు. స వైద్యశాస్త్ర కర్తయగు సనత్కుమారుఁడను దేవర్షి

వైధేయుఁడు. స. మూర్ఖుఁడు, బుద్ధిహీనుఁడు

వైధ్రుతి. స ఒక గ్రహయోగము

వైనతేయుఁడు. స. గరుత్మంతుఁడు, అనూరుఁడు

వైనత్యము. స. వినయప్రవర్తన

వైనము / వయినము } త. వివరణము, ఉపాయము, కారణము, క్రమము, విధము

వైనాశికుఁడు. స. బానిసవాఁడు, జ్యోస్యుఁడు

వైనీతకము. స. తేరుమోకు, అనేకులు మోయునట్టి అందలము మొదలగునది

వైపరీత్యము. స. విపరీతత్వము, తడఁబాటు

వైపు / వయిపు } దే. తట్టు, ప్రక్క, ఒడుపు, ఉపాయము, భాగము

వైపుకాఁడు / వయిపుకాఁడు } దే. ఉపాయశాలి

వైపుల్యము. స. విరివి

వైఫల్యము. స. విఫలత్వము

వైబోధికుఁడు స. వేళకని పెట్టినిద్ర లేపువాఁడు

వైభవము. స. విభవము, ఐశ్వర్యము, మహిమము, గొప్పతనము

వైభాషికుఁడు. స. భాషాంతరముచేసెడివాఁడు

వైమత్యము. స. విమతభావము, అసహ్యము, అభిప్రాయభేదము

వైమనస్యము. స. విమనోభావము, అసహ్యము, పగ, స్నేహభంగము

వైమాత స. సవతితల్లి

వైమాత్రేయుఁడు. స. సవతితల్లికొడుకు

వైమానికుఁడు. స. విమానమెక్కి సంచరించువాఁడు

వైమాలము / వయిమాలము } దే. అధికము

వైముఖ్యము. స. విముఖత్వము

వైయగ్ర్యము. స. కలవరము

వైయర్థ్యము. స. వ్యర్థత్వము, నిరుపయోగము

వైయాకరణుఁడు. స. వ్యాకరణశాస్త్రము తెలిసినవాఁడు

వైయాఘ్రము. స. పులితోలుతో కప్పఁబడినరథము
వైయాత్యము. స దిట్టతనము, ధైర్యము, మోటుతనము
వైరంగికుఁడు. స. జితేంద్రియుఁడు
వైరనిర్యాతనము. స. పగతీర్చుకొనుట
వైరము. స. విరోధము
వైరవులు } దే కట్టెనిప్పు
వయిరవులు }
వైరశుద్ధి. స. పగతీర్చుకొనుట
వైరస్యము. స. విరసత్వము, వెగటు
వైరాగి. స. వైరాగ్యము గలవాఁడు, బైరాగి
వైరాగ్యము. స. విషయేచ్ఛారహితత్వము, విరక్తి
వైరారోహము. స. అంతకంతకు చేల మెచ్చెడి గొప్పయుద్ధము
వైరాలు } దే. కట్టెనిప్పు
వయిరాలు }
వైరి. స. శత్రువు
వైరించు. స. పగగొను
వైరూప్యము. స. విరూపత్వము
వైరోచనుఁడు. స. బలిచక్రవర్తి
వైల } దే. శ్యేనవిశేషము
వయిల }
వైలక్షణ్యము. స. విలక్షణత్వము, భేదము
వైలక్ష్యము. స. విస్మయాన్వితత్వము, చిక్కు, సిగ్గు, భేదము
వైలోమ్యము స. విలోమభావము, అనఁగా చివరనుండి మొదటికి చేదువుట మొదలైనది
వైవధికుఁడు స. కావడి మోసెడివాఁడు, చిల్లరో అంగడివాఁడు
వైవర్ణ్యము. స. వివర్ణత, వెల్లఁబాటు
వైవశ్యము. స. వివశత, వివశత్వము
వైవస్వతుఁడు. స. యముఁడు, ఒకమనువు, శనైశ్చరుఁడు
వైవాహికము. స. వివాహసంబంధమైనది
వైశద్యము. స. నేర్పు, స్పష్టత, స్వచ్ఛత
వైశసము. స. హాని
వైశాఖము. స. ఒకనెల, కవ్వము
వైశారద్యము. స. పాండిత్యము, నేర్పు
వైశాల్యము. స. విశాలత్వము, వెడల్పు
వైశికము. స. కపటము, భోగముతనము, భోగముదానిది, దూష్యము
వైశికుఁడు. స. బహువేశ్యోపభోగరసికుఁడు
వైశిష్ట్యము. స. సదాచారసంపన్నత్వము
వైశేషికము. స సప్తపదార్థములను చెప్పు నట్టితర్కశాస్త్రము
వైశేషికుఁడు. స. సప్తపదార్థములను చెప్పు నట్టి తర్కశాస్త్రము నెఱిఁగినవాఁడు
వైశేష్యము. స. ఆధిక్యత
వైశ్యుఁడు. స కోమటి, ఆర్యుఁడు
వైశ్రవణుఁడు. స. కుబేరుఁడు
వైశ్వదేవము. స. విశ్వదేవతలను గూర్చి చేసెడు హోమాది
వైశ్వానరుఁడు స. అగ్ని
వైషమ్యము. స. విషమత్వము, భేదము
వైషయికము స. విషయ సంబంధమైనది
వైష్ణవము. స. ఒకమతము, విష్ణు సంబంధమైనది
వైష్ణవి. స. ఒకమాతృక
వైష్ణవుఁడు. స. విష్ణుభక్తుఁడు
వైసారిణము. స. చేఁప
వైసిక } త. కపటము
వయిసిక }

వైస్వర్యము. స. విస్వరత్వము
వైహాయసము. స. విహాయససంబంధమైనది
వైహాసికుఁడు. స. హాస్యగాఁడు, వేషగాఁడు
వైహాళి. దే. పెద్దసభ, సందడి, విహారము
వైహాల్యము. స. అలసట, బలహీనము
వైళము } దే. శీఘ్రము, వేగము
వయిళము

# వో

వోఢ. స. తేరుగడపువాఁడు, మోపరి, కూలివాఁడు
వోఢజుఁడు. స. గర్భిణీస్త్రీని పెండ్లాడఁగాఁ గలిగిన కొడుకు
వోఢవ్యము. స. తీసికొని పోఁదగినది

# వ్య

వ్యంగము. కప్పు, అంగహీనుఁడు, పుట్టుమచ్చ
వ్యంగ్యము. స. వ్యంజనచేతఁ దెలియఁదగిన యర్థము
వ్యంజకము. స. అభినయము, వ్యంగ్యార్థమును దెలిపెడిశబ్దము, గుఱుతు
వ్యంజన. స. ఒకశబ్దవృత్తి
వ్యంజనము. స. కూర, అలుమగల గుఱి, గుఱుతు, మీసము, హల్లు
వ్యంజితము స. బయలుపఱుపఁబడినది
వ్యంసకుఁడు. స. మోసకాఁడు
వ్యంసయితవ్యము.స. మోసము చేయఁదగినది
వ్యక్తత. స. స్పష్టత
వ్యక్తము. స. తెల్లమైనది, తెలియఁ బడినది
వ్యక్తి. స. జాతికి వేఱై జాతికి ఆశ్రయమైనస్వరూపము, ఉనికి, దృశ్యము, స్పష్టత, భేదము, ఏకవస్తుబోధకము, జాతివ్యక్తులలో జాతికానిది
వ్యక్తుఁడు. స. తెలివిగలవాఁడు, విష్ణువు
వ్యక్తురాలు. స. తెలివిగలది
వ్యగ్రత. స. తొట్రుపాటు
వ్యగ్రుఁడు. స.వేగిరపడువాఁడు, ఒకట తగిలినమనసుగలవాఁడు, కలవరపడినవాఁడు
వ్యజనము. స. విసనకఱ్ఱ
వ్యడంబకము. స. ఆముదపుఁ జెట్టు
వ్యతికరము. స క్షోభము, వ్యసనము, పరస్పరమేళనము
వ్యతికీర్ణము. స. బాగుగా కలసినది
వ్యతిక్రమము. స. అక్రమము
వ్యతిరిక్తము. స. వేఱుపడినది, మాఱుపడినది
వ్యతిరేకము. స. వేఱు, మాఱు
వ్యతిషంగము. స. పరస్పరసంబంధము
వ్యతీపాతము. స. ఒక గ్రహయోగము, యుద్ధమున వెనుదీయుట, అత్యుత్పాతము
వ్యతీహారము. స. మార్పు
వ్యత్యయము. స. వ్యత్యాసము, తడఁబాటు
వ్యత్యస్తము. స. వ్యత్యాసపడినది, తడఁబడినది
వ్యత్యాసము. స. వ్యత్యయము, తడఁబాటు
వ్యథ. స. బాధ
వ్యథనము. స. బాధించుట
వ్యధము. స. తొలిపుచ్చుట
వ్యధితము స.బాధింపఁ బడినది,తొలిపుచ్చఁబడినది
వ్యధ్వము. స. చెడ్డత్రోవ
వ్యపగతము. స. పోయినది, అదృశ్యమైనది
వ్యపత్రము స సిగ్గులేనిది
వ్యపదిష్టము. స. చెప్పఁ బడినది
వ్యపదిష్టుఁడు. స. కార్యవంతుఁడు, ప్రయోజకుఁడు

వ్యపదేశము స. మిక్కిలికపటము, మోసము, చెప్పుట, పేరు, కీర్తి, తెలియఁబఱచుట, కుటుంబము, యుక్తి, మిష
వ్యపదేష్ట. స. మోసకాఁడు
వ్యపేక్ష స. కోరిక
వ్యపేతము. స. మిక్కిలి తొలఁగినది
వ్యపోహము. స. తోలివేయుట, నివారణము
వ్యభిచరించు. స. తప్పిచరించు, అంకుపోవు
వ్యభిచారము. స. తప్పిచరించుట, అంకు
వ్యభిచారి. స శృంగారభావవిశేషము, వ్యభిచరించువాఁడు
వ్యభిచారిణి. స. అంకుటాలు
వ్యయ. స. ఒక సంవత్సరము
వ్యయము. స. లగ్నమునకు పండ్రెండవ యిల్లు, వెచ్చము, క్షయము
వ్యయించు. స. వ్యయముచేయు, వెచ్చించు
వ్యయితము. స. వెచ్చింపఁబడినది
వ్యర్థము. స. ప్రయోజనములేనిది, వమ్ము
వ్యవకలనము. స. ఒకసంఖ్యలోనొకసంఖ్యను త్రోయుట
వ్యవకలితము. స. వ్యవకలనము చేయఁబడినది
వ్యవచ్ఛిన్నము. స. వ్యవచ్ఛేదము నొందినది
వ్యవచ్ఛేదకము. స. వేఱుచేయునది
వ్యవచ్ఛేదము. స. ఖండించుట, భాగించుట, తారతమ్యము
వ్యవధ స. కప్పు, మఱుఁగు
వ్యవధానము. స. అవకాశము, కప్పు, మఱుఁగు
వ్యవధి. స. మేర, వ్యవధానము
వ్యవసాయము. స. ప్రయత్నము, కృషి, పరిశ్రమ, పాటుబడుట, పట్టుదల, నిశ్చితబుద్ధి, చేపనిశ్చయించుకొనుట, పని, వృత్తి, వర్తకము, ప్రవర్తన, యుక్తి
వ్యవసాయి. స. వ్యవసాయముగలవాఁడు
వ్యవసితము. స. నిశ్చయము, వ్యవసాయము, అనుష్ఠింపఁబడినది, నిశ్చయింపఁబడినది, మోసపుచ్చఁబడినది
వ్యవస్థ. స. శాస్త్రనిరూపితనియమము, క్రమము
వ్యవస్థానము. స. ఏర్పాటు, నిశ్చయము
వ్యవస్థితము. స. వ్యవస్థచేయఁబడినది
వ్యవహరించు. స. వివాదముచేయు, వాడుకచేయు
వ్యవహర్త. స. న్యాయాధిపతి, వ్యవహరించువాఁడు
వ్యవహారకుఁడు. స. వ్యవహారము చేయువాఁడు, వర్తకుఁడు
వ్యవహారము. స. తగవు, న్యాయము, వాడుక, ఇచ్చిపుచ్చుకొనుట, ఉద్యోగము
వ్యవహారస్థుఁడు. స. పనిగలవాఁడు, అధికారి
వ్యవహితము. స. వ్యవధానముగలది
వ్యవహితుఁడు. స. దూరమున నున్నవాఁడు
వ్యవహృతి. స. పని, వాడుక
వ్యవాయము. స. తేజము, మఱుఁగు, గ్రామ్యధర్మము
వ్యవాయి. స. విషయాసక్తుఁడు
వ్యష్టి. స. ఒంటరితనము, ఒంటిపాటు, విభాగపడుట
వ్యసనము. స. ఆపద, కామక్రోధములవలనఁ బుట్టినదోషము, ఆసక్తి, పాపము, అపాయము, నిష్ఫలమైన ప్రయత్నము, చెడువాడుక, చింత, వేఱుచేయుట,

నష్టము, నాశము, శ్రద్ధ, నేరము, దండన, అసమర్థత

వ్యస్తము. స. వేఱుపడినది, వ్యాకులతc బొందినది, వ్యాపించినది

వ్యళీకము. స. అప్రియము, అకార్యము, అచ్చెరుపాటు, అసత్యము, బాధ, సిగ్గు, మోసపుచ్చుట, మన్మథావేశముచేc జేయcబడిన కామినీజనాపరాధము

# వ్యా

వ్యాకరణము. స. శబ్దశాస్త్రము, వాక్యవిభజన

వ్యాకీర్ణము. స. చెదరినది

వ్యాకులత. స. దుఃఖము, చింత

వ్యాకులము } స. కలcతనొందినది
వ్యాకులితము }

వ్యాకూతి. స. మోసము

వ్యాకృతి. స. వేఱుపఱచుట, విశదపఱచుట, భాషాంతరపఱచేట, వ్యాకరణము

వ్యాకోచము } స. వికసించినది
వ్యాకోశము }

వ్యాఖ్య. స. అర్థవివరణము

వ్యాఖ్యాత. స. వ్యాఖ్యానముచేసినవాcడు

వ్యాఖ్యాతము. స. వ్యాఖ్యానము చేయcబడినది, చెప్పcబడినది

వ్యాఖ్యానము. స. అర్థవివరణముచేయుట

వ్యాఘట్టనము. స. రాపిడి

వ్యాఘాతము. స. ఒక గ్రహయోగము, విఘ్నము, దెబ్బ

వ్యాఘూర్ణనము. స. తిరుగుడు

వ్యాఘూర్ణితము. స. తిరుగుడుపడినది

వ్యాఘ్రనఖము. స. పులిగోరు, పులిగోరు చెట్టు,భూషణవిశేషము,నఖక్షతవిశేషము

వ్యాఘ్రపాదము. స. ములువెలcగcజెట్టు

వ్యాఘ్రపుచ్ఛము. స. ఆముదపుcజెట్టు

వ్యాఘ్రము. స. పులి, పెద్దాముదపుcజెట్టు

వ్యాఘ్రాటము. స. భరద్వాజపక్షి

వ్యాఘ్రి. స. వాcకుడుచెట్టు, ఆcడుపులి

వ్యాజనింద. స. నిందారూపమగు స్తుతి, వ్యాజస్తుతి [మోసము

వ్యాజము. స. కపటము, చెడ్డతనము, మిష,

వ్యాజోక్తి. స. ఛలోక్తి

వ్యాజ్యెగాcడు. దే. వివాదపడినవాcడు

వ్యాజ్యెమాడు. దే. వివాదపడు

వ్యాజ్యెము. దే. వివాదము, తగవు

వ్యాత్తము. స. తెఱువcబడినది, తెఱచిన నోరు

వ్యాదనము. స. తెఱచుట

వ్యాధి. స. తెవులు, చెంగల్వకోష్టు

వ్యాధిఘాతము. స. జేలచెట్టు [గొంటు

వ్యాధితుcడు స. వ్యాధిగలవాcడు, తెవులు

వ్యాధుcడు. స. బోయవాcడు, దుష్టుcడు

వ్యానము. స. శరీరమంతట వ్యాపించిన పంచవాయువులలో నొకటి

వ్యాపకుcడు. స. వ్యాపించువాcడు,విశేషము పనిగలవాcడు, చోరవగలవాcడు

వ్యాపనము. స. వ్యాపించుట

వ్యాపనీయము. స. వ్యాపింపcదగినది

వ్యాపాదనము. స. చంపుట, ద్రోహము తలcచుట

వ్యాపాదము. స ద్రోహపుతలcపు, నాశము, మరణము

వ్యాపాదితము. స. చంపcబడినది, ద్రోహము తలcపcబడినది

వ్యాపారము. స. పని, ఉద్యోగము, వర్తకము, వృత్తి, యత్నము
వ్యాపారి. స. మాధ్వుఁడు, వ్యాపారము గలవాఁడు
వ్యాపి. స. వ్యాపించేవాఁడు
వ్యాపించే. స. అంతట ప్రసరించే, నెరయు
వ్యాపృతి. స. వ్యాపారము
వ్యాపృతుఁడు.స.వ్యాపారమునొందినవాఁడు
వ్యాప్తము. స. వ్యాపించినది, ప్రసిద్ధికెక్కినది, పొందఁబడినది
వ్యాప్తి స వ్యాపించేట, ప్రసిద్ధికెక్కుట, పొందుట
వ్యాప్యము. స. చెంగల్వకోష్టు, వ్యాపింపఁదగినది
వ్యామము. స. బార, పొగ
వ్యామోహము. స. అత్యంత మోహము
వ్యాయతము. స. దృఢమైనది, దీర్ఘమైనది, అధికమైనది, వ్యాపారముగలది
వ్యాయామము. స. శ్రమము, సంచారము, సాము, బార, నిలుపు, ఉద్యోగము, పని
వ్యాయామి. స.శరీరసాధకముచేయువాఁడు
వ్యాయోగము. స. నాటకవిశేషము
వ్యాలీఢము. స. కూడుకొన్నది, కలిసినది
వ్యాలోలము. స. మిక్కిలి చలించేనది
వ్యావర్తనము. స. వెనుకకు మరలుట,చేట్టుట
వ్యావలనము. స. చలనము
వ్యావహారికము. స. వాడుక, ఉపయోగము
వ్యావహారికుఁడు. స. మంత్రి, వ్యవహారము తెలిసినవాఁడు
వ్యావృతము. స. వెనుకకు మరలినది, చేట్టఁబడినది
వ్యావృతి. స. కొఱవిడయ్యము
వ్యావృత్తము. స. వెనుకకు మరలినది, చేట్టఁబడినది

వ్యావృత్తి. స. మఱుగుపఱచేట, వేఱుచేయుట, లేకపోవుట, వెనుకకుదొర్లుట, స్తోత్రము
వ్యాసంగము. స. మిక్కిలి ఆసంగము, విద్యాకృషి, అతిశ్రద్ధ
వ్యాసక్తుఁడు. స. మిక్కిలి ఆసక్తిగలవాఁడు
వ్యాసఘట్టము. స. భారతములో నతికఠినము గానుండు పట్టు, అసాధ్యముగా నుండునది
వ్యాసము. స. విరివి, వృత్తముయొక్క అడ్డకొలఁత, ఏదేని యొకవిషయమును విరివిగా వ్రాయుట
వ్యాసుఁడు. స. పరాశరునికొడుకు
వ్యాసేధము. స. అడ్డి, ఆటంకము
వ్యాహతము. స. మిక్కిలికొట్టఁబడినది, వ్యర్థమైనది
వ్యాహారము. స. వచనము, పలుకు
వ్యాహృతము. స. వచింపఁబడినది, పలుకఁబడినది
వ్యాహృతి. స. వ్యాహారము, ఓమ్ అను మంత్రవిశేషము
వ్యాళగ్రాహి } స. పాములవాఁడు
వ్యాళగ్రాహుఁడు }
వ్యాళము } స. పాము, పులి, తులువయేనుఁగు, క్రూరమైనది
వ్యాడము }
వ్యాళాయుధము. స. పులిగోరుచెట్టు
వ్యాళి. స. పెంటిసర్పము

## వ్యు

వ్యుత్క్రమము. స. క్రమ విపర్యయము
వ్యుత్థానము. స. అడ్డపాటు, సమాధినుండి మరలుట, ప్రతికూలప్రవర్తనము, స్వాతంత్ర్యము

వ్యుత్పత్తి. స. శాస్త్రాదిజన్యపరిజ్ఞానము, శబ్దసంభవప్రకారము, పాండిత్యము

వ్యుత్పన్నుఁడు. స. శాస్త్రాదిజన్యపరిజ్ఞానము కలవాఁడు

వ్యుత్పాదకము. స. వ్యుత్పత్తిని కలిగించునది

వ్యుదితము. స. చర్చింపఁబడినది

వ్యుషితము. స. వేలిది, వేల్ది

వ్యుష్టము. స. వేకువ, వేగినది

వ్యుష్టి. స. ప్రయోజనము, సమృద్ధి

## వ్యూ

వ్యూఢము. స. వ్యూహముగా నుంచేఁబడిన సేన, ఉంచేఁబడినది, దట్టమైనది, విశాలమైనది

వ్యూతి. స. నేయుట, నేఁత

వ్యూహము. స. మిక్కిలి ఊహ, మొగ్గరము, సమూహము, రచన

## వ్యో

వ్యోకారుఁడు. స. ఇనుము చేయువాఁడు, కమ్మరవాఁడు

వ్యోమకేశుఁడు. స. శివుఁడు

వ్యోమము. స. ఆకాశము, జలము

వ్యోమయానము. స. విమానము

వ్యోషము. స. త్రికటుకము

## వ్ర

వ్రంత. దే. ఏఱు, పల్లము, చిన్నకాలువ

వ్రక్క. త. తునుక

వ్రక్కలించు. త. వ్రక్కలుచేయు, భేదించు

వ్రక్కలింత. త. భేదనము

వ్రక్కవాయు. దే. తెగు

వ్రక్కవాఱు. దే. వ్రక్కయగు, చీలు, భేదిల్లు

వ్రచ్చు. త. చీల్చు, భేదించు

వ్రజకుఁడు. స. భిక్షుకుఁడైన సన్యాసి

వ్రజనము స. పోవుట, ప్రయాణము

వ్రజము. స. పశువులమంద, పశువులకొట్టము, సమూహము, త్రోవ

వ్రజ్య. స. భిక్షములోనగువానికొఱకుతిరుగుట, ప్రయాణము, ఒకతెగ

వ్రణము. స. గాయము, కుఱుపు, కిణము

వ్రతకల్పము. స. వ్రతములను గుఱించిన పుస్తకము

వ్రతతి. స. తీఁగ, విరివి

వ్రతము. స. ఉపవాసాదిపుణ్యకర్మము, నోము

వ్రతి. స. యజ్ఞముచేయువాఁడు, వ్రతము గలవాఁడు

వ్రప్పు. త. చీలిక

వ్రయ్య. త. వ్రక్క, ఖండము

వ్రయ్యఁబడు, వ్రయ్యవాఱు } త. వ్రయ్యు, భేదిల్లు

వ్రయ్యు. త. బ్రద్దలగు, చీలు

వ్రశ్చనము. స. భేదము, ఆకుఱాయి

## వ్రా

వ్రాఁకుడు. త. వాఁకుడు మొక్క

వ్రాఁత. దే. వ్రాయుట, లేఖనము

వ్రాఁతకాఁడు. దే. వ్రాయువాఁడు, లేకరి

వ్రాఁతచోపడి. దే. వ్రాసెడుచోటు, గ్రంథకుటి

వ్రాఁతపని. దే. రంగువేయువాఁడు, వస్త్రములయంచేలయందు రంగుతో వ్రాసెడు చిత్రము, వ్రాయుపని

వ్రాఁతబల్ల. దే. వ్రాఁతకాండ్రు కాగితము లుంచుకొని వ్రాయుపలక లోనగునది

వ్రాఁతసాకిరి. దే. సాక్షిసంతకము చేసినవాఁడు, లిఖితుఁడు

వ్రాతము. స. సమూహము

వ్రాత్యుఁడు. స. ఉపనయనాదిసంస్కారము లేని ద్విజుఁడు

వ్రాయసకాఁడు. దే. లేకరి, లేఖకుఁడు

వ్రాయసము. దే. వ్రాఁత, జాబు [బొట్టు

వ్రాయి. దే. అక్షరము, రేఖ, పాచికమీఁది

వ్రాయు. దే. లిఖించు

వ్రాలు. దే. పక్షిక్రిందికిదిగు, ఒఱగు,మీఱు, తగ్గు, అక్షరములు, సంతకము

వ్రాలుచు / వ్రాల్చు } దే. వ్రాలఁజేయు

## వ్రీ

వ్రీడ. స. సిగ్గు

వ్రీలు. దే. చీలు

వ్రీలుపడు. దే. దౌర్బల్యముఁ బొందు

వ్రీహి. స. వడ్లు, ఎఱ్ఱవడ్లు

## వ్రే

వ్రే. దే. గొల్లకులము

వ్రేఁకటి. దే. వేఁకటి, గర్భము

వ్రేఁకన. దే. భారము

వ్రేఁకము. దే. వ్రేఁగు, భారము

వ్రేఁగు. దే. వేఁగు, భారము

వ్రేఁగుపడు. దే. భరపడు

వ్రేఁచు. దే. వ్రేఁగఁజేయు, వేఁచు

వ్రేఁడు. దే. గొల్లవాఁడు

వ్రేఁత. దే. వ్రేయుట, దెబ్బ

వ్రేఁపు. దే. వేఁపుడు, వేఁడు

వ్రేఁపుడు. దే. వేఁపుడు

వ్రేటు. దే. వ్రేయుట, దెబ్బ

వ్రేటుకొను. దే. కొట్టు

వ్రేత. దే. గొల్లది

వ్రేపల్లె / వ్రేపల్లియ } దే. గొల్లపల్లె, ఘోషము

వ్రేయు. దే. కొట్టు, నఱకు

వ్రేలఁబడు. దే. వ్రేలాడు

వ్రేలాడు. దే. వ్రేలు [అంగుళము, వేలు

వ్రేలు. దే. వ్రేలాడు, మునుఁగు, అంగుళి,

వ్రేలుకాడు. దే. వ్రేలాడు

వ్రేలుచు / వ్రేల్చు } దే. వ్రేలఁజేయు, కడుగు

వ్రేలుడు. దే. వ్రేలాడినది, లంబితము

వ్రేలుమిడి / వ్రేల్మిడి } దే. చిటిక, త్రుటి

వ్రేల్మి. దే. వేలిమి, హోమము

వ్రేల్మిడుచు. దే. చిటికవేయు

## వ్రై

వ్రైహేయము. స. వ్రీహిపండఁదగినభూమి

## శ

శ. ఒక యక్షరము [రము, ఆక్షేపము

శంక. స. సందేహము, భయము, విచా

శంకనీయము. స. సందేహింపఁదగినది
శంకరాభరణము. స. రాగవిశేషము
శంకరుఁడు. స. శివుఁడు, సుఖమునుగలుగఁ జేయువాఁడు [మలవిసర్జనము
శంకానివృత్తి. స. సందేహవిమోచనము,
శంకించు } స. సందేహించు, భయపడు
శంకిల్లు }
శంకితుఁడు. స. సందేహముఁబొందినవాఁడు, భయపడినవాఁడు
శంకుల. స. పోఁగొత్తు, ఉలి
శంకువు. స. మోడు, మేకు, నీరుపంది, సంఖ్యావిశేషము, బల్లెము, స్తంభము, గుండుసూది, గూటము, బాణపుములికి
శంఖక్షీరము. స. అసాధ్యము, శూన్యము
శంఖచరి. స. చేరుచుక్క
శంఖనఖము. స. నత్తగుల్ల
శంఖపాణి. స. విష్ణువు
శంఖపాలకులు. స. సర్పవిశేషము
శంఖము. స. సంకు, నొసటియెముక, నిధివిశేషము
శంఖిని. స. కట్లతీఁగ, స్త్రీజాతివిశేషము
శంఠుఁడు. స. నపుంసకుఁడు
శంప } స. మెఱపు, శంఖధ్వని
సంప }
శంపాకము. స. జేలచెట్టు
శంబము } స. వజ్రాయుధము, రోఁకలి మొదలగువానిపొన్ను సుఖముగలది [జింక
సంబము }
శంబరము. స. జలము, చేఁప, ఎఱ్ఱని చిన్న
శంబరారి. స. మన్మథుఁడు
శంబరి. స. మాయ, గారడీ, గారడీ విద్య చేయుస్త్రీ, ఎలుకజీడిమొక్క
శంబరుఁడు. స. ఒకరాక్షసుఁడు
శంబలము } స. దారిబత్తెము,మాత్సర్యము, తీరము
సంబలము }
శంబళి. స. కుంటెనకత్తె
శంబాకృతము } స. రెండుచాళ్లు దున్నిన నేల
సంబాకృతము }
శంబుఁడు. స. సౌఖ్యవంతుఁడు
శంబువు. స. వజ్రాయుధము,రోఁకటిపొన్ను
శంబూకము } స. కప్పచిప్ప, నూక, ఏనుఁగు కుంభస్థలము కడచోటు
శంబుకము }
శంభళి. స. కుంటెనకత్తె
శంభువు. స. శివుఁడు, విష్ణువు, బ్రహ్మ
శంస. స. మాట, స్తోత్రము, ఇచ్ఛ [చేట
శంసనము. స చెప్పుట, స్తుతించుట, ఇచ్ఛిం
శంసితము. స. చెప్పఁబడినది, స్తుతింపఁబడినది, ఇచ్ఛింపఁబడినది
శంస్త స. స్తోత్రముచేయువాఁడు
శకటము స. బండి
శకటిక. స. చిన్నబండి [త్సరము,ఒకదేశము
శకము. స. ఒకనిపరిపాలనతో చేరినసంవ
శకలము. స. చెట్టుమీఁదిపట్ట,నార,ఖండము
శకలితము. స. ముక్కలుగాఁ జేయఁబడినది
శకారుఁడు. స రాజుంచుకొన్నస్త్రీయొక్క సోదరుఁడు
శకుంతము } స. పక్షి
శకుంతి }
శకుటము. స. ఆడవిచేమ [పక్షి
శకునము. స. శుభసూచకనిమిత్తము, వలను

శకుని. స. నల్లపిచ్చుక, పక్షి, ఒకకరణము, దుర్యోధనుని మేనమామ
శకులము. స. మత్స్యవిశేషము
శకులాక్షకము. స. తీఁగగఱిక
శకులాదని. స. కటుకరోహిణి
శకులార్భకము. స. కుచ్చేమీను
శకులి } స. చేఁప
శకిలి
శకృత్కరి. స. ఏఁడాదిలోనిదూడ
శకృత్తు. స. మలము
శక్తత స. బలము, సామర్థ్యము
శక్తి. స. బలిమి, పార్వతి, చిల్లకోల, ఇచ్ఛాది, ఉత్సాహాది, సత్త్వాది, వసిష్ఠునికొడుకు, సహాయము, బల్లెము, పరాశరునితండ్రి, సామర్థ్యము
శక్తిధరుఁడు. స. కుమారస్వామి
శక్తుఁడు. స. శక్తిగలవాఁడు
శక్యము. స. అలవి, సాధ్యము
శక్రధనువు. స. ఇంద్రాయుధము
శక్రపాదపము. స. దేవదారువృక్షము
శక్రపుష్పి. స వెన్నవెదురుకూర
శక్రవల్లిక. స బుడ్డకాఁకరచెట్టు
శక్రుఁడు. స. ఇంద్రుఁడు
శక్వరి. స. ఒకఛందస్సు, ఏఱు, ఒడ్డాణము
శచి. స. ఇంద్రునిభార్య, పిల్లపీఁచరమొక్క
శచీపతి. స. ఇంద్రుఁడు
శఠన. స అసూయ
శఠము స. మూర్ఖము, మోసము
శఠించు. స. మోసముచేయు, దూషించు
శఠుఁడు. స. ఒకానొకనాయకుఁడు, మధ్యస్థపురుషుఁడు, కుత్సితుఁడు, మోసకాఁడు
శణపర్ణి. స. సోమిదపుచెట్టు
శణపుష్పి. స. పచ్చజేనము
శణపుష్పిక. స. గిలకచెట్టు, కారుజేనము
శణము. స. జేనము, బాణము
శణసూత్రము. స. జనపనారతోనల్లినత్రాడు
శతకము. స. నూఱుపద్యములుకలగ్రంథము, నూఱుసంఖ్యగలది
శతకోటి. స. వజ్రాయుధము, నూఱుకోట్లు
శతగ్రంథి. స గఱికగడ్డి
శతఘ్ని. స. ఫిరంగి, ఇనుపముండ్లకఱ్ఱ, కానుగుచెట్టు
శతద్రువు. స. ఒకానొకనది
శతధృతి. స. బ్రహ్మ, ఇంద్రుఁడు
శతపత్త్రము. స. తామర, నెమిలి, బెగ్గురుపక్షి, రాచిలుక
శతపది. స. కట్లజెఱ్ఱి, చెవిచోరుపాము, రోఁకటిబండ
శతపర్వ. స. శుక్రునిభార్య
శతపర్వము. స. వెదురు, ఒకదినుసుచెఱకు
శతపర్విక స. గఱికమొక్క, వసచెట్టు
శతపుష్ప. స. సదాపచెట్టు
శతప్రాసము. స. గన్నేరుచెట్టు
శతభిషము. స. ఒకనక్షత్రము
శతమన్యువు. స. ఇంద్రుఁడు
శతమానము. స. పలము, కర్షద్వయము, నూటికొలఁది, తాలిబొట్టు
శతము. స. నూఱు, వంద
శతమూలి. స. పిల్లపీఁచరమొక్క
శతవీర్య. స. తెల్లగఱిక
శతవేధి. స. పుల్లప్రబ్బచెట్టు
శతహ్రద. స. మెఱపు, వజ్రాయుధము

శతాంగము. స. రథము
శతానందము. స. విష్ణురథము
శతానందుఁడు. స. బ్రహ్మ, విష్ణువు
శతానీకుఁడు. స. ముసలివాఁడు
శతాబ్దము. స. నూఱుసంవత్సరములకాలము
శతారము. స వజ్రాయుధము
శతావధాని. స. ఏక కాలమందు నూఱంశ
ములను గమనింపఁగలవాఁడు
శతావరి. స. పిల్లపీఁచర, శచీదేవి
శతాహ్వాయ. స. పెద్దసదాపచెట్టు
శత్రువు. స. పగవాఁడు
శని. స. శనైశ్చరుఁడు
శనివారము. స. ఒకవారము
శనైశ్చరుఁడు. స. శని, ఒకగ్రహము
శపథము } స. ఒట్టు, ప్రతిజ్ఞ, శాపము
శపనము }
శపము. స. శాపము, తిట్టు, ఒట్టు
శపించు. స తిట్టు, శాసించు
శప్తము. స. ఒట్టుపెట్టఁబడినది, నిందింపఁబడినది
శఫము. స. గుఱ్ఱము లోనగువానిగొరిసె, చెట్టు
వేరు
శఫరి } స. ఎగిసిపడెడు మత్స్యము
శఫరము }
శబరాలయము. స. బోయపల్లె
శబరి. స. శబరస్త్రీ, చెంచుది
శబరుఁడు. స. ఆకులుకట్టుకొనియడవియందు
తిరిగెడుబోయవాఁడు, శివుఁడు
శబలము. స చిత్రవర్ణము
శబలి. స. మైలవన్నెయావు
శబ్దగ్రహము. స చెవి

శబ్దనుఁడు. స. శబ్దించువాఁడు
శబ్దపతి. స. నామమాత్రమున అధిపతిగా
నుండువాఁడు
శబ్దము. స. ధ్వని. వ్యాకరణశిక్షితమైనమాట
శబ్దశాస్త్రము. స. వ్యాకరణము
శబ్దించు. స. శబ్దముచేయు, మ్రోయు
శబ్దితము. స. శబ్దముచేయఁబడినది
శమంతకము. స. విష్ణుహస్తమునందలి మణి
శమథము. స. శాంతి
శమథుఁడు స. మంత్రి
శమనపురి. స. నరకము
శమనము. స. శాంతి, వధము, బాధతగ్గుట
శమనస్వస. స. యమునానది
శమని. స. రాత్రి
శమనుఁడు. స. యముఁడు
శమము. స. కామక్రోధాదులులేక యడఁగి
[యుండుట, శాంతి
శమలము. స. పురీషము
శమి. స. జమ్మిచెట్టు, పెసలు లోనగువాని
పైపొట్టు, శమముగలవాఁడు
శమించు. స. అడఁగు, శాంతించు, తగ్గు
శమితము. స. శమించినది [ధాన్యము
శమీధాన్యము. స. పెసలుమొదలైన కాయ
శమీరము. స. నేలజమ్మిచెట్టు
శమ్యా. స. యజ్ఞపాత్రవిశేషము, గసిక
శమ్యాకము. స. రేలచెట్టు, ఆరగ్వధవృక్షము
శయనము. స. శయ్య, నిద్ర, సురతము
శయనించు. స. పరుండు, పండుకొను
శయనీయము. స. శయ్య, శయనింపఁదగినది
శయము. స. చేయి, శయ్య, పాము
శయాళువు. స. కుక్క, నక్క, కొండచిలువ,
నిదురపోతు

శయించే. స. శయనించే
శయితుఁడు. స. నిదురపోతు
శయువు. స. పెనుఁబాము, తూముకాలువ
శయ్య. స. పడక, పదగుంఫనము, విధము
శరండము. స. సరడు, తొండ
శరండుఁడు. స. జోదరి
శరజన్ముఁడు. స. కుమారస్వామి, జెల్లుచూలి
శరణము. స. రక్షకము,రక్షణము,గృహము, వధము, రక్షకుఁడు
శరణాగతుఁడు. స. శరణుఁచొచ్చినవాఁడు
శరణీయుఁడు. స. శరణుఁచొరఁదగినవాఁడు, శరణ్యుఁడు
శరణు. స. రక్షకము, శరణాగతి, నమస్కారము
శరణుఁడు. స. రక్షకుఁడు
శరణుఁచొచ్చు. స. శరణాగతిని బొందు
శరణ్యుఁడు. స వాయువు, శరణుఁచొరఁదగినవాఁడు

శరత్తు } స. ఒకఋతువు, సంవత్సరము
శరద }

శరధి } స. సముద్రము, అమ్ములపొది
శరనిధి }

శరభము. స. మిాగండ్లమెకము, ఒంటెపిల్ల
శరము. స. బాణము, జెల్లు, జలము, మీఁది పెరుఁగు
శరవణోద్భవుఁడు. స. కుమారస్వామి
శరవ్యము. స. గుఱి, లక్ష్యము
శరారి. స. జలపక్షివిశేషము
శరారువు. స. చెంపునది, ఘాతుకము
శరావతి. స. నదీవిశేషము
శరావము. స. మూఁకుడు

శరాసనము } స. విల్లు
శరాసము }

శరీరజము. స. వ్యాధి, వలపు
శరీరజుఁడు స. కుమారుఁడు
శరీరదండము. స శరీరదండనము
శరీరము. స. దేహము, బలము,మృతశరీరము
శరీరయాత్ర. స. జీవనాధారము
శరీరవైకల్యము. స. రోగము
శరీరి. స. జంతువు, శరీరముకలవాఁడు
శర్కర. స. చెక్కెర, మొరము, మొరపనేల, పెంచిక, వ్రయ్య
శర్కరాంకము. స. తియ్యనిమ్మ
శర్కరిలము. స. మొఱపఁబాళ్లుగలనేల
శర్ధనము. స. అపానవాయువువిడుచుట
శర్ధించే. స. అపానవాయువువిడుచే
శర్మ. స. బ్రాహ్మణులపట్టుపేరు
శర్మము. స. సంతోషము, బ్రాహ్మణుల పట్టుపేరు
శర్వరి. స. రాత్రి, పసుపు, ఆఁడుది
శర్వాణి. స. పార్వతి
శర్వుఁడు. స. శివుఁడు
శలకము. స. సాలెపురుగు
శలభము. స. మిడుత

శలము }
శలలము } స. ఏదుపంది, ఏదుపందిముల్లు
శలలి }

శలాక. స. గొడుగులోనగువాని కమ్మి, కొడుపు, బాణము, ఏదుపంది, ఎముక, సన్ననిలోహపుకడ్డీ
శలాటువు. స. ఒకదినుసుపేరు, పండని కాయ, కాయ

శల్కము. స. ఖండము, నార, చేఁపమీఁది పొలుసు

శల్యకము. స. వరాహవిశేషము

శల్యము. స. ఎముక, బాణము, సలాక, విషము, మేకు, చిల్లకోల, ఏదుపంది, మంగచెట్టు, ఈఁటె, ముల్లు, గసిక, శరీరములో గ్రుచ్చుకొని బాధించుచున్న ఇతరపదార్థము, విశేషదుఃఖకారణము, ఆపద, పాపము, నింద

శల్యుఁడు. స. ఒకరాజు

శల్లకి, సల్లకి } స. ఏదుపంది

శవము. స. జలము, పీనుఁగు

శశకము, శశము } స. కుందేలు, బోళము, లొద్దుగుచెట్టు

శశధరుఁడు, శశి, శశాంకుఁడు } స. చంద్రుఁడు

శశాంకము. స. పచ్చకర్పూరము

శశాదనము. స. డేగ

శశోర్ణము. స. కుందేటిత్రుప్పటితో నేయఁబడిన కంబళి

శశ్వత్. స. ఎల్లప్పుడు, శాశ్వతముగ, తిరిగి తిరిగి

శష్కులి. స. చెక్కిలము, బయటిచెవి

శష్పము. స. లేఁతకసవు, నల్లగఱిక, ప్రతిభాహాని, అధఃకేశము

శసనము. స యజ్ఞమునందలి పశువధము, ప్రోక్షణము

శస్తము. స. శుభము, శుభకరమైనది, శ్రేష్ఠమైనది, స్తుతింపఁబడినది

శస్త్రకర్మ. స. వ్రణాదులను కోయుపని

శస్త్రమార్జుఁడు. స. ఆయుధములను కడుగువాఁడు, సానపెట్టువాఁడు

శస్త్రము. స. ఆయుధము, ఇనుము, వ్రణచికిత్సచేసెడి యాయుధము, వ్రణము లోనగువానిని కోయుట

శస్త్రవైద్యుఁడు. స. వ్రణచికిత్సకుఁడు

శస్త్రాజీవుఁడు. స. ఆయుధములచేత బ్రదుకువాఁడు, ఆయుధీయుఁడు, శస్త్రజీవి

శస్త్రి. స. చురకత్తి, శస్త్రమును ధరించువాఁడు

## శా

శాంకరి. స. కుమారస్వామి, వినాయకుఁడు, అగ్ని

శాంఖికుఁడు. స. సంకుపూసలు మొదలగునవి చేసి యమ్మెడువాఁడు, శంఖము నూఁదువాఁడు

శాండిల్యము. స. మారేడుచెట్టు

శాండిల్యుఁడు. స. ఒకముని

శాంతము. స. ఒకరసము, శాంతిబొందినది, ఓర్పు

శాంతి. స. కామక్రోధాదిరాహిత్యము, శమము, ఓర్పు, క్రూరగ్రహాదులకు ఉపశమనముగాఁ జేయుకర్మ

శాంతించు. స. శాంతిఁబొందు

శాంబరి. స. మాయ, రతీదేవి, గారడీ

శాంభవి. స. పార్వతి, నల్లగఱిక

శాకటము. స. బండియెద్దు, బండిపని

శాకటికుఁడు. స. బండివాఁడు

శాకము. స. కూర, టేఁకుచెట్టు, ఒకద్వీపము, శక్తి

శాకినము. స. శాకములు పండుపొలము
శాకిని. స. పిశాచస్త్రీభేదము, పెరుఁగుతోఁట కూర
శాకునము.స. శకునశాస్త్రము, శకునసంబంధమైనది
శాకునికుఁడు. స. పక్షులవేఁటకాఁడు
శాకులికుఁడు } స. చేఁపలను పట్టువాఁడు
శాఫరికుఁడు }
శాక్కరము. స. ఎద్దు
శాక్తీకుఁడు. స. శక్త్యాయుధమునుధరించినవాఁడు
శాక్తుఁడు. స. శక్తిమతప్రవర్తకుఁడు
శాక్తేయుఁడు. స. దుర్గపూజచేయువాఁడు
శాక్యముని } స. శాక్యబుద్ధదేవుఁడు
శాక్యసింహుఁడు }
శాక్వరము. స. ఎద్దు
శాఖ. స. చెట్టుకొమ్మ, వేదభాగము, చేయి, భాగము, తెగ
శాఖాదండుఁడు. స. అన్యశాఖాపారకుఁడు
శాఖానగరము. స. ఉపనగరము, పేఁట, పాలెము
శాఖామృగము. స. కోఁతి
శాఖి. స. వృక్షము, వేదము, తురక, అంతర్భాగములు గలది
శాటి } స యతులులోనగువారివస్త్రము, దుప్పటి
శాటిక }
శాఠ్యము. స. శఠత్వము, కపటము
శాణము } స. సానఱాయి, నాలుగుమాషములయెత్తు
శాణి }
శాణికుఁడు, స. సానపెట్టువాఁడు
శాణితము. స. సానపెట్టఁబడినది
శాతకుంభము. స బంగారు, ఉమ్మెత్తచెట్టు
శాతము } స. సుఖము, వాఁడిచేయఁబడినది, కృశించినది
సాతము }
శాతోదరి.స.కృశించినకడుపుగలస్త్రీ,ఆఁడుది
శాత్రవము. స. శత్రుత్వము, శత్రుసమూహము
శాత్రవుఁడు. స. శత్రువు
శాదము. స. లేఁతపచ్చిక, అడుసు
శాద్వలము } స. లేఁతపచ్చికకలదేశము
శాడ్వలము }
శానము. స. స్వర్ణచ్ఛేదనసాధనవిశేషము
శాపగ్రస్తుఁడు. స. శాపమునొందియున్నవాఁడు
శాపము. స. తిట్టు, ఒట్టు
శాపించే స. శపించే
శాబకము } స. శిశువు, పిల్ల, కూన
శాబము }
శాబరము. స. లొద్దుగుచెట్టు, శబరసంబంధమైనది
శాబ్దము. స. శబ్దసంబంధమైనది
శాబ్దికుఁడు స. శబ్దశాస్త్రము తెలిసినవాఁడు
శామనము. స. శాంతి, వధము
శామాకము. స. చామలు
శామిత్రము.స.యజ్ఞపశుబంధనము,యజ్ఞము
శారద. స. సరస్వతి, పార్వతి
శారదము. స. పచ్చపెసర, ఏడాకులరఁటి, శరత్కాలమందుఁ బుట్టినది, క్రొత్తది
శారది. స. ఏడాకులరఁటి, నీరుపిప్పలి
శారదీయము. స. శరత్కాలసంబంధమైనది
శారభటము. స. దినముయొక్క నాలుగవభాగము
శారము. స. చిత్రవర్ణము, జూదపుసారె, వాయువు
శారి. స. గోరువంకపిట్ట, జూదపుసారె, చౌడోలు, ఏనుఁగుమీఁదికంబళము
శారిక. స గోరువంకపిట్ట, నఖక్షతము, వీణలోనగువానిని వాయించుకోడుపు

శారిఫలము. స. జూదమాడెడుపీట
శారిబ. స. మామెనచెట్టు
శారీరకము. స. శరీరసంబంధమైనది
శారీరము. స. కంఠస్వరము, శరీరసంబంధమైనది
శార్కరము స. పాలనురుగు, మొరముగలనేల, చెక్కెరతో చేయఁబడినది
శార్కరిలము. స. మొరముగలనేల
శార్ఙ్గము. స. విష్ణువుయొక్కవిల్లు, విల్లు, శృంగసంబంధమైనది
శార్ఙ్గి. స. విష్ణువు
శార్దూలము. స. పులి, శ్రేష్ఠవాచకము
శార్వరము. స. కటికిచీఁకటి, చెంపునది, రాత్రిసంబంధమైనది
శార్వరి. స. రాత్రి, ఒకసంవత్సరము
శాల. స. ఇల్లు, ఇంటియందు కొంతభాగము, చావడి, సభ
శాలము.స. వేగముగాఁ బోయెడుచేఁప,చెట్టు
శాలి. స. ఒకప్రత్యయము, వరి, గంధమార్జాలము
శాలికుఁడు. స. సాలెవాఁడు
శాలిని. స. గృహిణి
శాలిహోత్రము. స. గుఱ్ఱము
శాలిహోత్రుఁడు. స. ఒకసిద్ధుఁడు
శాలీనత స. మర్యాద, అణఁకువ
శాలీనము స. సిగ్గుగలది, వినయము గలది
శాలీనుఁడు. స. దిట్టతనములేనివాఁడు, గృహస్థుఁడు
శాలూకము. స. తామర మొదలగు వాని దుంప, జాజికాయ
శాలూరము } స. కప్ప, కలువదుంప
సాలూరము }
శాలేయము. స. సదాపమొక్క, వరిపండు పొలము
శాల్మలి } స. బూరుగచెట్టు, ఒకద్వీపము
శల్మలి }
శావము. స. మృతసూతకము, శవసంబంధమైనది
శాశ్వతము. స నాశములేనిది, స్థిరమైనది
శాష్కులికము. స. చేక్కిలములసమూహము
శాష్కులుఁడు. స. మాంసముతినువాఁడు
శాసకుఁడు స. శాసించువాఁడు
శాసనము. స. రాజు తాను దానముచేసిన భూమికై వ్రాసియిచ్చినకవులు, ఆజ్ఞ, శిక్షించుట, శాస్త్రము, ఱాళ్లయందు చెక్కఁబడిన వృత్తాంతములు, అధికారము, తీర్పు, వ్రాఁతమూలకమగు నొడంబడిక, ఇంద్రియనిగ్రహము
శాసనీయము. స. శాసింపఁదగినది
శాసించు. స. ఆజ్ఞాపించు, శిక్షించు
శాస్త స. బుద్ధదేవుఁడు, శాసించువాఁడు, దేశాధిపతి
శాస్తి. స. శాసనము, శిక్ష
శాస్త్రము. స. నియమగ్రంథము,శాస్త్రమువలనఁ గలిగినది
శాస్త్రవిదుఁడు } స. శాస్త్రము తెలిసినవాఁడు
శాస్త్రజ్ఞుఁడు }
శాస్త్రి }
శాస్త్రీయము. స. శాస్త్రసంబంధమైనది
శాస్త్రోక్తము. స. శాస్త్రమునందు విధింపఁబడినది, సరియైనది
శాస్యము. స. శాసింపఁదగినది

# శి

శింఘాణము } స. ఇనుపచిట్టెము, చీమిడి,
శింహాణము } కాచపాత్రము

శింజ. స వింటినారిమ్రోత, అందెమ్రోత

శింజానము. స. శింజయనుధ్వనిగలది

శింజితము. స. భూషణముల మ్రోత

శింజిని. స. వింటినారి, కాలియందె

శింబ } స. పెసలులోనగువానిపై పొట్టు
సింబ }

శింబి. స. తంబతీఁగ

శింబికము. స. నల్లపెసలు

శింశుప } స ఇరుగుడుచెట్టు
శింశప }

శింశుమారము. స. మొసలి, నీరుకోఁతి, గ్రహసంచారమేషాదిరాసులస్థానము

శిక్యము. స. కావడియుట్టి, ఉట్టి

శిక్యితము. స. ఉట్టియందుంచఁబడినది

శిక్ష. స. షడంగములలో నొకటి, శిక్షించుట, విద్యాభ్యాసము బోధించుట,

శిక్షకుఁడు. స. బోధకుఁడు [వినయము

శిక్షణము. స. నేర్చుకొనుట, బోధించుట,

శిక్షించు. స. శిక్షచేయు

శిక్షితుఁడు. స. శిక్షింపఁబడినవాఁడు, నేర్పరి

శిఖ. స. సిగ, నెమిలిసిగ, కొన, ఊడ, కొమ్మ, కిరణము, తజిగొట్టుచెట్టు

శిఖండకము } స. పిల్లజుట్టు, నెమిలిపురి
శిఖండము }

శిఖండి. స. అడవిమొల్లచెట్టు, ధృష్టద్యుమ్నునియన్న, నెమిలి, నెమిలిపురి,కోడి, బాణము

శిఖరము. స. కొన, కొండకొన, చెట్టుకొన, మంచెపుకోడుకొన, కచ్చె

శిఖరి. స. కొండ, చెట్టు

శిఖరిణి స. చక్కెర మొదలగునవి చేర్పఁబడిన పెరుఁగు, ఉత్తమస్త్రీ, రోమావళి, మల్లెచెట్టు

శిఖాతరువు. స. దీపస్తంభము [శ్రేష్ఠుఁడు

శిఖామణి స. తలయందుధరించుభూషణము,

శిఖావంతుఁడు. స. అగ్ని

శిఖావళము. స. నెమిలి

శిఖి. స. అగ్ని, నెమిలి, కోడి, చెట్టు, కేతుగ్రహము, బాణము, ఎద్దు, సిగగలవాఁడు

శిఖిగ్రీవము. స. మయిలుతుత్తము

శిఖిముఖి. స. చెకుముకిరాయి

శిఖివాహనుఁడు. స. కుమారస్వామి

శిగ్రుజము. స. మునగవిత్తు

శిగ్రువు. స. మునగచెట్టు, కూర

శితద్రువు. స. శతద్రునది

శితము. స. వాఁడియైనది, బక్కయైనది

శితశూకము. స. యవధాన్యము

శితసారకము స. తుమ్మికచెట్టు

శితి. స. తెల్లనిది, నల్లనిది

శితికంఠుఁడు. స. శివుఁడు [వమునైనది

శిథిలము స. సంధులువదలినది, జీర్ణమైనది

శిథిలి. స. పచ్చవర్ణముగల చెదలు

శిపివిష్టుఁడు. స. విష్ణువు, శివుఁడు, బట్టతలగలవాఁడు [వేఱు

శిఫ. స. ఊడ, పడుగొమ్మ, తామరదుంప,

శిబి. స. హింసించెడిపశువు, ఒకచక్రవర్తి

శిబిక. స. యాప్యయానము, పల్లకి
శిబిరము. స. దండువిడిసినచోటు
శిర. స. నరము, ఈనె
శిరము } స. తల, శిఖరము, సేనాగ్రము,
శిరస్సు } ప్రధానము
శిరసావహించే. స. తలయందు ధరించే,
ఆమోదించే
శిరస్కము } స. బొమిడికము
శిరస్త్రము
శిరస్త్రాణము
శిరస్తోదము. స. తలనొప్పి
శిరస్యము. స. స్నానాది సంస్కారముచేత
పరిశుద్ధమైన తలవెంట్రుక
శిరాలుఁడు. స లావు నరములుగలవాఁడు
శిరీషము. స. దిరిసెనవృక్షము
శిరోగృహము. స. చంద్రశాల, మిద్దెయిల్లు
శిరోజము. స. తలవెంట్రుక
శిరోధి. స. మెడ
శిరోభారము. స. తలనొప్పి
శిరోరుహము. స. తలవెంట్రుక
శిరోవేష్టనము. స. తలగుడ్డ
శిరోశూలము. స. తలనొప్పి
శిల. స. ఱాయి, కడపక్రింది త్రొక్కుడుఁ
గమ్మి, సెలయేఱు
శిలము } స. కోఁతకోసిన మళ్లయందు జా
సిలము } ఱిపడిన వెన్ను లోనగువానిని
ఏఱికొని బ్రదుకుట
శిలాక్షరము. స. ఱాతిమీఁద చెక్కఁబడిన
వ్రాఁత, శాశ్వతమైనది
శిలాజతువు. స. సిలాజిత్తు
శిలాపాకి. స. గురిగింజ
శిలాపుత్రము. స. పొత్రము
శిలాపుష్పము. స. గుగ్గిలము, సాంబ్రాణి
శిలి. స. ఆఁడుఎట్టి
శిలీంధ్రము. స. అరఁటిపువ్వు, పుట్టగొడుగు
శిలీముఖము. స. బాణము, తుమ్మెద
శిలేయము. స. రాతిసంబంధమైనది
శిలోచ్చయము. స. పర్వతము
శిల్పము. స. చిత్తరువు వ్రాయుటలోనగు
శిల్పులపని, పనితనము, నేర్పు, పని,
కార్యము, ఆకారము, సృష్టి
శిల్పి. స. వడ్లంగిలోనగువాఁడు, శిల్పకారుఁడు
శివ. స. పార్వతి, నక్క, ఉసిరికచెట్టు,
నేలయుసిరిక మొక్క, జెమ్మిచెట్టు
శివంకరుఁడు. స. శుభకరుఁడు
శివకము. స. పశువునుగట్టుకొయ్య, మేకు
శివతాతి. స. శివంకరుఁడు
శివమల్లి. స. ఒకపుష్పవృక్షము
శివము. స. శుభము, సుఖము, జలము,
వేదము, మోక్షము, ఒకగ్రహయోగము,
తియ్యామామిడిచెట్టు, మేకు, శుభకరము
దేవతావేశము [పెట్టు
శివముపుట్టించు. దే. పురికొలుపు, పుల్లలు
శివరాత్రి. స. మాఖ బహుళ చతుర్దశినాఁ
డువచ్చు శివసంబంధమైన ఉపవాస
దినము
శివశక్తి. దే. ఒక మహాయోగురాలు
శివాలయము. స. శివుని దేవళము
శివుఁడు. స. ఈశ్వరుఁడు
శిశయిష. స. నిద్రింపవలెనను నిచ్ఛ
శిశిరము. స. ఒకఋతువు, చేల్లన, చేల్లనిది
శిశిరోపచారము. స. శైత్యోపచారము

శిశుకము. స. శిశువు, మీనభేదము, మొసలి
శిశువు. స. బిడ్డ, పిల్ల
శిశ్నము. స. మగగుఱి
శిశ్విదానుఁడు. స. సదాచారుఁడు, దురాచారుఁడు
శిష్టము. స. మిగిలినది, శిక్షింపఁబడినది, ఆజ్ఞాపింపఁబడినది, విధేయత గలది, మర్యాదగలది, శాంతమైనది, పవిత్రమైనది, ప్రధానమైనది
శిష్టాచారము. స. మంచివారియొక్క పద్ధతి
శిష్టి. స. ఆజ్ఞ, శాసనము
శిష్టుఁడు. స. సదాచార సంపన్నుఁడు, విధేయుఁడు, ఆజ్ఞాపింపఁబడినవాఁడు, సాధువు
శిష్యపుత్రుఁడు. స కొడుకుగా భావింపఁబడు శిష్యుఁడు
శిష్యసంచారము. స. వైష్ణవులు తమశిష్యులున్న గ్రామములకుఁ బోవుచుండుట
శిష్యుఁడు. స. విద్యకొఱకు దగ్గఱఁజేరి సేవ చేయుచు శిక్షింపఁబడువాఁడు, చేదువు కొనువాఁడు

## శీ

శీకరము. స. తుంపర, ఏనుఁగు తొండము చివరయందు పుట్టెడుమదము, అంబుకణము
శీఘ్రము. స. నీటివట్టివేరు, బండి కంటియాకు, త్వరితముగ, వడిగలది, త్వర
శీత. స. నాఁగటిచాలు
శీతకము. స. చేలికాలము
శీతకరుఁడు. స. చంద్రుఁడు
శీతకుఁడు. స. సోమరి, చింతలేక సుఖముగ నుండువాఁడు
శీతనగము. స. హిమవత్పర్వతము
శీతభీరువు. స. మల్లెచెట్టు
శీతము. స. చేల్లన, ప్రబ్బచెట్టు, చేల్లనిది, అలసమైనది
శీతరశ్మి. స. చంద్రుఁడు
శీతలము. స. చందనము, చేల్లనిది
శీతశివము. స. ఇందుప్పు, తాపువ్వు, జమ్మిచెట్టు
శీధువు. స. చెఱకుకల్లు, ఏనుఁగు కన్నులయందు పుట్టెడు మదము, పుష్పరసము
శీర్షకము. స. శిరస్త్రాణము, కిరీటము
శీర్షచ్ఛేద్యుఁడు. స. తలకొట్టఁదగినవాఁడు
శీర్షణ్యము. స. శిరస్త్రాణము, స్నానాది సంస్కారముచేత పరిశుద్ధమైన తలవెండ్రుక
శీర్షము. స. తల
శీర్షిక. స. వ్రాయఁబడు నంశముయొక్క పైభాగమందు సంగ్రహపుమాట
శీలనము స. దివ్యప్రబంధముల పరీక్ష, వాడుకచేయుట, సాధకము
శీలము. స. స్వభావము, మంచినడత, నీతి, అందము
శీలించు. స. వాడుకపఱచు, పరిశీలించు

## శు

శుంఠ. స. మూఢుఁడు
శుంఠకాయ. దే. దుష్టుఁడగుపిల్లవాఁడు
శుంఠి. స. సొంటి
శుంఠుఁడు. స. మూఢుఁడు
శుండ. స. తొండము, కల్లు, కల్లుత్రాగెడియిల్లు, ఉస్తెమొక్క, వేశ్య
శుండాలము. స. ఏనుఁగు
శుంభత్. స. ప్రకాశించెడు
శుంభము. స. త్రాడు

శుంభుఁడు. స. ఒకఅసురుఁడు
శుకతుండము. స. అభినయహస్తవిశేషము
శుకనాసము. స. దుండిగపుచెట్టు
శుకము. స. మాచిచెట్టు, చిలుక, దిరిసెనపు చెట్టు
శుకవాహుఁడు. స. మన్మథుఁడు
శుకుఁడు. స. వ్యాసునికొడుకు
శుక్కు. స. శోకము
శుక్తము. స. పులికడుగు, మాంసము, పులుసు, పుల్లనిది, పవిత్రమైనది, స్వచ్ఛమైనది
శుక్తి. స. ముత్తెపుచిప్ప. శంఖము నత్తగుల్ల, నేత్రరోగము
శుక్తిమంతము. స. ఒక కులపర్వతము
శుక్రము. స. రేతస్సు, కంటిపువ్వు, జ్యేష్ఠమాసము
శుక్రలము. స. వీర్యవృద్ధిచేయునది
శుక్రలుఁడు. స. వీర్యవృద్ధిగలవాఁడు
శుక్రవారము. స. ఒకవారము
శుక్రశిష్యుఁడు. స. అసురుఁడు
శుక్రుఁడు. స. భార్గవుఁడు, అగ్ని
శుక్ల. స. ఒకసంవత్సరము
శుక్లము. స. వెండి, తెలుపు, మాసమునందు పూర్వపక్షము, తెల్లనిది, వీర్యము
శుక్లిమ స. తెలుపు
శుచి. స. అగ్ని, ఉపధాశుద్ధుఁడైనమంత్రి, శృంగారరసము, గ్రీష్మఋతువు, జ్యేష్ఠమాసము, ఆషాఢమాసము, తెలుపు, తెల్లనిది, పరిశుద్ధమైనది
శుచిర్భూతుఁడు. స. పరిశుద్ధుఁడుగానుండువాఁడు
శుచివ్రతుఁడు. స. తనపనులయందు స్వచ్ఛమైనవాఁడు
శుద్ధము. స. తెలుపు, తెల్లనిది, పరిశుద్ధమైనది, దోషములేనిది, కేవలము, మాసమునందు పూర్వపక్షము
శుద్ధాంతము స. అంతఃపురము, అంతఃపురస్త్రీ. రాజుయొక్క యేకాంతస్థలము
శుద్ధి. స. శోధనము, మార్జనము, నిర్మలత్వము, పవిత్రముగా చేయుట, చక్కఁజేయుట, అప్పుతీర్చుట, నిజము, కాంతి, ప్రాయశ్చిత్తము
శునకము. స. కుక్క
శునకముద్ర. స. గొప్పనేరస్థులనొసటశునకరూపముగాఁగాల్చి ముద్రించెడి దండన
శుని. స. కుక్క, ఆఁడుకుక్క
శునీరము. స. ఆఁడుకుక్కలసమూహము
శుభంయువు. స. శుభముతోఁ గూడుకొన్నవాఁడు
శుభకృత్తు. స. ఒకసంవత్సరము
శుభదంతి. స. వాయువు దిక్కునందలి ఆఁడేనుఁగు, చక్కని పండ్లుగలది
శుభము. స. మంగళము, ఒక గ్రహయోగము, మంగళకరమైనది
శుభలేఖ. స. శుభవార్తగల యుత్తరము
శుభోదర్కము. స. ముందు శుభముగలది
శుభ్రము. స. అభ్రకము, తెలుపు, తెల్లనిది, ప్రకాశించేనది, ఒకగ్రహయోగము
శుభ్రాంశువు. స. చంద్రుఁడు
శుల్కగ్రాహి. స. పన్నుపోగుచేయువాఁడు
శుల్కము. స. సుంకము, ఉంకువ, వేశ్యకిచ్చెడిధనము, లాభము, బేరముచేసి యిచ్చుసంచేకరువు, పెండ్లికొమారుఁడు పెండ్లికొమార్తె కిచ్చే బహుమానము

శుల్బము. స. రాగి, త్రాడు
శుశ్రూష. స. వినవిచ్ఛ, సేవ, చెప్పుట
శుశ్రూషకుఁడు. స శుశ్రూషచేయువాఁడు
శుశ్రూషణ } స. వినవిచ్ఛ, సేవ, లోఁబడి
శుశ్రూషణము } యుండుట
శుష్కము. స. వంటచెఱకు, ఎండినది, కేవలము, వట్టి
శుష్కరుదితము. స. కన్నీళ్లు లేకుండునట్టి యేడుపు
శుష్కించే } స. ఇంకు, ఎండు
శుష్కీభవించే }
శుష్మము. స బలిమి, తేజస్సు, నిప్పు

## శూ

శూకకీటము. స. గొంగళిపురుగు, కందురీఁగ, నల్లతేలు
శూకధాన్యము. స. యవలు మొదలగునది
శూకము. స. తేలుకొండి, వరిముల్లు, కనికరము
శూకలము స. శిక్షింపఁబడని దుష్టాశ్వము
శూకశింబి. స. దూలగొండిమొక్క
శూద్ర. స. శూద్రజాతిస్త్రీ
శూద్రి. స. శూద్రునిభార్య
శూద్రుఁడు. స. నాల్గవజాతివాఁడు
శూనము. స. వాచినది, పెరిఁగినది
శూనారము. స. కుక్కయొక్క పాలు, పాముయొక్క గ్రుడ్డు
శూన్య. స. మల్లెచెట్టు, గొడ్రాలు
శూన్యగాఁడు. స దయ్యమును పెట్టువాఁడు
శూన్యచిత్తుఁడు. స. పరాకుగలవాఁడు
శూన్యము. స. సున్న, పాడు, వట్టిది, లేనిది, దయ్యములచే పెట్టుట

శూన్యవాది. స. దేవుఁడు లేఁడనువాఁడు
శూరంమన్యుఁడు. స. తాను శూరుఁడనని కొనువాఁడు
శూరుఁడు. స. సూర్యుఁడు, రణసాహసము గలవాఁడు, ప్రాఘుఁడు
శూర్పణఖ. స. ఒకరాక్షసి
శూర్పము. స. చేట, రెండుమంతలకొలఁది
శూర్మము } స. లోహప్రతిమ, దాగలి
శూర్మి }
శూల స. కొఱ్ఱు, వేశ్య
శూలపాణి. స. శివుఁడు
శూలము. స. అమ్మకము, ముమ్మొనవాలు, ఇనుపసలాక, రోగవిశేషము, ఒకగ్రహయోగము, చేవు, టెక్కెము, బల్లెము, నొప్పి, కడుపునొప్పి, కొఱ్ఱు
శూలాకృతము. స. ఇనుపసలాకయందు గ్రుచ్చి పక్వము చేయఁబడినది, కఱుకుట్లు
శూలి స. శివుఁడు, శూలాయుధము ధరించినవాఁడు, శూలరోగముగలవాఁడు
శూల్యము. స. శూలాకృతము

## శృ

శృంఖల } స. మగవాని మొలత్రాడు, సంకెల
శృంఖలము }
శృంఖలకము. స. కాళ్లకు బొండకొయ్య వేసిన ఒంటెపిల్ల
శృంఖలితము. స. సంకెలవేయఁబడినది
శృంగబేరము. స. అల్లము
శృంగము. స. కొమ్ము, కొండకొమ్ము, గుఱుతూబూర, ప్రాధాన్యము

శృంగాటకము. స. నాలుగుత్రోవలుకలసిన దారి
శృంగారము. స. గందవొడి, నవరసములలో నొకటి, అలంకారము, సురతము, సౌందర్యము
శృంగారయోని. స. మన్మథుఁడు
శృంగారవనము. స. ఉద్యానవనము
శృంగారి. స. విటుఁడు, ఏనుఁగు, పోఁక మ్రాను, శృంగారముగలవాఁడు
శృంగారించు. స. అలంకరించు
శృంగి. స. అతివస, మీనభేదము, ఏనుఁగు, కొండ, మ్రాను, కొమ్ముగలది
శృంగిణి. స. ఆవు
శృంగీకనకము } స. కడియములోనగుభూషణరూపమైన బంగారు
శృంగికనకము
శృతము. స. కాఁచఁబడిన పాలునెయ్యిలోనగునది

## శే

శేఖరమగు. దే. సిద్ధమగు
శేఖరము. స. సిగదండ, శ్రేష్ఠము
శేఖరించు. స. గొప్పపడు
శేఫము. స. మగగుఱి
శేఫాలిక. స. నల్లవావిలిచెట్టు
శేముషి. స. బుద్ధి
శేలువు. స. విరిగిచెట్టు
శేవధి } స. నిధి
సేవధి
శేష. స. అనుగ్రహించి యిచ్చిన అక్షతలు లోనగునది, అనుగ్రహించి అక్షతలు లోనగువాని నిచ్చుట
శేషత. స. దాస్యము
శేషము. స. మిగులు, వధము, తినఁగా మిగిలినది, సంబంధము
శేషశయనుఁడు. స. శేషుఁడే శయ్యగాఁగల వాఁడు, విష్ణువు
శేషాచలము } స. తిరుమల
శేషాద్రి
శేషి. స. సర్వజనసంరక్షకుఁడైన శ్రీమన్నారాయణుఁడు
శేషించు. స. మిగులు, మిగతయగు
శేషుఁడు. స. సర్పరాజు, బలరాముఁడు

## శై

శైక్షుఁడు. స. క్రొత్తగాచేదువనారంభించిన శిష్యుఁడు
శైఖరికము. స. ఉత్తరేనుమొక్క
శైత్యము. స. చేలువ, జలుబు
శైథిల్యము. స. శిథిలత్వము
శైనేయుఁడు. స. సాత్యకి
శైబికుఁడు. స. బోయి, బెస్త,పల్లకిమోయు వాఁడు
శైలకన్య. స. పార్వతి
శైలధన్వుఁడు. స. శివుఁడు
శైలము. స. పర్వతము, తాపువ్వ
శైలాటము. స. సింహము
శైలాలి. స. నట్టు
శైలి. స. రచనాకౌశలముగల భాషాసౌష్ఠవము,భాషాసరణి, లేఖనపద్ధతి, విధము, ధోరణి
శైలూషము. స. మారేడుచెట్టు
శైలూషి. స. ఆటకత్తె, నట్టువురాలు
శైలూషుఁడు. స. ఆటకాఁడు, నట్టువుఁడు
శైలేయము. స. ఇందుప్పు,తాపువ్వ, తేఁటి, తాతితో సరియైనది

శైవము. స. శివుఁడేదేవుఁడను ఒకమతము, శివసంబంధమైనది

శైవలము
శైవాలము } స. నీటిపాఁచి
శేవలము

శైవలిని
శైవాలిని } స. నది

శైవుఁడు. స. శివభక్తుఁడు

శైశవము స. శిశుత్వము, బాల్యము

శైష్యోపాధ్యాయిక. స.శిష్యోపాధ్యాయుల తనము

## శో

శోకము. స. పుత్రమరణాది దుఃఖముచేత తపించుట, వగపు, మనోదుఃఖము

శోకించు. స. పుత్రమరణాదిదుఃఖముచేత తపించు, వగచు

శోచనము. స. శోకించుట

శోచనీయము
శోచితవ్యము } స. శోకింపఁదగినది
శోచ్యము

శోచిష్కేశుఁడు. స. అగ్ని

శోచిస్సు. స. సూర్యకిరణము, వెలుఁగు

శోణకము. స. దుండిగపుమొక్క

శోణము. స. ఎఱుపు, ఎఱ్ఱనిగుఱ్ఱము, నిప్పు, దుండిగపుమొక్క, ఎఱ్ఱనిది

శోణరత్నము. స. కెంపు, పద్మరాగము

శోణితము. స. రక్తము

శోణిమ
శోణిమము } స. ఎఱుపు

శోథము. స. వాఁపురోగము, శోఫ

శోధకుఁడు. స. శోధించువాఁడు

శోధనపత్రము. స. శుద్ధపత్రము

శోధనము. స. శుద్ధిచేయుట, పరిష్కరించుట, వెదకుట, విష్ఠ

శోధని. స. చీఁపురుకట్ట

శోధించు. స. శుద్ధిచేయు, పరిష్కరించు వెదకు

శోధితము. స. శోధింపఁబడినది

శోధ్యము. స. శోధింపఁదగినది

శోఫ. స. వాఁపురోగము, శోథము

శోఫఘ్ని. స. గలిజేరుమొక్క

శోభ. స. వస్త్రభూషణాదిప్రయుక్తమైన కాంతి, కాంతి, ఇచ్ఛ

శోభకృత్తు. స. ఒకసంవత్సరము

శోభనము. స. ఒకగ్రహాయోగము, శుభము, సుందరము, నిషేకము

శోభాంజనము. స. మునగచెట్టు

శోభించు
శోభిల్లు } స ప్రకాశించు

శోభితము. స. ప్రకాశమొందినది

శోభితుఁడు. స. అలంకృతుఁడు

శోషణము. స. శోషిల్లుట

శోషము. స. శోషరోగము, క్షయరోగము, శోషిల్లుట

శోషించు
శోషిల్లు } స. ఇంకు, ఎండు, మూర్ఛపొందు

శోషితము. స. ఎండినది, చిక్కినది, వాఁడినది, అలసినది

## శౌ

శౌంర్యము. స. శుంఠత్వము, మూఢత్వము, జడత

శౌండి. స. పిప్పలిచెట్టు

శౌండికుఁడు. స. గవండ్లవాఁడు

శౌండీరుఁడు. స. గర్వి, హెచ్చుస్థితి నొందిన వాఁడు

శౌండుఁడు. స. ప్రసిద్ధుఁడు, కల్లుత్రాగుట చేత మత్తిల్లినవాఁడు, సమర్థుఁడు

శౌకము. స. శుకసమూహము

శౌక్తికము. స. ముత్తెపుచిప్ప

శౌక్తికేయము. స. ముత్యము

శౌక్లికేయము. స. విషభేదము

శౌక్ల్యము. స. శుక్లభావము, శుక్లకర్మము

శౌచకూపము. స. మరుగుదొడ్డి

శౌచము. స. శుచిత, శుచిత్వము, నైర్మల్యము

శౌచికుఁడు. స. శుచిచేయువాఁడు

శౌచేయుఁడు. స. చాకలవాఁడు

శౌటీరుఁడు. స శూరుఁడు, గర్వి

శౌద్ధోదని. స. శాక్యబుద్ధదేవుఁడు

శౌద్రుఁడు. స. శూద్రస్త్రీకిని వైశ్యుఁడు జాతులలో నొకనికిని గలిగినవాఁడు

శౌనకుఁడు. స. ఒకగొప్పఋషి

శౌనికుఁడు. స. కటికవాఁడు, పక్షులను వేఁటాడువాఁడు

శౌరి. స. విష్ణువు, కృష్ణుఁడు

శౌర్యము. స. శూరత్వము, ప్రౌఢిమము

శౌల్కికుఁడు. స. శుల్కాధ్యక్షుఁడు, సుంకరి

శౌల్కుఁడు. స. సుంకరి

శౌల్బికుఁడు. స. రాగిపనివాఁడు

శౌష్కలము. స. ఎండినమాంసముయొక్క వెల

శౌష్కలుఁడు. స. ఎండినమాంసము తినువాఁడు

## శ్చో

శ్చ్యోతము. స. జలాదిధార, కారుట

## శ్మ

శ్మశానము. స. వలికిమిట్ట, పితృవనము

శ్మశ్రుధరుఁడు. స. గడ్డము మీసము పెంచు కొన్నవాఁడు

శ్మశ్రుముఖి. స. గడ్డమును మీసమునుగల యాఁడుది

శ్మశ్రువు. స. గడ్డము, మీసమును

## శ్యా

శ్యామ. స. యౌవనమధ్యస్థురాలు, యమున, నల్లపిచ్చుక, రేయి, నీలిచెట్టు

శ్యామము. స. ఇందుప్పు, మిరియము, ఆకు పసుపు, నలుపు, మబ్బు, కోయిల, ప్రయాగయందలి మఱ్ఱిచెట్టు, ఆకు పచ్చనిది, నల్లనిది

శ్యామల. స. పార్వతి

శ్యామలము. స. నలుపు, రావిచెట్టు, నల్లనిది

శ్యామాకము. స తృణధాన్యవిశేషము, చామలు

శ్యామిక. స. చీఁకటి, కంఁదు, నైల్యము

శ్యాలకుఁడు. స. భార్యతోఁడఁబుట్టినవాఁడు

శ్యాలకి. స. భార్యతోఁడఁబుట్టినది

శ్యావము. స. కోఁతివన్నె, కోఁతివన్నెగలది

## శ్యే

శ్యేతము. స. తెలుపు, తెల్లనిది

శ్యేనము. స. డేగ, తెలుపు

## శ్యో

శ్యోనాకము. స. దుండిగపుచెట్టుయొక్క

## శ్ర

శ్రద్ధధానుఁడు. స. శ్రద్ధగలవాఁడు

శ్రథనము. స. కట్టు, కూర్పు, విడుపు

శ్రద్ధ. స. అక్కఱ, ఆసక్తి, నమ్మకము, మర్యాద, భక్తి, మంచికోరిక, వేవిళ్లు

శ్రద్ధాళువు. స. వేవిళ్లుగలఆఁడుది, శ్రద్ధ గలది, శ్రద్ధగలవాఁడు

శ్రమణుఁడు. స. సన్న్యాసి, యతి, నింద్య జీవనము గలవాఁడు

శ్రమము. స. అలసట, అలవాటు, దేహ దార్ఢ్యమునకై చేసెడుసాములోనగునది, ప్రయాసము,దుఃఖము,తపస్సు, కష్టించి చేదువుట

శ్రముఁడు. స. అలసినవాఁడు

శ్రయణము. స. ఆశ్రయించుట

శ్రవణము. స చెవి, వినికిడి, ఒకనక్షత్రము

శ్రవణీయము. స. వినఁదగినది

శ్రవము
శ్రవస్సు } స. చెవి

శ్రవిష్ఠ. స. ధనిష్ఠానక్షత్రము

## శ్రా

శ్రాంతము. స. అలసటపొందినది, విశ్రాంతి పొందినది

శ్రాంతి. స. డోఉట, విశ్రాంతి

శ్రాంతుఁడు. స.యతి,శాంతిఁబొందినవాఁడు

శ్రాణ. స కాఁపుడుగంజి, కాఁచేఁబడినది, పక్వమైనది

శ్రాద్ధదేవుఁడు. స. యముఁడు

శ్రాద్ధము. స. పితృకర్మము, శ్రద్ధతోఁగూడినది

శ్రాయము. స. ఆశ్రయించుట, శ్రీసంబంధమైనది

శ్రావకుఁడు. స. వినువాఁడు, శిష్యుఁడు

శ్రావణము. స. వినిపించుట, ఒకమాసము

శ్రావణి. స. శ్రావణపూర్ణిమ, ఒకకర్మము

శ్రావణికము. స. శ్రావణమాసము

శ్రావితము. స. వినిపింపఁబడినది

శ్రావ్యము. స. వినఁదగినది

## శ్రి

శ్రితము. స. కలసినది, కాపాడఁబడినది, రక్షింపఁబడినది

శ్రితి. స. సమీపించుట

శ్రితుఁడు. స ఆశ్రితుఁడు, సేవితుఁడు

శ్రియంమన్యుఁడు. స. తాను యోగ్యుఁడ ననుకొనువాఁడు, గర్వి

## శ్రీ

శ్రీ. స. లక్ష్మి, సంపద, ఐశ్వర్యము, వృద్ధి, శోభ, అలంకరణము, సరస్వతి, బుద్ధి, పార్వతి, విషము, మారేడుచెట్టు, ఒక రాగము, గౌరవార్థము కొన్ని పదములకు ముందు వచ్చునది

శ్రీకంఠుఁడు. స. శివుఁడు

శ్రీకము. స. అందము, ఉచ్చస్థితి

శ్రీకరుఁడు. స. సంపత్కరుఁడు

శ్రీకాంతుఁడు. స. విష్ణువు

శ్రీకార్యము. స. గుడిపారుపత్తెము

శ్రీఖండము } స. చందనము
శ్రీగంధము }

శ్రీఘనము. స. మీఁగడపెరుఁగు

శ్రీఘనుఁడు. స. బుద్ధదేవుఁడు

శ్రీచూర్ణము. స. తిరుచూర్ణము

శ్రీతాళము. స. ఒకదినుసు తాటిచెట్టు

శ్రీదుఁడు. స. కుబేరుఁడు

శ్రీధరుఁడు. స. విష్ణువు, బుద్ధదేవుఁడు

శ్రీనివాసుఁడు. స. విష్ణువు, వేంకటేశ్వరుఁడు

శ్రీపతి. స. విష్ణువు, రాజు

శ్రీపర్ణము. స. తామర, మారేడుచెట్టు

శ్రీపర్ణి. స. గుమ్ముడుచెట్టు, బే[illegible]చెట్టు

శ్రీపర్ణిక. స. గుమ్ముడుచెట్టు, కుముదిక వృక్షము

శ్రీపుత్త్రుఁడు. స. మన్మథుఁడు

శ్రీఫలము. స. మారేడుచెట్టు

శ్రీఫలి. స. ఉసిరికచెట్టు, నీలిచెట్టు

శ్రీమంతము. స. బొట్టుగుచెట్టు, సంపద గలది, ఒప్పిదముగలది

శ్రీమంతుఁడు. స. విష్ణువు, కుబేరుఁడు, ఇంద్రుఁడు, సంపదగలవాఁడు

శ్రీముఖి. స. ఒకసంవత్సరము

శ్రీముఖము. స. సన్యాసులుగురువులు మొద లగు పెద్దలు వ్రాసి పంపెడు పత్త్రిక

శ్రీరంగము. స. ఉభయకావేరీమధ్యమున నుండు ఒక దివ్యక్షేత్రము

శ్రీలుఁడు. స. సంపదగలవాఁడు

శ్రీవత్సము. స. విష్ణువుయొక్క ఱొమ్ము నందలి మచ్చ

శ్రీవత్సలాంఛనుఁడు. స. విష్ణువు

శ్రీవాసము. స. కమలము, గుగ్గిలమువంటి దేవదారు బంక

శ్రీవృక్షకము.స.గుఱ్ఱముఱొమ్మునందుగలసుడి

శ్రీవృక్షకి. స. శ్రీవృక్షకమను సుడిగల గుఱ్ఱము

శ్రీవృక్షము. స. మారేడుచెట్టు, రావిచెట్టు

శ్రీవేష్టము. స. దేవదారుబంకతోఁజేసిన ధూపద్రవ్యము

శ్రీశైలము స. ఒకానొక శ్రేష్ఠపర్వతము

శ్రీసంజ్ఞము. స. లవంగము

శ్రీహస్తిని. స. భూరుండివృక్షము

## శ్రు

శ్రుతపఱుచు. దే. తెలియఁజేయు

శ్రుతము. స వినికి, శాస్త్రము, వినఁబడినది

శ్రుతి. స. వేదము, చెవి, వినికి, సుతి, సుద్ది

## శ్రే

శ్రేణి. స. వరుస, బొక్కెన,గుంపు,వర్తకుల [గుంపు,

శ్రేణిక. స. గుడారము

శ్రేయము } స. శుభము, ధర్మము,
శ్రేయస్సు } మోక్షము, శ్రేష్ఠమైనది

శ్రేయసి. స. కరకచెట్టు, గజపిప్పలి

శ్రేష్ఠము. స ప్రశస్తమైనది, మంచిది

శ్రేష్ఠి. స. కులమునందు శ్రేష్ఠుఁడైనశిల్పి, కులశ్రేష్ఠుఁడైనవాఁడు, కోమట్లబిరుదు పేరు, సెట్టి [వాఁడు

శ్రేష్ఠుఁడు. స. కుబేరుఁడు, మేలిమిబొందిన

## శ్రై

శ్రైష్ఠ్యము. స. శ్రేష్ఠత్వము, మేలిమి

## శ్రో

శ్రోణి. స. పిఱుఁదు, మొల, మార్గము
శ్రోణిఫలకము. స. మొల
శ్రోణుఁడు. స. పిచ్చుకకుంటు
శ్రోత. స. వినువాఁడు
శ్రోతవ్యము. స. వినఁదగినది
శ్రోత్రము. స. చెవి
శ్రోత్రియము. స. పండితుల కీయఁబడిన యినాము భూమి
శ్రోత్రియుఁడు. స. వేదముఁజదివిన బ్రాహ్మణుఁడు, ఛాందసుఁడు

## శ్రౌ

శ్రౌతము. స. వేదమునందు విధింపఁబడినది, వేదచోదితకర్మప్రతిపాదకగ్రంథము

## శ్ల

శ్లక్ష్ణము. స. సన్నము
శ్లక్ష్ణుఁడు } స. అల్పుఁడు, ప్రియముపలుకువాఁడు
శక్ష్ణుఁడు }
శ్లథము. స. శిథిలము

## శ్లా

శ్లాఘ. స. ప్రశంస, పరిచర్య, ఇచ్ఛ, స్తోత్రము
శ్లాఘనము. స. శ్లాఘించుట
శ్లాఘనీయము } స. శ్లాఘింపఁదగినది
శ్లాఘ్యము }
శ్లాఘించు. స. పొగడు

## శ్లి

శ్లిష్ట } స. కౌఁగిలి
శ్లిష్టి }
శ్లిష్టము. స. శ్లేషతోఁగూడినది, మిళితమైనది

## శ్లీ

శ్లీలము. స. సంపదగలది

## శ్లే

శ్లేష. స. కలయిక, ఒక అర్థాలంకారము
శ్లేషము. స. కౌఁగిలి, చేరిక, శ్లేష, కాలంట
శ్లేష్మణుఁడు } స. శ్లేష్మరోగముగలవాఁడు
శ్లేష్మలుఁడు }
శ్లేష్మము. స. కఫము, తెమడ
శ్లేష్మాతకము. స. విరిగిచెట్టు

## శ్లో

శ్లోకము. స. సంస్కృతపద్యము, కీర్తి

## శ్వ

శ్వక్రీడి. స. వినోదమునకై కుక్కలను పెంచువాఁడు
శ్వదంష్ట్ర. స. పల్లేరుమొక్క
శ్వపచుఁడు. స. చండాలుఁడు
శ్వభ్రము. స. బెజ్జము
శ్వయథువు. స. వాఁపురోగము, శోఫ
శ్వవృత్తి. స. సేవ, కొలువు, సేవాజీవనము
శ్వశురుఁడు. స. మామ
శ్వశురులు. స. అత్తమామలు

శ్వశుర్యుఁడు. స. మగని తోడఁబుట్టువు, ఆలితోడఁబుట్టువు
శ్వశ్రువు. స. అత్త
శ్వశ్శ్రేయసము. స. శుభము, సుఖము, మోక్షము, శుభకరము, మంగళము
శ్వసనము. స. శ్వాసము, వాయువు, మంగ చెట్టు [బడినది
శ్వసితము. స. శ్వాసము, నిట్టూర్పు, కాచఁ

# శ్వా

శ్వానబర్బర. స. కుక్కవాయింటచెట్టు
శ్వానము. స. కుక్క
శ్వాపదము. స. వ్యాఘ్రము, హింసించెడిపశువు
శ్వావిత్తు. స. ముండ్లపంది
శ్వావిధము. స. ఏదుపంది
శ్వాసకాసము. స. ఉబ్బసముతోడిదగ్గు, ఉబ్బసమును పుట్టించెడిదగ్గు
శ్వాసము. స. ఊపిరి, ఉబ్బసము, వాయువు

# శ్వి

శ్వితము. స తెలుపు
శ్విత్రము. స. తెల్లపొడల కుష్ఠరోగము
శ్విత్రి. స. శ్విత్రరోగముగలవాఁడు

# శ్వే

శ్వేత. స. గవ్వ, కట్లతీఁగ, తెల్లకలిగొట్టుచెట్టు
శ్వేతకాకీయము. స. వినని కనని సంగతి
శ్వేతకుటజము. స. పాలకొడిసచెట్టు
శ్వేతగరుత్తు. స. హంస, తెలిపిట్ట [చెట్టు
శ్వేతపత్త్రము. స. హంస, తెల్లయిరుగుడు
శ్వేతపాకి. స. తెల్లగురిగింజె
శ్వేతపింగళము. స. సింహము
శ్వేతబృహతి స. తెల్లములకచెట్టు
శ్వేతమరిచము. స. మునగవిత్తు, తెల్లమిరియము
శ్వేతము. స. వెండి, తెలుపు, ఒకద్వీపము, కైలాసపర్వతము, తెల్లపులుము, సీసము, శంఖము, తెల్లమబ్బు, తెల్లనిది
శ్వేతవాహనుఁడు. స అర్జునుఁడు, చంద్రుఁడు
శ్వేతసురస స. తెల్లవావిలిచెట్టు
శ్వేతాద్రి. స. హిమాలయపర్వతము
శ్వేతుఁడు. స. శుక్రుఁడు

# ష

ష. ఒకయక్షరము
షండము. స. తామర లోనగువాని సమూహము, ఆఁబోతు, పేడి, సమూహము
షండుఁడు. స. నపుంసకుఁడు
షటి. స. గంట్లకచోరము
షట్కము. స. షట్సంఖ్య, ఆఱు
షట్కర్ముఁడు. స యజనయాజనాధ్యయనాధ్యాపనదానప్రతిగ్రహము లనెడు షట్కర్మములుగల స్మార్తబ్రాహ్మణుఁడు
షట్పదము. స. తుమ్మెద
షడభిజ్ఞుఁడు. స. బుద్ధదేవుఁడు
షడాననుఁడు. స- కుమారస్వామి
షడ్గ్రంథ. స. గంట్లకచోరము, వస
షడ్గ్రంథము. స. గంట్లకానుగుచెట్టు
షడ్జము. స. ఒకస్వరము
షడ్ఢకుఁడు. స. తోడియల్లుఁడు, షడ్డకుఁడు

షడ్బిందువు. స. మండ్రగబ్బ
షడ్భాగము. స. కప్పము, మిడుఁగుఱు
షడ్రసములు. స. ఉప్పు, పులుసు, కారము, చేఁదు, ఒగరు, తీపియను ఆఱురుచులు
షణ్ముఖుఁడు. స. కుమారస్వామి
షష్టి. స. అఱువది
షష్టిక. స. అఱువది దినములలో పండెడు ధాన్యము
షష్టిక్యము. స. షష్టికలుపండుపొలము
షష్టిపూర్తి. స. అఱువదియేండ్ల వయసు రాఁగానే చేయు నుత్సవము
షష్టిమము. స. అఱువదవది
షష్ఠము. స. ఆఱవది
షష్ఠాష్టమము. స. విరోధము
షష్ఠి. స. పక్షమునందు ఆఱవతిథి, పార్వతి, ఆఱవది

## షా

షాడబము. స. మధురాదిరసము, రుచి
షాడవము. స. ఆఱుస్వరములుగలరాగము
షాడ్గుణ్యము. స. భగవంతుని ఐశ్వర్య వీర్యాది షడ్గుణములు
షాణ్మాతురుఁడు. స. కుమారస్వామి
షాణ్మాసికము. స. ఆఱవనెలయందు పెట్టెడు మాసికము

## షి

షిద్గుఁడు. స. విటుఁడు

## షో

షోడశము. స. పదునాఱు, పదునాఱవది, మృతునికి పదునొకొండవ దినమందు చేయు శ్రాద్ధకర్మ

## ష్ఠీ

ష్ఠీవనము. స. ఉమియుట, ఉమ్మి

## స

స. ఒక యక్షరము
సం. సంస్కృతమునందలి సమ్ అనుదానికి వచ్చినరూపము, చక్కని, మిక్కిలి, చక్కఁగా, అనునర్థము నిచ్చుచు ఇది పదములకు ముందు వచ్చును
సంకటపడు. దే. ఇఱుకుపడు, శ్రమపడు
సంకటపాటు. దే. ఇఱుకుపాటు, సంకట పడుట
సంకటపెట్టు. దే. బాధపెట్టు
సంకటము. స. ఇఱుకు, ఇఱుకై, కఠినదినము, రోగము, బాధ
సంకటి. దే. వండిన రాగిపిండిలోనగునది
సంకరము స. భేదము తెలియని కూడిక, కలగలపు, పొరకతో చిమ్మిచేర్చిన కసవు కుప్ప
సంకర్షణుఁడు. స. బలరాముఁడు
సంకలనము. స. సంఖ్యలను కూడుట, కూడిక
సంకలితము. స. కూర్చఁబడినసంఖ్య, భూమియందు పాఁతినది
సంకలియ. త. సంకెల
సంకల్పము. స. మనోవ్యాపారము, ఎన్నిక, మనోనిశ్చయము
సంకల్పించు. స. ఎంచు, దేవుఁడు కృప చేయు
సంకసుకుఁడు. స. దేనియందును నిలుకడ లేనివాఁడు
సంకారము. స. పెంటకుప్ప, అగ్నిచటాత్కారము

సంకాశము. స. సమానమైనది, సమీపమైనది
సంకీర్ణము. స. ఒకటితో నొకటి కలసినది, వ్యాపించినది
సంకీర్తనము. స. స్తోత్రము
సంకు. త. శంఖము
సంకుచించె. స. సంకోచమునొందు
సంకుచితము. స. సంకోచమునొందినది, ముడుచుకొన్నది
సంకుమదము. స. జవ్వాజి
సంకుమూతిగుఱ్ఱము. త. గాడిద
సంకులము. స. పూర్వోత్తర విరుద్ధమైన మాట, ఒకటితో నొకటి కలసినది, వ్యాపించినది, వ్యాకులము
సంకులు. త. శంఖవలయము
సంకువు. స. జవ్వాజిపిల్లి
సంకుసుకుఁడు. స. ఎందును నిలుకడలేని వాఁడు
సంకృతి. స. ఒకఛందస్సు, అగ్నిసంకారము
సంకెల. త. కాలికట్టగు ఇనుపగొలుసు, శృంఖలము
సంకెలవాఁడు. దే. నిగళబంధనముగలవాఁడు
సంకేతము. స. పేరు, ఏర్పాటు, ఒడఁబాటు, సంజ్ఞ, ముందుగామాటాడుకొని నిష్కర్ష చేసికొన్నస్థలము
సంకేతించె.స. పేరుపెట్టు, ఏర్పాటుచేయు, నిర్దేశించె
సంకోచపిశునము. స. కుంకుముపువ్వు
సంకోచము. స. కుంకుముపువ్వు, ముకుళీభావము, సంక్షేపము, సంశయము, బిడియము
సంకోచించె. స. సంకోచమునొందు, అనుమానించె, జంకు
సంక్రందనుఁడు. స. ఇంద్రుఁడు
సంక్రమణము. స. సూర్యుఁడు ఒకరాశి నుండి మఱియొకరాశికి ప్రవేశించుట, చేక్కఁగా నడచుట
సంక్రమము. స. నీటికట్టలోనగునది, సంకరము, సంక్రమణము
సంక్రమించె. స. ప్రవేశించె, చొచ్చె, ఆక్రమించె
సంక్రాంతి. స. మేషాది సంక్రమణము, మకర సంక్రమణము
సంక్రామణము. స. మార్గము, అభివృద్ధి
సంక్రామము. స. సంక్రమము
సంక్షిప్తము. స. సంక్షేపింపఁబడినది
సంక్షేపణము. స. సంక్షేపపఱచుట
సంక్షేపము. స. సంగ్రహము, విడుపు
సంక్షేపించె. స. సంక్షేపముచేయు, విడిచిపెట్టు
సంక్షోభము. స. కలఁత, వ్యాకులత, దుఃఖము
సంక్షోభితము } స. వ్యాకులపఱచఁబడినది
సంక్షుభితము }
సంఖ్య. స. లెక్క, విచారణ, దేహావిలక్షణమైన ఆత్మజ్ఞానము
సంఖ్యము. స. యుద్ధము
సంఖ్యాతము. స. లెక్కపెట్టఁబడినది
సంఖ్యాతిగము. స. లెక్కకు మీఱినది
సంఖ్యానము. స. లెక్కపెట్టుట, గణనము
సంఖ్యావంతుఁడు. స. చేదువరి, లెక్కపెట్టఁబడినవాఁడు
సంఖ్యేయము. స. లెక్కపెట్టఁదగినది, గణనీయము
సంగడము. దే. జెట్టిసాధన కుపయోగమైన ఇనుపగుండు
సంగడము. త. స్నేహము, చేరిక, పరివారము, సమీపము, జత, సేన, సంకటము, సహాయము

సంగడి. త. స్నేహము, జత, సమీపము, పార్శ్వము, వెనుక,సమూహము,విధము, రెండుతాటిబొండులు జతగాకట్టిన తెప్ప, స్నేహితుఁడు

సంగడికత్తె. దే. చెలికత్తె

సంగడికాఁడు
సంగడీఁడు } దే. స్నేహితుఁడు

సంగతము. స. స్నేహము, చేరిక,యుక్తము, యుక్తి యుక్తమైనమాట, వివాహాదు లచే సంబంధించినది, స్త్రీపురుషులకల యిక

సంగతి. స. చేరిక, జ్ఞానము, అంశము, వ్యవహారము, సహవాసము, సంభోగము,తట స్థించినది, అర్వాత

సంగతించు. స. సంభవించు

సంగమడుఁగు. దే. ఊరికి సమీపమునం దుండు మడుఁగు

సంగమము. స. చేరిక, స్నేహబృందము, సజ్జనసాంగత్యము, సంభోగము, నదులు కలయుచోటు, అర్వాత, పోట్లాట

సంగము. స. సమీపించుట, చేరిక, కూడిక, స్నేహము, అనురాగము, కోరిక, సాంగత్యము, పోట్లాట, నదులు కలయుచోటు, స్నేహితులగుంపు, ఆటంకము

సంగరము. స. జెమ్మిపండు, యుద్ధము,ప్రతిజ్ఞ, అంగీకారము, ఆపద, బేరము, దురదృష్టము

సంగాతకత్తె
సంగాతకత్తియ } త. స్నేహితురాలు

సంగాతకాఁడు. దే. స్నేహితుఁడు, చెలికాఁడు

సంగాతము. త. స్నేహము

సంగాతి. త. సంగాతకాఁడు

సంగావము. స. సంభాషణము

సంగి. స. సంగము కలవాఁడు

సంగీతము. స. గానము, నృత్తగీతము

సంగీర్ణము. స. అంగీకరింపఁబడినది

సంగోరు. దే. పంటయందు సగముకోరు, కోరులో సగము

సంగ్రహకుఁడు. స. పోగుచేయువాఁడు, గ్రంథమునుసంక్షేపముగ వ్రాయువాఁడు

సంగ్రహణము స. పట్టుకొనుట,రక్షించుట, సంగ్రహము చేయుట, కలియిక, వ్యభిచారము

సంగ్రహము. స. సమ్యగ్గ్రహణము, సంక్షేపము, సంక్షిప్తగ్రంథము,సంపాదించుట, కూడఁబెట్టుట, రక్షణము, అనుగ్రహించుట

సంగ్రహించు. స. చేకూరఁగా గ్రహించు, సంక్షేపించు, సంపాదించు

సంగ్రామము. స. కలహము, యుద్ధము

సంగ్రాహము. స. డాలుపిడి, పిడికిలి,పిడికిటఁ బట్టుట

సంఘము. స. ప్రాణిసమూహము, గుంపు

సంఘటనము. స. కూడుట, ఘటన, సంప్రాప్తమగుట

సంఘటి. స. సంగడి

సంఘటించు. స. సంభవించు, సంఘటిల్లు

సంఘటిక. స. కుంటెనకత్తె

సంఘట్టనము. స. ఒరసికొనుట, వాయించుట

సంఘర్ష
సంఘర్షము } స. ఒరయిక, పోటి, వివాదము

సంఘాతమరణము. స. గుంపులుగా చేచ్చుట

సాసువులు. దే. ఆవాలు
సాస్న. స. గంగడోలు
సాహచర్యము. స. కూడనుండుట
సాహనము. స. సహనము
సాహసము. స. తెగువ, దండోపాయము
సాహసించు స. సాహసము చేయు, తెగించు
సాహసికుఁడు, సాహసుఁడు } స. సాహసము కలవాఁడు, దోఁపిడికాఁడు, దుర్మార్గుఁడు
సాహస్రము. స. సహస్రములసమూహము
సాహస్రుఁడు. స. సహస్రబలమునకధికారి
సాహాయకము, సాహాయ్యము } స. తోడుపాటు, సహాయత్వము, స్నేహము
సాహిణము. దే. గుఱ్ఱపుశాల
సాహిణి, సాహిణీ } దే. గుఱ్ఱపువాఁడు
సాహితి, సాహిత్యము } స. అర్థజ్ఞానము, కూడిక, పాండిత్యము
సాహు. దే. సాహుకారు
సాహేబు. దే. ప్రభువు, తురుష్కుఁడు
సాహో దే. చోపుదారు చేసెడు హెచ్చరిక
సాళగము. స. తిలతండుల న్యాయమున నైనరాగమేళనము
సాళగించు. స. మిళితమగు
సాళగింపు. స. మేళనము
సాళువము. దే. శ్యేనవిశేషము
సాళ్వుఁడు. దే. కుక్కకీయఁబడినపేరు
సాళ్వము. దే. సాళువము

## సి

సిగఁడు. త. నృసింహుఁడు, ఎఱుకువాఁడు, కోపించినవాఁడు
సింగపుఁబీఁట. త. సింహాసనము
సింగము. త. సింహము
సింగళము. త. సింహళద్వీపము
సింగాణి. త. ఒకదినుసువిల్లు, విల్లు, కొమ్ముతో చేసినది
సింగారపుఁదోఁట. దే. ఉద్యానవనము
సింగారము. త. అలంకారము, చెక్కుఁదనము, శృంగారము
సింగారి. త. శృంగారవతియగు స్త్రీ
సింగారించు. త. అలంకరించు
సింగి. త. ఎఱుకుది, కోపము
సింగిణి త. విల్లు
సింగినాదము. త. ఊఁదెడుకొమ్మువాద్యము, వెఱ్ఱిచేష్ట
సింగిలీకము. దే. పెద్దసల్లకోఁతి
సింగోట. దే దివిదారికొమ్ము
సిందుకము. స. వావిలిచెట్టు
సిందురము. త. సిందూరము, వావిలిచెట్టు
సిందువారము. స. వావిలిచెట్టు
సిందూరము. స. చెందిరము, వావిలిచెట్టు
సిందూరితము. స. ఎఱ్ఱఁగాఁ జేయఁబడినది
సింధురము. స. ఏనుఁగు
సింధువు. స. ఒకానొకయేఱు, సముద్రము, ఏనుఁగు, ఒకదేశము
సింహద్వారము. స. తలవాకిలి
సింహనాదము. స. ఏనుఁగులు మొదలైనవి భయపడుటకై వీరులుచేసెడు ధ్వని, బొబ్బ
సింహపుచ్ఛి. స. నక్కతోఁకపొన్నచెట్టు
సింహము. స. సింగము, ఒకరాశి

సింహాలము. స. తగరము, ఇత్తడి, చెట్టుపట్ట, సింహళద్వీపము
సింహాసంహననుఁడు. స. సర్వాంగసుందరుఁడు
సింహాణము } స. ఇనుపత్రుప్పు, చీమిడి
సింఘాణము
సింహావలోకనము. స. శబ్దాలంకారవిశేషము
సింహాసనము. స. సింహముఖమేర్పఱచిన స్వర్ణమయమైన యున్నతపీఠము
సింహాస్యము. స. అడ్డసరపుచెట్టు
సింహి. స. రాహుతల్లి, ఆఁడుసింహము, అడ్డసరపుచెట్టు, ములకచెట్టు
సింహుండము. స. జెముడుచెట్టు
సిక. త. సిగ, జుట్టు
సికత. స. ఇసుకనేల, మొరపనేల, ఒకవ్యాధి
సికతలు. స. ఇసుక
సికతిలము. స. ఇసుకగలనేల
సికఫలము. స. సీకాయ
సికా. త. ముద్ర
సికాయుంగరము. దే. ముద్దుటుంగరము
సిక్తము. స. తడిసినది
సిక్థము. స. మైనము, మెతుకు, అన్నము, ముద్ద
సిక్యము. స. ఏనుఁగుయొక్క స్తనాగ్రము నందలిమదము
సిగ. త. సిక
సిగపూలు. దే. శిఖయందుఁ గట్టెడి భూషణము. సికను జుట్టుకొను పుష్పములు
సిగబంతి. దే. సిగదండ, శేఖరము
సిగము. దే. సివము
సిగర } త. దధిశర్కరాదికృతలేహ్యము, కొన్ని సంబారువులు చేర్చి పక్వము చేసిన మజ్జిగ
సిగరి
సిగరము. త. శిఖరము
సిగినాలు. దే. నాణెమైనపక్కలు
సిగ్గరి. దే. లజ్జకలవాఁడు, లజ్జగలది
సిగ్గరికత్తియ } దే. లజ్జగలది
సిగ్గరికత్తె
సిగ్గఱు. దే. సిగ్గుచెడు
సిగ్గిడి. దే లజ్జచెడినవాఁడు, లజ్జచెడినది
సిగ్గు. దే. స్తుత్యాదులచేఁ గలిగెడు మనస్సంకోచము, లజ్జ
సిగ్గుపడు. దే. సిగ్గుఁజెందు, లజ్జించు
సిగ్గుపాటు. దే. సిగ్గుపడుట
సిగ్గువోవు. దే. సిగ్గుపడు
సిచయము. స. వస్త్రము, జీర్ణవస్త్రము
సిడము. దే. ధ్వజము, ధ్వజస్తంభము
సిడి. దే. ఏతపుమ్రాను, గ్రామదేవత జాతరలో నొకనిపీఁపున గాలము గ్రుచ్చిగాని ఒకనిని గంపలోఁ గూర్చుండఁ బెట్టిగాని త్రిప్పునట్టిదూలము, అంకుశము
సిడిముడి. దే. కోపము
సిత. స. చేక్కెర, వెన్నెల, సారాయి
సితఛత్త్ర. స. సదాపమొక్క
సితము. స. తెల్లపులుఁము, తెలుపులు, తెల్లనిది
సితవీర్య. స. జీలుగుచెట్టు
సితశివము. స. ఇందుప్పు
సితాభము } స. కర్పూరము
సితాభ్రము
సితుఁడు. స. శుక్రుఁడు, తెల్లనివాఁడు
సిద్ధాయము. త. వెచ్చేప్రసొమ్మునందుకూడఁ బెట్టినధనము, వ్యయశేషము
సిద్దీ. దే. మంచిబలముగల నల్లనియొకజాతివాఁడు

సిద్దె } దే. తోలుతో కట్టినపాత్రము
సిద్దియ }

సిద్ధక్రియ. స. పరమహంసక్రియ

సిద్ధము. స. ఒకగ్రహయోగము, ఆయిత్త మైనది, ఈడేఱినది, వండఁబడినది

సిద్ధాంతము. స స్థిరమైనపక్షము, నిర్ణయింపఁబడినది, జ్యోతిషగ్రంథము, నిర్ణయము

సిద్ధాంతి. స. జ్యోతిశ్శాస్త్రము తెలిసినవాఁడు, తత్త్వశాస్త్రము తెలిసినవాఁడు

సిద్ధాంతీకరించు. స. సిద్ధాంతముచేయు

సిద్ధాయము. స. కప్పము

సిద్ధార్థము. స. తెల్లావాలు

సిద్ధార్థి. స. ఒకసంవత్సరము

సిద్ధార్థుఁడు. స. శాక్యబుద్ధదేవుఁడు

సిద్ధి స. ఈడేఱుట, ఒకగ్రహయోగము, వాంఛితప్రాప్తి. పూర్తి

సిద్ధించు. స. ఈడేఱు, సమకూడు

సిద్ధుఁడు. స. దేవయోనివిశేషము, వ్యాసాది ఋషి

సిధ్మము. స. సిబ్బెము, సిబ్బెముగలది

సిధ్మల. స. ఉప్పుఁజేఁప, సిబ్బెముగలది

సిధ్మలుఁడు. స. శోఫరోగముగలవాఁడు

సిధ్యము. స. పుష్యనక్షత్రము

సినీవాలి. స. చంద్రకళకానవచ్చెడి యమావాస్య, పార్వతి

సిపాయి. దే. కాలిబంటు

సిబ్బి. దే. ఇత్తడిమూఁకుడు

సిబ్బితి. దే. సిగ్గు

సిబ్బితికత్తె. దే. సిగ్గుగలస్త్రీ

సిబ్బితికాఁడు. దే. సిగ్గుగలవాఁడు

సిబ్బెము } త. దేహమునందుఁ గలిగెడి
సిబ్బియము } యొకదినుసుపొడ, శోఫ

సిర. స. నాడి, ఈనె, బోలునరము

సిరంగఁడు. త. శ్రీరంగనాథుఁడు

సిరంగము. త. శ్రీరంగము, దక్షిణదేశము నందలిదివ్యక్షేత్రము

సిరము. త. తల, చేల్లనిది, కర్పూరము

సిరము. స. పిప్పలికట్టె

సిరసు. త. తల

సిరా. దే. మషీరసము, కాగితముమీఁద వ్రాయుటకుపయోగించు ద్రవద్రవ్యము

సిరాజి } దే. దేశవిశేషము, శ్రేష్ఠము
సిరాజీ }

సిరాణము. దే. ఆయుధవిశేషము

సిరి. త. లక్ష్మి, సంపద, శోభ

సిరిగందము. త. శ్రీచందనము, శ్రీచందన వృక్షము

సిరిగట్టు. త. శ్రీశైలము

సిరిచూలి. దే. మన్మథుఁడు

సిరిమంతుఁడు. త. శ్రీమంతుఁడు

సిరిసింగణావత్తి. దే. బాలక్రీడావిశేషము

సిలాజిత్తు. త. ఒకానొకమందుదినుసు

సిలుగు. దే. ఉపద్రవము, ఆపద

సిల్హము. స. ధూపద్రవ్యవిశేషము, చిల్లమడ్డి

సివఁగి } దే. ఒకానొక మృగము, తరక్షువు
సివంగి }

సివము. దే. దేవతావేశము

సివ్వఁగి. దే. సివంగి

సిషాధయిష. స. ఋజువుపఱుపవలెనను నిచ్ఛ

సిసువు. త. పసిబిడ్డ, శిశువు

సిసృక్ష. స. సృజింపనిచ్ఛ

సిసృక్షువు. స. సృజింప నిచ్ఛగ్గలవాఁడు

సిసృప్స. స. పోవనిచ్ఛ

సిసృప్సువు. స. పోవనిచ్ఛగలవాఁడు
సిస్తు. దే అందము, సొంపు
సిల్గు దే. అంకుశము, బరిగోల

## సీ

సీ. దే జుగుప్సార్థమందు చెప్పుమాట
సీ. త. శ్రీ
సీకాయ. దే. జిడ్డును పోఁగొట్టెడి యొకా నొకకాయ
సీకారి. త. పాటపాడువాఁడు, గాయకుఁడు
సీత. స. శ్రీరాముని భార్య, నాఁగటిచాలు, ఆకాశగంగ
సీతాకోకచిలుక. దే. పెద్దఱెక్కలు గల యొకపురుగు
సీతాఫలము. స. ఒకానొకపండు
సీతాభోగములు. స. శాలిధాన్యవిశేషము
సీతు, సీతువు } త. చేలి, చేలికాలము
సీత్కారము. స. ధ్వనివిశేషము
సీత్యము. స. ఒకసారిదున్నిన భూమి
సీదరపుఁబెద్ద. దే. శేషుఁడు
సీదరము. దే. దారిద్ర్యము
సీదరము. త. సర్పము, సర్పకంచుకము
సీద్యము. స. సోమరితనము
సీద్రము. దే. సీదరము
సీమ. దే. దేశము, ప్రదేశము, రాజ్యము
సీమ. స. ఎల్ల, పెడతల, పరిమడి, గుఱుతు, ఒడ్డు, దిగంతము, మేర
సీమంతము. స. పాపట, గర్భిణీస్త్రీలకు చేయు నొకకర్మము
సీమంతితము. స. వేఱుచేయఁబడినది, వెండ్రుకలు
సీమంతిని. స. ఆఁడుది
సీమాటి. త. భాగ్యశాలినియైన యాఁడుది
సీరపాణి. స. బలరాముఁడు
సీరము. స. నాఁగలి
సీరాంగము. స. కఱ్ఱు
సీరి. స. నాఁగటిజోడు, బలరాముఁడు
సీల. దే. చీల
సీలమండ. దే. చీలమండ
సీవనము. స బట్టకుట్టుట
సీవని. స. సూది
సీవిరి. దే. వింజామరము, ఆలవట్టము
సీసకము. దే. కిరీటము, మల్లబంధవిశేషము
సీసకము. స. సీసము
సీసము. దే. మల్లబంధవిశేషము, ఒకానొక పద్యము, కోపము
సీసము. స. సత్తు

## సు

సు. స. మంచి, మిక్కిలి అనునర్థములను తెలుపునట్టి ఉపసర్గము
సుంకము. త. అమ్ముఁడుసరకులమీఁదిపన్ను, ప్రతిబంధము, శుల్కము
సుంకరి. దే. సుంకముతీయువాఁడు, శుల్కహారి
సుంకరిమెట్టు దే. సుంకము పుచ్చుకొనెడు చావడి
సుంకరీఁడు, సుంకీఁడు } దే. సుంకము పుచ్చుకొను వాఁడు
సుంకు. దే. సస్యకుసుమము, పెండ్లియందు పళ్లెరమునఁ బోసి వధూవరులమీఁద చెరుగు బియ్యము
సుంకు. త. ప్రతిబంధము
సుంకేసలము. దే. వృక్షవిశేషము
సుంత. దే. కొంచెము, రవంత

సుందరము. స. చక్కనిది
సుందరి. స. చక్కనియాఁడుది, స్త్రీ
సుందరుఁడు. స. చక్కనివాఁడు
సుకందకము. స. నీరుల్లి, మట్టుకాఁకర
సుకత. స. సాధువుకాని యావు
సుకము. త. సౌఖ్యము, భోగము
సుకర. స. సాధువైనయావు
సుకరము. స. సులభము
సుకర్మము.స మంచిపని,ఒకగ్రహయోగము
సుకలుఁడు. స త్యాగభోగవంతుఁడు
సుకవాసి. త. కష్టపడక సుఖముగ నుండు వాఁడు
సుకారి. దే. ఎద్దులమీఁద సరకెత్తించే కొని యూరూరు తిరిగి వర్తకముచేసెడి యొకనీచజాతి
సుకిని. త. సుఖపతి
సుకియ. దే. భక్ష్యవిశేషము, బూరె
సుకుమారము. స. పుండ్రేక్షువు, కోమలము
సుకుమారుఁడు. స. కోమలదేహుఁడు
సుకృతము. స. పుణ్యము, శుభము, చక్కఁగాఁ జేయఁబడినది
సుకృతి. స. పుణ్యవంతుఁడు,భాగ్యవంతుఁడు
సుక్కురుఁడు. త. శుక్రుఁడు
సుఖ. స, వరుణునిపట్టణము
సుఖజీవనము. స. కష్టములేనివృత్తి
సుఖము.స. సౌఖ్యము, స్వర్గము, సౌఖ్యము గలది, సంతోషము, అభివృద్ధి,క్షేమము, ఆరోగ్యము, దుఃఖోపశమనము
సుఖవర్చస్కము. స. సజ్జాకారము
సుఖవాసి. స. కారుబుడమమొక్క, సుకవాసి
సుఖి. స. యతి, సుఖముగలవాఁడు
సుఖించు. స. సుఖపడు
సుగంధి. స. నూఁగుదోస, ఇంపైనవాసన గలది
సుగంధిపాల. స. ఒకయౌషధి
సుగంధిమూల. స. మావలిమొక్క
సుగతుఁడు. స. బుద్ధదేవుఁడు
సుగమము. స. సులభము
సుగము. త. సుఖము
సుగుడి. దే. సరసుఁడు
సుగుణి. స. మంచివాఁడు
సుగుమారము. త. కోమలము
సుగ్గడితము. దే. తళుకుచే నేఁతగలవస్త్రము
సుగ్రీవుఁడు. స. ఒకవానరుఁడు, మంచి మెడ గలవాఁడు
సుచకము. స. మొట్టిఁగెడికుక్క
సుచరిత్ర. స. పతివ్రత
సుచేలకము. స. సన్నకోక, మంచివస్త్రము కలది
సుజనుఁడు. స. ఇంద్రునిసారథి, మంచి మనుష్యుఁడు
సుడాలము. స. అశ్వగతివిశేషము
సుడి. దే. జలావర్తము, రోమావర్తము, అనిలావర్తము, ఝుంకారపుగుఱుతు
సుడిఁబడు. దే. సుడిపడు
సుడికట్టు. దే. చక్రవాళపర్వతము
సుడిగాలి. దే. సుడియుగాలి, వాత్య
సుడిగొట్టు. దే. గాలి
సుడిగొను. దే. చుట్టుకొను
సుడిగోరు. దే తంతిమీటుటకు లోహముతోచేసి వ్రేలికి వేసికొనెడుగోరు
సుడియ. దే. తములపాకుల బరువునందు సగము, తుల్లవ

సుడియు. దే. చుట్టిచుట్టివిచు, చుట్టుకొను
సుడివడు. దే. చుట్టుకొను, కలంతపడు, చలించు, మూర్ఛిల్లు, చీకాకుపడు
సుడివాలు. దే. చక్రాయుధము
సుడివోవు. దే. వ్యర్థమగు
సుడుము. దే. నూఱుగొట్టెలగుంపు, దివటి
సుణుంగు. దే. మోసపుచ్చు
సుత. దే. మొదలుకొని
సుత. స. కూఁతురు
సుతనువు. స. కోమలమైన దేహముగలస్త్రీ
సుతము. స పోయఁబడినది, తీయఁబడినది, పుట్టింపఁ బడినది
సుతలము. స. పాతాళలోకము
సుతశ్రేణి. స. ఎలుకచెవిమొక్క
సుతి త. కంఠస్వరాములకు సహాయమగు తంత్రి మొదలగువాని ధ్వని
సుతికాఁడు. స. సుతిపోయువాఁడు
సుతిని. స. తల్లి
సుతుఁడు. స. కొడుకు, రాజు
సుత్తుమెత్తనివాఁడు. స. సుకుమారుఁడు
సుత్తె / సుత్తియ } దే. ఇనుము మొదలగు వానిని సాగఁగొట్టు సాధనము
సుత్య. స. సోమలతను కొట్టి పిడుచుట, సోమపానము, స్నానము
సుత్రాముఁడు. స. ఇంద్రుఁడు
సుత్వుఁడు. స. యజ్ఞమునందు సోమలతను కొట్టి పిడిచినవాఁడు
సుద. దే. కొన, తుద
సుదతి.స. చక్కనిపలువరుసగలస్త్రీ, ఆడుఁది
సుదర్శనము. స. విష్ణుచక్రము
సుదాయము. స. పెండ్లియందు అల్లునికి ఇచ్చెడి అరణము
సుదూరము. స. మిక్కిలిదవ్వు
సుద్ద. త. తెల్లమన్ను
సుద్దగించు. త. బంగారు లోనగువానిని సుత్తెతో మిట్టపల్లములు లేకశుద్ధపఱచు
సుద్దము. త. నిర్దోషము
సుద్ది. త. వృత్తాంతము, పరశుద్ధి,మాట, శుచి
సుద్దిగాఁడు. దే. పరిశుద్ధుఁడు
సుద్దిచేయు. త. శుద్ధిపఱచు
సుద్దులకుమారుఁడు. దే. గొల్లసుద్దులు మొదలగునవి చెప్పి జీవించువాఁడు
సుద్దులమారి. దే. ఆకతాయి
సుధ. స. అమృతము, పాలు, సున్నము, జెముడుమొక్క, ఇటిక
సుధర్మ. స. దేవసభ
సుధాంశువు / సుధాకరుఁడు } స. చంద్రుఁడు
సుధాపాణి. స. ధన్వంతరి
సుధి స. విద్వాంసుఁడు
సునాయాసము. స. మిక్కిలి సులభము
సునాసీరుఁడు. స. ఇంద్రుఁడు
సునిషణ్ణకము. స నీరుచెంచలి మొక్క
సున్న. త. అనుస్వారము, అభావము, మణిదోషవిశేషము
సున్నగిల్లు / సున్నగిలు } త. గుండ్రమగు
సున్నపుఁగాయ. దే. సున్నముంచుకొనెడు డబ్బి
సున్నపెట్టు. దే. సున్నను వ్రాయు, వంచించు
సున్నము. త. తెల్లని యొకదినుసు కారపు వస్తువు, చూర్ణము

సున్ని. త. మినుములు లోనగువాని పొడి, నలుగుఁ బిండి
సున్నితము. త. కచ్చితము, సరియైనది
సుపక్షము. స. మంచిత్రోవ
సుపర్ణి. స. గరుత్మంతునితల్లి
సుపర్ణము. స. పాలపిట్ట
సుపర్ణుఁడు. స. గరుత్మంతుఁడు
సుపర్వుఁడు స. వేల్పు
సుపాణి. త. ముత్యమునందలి శుభ్రమైన నీరు, శుభ్రమైన నీరుగల ముత్యము
సుపుంసి. స. మంచి భర్తగల స్త్రీ
సుప్తి. స. నిద్ర, తిమ్మిరి
సుప్తుఁడు. స. నిద్రించినవాఁడు
సుప్తోత్థితుఁడు. స. నిద్రనుండిలేచినవాఁడు
సుప్పాణి. త. సుపాణి
సుప్రతీకము. స. ఈశాన్యపు దిక్కునందలి యేనుఁగు, మంచి యవయవములుగలది
సుప్రలాపము. స. మంచిమాట
సుప్రసన్నత. స. ఉల్లాసము, తేట
సుబంతములు. స. నామవాచకపదములు
సుబాణము. దే. ఒకదినుసు పిరంగి
సుబ్బు. దే. బయలుపడు
సుబ్రహ్మణ్యుఁడు. స. కుమారస్వామి
సుభగ. స. మనోహరురాలు, భాగ్యవంతురాలు
సుభగము. స. సుందరము, యోగ్యమైనది
సుభగుఁడు. స. భాగ్యవంతుఁడు, అదృష్టవంతుఁడు
సుభద్ర. స. అర్జునుని భార్య
సుభిక్ష. స. ఆరెపువ్వు
సుభిక్షము. స. సులభభిక్షము కలది, మంచికాలము
సుమంగలి. స. ముత్తయిదువ
సుమనము. స. గోదుమలు [వాఁడు
సుమనస్కుఁడు. స మంచిమనస్సు గలవాఁడు
సుమనస్సు స. పువ్వు, వేలుపు, విద్వాంసుఁడు
సుమనోరజము. స. పుప్పొడి
సుమము. స. పువ్వు
సుమా. దే. చుమీ, సుమీ
సుమాళము. దే. సంతోషాదులవలనఁ గలిగెడుపారవశ్యము, సుఖము, ఆవేశము, అత్యుత్సాహము
సుమాళి. దే. సుమాళముగలవాఁడు
సుమాళించు. దే. సుమాళమునొందు, ఉల్లాసముచే గంతులువేయు
సుముఖత్వము.స.సుముఖత, ప్రసన్నవదనత
సుముఖుఁడు. స. గరుత్మంతుని కొడుకు, విద్వాంసుఁడు, చక్కని ముఖముగలవాఁడు
సుమేరువు. స. మేరుపర్వతము
సుయోధనుఁడు. స దుర్యోధనుఁడు
సుర. దే. గాలిసుడి, గాలి, పెద్ద
సుర.స మద్యము, మద్యపానముచేసెడుగిన్నె
సురంగము. స. సొరంగము, కన్నము
సురఁటి / సురఁటీ } దే. వట్రువ, విసనకఱ్ఱ
సురకాని. దే. కానిలో నాల్గవభాగము
సురకోలి. దే. ఒకదినుసు పిరంగి
సురగవి. స. కామధేనువు
సురగాలి. దే సుడిగాలి
సురజ్యేష్ఠుఁడు. స. బ్రహ్మ
సురట / సురటి } స. రాగవిశేషము

సురతము. స. స్త్రీపురుషుల కలయిక

సురతాణి. త. ఇంద్రుఁడు, ఇంద్రాణి

సురతుఁడు. స. దయగలవాఁడు

సురదీర్ఘిక. స. ఆకాశగంగ

సురద్విషుఁడు. స. అసురుఁడు

సురనిమ్నగ. స. ఆకాశగంగ

సురపతి. స. ఇంద్రుఁడు

సురపొది. దే. ఒకానొకచెట్టు

సురపున్నాగము. స. సురపొన్నచెట్టు

సురపొన్న. త. ఒకదినుసు పొన్నచెట్టు

సురభి. స. కామధేనువు, ఆవు, అందుగుచెట్టు, బంగారు, వసంతఋతువు, చైత్రమాసము, సంపెఁగచెట్టు, జాజికాయ మంచివాసనగలది, మనోహరమైనది

సురభితము. స. పరిమళింపఁ జేయఁబడినది

సురభిళము. స. మంచివాసనగలది

సురభీకరించు. స. వాసనగలదానిఁగాఁ జేయు

సురమాయి } దే. మిక్కిలి నల్లనిది
సురమా }

సురమాలి. దే. గాలినించిన తలగడ

సురర్షి. స. నారదాదిదేవఋషి

సురలు. స. దేవతలు

సురలోకము. స. స్వర్గము

సురవర్త్మము. స. ఆకాశము

సురస. స. నాగమాత, సర్పాక్షిచెట్టు

సురసము. స. తియ్యనిది

సురళించు. దే. చుట్టు, త్రిప్పు, సురాళించు

సురాచార్యుఁడు. స. బృహస్పతి

సురామండము. స. కల్లుతేట

సురాలయము. స. మేరుపర్వతము

55

సురాష్ట్రజము. స. తోఁగరిమన్ను

సురాళము. దే. కోపావేశము

సురాళించు. దే. దిగఁదుడుచు, నిర్లక్ష్యముతో త్రిప్పిపారవైచు

సురాళింపు. దే. దిగఁదుడుపు

సురిగ. దే. చిన్నకొమ్మ

సురిగి. దే. ఒకానొకచెట్టు

సురియ. త. చురకత్తి

సురియాళు. దే. మాలవాఁడు

సురుఁగు. దే. అదృశ్యమగు, పాఱు, జాడగాఁబోవు, చలించు [చెట్టు

సురుగుడు. దే. ఒకానొకఎఱ్ఱచాయచెక్క

సురుడు. దే. దివిటీకిమాఱుగా కాల్చి పట్టుకొనెడు వెలుతురుకట్టెలకట్ట

సురుము. దే. చూర్ణము, పొడి [డు

సురూపుఁడు. స. చక్కనివాఁడు, విద్వాంసుఁ

సురె. త. సురియ

సురెయాళు. దే. సురియాళు

సురేకారము. దే. ఒకదినుసు ఉప్పు

సురేజ్యుఁడు. స. బృహస్పతి

సురోదము. స. కల్లుసముద్రము

సుఱసుఱ. దే. ప్రుక్కుటయందగు ధ్వన్యనుకరణము

సులభము. స. సుఖముగా లభించునది, సులువు

సులభుఁడు. స. గడుసుమనుష్యుఁడు కానివాఁడు

సులోచనము. స ముక్కద్దము

సువర్చల. స. నింగిమిరిచెట్టు

సువర్ణకము. స. జేలచెట్టు

సువర్ణము. స. బంగారు, మాడ, ధనము, ఒకపువ్వు, మంచివర్ణముగలది

సువల్లి. స. కారుగచ్చేచెట్టు
సువహా. స. అందుగుచెట్టు, నల్లవావిలిచెట్టు, వీణ, సుఖముగ మోవఁదగినది
సువారము. త. వంట
సువాల
సువ్వాల
సువ్వలాల } దే. ఆఁడువారు పెండ్లిండ్లయందు సువ్వియనుపదముతో ఆలాపము చేసి పాడెడు పాట
సువాసిని. స. పేరంటాలు
సువేలము. స. పర్వతవిశేషము
సువ్రత. స. సులభముగా పిదుకందగిన యావు, మంచివ్రతము గలది
సువ్వి. దే. దంచునప్పు డుచ్చరించేపదము
సుషమ. స. మిక్కిలిశోభ, మనోజ్ఞమైనది, సరిసమానమైనది
సుషవి
సుశవి } స. జీలకఱ్ఱ, కాఁకరమొక్క
సుషి. స. రంధ్రము
సుషిమము. స. చల్లన, చల్లనిది
సుషిర. స. గువ్వగుత్తిక చెట్టు
సుషిరము. స. బెజ్జము, పిల్లఁగ్రోవి మొదలగు వాద్యము, బెజ్జముగలది
సుషుప్తి. స ఒళ్లెఱుఁగనినిద్ర, మంచినిద్ర
సుషుమ్న. స. ఒకనాడి, వెన్నెముకపొడుగుననుండు నాడి
సుషేణము. స. కలివిచెట్టు
సుషేణిక. స. నల్లతెగడచెట్టు
సుస్థ. స. చక్కన, బాగు, ఆరోగ్యము
సుస్థపఱచు. దే. చక్కఁబెట్టు
సుహృదుఁడు స. చెలికాఁడు
సుళువు
సులువు } త. సులభము, చేలుకన
సుళ్లమారి. దే. సుడులు గలవాఁడు, చేట్లఁబెట్టువాఁడు

## సూ

సూకరము. స. పంది
సూక్తము. స. చక్కఁగాఁ జెప్పఁబడినది
సూక్ష్మము. స. అధ్యాత్మము, కపటము, అణువు, సన్నము
సూచకము. స. సూది, తెలుపునది, కాకి
సూచకుఁడు. స. కొండెము చెప్పువాఁడు, బోధచేయువాఁడు [చూపు
సూచన. స. జాడ, గ్రుచ్చుట, తెలుపుట,
సూచనము. స. బొక్కపొడుచుట, కనఁబఱచుట, తెలియఁ జేయుట, హాని చేయుట
సూచి. స. సూది
సూచించు. స. జాడగాఁ దెలియఁజేయు
సూచిక. స. సూది, తెలియఁజేయునది
సూచికుఁడు. స. కుట్రపువాఁడు, కుట్టుపని చేయువాఁడు
సూచితము. స. జాడగా తెలుపఁబడినది
సూచిని. స. సూది
సూచీపత్రము. స. ఒక గ్రంథములోని యంశములను సూచించుపట్టీ
సూచీముఖము. స. అభినయహస్తవిశేషము, బాణము, పక్షివిశేషము, సూదిమొన
సూటి. దే. గుఱి,విధము,ఉపాయము,తిన్నని
సూటికాఁడు. దే. గుఱికాఁడు, అందగాఁడు
సూటిగొను. దే. సరిపడు, జేతపడు
సూటిపడు. దే. సరితాఁకు
సూడించు. దే. పగగొను

సూడిగములు. దే. ఆఁడుదానిచేతిగాజోలు, చేతికడియములు
సూడిద. దే. కానుక, వింతవస్తువు
సూడు. దే. పగ, పగవాఁడు, కోయు
సూడుకాఁడు. దే. శత్రువు
సూడుకొను. దే. పగగొను
సూడుపట్టు. దే విరోధించు
సూతకము. స. జాతాశౌచము, మృతాశౌచము, పాదరసము, పుట్టుక
సూతము. స. పాదరసము, సూతకము
సూతి. స. పుట్టు, ప్రసవము
సూతిక } స. బాలెంతరాలు
సూత
సూతికాగృహము. స. పురిటిల్లు
సూతిని. దే. దేశవిశేషము
సూతుఁడు. స. తేరుగడపువాఁడు, బట్టువాఁడు, వడ్లంగి
సూత్థానుఁడు. స. నేర్పరి
సూత్రధారుఁడు. స. ఆటాడించువాఁడు, నడపించువాఁడు, వడ్లంగి
సూత్రపట్టు. దే. దారముపట్టు
సూత్రపడు. దే, జతపడు
సూత్రము. స. నూలిపోఁగు, శాస్త్రాదిసూచనాగ్రంథము, జన్నిదము, ఏర్పాటు
సూత్రించు. స. సూత్రపఱచు
సూత్రితము. స దారమునకు గ్రుచ్చఁబడినది, ఏర్పఱుపఁ బడినది, సూత్రములయందుఁ జెప్పఁబడినది
సూదంటుఱాయి. దే. అయస్కాంతము
సూదకర్మ. స. వంట
సూదకుఁడు. స. వంటవాఁడు
సూదనము. స. చంపుట, చంపునది
సూదము. స వండినపప్పు, నాశము, బావి, చారు, బురద, తప్పు
సూదశాల. స. వంటయిల్లు
సూది. త. గుడ్డలు కుట్టుసాధనము
సూదిగొంటు. త. ఒకదినుసు పోఁక
సూదితము. స. చంపఁబడినది
సూదిరాయి. దే. సూదంటుఱాయి
సూదుఁడు. స. వంటవాఁడు
సూన. స. కూఁతురు, కొండనాలుక, వధస్థానము, మేఁకలు మొదలగువానిని కోయుస్థలము
సూనగాఁడు } గ్రా. చంపువాఁడు, కటికవాఁడు
సూనరి
సూనము. స. ప్రసవము,పుష్పము,కుసుమము
సూనములు } స. చీమలు మొదలైనజీవజంతువులప్రాణములనుపోఁగొట్టునట్టి, ప్రొయి, సన్నికల్లు, చీఁపురు, ఱోలు, నీటికుండయు ననునీదైదుగృహోపకరణములు
శూనములు
సూనుఁడు.స.కొడుకు, తమ్ముఁడు, సూర్యుఁడు
సూనృతము. స. శుభము, ప్రియమును సత్యమును అయినమాట, నిజము
సూపకారుఁడు } స. వంటవాఁడు
సూపుఁడు
సూపధూపకము. స ఇంగువ
సూపము. స. వండినపప్పు
సూపశాస్త్రము. స. పాకవిద్య
సూయమానము. స. హోమము చేయఁబడుచుండునది

సూయాణము. త. శత్రుభయంకరమైనదండయాత్ర
సూరణము. స. కందగడ్డ
సూరతము. స. శాంతమైనది
సూరసూతుఁడు. స. అనూరుఁడు
సూరి. స. సూర్యుఁడు, పండితుఁడు
సూరి. త. కత్తి, ఛురిక
సూరుఁడు. స. సూర్యుఁడు
సూరెగిలు, సూరెగిల్లు } దే. ప్రక్క కొదుగు
సూరెపాను. దే. ఆలవట్టము
సూరెపుటము. త. సూర్యపటము
సూరెలు. దే. పార్శ్వము
సూర్మి, శూర్మి } స. లోహపుప్రతిమ
సూర్యకాంతము. స. సూర్యరశ్మి తగులుటచే నిప్పుకలిగెడు ఒకదినుసుఱాయి
సూర్యతనయ. స. యమునానది
సూర్యపటము స. మేలుతరపు మొకమాలు
సూర్యావర్తము. స. ప్రొద్దుతిరుగుడుపువ్వు
సూర్యుఁడు. స. వెలుఁగుఱేఁడు
సూర్యానువర్తిని. స. ప్రొద్దుతిరుగుడుచెట్టు
సూల. త. రోగవిశేషము
సూలచేకటులు. దే. హస్తభూషణములు
సూసకము. దే. స్త్రీలు తలను ధరించెడు తిరుగుడుబిల్ల
సూసరి. దే. సున్నముపూయువాఁడు, లేపకుఁడు
సూళ్మము. స. గీతవిశేషము

## సృ

సృక్వము, సృక్వి } స. పెదవిమూల, సెలవి
సృగము. స. భిండివాలము
సృగాలము. స నక్క
సృగాలిక. స. ఆఁడునక్క
సృజన. స. సృష్టి
సృజించు స. సృష్టిచేయు, కలుగఁజేయు
సృజ్యము. స. సృజింపఁదగినది
సృణి. స. అంకుశము
సృణిక, సృణీక } స. చొంగ
సృతి. స. త్రోవ, పోక
సృమరము. స. పెద్దచమరమృగము
సృష్టము. స. సృజింపఁబడినది,విడువఁబడినది
సృష్టి. స. సృజించుట, స్వభావము
సృష్టియగు. దే. పుట్టు, కలుగు

## సె

సెక, సెగ } త. జ్వాల, తాపము, వేఁడిమి
సెకకంటి. దే. శివుఁడు
సెకవెలుఁగు. దే. సూర్యుఁడు
సెగఱేఁడు. దే. అగ్ని
సెగ్గము. దే. రోఁత, నింద్యము
సెగ్గించు. దే. రోయు, నిందించు
సెగ్గింపు. దే. రోఁత, నింద
సెగ్గు దే. రోఁత, నింద
సెజ్జ. త. శయ్య
సెట్టి. త. కోమట్లులోనగువారి పట్టపుఁబేరు, వర్తకుఁడు
సెనగ దే. చణకసస్యము
సెపియించు, సెపించు } త. శపియించు
సెబాసు. దే. బళీ

సెబ్బర / సెబ్బ } దే. చెడుగు, చెడ్డది
సెమ్మె. త. ఇత్తడిదీపస్తంభము
సెర. దే. నేత్రమునందలిరేఖ
సెరగు. దే. ఆపద
సెరబడి. దే. స్నేహము
సెరింత. దే. నవ్వు, హాస్యము
సెల. త. సెలయేఱు, బాణపుములికి, పిదుపంది ముల్లు, కత్తిచివరయందలి యినుపముల్లు, బాణము, వ్రణమునందు చీము వ్యాపించెడి రంధ్రము, నదీమూలము, బరిక, బొక్క
సెలకట్టె / సెలకట్టియ } త. బాణము, శ్యేనవిశేషము
సెలగ. దే. ఉపశాఖ
సెలగత్తి. దే. కల్లుగీచువానికత్తి
సెలగు. దే. ఖండించు, చెల్లు
సెలగులు. దే. చిక్కులు
సెలగొమ్మ. దే. ఉపశాఖ
సెలగోల. దే. చెబుకుకట్టినచిన్నకఱ్ఱ, గొల్లవాఁడు పసులమేపెడుకోల
సెలపంది. దే. ముండ్లపంది
సెలపుండు. దే. నారికుఱుపు, నాడీవ్రణము
సెలయు. దే. విజృంభించు, ఓమ్ము, నఱుకు
సెలయూట. దే. కొండయూట
సెలయేఱు. దే. పర్వతమునుండి పాఱెడునది
సెలపడు / సెలవాఱు } దే. సెలవేయు
సెలవి. త. పెదవిమూల
సెలవిచ్చు. దే. ఆజ్ఞాపించు
సెలవిల్లు / సెలసువిల్లు } దే. సెలసుబద్దలతోఁజేసిన విల్లు
సెలవు. దే. సెలగు, ఆజ్ఞ, ఉపయోగము, వ్యయము, విడుపు
సెల్లా. త. అంచుకమ్ములులేని తెల్లవస్త్రము
సెల్లుఁడు. త. శల్యుఁడు
సెవ. త. సెగ

## సే

సేకము. త. సెగ, ఉష్ణము
సేకము. స. చెల్లుట, తడుపుట
సేకరము. త. సంగ్రహము
సేకరించు. దే. తెప్పించెల్లు
సేకరించు. త. సంగ్రహించు, సంపాదించు
సేగి. దే. నష్టి, ఆపద, కీడు
సేగిపోవు. దే. వ్యర్థమైపోవు
సేచకము. స. మేఘము, చెల్లునది, తడుపునది
సేచకుఁడు. స. తడిపెకువాఁడు
సేచనము. స చెల్లుట, తడుపుట
సేడుకఱ్ఱ. దే. సాలెవానిసాధనవిశేషము
సేతువు. స. నీటికట్ట, శ్రీరాములు కట్టించిన [వారధి
సేద. త. బడలిక, శ్రమము
సేదగొను. దే. బడలు, శ్రమమునొందు
సేద్యకాఁడు. దే. సేద్యముచేయువాఁడు
సేద్యము. త. పైరుపెట్టుట, కృషి
సేన. దే. బహువు, అధికము
సేన. స. సైన్యము
సేనము. దే. చిన్నయులి
సేనాంగము. స. రథ గజ తురగ పదాతి చతుష్టయము
సేనాని. స. కుమారస్వామి, సేనాధిపతి

సేనాపతి. స. సేనానాయకుఁడు, మొన గాఁడు
సేనాముఖము.స. సేనయొక్క అగ్రభాగము
సేపు. దే. కాలము
సేబాసు. దే. సెబాసు
సేమంతిక } స. చేమంతి మొక్క
సేమంతి }
సేమము. త. క్షేమము, ఉన్నదిచెడకుం డుట, శుభము
సేరు. దే. ఆఱువదినాలుగు డబ్బులయెత్తు పట్టెడుమానవిశేషము, ఇఱువదినాలుగు తులములయెత్తు, ఇఱువదిడబ్బులఎత్తు
సేల. త. వస్త్రము
సేలు.దే.సాలు,రాంకవము, సూక్ష్మవస్త్రము
సేవ. స. శుశ్రూష, కొలువు, అనుసరణ, పూజ, చెప్పిన పని చేయుచుండుట, గౌర వించుట, భక్తి, వాడుక, తఱచుచచ్చు చుండుట, స్తోత్రము, బుజ్జగించుట
సేవకము. స. వీణకరివె, ప్రసేవకము
సేవకవృత్తి. స. కొలువుచేసిజీవించుట
సేవకుఁడు. స. కొలువుడుకాఁడు
సేవధి. స. నిధి
సేవనము. స. కొలువు,కుట్టు, అనుభవించుట
సేవని. స. సూది
సేవి } స. సేవకుఁడు
సేవిత }
సేవించు. స. కొలుచు, పుచ్చుకొను, నమ స్కరించు
సేవిక }
సేవ్య } త. గోదుమనూకతో సన్నగా తాలి కలుచేసి పాలుపోసి వండెడి భక్ష్యవిశేషము
సేవె }
సేవితుఁడు. స. సేవింపఁబడినవాఁడు, నమ స్కృతుఁడు
సేవ్యము. దే. దున్ని సిద్ధము చేసినపొలము
సేవ్యము. స. వట్టివేరు, సేవింపఁదగినది
సేవ్యుఁడు. స. సేవింపఁదగినవాఁడు
సేస. త. అక్షత, పాపట, సేసఁబ్రాలు
సేసఁబ్రాలు. త. తలఁబ్రాలు
సేసకొప్పు. దే. కొండెసిగ
సేళము. స. ఒకానొకచెట్టు

## సై

సై } త. సహాశబ్దార్థకము
సయి }
సైంధవము. స. ఇందుప్పు, గుఱ్ఱము, సింధు వునఁ బుట్టినది
సైంహికేయుఁడు. స. రాహుగ్రహము
సైఁచు } త ఓర్చుకొను, రుచించు
సయిఁచు }
సైఁదము దే. గోదుమపిండి
సైఁపు } త. ఓర్పు
సయిఁపు }
సైఁపుడు } త. ఓర్పు
సయిఁపుడు }
సైకతము. స. ఇసుకదిబ్బ, ఇసుకనేల
సైకము } దే. సూక్ష్మత్వము, సూక్ష్మము
సయికము }
సైగ } త. హస్తాదులసంజ్ఞ
సయిగ }
సైతము } త. కూడ
సయితము }
సైతవాహిని. స. బాహుద యనెడునది
సైదోఁడు. దే. తోఁబుట్టువు

సైద్ధాంతికుఁడు. స. సిద్ధాంతము తెలిసిన వాఁడు

సైనికుఁడు. స. సేనాధిపతి

సైన్యము. స. సేన. సేనతోఁ గూడినది

సైరంధ్రి. స. గట్టువాలు, అంతఃపురపు కావలికత్తె, సంకరజాతిస్త్రీ, పరగృహమందుండి స్త్రీలకు శృంగారాదులను జేయుచునట్టి పతివ్రత

సైరంధ్రుఁడు. స. నీచసేవకుఁడు

సైరణ / సయిరణ } త. సహనము

సైరించు / సయిరించు } త. సైరణచేయు

సైరికము. స. దున్నెడియెద్దు, నాఁగలి సంబంధమైనది

సైరికుఁడు. స. దున్నెడువాఁడు

సైరిభము. స. కారెనుపోతు, స్వర్గము

సైరేయికము. స ములుగోరంట మొక్క

సైసకరము స. సీసముతోఁ జేయఁబడినది

## సొ

సొంటి. త. పక్వముచేసి యెండఁబెట్టిన అల్లము

సొంటు. త. తప్పు, దోషము

సొంతము. త. స్వకీయము, తనది

సొంపారు. దే. ఒప్పు

సొంపిల్లు. దే. సొంపగు, శోభిల్లు

సొంపు. దే. ఒప్పు, సమృద్ధి, సంతోషము, ప్రసన్నత,సుఖము, సౌందర్యము,కాంతి

సొక్కించు. దే. పరవశతను పొందించు

సొక్కు. త. చొక్కు, ఇంచుకంత శరీర విస్మృతి, మత్తు

సొగటాలు. దే. జూదమాడుసారెలు, పగడసాలాట

సొగటు. దే. వాదు

సొగపు / సొగయిక } త. చొక్కు, పారవశ్యము

సొగయించు. దే. చొక్కించు

సొగయు.త.పరవశత్వమునొందు,మూర్ఛిల్లు

సొగసు. త. అందము, పారవశ్యము

సొగసుకత్తె. త. వికటకత్తె, అందకత్తె

సొగసుకాఁడు.దే. విటకాఁడు, అందగాఁడు

సొగియించు. త. సుఖించు

సొగియు. త. ఇంపగు

సొచ్చెము. త పెచ్చు, అధికము, నిర్మలము, చిల్లర

సొజ్జె. దే. బియ్యమువేఁచివండినయన్నము

సొజ్జెబూరె. దే. భక్ష్యవిశేషము

సొటసొట. దే. కార్శ్యము

సొటసొటవోవు / సొటసొటలువోవు / సొటసొటలాడు } దే. కృశించు

సొట్ట. దే. అంగవైకల్యము, చొట్ట, నొక్కు

సొడ్డు. దే. న్యూనత, కొఱఁత, ఆటలో నోడినవాని తలమీఁదవేయుదెబ్బ

సొత్తు. త. సొమ్ము, సత్వము

సొద. త. పీనుఁగును గాల్చుటకుఁ జేర్చిన కట్టెలులోనగు వానిప్రోగు, చిత్యగ్ని, దుఃఖవార్త, దుఃఖము

సొన. దే. స్రవించునది, చెట్టుకాయ మొదలగునవి కోయఁగావచ్చు పల్చని నిర్యాసము, ఎండలోనగువానిమీఁదినూఁగు, ఊటకాలువ, గ్రుడ్డులోని జెన

సొన్నము. త. బంగారు, మాడ

సొన్నారి. దే. అగసాలెవాఁడు
సొబగు. త. సౌందర్యము
సొబగుఁడు. త. చక్కనివాఁడు, విటుఁడు
సొబను. దే. బడబచూలు
సొమ్మ. త. మూర్ఛ
సొమ్మగొను
సొమ్మపోవు } త. మూర్ఛిల్లు
సొమ్మసిల్లు
సొమ్ము. త. ధనము, ఆభరణము, గోధనము, అధీనవస్తువు
సొయ్యాక. దే. వాద్యవిశేషము
సొర. దే. వ్యాకులత, మత్స్యభేదము
సొరంగము. త. గుహావలెతొలిచినరంధ్రము
సొరగు. దే. లీనమగు
సొరదోఁకి. దే. దురాచారుఁడు
సొరపు. దే. కృశము
సొరము. త. కంఠధ్వని, షడ్జాదిస్వరము
సొరిది. దే. వరుస, క్రమము, అత్యంతము
సొరుగు. దే. మూర్ఛిల్లు, మూర్ఛ, ఎండాకు, పెట్టెయఱ
సొఱ
సొఱ్ఱ } దే. తుంబీలత, ఆనుగుమొక్క
సొలపు దే. పారవశ్యము, వైముఖ్యము
సొలయిక. దే. వైముఖ్యము
సొలయు. దే. మూర్ఛపోవు, అలయు, వెసుదీయు, వైరస్యము నొందు
సొలిమిడి. దే. మూర్ఛ
సొవ. దే జోడ, సవ, గుసగుస
సొల్లెము. దే. సెమిలియాఁక, సెమిలి యాఁకలు చుట్టిన పాగ

## సో

సోఁకించు. దే. తాఁకించు
సోఁకు. దే. తగులు, గ్రహావేశించు, స్పర్శము, పిశాచము, రాక్షసుఁడు
సోఁకుఁజుక్క. దే. మూలానక్షత్రము
సోఁకుటొజ్జ. దే. శుక్రుఁడు
సోఁకుడు. దే. స్పర్శము, గ్రహావేశము, పిశాచము, రాక్షసుఁడు
సోఁకుడుముడుఁగు. దే. ఓషధీవిశేషము
సోఁకుదయ్యము. దే. వాయువు, స్పర్శనము
సోఁకులఱేఁడు. దే. నైరృతి
సోఁగు. త. సరము
సోఁపు. దే. ఒకానొకసంబారపుదినుసు
సోఁపుబిండి. దే. చణకపిష్టము, చమసి
సోగ. దే. దైర్ఘ్యము, దీర్ఘము
సోడు. దే. మాడపట్టు, బ్రహ్మరంధ్రము
సోడుముట్టు. దే. తలకెక్కు, అంతట వ్యాపించు
సోఢ. స. ఓర్చువాఁడు
సోఢము. స. ఓర్వఁబడినది
సోఢవ్యము. స. సహింపఁదగినది
సోణము. దే. నాసామూలము
సోత్సుకము. స. చింతగలది
సోత్ప్రాసము. స ఎత్తిపొడుపుమాట
సోద. దే. గచ్చు, గార
సోదన. త. శోధనము, శకునార్థము రామాయణము మొదలైన గ్రంథములయందు పుల్లవేసి శోధించుట
సోదర. స. అక్క, చెల్లెలు
సోదరి. స. తోడఁబుట్టినది

సోదరుఁడు / సోదర్యుఁడు } స. తోడఁబుట్టినవాఁడు

సోదించు. త. శోధనచేయు

సోదె / సోదియ } త. రాఁగలమేలుకీడులనుగూర్చి చేయుప్రశ్నము

సోదెకత్తె. త. సోదె చెప్పునది

సోదెము / సోద్దెము } త. ఆశ్చర్యము, చోద్యము

సోద్వేగము. స. చింతగలది

సోధ్రకము. స. బిల్లుచెట్టు

సోన. దే. అల్పవర్షము, వర్షము

సోపధి. స. మోసము గలది

సోపనము. త. మెట్టు [వాఁడు

సోపప్లవుఁడు. స. రాహువుచేత పట్టబడిన

సోపాకుఁడు. స. నీచజాతివాఁడు [గలది

సోపాధి. స. మేరగలది, ఏదోవేఱుగుణము

సోపానము / సౌపానము } స. మెట్లు

సోబ. త. వ్యాధివిశేషము, శోఫ

సోబనము. త. మంగళము

సోబనవారము. త. మంగళవారము

సోబాన. త. ఒకవిధమైన పెండ్లిపాట

సోబె / సోబియ } త. సిబ్బెము, పాఁడ

సోమ. త. శ్రమము, పరాక్రమము

సోమకర్కటి. స. కరపుచ్చెమొక్క

సోమధార. స. ఆకాశగంగ

సోమపీథి / సోమపీతి / సోమపుఁడు } స. యజ్ఞమునందు సోమపానము చేయువాఁడు

సోమము. త. పరాక్రమము

సోమము. స. తిప్పతీగ,జలము,కర్పూరము

సోమయాజి. స. యజ్ఞముచేసినవాఁడు

సోమరాజి. స. కాఁపుగచ్చెచెట్టు

సోమరి. దే. అలసుఁడు, మందుఁడు

సోమలము. స. కోమలము, మెత్తనిది [చెట్టు

సోమవల్కము. స. వెలిచేండ్రచెట్టు, తేఁకు

సోమవల్లరి. స. సోమెదకూర

సోమవల్లి. స. తిప్పతీఁగ

సోమవారము. స. ఒకవారము [పోవుదారి

సోమసూత్రము. స. పానవట్టమునుండినీళ్లు

సోమాసి. త. సోమయాజి

సోమించు. త. సరిపోలు, పరాక్రమించు, విజృంభించు, వ్యాపించు

సోమిద. త. తిప్పతీఁగ

సోమిదము. దే. శణపర్ణివృక్షము

సోమిదమ్మ / సోమిసాని } త. సోమయాజి భార్య

సోము. త. సుఖము, ఆసక్తము

సోముఁడు. స. చంద్రుఁడు, శివుఁడు, పితృదేవత, కుబేరుఁడు

సోమెద. త. ఒకదినుసుకూరాకు

సోమోద్భవ. స. నర్మదానది

సోయగము. దే. అందము

సోరణగండ్లు / సోర్ణగండ్లు } దే. గవాక్షము

సోరణము. దే. గవాక్షము

సోరు. దే. పెట్లుప్పు

సోల. దే. పసునాఁజుడబ్బులయెత్తువస్తువు పట్టెడు మానవిశేషము, నికుంచకము

సోలము. దే. మత్తు, చొక్కు

సోలవెలితిగ. దే. కొంచెముతక్కువగ, నిర్ల
సోలాడు. దే. వ్యాపించు [క్ష్యముగ
సోలించు. దే. వివశునిగాఁజేయు
సోలింత. దే. వివశత్వమునొంది వ్రాలుట
సోలు. దే. వివశత్వమునొంది వ్రాలు
సోలుపు దే. వరుస
సోల్లుంఠనము. స. ఎత్తిపొడుపుమాట
సోళాదొప్పి. దే. ద్యూతవిశేషము

## సౌ

సౌందర్యము. స. చక్కఁదనము
సౌకర్యము. స. అనాయాసము, సూకరభావము, సులభము, నేర్పు [త్వము
సౌకుమార్యము. స. సుకుమారత్వము, మృదు
సౌఖశాయనికుఁడు, సౌఖసుప్తికుఁడు } స. రాజులను నిద్రమేల్కొలుపువాఁడు, సుఖనిద్రయాయని ప్రశ్నము చేయువాఁడు
సౌఖ్యము. స. సుఖము
సౌగంధికము. స. చెంగలువ, మాణిక్యవిశేషము, కామంచిమొక్క, గంధకము
సౌగంధికుఁడు. స. సుగంధవస్తువుల వ్యాపారము చేయువాఁడు
సౌగంధ్యము. స. వాసన, పరిమళము
సౌగమ్యము. స. సులభము, సౌకర్యము
సౌచికుఁడు. స. కుట్టుపువాఁడు [శాంతము
సౌజన్యము స. సుజనత్వము, మంచితనము,
సౌదర్యము. స. సోదరభావము
సౌదామని, సౌదామిని } స. మెఱపు

సౌదాయికము. స. తల్లితండ్రులచేత నేనియు అన్నదమ్ములచేత నేనియు నియ్యఁబడు స్త్రీధనము, అరణము
సౌధము. స. రాజగృహము, నగరు, మేడ
సౌనందము. స. బలరాముని ముసలము
సౌనికుఁడు. స. మృగపక్ష్యాదులనుజంపివిక్రయించి జీవించువాఁడు, కటికవాఁడు
సౌప్తికము. స. నిద్రించుటలోనగు సమయములందు శత్రువులపైఁ బడి చంపుట, మహాభారతమునందలి యొకపర్వము
సౌభగము. స. క్షేమము, సౌఖ్యము, అదృష్టము, భాగ్యము
సౌభాగినేయి. స. భాగ్యవతికూఁతురు
సౌభాగినేయుఁడు. స. భాగ్యవతికొడుకు
సౌభాగ్యము. స. సుభగత్వము, ఒకగ్రహయోగము
సౌభాగ్యవతి. స. మంచిభార్య, మంచిస్త్రీ, ముత్తైదువ
సౌభ్రాత్రము.స.మంచితోఁడఁబుట్టుఁదనము
సౌమనస్యము. స. సుమనోభావము, తృప్తి
సౌమ్య. స. ఒకసంవత్సరము
సౌమ్యము. స. శాంతము,తిన్నని,సుందరము
సౌమ్యుఁడు.స.బుధగ్రహము, తిన్ననివాఁడు
సౌరభము. స. వాసన, కుంకుమము, ఎద్దు
సౌరభేయము. స. ఎద్దు
సౌరభేయి. స. ఆవు
సౌరభ్యము. స. వాసన, ఒప్పిదము, గుణగౌరవము
సౌరమానము. స. సూర్యగతినిబట్టి కాలమానము

సౌరము. స. ఒకమతము, సూర్యసంబంధమైనది

సౌరస్యము. స. రుచి

సౌరాష్ట్రము. స. ఒకదేశము, రాగవిశేషము, కంచు

సౌరాష్ట్రికము. స. విషభేదము, సౌరాష్ట్ర దేశ సంబంధమైనది

సౌరి. స. శనైశ్చరుఁడు, యముఁడు

సౌరికుఁడు. స. కల్లమ్మువాఁడు, కబ్బిలి

సౌరు } దే. అందము, విధము, మనోజ్ఞము
సవురు }

సౌవర్చలము. స. ఒకదినుసు ఉప్పు

సౌవర్ణకరణి స. ఓషధీవిశేషము

సౌవర్ణి. స. బంగారుతోఁజేసిన

సౌవర్ణికము.స. నాలుగుమినుపగింజలయెత్తు

సౌవిదల్లుఁడు } స. అంతఃపురపు కావలి వాఁడు
సౌవిదుఁడు }

సౌవీరము. స. పులియఁబెట్టిన కడుగునీళ్లు, నీలాంజనము, రేఁగుబండు, ఒకానొక దేశము

సౌవీర్యము.స.గొప్పపరాక్రమము,శౌర్యము

సౌశీల్యము. స. సుశీలత్వము

సౌష్ఠవము. స. సుష్ఠుభావము, చేక్కఁదనము

సౌహార్దము. స. స్నేహము

సౌహిత్యము. స. తృప్తి, పూర్తి, స్నేహ భావము

సౌహృదము } స. స్నేహము
సౌహృద్యము }

## స్క

స్కందనము. స. జాఱుట, విరేచనము

స్కందుఁడు. స. కుమారస్వామి

స్కంధము. స. మూఁపు, చెట్టుబోదె, యుద్ధము, సమూహము, శరీరము, ప్రకరణము, మగగుఱ్ఱి, విషము, పాపము, నేరము

స్కంధపట్టిక.స. తలుపునకమర్చెడుగందపట్టె

స్కంధశాఖ. స. మ్రానిమొదటికొమ్మ

స్కంధావారము. స. దండువిడిసినచోటు, దాఁడు

స్కన్నము. స. జాఱినది

## స్ఖ

స్ఖలనము. స. జాఱుపాటు, తొట్రుపాటు

స్ఖలించు స. జాఱు, తొట్రుపడు

స్ఖలితము. స జాఱినది, తొట్రుపడినది, పొరపాటు

## స్ఖా

స్ఖాలిత్యము. స. స్ఖలితభావము, పొరపాటు

## స్త

స్తంబకరి. స. ధాన్యము

స్తంబఘనము } స. కొడవలి
స్తంబఘ్నము }

స్తంబము. స. వరిలోనగువానిగుంట, బోదె లేని చిన్నచెట్టు

స్తంబేరమము. స. ఏనుఁగు

స్తంభనము. స. మ్రానుపడఁజేయుట, మంత్రశక్తిచేత అగ్ని లోనగువానిశక్తిని అణఁగఁజేయుట

స్తంభబలి. స. ఉపనయనమునందుఁ గడ పటిదినముచేయు స్తంభపూజ లోనగు నది, కంబవల్లి

స్తంభము. స. కంబము, మ్రానుపాటు, స్థిరత, తెలివిలేమి, అడ్డంకి, నిర్బంధము, ఆధారము, మొద్దు, సహజ శక్తులను నిలుపుట

స్తంభయిత. స. స్తంభించువాఁడు

స్తంభించు. స. మ్రానుపడు [చేంటిపాప

స్తనంధయ. స. పాలుద్రాగెడు ఆఁడుబిడ్డ,

స్తనంధయుఁడు.స. పాలుత్రాగెడు మగబిడ్డ,

స్తనము. స. కుచము, చన్ను [చేంటిపాప

స్తనయిత్నువు స. మబ్బు, ఉఱుము

స్తనితము. స. ఉఱుము

స్తన్యము. స. చనుఁబాలు

స్తబకము. స. పూగుత్తి, ప్రకరణము

స్తబ్ధత. స. దృఢత, కాఠిన్యము

స్తబ్ధము. స. అణఁగినది, చేష్టారహితము, దృఢము, నిక్కపొడుచుకొన్నది

స్తబ్ధరోమము. స. పంది

స్తమితము స. తడిసినది, తడిది, శాంతమైనది, మూయఁబడినది, మెత్తనిది, తృప్తి పొందినది, లేమ, స్థిరత

స్తరణము. స. పఱచుట

స్తవకుఁడు
స్తావకుఁడు } స. స్తోత్రము చేయువాఁడు

స్తవము
స్తావము } స. స్తోత్రము

## స్తి

స్తిమితము. స. కదలనిది, తడిసినది, నిలుకడ

## స్తు

స్తుతము. స. స్తోత్రము చేయఁబడినది

స్తుతి. స. స్తోత్రము, పొగడిక

స్తుతించు. స. స్తోత్రముచేయు, పొగడు

స్తుతిపాఠకుఁడు స. బట్టువాఁడు

స్తుత్యము. స. స్తోత్రము చేయఁదగినది

## స్తూ

స్తూపము. స. మట్టిమొదలగువానిదిబ్బ, రాశి, చితి, శక్తి

## స్తే

స్తేనుఁడు. స. దొంగ

స్తేమము. స. తడియుట

స్తేయము. స. దొంగతనము

స్తేయి. స దొంగ, కంసాలి

## స్తై

స్తైన్యము. స. దొంగతనము

స్తైమిత్యము. స. నిలుకడ, తిమ్మిరి

## స్తో

స్తోకకము. స. చాతకపక్షి, వానకోయిల

స్తోకము. స. నీటిబొట్టు, వానకోయిల, అల్పము

స్తోతవ్యము. స. స్తుతింపఁదగినది

స్తోత్రము. స. స్తుతి, పొగడిక

స్తోభము. స. నిలుపుదల,అమర్యాద, మాయమాటలు

స్తోమము. స. సమూహము, స్తోత్రము, భాగ్యము

## స్త్యా

స్త్యానము. స. గుంపుగాచేరినది, దళమైనది, మద్దగానైనది

స్త్ర్యాయనము. స. గుంపుగూడఁ గూడుట, ముద్దగానగుట

## స్త్రీ

స్త్రీ. స. ఆఁడుది, జంతువులలో నాఁడుది, భార్య
స్త్రీగురువు. స. బోధకురాలు
స్త్రీఘోషము. స. వేకువ, ప్రభాతము
స్త్రీజనని. స. ఆఁడుబిడ్డలనుమాత్రముకన్న యాఁడుది
స్త్రీధనము. స. స్త్రీద్రవ్యవిశేషము
స్త్రీధర్మిణి. స. ఋతుమతి, ముట్టుది
స్త్రీభూషణము. స. మొగలిచెట్టు
స్త్రీరంజనము. స. తాంబూలము

## స్త్రై

స్త్రైణము. స. స్త్రీస్వభావము, స్త్రీసంబంధమైనది

## స్థ

స్థండిలము. స. వ్రతముపూనినవాఁడు, పండుకొనుటకు దర్భాదులచే సంస్కరింపఁబడినభూమి, చేక్కఁజేయఁబడినభూమి, మేర, మట్టిగడ్డలదిబ్బ
స్థగనము. స. కప్పు, ఆచ్ఛాదనము, దాఁచుట
స్థగితము. స. కప్పఁబడినది, ఆచ్ఛాదితము
స్థపతి. స వడ్లవాఁడు, అంతఃపురపుకావలివాఁడు, రాజు, శ్రేష్ఠుఁడు
స్థపుటము స. మధ్య వంగిపార్శ్వములయందు ఉన్నతమైనది
స్థలపద్మిని. స. మెట్టదామర
స్థలము, స్థలి. స. మెట్టనేల
స్థవిరుఁడు. స. ముసలివాఁడు
స్థవిష్ఠము. స. మిక్కిలిస్థూలము
స్థవీయము. స. రెంటికంటె మిక్కిలిస్థూలము

## స్థా

స్థాండిలుఁడు. స. స్థండిల భూమియందు శయనించెడువ్రతి, స్థండిలశాయి
స్థాణువు. స. మేకు, శివుఁడు, కొమ్మలులేని చెట్టు, మ్రోడు, స్థిరమైనది
స్థాత. స. ఉండువాఁడు
స్థాతవ్యము. స ఉండఁదగినది
స్థానము. స. చోటు, ఉనికి, పోలిక, ఉద్యోగము, సంగతి, పవిత్రమైన తావు, దిగియున్నతావు, నివాసము, కదలక స్థిరముగా నుండుట, సంబంధము, ఇల్లు, దేశము, పట్టణము
స్థాని. స. స్థానముగలది
స్థానికము. స ఒకస్థలమునకు సంబంధించినది
స్థానికుఁడు. స స్థానమునకధ్యక్షుఁడు, గుడిపారుపత్తెకాఁడు
స్థానీయము. స. పట్టణము
స్థాపకుఁడు. స. స్థాపించువాఁడు
స్థాపత్యుఁడు స. అంతఃపురపు కావలివాఁడు
స్థాపనము. స. స్థాపించుట, సమాధి
స్థాపని. స. చిఱుబొద్దిచెట్టు
స్థాపించు స. స్థాపనముచేయు, నిలుపు
స్థాపితము. స. నిలుపఁబడినది, నిశ్చయింపఁబడినది
స్థామము. స. శరీరబలము

స్థాయి. స. ఉండునది

స్థాయీభావము. స. నవరసములయందుండెడి స్వాదుత

స్థాయుకుఁడు. స. ఒక గ్రామమున కధికారి

స్థాలము. స. భోజనపాత్రము, కంచేము

స్థాలి. స. వంటకుండ, చిన్నచెంబు, లోవి

స్థాలీపాకము. స. వివాహామునందు చేయు నొక కర్మము

స్థాలీపులాకన్యాయము. స. కుండెడు అన్నమునకు ఒక మెతుకును పట్టిచూచుట అనెడు న్యాయము

స్థావరము. స. వింటినారి, కొండ, కదలనిది, నిలుకడ, సంచరింపనివృక్షపర్వతాదులు

స్థావిరము. స. వృద్ధత్వము

స్థాసకము. స. కుంకుమలోనగువాని పూఁత, చేతనిడినకుంకుములోనగునది, నీటిబుగ్గ

స్థాస్నువు. స. బహుకాలము ఉండునది, స్థిరమైనది

## స్థి

స్థితము. స. ఉన్నది, నిలుచున్నది

స్థితి. స. ఉనికి, కూర్చుండుట, నిలుకడ, దశ, అస్తి, అర్హత, అధికారము, క్షేమము, నిలుపుదల, మేర

స్థిర. స. నేల

స్థిరము. స. కొండ, చెట్టు, మోక్షము, నిలుకడైనది

స్థిరవారము. స. శనివారము

స్థిరాయువు. స. బూరుగచెట్టు

స్థిరుఁడు. స. శని, నిలుకడగలవాఁడు

## స్థూ

స్థూణ. స. స్తంభము, ఇనుపప్రతిమ

స్థూరి. స. బరువుమోసెడుగుఱ్ఱము

స్థూలదంతకము. స. ఉడుత

స్థూలనాసము. స. పంది

స్థూలపుష్పకము. స. మాదెనచెట్టు

స్థూలము. స. గుడారము, బలిసినది, బుద్ధిలేనిది

స్థూలలక్షుఁడు. స. మిక్కిలి యీవికాఁడు, మిక్కిలి వెచ్చకాఁడు

స్థూలోచ్చయము. స. పెద్దతాయి, బోటిమ

## స్థే

స్థేమము. స. శరీరబలము [మిక్కిలిస్థిరుఁడు

స్థేయుఁడు. స. పురోహితుఁడు, తీర్పరి,

## స్థై

స్థైర్యము. స. స్థిరత్వము, జోపత్రి

## స్థౌ

స్థౌణేయము. స. మాచిపత్రి

స్థౌరము. స. గుఱ్ఱము వీఁపున మోసెడుబరువు

స్థౌరి స బరువుమోసెడుగుఱ్ఱము

స్థౌల్యము. స స్థూలభావము

## స్న

స్నపనము. స. స్నానము, స్నానముచేయించుట, నీళ్లు చిలుకరించుట

స్నపితము. స. స్నానముచేసినది

స్నవము. స. స్రవణము, కాఱుట
స్నస. స. సన్నపునరము

## స్నా

స్నాతకము.స.వివాహమునకు ముందు బ్రహ్మచారి జేసికొను నొకవ్రతము
స్నాతకుఁడు. స. స్నానశీలవ్రతుఁడు
స్నాతుఁడు. స. స్నానముచేసినవాఁడు
స్నానము. స. మునుక, నలుఁగుపిండి
స్నానీయము. స నలుఁగుపిండి
స్నాపకుఁడు. స. స్నానముచేయించు భృత్యుఁడు,స్నానమునకై నీళ్లు తెచ్చువాఁడు
స్నాపనము. స. స్నానముచేయించుట
స్నాయువు. స. సన్నపునరము

## స్ని

స్నిగ్ధము. స. స్నేహముగలది, నునుపుగలది, చిక్కనగలది
స్నిగ్ధుడు. స. స్నేహితుఁడు

## స్ను

స్నుక్కు. స. జెముడు మొక్క
స్నుతము. స. కాఱినది
స్నువు. స. కొండనెత్తము
స్నుష. స. కోడలు
స్నుహి. స. జెముడుమొక్క

## స్నే

స్నేహనము. స. చేమురురాచుట
స్నేహము. స. చెలిమి, చేమురు, ప్రేమ
స్నేహించు. స. స్నేహముచేయుఁ
స్నేహితము. స. ప్రేమింపఁ బడినది, ప్రేమ గలది, చేమురు రాయఁబడినది
స్నేహితుఁడు. స. చెలికాఁడు

## స్నై

స్నైగ్ధ్యము. స. స్నిగ్ధభావము, స్నేహము

## స్ప

స్పందము. స. ఇంచుక, కంపము
స్పర్ధ. స. పోటి, పోలిక, ఒకరికంటె నొకరు మించవలెనను బుద్ధి
స్పర్ధాళువు. స. స్పర్ధగలవాఁడు
స్పర్శనము. స. తాఁకుడు, ఈవి, వాయువు
స్పర్శము. స. తాఁకుడు, తాఁకునది, ఈవి, వ్యాధి
స్పర్శవేధి. స. పరుసవేది, తాఁకించుటచేత లోహమును బంగారుగా మార్చునట్టి మూలికావిశేషము
స్పశము. స. యుద్ధము, పోరు
స్పశుఁడు. స. వేగులవాఁడు, పులితోడను సింహముతోడను పోట్లాడెడువాఁడు
స్పష్టము. స. వెల్లడియైనది

## స్పృ

స్పృక్క. స. పిక్కచెట్టు
స్పృక్కు. స. స్పర్శము
స్పృశి. స. వాఁకుడుచెట్టు
స్పృశించు. స. తాఁకు
స్పృశ్యము. స. స్పృశింపఁదగినది

స్పృష్టకాండుఁడు. స. ఆయుధమును ధరించి జీవించువాఁడు

స్పృష్టము. స. స్పృశింపఁబడినది

స్పృష్టి. స. తాఁకుడు

స్పృహా. స. ఇచ్ఛ, కోరిక, ఆశ

స్పృహణీయము. స. కోరఁదగినది

స్పృహ్యాము. స. మాదీఫలము, కోరఁదగినది

## స్పె

స్పెష్ట. స. తపింపఁజేయురోగము

## స్ఫ

స్ఫట. స. పాముయొక్క పడగ

స్ఫటి. స. పాము

స్ఫటిక. స. పటిక

స్ఫటికము. స. పటికపుఱాయి

## స్ఫా

స్ఫాటితము. స. చీల్పఁబడినది, తెఱవఁబడినది

స్ఫాతి. స. వృద్ధి

స్ఫాయత్. స. విస్తృతమైన

స్ఫారము. స. చలనము, బంగారు లోనగువాని చీలిక, అధికమైనది

స్ఫాలనము. స. వణఁకుట, రాపిడి

## స్ఫి

స్ఫిక్కు. స. పిఱుఁదులయున్నతి

స్ఫిరము. స. అధికమైనది

## స్ఫీ

స్ఫీతము. స. అధికమైనది, సంతోషముగలది, స్వచ్ఛమైనది

## స్ఫు

స్ఫుటనము. స. భేదించుట

స్ఫుటము. స. స్పష్టమైనది, వికసించినది

స్ఫురణము. స అదురుట, తోఁచుట

స్ఫురించు. స. అదురు, తోఁచు

స్ఫురితము, స. చుంబనవిశేషము, రతిబంధవిశేషము, అదిరినది, తోఁచినది

స్ఫులింగము. స. అగ్నికణము, మిడుఁగుఱు

## స్ఫూ

స్ఫూర్జకము. స. తుమ్మికచెట్టు

స్ఫూర్జథువు. స. వజ్రధ్వని

స్ఫూర్తి. స. అదురుట, తోఁచుట, ప్రకాశము, పరిపూర్ణత

## స్ఫే

స్ఫేష్ఠము. స. మిక్కిలి అధికమైనది

## స్ఫో

స్ఫోటకము. స. బొబ్బలుపొక్కెడు రోగవిశేషము

స్ఫోటని. స. బెజ్జము వేయునట్టిపనిముట్టు

స్ఫోటము. స. భేదించుట, కఱుపు

## స్మ

స్మయమానము. స. చిఱునగవుగలది

స్మయము. స. గర్వము, ఆశ్చర్యము

స్మరణము. స. తలఁపు, జ్ఞప్తి

స్మరహరుఁడు. స. శివుఁడు

స్మరాంకుశము స. పెంచి దిద్దినగోరు

స్మరించు. స. స్మరణముచేయు, తలచు

స్మరుఁడు. స. మన్మథుఁడు

స్మర్త. స. స్మరించువాఁడు

## స్మా

స్మారకము. స. తెలివి, స్మృతి

స్మారణము. స. జ్ఞాపకముచేయునది

స్మారితుఁడు. స. తలఁపుసాకిరి, ఒకవిధమగు సాక్షి

స్మార్తము. స. స్మృత్యుక్తకర్మము, స్మృతి సంబంధమైనది

## స్మి

స్మితము } స. చిఱునగవు
స్మితి }

## స్మృ

స్మృతము. స. తలఁపఁ బడినది

స్మృతి. స. తలఁపు, ధర్మశాస్త్రము, బుద్ధి

## స్మే

స్మేరము. స. కొంచెము నవ్వునది, వికసించినది

## స్య

స్యందనము. స. కాఱుట, జలము, రథము

స్యందము. స. స్రవణము, కాఱుట

స్యంది. స. స్రవించునది

స్యందిని స. చొంగ

స్యదము. స. వేగము

స్యన్నము. స. కాఱినది

## స్యా

స్యామిక. స. నీలిమందు

స్యాలకుఁడు } స. భార్యతోడఁ బుట్టిన వాఁడు
స్యాలుఁడు }

స్యాలిక. స. భార్యతోడఁ బుట్టినది

## స్యూ

స్యూతము. స. పట్టిక, దాఁగర, కుట్టఁబడినది

స్యూతి. స. కుట్టు, సంతతి

స్యూనము స. దాఁగర, స్యూతము

## స్ర

స్రంసనము. స. క్రిందనిడు

స్రంసి. స. పోఁక, క్రింద పడునది

స్రగ్గు దే. సగ్గు, క్షీణించు, తగ్గు, చచ్చు

స్రగ్వి. స. పూలదండగలవాఁడు

స్రజము. స. పూలదండ

స్రవ. స. చేఁగచెట్టు

స్రవంతి. స. నది

స్రవణము } స. కాఱుట
స్రవము }

స్రవించు. స. కాఱు

స్రష్ట. స. బ్రహ్మ

స్రస్తము. స. జాఱినది, పడినది

## స్రా

స్రావక. స. కాఱునది

స్రావణము. దే అగసాలెవానికాఱుముట్టు

స్రావము. స. కాఱుట

స్రావి. దే. సరవి, క్రమము

## స్రు

స్రుక్కఁబడు. దే. స్రుక్కు, దుఃఖించు

స్రుక్కు. దే. వెనుదీయు, భయపడు, ముడుఁగు, ముడతపడు,తగ్గు, దుఃఖించు, చింతించు, మూర్ఛిల్లు, సంకోచించు, వాడు, చుట్టుకొను, దుఃఖము, శోకము, చిక్కు

స్రుక్కు. స. హోమపాత్రవిశేషము

స్రుక్కులు. దే. కడుపుమీఁదిముడుతలు

స్రుతము. స. కారినది

స్రుతి. స కారుట

స్రువ. స. చేఁగచెట్టు

స్రువము. స. స్రుగ్భేదము

స్రువావృక్షము. స. ములువెలఁగచెట్టు

## స్రో

స్రోతస్విని. స. నది

స్రోతస్సు. స. ప్రవాహము, ఏఱు, నీరు వచ్చెడుతూము

స్రోతోంజనము. స. నీలాంజనము

## స్వ

స్వంగము. స. కౌఁగిలి

స్వంజనము. స. కౌఁగిలించుకొనుట, కౌఁగిలింత

స్వకము
స్వకీయము } స. తనది

స్వకీయ. స. ఒకనిసొంతభార్య

స్వచ్ఛందము. స. స్వతంత్రము

స్వచ్ఛము. స. తెలుపు, తెల్లనిది, నిర్మలము

స్వజనుఁడు. స. సగోత్రుఁడు, తనవాఁడు

స్వతంత్రము. స. స్వచ్ఛందము, సొంతము

స్వతంత్రించు. స. ఒకరి యనుమతిలేక తానుగా ఏర్పడు

స్వత్వము. స. సొత్తు, స్వామ్యము,హక్కు, ఉన్నది ఉన్నట్టు ఉండుట

స్వదనము. స. రుచిచూచుట, తినుట

స్వదితము. స. రుచిచూడఁబడినది

స్వధితి. స. గండగొడ్డలి

స్వనము. స. ధ్వని

స్వనితము. స. ఉఱుము, మ్రోసినది

స్వపనము. స. నిద్రపోవుట, నిద్ర

స్వపుక్కు. స. నిదురపోతు

స్వప్నము. స కల, నిదుర

స్వభాను. స. ఒకసంవత్సరము

స్వభావము. స. స్వధర్మము

స్వభువు. స. విష్ణువు, శివుఁడు

స్వము. స. ధనము, తాను, తనది

స్వయమ్. స. తానుగా, తనయిష్టముతో

స్వయందత్తుఁడు. స. తల్లిదండ్రులులేక తానుగానే దత్తుపోయినవాఁడు

స్వయంపాకము. స. వంట, వంటసామగ్రి, ఒకనికి ఒకపూఁటకు సరిపోవునట్లుఇచ్చునట్టి బియ్యము మొదలైనవి

స్వయంభువు. స. బ్రహ్మ, విష్ణువు, శివుఁడు, మన్మథుఁడు

స్వయంవర. స. తనంతట మగని వరించునట్టియాఁడుది

స్వయంవరము.స పెండ్లికూఁతురు తనమనసు వచ్చిన వరుని వరించెడి యుత్సవము

స్వరము.స.అకారాది, ఉదాత్తాది,షడ్జాది, ముక్కుగాలి, కంఠధ్వని

స్వరాట్టు } స. బ్రహ్మము, ఇంద్రుఁడు
స్వరాటు }

స్వరితము. స. స్వరవిశేషము

స్వరువు స. వజ్రాయుధము, పిడుగు, యజ్ఞము, స్వతంత్రము

స్వరూపము. స. స్వభావము, తనరూపము

స్వర్గము. స. దేవలోకము

స్వర్ణకారుఁడు. స. అగసాలెవాఁడు

స్వర్ణక్షీరి. స. రెడ్డివారినానఁబ్రాలు మొక్క

స్వర్ణది. స. ఆకాశగంగ

స్వర్ణపారేవతము. స. పెద్దయిూడచెట్టు

స్వర్ణము. స. బంగారు, ఎఱ్ఱటెంకాయచెట్టు

స్వర్భానువు. స రాహువు

స్వర్లోకము. స. స్వర్గము

స్వల్పము. స. మిక్కిలి అల్పమైనది, కొంత

స్వవాసిని. స. పేరంటాలు,పుట్టినింటనుండెడి యాఁడుది

స్వస. స. తోడఁబుట్టినది

స్వస్తి స. శుభము

స్వస్తికము. స. తూర్పువాకిలిగల రాజగృహము, మంగళవస్తువు, పాముపడగ మీఁది నల్లనిరేఖ

స్వస్తిముఖము. స. జాబు

స్వస్తిముఖుఁడు. స. బ్రాహ్మణుఁడు, బట్టువాఁడు

స్వస్థము.స.నెమ్మదిగా నుండునది,ఆరోగ్యము

స్వస్రీయ. స. మేనకోడలు

స్వస్రీయుఁడు. స. మేనల్లుఁడు

## స్వా

స్వాంతము. స. మనస్సు, గుహ

స్వాగతము. స. కుశలప్రశ్నము, సుఖము, తోడిరాక, క్షేమము

స్వాచ్ఛము. స. స్వచ్ఛత

స్వాతంత్ర్యము. స. స్వతంత్రభావము స్వత్వము

స్వాతి. స. సంజ్ఞాదేవి, నక్షత్రవిశేషము

స్వాదనము } స. పానము, తినుట, రుచి,
స్వాదము } రుచిచూచుట

స్వాదితము. స. పానముచేయఁబడినది, రుచిచూడఁబడినది, మధురముగాఁ జేయఁబడినది, తినఁబడినది

స్వాదిమ. స మాధుర్యము

స్వాదిష్ఠము. స. అత్యంతమధురమైనది

స్వాదుకంటకము. స. పల్లేరు, ములువెలఁగ చెట్టు

స్వాదుధన్వుఁడు. స. మన్మథుఁడు

స్వాదురస. స. ద్రాక్షచెట్టు

స్వాదువు. స. ఇంపైనది, తియ్యనిది, మంచిది

స్వాదూదము. స. మంచినీళ్లసముద్రము

స్వాద్వి. స. ద్రాక్షచెట్టు

స్వాధీనపతిక. స. స్వాధీనుఁడైన పెనిమిటి గలనాయిక

స్వాధీనుఁడు. స. తనకు లోఁకువైనవాఁడు

స్వాధ్యాయము. స. వేదాధ్యయనము, వేదము, జపము

స్వాధ్యాయి. స. వేదాధ్యయనము చేయువాఁడు, పట్టణమునందలి వర్తకుఁడు

స్వానము. స. ధ్వని

స్వాపతేయము. స. ధనము, ఆస్తి

స్వాపనము. స. నిద్ర

స్వాపము. స. నిద్ర, శయనము, అజ్ఞానము

స్వాభావికము. స. స్వభావముచేతఁ గలిగినది

స్వాభావ్యము. స. స్వభావసిద్ధము

స్వాభిమానము. స. తనదనువిశ్వాసము

స్వామి. స. ఒడయఁడు, కుమారస్వామి, అధికారి, దేవుఁడు, భర్త, వస్తు స్వాతంత్ర్యము గలవాఁడు, ఆచార్యుఁడు, గొప్ప సన్యాసి

స్వామిత, స్వామిత్వము } స. స్వామ్యము, స్వత్వము, హక్కు, ప్రభుత్వము

స్వామిని. స. ఒడయరాలు

స్వామ్యము. స. సొంతము, స్వత్వము, అధికారము, రాజ్యము

స్వారసికము.స. మంచిమధురమైనకావ్యము

స్వారస్యము. స. రమ్యము

స్వారాజ్యము. స. స్వర్గలోకపుదొరతనము

స్వారాట్టు. స. ఇంద్రుఁడు

స్వారి. దే విహారము, వాహ్యాళి

స్వార్జితము. స స్వంత సంపాద్యము

స్వార్థపరుఁడు. స. స్వప్రయోజనమునే ముఖ్యముగా విచారించువాఁడు

స్వార్థము. స. స్వప్రయోజనము, తనమేలు

స్వాలక్షణ్యము. స. స్వాభావికగుణము

స్వాల్పము. స. స్వల్పము

స్వాస్థ్యము. స. నెమ్మది,ఆరోగ్యము,దృఢత, వస్త్రాశనసమృద్ధి

స్వాహా. స. అగ్నిభార్య

స్వాహాప్రియుఁడు. స. అగ్నిహోత్రుఁడు

# స్వి

స్విన్నము. స. స్వేదముతోఁ గూడినది

# స్వీ

స్వీకరణము. స. స్వీకరించుట, అంగీకారము, వివాహము

స్వీకరించు. స. అంగీకరించు, పుచ్చుకొను

స్వీకర్త. స. స్వీకరించువాఁడు

స్వీకారము. స. అంగీకారము, దత్తు

స్వీకృతము. స. అంగీకరింపఁ బడినది

స్వీయ. స. పతియందుమాత్రము అనురాగముగల నాయిక, తనది

స్వీయము. స. తనది

# స్వే

స్వేచ్ఛ. స. స్వతంత్రత

స్వేదజము. స. చెమటవలనఁ బుట్టినది

స్వేదనము. స. చెమట, చెమటను గలుగఁజేయుమందు

స్వేదని. స. పెనము, కందువు

స్వేదము. స. చెమట, చెమటపోయుట

# స్వై

స్వైరత, స్వైరత్వము } స. స్వాతంత్ర్యము

స్వైరము. స. స్వతంత్రము, యథేచ్ఛము

స్వైరి. స. స్వతంత్రుఁడు

స్వైరిణి స. జారిణి

స్వైరిత. స. యథేచ్ఛత

స్వైరుఁడు. స. స్వతంత్రుఁడు, సోమరి

# హా

హా. ఒకయక్షరము

హాంకరించు. త. అహంకరించు

హాంకారము.త.అభిమానము, అహంకారము

హాంగు. దే. అనుకూలము, ఏర్పాటు

హాండ, హాండి } స. వెడల్పునోరుగల పెద్దలోహపాత్రము

హండిక. స. కుండ

హంత. స. హింసించువాఁడు

హంతవ్యుఁడు. స. చంపఁదగినవాఁడు

హంభ. స. గోధ్వని

హంవీరుఁడు. స. క్షత్రియుఁడు, శూరుఁడు

హంస / హంసము } స అంచే, యోగవిశేషము, పరమాత్మ, తెల్లగుఱ్ఱము, శరీరవాయువిశేషము

హంసకము. స. కాలియందె

హంసపక్షము. స. అభినయహస్తవిశేషము

హంసపాదము. స. అంచేపదము, ఒకగుఱుతు

హంసపాది. స. ఒకానొక మొక్క

హంసవాహనుఁడు స. బ్రహ్మ

హంసాస్యము. స. అభినయహస్తవిశేషము

హంసి / హంసిక } స. ఆఁడుహంస

హంసుఁడు. స. సూర్యుఁడు, జీవుఁడు, విష్ణువు, శివుఁడు

హక్కు. దే. బాధ్యత, స్వాతంత్ర్యము

హజారము. దే. ఆస్థానమండపము, తలవాకిలి

హజారు. దే. ఆస్థానము

హజ్జ. దే. పాదము

హట్టము. స. అంగడివీథి

హట్టవిలాసిని. స. నఖమనెడుగంధద్రవ్యము

హఠము. స. పట్టు, బలాత్కారము, యోగవిశేషము, మూర్ఖము

హఠవాది. స. పట్టుపట్టి సాధించేవాఁడు

హఠాత్కరించు. స. బలాత్కారముచేయు

హఠాత్తు. స. ఉన్నట్టుండి, తటుక్కున

హఠారము. స. ఉగ్రము

హడపము. దే. అడపము

హణిగెలు. దే. దండములు

హతకుఁడు. స. నీచుఁడు, పిఱికి

హతము. స. కొట్టఁబడినది, నాశము

హతాహతము. స. ధ్వంసము, మహత్తైన జగడము

హతి. స. కొట్టు, దెబ్బ

హతుఁడు. స. కొట్టఁబడినవాఁడు, మనసు చెడినవాఁడు

హత్త. దే. చిక్కుకొనుట, తగులుకొనుట

హత్తము. త. చేయి, హస్తము

హత్తి. త. ఏనుఁగు, గజము

హత్తించు. దే. సక్తముచేయు, కలుగఁజేయు

హత్తు దే. అత్తు, కలుగు, పొందు

హత్య. స. చంపుట

హదనము. స. ఁగురుట

హదను. దే. అదను, కాలము

హద్దు దే. ఎల్ల, మితి

హననము. స. చంపుట

హనుమ / హనుముఁడు } త. హనుమంతుడు

హనుమంతుఁడు / హనుమానుఁడు } స. అంజనేయుఁడు

హనువు స. చావు, వ్యాధి, చెక్కిలిమీఁది భాగము

హన్నము. స. విష్ఠ

హన్నుఁడు. స. విష్ఠించినవాఁడు

హయగ్రీవుఁడు స. విష్ణ్వవతారవిశేషము

హయపుచ్ఛి. స. కారుమినుము

హయమారకము. స. గన్నేరుచెట్టు

హయము. స. గుఱ్ఱము

హయాయుర్వేదము.స. పశువైద్యశాస్త్రము

హయారూఢుఁడు. స. గుఱ్ఱము నెక్కినవాఁడు
హయి. స. ఆఁడుగుఱ్ఱము
హరకుఁడు. స. దొంగ
హరణము. స. హరించుట, అరణము, భాగహారము
హరబ్బి. దే. దేశవిశేషము, ఆదేశపుగుఱ్ఱము
హరి. స. విష్ణువు, ఇంద్రుఁడు, సూర్యుఁడు, చంద్రుఁడు, యముఁడు, సింహము, గుఱ్ఱము, కోఁతి, పాము, గాలి, కిరణము, కప్పు, చిలుక, పచ్చనిది, బంగారువర్ణముగలది
హరించు. స. అడఁగు, అడఁచు, జీర్ణించు, దొంగిలించు, నాశముచేయు
హరికథ. స. శివవిష్ణువులను గుఱించి చేయఁబడు కాలక్షేపము
హరికుఁడు. స. దొంగ, హరించువాఁడు
హరిగ. దే. కేడెము, అరిగ
హరిగోలు. దే. ఏఱుదాఁటించుపుట్టి, అరిగోలు
హరిచందనము. స. చెందిరము, వెన్నెల, పసుపువన్నెగల చందనము, ఒక కల్పవృక్షము
హరిణక్రీడనము. స. బాలక్రీడావిశేషము
హరిణము. స. జింక, తెలుపు, తెల్లనిది
హరిణి. స. ఆఁడుజింక, ఒకయప్సరస్త్రీ, బంగారుప్రతిమ, ఆకుపచ్చవర్ణముగలది
హరిత. స. గఱిక
హరితకము. స. కూర, శాకము
హరితపత్త్రిక. స. పచ్చాకుచెట్టు
హరితము. స. ఆకుపచ్చవర్ణము, పచ్చగుఱ్ఱము, పచ్చపిట్ట, గిజిగాఁడు, సింహము, ఆకుపచ్చనిది, పచ్చపెసర
హరితాళము. స. హరిదళము
హరిత్తు. స. దిక్కు, ఆకుపచ్చవర్ణము, పచ్చగుఱ్ఱము, సింహము, గఱిక, ఆకుపచ్చనిది
హరిదళము. త. అరిదళము
హరిదశ్వుఁడు. స. సూర్యుఁడు
హరిదాసుఁడు. స. విష్ణుభక్తుఁడు
హరిద్ర. స. పసుపు
హరిద్రాభము. స. పసుపువర్ణము
హరిద్రువు. స. మ్రానిపసుపు
హరిన్మణి. స. పచ్చ, మరకతము
హరిప్రియ. స. లక్ష్మి, భూమి, తొళసి, ఏకాదశి
హరిబువ్వము. దే. వివాహమునందు నాల్గవ నాఁటిరాత్రి బంధువులైన మగవారు ఆఁడువారు అందఱును ఒకటిగా కూడి వేడుకగా భుజించుట
హరిజెయ్యాకెల్లు. దే. ఏదుపంది ముండ్లు
హరిమ. స. పచ్చఁదనము, కామాలరోగము
హరిమంథకము. స. సెనగలు
హరివాణము. స. గుండిగ
హరివాణము, అరివాణము. త. చిన్నపళ్లెరము, కంచము, గిన్నె
హరివాలుకము. స. నూఁగుదోఁస, కూఁతురుబుడమ మొక్క
హరివాసరము. స. ఏకాదశి
హరిహయుఁడు. స. ఇంద్రుఁడు
హరీతకి. స. కరకచెట్టు
హరుఁడు. స. శివుఁడు
హరువరి. దే. నేర్పరి
హరువు. దే. మనోజ్ఞత, నాణెమైనపని, మనోజ్ఞము, నాణెము

హారువుకాఁడు } దే. కర్మదక్షుఁడు, పని
హార్వుకాఁడు } యందు నేర్పరి
హారుసము. త. ఆరుసము, సంతోషము
హారుసించు. త. సంతోషించు
హారేణువు. స. రేణుకయనుగంధద్రవ్యము
హార్త. స. హరించువాఁడు
హార్మ్యము.స మిద్దెటిల్లు, ధనికునిగృహము, లంకలు
హార్యక్షము. స. సింహము
హార్యక్షుఁడు. స. కుబేరుఁడు
హర్షకుఁడు. స. సంతోషింపఁ జేయువాఁడు
హర్షణము. స. సంతోషించుట, ఒకగ్రహ యోగము
హర్షమాణుఁడు. స. సంతోషము నొందిన మనస్సుగలవాఁడు
హర్షము. స. సంతోషము, సమ్మతి
హర్షి. స. సంతోషము గలవాఁడు
హర్షించు. స. సంతోషించు
హర్షితము. స. సంతోషింపఁజేయఁబడినది, సుఖముకలుగఁ జేయఁబడినది
హలము. స. నాఁగలి
హలహలము. స హాలాహలమను విషము
హలాయుధుఁడు. స బలరాముఁడు, మడక దున్నువాఁడు
హలాహలము. స. బల్లి, నలికీఁచు, హాలాహలము
హలి. స. నాఁగలి, బలరాముఁడు, మడఁక దున్నువాఁడు
హలికుఁడు స. మడఁకదున్నువాఁడు
హలిని. స. తఱిగొట్టుచెట్టు
హలిప్రియ. స. కల్లు
హలిప్రియము. స. కడపచెట్టు
హల్య. స. నాఁగళ్ల సమూహము, ఒక సారి దున్నినపొలము
హల్లకము. స. చెంగలువ
హల్లకల్లోలము. దే. అల్లకల్లోలము, వ్యత్యస్తము
హల్లనము. స. నిద్రలో పొర్లుట
హల్లీసకము. స. స్త్రీలు పెక్కండ్రు చేరి మండలాకారముగా తిరుగుచుఁ జేయు నృత్యము, కోలాటము
హల్లు స. కకారాద్యక్షరము
హల్లోహలము. స. తొట్రుపడినది
హవణించు. దే. అలంకరించు, ధరించు, చేకొఁ బఱుచు, ఉంచు
హవణింపు. దే. అలంకరణము, జాగరూకత
హవణిక. దే. అలంకారము, జాగరూకత
హవణిల్లు. దే. ప్రకాశించు, విజృంభించు
హవణు. దే. ఒప్పిదము
హవనము. స. హోమము
హవనీయము. స. హోమము చేయఁ దగినది
హవము. స. యజ్ఞము, పిలుపు, ఆజ్ఞ
హవిష్యము. స. హవిస్సు, నెయ్యి
హవిస్సు } స. అగ్నిహోత్రమునందు
హవి } వేల్చుటకు ఇవురఁబెట్టిన యన్నము, నెయ్యి
హవ్యము. స. దేవతలకీయఁదగిన యన్నము, నేయి
హవ్యవహుఁడు } స. అగ్నిహోత్రుఁడు
హవ్యవాహనుఁడు }
హసంతి. స. కుంపటి, మల్లెమొక్క, కంబళి
హసదు. దే. దొడ్డవాఁడు
హసనము. స. హాస్యము
హసని. స. కుంపటి
హసము. స. హాస్యము

హసాదు. దే. గొప్పవారి యాజ్ఞను విధేయులు మంచిదని అంగీకరించుటయందు వచ్చునది, ఆసాదు

హసించు స. నవ్వు, హాసముచేయు

హసితము. స. నవ్వు, నవ్వునది, వికసించినది

హస్త. స. ఒకనక్షత్రము

హస్తము. స. చేయి, తొండము, మూర, హస్త, వ్రాత, చేవ్రాలు, సహాయము

హస్తలాఘవము. స. గారడీవిద్య

హస్తవారణము. స. చేతితో అడ్డగించుట

హస్తాంతరము. స. బొక్కసములో సిద్ధముగా నున్న రూకలు

హస్తాక్షరి. స. చేవ్రాలు

హస్తి. స. ఏనుఁగు

హస్తినఖము. స. గవనివాకిట వాటముగా నేర్పఱచిన మట్టిగిబ్బ

హస్తిని. స. ఆఁడేనుఁగు, స్త్రీజాతివిశేషము, హస్తినాపురము

హస్తిపకుఁడు. స. మావటివాఁడు

హస్తిభారము. స. అడుగుమట్టు, పునాది

హస్త్యము. స. చేతిసంబంధమైనది, చేతితోఁ జేయఁబడినది

హళఁది. త. పసుపువర్ణము, అళఁది

హళహళి, హళహళిక } స. త్వర

హళాహళి. దే. కలకలధ్వని

హళాహళి. స. త్వర, శౌర్యము

హళ్లి. దే. అభావమును దెలుపు నొకగుఱుతు

## హా

హా. స. ఆశ్చర్యమును దుఃఖమును దెలుపునది

హాజోరము. దే. ముఖశాల, కొలువుకూటము, హజారము

హాటకగర్భుఁడు. స. హిరణ్యగర్భుఁడు, బ్రహ్మ

హాటకము. స. బంగారు, ఉమ్మెత్తచెట్టు

హారాత్క్యము. స. హరాత్తుగాఁ గలిగినది

హాతవ్యము. స. విడిచిపెట్టఁదగినది

హానము. స. విడుచుట, నష్టము, శక్తి

హాని. స. తక్కువగుట, కీడు, నష్టము

హామిక. స. ఆమిక, గర్వము, మదము

హాయనము. స. సంవత్సరము, కిరణము

హాయి దే. సుఖము, సౌఖ్యము, నెమ్మది

హారకుఁడు. స. దొంగ, జోదరి, దోఁచుకొనువాఁడు

హారతి. త. ఆరతి, మంగళార్థము పసుపు నీళ్లు కలిపిచేట్టు

హారము. స. నూటయెనిమిది పేటలముత్యాల పేరు, యుద్ధము, హారసంబంధమైనది, పుష్పమాలిక, హరించునది, భిన్నాంకములలో లవము క్రిందిది

హారి. స. పథికజనసమూహము, మనోజ్ఞమైనది, హరించువాఁడు, హారముగలవాఁడు

హారిణము. స. జింకమాంసము

హారితము. స. హరింపఁజేయఁబడినది, ఇయ్యఁబడినది

హారిద్రము. స. కడపచెట్టు, పసుపువర్ణము, పసుపువర్ణముగలది

హారీతము. స. పచ్చపిట్ట, కపటము

హారువు దే. జోదమునందలి పరిభాష

హార్దము. స. స్నేహము

హార్యము స. తాండ్రచెట్టు, హరింపఁదగినది

హాల. స. సారాయి, కల్లు

హాలము. స నాఁగేలు

హాలహాలము
హాలాహాలము
హాలాహలము
హాలహాలము } స. సముద్రమథనకాలమునఁ బుట్టిన యొకయ పాయ కరమగు విషము, నలి కండ్లపాము, బల్లి

హాలహాలి
హాల } స. సారాయి

హాలికుఁడు. స హాలికుఁడు, సేద్యము చేయు వాఁడు

హాలెము. దే. అత్యంతము

హావకుఁడు. స పిలుచేవాఁడు

హావడి. దే. ఉపద్రవము, ఆవడి

హావము. స. భ్రూనేత్రాది వికారములచేత కొంచెము తెలియఁదగిన మనోవికారము

హావళి. దే. హావడి, ఉపద్రవము

హాస. దే. నూతనము, క్రొత్తది

హాసకుఁడు. స. హాస్యగాఁడు, ఉల్లాస వంతుఁడు

హాసము
హాస్యము } స. నవ్వు, హాస్యరసము, సంతోషము, అపహాస్యము

హాసించు. స. నవ్వు

హాస్తికము. స. హస్తిసమూహము

హాస్తికుఁడు. స. ఏనుఁగునడపువాఁడు

హాహా. స. ఆశ్చర్యమును దుఃఖమును దెలుపునది

హాహుఁడు. స ఒకానొక దేవగాయకుఁడు

హాళి. దే. ఆసక్తి, ఆనందము, పరిహాసము

## హి

హింగుది. స. ఇంగుది, గారచెట్టు

హింగునిర్యాసము. స. ఇంగువరసము, వేప చెట్టు

హింగువు. స. ఇంగువ

హింగుళము. స. ఇంగిలీకము

హింగుళి. స. ములకచెట్టు

హిండనము. స. వ్యాప్తి, భ్రమణము, సురతము

హిండితము. స. వ్యాపించినది, కలుపఁబడినది

హింతాలము. స. గిఱకతాడిచెట్టు

హిందువులు. స. ఒకతెగవారు, హిందూ దేశమందలి బ్రాహ్మణాది వర్ణస్థులు

హిందూదేశము. స. భరతఖండము

హిందోళము. స. ఒకానొకరాగము

హింస. స. చంపుట, దొంగతనము, బాధించుట

హింసకము
హింస్రకము } స. ఘాతుకజంతువు

హింసకుఁడు. స. హింసించువాఁడు, చంపువాఁడు

హింసనము. స. హింసించుట

హింసించు. స. చంపు, బాధించు

హింసితము. స. హింసింపఁ బడినది, హాని

హింస్ర. స. నల్లయుప్పిచెట్టు, చంపునది, నరము

హింస్రము. స. ఘాతుకజంతువు

హిక్క. స. ఎక్కిలి, పైడికంటెయనుపక్షి

హిజారు. దే. కాలికి తొడగికొను చట్ట, ఇజారు

హిజ్జలము. స. ఎఱ్ఱగన్నేరుచెట్టు

హితకుఁడు. స. బిడ్డ

హితము. స. వెనుకటికి మేలు చేయునది, ధరింపఁబడినది, పోయినది, ఉంచఁబడినది, తగినది, ఉపయోగకరమైనది, ప్రేమకలది, లాభము, క్షేమము

హితవరి. త. ఇతవరి, హితవు చెప్పువాఁడు

హితవు. త. ఇతవు, హితము, మంచి

హితుఁడు. స హితవు చెప్పువాఁడు

హితైషి. స. మంచిని కోరువాఁడు

హిమ. స. పాఁకూర, చేలికాలము

హిమకరుఁడు
హిమధాముఁడు } స. చంద్రుఁడు

